# పత్రికాభాషా నిఘంటువు

సంపాదకులు


కె. బాలసుబ్రమణియన్

కాచినేని రామారావు

వడ్లా సుబ్రహ్మణ్యం

ఎం. వి. రమణయ్య


సహాయ సంపాదకులు


డి. రఘురామ రాజు

కె. రామాంజనేయులు

వై. రెడ్డి శ్యామల

వి. రమాంజని కుమారి






నిఘంటునిర్మాణ శాఖ

భాషాభివృద్ధి పీఠం

తెలుగు విశ్వవిద్యాలయం

PATRIKA BHASHA NIGHANTUVU
(DICTIONARY OF TELUGU NEWSPAPER LANGUAGE)
PREPARED BY . DEPARTMENT OF LEXICOGRAPHY
SCHOOL OF LANGUAGE DEVELOPMENT
TELUGU UNIVERSITY
HYDERABAD

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు


ప్రచురణ సంఖ్య . 153
ప్రథమ ముద్రణ 1995

మూల్యం : రూ. 75/-
ప్రతులు 2000

ప్రతులకు
రిజిస్ట్రార్
తెలుగు విశ్వవిద్యాలయం
పబ్లిక్ గార్డెన్స్
హైదరాబాదు 500 004

FOR COPIES CONTACT:
The Registrar
Telugu University
Public Gardens
Hyderabad 500 004

ముద్రణ ·
మెస్సర్స్ పద్మశ్రీ గ్రాఫిక్స్
1-1-770-1/, ప్రియాప్లాజా అపార్ట్‌మెంట్స్
గాంధీనగర్
హైదరాబాదు 500 380

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు-4

# ఆముఖం

నిఘంటు నిర్మాణంలో తల పండిన డా. జాన్సన్ తాను అనేక శ్రమలకోర్చి నిర్మించిన నిఘంటువుకు ఆముఖం రాస్తూ- ప్రతి ఒక్క కవీ, రచయితా పొగడ్తను ఆశించవచ్చు. కానీ నిఘంటుకారుడు కేవలం దూషణల్నుంచి తప్పించుకోవడాన్ని కోరతాడు, అయితే ఆ ప్రశస్తి కూడా కొద్దిమందికే లభ్యమౌతుంది. ఆయన నిఘంటుకారుని నిరపాయకరమైన కష్టజీవి (harmless drudge) అన్నాడు.

ఆధునిక వార్తాపత్రికలు తెలుగువారి నిత్యజీవితంలో విడదీయరాని భాగమైపోయినాయి. ఆకాశవాణి, దూరదర్శన్ మొదలైన ప్రసారసాధనాలెన్ని ఉన్నా అవి దినపత్రికల స్థానాన్ని ఎన్నడూ ఆక్రమించలేవు. అయితే ఈ సాధనాలన్నీ కూడా వార్తలను ప్రజలకు చేరవేయడంలో ఎప్పటికప్పుడు అవసరాలకు అనుగుణంగా మలచుకుని ఎన్నో కొత్తపదాలను సృష్టించుకుని, అనూహ్యమైన రీతిలో అమితమైన వేగంతో జనం ముందుకు వచ్చి నిలబడుతున్నాయి. కొత్తపదాలకు అర్థాలను సమకూర్చడమేగాక ఆంగ్లపదాలకు సమానార్థకాలను సృష్టించడంలో నూతన పదకల్పనలు (new coinages) చోటు చేసుకుంటున్నాయి. ఇవి అన్నీ కాకపోయినా కొన్ని మాత్రం భాషలో స్థిరపడుతున్నాయి. పాతమాటల కెన్నిటికో కొత్త అర్థాలు కల్పిస్తున్నారు. తమ అవసరార్థం పదాలను సృష్టించుకుని అప్పటికప్పుడు వాడి కృతార్థులయ్యారు పత్రికారచయితలు. ఇలా వాడుకలోకి వచ్చినవే- ఇనుపతెర, విలీన విధానం, అణుయుద్ధం, వ్యోమగామి, అంతరిక్షయానం, పక్షిఘాతం, ఘెరా, బంద్, ముందస్తు బెయిల్, కాఫీపోసా - ఇంకా ఇలాటివెన్నో. భాష ఒక సహజప్రవాహం. నిత్యచైతన్యశీలమైనది. భాషవాడుతున్న కొద్దీ మారిపోయే, అరిగిపోయే స్వభావం కలది.

ఈ మార్పులనీ కొత్తపదాలనూ అర్థంచేసుకుని సమన్వయ పరచుకోగలవారు కొందరే ఉంటారు. చాలామంది ఆంగ్లభాష సరిగారాని పాఠకులకు ఆంగ్ల సమానార్థకాలు ఎంత తెలుగు లిపిలో ఉన్నప్పటికీ బోధపడడం కష్టం. సామన్య పాఠకుని అవగాహనను పెంపొందించేందుకు పత్రికాభాషా నిఘంటువు రూపొందించాల్సిన అవసరం ఏర్పడింది. ఈ ఆవశ్యకతను గుర్తించి తెలుగు విశ్వవిద్యాలయం నిఘంటు నిర్మాణశాఖ శాస్త్రీయ పద్ధతిలో పత్రికాభాషా నిఘంటువును రూపొందించడానికి నమూనా నిఘంటువు- (Fascicle)ను తయారుచేసింది. ఆ రంగంలోని పెద్దలకు సలహా సంప్రతింపులకై పంపించి వారి సూచనలను స్వీకరించింది. మామూలు దినపత్రికల నుండి పదసేకరణ ఈ నిఘంటు నిర్మాణంలో జరిగింది. ఇందులో ప్రతి ఆరోపమూ ఏడు అంశాలను కలిగి ఉంది. అవి ఆరోపమూ, వ్యాకరణాంశమూ, లిప్యంతరీకరణమూ, అర్థ విభాగమూ, సమానార్థకమూ, ఆంగ్లంలో అర్థమూ- సందర్భమూ, సేకరణ వివరాలూ.

ఆధునిక తెలుగు పత్రికాభాష తెలుగు భాషను ప్రమాణీకరించడానికి ఎంతవరకు తోడ్పడుతుందో విజ్ఞులైన పాఠకులు, కవులు, రచయితలు, పండితులు ఆలోచించి చెప్పాలి.

పత్రికం భాషకు శైలీ, అలంకారాలూ ఉండకూడదు. అయినా, రచనా ధోరణులను అనుకరిస్తూ రచయితలు రచనలు చేస్తూ ఉన్నారు. పత్రికల భాషలో సృజనాత్మక రచనలు చేయవచ్చా అనేది వేరే అంశం.

టెలిప్రింటరులో, పి.టి.ఐ., యు.యన్.ఐ., తదితర ప్రపంచ వార్తా సంస్థలు పంపించిన తాజా వార్తలను ఎప్పటికప్పుడు ఆంగ్లంలో నుంచి తెలుగు చేయవలసి రావటంవలన ఆంగ్లపదాలకు ఒదిగే అనువైన కొత్తరకం తెలుగు భాష పత్రికలవలన ప్రచారంలోకి వచ్చింది. ఇది సహజమైన వ్యావహారికంలోకి వచ్చింది. ఇలాగాక, టెలిప్రింటరులో ఆంగ్లానికి బదులుగా సహజమైన తెలుగులో వార్తలు వచ్చినట్లయితే అప్పుడు పత్రికలలో వాడే భాషకీ, మన నిత్య అవసరాలకు వాడుకునే భాషకీ వ్యత్యాసం ఉండదు. హిందీ, తమిళ భాషలలో టెలిప్రింటరులో వార్తలు వారి వారి మాతృభాషలలోనే పుట్టి పత్రికల్లోకి ఎక్కుతాయి. తెలుగులో అలాకాదు. ఇది నిజంగా మరో భాషా విప్లవానికి ప్రాతిపదిక కావచ్చు.

తెలుగు భాషను వార్తా ప్రసారానికి ఆకాశవాణి, దూరదర్శన్, మొదలైన సంస్థలవారు వాడుతున్నారు. ఈ పదజాలాన్నంతా కూడా సేకరించి, ప్రమాణీకరించి నిఘంటుబద్ధం చేయవలసి ఉంది.

ఈ మా ప్రస్తుత ప్రయత్నాన్ని తెలుగు భాషాభిమానులు, పత్రికలవారు ఆదరిస్తారని నమ్ముతూ-

హైదరాబాదు
తేది: 16.04.1995

(పేర్వారం జగన్నాథం)

**Professor B. Ramakrishna Reddy**
Dean
School of Language Development
Telugu University

## FOREWORD

The School of Language Development, Telugu University is endowed with the responsibility of teaching linguistics and conducting research on various aspects of Telugu language, especially in the area of applied Telugu linguistics. As a first attempt in this direction, the Department of Lexicography of the School has taken up the project of preparing a dictionary of Telugu newspaper language. The scholars involved in this pioneering work have contributed their knowledge of modern linguistic- semantics and the Telugu language.

The importance and impact of print media over the reading public hardly needs to be reiterated. Within the print media the daily gets a place of pride as it serves the reader with current affairs all over the world. There has been a proliferation of dailies in the modern Indian languages and Telugu is no exception to it. Having realised the topical significance of the daily Telugu newspapers, the language used there has been taken as the material source for the preparation of the present dictionary. Unlike other such attempts, the present work concentrates on Telugu as it is actually used in the newspapers rather than depending on the recall vocabulary of the dictionary makers.

The Scholars who contributed their might deserve to be congratulated, both for evolving a methodology in lexicography and for its application in dictionary preparation of a major Indian language like Telugu. We hope that this work may stimulate the preparation of many such specialised dictionaries covering various fields in Telugu and other Indian languages.

Hyderabad
18 April 1995

B. Ramakrishna Reddy

# INTRODUCTION

## 1. The present work in the context of Indian lexicographic tradition.

The lexicographic tradition is quite ancient in India and goes back to Yaaska's Nirukta and Amarasimha's Amarkosh in Sanskrit. The ancient Indian tradition is memory based. The modern lexicographic tradition is based on the techniques of easy reference and retrievability through alphabetization. The credit of laying the foundation for modern lexicographic tradition in India goes to European missionaries and British officials like Monier Williams (Sanskrit), Molesworth (Marathi), Winslow ( Tamil), C.P. Brown (Telugu), Kittel (Kannada), Gundert (Malayalam), Carey ( Bengali), Grierson (Kashmiri), Ferguson (Hindustani) and others. The dictionaries of these scholars were published in the 18th and 19th centuries. The follow up action by Indian scholars that lead to the publication of dictionaries like Telugu Suryarayandhra Nighantuvu, Tamil Lexicon of the Madras University, Manak Hindi Kosh of the Allahabad Hindi Sahitya Sammelan was not maintained as a live tradition, but for stray publications now and then.

In the meanwhile the Indian languages developed very fast after the introduction of regional languages as medium of education, proliferation of mass media like newspapers, magazines, radio and T.V. and the use of these languages as medium of administration and legislation. The result is a vocabulary "boom" or "explosion" in the form of manifold increase of the number of words. But, the lexicographic activity to record this "boom" or "explosion" in the form of dictionaries is negligible. Telugu too is no exception to this tuation. Though the publication of Mandalika Vrttipada Kosas by Andhra Pradesh Sahitya Akademy is an important milestone in the development of Telugu lexicographic tradition, thousands of newly coined terms in the areas of administrative, political, scientific, journalistic etc , are yet to be recorded in dictionaries. The glossaries published by the Telugu Akademi cover the vocabulary only partially Moreover, they are not records of current usage of the living Telugu language, but only part of the language planning activity of coining technical terms to fill the gaps. A dictionary of modern Telugu, which is alive and vibrant to the demands of ever expanding activities of the modern man is a desideratum. Dictionaries which cater to the needs of students of different levels, non- native language learners, translators etc., are essential. Dictionaries of usages of words, phrases and idioms, collocations of words, dictionary of synonyms or Thesaurus are also necessary to help the active user of the Telugu language. Taking into consideration this lexicographic position and needs of Telugu, the planners of the Telugu University with far sightedness included a separate Department of Lexicography as part of the School of Language Development. Apart from

the Tamil University, Thanjavur which has a Department of compilation, Telugu University is the only University in India to have a department exclusively for lexicography, to take care of all the lexicographic needs of the language, though there are University departments dealing with single dictionary projects like Malayalam Lexicon Department of University of Kerala and Sanskrit dictionary project of Deccan college, Pune.

Though the word "compilation" is used for the preparation of a dictionary, it is not an activity of mere collection and arranging in order of similar or diverse objects. It is a complex activity of collection of words with contexts, selection of stabilized words, discarding the transient and unstabilized ones abstraction of the different senses of a word from the multiple contexts, construction of the entries or articles indicating the grammar, meaning and usages of the words with examples, taking care of the total uniformity of the structure, alphabetically arranging the words and preparing the necessary appendices. Because of this complexity, dictionary making becomes a time consuming and very prolonged work. Having this aspect in mind the Department of Lexicography of the Telugu University decided to compile small dictionaries covering small segments of modern Telugu which will contribute in the long run to the compilation of a dictionary of modern Telugu which will be a comprehensive one covering all the segments of the language. The language of the Telugu newspapers is one segment of the Telugu language which touches upon almost all the segments of language use like politics, administration, judiciary, science, sports, games, etc. Therefore, the department decided to take up the compilation of the dictionary of Telugu Newspaper language as its first project which, it thought, will be representative of the developmental and modernization aspect of the living Telugu language.

## 2. Need for Newspaper Language Dictionary of Telugu and its usefulness

Mass media like newspapers, magazines, radio and T.V. have come to play an important part in the life of Indian people. Of the different media, newspaper plays a very significant role giving detailed information about different problems and activities going around the people, both national and international. In this practical process of information dissemination a byproduct is the enrichment of our national languages. Considerable number of new words and phrases are used in the news columns. New words are coined using existing words, or , by borrowing Sanskrit or English words, or existing words are used with new meanings. This helps the modernization process of our languages.

Telugu seems to have achieved a place of pride among the Indian languages both in the publication of a number of newspapers and in their wide circulation. The results of this proliferation is the development of Telugu vocabulary as pointed out above.

Educated readers with considerable English background and appreciable knowledge in Telugu can understand the new coinages based on the context. But the readers of average or minimum educational background find it difficult to understand the new words and the concepts denoted by them. Neither the average reader uses Telugu dictionaries nor these words find a place in the available dictionaries, which draw their material from classical sources. Therefore, compilation of a dictionary words specific to the Newspaper language is a necessity. Hence the present dictionary.

The present dictionary is not just a glossary of newspaper terminology. Glossary is of technical terminology give only English or international terms and their Telugu equivalents. This is a dictionary which explains the different concepts denoted by the terms used in the newspapers with definitions in simple language. Because of this, the dictionary is useful to the common man and non-specialist in the different fields to understand the concepts and involve himself or herself in the democratic and modernization process fully.

Further this dictionary will also be useful to the practising journalist to find in one place all the terms used in all the newspapers and make a choice of the most suitable term. It also helps the process of standardization of Telugu as unformity can be achieved by all the newspapers.

This dictionary will also be useful to the linguist who studies the trends of innovative word formation and for the language planner who is concerned with the modernization and standardization of Telugu.

To the knowledge of editors this work seems to be the first of its kind in dictionary format in the Indian languages, and will be a model for compilation of such dictionaries for other Indian languages.

## 3. The type of the dictionary

The Newspaper language dictionary belongs to the category of special dictionaries or restricted dictionaries in the typology of dictionaries. This dictionary is special as it is concerned with a specific category of words viz., those words which are used in the newspapers and not commonly used in the general language of day to day communication. This is a restricted dictionary in the sense that collection of data and selection and inclusion of words is restricted on the basis of their occurrence in a particular area of language use. The vocabulary that is presented in the dictionary is a marked vocabulary in the sense that they are clearly identifiable as belonging to the newspaper language. In most of the cases the words themselves are neologisms or newly coined ones and their special or restricted nature clearly standsout. There are also a number of words which are not new coinages but existing words used in new meanings. In that meaning they standout as special words belonging to the newspaper language.

## 4. The data for the dictionary

The data for the dictionary was collected from the Telugu newspapers using the restrictive principles. For this work, the newspapers Andhra Prabha, Andhra Bhoomi, Andhra Jyothi, Andhra Patrika, Eenadu, Udayam, Praja Shakti and Visalandhra constituted the source. The words which are specially used in the newspaper language as explained above were collected. Words like ekagavaksha vidhanam 'Single Window System', shikharaagra samaaveesam 'summit meeting' , dravyoolbaNam 'inflation', sveetapatram 'White paper' which are coined words, and words like astamayam 'demise (of a great person)', daaDi 'raid, sabhikulu 'audience', which are existing words which have acquired new senses in the context of newspaper usage, have been collected.

The newspaper language uses not only newly coined words, existing words with new meanings but also words with their original meanings as part of the presentation of news items. Such common words like annam 'rice', pasuvulu 'animals', etc., are not included in the dictionary for the following reasons: one, they are not marked words, two, they belong to the common language and can be understand by the readers easily.

## 5. Method of collection and selection of words

Words were collected from the listed newspapers along with their contexts in cards. For this special dictionary the two phases of dictionary making process. collection of material and selection of words have to be done simultaneously, in most of the cases. This is because, as observed above, only words specific to the newspapers were identified. Politics, national and international along with sub-fields like legislative assembly, parliament, economics, commerce and business, judiciary including law, science and medicine, sports and games are the fields identified, though many words belonging to other fields were also collected when they were felt to belong to the newspaper language specifically. Ex: kaalgaral 'call girl'.

While it was easy to collect and select words specifically coined for the newspaper usage, in the case of words adopted form the common language there were uncertainties as to whether the meanings are specific to the newspaper language are just a contextual extention of the original meaning. In such cases the editorial committee held discussions and decided on the inclusion or exclusion of the words. An element subjectivity could not be avoided in such cases. Anyhow, in the cases of lack of unanimity among the editors the decision was made in favour of inclusion of the word as it only adds to the informative power of the dictionary. Ex: kincaparacu, kalaharanam.

## 6. Structure of entries

After collection and selection of words, the work of entry construction

was taken up.

Each entry will have the following structure. The head word will be given in bold type. Following the head word, the grammatical category or part of speech of the word will be given in the form of abbreviation in Telugu

క్రి. for kriya or verb

వి. for viseshyam or noun

After the grammatical indication Roman transliteration of the head word is given. This is to help the non-Telugu user of the dictionary. This is given in the italic type. The transliteration scheme is given as appendix. This is followed by the Telugu definition of the word. The definitions are given using simple words only. Within the definition the explanatory notes needed to understand the meaning clearly are given within parantheses.

If synonyms or words with similar meaning as the head word are available they are given following the definition.

## 7. The execution of the project

The project for the compilation of a dictionary of Telugu Newspaper language was initiated by Prof. C. Rama Rao, the then Dean of School of Language Development in June 1987. Collection of material was done, by the staff of the Department of Lexicography Dr. Usha Devi, Dr. V. Subrahmanyam, Dr. K. Rama Rao, V Ramanjanikumari, Mr. M.V. Ramanaiah and Dr. K. Balasubramanian joined the School as Professor and the Head of the Department of Lexicography in March, 1988. He took up the work of theoretical planning of this dictionary along with other works like training the staff in lexicographic theory and methods, survey and evaluation Telugu Dictionaries, identification of the gaps in the Telugu lexicographic situation, preparation of a list of short term and long term projects to be taken by the Department and fixing of priorities, with the cooperation of the staff.

The detailed plan for the execution of the different phases of the dictionary was prepared by Dr K. Balasubramanian. He also prepared a list of instruction for collection of material to be used by the Staff. Dr. Balasubramanian was also responsible for the preparation of the structure and format of the entries in the dictionary.

Projects Assistants Dr. Raghuramaraju, Dr. K. Ramanjaneyulu and Ms. Reddy Syamala joined the department in April 1989. They also assisted in the collection of material which was completed by the end of 1989. Selection entries and writing of definitions followed. Meanwhile Dr. A. Usha Devi withdrew from the project as she took an individual project of her own.

The definitions were written by the members of the editorial board other than Dr. K. Balasubramanian. But he sat with other members discussed

thoroughly the definitions and structure of entries. Every member of the board contributed to the finalization of the definition. In 1990 a sample fascicle of 200 entries was printed and circulated among scholars, journalists and others for their valuable suggestions and comments which were taken note of in the further editorial work.

Dr. K. Balasubramanian who was on deputation from Annamalai University, Tamilnadu, left the Department in April 1991 after finalising certain number of entries. By then the format and pattern emerged clearly and not finalised. Mr. Ramanjanikumari also left in July 1990 after contribution of considerably to the editorial work. The work was continued by the other members of the editorial committee. Mr. Puranam Subrahmanyam Sharma, the veteran journalist worked for two terms of three months as a technical consultant.

Revision and final editing of the work was done by Dr. K. Rama Rao and Mr. M. V. Ramanaiah. Apart from the editorial work Dr. V. Subrahmanyam was responsible for final proof reading, Dr. K Ramanjaneyulu for preparation of the press copy by the computer operator and Ms. Reddy Syamala for the alphabetization of the dictionary.

Mr. G.S. Varadachari, Head, Dept. of Journalism who is also a veteran journalist was of immense help during the final phase of the dictionary work.

## 8. Future plan

The editors do not claim exhaustiveness in the coverage of the vocabulary of the Newspaper Telugu as the vocabulary of a language is an open set with constant additions and deletions. Further, the newspaper vocabulary is expanding in a faster pace to cope with the demands of modern society But, the editors plan to continue the collection of material and revise the dictionary periodically. The editors also solicit the cooperation of the practising journalists, scholars, and general public to contribute to the improvement of the work by their constructive criticism and suggestions.

The editors are always aware of inherent shortcomings in the work in the aspects of definitions, providing English equivalents and uniformity of the structure of entries inspite of their desire and effort to maintain a standard similar to that of Western dictionaries. This is the maiden work from the Department of Lexicography of the Telugu University. The future goal of the Department is to improve the quality of the work and set standards in the future revisions of the dictionary.

## 9. Acknowledgements

The editors are extremely thankful to the successive Vice-Chancellors of the Telugu University for their constant encouragement and unstinted help in the execution of the project.

The founder Vice-Chancellor Prof. T. Donappa was instrumental in the

starting of the Department of Lexicography. As Vice Chancellor he got sanctioned a number of Project Assistants to the department and constantly encouraged our activities.

Prof. C. Narayana Reddy was a source of inspiration for us. He was constantly in touch with the progress of the dictionary, and gave constructive suggestions for speedy execution of the work.

Prof. P. Jagannadham, the present Vice-Chancellor took keen interest and contributed to the successful completion of this work through his encouragement and material help.

The successive Deans of the School of Language Development were also responsible for the successful execution of the project. Both Prof. C. Rama Rao, the first Dean and Prof. B. Ramakrishna Reddy the present Dean are reputed Linguists and their scholarship was a source of support.

All the successive Registrars of the University, Mr. T. D. Prasad Rao, Dr. N. Sivarama Murthy, Dr. B. Ramakrishna Reddy, Dr. T. Venkat Reddy and Mr. D.V. Subba Rao have extended administrative support and we thank them profusely for their help.

Mr. G. Srinivas, the computer operator needs special mention for the neat execution of the press copy. We thank the various scholars and journalists who went through the sample fascicle and gave constructive criticism and suggestions.

Finally we thank the department of publications of the Telugu University for the neat execution of the printing of the dictionary.

**- Editors**

# భూమిక

## 1. నిఘంటునిర్మాణ సంప్రదాయం

### కోశ నిర్మాణ పరంపరలో ఈ నిఘంటువు

భారతదేశంలో నిఘంటు నిర్మాణం ప్రాచీనకాలం నుంచీ ఉన్నది. యాస్కుని నిరుక్తం నుంచీ అమరసింహుని అమరకోశంనాటి నుంచీ ఈ సంప్రదాయం కొనసాగుతూవస్తున్నది. భారతీయ నిఘంటు నిర్మాణం కంఠస్థం చేసేందుకు అనుకూలంగా ఉండేది. ఆధునిక నిఘంటు నిర్మాణ పద్ధతి అక్షర క్రమంపై ఆధారపడి ఉన్నది. దీనివల్ల అవసరమైన పదాలను వెంటనే వెతుక్కోవటం సులభమైనది. మిషనరీ సంస్థలు, బ్రిటిష్ అధికారులు ఆధునిక నిఘంటు నిర్మాణ పద్ధతులను రూపొందించటంలో భారతదేశంలో ముఖ్యపాత్ర వహించారు. సంస్కృతంలో మోనియర్ విలియమ్స్, మరాఠీలో మోల్స్వర్త్, తమిళంలో విన్స్లో, తెలుగులో సి.పి. బ్రౌన్, కన్నడంలో కిటెల్, మళయాళంలో గుండర్ట్, బెంగాలీలో క్యారి, కాశ్మీరీలో గ్రియర్సన్, హిందూస్తానీలో ఫెర్గూసన్ తదితరులు ఈ రంగంలో ముఖ్యులు. ఈ విద్యావేత్తలు కూర్చిన నిఘంటువులు 18, 19 శతాబ్దాలలో ప్రచురించబడినై. ఈ నేపథ్యంలో భారతీయ విద్యావేత్తల కృషి ఫలితంగా; తెలుగులో సూర్యరాయాంధ్ర నిఘంటువు, మద్రాసు విశ్వ విద్యాలయం వారి తమిళ నిఘంటువు, అలహాబాద్ హిందీ సాహిత్య సమ్మేళన్ వారి మానక్ హిందీ కోశ్ తయారయ్యాయి. అయితే ఆ తర్వాత అడపాదడపా వచ్చిన నిఘంటువులున్నా, సజీవంగా నిఘంటు నిర్మాణం కొనసాగలేదనే భావించాలి.

ప్రాంతీయ బాషలను విద్యామాధ్యమాలుగా ప్రవేశపెట్టిన తర్వాత, భారతీయ భాషలు త్వరగా అభివృద్ధి చెందసాగాయి. ప్రసార సాధనాలైన వార్తా పత్రికలు, మాగజైన్లు, రేడియో, టివీలు ఇబ్బడి ముబ్బడిగా అభివృద్ధి అయినవి. భారతీయ భాషలు పాలనా భాషలుగా చట్ట వ్యవహారాల భాషలుగా కొత్త రంగాలలో ముందుకు వచ్చాయి. ఈ మార్పుల వల్ల భాషలలో అనేకరంగాలలో 'పదజాల విస్ఫోటన' జరిగింది. ఈ పదజాల విస్ఫోటనను అందుకొని, తగిన నిఘంటువులను తయారు చేయడంలో జరిగిన ~షి అంతంత మాత్రమే. తెలుగులో పరిస్థితి చూసినా ఇందుకు భిన్నంకాదు. అ టి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించిన వృత్తిపదకోశాలు మైలురాళ్ల వం , అయినా కొత్తగా రూపొందిన, పాలన, రాజకీయ, శాస్త్రీయ, పత్రికా రచన-రంగాలలో విస్తృతంగా పెరిగిన వేలాది పదాలు నిఘంటువులకు ఎక్కవలసి ఉన్నవి. తెలుగు అకాడమీ గతంలో ప్రచురించిన పదపట్టికలు, పదజాలాన్ని పాక్షికంగా మాత్రమే ఇవ్వగలిగాయి. పైగా ఈ పదపట్టికలు సజీవ భాషాప్రయోగాల నుంచి, తయారైనవి కావు. భాషా ప్రణాళికా కార్యక్రమంగా పదశూన్యతను భర్తీ చేసేందుకు తయారు చేసిన సాంకేతికపదజాలమది. ఆధునిక అవసరాలకు సరిపడే సజీవ తెలుగు భాషా నిఘంటువు ఇంకా సుదూర లక్ష్యంగానే ఉన్నది. భిన్న స్థాయిలలో విద్యార్థులకోసం, తెలుగు నేర్చుకొనేవారికోసం, అనువాద కులకోసం - అవసరమైన నిఘంటువులు రావలసి ఉన్నవి. భిన్న అర్థఛాయలలో పదాల ప్రయోగాలను చూపే కోశాలు, సమాసాల, పలుకుబడుల నిఘంటువులు, పదాల

సంయోజన, ఆకాంక్షలకు సంబంధించిన నిఘంటువులు, సమానార్థక నిఘంటువులు - ఇవన్నీ తెలుగు భాషా ప్రయోగం క్రియాశీలంగా పెరిగేందుకు దోహదం చేస్తాయి. తెలుగులో నిఘంటు నిర్మాణ పరిస్థితినీ, తెలుగు భాషావసరాలను దృష్టిలో పెట్టుకొని, [illegible] పద పరిశీలకులు, భాషాభివృద్ధి పీఠంలో భాగంగా, నిఘంటు నిర్మా తెలుగు విశ్వ[illegible] [illegible]లయంలో డిపార్టుమెంటు ణశాఖను ఏర్పాటు చేశారు. తంజావూరులోని తమిళ విశ్వ[illegible] ఆఫ్ కంపైలేషన్ ఉన్నది. అయితే తెలుగు వి-విద్యాలయంలో మాత్రమే తెలుగు భాషకు నైఘంటిక అవసరాలను [illegible] ప్రత్యేకంగా నిఘంటు నిర్మాణశాఖ ఉన్నది. కేరళ విశ్వవిద్యాలయంలో "మళయాళం లెక్సికాన్ డిపార్టుమెంటు", పూనే దక్కన్ కాలేజీలో సంస్కృత నిఘంటువు ప్రణాళిక నడుస్తున్నవి.

నిఘంటు నిర్మాణానికి 'కంపైలేషన్' అన్న పదం ఉపయోగిస్తుంటారు. అంత మాత్రం చేత నిఘంటు నిర్మాణం అంటే భిన్న విషయాలనో, సాదృశవిషయాలనో, ఒక పద్ధతిలో పెట్టడమే అనుకోకూడదు. నిఘంటు నిర్మాణం ఒక సంక్లిష్ట ప్రక్రియ. ప్రయోగ సహితంగా పదాల సేకరణ, స్థిరత్వం పొందిన పదాల ఎంపిక, వివిధ ప్రయోగాల నుంచి అర్థవైవిధ్యాలను నిర్ణయించటం, ఆరోపాల నిర్మాణం, అందులో భాగంగా, వ్యాకరణ వివరాల సూచన, అర్థ వివరణ, పదప్రయోగ ఉదాహరణలు ఇవ్వటం, మొత్తం నిఘంటువు అంతర్గత నిర్మాణంలో ఏకసూత్రత పాటించటం, అక్షర క్రమంలో ఆరోపాలను కూర్చటం, అవసరమైన అనుబంధాలను చేర్చటం - ఇవన్నీ నిఘంటు నిర్మాణ క్రమంలో చేయాల్సిన సంక్లిష్ట కార్యక్రమాలు. ఇంత సంక్లిష్టతతో కూడిన పని కాబట్టే ఏ నిఘంటు నిర్మాణం అయినా, ఎక్కువ కాలం సాగాల్సి వస్తుంది. అందువల్ల తెలుగు విశ్వవిద్యాలయంలోని, నిఘంటు నిర్మాణ శాఖ చిన్న నిఘంటువులను తయారు చేయాలని తలపెట్టింది. తెలుగులో వివిధ రంగాలకు సంబంధించి, చిన్న నిఘంటువులు తయారయితే, ముందుముందు 'ఆధునిక తెలుగు నిఘంటువు' నిర్మాణానికి - ఇవి తోడ్పడతాయి. ఆధునిక తెలుగు నిఘంటువు వివిధ రంగాలను సమగ్రంగా చూపడానికి ఈ పద్ధతి ఉపయోగపడుతుంది. తెలుగు వార్తా పత్రికలలో భాష, తెలుగులో ఒక రంగానికి చెందినది. ఈ రంగంలో, రాజకీయ, పరిపాలన, న్యాయ, శాస్త్ర, క్రీడలు మొదలైన విభాగాలు చేరి ఉంటాయి. అందువల్ల తెలుగు పత్రికాభాషా నిఘంటువును మొదటి కార్యక్రమంగా నిఘంటు నిర్మాణ శాఖ చేపట్టింది. నేటి తెలుగు భాష అభివృద్ధినీ, నవీకరణనీ ఈ నిఘంటువు ప్రతిబింబిస్తుందని భావించడమైనది.

## 2. పత్రికా భాషా నిఘంటువు

### ఆవశ్యకత, ఉపయోగం

భారతదేశ జనజీవనంలో, ప్రజాప్రసార సాధనాలైన పత్రికలు, రేడియో, టి.వి.లు, ఒక ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయి. వీటిల్లో వార్తాపత్రికలది ప్రత్యేక స్థానం అని చెప్పాలి. దేశవిదేశాలలో జరిగే సంఘటనలను గురించిన విపుల సమాచారాన్ని పత్రికలు అందిస్తాయి. ఇట్లా సమాచారాన్ని అందించే ప్రక్రియలో భాగంగా జాతీయ భాషలు సుసంపన్నం అవుతాయి. వార్తా రచనలో అనేకమైన కొత్త పదాలు, పదబంధాలు ఉపయోగించబడతాయి. ఇప్పటికే ఉన్న పదజాలంతోనో లేదా ఆంగ్ల, సంస్కృత పదాలతోనో - కొత్త పదాలను

సృష్టించటం జరుగుతుంది. ఉన్నపదాలను కొత్త అర్థాలతో ఉపయోగించుకోవటమూ ఉంటుంది. ఈ ప్రక్రియలన్నీ మన భాషల ఆధునీకరణకు తోడ్పడతాయి.

వార్తా పత్రికల ప్రచురణలోనూ, పంపిణీకి సంబంధించిన విషయంలోనూ, భారతీయ భాషలలో తెలుగు గర్వించదగ్గ స్థితిలో ఉన్నది. ఈ సానుకూలస్థితివల్ల, తెలుగులో, పదజాలం ఉధృతంగా పెరగటం సహజమే.

ఆంగ్లభాషానేపథ్యం ఉన్న పాఠకులు, తెలుగులో ఏర్పడిన కొత్త పదాలను గమనించ గలుగుతారు. సగటు విద్యాస్థాయితో ఉండే పాఠకుడు, కొత్తపదాలను, వాటి భావనలను అర్థంచేసుకోవటంలో ఇబ్బందిని ఎదుర్కొంటాడు. సగటు పాఠకుడు నిఘంటువులను ఉప యోగించటం కష్టసాధ్యం. ఒకవేళ ఏ నిఘంటువునైనా వెదకినా, అందులో కావ్యభాషా పదజాలమే గాని, ఈ ఆధునిక పదజాలం దొరకదు. అందువల్ల ప్రత్యేకించి పత్రికాభాషా నిఘంటువును తయారుచేసుకోవాల్సిన అవసరం ఉన్నది. ఆ అవసరం తీర్చేందుకే ఈ నిఘంటువు.

ఈ నిఘంటువు పత్రికా శైలికి సంబంధించిన సమానార్థకాల పదపట్టికకాదు. సాంకేతిక పదాల పదపట్టికలు, ఆంగ్ల పదాలను, వాటికి తెలుగు సమానార్థకాలను మాత్రమే ఇస్తాయి. ఈ నిఘంటువులో, పదాలు సూచించే వివిధార్థాలను, అర్థ వివరణలతో సరళమైన భాషలో ఇవ్వటం జరిగింది. సామాన్య పాఠకుడికి ఈ నిఘంటువు ఎంతో ఉపయోగపడుతుంది. అనేక రంగాలలో నిపుణత్వం లేకపోయినా, వివిధ భావనలను తెలుసుకోవటంలో ఈ నిఘంటువు సహాయపడుతుంది. అందువల్ల సామాన్యుడు కూడా ప్రజాస్వామ్య, ఆధునీకరణ క్రమంలో పాలుపంచు కొనే అవకాశం కలుగుతుంది.

అంతేకాక ఈ నిఘంటువు పత్రికా రచయితలకు కూడా ఉపయోగంగా ఉంటుంది. అన్ని పత్రికలలో ఉపయోగించే పదజాలం ఒకేచోట లభ్యం అవటంవల్ల తగిన పదాన్ని ఎంపికచేసుకొనే అవకాశం కలుగుతుంది. ఈ కోశంవల్ల తెలుగు పత్రికలలో పదజాలంలో ఏకరూపత ఏర్పడి తద్వారా తెలుగు భాషలో ప్రామాణీకరణ జరగటం సాధ్యమౌతుంది.

నూతన పదప్రయోగ రీతులను అధ్యయనం చేయటానికి భాషా శాస్త్రజ్ఞుడు ఈ నిఘంటువును ఉపయోగించుకోవచ్చు. భాషా ప్రణాళికా రచయిత ఈ కోశం ద్వారా తెలుగు భాష ఆధునీకరణ, ప్రామాణీకరణ క్రమాలను అధ్యయనం చేయవచ్చు.

ఇటువంటి కృషి నిఘంటువు రూపంలో రావటం భారతీయ భాషలలో. ఇదే మొదటి దేమో. భారతీయ భాషలలో ఇటువంటి నిఘంటువుల కూర్పు జరగటానికి ఇది ఒక నమూనాగా ఉంటుంది.

## 3. నిఘంటు స్వరూపం

నిఘంటువుల్ని వర్గీకరణ దృష్టితో చూసినప్పుడు ఈ పత్రికాభాషా నిఘంటువు ఒక ప్రత్యేక నిఘంటువు లేదా ఒక విషయానికి పరిమితమైన నిఘంటువు కోవకు చెందుతుంది. సాధారణపదజాలం అంటే రోజువారీ వాడుకలో ఉండే పదజాలం కాకుండా, వివిధ దినపత్రికల్లో చలామణిలో ఉంటూ ఒక నిర్దిష్ట రంగానికి చెందిన పదజాలం ఈ పత్రికా భాషా నిఘంటువులో లభ్యంకావడం దీని ప్రత్యేకత. ఒక విషయానికి పరిమితమై, దాని

ఆధారంగా ఒక ప్రత్యేక రంగంలో వాడబడే పదజాలం సేకరణ, పదాల ఎంపిక, ఎంపికైన పదాలను నిఘంటువు కెక్కించడమూ జరిగింది. ఇది ఒక ప్రత్యేక విషయానికి పరిమితమైన నిఘంటువు.

ఈ నిఘంటువులో చేర్చిన పదజాలం ఒక ప్రత్యేక రంగానికి చెందింది. అది పత్రికారంగానికి చెందిన పదజాల మని స్పష్టంగా గుర్తించవచ్చు. చాలాచోట్ల కొత్తకొత్త పదాలసృష్టి అంటే నూతన పదకల్పనలు కనిపిస్తాయి. వాటి ప్రత్యేకత లేదా వాటి విషయపరిమితి స్వభావం స్పష్టంగా గోచరిస్తుంది. నూతన పదకల్పనలే కాకుండా వాడుకలో ఉన్న పదాల్ని, పదబంధాల్ని కొత్త అర్థాలలో వాడడం జరుగుతుంటుంది. అటువంటి సందర్భాలలో ఆ ప్రత్యేక పదాలుగానీ, పదబంధాలు కానీ పత్రికాభాషా పదజాలంగా రూపుదిద్దుకుంటాయి.

## 4. నిఘంటు రచనా సామగ్రి

కొన్ని నియమిత సూత్రాల్ని దృష్టిలో ఉంచుకుని నిఘంటు రచనకు కావలసిన సామాగ్రిని అంతా తెలుగువార్తా పత్రికల నుంచి సేకరించడం రిగింది. ఆంధ్రజ్యోతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఈనాడు, ఉదయం, ప్రజా , విశాలాంధ్ర దినపత్రికలు మన సామగ్రి సంకలనానికి ఆధారభూమికలు. పత్రికాభాషకు ంబంధించిన పదాల్నీ పదబంధాల్నీ సేకరించాం. 'ఏకగవాక్ష విధానం', 'శిఖరాగ్ర సమావేశం', 'ద్రవ్యోల్బణం', 'శ్వేతపత్రం' వంటి నూతన పదకల్పనలనూ, వాడుక వ్యవహారంలో ఉంటూ పత్రికల్లో వాడే సందర్భంలో కొత్త అర్థాల్ని సంతరించుకున్న 'అస్తమయం', 'దాడి', 'సభికులు' వంటి పదాలను సేకరించాం.

పత్రికాభాషలో నూతన పదకల్పనలే కాకుండా, ఉన్న పదాలు కొత్త అర్థాలలో వాడటం, మరికొన్నిచోట్ల అసలు అర్థంలోనే వాడటం సర్వసాధారణంగా జరుగుతుంటుంది. 'అన్నం', 'పశువులు' వంటి సాధారణ పదాలనూ, సులభంగా అర్థమయ్యే పదాలనూ ఇందులో చేర్చలేదు.

## 5. పదసేకరణ పద్ధతి, పదాల ఎంపిక

పైన పేర్కొన్న వార్తా పత్రికల నుంచి సందర్భంతో సహా పదాలను సేకరించి కార్డుల మీది కెక్కించాం. ప్రత్యేక తరహాకు చెందిన ఈ నిఘంటువు నిర్మాణంలో పదసేకరణ, నిఘంటువు కెక్కవలసిన పదాల ఎంపిక ఏకకాలంలో జరుగుతూ వచ్చింది. మీద సూచించిన మాదిరిగా వార్తా పత్రికలకు పరిమితమైన పదాలను ఎంపిక చేసుకోవడం జరిగింది.

జాతీయ, అంతర్జాతీయ, రాజకీయరంగం, దానికి అనుతరంగాలైన పార్లమెంటు, చట్టసభలు, రాజ్యాంగం, ఆర్థిక రంగం, వర్తకవాణిజ్యం, చట్టం న్యాయం, వైద్యం, విజ్ఞాన శాస్త్రం, క్రీడారంగం మొదలైన రంగాలను గుర్తించి, ఆయా రంగాలకు చెందిన పదాలనేకాక, తక్కిన రంగాలకు సంబంధించిన పెక్కుపదాలను కూడా సేకరించాం. ఉదా. 'కాల్‌గరల్'.

ప్రత్యేకంగా పత్రికల్లో వాడకానికై సృష్టించుకున్న కొత్త పదాల సేకరణ, ఆ పదాల ఎంపిక కొంత సులభంగా ఉన్నా సాధారణ భాషా పదజాల నుంచి తీసుకున్న కొన్ని మాటలూ, వాటి అర్థాలూ అవి పత్రికాభాషకు పరిమితమైనవా? లేక సందర్భానికి

తగినట్టుగా అసలు అర్థానికి పొడిగింపా? అనే విచికిత్స కలిగిస్తాయి. అలాంటి సందర్భాల్లో ఆ పదాలను నిఘంటువు కెక్కించడమా? నివారించడమా అనే విషయం తలెత్తినప్పుడు సంపాదకవర్గం చర్చించి నిర్ణయం తీసుకున్నది. అటు వంటప్పుడు కొంత ఆత్రాశయత్వం చోటుచేసుకుంది. ఏమైతేనేం - ఏకాభిప్రాయం సాధ్యంకాని సందర్భాల్లో ఆ పదాలను నిఘంటువు కెక్కించడమే శ్రేయస్కర మనీ, అలా చేర్చడంవల్ల నిఘంటువు సమాచార సామర్థ్యం పెరుగుతుందనీ భావించడమైనది.

## 6. ఆరోప నిర్మాణం

పదసేకరణ, పదాల ఎంపిక అయిన వెంటనే ఆరోప నిర్మాణం చేపట్టాం. ప్రతి ఆరోపం ఈ విధంగా నిర్మితమైంది.

ప్రధాన ఆరోపం పెద్దసైజు అక్షరాలలో ఇవ్వబడింది. తదుపరి వ్యాకరణాంశం సంక్షిప్తరూపంలో తెలుగులో సూచించబడింది. క్రి. క్రియనీ, వి. విశేష్యాన్నీ సూచిస్తాయి. తర్వాత ప్రధాన ఆరోపం రోమన్ లిపిలో లిప్యంతరీకణంలో చూపబడింది. తెలుగేతరులైన వారికిది ఉపయోగకారి కాగలదని భావించాం. ఇది ఇటాలిక్ టైపులో ఇవ్వబడింది. లిప్యంతరీకరణ పద్ధతి మొదటనే చేర్చబడింది. తదుపరి తేలికైన తెలుగుమాటల్లో అర్థాన్ని నిర్వచనరూపంలో ఇచ్చాం. అటుపై ఆంగ్ల సమానార్థకాలను ఇచ్చాం. అటు తర్వాత ప్రయోగ సందర్భాన్ని చేర్చాం. చివరగా అది ఏ పత్రికా ప్రయోగమో తేదీతోసహా గుర్తించాం.

స్పష్టమైన అవగాహనకోసం నిర్వచనంలో భాగంగానే అవసరమైనచోట్ల వివరణ భాగాన్ని బ్రాకెట్లలో ఇచ్చాం. ప్రధాన ఆరోపానికి తెలుగులో పర్యాయ పదాలున్నట్లయితే వాటిని నిర్వచనం తర్వాత చేర్చాం. మాదిరికి ఒక ఉదాహరణ

**తాత్కాలిక ఉత్తర్వు** వి. *taatkaalika uttarvu* అంతిమ తీర్పుకు వరకు వేచి ఉండకుండా న్యాయస్థానం మధ్యలో ఇచ్చే నిర్ణయం; మధ్యంతర తీర్పు- interim orders రామమందిరం లాన్యాసానికి (శంకుస్థాపన) ఉద్దేశించిన స్థలం, అలహాబాద్ హైకోర్టు తాత్కాలిక ఉత్తర్వులో పేర్కొన్న వివాదాస్పద భూమిలో కాకుండా వెలుపలే ఉన్నదని ... వివరణ ఇచ్చారు. (ఆంభూ 9 11 89)

## 7. నిర్మాణ కార్యక్రమ దశలు

పత్రికాభాషా నిఘంటువు నిర్మాణం 1987 జూన్‌లో ప్రారంభమయింది. భాషాభివృద్ధిపీఠం తొలి అధ్యక్షులయిన ఆచార్య శ్రీ చేకూరి రామారావు గారి మస్తిష్కంలో మెదిలిన ఆలోచనకి సాకారం ఈ నిఘంటువు. తొలి దశలో ఆయన పర్యవేక్షణలో డా. ఎ. ఉషాదేవి, డా. వి. సుబ్రహ్మణ్యం, డా. కె. రామారావు, శ్రీమతి వి. రమాంజనీకుమారి, శ్రీ ఎం.వి. రమణయ్యలు విషయ సేకరణ చేశారు. 1988 మార్చిలో ఆచార్య కె. బాలసుబ్రమణియన్ గారు తమిళనాడులోని అన్నామలై విశ్వవిద్యాలయం నుంచి డిప్యుటేషన్ మీద వచ్చి నిఘంటు నిర్మాణశాఖ అధిపతిగా పదవీ బాధ్యతలు స్వీకరించారు. 1989 ఏప్రిల్‌లో డా. డి. రఘురామరాజు, డా. కె. రామాంజనేయులు, శ్రీమతి వై. రెడ్డి శ్యామల శాఖలో కొత్తగా చేరారు. అప్పటి నుంచి

వాళ్ళు కూడా విషయ సేకరణలో పాలుపంచుకున్నారు. ఈ విషయ సేకరణ 1989 చివర్లో ముగిసింది. అప్పటి నుంచి పదాల ఎంపిక, నిర్వచన రచన ప్రారంభమయినై. ఈ దశలో డా. ఎ. ఉషాదేవిగారు మరో ప్రాజెక్టుని చేపట్టి ఈ నిఘంటువు నుంచి వైదొలగారు.

తెలుగు మాతృభాష కానందువలన బాలసుబ్రమణియన్ గారికి పదసేకరణ, నిర్వచన రచనాది కార్యకలాపాలలో ప్రత్యక్ష భాగస్వామ్యం లేదు. నిఘంటువు రూపురేఖలు, పని విధానం నిర్ణయించడం, సిబ్బంది రాసిన నిర్వచనాలలో కొన్నింటిని శిక్షణాత్మకంగా చర్చించడం వంటివి ఆయన చేశారు. 1990 లో ఆయన పర్యవేక్షణలో డా. కాచినేని రామారావు, వి. రమాంజనీ కుమారి, ఎం.వి. రమణయ్య దాదాపు రెండు వందల ఆరోపాలతో ఒక నమూనా నిఘంటువును తయారుచేసి ప్రముఖ పాత్రికేయులు, భాషావేత్తలకు వారి సలహాల నిమిత్తం పంపడం జరిగింది. వారిచ్చిన సలహాలను తదుపరి దశలలో అవసరమైన మేరకు స్వీకరించడం జరిగింది. నిఘంటు నిర్మాణం ఒక నిర్ణాయక దశను చేరుకున్న తరువాత 1990 జూలైలో శ్రీమతి రమాంజనీ కుమారిగారు, 1991 ఏప్రిల్‌లో శ్రీ బాలసుబ్రమణియన్ గారు విశ్వవిద్యాలయం వదలి వెళ్ళగా మిగిలినవారు ఆ పనిని కొనసాగించారు. ప్రాథమిక అర్థరచన దశలో సంపాదక మండలి సభ్యులందరూ పాల్గొన్నారు.

నిఘంటువు తుదిదశలో సంపాదకత్వ బాధ్యతలు ప్రధానంగా నిర్వర్తించి ఆరోప నిర్మాణం, నిర్వచన రచనాది విషయాలలో తుది మెరుగులు దిద్దినవారు శ్రీయుతులు కాచినేని రామారావు, ఎం. వి. రమణయ్య. ప్రూఫులు దిద్దేపని శ్రీ వి. సుబ్రహ్మణ్యం చేశారు. లిప్యంతరీకరణ సరిచూడడంతోపాటు చివరిదశలో చేసిన మార్పులు చేర్పులు సక్రమంగా అమలయ్యేట్లు చూసి ప్రచురణ ప్రతి తయారు చెయ్యడంలో శ్రీ కె. రామాంజనేయులు సహకరించారు. శ్రీమతి వై. రెడ్డి శ్యామల అకారాది క్రమం సరిచూశారు.

ప్రముఖ పాత్రికేయులు శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు రెండు దఫాలుగా మొత్తం ఆరు నెలలు సాంకేతిక సలహాదారుగా పని చేశారు. తెలుగు విశ్వవిద్యాలయం జర్నలిజం శాఖాధిపతి శ్రీ జి. యస్. వరదాచారిగారు సందర్భానుసారంగా ఎంతో విలువైన సమాచారం అందించి నిర్వచనాలకు మెరుగులు దిద్దేందుకు సహాయపడ్డారు. నిఘంటు నిర్మాణశాఖలో అధ్యాపకులు శ్రీ ఎం. శాంతయ్య సమాచారాన్ని కార్డులకి ఎక్కించడంలోను శుద్ధప్రతి తయారు చెయ్యడంలోను పాలుపంచుకున్నారు. 1994 ఏప్రిల్ నెలాఖరులో నిఘంటువు పూర్తి అయింది.

## 8. భవిష్యత్ప్రణాళిక

ఇందులో పొందుపరిచిన పదజాలం సమగ్రం, సంపూర్ణం కాదని ప్రత్యేకించి చెప్ప నవసరంలేదు. ఏభాషలోనైనా పదజాలం నిరంతరం మార్పులు, చేర్పులకు లోనవుతూ ఉంటుంది. ముఖ్యంగా మారుతున్న సమాజావసరాలను ప్రతిబింబించే పత్రికాభాషా పదజాలం మరింత వేగంగా విస్తృతి చెందుతున్నది. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని ఎప్పటికప్పుడు కొత్తగా పత్రికాభాషలోకి ప్రవేశిస్తున్న పదాలను సేకరించి ఈ నిఘంటువు మలి ముద్రణల్లో పొందుపరుస్తూ ఉండాలని నిర్ణయించుకున్నాం. దీనికి సంబంధించి

భాషావేత్తలు, ప్రాతికేయులు, తెలుగుభాష పట్ల మక్కువ ఉన్న ఇతర ప్రజానీకం నుంచి నిర్మాణాత్మకమైన విమర్శలు, సలహాలను కోరుతున్నాం.

నిఘంటు నిర్మాణశాఖ నుంచి వెలువడిన తొలి నిఘంటువిది. అంతర్జాతీయంగా నిఘంటు నిర్మాణంలో ఏర్పడిన ఉన్నత ప్రమాణాలకనుగుణంగా దీన్ని తీర్చిదిద్దాలని ప్రయత్నించాం. అయినప్పటికీ కొన్ని పొరపాట్లు దొర్లి ఉండొచ్చు. మలిముద్రణలో ఆ పొరపాట్లను సరిదిద్దుకుని మరింత ఉన్నతంగా ఈ నిఘంటువును తీర్చిదిద్దగలమని మనవి చేస్తున్నాం.

## 9. కృతజ్ఞతలు

ఈ నిఘంటువు తయారీలో మాకెంతో సహకారం, ప్రోత్సాహం అందించిన తెలుగు విశ్వవిద్యాలయం పూర్వ, ప్రస్తుత ఉపాధ్యక్షులందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

వ్యవస్థాపక ఉపాధ్యక్షులు ఆచార్య తూమాటి దొణప్ప గారు నిఘంటు నిర్మాణ విభాగం రూప శిల్పులలో ఒకరు. నిఘంటు నిర్మాణం లోతుపాతులు, అందులోని సాధకబాధకాలు తెలిసిన వ్యక్తిగా ఈ విభాగం మీద ఉన్న గురుతర బాధ్యతను గుర్తెరిగి ఆర్థిక, మానవ వనరుల్ని ఇతోధికంగా సమకూర్చి సహకరించారు.

ఆచార్య సి. నారాయణ రెడ్డి గారు తమ సహజమైన భాషానురాగంతో ఈ నిఘంటువుపట్ల అమితమైన ఆసక్తి కనబరిచారు. అవసరానికనుగుణంగా విధాన నిర్ణయాలు తీసుకుని నిఘంటు రచనా ప్రక్రియ వేగిరం కావటానికి దోహదపడ్డారు.

ప్రస్తుత ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథంగారు మా కందించిన ప్రోత్సాహం ఎన్నదగినది. కీలక దశలో నిఘంటువు పురోగతిని సమీక్షిస్తూ, అవసరమైన సహాయం అందిస్తూ దీనిని వెలువరించేందుకు తోడ్పడ్డారు.

భాషాభివృద్ధిపీఠం తొలి అధ్యక్షులు ఆచార్య చేకూరి రామారావుగారు, ప్రస్తుత అధ్యక్షులు ఆచార్య బి. రామకృష్ణారెడ్డిగారు మాకందించిన తోడ్పాటు స్మరణీయం. వారికి మా కృతజ్ఞతలు.

తెలుగు విశ్వవిద్యాలయం పూర్వ, ప్రస్తుత రిజిస్ట్రార్లు - శ్రీయుతులు - టి.డి. ప్రసాదరావు, ఎన్. శివరామమూర్తి, బి. రామకృష్ణారెడ్డి, టి. వెంకటరెడ్డి, డి.వి. సుబ్బారావు - పాలనాపరంగా మాకెంతో సహకారం అందించారు. వారికి మా కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాం.

మా నమూనా నిఘంటువుని శ్రద్ధతో పరిశీలించి నిర్మాణాత్మకమైన సలహాలనందించిన పాత్రికేయులు, భాషావేత్తలందరికీ మా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

నిఘంటు ప్రమాణాల్ని పెంచే ప్రయత్నంలో భాగంగా ముద్రణకిచ్చేంతవరకు అందులో మార్పులు, చేర్పులు చోటుచేసుకుంటూనే ఉంటాయన్నది నిఘంటుకారులందరికీ తెలిసిన విషయం. సహనంతో ఇలాంటి మార్పుల్ని ఎప్పటికప్పుడు పొందుపరుస్తూ ప్రచురణ ప్రతిని సమర్థవంతంగా రూపొందించిన మా కంప్యూటర్ ఆపరేటర్ శ్రీ జి. శ్రీనివాస్‌కు మా ప్రత్యేక కృతజ్ఞతలు.

చివరగా ఈ నిఘంటువు ప్రచురణ బాధ్యతని నిర్వర్తించిన తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణల విభాగానికి కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాం.

- సంపాదకులు

## సంపాదకమండలి సభ్యులు
## నిఘంటునిర్మాణంలో పనిచేసిన కాలం

| | |
|---|---|
| కె. బాలసుబ్రమణియన్ | 1988 మార్చి - 1991 ఏప్రిల్ |
| కాచినేని రామారావు | 1987 సెప్టెంబర్ - 1994 ఏప్రిల్ |
| వడ్లా సుబ్రహ్మణ్యం | 1987 జూన్ - ఆగస్టు 1991 |
| | 1993 నవంబర్ - 1994 ఏప్రిల్ |
| ఎం.వి. రమణయ్య | 1987 సెప్టెంబర్ - 1994 ఏప్రిల్ |
| డి. రఘురామరాజు | 1989 ఏ్ర ల్ - 1992 అక్టోబర్ |
| కె. రామాంజనేయులు | 1989 ఏ్ర ల్ - 1994 ఏప్రిల్ |
| వై. రెడ్డి శ్యామల | 1989 ఏ ల్ - 1992 మే |
| వి. రమాంజనీ కుమారి | 1987 జూన్ - 1990 జూలై |

# లిప్యంతరీకరణ ప్రణాళిక
# (Transliteration Scheme)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అ | : | a | | ట | : | T |
| ఆ | : | aa | | ఠ | : | Th |
| ఇ | : | i | | డ | : | D |
| ఈ | : | ii | | ఢ | : | Dh |
| ఉ | : | u | | ణ | : | N |
| ఊ | : | uu | | త | : | t |
| ఋ | : | R | | థ | : | th |
| ఎ | : | e | | ద | : | d |
| ఏ | : | ee | | ధ | : | dh |
| ఐ | : | ai | | న | : | n |
| ఒ | : | o | | ప | : | p |
| ఓ | : | oo | | ఫ | : | ph |
| ఔ | : | au | | బ | : | b |
| అం | : | am | (పవర్గ స్పర్శాలకు ముందు) | భ | : | bh |
| | : | an | (తక్కిన హల్లులకు ముందు) | మ | : | m |
| అః | : | ah | | య | : | y |
| క | : | k | | ర | : | r |
| ఖ | : | kh | | ల | : | l |
| గ | : | g | | ళ | : | L |
| ఘ | : | gh | | వ | : | v |
| చ | : | c | | శ | : | ś |
| ఛ | : | ch | | స | : | s |
| జ | : | j | | ష | : | S |
| ఝ | : | jh | | హ | : | h |

# సంకేత పదవివరణ పట్టిక
# (List of abbreviations)

| | | |
|---|---|---|
| అను. | : | అనుబంధం |
| ఆం.జ్యో. | : | ఆంధ్రజ్యోతి |
| ఆం.ప. | : | ఆంధ్రపత్రిక |
| ఆం.ప్ర. | : | ఆంధ్రప్రభ |
| ఆం.భూ. | : | ఆంధ్రభూమి |
| ఈ. | : | ఈనాడు |
| ఉ. | : | ఉదయం |
| క్రి. | : | క్రియ |
| క్రి. విశ. | : | క్రియా విశేషణం |
| చూ. | : | చూడండి |
| ప్ర.శ. | : | ప్రజాశక్తి |
| బ.వ. | : | బహువచనం |
| పో.చూ. | : | పోల్చిచూడండి |
| మొ. | : | మొదలైన |
| విశా. | : | విశాలాంధ్ర |
| వి. | : | విశేష్యం |
| విశ. | : | విశేషణం |

అ

**అంకితభావం** వి. *ankitabhaavam* ఒక సిద్ధాంతం లేదా లక్ష్యంకోసం దీక్షతో పనిచేయటం sense of dedication గతకీర్తినీ, వైభవాన్నీ, పునరుద్ధరించవలసిన అవసరం ఎంతైనా ఉందనీ, ఇందుకు అందరూ అంకితభావంతో కృషిచేయాలనీ, పంచాయితీరాజ్ మంత్రి ఉద్బోధించారు. (ఆం.ప 9.6.87)

**అంకితసేవ** వి. *ankitaseeva* దీక్షతో సాగించే కృషి dedicated service గతకీర్తిని మళ్ళీ సంపాదించేందుకు చిత్తశుద్ధితో, అంకితసేవతో పాటుపడాలని న్యాయవాదులకు విజ్ఞప్తి చేశారు. (ఆంభూ. 3 7 89)

**అంకురార్పణ** వి. *ankuraar-paNa* నూతనంగా ఒక కార్యక్రమం ప్రారంభించటం; బీజావాపనచేయటం commencement, beginning or starting (of a programme), launching a programme ఇల్లినాయిస్‌లో డొనాల్డ్ లారీ అనే ఆసామి తన భార్యామణితో కలిసి ఓ అద్భుత పథకానికి అంకురార్పణచేశాడు. (ఈ. 1.1 88)

**అంకెల గారడీ** వి. *ankela gaa-raDii* ఫలితాలు నిజానికి లేకున్నా ఉన్నట్లు లెక్కలలో చూపటం jugglery or manipulation of numbers ప్రణాళికా సంఘం అంకెల గారడీ చేస్తూ కాకిలెక్కలు చూపుతూ ప్రణాళికా లక్ష్యాలను సాధించినట్లు ప్రకటిస్తూ ప్రజలను మభ్యపెడుతూ ఉంటుంది. (ఉ 14 10 87)

**అంకెల భాష** వి. *ankela bhaaSa* పదాలకు బదులుగా వివిధ సంఖ్యలకు అర్థాలను జోడించి వాటిద్వారా చేసే భావప్రకటన digital language ఒకటి నుండి తొమ్మిది వరకు గల అంకెలతో ఒక నూతన అంకెల భాష (న్యూడిజిటల్ లాంగ్వేజ్) ను ఇక్కడగల అంతర్జాతీయ సంఖ్యా వ్యావహారిక పరిశోధనా సంస్థ (యూనివర్సల్ డిజిటల్ కమ్యూనికేషన్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్) తయారు చేసింది. (ఉ. 28 10 87)

**అంగబలం** వి. *angabalam* కార్యనిర్వహణకు అవసరమైన సిబ్బంది; మద్దతుదార్లు personnel వ్యవసాయరంగంలో పరిశోధన శరవేగంతో అభివృద్ధి చెందటంతో ఈ రంగంలో అంగబలాన్ని సమీకరించి వారిని సమన్వయపరచటం ద్వారా ... (ఆం. ప్ర 1 7 87)

**అంగడిబొమ్మ** వి. *angaDibomma* శరీరాన్ని అమ్ముకొని జీవించే స్త్రీ; వేశ్య prostitute అదృశ్యమైన అమ్మాయిలు అంగడి బొమ్మలవుతున్నారు. (ఆం ప్ర 1 7 87)

**అంగలార్చు** క్రి. *angalaarcu* స్వలాభం కోసం తహతహలాడు to crave for రాజకీయవేత్త క్షణికోద్రేకాలకు లోనై తక్షణ స్వార్థంకోసం అంగలారుస్తాడు. (ఆం భూ 25 7 89)

**అంచనా** వి. *ancanaa* ఒక విషయం (ఆర్థిక మొ.) స్థితిగతులను పరిశీలించి నిర్ణయించటం estimate జిల్లాలో పార్టీ పరిస్థితిని అంచనా వేసేందుకు పర్యటనలు జరుపుతున్న నాయకులు ... (ఆం ప్ర 20 7 89)

**అంచనావ్యయం** వి. *ancanaavyayam* కార్యక్రమాల అమలుకు ఖర్చుకాబోయే ధనాన్నిలెక్కిస్తే తేలేమొత్తం estimate of expenditure మొత్తం 4775 కోట్ల రూపాయల అంచనావ్యయంతో నిర్మిస్తున్న ఈ పథకాలు పూర్తి అయిన తర్వాత ... (ఆం ప్ర. 29 7 89)

**అంచెలంచెలుగా** క్రి.విశ. *ancelancelugaa* దశల వారీగా step by step ప్రభుత్వవై ఖరికి నిరసనగా అంచెలంచెలుగా ఆందోళన కార్యక్రమాలు చేపడతామని హెచ్చరించారు. (ఈ.అను 30.5.89)

**అంటగట్టు** క్రి. *anTagaTTu* వ్యక్తు లకు దురుద్దేశాలు ఆపాదించు to attribute (motives) స్పీకర్ హోదాలో తాను ఎవరి నైనా కలుసుకో వచ్చని అంతమాత్రాన తనకు రాజకీయాలు అంటగట్టడం భావ్యం కాదన్నారు. (ఈ. 27 4.89)

**అండదండలు** వి. (బ.వ.) *anDadanDalu* కార్య సాధనా ప్రయత్నా నికి మద్దతుగా అందించే సహాయసహకా రాలు support రాజుల రాచరికం క్రింద మగ్గుతూ ప్రజాస్వామ్య వ్యవస్థ కోసం పెక్కు ఉద్యమాలు నడుపుకొన్న నేపాలీలకు అండ దండలు అందించిన భారత జాతీయకాంగ్రెస్ ... (ఆం భూ. 20.4.89)

**అంతంచేయు** క్రి. *antamceeyu* సరైనవి కావని భావించిన పనులను నిరోధించు; రూపుమాపు; to put an end to లిబరేషన్ టైగర్స్ కార్యకలాపాలను అంతంచే యగలమని భారత ప్రభుత్వం హామీ ఇచ్చేవ రకూ రాస్త్రారోకో ఉద్యమాన్ని నిరవధికంగా నిర్వహించగలమని లిబరేషన్ ఫ్రంట్ హెచ్చ రించింది. (ఆం ప్ర 22.9.87)

**అంతరాత్మ ప్రబోధం** వి. *antaraatma praboodham* ఆదేశాలను ధిక్కరించి అంతస్సాక్షి చెప్పినట్లు ప్రవర్తించటం conscience 1969లో శ్రీమతి ఇంది రాగాంధీ "అంతరాత్మ ప్రబోధం" అనే నినాదాన్ని ఇచ్చారో కాని ... (ఆం. కే. 10 7.87)

**అంతరాయం** వి. *antaraayam* కార్య క్రమం మధ్యలో ఏర్పడే అడ్డంకి; అవరోధం interruption ఈ మ్యాచ్‌కు వర్షంవల్ల 2గం. 25నిమిషాలపాటు అంతరాయం కలి గింది. (ఆం. ప్ర 16.6 87)

**అంతరిక్ష కక్ష్య** వి. *antarikSa kakSya* ఉపగ్రహం సంబంధితగ్రహం చుట్టూ తిర గడానికి నిర్దేశించిన మార్గం orbit (space) సోవియట్ యూనియన్ నేటి ఉదయం "సోయజ్ టి.ఎం. 34" అనే అంతరిక్షనౌకను అంతరిక్ష కక్ష్యలోని "మిర" కేంద్రంతో అనుసంధానించడంలో విజయం సాధించింది. (ఆం ప్ర 25.7 87)

**అంతరిక్ష కేంద్రం** వి. *antarikSa keendram* రోదసిలో నిర్మించిన ప్రయోగ శాల space station సోయజ్ అంతరిక్ష కేంద్రంతో అనుసంధానంఅయ్యేంత వరకూ సక్రమంగా ప్రయాణించినట్లు టాస్ వార్తా సంస్థ పేర్కొంది. (ఆం ప్ర. 25.7.87)

**అంతరిక్ష నౌక** వి. *antarikSa nauka* పరిశోధనలకై రోదసిలోకి పంపే వాహనం space craft సోవియట్ యూనియన్ నేటి ఉదయం "సోయజ్ టి. ఎం. 34" అనే అంతరిక్ష నౌకను అంతరిక్ష కక్ష్యలోని "మిర" కేంద్రంతో అనుసంధానించడంలో విజయం సాధించింది. (ఆం ప్ర 25 7 87)

**అంతరిక్ష యుద్ధం** వి. *antarikSa yuddham* ఆకాశంలో నిర్మించిన కేంద్రాల నుంచి ఉపగ్రహాల నియంత్రణ ద్వారా మారణాస్త్రాలతో జరిపే పోరాటం, నక్షత్ర యుద్ధం star wars ఈ ప్రాంతం పొడు గునా విభిన్న ప్రదేశాల్లో అంతరిక్ష యుద్ధ పథకంలోని వివిధ దశలను మోహరిస్తూపో తోంది పెంటగాన్. (ఉ 2.3.88)

**అంతర్జాతీయ ఒప్పందం** వి. *antarjaatiiya oppandam* భిన్న దేశాల మధ్య కుదిరే అంగీకారం international accord పొరుగుదేశమైన ఇండియాతో ఈ ఒప్పందం కుదుర్చుకున్నారని, ఆ అంతర్జాతీయ ఒప్పందాన్ని తాను కూడ గౌరవించాలని ... (ఆం.ప్ర.29 7.89)

**అంతర్జాతీయ చట్టం** వి. *antarjaatiiya caTTam* అన్ని దేశాలు పాటించవలసిన నియమ నిబంధన international law భూతలం మీద జంతు వృక్షరాసుల పరిరక్షణకు ఒక అంతర్జాతీయ చట్టాన్ని త్వరలో చేయబోతున్నారు. (ఈ 14 6 89)

**అంతర్జాతీయ జలాలు** వి. (బ.వ.) *antarjaatiiya jalaalu* ఏ దేశానికీ ప్రత్యేకాధికారం లేకుండా అన్నిదేశాలకూ ఉపయోగపడే సముద్ర ప్రాంతం international waters అంతర్జాతీయ జలాల్లో మందుపాతరలు ఉంచడం, నౌకలపై దాడులు జరుపుతున్న ఇరాన్ బాధ్యతా రహిత ప్రవర్తనకు ... (ఆం భూ 20 4 88)

**అంతర్జాతీయ ప్రవర్తనానియమావళి** వి. *antarjaatiiya pravartanaaniyamaavaLi* ప్రపంచదేశాలు తమ మధ్యనున్న సత్సంబంధాలను కాపాడుకోవటం కోసం ఏర్పాటు చేసుకొన్న కట్టుబాట్లు international code of conduct అంతర్జాతీయ ప్రవర్తనానియమావళికి భిన్నంగా ఉన్న ఏకపక్ష చర్యలను మేం ఖండించినపుడల్లా మా నోరు మూయడానికి ... (ఉ 2 7 87)

**అంతర్జాతీయ సదస్సు** వి. *antarjaatiiya sadassu* (భిన్న సమస్యలపై ఒక అవగాహనకు వచ్చేందుకు) వివిధ దేశాల ప్రతినిధులు పాల్గొనే సభ international conference కంపూచియా సమస్యపై వీలయినంత త్వరలో అంతర్జాతీయ సదస్సు నిర్వహించాలని కూడా పిలుపు నిచ్చాయి. (ఈ 19.5 89)

**అంతర్జాతీయ సభ** వి. *antarjaatiiya sabha* చూ.అంతర్జాతీయ సదస్సు; కంపూచియా సమస్యపై సాధ్యమైనంత తక్కువ సమయంలో ఒక అంతర్జాతీయ సభను ఏర్పాటుచేయాలని ... (ఆం.భూ 19 5.89)

**అంతర్జాతీయ సమస్య** వి. *antarjaatiiya samasya* ఏదో ఒక దేశానికో, ప్రాంతానికో పరిమితం కాకుండా ప్రపంచానికంతటికీ ఆందోళన కలిగించే విషయం international issue గల్ఫ్ యుద్ధం, దక్షిణాసియా ప్రాంతం లోని పరిస్థితి, నిరాయుధీకరణ, దక్షిణాఫ్రికా వంటి ముఖ్యమైన అంతర్జాతీయ సమస్యల గురించి తను సోవియట్ నాయకులతో చర్చించగలనని ఆయన చెప్పారు.(విశా 3 7 87)

**అంతర్ధానం** వి. *antardhaanam* హఠాత్తుగా కనబడకుండా పోవటం; అదృశ్యమవటం disappearance డాక్టర్ గుప్తాను ఎత్తుకుపోయి పద్మనాభం అతిథిగృహంలో ఉంచి గాయత్రి అంతర్ధానం గురించి ప్రశ్నించడం మొదలు పెట్టారు. (ఆం.జ్యో 18.6 87)

**అంతర్యుద్ధం** వి. *antaryuddham* ఒకే దేశపౌరులలో భిన్న వర్గాలమధ్య తీవ్రస్థాయిలో జరిగే సాయుధఘర్షణ civil war రాష్ట్రంలో శాంతిభద్రతలను పరిరక్షించడంలో పోలీసులు, ప్రభుత్వం విఫలమైతే తెలుగు దేశం దాడి నుండి రక్షణకు ప్రజలే చర్యలు తీసుకుంటారని అపుడు రాష్ట్రంలో 'అంతర్యుద్ధం' వచ్చే రోజు ఎంతో దూరంలో లేదని డాక్టర్ చెన్నారెడ్డి హెచ్చరించారు. (ఆం.భూ 17 11 89)

**అంతర్రాష్ట్రమండలి** వి. *antarraaS-Tra manDali* రాష్ట్రాల మధ్య సమ న్వయం సాధించేందుకు ఏర్పడే సంఘం inter-state council *రాజ్యాంగంలోని 263వ అధికరణంలో పేర్కొన్న విధంగా అంతర్రాష్ట్రమండలిని ఏర్పాటు చేసే విష యాన్ని ప్రభుత్వం పరిశీలిస్తుందని ... తెలిపారు.* (ఆం.ప్ర. 1 12.88)

**అంతిమయాత్ర** వి. *antimayaatra* అంత్యక్రియలు జరిపేందుకు మృతదేహాన్ని తీసుకుపోయే ఊరేగింపు; శవయాత్ర funeral procession *యుక్తవయస్సు నుంచి ఎం. జి. ఆర్‌తో సన్నిహితంగా మెలిగిన జయలలిత, అంతిమయాత్ర రోజున జరిగిన అవమానానికి తీవ్రంగా స్పందించింది.* (ఈ 29 12 87)

**అంతిమ సందేశం** వి. *antima sandeeśam* ప్రముఖ వ్యక్తులు మరణానికి ముందు సమాజ శ్రేయస్సు కోరి ప్రజ లకు చేసే ఉద్బోధన last message *మానవాళిని అంతమొందించే మారణాయు ధాలను నిషేధించమని సరిహద్దు గాంధీ ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ తన అంతిమ సందేశంలో పేర్కొన్నారు.* (ఈ. 21 1.88)

**అంత్యక్రియలు** వి. (బ.వ.) *antyakriyalu* మృతదేహానికి జరిపే (మతానుగుణమైన) సంస్కారాలు funeral rites *సుమారు కొన్ని గంటల పాటు సాగిన శవయాత్ర తర్వాత మృతదేహానికి ఛైల్ ఆవరణ లోని శ్మశాన వాటికలో అంత్యక్రియలు జరిపారు.* (ఉ. 16.6.87)

**అందజేయు** క్రి. *andajeeyu* (ఆధికారి కంగా) ఇచ్చు to deliver formally, give *కిస్తులను సరిగా చెల్లిస్తున్న ఖాతా దారులు కొందరికి బ్యాంకు ఈ సందర్భంగా ప్రోత్సాహక బహుమతులు అందజేసింది.* (ఆం.ప్ర 19 10 87)

**అందించు** క్రి. *andincu* సరఫరా చేయు; ఇచ్చు to provide, make available *మంచినీటి కొరకు ప్రజలు పడుతున్న ఇబ్బందులు గుర్తించి జిల్లా యంత్రాంగం యుద్ధప్రాతిపదికపై సహాయక చర్యలు అందించాలని శ్రీ జోగారావు కోరారు.* (ఆం.భూ. 4 12.87)

**అందుబాటు** వి. *andubaaTu* లభ్య మవటం availability *ఆగస్టు నెలా ఖరు లోగా ఒకటి నుంచి 10వ తరగతి వరకు పాఠ్యపుస్తకాలన్నీ విద్యార్థులకు అందు బాటులో ఉంటాయి.* (ఆం.ప్ర 19 7 89)

**అంపైర్** వి. *ampair* (క్రికెట్, టెన్నిస్ లాంటి ఆటలలో) ఆటగాళ్ళు నియ మాలను సరిగా పాటించేలా చూస్తూ ఆటను నిర్వహించే తటస్థవ్యక్తి umpire *మూడవ టెస్ట్‌లో భారతజట్టు ఓడిపోవడా నికి అంపైరింగ్ కూడా ఒక కారణమని ...* (ఆం.ప్ర 22.4 89)

**అంశం** వి. *amśam* 1. ఒక చర్చనీయ విషయం issue *రాష్ట్రాలలో ప్రజలచే ఎన్ను కోబడిన రాష్ట్రాధినేతలపై కేంద్రం సి.బి.ఐ. ఎంక్వయిరీని జరిపించడం రాష్ట్రాధికారా లను హరించడమేనని, ప్రజాస్వామ్య చరిత్రలో ఇలాంటి సంఘటనలు ఎక్కడా జరగలేదని ఈ అంశాలు కూడా పార్లమెంటులో చర్చకు తీసుకురాదలిచామని ఆయన అన్నారు.* (ఆం.ప్ర.28 8 87) 2. కార్యక్రమాలలో ఒకటి item *పంజాబ్‌లో నవంబర్ 26 నుంచి డిసెంబర్ 8 వరకు అయిదు నగరాలలో జరిగే జాతీయ క్రీడోత్సవాలలో ఏడువేల మంది అథ్లెట్లు 28 అంశాలలో పాల్గొంటారు.* (ఆం.ప్ర.28 8 87)

**అక్రమ** విశే. *akrama* చట్ట బద్ధంకాని; నిబంధనలకు వ్యతిరేకమైన illegal స్విస్ బ్యాంకుల్లోని భారతీయుల అక్రమ నిధులను గురించి ప్రస్తావిస్తూ ... (ఆం.ప్ర 2 7 87).

**అక్రమం** వి. *akramam* నిబంధనలు అతిక్ర మించి చేసేపని irregularity ప్రమాదాలను ఎటూ నివారించలేకపోతున్నాం, కనీసం బాధితులకు సహాయం అందించడం లోనైనా అక్రమాలు జరక్కుండా చూడాలి. (ఆం.ప్ర.20 7.89)

**అక్రమ సంబంధం** వి. *akrama sambandham* స్త్రీ పురుషుల మధ్య సామాజిక నియమాలకి విరుద్ధంగా సాగే సంపర్కం illicit relation అక్రమ సంబంధం పెట్టుకొని ఈ హత్యకు పాలుపడ్డట్టు తెలిసింది. (ఆం.ప్ర 7 7 89)

**అక్షరాస్యత** వి. *akSaraasyata* రాయటం, చదవటం తెలిసి ఉండటం literacy పౌష్టికాహారం, అక్షరాస్యత, జనాభా పెరుగుదల వంటి అంశాలకు సంబంధించి ... (ఉ. 16.4 88)

**అక్షింతలు** వి. (బ.వ.) *akSintalu* చేసిన పొరపాట్లను ఎత్తిచూపుతూ పైనున్న వ్యక్తి లేదా సంస్థలు చేసే వ్యాఖ్యలు censure, chiding ఏడు కేసుల్లో ... అవినీతికి పాల్పడినట్లు హైకోర్టు అక్షింతలు వేసిన సంఘటనను ఆయన మర్చిపోయారా! అని శ్రీ భగత్ వ్యంగ్యంగా అన్నారు. (ఆం.ప్ర 25 7 89)

**అఖండ విజయం** వి. *akhanDa vijayam* (ఎన్నికలలో లేదా ఇతరత్రా పోటీలలో సాధించే) స్పష్టమైన, తిరుగులేని గెలుపు sweeping victory రాబోయే సార్వత్రిక ఎన్నికలలో కాంగ్రెస్ అఖండ విజయం సాధిస్తుందని ఆయన ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. (ఆం.ప్ర. 21.8.89)

**అఖిలపక్ష** విశే. *akhilapakSa* అధికార పార్టీతో సహా అన్ని రాజకీయపార్టీలతో కూడి ఉన్న all-party కరువు సహాయక నిధుల కోసం ఈ నెల 23వ తేదీన ఒక అఖిలపక్ష బృందం ఢిల్లీ వెళ్ళి ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్ గాంధీకి సవివరమైన మెమొరాండం సమర్పించాలని ... (ప్ర.శ. 14 8 87)

**అగత్యం** వి. *agatyam* తప్పనిసరిగా చేయాల్సిన పరిస్థితి; అవసరం necessity, inevitability రాయలసీమ ప్రాంతంలో వెనుకబడినతనాన్ని ఇతర ప్రాంతాల పరిస్థితిని రాష్ట్ర ప్రభుత్వం పరిశీలించి ఈ విషయాలలో తగిన నిర్ణయం తీసుకోవాల్సిన అగత్యం ఎంతైనా ఉన్నదని డాక్టర్ ఈశ్వర్ రెడ్డి సూచించారు. (ఆం.భూ. 26 6 87)

**అగ్నిమాపకకేంద్రం** వి. *agnimaapakakeendram* అగ్ని ప్రమాదాలు సంభవించినప్పుడు మంటలను ఆర్పివేసేందుకు ప్రభుత్వం ఏర్పాటు చేసిన సిబ్బంది, వాహనాలు మొ.వి ఉండేచోటు fire station ప్రమాదవార్త తెలియగానే టంగుటూరు అగ్నిమాపకకేంద్రం వారు, ఒంగోలు అగ్నిమాపకకేంద్రం వారు, మంటలను అదుపులోకి తెచ్చారు. (ఈ. 22 7 87)

**అగ్నిమాపకదళం** వి. *agnimaapakadaLam* అగ్నిప్రమాదాలు సంభవించినప్పుడు మంటలను ఆర్పివేయటంలో శిక్షణపొందిన ప్రభుత్వ సిబ్బంది బృందం fire brigade ఆరు గంటల పాటు పోరాడిన అనంతరం అగ్నిమాపకదళంవారు వ్యాగన్ల నుంచి పైకి లేస్తున్న మంటలను నేటి రాత్రి అదుపులోకి తేగలిగినారు. (ఆం.ప్ర. 30 5 89)

అగ్రకులస్తులు వి. (బ.వ.) *agrakulastulu* హిందూ వర్ణవ్యవస్థలోని క్రమంలో పైకులాలకు చెందినవారు; ఉన్నతకులంవారు caste Hindus *తమకొడుకును అగ్రకులస్తులు చంపటంవల్ల తనకున్న ఏకైక ఆధారం కోల్పోయినట్లు ... తల్లిదండ్రులు విలపిస్తూ తెలిపారు.* (ఆం.భూ. 4.12.87)

అగ్రనాయకులు వి. (బ.వ.) *agranaayakulu* పార్టీ లేదా ప్రభుత్వ యంత్రాంగంలో ఉన్నతస్థాయిలో ఉన్న నేతలు top-ranking leaders *బోఫోర్స్ వివాదంలో గద్దె దిగడానికి ప్రధాని నిరాకరించినందుకు నిరసనగా ప్రతిపక్షాల అగ్రనాయకులు ఈ సమిష్టి నిర్ణయం తీసుకొన్నారు.* (ఈ. 24.7.89)

అగ్రనేతలు వి. *agraneetalu* చూ. అగ్రనాయకులు; *చైనా అగ్రనేతలు గోర్బచేవ్ దంపతులకు సోవియట్ బృందం లోని ఇతర ప్రతినిధులకు వీడ్కోలు చెప్పారు.* (ఈ. 19.5.89)

అగ్రరాజ్యం వి. *agraraajyam* ఆర్థిక, సైనిక ఇత్యాది రంగాలలో అపారమైన శక్తిని కలిగి ఉండి ప్రపంచ వ్యవహారాలను ప్రభావితం చేయగలిగిన దేశం (ఉదా. రష్యా, అమెరికా) super power *అగ్రరాజ్యాల రాయబారులతో సహా పలుదేశాల రాయబారులను నట్వర్ సింగ్ కలుసుకుని పరిస్థితిని గూర్చి, భారత్ నిర్ణయం గూర్చి వివరించారు.* (ఆం.జ్యో. 6.5.87)

అగ్రికోస్ వి. *agrikoos* వ్యవసాయ శాస్త్రం చదివే విద్యార్థులు (మెడికోస్ లాగా) agricos *రాజేంద్రనగర్ లోని రాష్ట్ర వ్యవసాయ విశ్వవిద్యాలయానికి చెందిన 200 మంది విద్యార్థినీ విద్యార్థులను పోలీసులు అరెస్టు చేశారని అగ్రికోస్ ఫోరం కార్యకర్తలు తెలిపారు.* (ఆం.ప. 28.10.87)

అఘాయిత్యం వి. *aghaayityam* 1. మానభంగ ప్రయత్నం; దౌర్జన్యం sexual assualt, outrage ... *15సంవత్సరాల బాలుడు సినిమాలో చూసిన విధంగా ఒక బాలికపై అఘాయిత్యానికి పాల్పడగా పోలీసులు పట్టుకున్నారు.* (ఆం.జ్యో. 11.6.87) 2. ఆత్మహత్యా ప్రయత్నం attempt to commit suicide *వేధింపు పడలేక అఘాయిత్యం* (ఈ. 1.12.87) 3. అకారణంగా కొట్టటం; దౌర్జన్యం physical assualt *పోలీసు అఘాయిత్యం:* ... *హరిజనులను పోలీసు ఎస్.ఐ. ఆగష్టు 28న పోలీసుస్టేషన్‌కు లాక్కువెళ్ళి విచక్షణారహితంగా కొట్టారు.* (వి.శా. 9.9.87)

అచ్చువేయు క్రి. *accuveeyu* యంత్ర సహాయంతో కాగితంపై ముద్రించు to print ... *పదవ తరగతి పాఠ్యపుస్తకం, ఉపవాచకం మూడున్నర లక్షల వంతున అచ్చువేయాలని నిర్ణయించి ఇంతవరకు 2లక్షల పుస్తకాలు అచ్చువేసి పంపిణీ చేసింది.* (ఆం. ప్ర. 19.7.89)

అజమాయిషీ వి. *ajamaayiSii* వ్యక్తి లేదా సంస్థ పనితీరు మీద ఉన్న అదుపు control ... *జౌళిమిల్లులు ప్రైవేటు రంగానికి చెందినవని, మిగతావి సహకార సంఘాల ఆధ్వర్యంలోను ప్రభుత్వ అజమాయిషీలోను నడుస్తున్నాయని తేలింది.* (ఆం భూ 26.4.89)

అజమాయిషీచేయు క్రి. *ajamaayiSii ceeyu* పనులు సరిగా జరుగుతున్నదీ లేనిదీ దగ్గరుండి ఎప్పటికప్పుడు పరిశీలించు; పర్యవేక్షించు to supervise *అజమాయిషీ చేసే అధికారం యావత్తు కేంద్రప్రభుత్వానిదే.* (ఆం. ప్ర 25.7.89)

అజ్ఞాతం వి. *ajnaatam* తన ఉనికిని బయట పడనివ్వకుండా (ముఖ్యంగా ప్రభుత్వానికి) జీవితం గడపటం underground, incognito*పూజారి*

రాజయ్య ఉరఫ్ ధర్మన్న వెంకటాపురం నివాసి బీడి ఆకుల కళ్ళాల్లో వాచ్‌మెన్‌గా పనిచేసే రోజుల్లో చంద్ర పుల్లారెడ్డి వర్గానికి చెందిన రాము దళంతో సంబంధాలు పెరిగి పార్టీలో చేరి అజ్ఞాతానికి వెళ్ళిపోయాడు. (ఆం ప్ర. 24.8.89)

**అజ్ఞాత కార్యకర్త** వి. *ajnaata kaarya-karta* తన ఉనికిని బయట పడనివ్వకుండా ఒక సంస్థ లేదా పార్టీ కోసం పనిచేసే వ్యక్తి underground worker హత్య జరిగిన చోట అజ్ఞాత కార్యకర్త రాసిన ఓ ఉత్తరం పోలీసులకు దొరికింది. (ఆం. ప్ర 31 0 87)

**అజ్ఞాత జీవితం** వి. *ajnaata jiivi-tam* చూ.అజ్ఞాతం; underground life నిర్బంధం కారణంగా 1984లో ఎన్నికైన నాయకత్వం కూడా అజ్ఞాత జీవితాన్నే ఆశ్రయించాల్సి వచ్చింది. (ఆం ప్ర 8.5 89)

**అజ్ఞాత వాసం** వి. *ajnaata vaasam* చూ. అజ్ఞాతం; ఈ పరిస్థితుల్లో వరంగల్ జిల్లాలో రక్షణ లేని దృష్ట్యా ఎం.సి.పి.ఐ కార్యకర్త లందరూ అజ్ఞాతవాసంలోకి వెళ్ళి తమప్రాణా లను రక్షించుకోవలసినదిగా ఆయన విజ్ఞప్తి చేశారు. (ఆం జ్యో 6 5.87)

**అటకాయించు** క్రి. *aTakaayincu* దారి మధ్యలో దౌర్జన్యంగా ఆపివేయు to intercept ఒక ఖాళీలారీని అటకాయించి కత్తులతో బెదిరించి ... అందులో ప్రయాణం చేస్తున్న వ్యాపారస్తుని నుండి అయిదు వేల రూపాయలు నగదు దోచుకున్నారు (ఆం భూ 16 5 89)

**అటకెక్కించు** క్రి. *aTakekkıncu* (ప్రాజెక్టులు, సిఫార్సులు మొ.) అమలు చేయకుండా మూలన పడవేయు to shelve (a plan or a proposal etc.) ఈ కమిటీ సిఫారసులను తొమ్మిదేళ్ళ పాటు అటకెక్కించిన కాంగ్రెస్(ఐ) ప్రభుత్వం తీరు ఇప్పుడు ఎన్నికల సంవత్సరంలో ఇందుకోసం కంకణం కట్టుకున్నట్లు చెప్పుకుంటున్నదని ఆయన విమర్శించారు. (ఈ. 15.5.89)

**అటవీ ఉత్పత్తులు** వి. (బ.వ.) *aTavii utpattulu* అడవులలో సహజంగా లభించే వస్తువులు (తేనె మొ.) forest products అడవి తల్లిని నమ్ముకొని అటవీ ఉత్పత్తుల సేకరణ ప్రధాన వృత్తిగా చేపట్టి అర్థాకలితో పేదరికాన్ని అనుభవిస్తున్న గిరిజనులను ఆదుకునేందుకు ... (ఆం.ప్ర. 24.9.87)

**అట్టడుగు ప్రజలు** వి. (బ.వ.) *aTTaDugu prajalu* ఆర్థికంగా, సామాజికంగా క్రింది స్థాయిలో ఉన్న జనం; బడుగుజనం downtrodden people స్థానిక బర్కత్‌పురాలోని మూడవ నెంబర్ సర్కిల్‌లో స్లమ్ సర్టిఫికెట్లు పొందడానికి అట్టడుగు ప్రజలు ఎన్నో బాధలు పడుతున్నారు. (ఆం.ప్ర 3.5 89)

**అట్టడుగు స్థాయి** వి. *aTTaDugu sthaayı* సంస్థాగత యంత్రాంగంలో కింది స్థాయి grass-root level అట్టడుగుస్థాయిలో పంచాయితీలకు సముచిత స్థానం కల్పించడం ద్వారా గ్రామీణులందరికీ సంపూర్ణ ప్రజాస్వామ్యాన్ని అందించి వారి సత్వర పురోగతికి మేం చేయాల్సినదంతా చేస్తాం. (ఈ 11 5 89)

**అట్టుడికించు** క్రి. *aTTuDikincu* తీవ్రమైన అలజడి సృష్టించు; కుదిపివేయు to shake ఆరేడేళ్ళ కిందట పోలెండ్‌లో కార్మికుల నాయకత్వాన నడిచిన సాలిడారిటీ ఉద్యమం లోగడ హంగేరీ చెకొస్లవేకియాలను అట్టుడికించిన సామూహిక తిరుగుబాట్లతో పోల్చదగిన ప్రజా చైతన్యకెరటమిది. (ఈ 31 5 89)

అట్టుడికిపోవు క్రి. *aTTuDikipoovu* తీవ్రమైన సంచలనానికి లోనగు; కుతకుతలాడిపోవు to simmer పన్నులు నిర్బంధాలు కంపుకొట్టే రకరకాల కుంభకోణాలతో దేశం అట్టుడికి పోతున్న యథార్థ దృశ్యం ఈనాడు మన ముందున్నది. (విశా. 20.6.87)

అడపాదడపా క్రి.వి. *aDapaadaDapaa* అప్పుడప్పుడు occasionally ఆయా ఉత్పత్తి ప్రాంతాల నుంచి వస్తువుల సరఫరాలు తగ్గడంతో అడపాదడపా సమస్య మరింత జటిలమవుతూ ఉంటుంది. (ఈ. 25.4.89)

అడవి అన్నలు వి. (బ.వ.) *aDavi annalu* గిరిజన ప్రాంతాలలో ఉంటూ వాళ్ళ శ్రేయస్సు కోసం పనిచేసే విప్లవకారులు; నక్సలైట్లు naxalites, group of ultra leftist revolutionaries working in forest regions among the tribals ఈ సమయంలో ప్రభుత్వాన్ని ఎంత అభినందిస్తున్నామో "అడవిఅన్నల" నిజాయితీని అంతే అభినందించాలి. (ఉ. 1.1.88)

అడహాక్ కమిటీ వి. *aDahaak kamiTii* ఒక ప్రత్యేక విషయాన్ని మాత్రమే పరిశీలించేందుకు ఏర్పాటు చేసిన తాత్కాలిక సంఘం ad hoc committee కమీషనర్ తదితర అధికారులతో ఏర్పాటు చేసిన సబ్ కమిటీ సహకారంతో అడహాక్ కమిటీ వాస్తవంగా ఎం.సి.హెచ్ స్థలాలు వాటిలో ఆక్రమిత స్థలాల వివరాల్ని సేకరించింది. (ఈ. 30.5.88)

అడహాక్ గ్రాంటు వి. *aDahaak graanTu* అంచనాలు, ఆమోదాలు లేకుండా తక్షణావసరాల కోసం ప్రభుత్వం ప్రకటించే సొమ్ము; తాత్కాలిక గ్రాంటు ad hoc grant ఏ రాష్ట్రానికి వెళ్ళినా అడహాక్ గ్రాంట్లు ప్రకటిస్తున్న ప్రధాన మంత్రి మన రాష్ట్రానికి వచ్చినప్పుడు 21కోట్ల రూపాయలు వేస్ అండ్ మీన్స్ అడ్వాన్స్ మాత్రమే ప్రకటించడం ఎంతవరకు సమంజసమని ప్రశ్నించారు. (ఆం.ప్ర. 21.8.89)

అడహాక్ బాడీ వి. *aDahaak baaDii* సంస్థాగత ఎన్నికలు జరిగేవరకు కార్యనిర్వహణకోసం నియమించిన తాత్కాలిక కార్యవర్గం ad hoc body ఎన్నికలు జరిగి రైతు ప్రతినిధులు బాధ్యతలు స్వీకరించేవరకు కర్షక పరిషత్ ఆలనాపాలనా చూడటానికి రాష్ట్ర స్థాయిలో ఒక అడహాక్ బాడీని సృష్టించారు. (ఈ. 26.5.89)

అడ్డంకి వి. *aDDanki* రోడ్డు మీద వాహనాల రాకపోకలను నిరోధిస్తూ పెట్టిన రాళ్ళు మొ. barricade బంద్ సందర్భంగా ప్రైవేట్ వాహనాల రాకపోకలను కూడా నిషేధించే ఉద్దేశంతో తెలుగుదేశం, దాని మిత్రపక్షాల కార్యకర్తలు నేడు నగరంలో పలుచోట్ల రోడ్ల మీద అడ్డంకులు ఏర్పాటు చేశారు. (ఆం.ప్ర. 31.8.89)

అడ్డదారి వి. *aDDadaari* నిబంధనలకు, నైతిక విలువలకు వ్యతిరేకమైన మార్గం backdoor method బాధ్యతలను విస్మరించి తమ విధులు నెరవేర్చకుండా డబ్బులు సంపాదించేందుకోసం అడ్డదారులు తొక్కడమే కాకుండా సివిల్ కేసుల్లో అధికంగా జోక్యం చేసుకుంటున్నారు. (ఆం.ప్ర. 11.5.89)

అడ్డగించు క్రి. *aDDagincu* ముందుకు వెళ్ళనివ్వకుండా ఆపివేయు to obstruct విధులను పునఃప్రారంభించడానికై ఈ భవనంలోకి వెళ్ళే ఇండియన్ ఎక్స్‌ప్రెస్ జనసత్తా ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్

ఉద్యోగుల రాకపోకలను శ్రీ నాగరాజన్ ఏజెంట్లు కాని మద్దతుదార్లు కాని అడ్డగించ రాదని ఢిల్లీ హైకోర్టు ఆదేశించింది. (ఆం.ప్ర. 28.11.87)

**అడ్డుకొను** క్రి. *aDDukonu* ఏదయినా కార్యక్రమాన్ని కొనసాగకుండా చేయు; ఆపు, నివారించు to prevent తమిళ రాజ్య స్థాపనకు అడ్డుకోవడానికి ప్రపంచంలో ఏ శక్తిని తమిళులు అనుమతించబోరని ఆయన అన్నారు. (ఆం.భూ 1.5.89)

**అడ్డుతగులు** క్రి. *aDDutagulu* (కార్యక్ర మాన్ని) కొనసాగకుండా చేయు; ఆటంకం కల్పించు to interrupt ముఖ్యమంత్రి శ్రీ జ్యోతిబసు సమాధానమిస్తున్నపుడు కాంగ్రెసు (ఐ) సభ్యుడు శ్రీ నాథన్ పాండే పదేపదే అడ్డుతగలడం ప్రారంభిం చారు. (ఆం.ప్ర. 12.4.88)

**అడ్డుపడు** క్రి. *aDDupaDu* చూ. అడ్డు కొను; చిత్రంలో తనను నటించకుండా అడ్డుపడడం దేవునితరం కూడా కాదని ముఖ్యమంత్రి, నేషనల్ ఫ్రంట్ ఛైర్మన్ శ్రీ ఎన్టీ రామారావు అన్నారు. (ఈ. 7 6 89)

**అడ్డుపుల్లవేయు** క్రి. *aDDupullaveeyu* ఒకపని సాగకుండా చేయటం కోసం, అనవసరమైన అభ్యంతరాలు లేవనెత్తు to raise an objection (with the ulterior motive of hindering some body's work), obstruct on a plea తమ ప్రభుత్వం గతంలో ఏ ప్రభుత్వం చేపట్టని భారీ ప్రాజెక్టుల నిర్మా ణాన్ని చేపట్టడానికి కృషి చేస్తుండగా కేంద్రం అడ్డుపుల్లవేస్తూ పథకాలకు అనుమతి ఇవ్వడం లేదని ... కేంద్రాన్ని విమర్శించారు. (ఆం.జ్యో. 18.4.88)

**అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్** వి. *aDmin-isTreeTiv Tribyunal* ప్రభుత్వ ఉద్యో గుల సర్వీసు వ్యవహారాలలో వచ్చే వివా దాలపై విచారణ జరిపే న్యాయస్థానం administrative tribunal జూన్ ఆరో తేదీ వరకు ఆంధ్ర ప్రదేశ్ అడ్మి నిస్ట్రేటివ్ ట్రిబ్యునల్‌కు వేసవి సెలవులు ప్రకటించినట్లు ఆ ట్రిబ్యునల్ రిజిస్ట్రార్ తెలియజేశారు.

**అణగదొక్కు** క్రి. *aNagadokku* (వ్యక్తి, సంస్థ, భావాలు మొ.) అభివృద్ధిలోకి రాకుండా తొక్కి ఉంచు to suppress పోలీసు బిల్లు, ప్రెస్ బిల్లులు తెచ్చేందుకు తెలుగు దేశం చేసిన ప్రయత్నాలు విఫలం కావటంతో సరికొత్త మార్గంలో మేధస్సును అణగ దొక్కేందుకు ఇటీవలే ఒక సర్క్యులర్‌ను జారీచేసింది. (ఉ. 23.11.87)

**అణచివేత** వి. *aNaciveeta* తనకు వ్యతి రేకమైన వ్యక్తులను, వారి అభిప్రాయ లను నిరంకుశంగా కాలరాయటం; నొక్కి పట్టటం repression బూటకపు ఎదురు కాల్పుల్లో సిక్కులను హతమారుస్తున్నం దుకు సిక్కులపై సాగుతున్న అణచివేత విధానాలకు నిరసనగా ఆయన ఆ పతకాన్ని తిరస్కరించారు. (ఆం.ప్ర. 26.4.89)

**అణచివేయు** క్రి. *aNaciveeyu* (ఉద్య మాలు, తిరుగుబాట్లు మొ. వాటిని) బలప్ర యోగం ద్వారా తొక్కివేయు to crush, quell (a movement, rebellion etc.) విద్యార్థి ఉద్యమాన్ని అణచివేసే ప్రయత్నంలో భాగంగా చైనా ప్రధానమంత్రి ... సైనిక పాలన విధిస్తున్నట్లు ప్రకటిం చారు. (ఈ. 20.5.89)

**అణుకేంద్రం** వి. *aNukeendram* అణుశక్తి విజ్ఞానంపై ప్రయోగాలు జరిపే పరిశోధనా స్థలం atomic centre భారత అణుకేం ద్రాన్ని పాకిస్తాన్ కూడా అదే విధంగా తనిఖీ చేయడానికి ఒప్పుకోవలసి ఉంటుందని ... (ఈ 9 7 87)

**అణుధార్మికత** వి. *aNudhaarmikata* అణు విచ్ఛేదన వల్ల వెలువడే వినాశకర కిరణాలు nuclear radiation *అణు ధార్మికతవల్ల మనుషుల ప్రాణాలకు ముప్పు వాటిల్లుతుందనడం కేవలం అపోహ మాత్ర మేనని ...* (ఆంజ్యో 24 6 87)

**అణుధూళి** వి. *aNudhuuLi* అణువిస్ఫో టనం లేదా అణు ప్రమాదాల సమయంలో వాతావరణంలో వ్యాపించే శక్తి కలి గిన పదార్థం radioactive fallout *చెర్నోబిల్ అణుధూళితో కలుషితమైన పాల ఉత్పత్తులను యూరప్ ఉమ్మడి మార్కెట్ (ఇఇసి) దేశాల నుండి భారత్ పాడి పరి శ్రమాభివృద్ధి సంస్థ దిగుమతి చేసుకోవటం పట్ల ఆందోళన వ్యక్తమవుతున్నది.* (ఆంప్ర 27.10.87)

**అణుపరీక్ష** వి. *aNupariikSa* అణు శక్తి సామర్థ్యాన్ని నిర్ణయించేందుకు జరిపే విస్ఫోటన ప్రయోగం; అణుపాటవ పరీక్ష nuclear test *సోవియట్ యూనియన్ సైబీరియాలోని యాకుటియ అణు పరీక్ష కేంద్రంలో భూగర్భ అణుపరీక్ష నిర్వహించి నట్లు "టాస్" ప్రకటించింది.* (ఈ. 25 7.87)

**అణువిద్యుత్ కేంద్రం** వి. *aNuvidyut keendram* అణు విచ్ఛేదన ప్రక్రియ ద్వారా కరెంటును ఉత్పత్తి చేసే ప్రదేశం atomic power plant *రాష్ట్రంలో తొలి అణువిద్యుత్ కేంద్రాన్ని నాగార్జున సాగర్ లోనే నెలకొల్పాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించినట్లు ఆంధ్ర ప్రదేశ్ విద్యుత్ బోర్డు సభ్యుడు ... తెలియజేశారు.* (ఈ. 28.6.89)

**అణువిస్ఫోటనం** వి. *aNuvispho-oTanam* పరమాణువును విచ్ఛేదన చేయటం nuclear explosion *అణు విస్ఫోటనం ప్రస్తుతం ఎదుర్కొంటున్న ప్రమాదం, విపత్తు.* (ఆంభూ 21 4 89)

**అణ్వస్త్ర పరీక్ష** వి. *aNvastra pariikSa* చూ. అణుపరీక్ష; *అమెరికా మంగళవారం ఉదయం నెవాడా ఎడారిలో భూగర్భ అణ్వస్త్ర పరీక్షను నిర్వహించింది.* (ఆం.ప్ర 29 6 89)

**అణ్వస్త్ర యుద్ధం** వి. *aNvastra yud-dham* అణ్వాయుధాలతో చేసే సమరం nuclear war *భారతదేశానికి చైనా అణ్వస్త్ర యుద్ధం జరుపుతుందనే భయం ప్రస్తుతానికి లేదని ...* (ఆం.ప్ర 9.10 88)

**అణ్వస్త్రరహిత ప్రపంచం** వి. *aNvas-trarahita prapancam* అణ్వస్త్రాల బారి నుండి విముక్తమైన ప్రపంచం nuclear free world *అణ్వస్త్రరహిత ప్రపంచం దిశగా తొలి చర్య.* (విశా. 18.10.87)

**అణ్వస్త్ర వ్యాప్తి** వి. *aNvastra vyaapti* వివిధ దేశాలు నూతనంగా అణ్వాయు ధాలను సమీకరించుకోవటం nuclear proliferation *ఫ్రాన్స్ దేశం ఇటీవల అణుపాటవ పరీక్షలు జరపడంపై ఆయన అసంతృప్తి వ్యక్తం చేశారు. అణ్వస్త్ర వ్యాప్తిని నిరోధించాలంటే ముందుగా అణుపాటవ పరీక్షలు నిలిపివేయాలని ప్రధాని అన్నారు.* (ఈ 2 7 87)

**అణ్వస్త్రవ్యాప్తి నిరోధక ఒప్పందం** వి. *aNvastravyaapti niroo-dhaka oppandam* ఇతర దేశాలు అణ్వాయుధ సామర్థ్యాన్ని పొంద కుండా నివారించడానికి అణ్వాయుధ రాజ్యాల మధ్య కుదిరిన అంగీ కారం nuclear non-prolifera tion treaty *1977 లో అణ్వస్త్ర వ్యాప్తి నిరోధక ఒప్పందం రూపకల్పనలో ఆయన కూడా తోడ్పడ్డారు.* (ఈ 25 4 89)

**అతలాకుతలంచేయు** క్రి. *atalaakutalamceeyu* తట్టుకోలేనంత అధిక స్థాయిలో నష్టం లేదా విధ్వంసం కలిగించు to create havoc - వర్ష రుతువుకు ముందు మే నెలలోనో లేదా నవంబర్ నెలలోనో బంగాళా ఖాతంలో వాయు గుండాలు ఏర్పడి రాష్ట్రాన్ని అతలాకుతలంచేయడం గతంలో అనుభవమే. (ఈ. 26.7.89)

**అతిక్రమించు** క్రి. *atikramincu* నియమాలు, నిబంధనలకు వ్యతిరేకంగా ప్రవర్తించు to violate ఒక దేశం అంతరంగిక వ్యవహారాలలో మరోదేశం అనుచిత జోక్యం చేసుకోరాదన్న వైదేశికనీతిని అతిక్రమించి న్యూఢిల్లీ తీసుకొన్న ఏకపక్ష నిర్ణయం ... (ఈ. 5 6.87)

**అతిరథ మహారథులు** వి. (బ.వ.) *atiratha mahaarathulu* రాజకీయ పోరాటాల్లో రాటుదేలి పేరెన్నిక గన్న నాయకులు stalwarts అతిరథ మహారథులైన రాష్ట్ర ప్రస్తుత ముఖ్యమంత్రి బన్సీలాల్, లోక్‌దళ్(బి) నాయకుడు దేవిలాల్ రాష్ట్ర బి.జె.పి. అధ్యక్షుడు మంగల్ సేన్, మాజీ ముఖ్యమంత్రి బి.డి.గుప్తా తదితర మాజీ మంత్రుల భవితను నిర్ణయించే ఎన్నికలు ఇవి. (ఈ 18.6.87)

**అతిరహస్య పత్రం** వి. *atirahasya patram* దేశ భద్రత, రక్షణలకు సంబంధించిన గోప్యమైన సమాచారం ఉన్న ఫైలు; ముఖ్యమైన డాక్యుమెంట్లు classified documents దేశ భద్రతకు సంబంధించిన "అతిరహస్య " పత్రాలను జనరల్ సుందర్జీ వెల్లడిస్తున్నారని రక్షణ శాఖ ఆరోపించింది. (ఆం ప్ర 7 9.89)

**అతివాద ప్రజాతంత్రశక్తులు** వి. (బ.వ.) *ativaada prajaatantraśaktulu* అభ్యుదయ కర పరిణామాలకై కృషిచేసే అతి వాద రాజకీయపక్షాలు; వామ పక్ష, ప్రజాస్వామ్య శక్తులు left and democratic forces అతివాద ప్రజాతంత్రశక్తుల ఐక్యతకు సి.పి.ఐ. కృషి, ప్రజా వ్యతిరేక విధానాలను అనుసరిస్తున్న ఇందిరా కాంగ్రెస్ ... (విశా. 24.7.87)

**అతివాది** వి. *ativaadi* 1. తీవ్రమైన సాంఘిక, ఆర్థిక మార్పులను కోరే రాజకీయవాది radical అందరి కంటే నేను మరింత ఎక్కువ అతివాదిని కానట్లయితే లాభసాటి యైన వృత్తిని విడనాడి పేదప్రజల సేవకు ఎందుకు వస్తాను అని ప్రశ్నించారు. (విశా 25 6 87) 2. ఏదైనా విషయంపై కొన్ని ఖచ్చితమైన, తీవ్రమైన అభిప్రాయాలు కలిగి ఉండి, వాటి విషయాలలో రాజీపడని వ్యక్తి hardliner సుప్రీం సోవియట్‌కు జరిగిన ఎన్నికలలో ఓడిపోయిన డిప్యూటీలు తీవ్ర స్థాయిలో పార్టీలో అతివాదులను విమర్శించారు. (ఆం.భూ. 31.5 89)

**అతిసారవ్యాధి** వి. *atisaaravyaadhi* విపరీతమైన విరేచనాలతో శరీరంలో నీరు తగ్గిపోవటం వల్ల ప్రాణాపాయం కల్గించే వ్యాధి; నీళ్ళ విరేచనాల వ్యాధి diarrhoea రాష్ట్రంలోని అనేక జిల్లా కేంద్రాల్లో ప్రబలిపోయిన అతిసారవ్యాధి ప్రజల్ని భయాందోళనలకు గురిచేస్తోంది. (ఆం ప. 28 5 87)

**అతీంద్రియశక్తి** వి. *atiindriyaśakti* భౌతికంగా పరిశీలించడానికి వీలులేని అసాధారణ సామర్థ్యం; కంటికి కనిపించని శక్తి supernatural power ఓగులాపూర్ గ్రామంలో పదకొండు సంవత్సరాల వయస్సుగల వికృత బాలమణి అనే బాలికను అతీంద్రియశక్తులు కలిగిన దేవత పూనింది. (ఆం.ప్ర 6 10.87)

**అతీతం** వి. *atiitam* ఒక విషయం యొక్క ప్రభావం తన మీద పడకుండా లేదా పట్టించుకోకుండా ఉండటం free from, above కులమతాలకు అతీతంగా సామరస్యాన్ని పెంపొందించేందుకు పోలీసు సిబ్బంది కృషి చేస్తారని ... చెప్పారు. (ఈ.అను. 1.5.89)

**అతుకులబొంత** వి. *atukulabonta* ఏ మాత్రం పొంతన లేని భిన్న వ్యక్తుల లేదా సంస్థల కలయికతో ఏర్పడిన కూటమి conglomeration of different political parties ఫ్రంట్ అన్నది ఐదు భాగస్వామ్య పక్షాలతో ... అతుకు లబొంతగా కాంగ్రెస్(ఐ) చేసే ప్రచారాన్ని ఎదుర్కోడానికి ... (ఈ. 5.6 89)

**అత్యవసర అధికారాలు** వి. (బ.వ.) *atyavasara adhikaaraalu* దేశంలో క్లిష్ట పరిస్థితు లేర్పడినప్పుడు వ్యక్తులు, సంస్థలకున్న హక్కులను కుదిస్తూ తీవ్ర మైన చర్యలు తీసుకోడానికి వీలుగా ప్రభు త్వానికి సంక్రమించే అసాధారణ అధికా రాలు emergency powers దేశభద్ర తకు భంగకరమైన విషయాల ప్రచురణను నిషేధించినట్టు సమాచార శాఖ పేర్కొంది. అత్యవసర అధికారాలు ఉపయోగించి ఈ సెన్సార్‌షిప్ విధించారు. (ఆం. ప్ర. 6.7.89)

**అత్యవసర చర్చ** వి. *atyavasara carca* (విషయ తీవ్రత దృష్ట్యా) వెంటనే కలిసి చేయవలసిన విషయపరిశీలన urgent discussion, urgent talks ఈ అంశంపై అత్యవసర చర్చ జరపడంకోసం శాసనసభ సభ్యులందరికీ వెంటనే టెలిగ్రా ములు పంపి రాజధానికి పిలిపించాలని కోరారు. (ఆం ప్ర 5.5 89)

**అత్యవసర పరిస్థితి** వి. *atyavasara paristhiti* దేశం వెలుపలి నుంచి గాని, లోపలి నుంచి గాని తీవ్రమైన ప్రమాదం ఎదురైనప్పుడు లేదా సంక్షోభం తలెత్తిన ప్పుడు పౌరహక్కులను కుదించి అసాధా రణ అధికారాలతో ప్రభుత్వం సాగించే పాలనా వ్యవస్థ emergency ఫిలిప్పీన్స్ ప్రభుత్వాన్ని కూలదోయడానికి గత ఆరు రోజులుగా విద్రోహ సైనిక శక్తుల సంకుల పోరాటం జరుపుతున్న దృష్ట్యా అత్యవసర పరిస్థితి విధిస్తున్నట్లు ఆమె తెలిపారు. (ఆం. ప్ర 7.12.89)

**అత్యవసర లేఖ** వి. *atyavasara leekha* తక్షణ కర్తవ్యాన్ని గుర్తు చేస్తూ రాసే ఉత్తరం urgent letter ... జె.డి. ఎల్.పి. ప్రధాన కార్యదర్శి శ్రీమతి లీలా దేవీప్రసాద్ సభ్యులకు ఒక అత్యవసర లేఖ పంపారు. (ఈ. 21.4.89)

**అత్యవసర సంప్రదింపులు** వి. (బ.వ.) *atyavasara sampradimpulu* (తీవ్ర మైన పరిస్థితి ఏర్పడినప్పుడు) సంబం ధిత ప్రముఖ వ్యక్తులు లేదా సంస్థల సలహా, అంగీకారాల కోసం వెంటనే వారితో కలిసి మాట్లాడటం urgent consultations సోమశిల ప్రాజెక్టులో ... జరిగిన అక్రమాల మీద మాజీ చీఫ్ ఇంజనీర్ సమర్పించిన సాంకేతిక నివేది కపై అత్యవసర సంప్రదింపులు జరిపేందుకు తెలుగు గంగ చీఫ్ ఇంజనీర్ హైదరాబాద్ వెళ్ళారు. (ఆం.ప్ర. 26.4.89)

**అత్యవసర సమావేశం** వి. *atyavasara samaaveeśam* తక్షణ సమస్యలను చర్చించేందుకు కొద్ది గడువులో ఏర్పాటు చేసే మీటింగు urgent meeting రాష్ట్ర శాసన సభ అత్యవసర సమావేశం ఎప్పుడు జరిగేదీ ఇంకా నిర్ణయించలేదని ... (ఈ. 4.5.89)

**అత్యాచారం** వి. *atyaacaaram* 1. దౌర్జన్య పూరితమైన ప్రవర్తన atrocity టెర్రరిస్టుల అత్యాచారాలతో పాటు పెరిగిపోతున్న పోలీసుల అమానుషచర్యలను అదుపు చేస్తామని రాజీవ్ 'హామీ' ఇచ్చారు. (ఆం భూ. 25.5 89) 2. ఒక వ్యక్తిని బలవంతంగా అనుభవించడం rape ఒక గిరిజన యువతి ఎంత వేడుకున్నా కాదని భీమ్లా అత్యాచారం జరపడం చూసిన చంద్రమౌళి అతనితో తగువు పడ్డాడని తెలిసింది. (ఆం భూ 4 7 89)

**అత్యున్నత స్థాయి** వి. *atyunnata sthaayi* అధికార యంత్రాంగపు అంచెలలో ప్రముఖ స్థానం top ranking, high level భద్రతా ఏర్పాట్ల విషయంపై అత్యున్నత స్థాయి అధికారులతో సమీక్ష చేసి కొన్ని నిర్ణయాలు తీసుకున్నారు. (ఆం.ప్ర 26 4 89)

**అథ్లెట్** వి. *athleT* పోటీలలో పాల్గొనే క్రీడాకారుడు athlète అథ్లెట్లు అనవసరమైనవాటికి ప్రాధాన్యమిచ్చేకంటే శిక్షణ పూర్తి చేసుకోవడం మంచిదని కోచ్‌లు సలహా ఇచ్చారు. (ఆం.ప్ర. 15.7.89)

**అదనపు బలగం** వి. *adanapu balagam* అప్పటికి ఉన్న భద్రతా దళాలకు తోడుగా పంపే మరికొంత భద్రతా సిబ్బంది additional force ట్రింకోమలీలో ఘర్షణల దృష్ట్యా అక్కడికి అదనపు బలగాలను పంపి భారతదళాన్ని మరింత పటిష్ఠవంతం చేయనున్నట్లు ... తెలియజేశారు. (ఆం.ప్ర 6 10 87)

**అదనపు బాధ్యత** వి. *adanapu baadhyata* అప్పటికే నిర్వర్తిస్తున్న విధులకు తోడుగా వచ్చి చేరే కొత్త విధి additional charge ఆయన బోర్‌స్టల్ స్కూల్ సూపరిండెంటుగా అదనపు బాధ్యతలు కూడా నిర్వహిస్తారు. (ఉ 14 4.88)

**అదనపు భూమి** వి. *adanapu bhuumi* భూపరిమితి చట్టానికి మించి భూస్వాముల దగ్గర ఉన్న నేల; మిగులు భూమి surplus land అదనపు భూములను స్వాధీనం చేసుకొనడానికి జిల్లాల వారీగా ఏ విధమైన చర్యలు తీసుకోవాలో ప్రభుత్వానికి సూచనలు ఇచ్చే అధికారాలు ఈ కమిటీకి అప్పగించినట్లు ముఖ్యమంత్రి చెప్పారు. (ఆం ప్ర 29 6 89)

**అదనపు వనరులు** వి. (బ.వ.) *adanapu vanarulu* ఉన్న నిల్వలను మరింత పెంపొందించేందుకు ఏర్పాటు చేసుకొనే మరికొన్ని సదుపాయాలు additional resources అదనపు వనరులను సమీకరించి రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని మెరుగుపర్చాలని ... కోరారు. (ఆం భూ 19 4 88)

**అదుపు** వి. *adupu* 1. చేయిదాటి పోని స్థితి control శ్రీ శ్రీపతిరెడ్డి హత్యతో ఉద్రిక్తత నెలకొన్న షాబాద్ దాని చుట్టుప్రక్కల ప్రాంతాలలో పరిస్థితి అదుపులో ఉంది. (ఆం. ప్ర 1.5 90) 2. పోలీసుల నిర్బంధం custody రాష్ట్ర వ్యాప్తంగా నక్సలైట్లను ... అదుపులోకి తీసుకొనే ప్రయత్నాలు ప్రారంభించారు. (ఉ 29.12.87)

**అదుపు తప్పు** క్రి. *adupu tappu* 1. నియంత్రణకు లోబడకుండా పోవు to go out of control కారు టైర్ రాడ్ విరిగి పోవడంతో అదుపు తప్పి ... తల్లక్రిందులుగా పడిపోయింది. (ఈ. 22 6. 89) 2. క్రమ శిక్షణను తీవ్రంగా ఉల్లఘించి ప్రవర్తించు to become unruly అదుపు తప్పిన మూకలపై పోలీసులు కాల్పులు జరిపినప్పుడు ఒక వ్యక్తి మృతిచెందినట్లు ... తెలుస్తోంది. (ఆం.జ్యో. 2.7 87)

**అదృశ్యం** వి. *adRśyam* ఆచూకీ తెలియకుండా పోవటం disappearance ఐలయ్య, రాజమల్లుల అదృశ్యంపై ఎటువంటి వత్తిడులకు లొంగని స్వతంత్ర వ్యక్తి చేత విచారణ జరిపించాలని ... (ఆం.ప్ర 18 7 89)

**అద్దంపట్టు** క్రి. *addampaTTu* ఉన్న పరిస్థితిని ప్రతిఫలింపజేయు; ప్రతిబింబించు to reflect, mirror ఒక వ్యవస్థలో దాసీల దయనీయ స్థితిగతులకు అద్దం పట్టిన చిత్రం. (ఆం.ప్ర 21 4 89)

**అధికారం** వి. *adhıkaaram* 1. పరిపాలించే హక్కు rule ఇప్పుడు మళ్ళీ అధికారంలోకి రావాలనీ, కాంగ్రెస్(ఐ) నాయకులు ఆరాట పడుతున్నారనీ ... విజ్ఞప్తి చేశారు. (ఆం. ప్ర. 4 3 88) 2. పదవివల్ల గానీ, ఉన్నత స్థానంలోని వారి నిర్ణయానుసారం కానీ లభించే పాలనాపరమైన శక్తి power అధిష్ఠానవర్గంతో సంప్రదించి తక్కిన వారిని నియమించే అధికారం కొత్త అధ్యక్షునికి ఇవ్వనున్నట్లు చెప్పున్నారు. (ఆం. ప్ర. 26.4 89)

**అధికార తీర్మానం** వి. *adhikaara tiirmaanam* చట్ట సభలలో పాలక పార్టీ ప్రవేశ పెట్టే ప్రతిపాదన official resolution దేశంలో మతతత్వ వైరస్ వ్యాపిస్తోందని, ఇది ప్రజాస్వామ్యానికి పెద్ద ప్రమాదమన్న సభ్యుల అభిప్రాయాన్ని అంగీకరిస్తూ . . . ఒక అధికార తీర్మానాన్ని ప్రవేశ పెడతామని తెలిపారు. (ఆం. భూ 9.5.89)

**అధికార దాహం** వి. *adhikaara daaham* పాలనాపరమైన హక్కు చేజిక్కించుకొనేందుకు పడే తీవ్రమైన తపన power hunger, power thirst ... పరిస్థితి ఈ విధంగా ఉన్నా ప్రధాన రాజకీయ పక్షాలు మాత్రం అధికార దాహాన్ని వదులుకోవడంలేదు. (ఈ 3.5 87)

**అధికార దుర్వినియోగం** వి. *adhıkaara durviniyoogam* అధికారాన్ని స్వలాభానికి ఉపయోగించుకోవటం abuse of power అధికార పార్టీ అధికార దుర్వినియోగానికి పాల్పడినందున తాము ఈ సమిష్టి నిర్ణయం తీసుకోక తప్పలేదని ... అన్నారు. (ఈ 24.7 89)

**అధికార నరమేధం** వి. *adhıkaara narameedham* ప్రభుత్వం స్వయంగా తన పోలీసు యంత్రాంగం ద్వారా జరిపించే ఊచకోత official massacre అటు నక్సలైట్లు తమ అనధికార హింసనూ, ఇటు ప్రభుత్వం తన అధికార నరమేధాన్ని తక్షణం నిలిపివేసి ముఖాముఖి చర్చలకు దిగకపోతే ... ప్రమాదం ఉంది. (ఆం భూ. 12.6 89)

**అధికార నివాసం** వి. *adhikaara nivaasam* (ముఖ్యమంత్రి, మంత్రులు మొ.) పదవిలోఉన్న ప్రజాప్రతి నిధులు నివసించడానికి ప్రభుత్వ పరంగా కేటాయించిన భవనం official residence అఖిలపక్ష కమిటీ సభ్యుల ప్రథమ సమావేశం ముఖ్యమంత్రి అధికార నివాసంలో జరుగుతుంది. (ఆం.ప్ర. 28 7 89)

**అధికార పక్షం** వి. *adhikaara pakSam* పరిపాలన చేస్తున్న రాజకీయ పార్టీ; పాలక పార్టీ ruling party అటు ప్రతిపక్షం, ఇటు అధికార పక్షం అత్యంత ప్రతిష్ఠాత్మకంగా భావిస్తున్న ఈ నియోజకవర్గం ఉప ఎన్నికల కోసం ... (ఆం జ్యో 20 4 88)

**అధికార పత్రం** వి. *adhikaara patram* ప్రభుత్వ పరంగా తయారు చేసే నివేదిక official document అవసరమైన నిర్ణయాలు తీసుకోని పక్షంలో అభివృద్ధి ఒక దశాబ్దంపాటు వెనుకంజ వేసే ప్రమాదం ఉందని అధికార పత్రంలో హెచ్చరిక చేశారు. (ఆం.ప్ర. 29 6 89)

**అధికార పర్యటన** వి. *adhikaara parya Tana* ప్రభుత్వ పదవీ, హోదా తదితర లాంఛనాలతో పాలనా వ్యవహారంపై జరిపే ప్రయాణం official tour అధికార పర్యటన కాలంలో జయవర్ధనే ప్రధాని రాజీవ్‌ను అనేకమార్లు కలుసుకున్నప్పటికీ ... (ఆం జ్యో 26 1.88)

**అధికార పీఠం** వి. *adhikaara pii-Tham* పాలనాపరమైన ఉన్నత స్థానం; పదవి seat of power ఒకసారి అధికార పీఠం అధిష్టిస్తే ఎం.పి.ల నుండి అదనపు మద్దతు తెచ్చుకొని శ్రీ రాజీవ్ గాంధీ తన స్థానాన్ని నిలుపుకొంటారని తేలిగ్గా ఊహించవచ్చున్నారు. (ఆం ప్ర 20 7 89)

**అధికార భాష** వి. *adhikaara bhaaSa* ప్రజలకు ప్రభుత్వానికి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలకు గుర్తించిన భాష official language రాష్ట్రంలో తెలుగుకు అధికార భాషా పట్టం కట్టే కార్యక్రమం మరుగున పడిపోయింది. (ఈ 14 10 87)

**అధికార వర్గాలు** వి. (బ.వ.) *adhikaara vargaalu* ప్రభుత్వ శాఖలలో ఉన్నత పదవులలో ఉన్న వ్యక్తులు official sources అధికార వర్గాల ప్రకారం ఆరవ ప్రణాళికలో ఆ పథకానికి రూ 6.50కోట్లు కేటాయించారు. (ఆం ప్ర. 1 9.87)

**అధికార వాణి** వి. *adhikaara vaaNi* పాలక పార్టీ ప్రయోజనాలకు అనుగుణంగా వార్తలను, విశేషాలను అందించే ప్రసార వ్యవస్థ mouth piece of the ruling party అధికార వాణిగా మారిన టి.వి., రేడియో గత కొద్ది రోజుల నుంచి దూరదర్శన్, ఆకాశవాణి ప్రభుత్వ సమాచార వ్యవస్థ తమ పాత్రను చాల సమర్థవంతంగా నిర్వహిస్తున్నాయి. (ఆం.ప్ర. 22.7 87)

**అధికార వార్త** వి. *adhikaara vaa-rta* ప్రభుత్వం ప్రకటించే సమాచారం official news ... సింహళ పౌరులను చంపి వేసినట్లు నేడిక్కడకు అందిన అధికార వార్తలు తెలుపుతున్నాయి. (విశా 8 10 87)

**అధికార వికేంద్రీకరణ** వి. *adhi-kaara vikeendriikaraNa* పాలనా యంత్రాంగంలో కింది స్థాయి సంస్థలకు ఎక్కువ హక్కులను దఖలు పరచటం decentralisation of power ప్రజాస్వామ్యాన్ని పటిష్ఠం చేయడం కోసం, అట్టడుగుస్థాయిలో అధికార వికేంద్రీకరణ కోసం పంచాయితీ వ్యవస్థకు అధికారాలు కట్టబెట్టాలని ... అన్నారు. (ఆం భూ. 19.5.89)

**అధికార సమావేశం** వి. *adhikaara samaaveeśam* ప్రభుత్వం తరపున ఏదైనా విషయంపైన విపుల సమీక్ష కోసం ఆయా శాఖల ఉన్నతాధికారులతో ఏర్పాటు చేసిన సమావేశం official meeting ఆదివారం ఉదయం కేంద్ర హోంమంత్రి శ్రీ బూటా సింగ్ అత్యున్నతస్థాయి అధికార సమావేశాన్ని ఏర్పాటు చేసి శాంతి భద్రతల పరిస్థితిని సమీక్షించారు. (ఉ. 15.6.87)

**అధికార హోదా** వి. *adhikaara hoodaa* పాలనా యంత్రాంగంలో ప్రభుత్వం ఇచ్చిన స్థాయీ పరమైన గుర్తింపు official status ఇప్పుడు ప్రభుత్వ ఉత్తర్వులు జారీ చేయడం ద్వారా అలాంటి రక్షక దళాలకు అధికార హోదా ఇచ్చినట్లైందని హోంమంత్రి అంటూ ... (ఆం ప్ర 25 4.89)

అధిక్షేపణ పత్రం వి. *adhikSeepaNa patram* నిరసనను లేదా అభ్యంతరాన్ని తెలియజేసే అధికారిక లేఖ letter of protest దౌత్య కార్యాలయాలు, ప్రతి నిధులకు సంబంధించి వియన్నా ఒప్పందం ఖచ్చితంగా పాటించితీరాలని డిమాండ్ చేస్తూ ఫిజీ విదేశాంగ శాఖ శాశ్వత కార్యదర్శికి ఒక అధిక్షేపణ పత్రాన్ని అందజేయాలని వారు నిర్ణయించారు. (ఆం.ప్ర 6.6.87)

అధిగమించు క్రి. *adhigamincu* 1. (ఆటల పోటీలలో) ఇంతకు మునుపు నెలకొల్పి ఉన్న రికార్డుకు మించిన ఫలితం సాధించు to break (a record in sport events) 50 మీటర్ల మహిళల ఫ్రీ స్టయిల్‌లో కర్నాటక క్రీడాకారిణి లొరైన్ వర్గీస్ ... పల్లవి షెట్టి ఇదివరకు నెలకొల్పిన రికార్డు (0 . 29 . 59)ను ఈసారి అధిగమించింది. (ఆం.ప్ర. 6.6.87) 2. (లక్ష్య సాధనలో) మరింత ముందుకుపోవు to exceed పశ్చిమ ప్రాంతంలో ఏడో ప్రణాళికా లక్ష్యాలను అధిగమించగలమని కమీషన్ గట్టి విశ్వాసంతో ఉందని ప్రతినిధి చెప్పారు. (ఆం.ప్ర 16.6.87)

అధినాయక సభ వి. *adhinaayaka sabha* దేశాధి నేతలు పాల్గొనే సమావేశం summit సార్క్ అధినాయక సభకు జియా, జయవర్ధనే గైరుహాజరు. (ఆం.ప.15.10.87)

అధినాయక సమావేశం వి. *adhi-naayaka samaaveeśam* చూ. అధినాయక సభ; ఈ అధినాయక సమావేశం ఫలితాల కోసం యావత్ ప్రపంచం ఎంతో ఆతృతతో ఎదురు చూస్తూంది. (ఈ.15.5.89)

అధినాయకుడు వి. *adhinaayakuDu* ఒక వ్యవస్థలో అందరికన్నా ఉన్నతమైన స్థానంలో ఉన్న వ్యక్తి supreme leader, supremo జనాకర్షణ పథకాల ద్వారా అధినాయకుడే ప్రజలకు ఆరాధ్య దైవమంటూ వివిధ స్థాయిల్లో పనిచేసే నాయకుల్ని నిష్ప్రయోజకులుగా ... (ఆం.ప్ర 21.4.89)

అధినివేశ ప్రతిపత్తి వి. *adhiniveeśa pratipatti* పరిమిత స్వాతంత్ర్యంతో కూడిన రాజకీయ పాలనా స్థితి dominion status ఆయన భారత మంత్రిగా పనిచేస్తున్న రోజుల్లో భారతదేశానికి అధినివేశ ప్రతిపత్తి ఇవ్వాలని వాదించి అందుకు తొలి చర్యగా దేశంలో ద్వంద్వ ప్రభుత్వ విధానం ప్రవేశపెట్టాడు. (ఆం.ప్ర. అను 9.8.87)

అధినేత వి. *adhineeta* దేశాన్ని పాలించే నాయకుడు head of a state సోవియట్ అధినేత మిహాయిల్ గోర్బచేవ్ నాలుగు రోజుల చైనా పర్యటన నేటితో ముగిసింది. (ఆం.ప్ర 19.5.89)

అధిరోహించు క్రి. *adhiroohincu* ఉన్నత శిఖరాలపైకి ఎక్కు to climb (as a mountain peak) సరిహద్దు భద్రతా దళంకు చెందిన ఐదుగురు సభ్యుల సాహస బృందం హిమాలయంలో కేమెట్ పర్వత శిఖరాన్ని నిన్న అధిరోహించారని తెలిసింది. (ఆం.ప్ర 5.6.87)

అధిష్ఠాన వర్గం వి. *adhiSThaana vargam* (రాజకీయ పార్టీలలో) ఉన్నత స్థాయి నాయకత్వం high command మత రాజకీయాలను ఎలాగయినా సర్దుబాటు చేసుకొని ఎన్నికలలో విజయం సాధించడం కోసం కాంగ్రెస్(ఐ) అధిష్ఠాన వర్గం సామ దాన భేదదండోపాయాలను ప్రయోగించను న్నట్లు తెలుస్తూంది. (ఆం.భూ. 17.8.89)

**అధిష్ఠించు** క్రి. *adhiSThincu* ఉన్నత పదవిని చేపట్టు to assume (a high position) ఒకసారి అధికార పీఠం అధిష్ఠిస్తే ఎం.పి.ల నుండి అదనపు మద్దతు తెచ్చుకొని ... (ఆంప్ర 20.7.89)

**అధీనం** వి. *adhiinam* అధికార పూర్వకమైన నియంత్రణ లేదా ఏలుబడి control గ్లేషియర్ ప్రాంతాలు ఎక్కువగా భారత్ అధీనంలో ఉండటంవల్ల భారత్‌కు కొన్ని లాభాలున్నాయని ... ఆయన చెప్పారు. (ఆంప్ర 10.5.87)

**అధోగతి** వి. *adhoogati* పతనావస్థ debacle పార్టీని అధోగతినుంచి రక్షించగల నాయకుడిని ఎన్నుకొని ... (ఆం ప్ర 25.4.89)

**అధ్యక్షత** వి. *adhyakSata* సభల, బృందాల కార్యక్రమాలను నిర్వహించే బాధ్యత the position and role of a chairman of meeting, heading (a committee etc.) ప్రధాన న్యాయమూర్తి శ్రీ కె. భాస్కరన్ అధ్యక్షతన ఏర్పడిన ప్రత్యేక ధర్మాసనం ముందు డిశంబర్ 31 వరకు వాదోపవాదాలు కొనసాగాయి. (ఆం ప్ర 4.1.88)

**అధ్యక్షోపన్యాసం** వి. *adhyakSoopanyaasam* సభను నిర్వహించే ముఖ్యమైన వ్యక్తి ప్రసంగం presidential address "పరిశ్రమల ఎగుమతుల అభివృద్ధి" అన్న అంశంపై సోమవారం నాడిక్కడ ప్రారంభమైన 'ఇండో-గల్ఫ్' సదస్సులో ఆయన అధ్యక్షోపన్యాసం ఇచ్చారు. (ఈ 11.7.89)

**అధ్యయన బృందం** వి. *adhyayana bRndam* నిజానిజాలను, స్థితిగతులను నిశితంగా పరిశీలించే సంఘం study committee జిల్లాలో కరువు తీవ్రతతో పోలిస్తే ప్రభుత్వ సహాయ కార్యక్రమాలు నామ మాత్రంగా ఉన్నాయని అధ్యయన బృందం విమర్శించింది. (ఆంప్ర 13.6.89)

**అధ్వాన్నం** వి. *adhvaannam* బాగా దెబ్బతిని పనికిరాని స్థితి bad condition శత వార్షికోత్సవాలు జరుపుకుంటున్న నిజాం కళాశాలకు అనుబంధంగా ఉన్న ఒకే ఒక హాస్టల్ అధ్వాన్నంగా ఉంది. (ఈ. 15.9.87)

**అన్ ఎయిడెడ్ విద్యాసంస్థ** వి. *an eyiD-eD vidyaasamstha* ప్రభుత్వం నుంచి ఎటువంటి ఆర్థిక సహాయం లేకుండా ప్రైవేట్ యాజమాన్యం నడిపే విద్యాసంస్థ un-aided educational institution రాష్ట్రంలో ప్రభుత్వ సహాయంలేని పాఠశాలలు, కాలేజీలకు ప్రభుత్వ సహాయాన్ని అందజేయాలని కోరుతూ ఆందోళన జరపాలని రాష్ట్ర అన్ ఎయిడెడ్ విద్యా సంస్థల పోరాట కమిటీ నిర్ణయించింది. (ఆంభూ 10.10.89)

**అనధికార తీర్మానం** వి. *anadhikaara tiirmaanam* మంత్రి వర్గం ప్రమేయం లేకుండా సభలో చర్చకు పెట్టిన తీర్మానం unofficial resolution పార్లమెంట్ ఉభయసభలకు సభ్యుల అనధికార తీర్మానాల చర్చ సందర్భంలో అధిక సంఖ్యాక ప్రతిపక్ష సభ్యులు హాజరు కాలేదు. (ఆంభూ 22.7.89)

**అనధికార పోటీ** వి. *anadhikaara pooTii* సీరీస్‌లో భాగంగా పరిగణించని పోటీ unofficial match ఇప్పుడు క్రికెటర్లు డబ్బు మీద ఆశతో ఈ ఎగ్జిబిషన్ మ్యాచ్‌లు ఆడారంటున్న క్రికెట్ బోర్డు గతంలో వెస్టిండీస్, భారత్‌ల మధ్య జరిగిన ఓ అనధికార పోటీని వన్ డే ఇంటర్నేషనల్‌గా ప్రచారం చేసింది. (ఈ 18.8.89)

అనధికారికం వి. *anadhikaarikam* అధికారికంగా నిర్ణయించనిది unofficial బోర్డు అనుమతి తీసుకోకుండా అమెరికా, కెనడాల్లో అనధికారికంగా మ్యాచ్‌లు ఆడారనే గదా ఆటగాళ్లకు శిక్ష విధించారు. (ఈ. 18 8.89)

అనధికారిక మ్యాచ్ వి. *anadhikaarika myaac* చూ. అనధికార పోటీ ఏం చేశాడని అంత మొత్తం ముట్టింది, షార్జాలో అనధికారిక మ్యాచ్ ఏర్పాటు చేసినందుకా అనే ప్రశ్నలు ఇంకా అంతు బట్టకుండా ఉన్నాయి. (ఈ 18 8 89)

అనియత విద్య వి. *aniyata vidya* పాఠశాల వెలుపల పిల్లలకు విద్యాబోధన చేసే పథకం (ఏడు నుంచి పద్నాలుగు సంవత్సరాల మధ్య) non-formal education అనియత విద్యా కేంద్రాలు స్థాపించి రెండు సంవత్సరాలు కావస్తున్నా విద్యా బోధకులకు జీతాలు మాత్రం పెంచ లేదని ... ఆవేదన వ్యక్తం చేశారు. (ఆం.భూ 28 7.87)

అనివార్యం వి. *anivaaryam* తప్పనిసరిగా చేయవలసినది binding, inevitable సభా నిబంధనలకు అనుగుణంగానే తామంతా రాజీనామా చేశామని, తమ రాజీనామాలను స్పీకర్ ఆమోదించడం అనివార్యమని దండావతే వివరించారు. (ఆం.ప్ర 25.7 89)

అనివార్య కారణాలు వి. (బ.వ.) *anivaarya kaaraNaalu* ఒక పని చెయ్యడానికి ఊహించని విధంగా అడ్డు పడిన పరిస్థితులు unavoidable circumstances డా. సి. నారాయణరెడ్డిని జానపద శైలిలో కొన్ని గేయాలను రాయవల్సిందిగా కోరారని, అయితే అనివార్య కారణాలవల్ల ఆయన రాయలేక పోయారని తెలిసింది. (ఆం.ప్ర 16 6 87)

అనిశ్చిత పరిస్థితి వి. *aniścita pari sthiti* ఎటూతేలకుండా ఉన్నస్థితి uncertainty కేంద్ర పరిశ్రమల శాఖ మంత్రి ... పి.సి.సి.(ఐ) అధ్యక్ష పదవికి రాజీనామా చేయడంతో రాష్ట్ర పార్టీలో నెల కొన్న అనిశ్చిత పరిస్థితి తొలగి పోయిందనే భావం ఏర్పడిందని ఆయన ... అభిప్రాయ పడ్డారు. (ఆం.ప్ర 6.10.88)

అనుచితం వి. *anucitam* చేయతగనిది unwarranted రాష్ట్ర జాబితాలోని అంశంపై కేంద్రం తన అనుచిత జోక్యానికి వీలుగా రాజ్యాంగ సవరణకు తెగించిందని పలు రాష్ట్ర ప్రభుత్వాలు భావించడం సహేతుకం. (ఈ. 3 5.89)

అనుబంధం వి. *anubandham* స్నేహపూర్వకమైన సంబంధం; దగ్గరితనం intimacy, closeness భౌగోళికంగా, చారిత్రకంగా శ్రీలంకతో భారత దేశానికి వున్న అనుబంధాన్ని ఎవరూ కాదనరు. (ఈ 5.6 87)

అనుబంధ పద్దు వి. *anubandha paddu* బడ్జెట్ కేటాయింపుకు మించి జరిగిన వ్యయానికి సంబంధించిన పద్దు supplementary demand *1780* కోట్ల *49* లక్షల రూపాయల ఖర్చుతో కూడిన అనుబంధ పద్దులను కేంద్ర ప్రభుత్వం సోమవారంనాడు లోక్‌సభలో ప్రవేశపెట్టింది. (ఆం.జ్యో. 1.12 87)

**అనుబంధ ప్రశ్న** వి. *anubandha praśna* చ సభల్లో ప్రశ్నోత్తరాల సమయంలో ప్రధానప్రశ్నకు వచ్చిన జవాబుకు వివరణ కోరుతూ అడిగే ప్రశ్న supplementary question *వాయుదూత్ విమానాల కొనుగోలుకు సంబంధించి సురేష్ కల్మాడి అడిగిన ప్రశ్న తర్వాత సభ్యులు అనుబంధ ప్రశ్న లడిగారు.* (ఆం.ప్ర 20 7 89)

**అనుబంధితం** వి. *anubandhitam* ఏదో ఒక సంస్థకుగాని, పార్టీకిగాని సంబంధించి ఉండటం affiliated *కర్షకుల పేరిట నెలకొల్పిన సంస్థలు దేశంలో అనేకం ఉన్నా వాటిలో అత్యధిక భాగం ఏదో ఒక రాజకీయ పార్టీకి అనుబంధితమైనవే.* (ఈ 18 7 89)

**అనుమానం** వి. *anumaanam* ఏదైనా విషయానికి సంబంధించిన సందేహం apprehension, doubt *జాతి భద్రత దృష్ట్యా, తనకున్న అనుమానాలపై స్పష్టమైన వివరణ ఇవ్వాలని ముఖ్యమంత్రి ప్రధాన మంత్రిని కోరారు.* (ఆం.ప్ర 20 7.89)

**అనుమానపడు** క్రి. *anumaanapaDu* ఏదైనా విషయానికి సంబంధించిన నిజానిజాలపై సందేహాలు కలుగు; సందేహపడు to suspect, have doubt *ఈ విచారణ సంఘంలోని సభ్యులు ముగ్గురూ ఈ రాష్ట్రానికి చెందినవారు కానందున అనుమానపడవలసిన అవసరం లేదని ఆయన అన్నారు.* (ఆం.ప 28 11 87)

**అనుమానాస్పద పరిస్థితి** వి. *anumaanaaspada paristhiti* సందేహాన్ని కలిగించే పరిస్థితి లేదా ధోరణి suspicious condition *ఒక స్త్రీ అనుమానాస్పద పరిస్థితులలో చనిపోయిందని తెలియగానే ఆ స్థలానికి ఫోరెన్సిక్ నిపుణుల బృందాన్ని రప్పించాలని ...* (ఆం.ప్ర. 23 6 87)

**అనుయాయుడు** వి. *anuyaayuDu* ఒక వ్యక్తిని ఆదర్శంగా తీసుకొని అనుసరించే వాడు follower *హరికేష్ బహదూర్, చంద్రశేఖర్ అనుయాయుడనే సంగతి పాఠకులకు తెలుసు.* (ఈ 25 5 89)

**అనుసంధాన భాష** వి. *anusandhaana bhaaSa* (ఒక దేశంలో) భిన్నభాషలు మాట్లాడే ప్రజలు తమ మధ్య వ్యవహారం కోసం ఉపయోగించే ఉమ్మడి భాష link language *రాష్ట్రాలు స్వచ్ఛందంగా హిందీని అనుసంధాన భాషగా, రాజ భాషగా అంగీకరించేలా ప్రయత్నిస్తామని, బలవంతం చేయబోమని ఆయన అన్నారు.* (ఈ 8 7.87)

**అనుసంధించు** క్రి. *anusandhincu* పెద్ద యంత్రాంగంలో భాగంగా చేర్చు to attach, embed *ప్రభుత్వం గతంలో మాదిరిగా ఉన్నత విద్యనంతటినీ విశ్వవిద్యాలయాలకు అనుసంధిస్తే మంచిది.* (ఈ. 2 10 87)

**అనుసరించు** క్రి. *anusarincu* 1. ఒక పద్ధతిని పాటించు to adopt (a policy) *సర్దార్ పటేల్ ఢిల్లీలో అనుసరించిన వైఖరినే డా. రాజేంద్ర ప్రసాద్ బీహార్‌లో అనుసరించారని ...* (ఆంజ్యో 7 11.88) 2. ఒకరి వెనుక వెళ్ళు to follow *రెండు లారీలలో పోలీసుబలగం కూడా వారిని అనుసరించింది.* (ఈ 30 12 87)

**అనుసూచిత జాతి** వి. *anusuucita jaati* వెనుకబడిన వర్గంగా భారత రాజ్యాంగంలో గుర్తింపు పొందిన ఆటవిక తెగ scheduled tribe *అఖిల భారత అనుసూచిత జాతి పరిషత్ తరపున అనేక కార్యక్రమాలు చేపడుతున్నట్లు ... తెలిపారు.* (ఈ 7 6 89)

**అనుసూచిత ప్రాంతం** వి. *anusu-ucita praantam* ప్రభుత్వం గిరిజన ప్రాంతంగా గుర్తించి, గిరిజన చట్టాలను అమలు చేస్తూ ఉండే ప్రదేశం habitat of the tribal people as recognized by the government, scheduled area, agency area అనుసూచిత ప్రాంత గ్రామాలలోకి కొత్తగా గిరిజనేతరులు ప్రవేశించి భూములు కొనకుండా చూడటంతో పాటు ... (ఆం.భూ. 7.10 87)

**అనూచానం** వి. *anuucaanam* పరంపరగా కొనసాగుతున్నది continued by tradition పబ్లిక్ అకౌంట్స్ కమిటీ ఛైర్మన్ పదవి అనూచానంగా వస్తున్న పార్లమెంటరీ సంప్రదాయాల ప్రకారం తమవంతుకు రావాలని జనతా దళ్ పట్టుబడుతున్నది. (ఆం.భూ. 12.5 89)

**అనూహ్యరీతి** వి. *anuuhyariiti* ఊహించని విధం unexpected way మత తత్త్వ పరిస్థితిపై సోమవారంనాడు ఏర్పాటయిన వివిధ రాజకీయ పక్షాల నాయకుల సమావేశంలో అనూహ్యరీతిలో వాగ్యుద్ధం చెలరేగింది. (ఈ. 16 5 89)

**అన్నలు** వి. (బ.వ.) *annalu* చూ అడవి అన్నలు; సర్పంచ్‌లపై వత్తిడి తెచ్చి ఈ రోజ్‌గార్ నిధులు తాము చెప్పిన విధంగా ఖర్చు పెట్టించి సర్పంచ్ కన్నా 'అన్న' లదే పై చేయి అన్న భావనను గిరిజనుల్లో కలిగించి ... (ఆం.ప్ర 5 7 89)

**అన్యాపదేశం** వి. *anyaapadeeśam* ఒకరి పేరును నేరుగా ప్రస్తావించకుండా పరోక్షంగా సూచించటం indirect reference పాకిస్తాన్ పేరును ప్రస్తావించకుండా అన్యాపదేశంగా ఈ హెచ్చరిక చేస్తూ ఆప్షన్ పోరాటానికి సంబంధించిన వారు అందరూ ప్రాంతీయ అస్థిరత కలిగించే పనులకు స్వస్తి చెప్పాలని కోరింది. (ఆం.భూ. 22.4 89)

**అన్యాక్రాంతం** వి. *anyaakraantam* చట్ట సమ్మతి లేకుండా, ఇతరులు ఆక్రమించుకున్నది; కబ్జా illegal occupation ఎండోమెంట్స్‌కు ఆదాయం రాకుండా అన్యాక్రాంతంగా ఉన్న భూములను అవసరమైతే అమ్ముతామని, లేకుంటే కౌలుకు ఇస్తామని ఆయన తెలిపారు. (ఈ. 20.9 89)

**అన్వేషించు** క్రి. *anveeSıncu* పరిశీలించు· వెదకు to search, contemplate ఈ పరిస్థితి పట్ల ప్రభుత్వం ఆందోళన చెందుతోంది. దీని నుండి బయట పడేందుకు మార్గాలను అన్వేషిస్తోంది. (విశా 12.10.87)

**అప్‌గ్రేడ్‌చేయు** క్రి. *apgreeDceeyu* ఉన్నత స్థాయిని కల్పించు to upgrade ధర్మవరంలోని పట్టు మార్పిడి కేంద్రాన్ని అప్‌గ్రేడ్ చేయడం జరుగుతుందని మంత్రి వెల్లడించారు. (విశా 20 6.87)

**అపప్రథ** వి. *apapratha* అక్రమం చేశారన్న చెడ్డ పేరు; అపనింద bad name, allegation అధికార దుర్వినియోగం చేశారన్న అపప్రథకు ... గురయ్యారు. (ఈ 28.12 89)

**అపరాధ రుసుం** వి. *aparaadha rusum* ఫీజులను సకాలంలో చెల్లించకపోతే, ఆ తర్వాత రోజులలో చెల్లించేందుకు అధికంగా కట్టవలసిన సొమ్ము fine (along with the fees in educational institutions) టెన్త్ పరీక్ష ఫీజుకు ఒకటి వరకు గడువు ... అయితే ఈ ఫీజులతో మూడు రూపాయల అపరాధ రుసుమును కూడా చెల్లించాలి. (ఈ 30 1 88)

**అపరాధ వడ్డీ** వి. *aparaadha vaDDii* అప్పుగా తీసుకొన్న మొత్తాలను సకాలంలో చెల్లించనందుకు గాను దానిపై అధికంగా వసూలుచేసే డబ్బు penal interest వర్తమాన సంవత్సరంలో రైతులు తిరిగి చెల్లించ వలసిన మొత్తాలపై అపరాధ వడ్డీ వసూలు చేయవద్దని రిజర్వు బ్యాంకు అన్ని బ్యాంకులను ఆదేశించింది. (ఆం.ప. 20 9.87)

**అపరిష్కృతం** వి. *apariSkRtam* (కేసులు, సమస్యలు మొ.) పరిష్కారం కానిది unsolved, pending దీర్ఘ కాలంగా అపరిష్కృతంగా ఉన్న తమ సమస్యలను పరిష్కరించాలని కోరుతూ ... టీచర్లు ధర్నా జరిపారు. (ఈ 15 10 88)

**అపసవ్య పాలన** వి. *apasavya paalana* అవకతవకలతో కూడిన పరిపాలన misrule జనతా పార్టీ ఆ తర్వాత జనతాదళ్ పేరుతో కర్నాటకలో సాగిన అపసవ్య పాలన తీరును కాంగ్రెస్(ఐ) నాయకుడు ... విమర్శించారు. (ఆంప్ర. 26 4 89)

**అపస్మారక స్థితి** వి. *apasmaaraka sthiti* స్పృహలేకుండా పడి ఉండటం unconscious state దాదాపు 75 మందిని అపస్మారక స్థితిలో స్ట్రెచర్ల మీద ఆస్పత్రులకు తరలించారు. (ఆంభూ 30.6 87)

**అపహరించుకు పోవు** క్రి. *apaharincukupoovu* (వ్యక్తుల్ని) దౌర్జన్యంగా ఎత్తుకొనిపోవు; కిడ్నాప్ చేయు to kidnap ఈ లోగా అమ్మాయి తండ్రి ... తన కూతురును యాదవ్ అపహరించుకుపోయాడని ఫిర్యాదు చేశాడు. (ఆంప్ర 17.12 87)

**అపాయింట్ మెంట్** వి. *apaayinT-menT* ప్రముఖులను కలుసుకోవటానికి ముందుగా సమయాన్ని నిర్ధారణ చేసుకోవటం appointment (to meet higher official) రాజీవ్ గాంధీని కలుసు కోవాలంటే నేను ముందుగా అపాయింట్ మెంట్ తీసుకోవాలి .. అని ఆయన అన్నారు (ప్ర శ. 1.7.87)

**అపోహ** వి. *apooha* వాస్తవాలతో నిమిత్తంలేని భయం లేదా అనుమానం misgiving పార్లమెంటు సభ్యులలోని అసంతృప్తి వాదుల అపోహలను తొలగించేందుకు ఏమి చేయాలనే విషయాన్ని కూడా పార్టీ యోచిస్తోంది. (ఆం.భూ 26 5.89)

**అప్పగించు** క్రి. *appagincu* తమ స్వాధీనంలో ఉన్న వస్తువులను లేదా వ్యక్తులను ఇతరులకు స్వాధీనం చేయు to hand over, surrender sth to sb ప్రజలకే కళాశాలలను నెలకొల్పే అవకాశాన్ని కల్పించి, నిర్వహణ బాధ్యతలను అప్పగించడం జరుగుతుందని ముఖ్యమంత్రి తెల్పారు. (ఆం.ప్ర. 2 11 87)

**అప్పజెప్పు** క్రి. *appajeppu* ఒక కార్యక్రమాన్ని నిర్వహించే బాధ్యత, అధికారం ఇచ్చి వేయు to hand over నీతి నిజాయితీ లేని వారికి రాష్ట్రంలో అధికారం అప్పజెప్పవద్దని ... కోరారు. (ఆంభూ 28 8 89)

**అప్పీలు** వి. *appiilu* ఒక కోర్టు తీర్పును సవాలు చేస్తూ పెట్టుకొనే లిఖితపూర్వక అభ్యర్థన appeal ఒక వేళ వీరి అప్పీలు కొట్టి వేసిన పక్షంలో కార్యకర్తలు శిక్ష పూర్తి కావడానికి ఇంకా మిగిలి పోయిన రోజులు ... (ఆం.ప్ర 26.4.89)

**అప్పులపాలగు** క్రి. *appulapaalagu* తాహతుకు మించి అప్పులు చేసి తిరిగి చెల్లించలేక పోవు to end up in debts ఒలంపిక్స్ వల్ల మాంట్రియల్ అప్పులపాలైతే ఇదే ఒలంపిక్స్ వల్ల లాస్ ఏంజిల్స్‌కి దాదాపు రెండు కోట్ల డాలర్ల ఆదాయం లభించింది. (ఆం.భూ 30 11 87)

**అప్రకటిత యుద్ధం** వి. *aprakaTita yuddham* అధికారికంగా ప్రకటించనప్పటికీ జరిగే సాయుధ సంఘర్షణ

undeclared war నక్సలైట్లకు ప్రభుత్వానికి మధ్య జరుగుతున్న అప్రకటిత యుద్ధంలో ... 12 నిండుప్రాణాలు బలైనాయి. (ఆం.ప్ర. 2.9 89)

అప్రచురితం వి. *aprecuritam* (రాత ప్రతి రూపంలోనే ఉండి) ఇంకా అచ్చుకానిది unpublished *గత 30 సంవత్సరాలుగా అప్రచురితంగా ఉన్న ఈ 30 పేజీలతో సహా పూర్తి గ్రంథాన్ని ఓరియంట్ లాంగ్‌మన్ సోమవారం నాడు అన్ని ప్రధాన నగరాలలో విడుదల చేస్తున్నారు.* (ఆం.జ్యో 7.11 88)

అప్రజాస్వామికం వి. *aprajaasvaamikam* ప్రజాస్వామ్య పద్ధతులకు వ్యతిరేకమైనది undemocratic ... *కేంద్ర ప్రభుత్వం నియమించిన గవర్నర్‌కు పంచాయితీ రాజ్ వ్యవస్థ అధికారాలు అప్పగించడం అప్రజాస్వామికమే కాకుండా ఫెడరల్ సిద్ధాంతానికి భిన్నంగా ఉన్నదని అన్నారు.* (ఆం.ప్ర. 11.5 89)

అప్రదిష్టపాలగు క్రి *apradiSTapaalagu* ఉన్న మంచిపేరు, పరపతి కోల్పోవు to be discredited, become unpopular *రాజీవ్ గాంధీ ప్రభుత్వం అప్రదిష్ట పాలైందని ... వైద్యా అన్నారు.* (విశా 8.6 87)

అప్రమత్తంచేయు క్రి. *apramattamceeyu* (రక్షక దళ యంత్రాంగాలను) విపత్కర పరిస్థితుల నెదుర్కొనేందుకు సంసిద్ధంగా ఉంచు to alert sb *పోలీసులు ఈ సారి కూడా నగర పోలీసు శాఖను, రంగా రెడ్డి జిల్లా పోలీసు యంత్రాంగాన్ని అప్రమత్తం చేశారు.* (ఆం.ప్ర. 4 12.87)

అప్రమత్తత వి. *apramattata* జాగ్రత్తగా ఉండటం to be alert *పట్టణంలో దోపిడీ దొంగలు విడిది చేసి ఉన్నారని, ప్రజలు అప్రమత్తతతో మెలగాలని పోలీసులు చేస్తున్న హెచ్చరికల పట్ల ప్రజలు భయాందోళనలు వ్యక్తం చేస్తున్నారు.* (ఆం.భూ 16.5.89)

అప్రోప్రియేషన్ బిల్లు వి. *approopriyeeSan billu* వివిధ శాఖల పద్దులు ఖరారైన తర్వాత డబ్బును వినియోగించేందుకు ప్రభుత్వానికి అనుమతి కోసం చట్టసభలలో ప్రవేశపట్టే బిల్లు; ద్రవ్య వినియోగ బిల్లు appropriation bill *సభ మూజువాణి ఓటుతో అప్రోప్రియేషన్ బిల్లును ఆమోదించింది.* (ఈ. 27 4.89)

అప్లయ్‌చేయు క్రి. *aplayceeyu* (ఉద్యోగాలకు, విద్యా సంస్థలకు, రాజకీయ పార్టీలకు) దరఖాస్తు పెట్టుకొను to apply (for jobs, as in educational institutions, political parties) *1983 ఎన్నికల్లో అటు తెలుగు దేశం ఇటు కాంగ్రెస్ పార్టీల టికెట్‌కు అప్లయ్‌చేసి భంగపడిన ...* (ఆం.భూ. 21 11.87)

అఫిడవిట్ వి. *afiDaviT* దాఖలు చేసిన కేసుకు సంబంధించి రాత పూర్వకంగా న్యాయస్థానానికి సమర్పించే వివరాల పత్రం affidavit *32 మంది యువజన కాంగ్రెస్(ఐ) కార్యకర్తలను తిరిగి అరెస్టు చేయాల్సిందిగా స్పీకరు శ్రీ జి. నారాయణ రావు ఇచ్చిన ఉత్తర్వులను, దానికి సంబంధించిన పరిణామాలను శ్రీ సుధాకర రెడ్డి తమ అఫిడవిట్‌లో వివరించారు.* (ఆం.ప్ర. 28.9 89)

**అభయ హస్తం** వి. *abhaya hastam* భద్రతకు సంబంధించి ఇచ్చే హామీ assurance గవాస్కర్ లాంటివాడు అభయ హస్తం ఇచ్చాక ఇక తాము వెను కాడవలసిన పనిలేదని అనుకున్నట్టు కపిల్, వెంగ్ సర్కార్ వాదన. (ఆం భూ. 19 8.89)

**అభయారణ్యం** వి. *abhayaaraNyam* కొన్ని రకాల పక్షులు, జంతువులు నశించి పోకుండా కాపాడి వాటి సంతతిని అభి ద్ధి చేయడానికి ఎంపిక చేసిన అటవీ ( ంతం sanctuary (forest) ఏది `మైనా అభయారణ్యం అభివృద్ధికి కేంద్ర ప్రభుత్వం అన్ని విధాల సహాయం అందించ గలమని ... (ఆం భూ. 14 8.87)

**అభాండం** వి. *abhaanDam* ఉన్నవీ లేనివీ కల్పించి చేసే నేరారోపణ false allegation, canard రాష్ట్ర ప్రయో జనాలే ముఖ్యమని, ఎలాంటి అభాండాన్ని నెత్తిన వేసినా ముఖ్యమంత్రి తొణక కూడ దని ఆయన తరచూ అనేవారు. (ఆం భూ 3 5 89)

**అభాసుపాలగు** క్రి. *abhaasupaalagu* అప్ర తిష్ఠ పాలగు to be discredited, to become a fiasco అంతులే అభాసు పాలైనా శరత్ పవార్‌ను మహారాష్ట్ర ముఖ్యమంత్రిగా పదవీచ్యుతుణ్ణి చేయడానికి కేంద్రం అనుమతిస్తూనే ఉంది. (ఆం.భూ. 23 4 89)

**అభాసుపాలుచేయు** క్రి. *abhaasupaaluceeyu* పరువు ప్రతిష్ఠలను దిగ జార్చు; హేళనకు గురి చేయు to discredit or humiliate ముఖ్య మంత్రిపై ఎన్నో అవినీతి ఆరోపణలు ఉన్న ప్పటికీ ఎలాంటి ఆరోపణలు లేని ప్రధానిపై ప్రతిపక్షాలు అబద్ధపు ఆరోపణలు చేస్తూ అభా సుపాలుచేయడానికి ప్రయత్నిస్తున్నారని ... (ఆం.భూ 21 8 89)

**అభిజ్ఞ వర్గాలు** వి. (బ.వ.) *abhijna vargaalu* ఇచ్చిన సమాచారం సరయి నదేనని అనుకోదగ్గ విశ్వసనీయ వర్గాలు reliable sources ... ముఖ్యంగా కాంగ్రెసేతర పార్టీలు అధికారంలో ఉన్న రాష్ట్రాల్లోని గూఢచారి శాఖకు చెందిన ఉన్న తాధికారులను కేంద్రం పంపిందని అభిజ్ఞ వర్గాల ద్వారా తెలిసింది. (ఆం.ప్ర 26 4.89)

**అభినయించు** క్రి. *abhinayincu* లేని దాన్ని ఉన్నట్లుగా నటించు to act, pretend విపరిణామాలన్నిటికీ కొలంబోదే బాధ్యత అయినట్టు జయవర్ధనే బారి నుంచి శ్రీలంక తమిళులను రక్షించేది తామే అయి నట్టు న్యూఢిల్లీ అభినయించటంలో ఔచిత్యం లేదు. (ఈ 5 6 87)

**అభినివేశం** వి. *abhiniveeśam* గౌర వభావంతో కూడిన ఆసక్తి interest, commitment ... మెజారిటీ శాసన సభ్యుల బలం ఉన్న నాయకుల్ని కాదని తనకు నచ్చిన వాళ్ళనే ముఖ్యమంత్రులుగా కుర్చీల్లో ఉంచే ప్రధానికి ప్రజాస్వామ్య మంటే ఏ మాత్రం అభినివేశం పొంగిపొర్లుతుందో మేం చెప్పనక్కర్లేదు. (ఈ 3 5 89)

**అభిప్రాయపడు** క్రి *abhipraayapaDu* నిజమని నమ్ము లేదా భావించు to believe, opine ముఖ్యమంత్రిపై ఏడు సందర్భాల్లో అవినీతికి పాల్పడినట్లు ప్రాథమిక సాక్ష్యాధారాలు ఉన్నాయని కోర్టు అభిప్రాయ పడ్డదని భగత్ గుర్తు చేశారు. (ఈ 29.7 89)

**అభిప్రాయ సేకరణ** వి. *abhipraaya seekaraNa* ఇతరుల మనోభావాలను లేదా ఉద్దేశాలను తెలుసుకునేందుకు ఒక పద్ధతి ప్రకారం జరిపే సర్వే opinion survey *దేశమంతటా శ్రీ ప్రజాయ్‌రాయ్ అనే సాంఘిక శాస్త్రవేత్త నవంబరు 12,16 తేదీల మధ్య ఎంపికచేసిన 37 నియోజక వర్గాలలో ఈ అభిప్రాయ సేకరణ జరిపారు.* (ఆం.ప్ర 20 11 89)

**అభిమతం** వి. *abhimatam* ఒక విషయం పట్ల ఉండే ఇష్టం; ఉద్దేశం interest, wish *సాధారణంగా అధికారంలో ఉన్న పార్టీ అభిమతానికి లోబడే జిల్లా అధికారులు నడుచుకుంటూ ఉంటారు.* (ఆం భూ. 6.6 87)

**అభియోగం** వి. *abhiyoogam* నేరం చేశారన్న ఆరోపణ charge *మరింత కట్నం తేలేదని ఒక గృహిణిని వేధించి ఆమె ఆత్మహత్య చేసుకోడానికి పురికొల్పారన్న అభియోగంపై ఆమె భర్తతో సహా నలుగురిని అరెస్టు చేసి జ్యుడిషియల్ రిమాండుకు పంపారు.* (ఆం.భూ. 9 8 89)

**అభియోగ పత్రం** వి. *abhiyooga patram* నిందితులపై ఉన్న ఆరోపణలను వివరిస్తూ కోర్టులో దాఖలు చేసే పత్రం; నేరారోపణ పత్రం charge sheet *అరెస్టు చేయక పోయినా తనపై అభియోగ పత్రాన్ని దాఖలు చేయనున్నారని తెలియడంతో ఆయన ఈ నిర్ణయానికి వచ్చారు.* (ఆం.ప్ర. 18.5 89)

**అభిలషణీయం** వి.*abhilaSaNiiyam* కోరుకోతగినది desirable *విద్యార్థులు సొంత కాళ్ళపై నిలబడేందుకు ఉపకరించే చదువులు అభిలషణీయమైనవని రామారావు అన్నారు.* (ఈ. 6.9.89)

**అభిలషించు** క్రి. *abhilaSincu* ఒక పని తాము కోరుకున్న రీతిలో జరగాలని అనుకొను; కోరుకొను to describe *స్వదేశీ పరిజ్ఞానంతో రూపొందించుకుని 'అగ్ని' క్షిపణిని సొంతంగా ప్రయోగించినందుకు ఇండియాను ప్రపంచదేశాలన్నీ కొనియాడుతుంటే ఫ్రంట్ నాయకులు కొందరు క్షిపణులను ఇండియా తయారుచేయకూడదని అభిలషిస్తున్నారని ప్రధాని అన్నారు.* (ఆం భూ 22.6 89)

**అభివర్ణించు** క్రి. *abhivarNincu* ఏదైనా విషయంపై తమ అభిప్రాయాన్ని రూపుకట్టినట్లుగా చెప్పు; వివరించు to describe *ప్రపంచమానవాళిలో ఏడో వంతు విశాల ప్రజానీకం చరిత్రను నిర్మించే వ్యవస్థగా భారత పార్లమెంట్‌ను ఒకప్పుడు శ్రీ జవహర్ లాల్ నెహ్రూ అభివర్ణించారు.* (ఈ. 25 5.89)

**అభివృద్ధి** వి. *abhivRddhi* వసతులు మెరుగు పరచటం development *తన లేఖలో ఎక్కడా అభివృద్ధి పనులను నిలుపు చేయాలని కోరలేదని వివరించారు.* (ఈ అను 28 7 89)

**అభిశంసన** వి. *abhiśamsana* తీవ్రమైన విమర్శ censure *అదే మోతాదులో ఈ తీర్పు పార్టీనేతగా, ప్రభుత్వ నాయకునిగా రెండేండ్ల పై కాలంలో శ్రీ రాజీవ్ గాంధీ వ్యవహారసరళిపట్ల నిర్ద్వంద్వమైన అభిశంసనగా కూడా పరిగణించవలసి ఉంటుంది.* (విశా 20.6 87)

**అభిశంసన తీర్మానం** వి. *abhiśamsana tiirmaanam* చట్ట సభలలో తీవ్రమైన విమర్శను, నిరసనను వ్యక్తం చేసేందుకు ప్రవేశపెట్టే ప్రతిపాదన censure motion *లోక్ సభలో తెలుగు దేశం పార్టీ హోంమంత్రి బూటా సింగ్‌పై అభిశంసన తీర్మానం ప్రవేశపెట్టింది.* (ఉ 4.12.87)

**అభిశంసించు** క్రి. *abhiśamsincu* వ్యతిరేకతను, అనిష్టతను తీవ్రంగా వ్యక్తం చేయు; నిరసించు to censure ప్రధాన మంత్రి అవినీతికి, ఆశ్రిత పక్షపాతానికి పాలు పడినట్లు దేశంలోని ఏ కోర్టు అభిశంసించలేదని అలాంటప్పుడు ప్రధాని రాజీనామా కోరేహక్కు తెలుగు దేశం పార్టీ వారికి లేదని ఆయన అన్నారు. (ఆం భూ. 13 10.89)

**అభీష్టం** వి. *abhiiSTam* బలమైన కోరిక; ఇష్టం wish, desire ఎంత ఖర్చు అయినా సరే తన అభీష్టం మేరకు చిత్ర నిర్మాణం జరగాలనే అభిప్రాయంతోనే శ్రీ రామారావు ఉన్నారు. (ఆం.భూ 2 5.89)

**అభ్యంతరం** వి. *abhyantaram* (చట్ట సభలలో) సభ్యులు లేవనెత్తే భిన్నాభిప్రాయం objection తివారి కర్నాటక ముఖ్యమంత్రి చేసిన సిఫార్సును ప్రస్తావించినప్పుడు జైపాల్ రెడ్డి, అమల్ దత్తా, సురేశ్ కురూప్ ప్రభృతులు అభ్యంతరం చెప్పారు. (ఆం.ప్ర 19.7 89)

**అభ్యంతరంచెప్పు** క్రి. *abhyantaram-ceppu* వ్యతిరేకతను వ్యక్తం చేయు; అడ్డు చెప్పు to register the protest భారత వైమానికదళ విమానాలు జాఫ్నాలోనికి ప్రవేశించి ఆహార సరఫరాలను జారవిడువటం పట్ల శ్రీలంక విదేశాంగమంత్రి హమీద్ అభ్యంతరం చెబుతూ ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శికి నిరసన తెలియజేశారు. (ఈ. 6 6 87)

**అభ్యంతరకరమైన** విణ. *abhyan-tarakaramaina* రక్షణ, భద్రతలకు సంబంధించిన; రహస్యంగా వర్గీకరించి ఉంచాల్సిన classified కొందరు విదేశీ పండితుల గదిలో అభ్యంతరకరమైన సమాచారాన్ని పోలీసులు కనుగొన్నారు. (ఆం భూ 6 6.87)

**అభ్యర్థన** వి. *abhyarthana* విన్నవించుకోవటం; విజ్ఞప్తి request, appeal తనకు తెలిసిన వాస్తవాలన్నీ సభ్యుల ముందు పెడతానని ప్రశ్నలన్నిటికీ జవాబిస్తానని స్పీకర్ అన్నారు. పాత సంప్రదాయాలను అనుసరించి తాను ఈ అభ్యర్థన చేస్తున్నానని ఆయన అన్నారు. (ఆం.భూ 9.5 89)

**అభ్యర్థి** వి. *abhyarthi* (అధికారం, పదవి మొ. వాటి కోసం) పోటీపడే వ్యక్తి candidate హిస్సార్ నియోజక వర్గంలో అత్యధిక సంఖ్యలో 38 మంది అభ్యర్థులు పోటీ చేస్తున్నారు. (ఆం.ప్ర. 16 6.87)

**అభ్యర్థించు** క్రి. *abhyarthincu* తన అభిప్రాయాలు వినమని విజ్ఞప్తి చేయు, కోరు to request, make an appeal పాకిస్తాన్ వంటి దేశంలో ప్రజాస్వామ్యం బతక దన్న విశ్వాసాన్ని విడనాడవలసిందిగా ముస్లిం దేశాలను ఆమె అభ్యర్థించారు. (ఆం. భూ. 11 6 89)

**అభ్యర్థిత్వం** వి. *abhyarthitvam* ఒక పదవికి పోటీపడే అభ్యర్థిగా ఉండటం candidature శ్రీ వెంకట్రామన్ అభ్యర్థిత్వాన్ని ఆదివారం ఇక్కడ జరిగిన కాంగ్రెస్(ఐ) పార్లమెంటరీ బోర్డు సమావేశం ఖరారు చేసింది. (ఉ 15 6.87)

**అభ్యసించు** క్రి. *abhyasincu* తెలియని విషయాన్ని నేర్చుకొను; తెలుసుకొను to learn క్రెమ్లిన్ బీజింగ్‌కు సైద్ధాంతిక మార్గదర్శినిగా ఉన్న రోజుల్లో షాంగ్ కున్ యుక్తవయస్సులో రష్యన్ భాష అభ్యసించారు. (ఈ. 16.5.89)

**అభ్యున్నతి** వి. *abhyunnati* అభివృద్ధి development, progress ... అట్టడుగు వర్గాల అభ్యున్నతికి తోడ్పడి వారిని చైతన్యవంతులుగా తీర్చి దిద్దడమే ముఖ్యమంత్రి ప్రథమ కర్తవ్యమని ... (ఉ. 21.4.88)

**అమర్యాదకరం** వి. *amaryaadakaram* అగౌరవ పరిచే పద్ధతి indecent, disrespectful ఏవో రహస్య సంభాషణలు జరిపి నట్లు రంగులు పులిమి రాష్ట్ర ప్రభుత్వాల పట్ల అమర్యాదకరంగా ప్రవర్తించడం ఎందుకో అర్థం కావడంలేదు. (ఆంప్ర 15 89)

**అమలు** వి. *amalu* ఆచరణలోకి లేదా కార్య రూపంలోకి తేవటం bringing sth into force పంజాబ్ సమస్యకు పంజాబ్ ఒప్పందమే ఉత్తమ పరిష్కారమని అయితే దీని అమలుకు అన్ని పార్టీలు, ఇరుగు పొరుగు రాష్ట్ర ప్రభుత్వాల సహకారం అవసరమని శ్రీ బూటా సింగ్ పేర్కొన్నారు. (ఆంప్ర 4.7 89)

**అమలుచేయు** క్రి. *amaluceeyu* వర్తింపజేయు, ఆచరణలో పెట్టు to put into practice, implement రంగారెడ్డి జిల్లాపరిషత్, మండల ప్రజాపరిషత్‌లకు వచ్చే డిశంబరులో జరిగే ఎన్నికలలో ఈ సంస్కరణలను ప్రయోగాత్మకంగా అమలుచేయాలని నిర్ణయించినట్లు ... చెప్పారు. (ప్ర శ. 27 10 87)

**అమలుపరచు** క్రి. *amaluparacu* చూ. అమలు చేయు; గ్రామీణ ప్రాంతాల్లో అధికార వికేంద్రీకరణ జరగాలని, అప్పుడే గాంధీజీ సిద్ధాంతాన్ని అమలుపరచినట్లవుతుందని అన్నారు. (ఈ 22.5 89)

**అమలులోకి వచ్చు** క్రి. *amalulooki vaccu* (నిర్ణీత సమయం తర్వాత) కార్యరూపంలోకి వచ్చు to come into force జూన్ ఒకటో తేదీ నుండి కొత్త పన్నులు అమలులోకి వచ్చినట్లు పరిగణిస్తారు. (ఈ 5 6 87)

**అమాంబాపతు** విణ. *amaambaapatu* గౌరవ ప్రదం కాని(నానారకాలు) కింది స్థానాలలో ఉన్న (people of) low rank ఈ విధంగా వాక్, సభా స్వాతంత్ర్యాలను దుర్వినియోగం చేస్తున్నవారు అల్లాటప్పా అమాంబాపతు నాయకులు కారు. (ఉ. 4 12 87)

**అమానుషం** వి. *amaanuSam* నిర్దయతో కూడిన రాక్షసత్వం inhuman శ్రీలంకలో సాగుతున్న అమానుష జన సంహారాన్ని ఎవరూ సమర్థించరు. (ఈ 5 6 87)

**అమానుష చర్య** వి. *amaanuSa carya* క్రూరత్వంతో కూడిన పని; రాక్షసత్వం inhuman act సంఘటనలో సంబంధం లేకుండా పల్లెగ్రామాల్లో బీభత్సం సృష్టిస్తూ ప్రజల్లో భయానక వాతావరణం నెలకొల్పారని, దోషులను నిర్బంధించడం అమానుష చర్య అని ... తెలిపారు. (ఆం భూ. 3 5 89)

**అమిత్రభావం** వి. *amitrabhaavam* మైత్రీభావం లేకపోవడం, unfriendly attitude, antagonism, hostility ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో రష్యా ఆధిపత్యాన్ని 1950వ దశకంలో చైనా సవాలు చేయడంతో ప్రారంభమైన అమిత్రభావం ఆ తర్వాతి కాలంలో తీవ్రమైన శాపంగా పరిణమించింది (ఈ. 15 5 89)

**అమిత్రవైఖరి** వి. *amitravaikhari* స్నేహం లేని ధోరణి hostile attitude, unfriendly attitude ద్వైపాక్షిక సంబంధాల సుదీర్ఘ చరిత్రలో భారత్ ఇలా అమిత్రవైఖరిని అనుసరించడం ఎన్నడూ లేదన్నారు. (ఈ 4 5 89)

**అమ్మకం పన్ను** వి. *ammakam pannu* వస్తువుల ధరతో పాటు వాడకందారు నుంచి ప్రభుత్వం వసూలు చేసే నిర్ణీత శాతం సొమ్ము sale tax వీరు సానలు బట్టే వజ్రాల అమ్మకాల మీద అమ్మకం పన్ను మినహాయింపు సౌకర్యం ఉంది. (ఆంప్ర. 26.4 89)

**అమ్ముడుపోవు** క్రి. *ammuDupoovu* డబ్బుకు లొంగి పోవు to be sold away (of persons) *"అయితే ధనానికి అమ్ముడుపోనందుకు భారత ప్రజలను అభినందించి తీరాలి" అని ఆయన అన్నారు.* (ఆం.ప్ర 15.10.87)

**అరకొర** వి. *arakora* అసంపూర్ణం, కాస్త కాస్త incomplete, inadequate *1949 నాటి హైదరాబాద్ గిరిజన ప్రాంతాల క్రమబద్ధీకరణ(రెగ్యులేషన్) ఉత్తర్వు తరువాత వచ్చిన రెగ్యులేషన్స్ అన్నీ అరకొరగానే అమలు జరుపుతూ వచ్చారు.* (ఆం.భూ. 11.7.89)

**అరదండాలు** వి. (బ.వ.) *aradanDaalu* చేతులకు పోలీసులు వేసే సంకెళ్ళు; బేడీలు handcuffs *పత్రికా నిర్వాహకునికి అరదండాలు.* (ఈ 18.1.88)

**అరమరికలు** వి. (బ.వ.) *aramarikalu* అవగాహన లేక పోవడం; సందేహాలు, భేదాభిప్రాయాలు differences *సోవియట్-చైనా సంబంధాలలో ఎలాంటి అరమరికలు ఉండకూడదనే తమదేశం కోరుతున్నదని ఆయన చెప్పారు.* (ఈ 18.5.89)

**అరాచకం** వి. *araacakam* ఆందోళన పూరిత సంఘటనలతో, శాంతి భద్రతలు నశించిన పరిస్థితి lawlessness, unruliness *భారత్ బంద్ రోజు అరాచకాలు జరిగే సూచనలు కనిపిస్తున్నాయి. కావున ప్రజలు తమ ప్రయాణాలు రద్దు చేసుకొని బంద్‌కు సహకరించాలని ఆయన కోరారు.* (ఆం.భూ 28.8.89)

**అరాచక చర్య** వి. *araacaka carya* శాంతి భద్రతలకు కట్టుబడకుండా చేసే దౌర్జన్యపూరితమైన పని unruly action *పట్టణాల్లోని కార్యకర్తలు కొందరు వ్యక్తిగత అరాచక చర్యలకు పాల్పడినప్పుడల్లా ...* (ఆం.ప్ర 25.7.89)

**అరాచక పరిస్థితి** వి. *araacaka paristhiti* శాంతి భద్రతలు లోపించిన వాతావరణం, కల్లోలిత వాతావరణ స్థితి; అస్తవ్యస్త పరిస్థితి chaotic situation *లంక దక్షిణ ప్రాంతంలో దాదాపుగా 'అరాచక పరిస్థితి' ఏర్పడడానికి కారణం శ్రీలంక ప్రభుత్వమేనని భారత్ వ్యాఖ్యానించింది.* (ఈ 27.7.89)

**అరికట్టు** క్రి. *arikaTTu* (చెడు విధానాలను) కొన సాగకుండా ఆపు చేయు to curb, restrict, contain ... *కార్యకర్తలనుద్దేశించి ఆయన మాట్లాడుతూ దౌర్జన్యాలను అరికట్టడంలో ప్రభుత్వం ఏ మాత్రం వెనుదీయదన్నారు.* (ఈ 14.6.89)

**అర్జీ** వి. *arjii* ఒక విషయం గురించి విన్నవించుకుంటూ న్యాయం చేకూర్చమని పెట్టుకొనే దరఖాస్తు; మహజరు petition, claim, memorandum *భూమి హక్కు రికార్డు తయారీకై సంబంధించిన వివరాలను రైతులు అర్జీలు పెట్టుకోవడానికై రామన్న పేట మండలంలోని గ్రామాల్లో తిరిగి గ్రామసభలు ఏర్పాటుచేసి ప్రజలకు తెలియజేశామని ... తెలిపారు.* (ఆం.ప్ర. 3.7.89)

**అర్థాంతరంగా** క్రి విశ. *ardhaantarangaa* పూర్తి కాకుండా; చెప్పా పెట్టకుండా abrupt, unexpected *రైలు పట్టాలపై స్త్రీ మృత దేహానికి సంబంధించిన పరిశోధన అర్థాంతరంగా ముగిసినట్టుగానే భావిస్తున్నారు.* (ఆం.ప 9.6.87)

**అర్పించు** క్రి. *arpincu* గౌరవసూచకంగా సమర్పించు to offer ఈమె మృతివల్ల ఒక్క గుంటూరు జిల్లాకే కాదు, రాష్ట్రానికే తీరనిలోటు అని రెవిన్యూ మంత్రి ... జోహారులర్పించారు. (ఆం.ప 18.9.87)

**అర్బన్ ఎగ్లోమరేషన్** వి. *arban egloomareeSan* పెద్ద పట్టణాలలో, నగరాలలో, నగర శివార్ల క్రమాభివృద్ధిని దృష్టిలో ఉంచుకొని పట్టణాభివృద్ధి సంస్థలు నిర్దేశించిన నగర శివార్ల పరిమితులలోని ప్రాంతం urban agglomeration చట్టం ప్రకారం అర్బన్ ఎగ్లోమరేషన్ పరిధిలో గల వ్యవసాయ భూములను నివేశన స్థలాలుగా మార్పు చేసే అవకాశం లేకపోవడంవల్ల ... (ఈ. 15 7.89)

**అర్బన్ సీలింగ్ చట్టం** వి. *arban siilıng caTTam* పట్టణాలలో ఒక వ్యక్తి, ఆస్తిగా కలిగివుండే భూమిపై పరిమితి విధించే శాసనం urban ceiling act అర్బన్ సీలింగ్ చట్టం అమలులోకి వచ్చేనాటికి నారయ్యకు మైనారిటి తీరిన కుమారుడున్నాడు. (ఆం జ్యో. 10 12.87)

**అర్రులుచాచు** క్రి. *arrulucaacu* ఆశగా (పదవికోసం) పాకులాడు to crave for కాంగ్రెస్(ఐ)లో చేరినప్పటికీ పదవులకోసం అర్రులుచాచడం లేదు. (ఆం.భూ. 24.5 89)

**అలగా శక్తులు** వి. (బ.వ.) *alagaa śaktulu* విలువలు, క్రమశిక్షణ లేని వ్యక్తులు lumpen elements పార్టీ ప్రతిష్ఠను దెబ్బతీసే అవాంఛనీయమైన వ్యక్తులను, అలగా శక్తులను పక్కకు తొలగించుకుంటూ ... (ఆం.భూ. 4.5.89)

**అలజడి** వి. *alajaDi* ఆందోళనా పూరిత వాతావరణం unrest, disturbance రాష్ట్రంలో శాంతి భద్రతలకు భంగంవాటిల్లేటట్లుగా అలజడులు సృష్టించి తద్వారా అస్థిరత నెలకొనేట్లు చేసేందుకు కాంగ్రెస్ కుట్ర పన్నిందని ... (ఆం ప్ర 28 8.89)

**అలరించు** క్రి. *alarincu* సంతోషపరచు; ఆకట్టుకొను to entertain, captivate ఐదేళ్ళ పాలనలో దేశం సాధించిన అభివృద్ధి గురించి చెబుతూ, ప్రేక్షకులను ఉత్సాహపరుస్తూ కాంగ్రెస్ విధానాలను దుయ్యబడుతూ సభికులను ఆయన అలరించారు. (ఈ 17.11 89)

**అలసత్వం** వి. *alasatvam* ఉత్సాహం లేకపోవటం; నిర్లక్ష్యం lethargy ప్రభుత్వ అధికారుల అలసత్వంవల్ల భూస్వాముల దౌర్జన్యాలకు తట్టుకోలేని ... (ఆం.భూ. 28 8 89)

**అలీనదేశం** వి. *aliinadeeśam* ఏ రాజ్యకూటాల్తో సంబంధం లేనిదేశం; తటస్థ దేశం non-aligned country ... సోవియట్ దళాలను త్వరలో అక్కడనుంచి ఉపసంహరించుకుంటారని, ఆఫ్ఘనిస్తాన్ దీనిలో అలీనదేశమవుతుందని ... పేర్కొన్నారు. (ఆం.ప్ర. 4.2.89)

**అలుముకొను** క్రి. *alumukonu* ఎక్కువ ప్రాంతాలకు చేరు to spread ఉత్పాదకత అడుగంటడంతోపాటు పులిమీద పుట్రలా జాతుల సమస్య భగ్గుమని దావానలంలా అలుముకొంటున్నది. (ఈ 27.5 89)

**అల్టిమేటం** వి. *alTımeeTam* ఏదైనా ఒక పనిని కార్యరూపంలో పెట్టడానికి లేదా పరిష్కరించడానికి తుదిగడువు లేదా చివరి అవకాశం ultimatum ఇరవై నాలుగు గంటలలో ప్రత్యుత్తరం ఇవ్వని పక్షంలో, మళ్ళీ ప్రదర్శనలు జరుపుతామని వారు 'అల్టిమేటం' ఇచ్చారు. (ఆం.భూ. 3.5.89)

**అల్పపీడనం** వి. *alpapiiDanam* సము ద్రంపై ఏదో ఒక చోట గాలి ఒత్తిడి తగ్గి, నీటిలో పెద్ద సుడి ఏర్పడటం, తుఫాన్‌గా మారేందుకు ముందుదశ depression(atmosphere) *బంగాళాఖాతంలో ఏర్పడిన అల్పపీడనం తుఫానుగా మారినట్లు ఇక్కడి వాతావరణ కేంద్ర ప్రతినిధి తెలిపారు.* (ప్రశ 16 10 87)

**అల్పసంఖ్యాక వర్గాలు** వి. (బ.వ.) *alpa-sankhyaaka vargaalu* సమాజంలో సంఖ్యలో తక్కువగా ఉండి ప్రత్యేక రక్షణలు కోరే చిన్న వర్గాలు minorities *తమ పార్టీ అధికారంలోకి వచ్చినట్లయితే అల్పసంఖ్యాక వర్గాల(మైనారిటీ) కమీషన్‌కు శాసనీయ ప్రతిపత్తి కల్పించగలదని శ్రీ సింగ్ హామీ ఇచ్చారు.*(ఈ 5.12 87)

**అల్పాహారం** వి. *alpaahaaram* కొద్దిపాటి తిండి snacks and tea *... వెళ్ళిన తరువాత మద్దతుదార్ల అభ్యర్థనపై వి.పి.సింగ్ ... అల్పాహారం తీసుకున్నారు.* (ఆంప్ర 16 6 87)

**అల్పాహార విందు** వి. *alpaahaara vindu* చిరు తిండితో తేనీటి విందు tea party, light refreshments *సుమారు 30 నిమిషాల సేపు చర్చలు జరిగిన అనంతరం శ్రీ రామారావు నాగానాయకులకు అల్పాహార విందు చేశారు.* (ఈ 18.6 87)

**అల్లకల్లోలం** వి. *allakalloolam* శాంతి భద్రతలకు తీవ్ర విఘాతం కలిగిన స్థితి disturbance *విధ్వంసక కార్యకలాపాల్లో పాకిస్తాన్ శిక్షణ పొందిన విద్రోహుల బృందాలే కాశ్మీరు లోయలో అల్లకల్లోలం సృష్టిస్తున్నాయనేది రుజువులతో రూఢి అయింది.* (ఈ. 28 7 89)

**అల్లరిమూక** వి. *allarimuuka* సంఘ విద్రోహ చర్యలకు పాల్పడేవారు miscreants *సాయుధులైన అల్లరిమూక పోలీసులపై జరిపిన దాడిలో ... గాయపడ్డారు.* (ఆంప్ర 23.9 89)

**అవకతవక** వి. *avakatavaka* చట్టాన్ని విస్మరించి క్రమం తప్పి జరిగిన పొరపాటు irregularity *ఫిబ్రవరి 2వ తేదీ జరిగిన ఇంటర్వ్యూలో అనేక అవకతవకలు జరిగాయని, అభ్యర్థికి కేవలం రెండు నిమిషాల కంటే ఎక్కువ కాలం కేటాయించకుండా ఊరు, పేరు అడిగి పంపారని ...* (ఉ. 6.4 88)

**అవకతవక విధానం** వి. *avakatavaka vidhaanam* లోపభూయిష్ఠమైన పద్ధతి inept policy *కేంద్ర ప్రభుత్వ అవకతవక విధానాలను విమర్శించేందుకు భయపడవలసిన అవసరం లేదని ఆయన అన్నారు.* (ఈ 27 5 89)

**అవకాశవాదం** వి. *avakaaśavaadam* సిద్ధాంత నిబద్ధత లేకుండా, అవసరాలను బట్టి అనుసరించే పద్ధతి opportunism *వర్కింగ్ కమిటీ సీనియర్ సభ్యుడు ... మాట్లాడుతూ ప్రతిపక్షాల ఐక్యతకు జరుగుతున్న ప్రయత్నాలు కేవలం అవకాశవాదం తప్ప మరేమికాదన్నారు.* (ఆం.జ్యో. 25.4 88)

**అవగతమగు** క్రి. *avagatamagu* (అస్పష్టంగా ఉన్న విషయం) తెలియ వచ్చు to become comprehensible *వారికి ఎలాంటి సంస్కృతి ఉందో అవగతమవుతూంది అని వ్యాఖ్యానించారు.* (ఆంప్ర. 4 3.88)

**అవగాహన** వి. *avagaahana* 1. ఇరు పక్షాలు ఒక ఒప్పందానికి రావటం, ఒడంబడిక agreement,

understanding లిబరేషన్ టైగర్స్‌తో తమకు ఒక అవగాహన కుదిరినందున వారికి వ్యతిరేకంగా శాంతిసేన ఎలాంటి చర్యలు తీసుకో రాదని కోరుతూ శ్రీలంక అధ్యక్షుడు శ్రీ ప్రేమదాస రాసిన లేఖకు సమాధానంగా ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ రాసిన లేఖలో పైవిధంగా స్పష్టంచేసినట్లు తెలిసింది. (ఆం.ప్ర. 1.7 89) 2. విషయంపై గ్రహింపు understanding ప్రస్తుతం ఉన్న బ్రిడ్జి భాగం ఎంతవరకు పటిష్ఠంగా ఉందన్న అంశం మీద కూడా అధికారులకు పూర్తి అవగాహనలేదు. (ఈ. 6 7.89)

**అవతరించు** క్రి. *avatarincu* (కార్యార్థం) జన్మించు, సంభవించు to incarnate ప్రస్తుతం దేశం అత్యంత క్లిష్ట ప్రమాద పరిస్థితుల్ని ఎదుర్కొంటోందని, దేశాన్ని రక్షించడానికి మరో మహాత్మాగాంధీ అవతరించాల్సిందేనని ఆయన అన్నారు. (ఈ. 20 7.89)

**అవతలపెట్టు** క్రి. *avatalapeTTu* (చర్చకు) దూరంగా ఉంచు to set sth aside ... ధాన్యాల సరఫరా వివాదాన్ని అవతలపెట్టి ఇండియా శ్రీలంకలు ... (ఆం.ప్ర. 6 6.87)

**అవనతంచేయు** క్రి. *avanatamceeyu* (జాతీయ పతాకాన్ని) సంతాప సూచకంగా కొద్దిపాటి ఎత్తులో ఎగరకుండా ఉంచు to keep (the national flag) half-mast ఇరాన్ ఆధ్యాత్మిక గురువు ఆయతుల్లా ఖొమేని మృతికి దేశవ్యాప్తంగా మూడు రోజులు సంతాపం పాటించాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. మంగళ వారం వరకు ప్రభుత్వ కార్యాలయాలపై జాతీయ పతాకాన్ని అవనతంచేస్తారు. (ఆం.భూ. 5 6.89)

**అవరోధం** వి. *avaroodham* కార్య నిర్వహణలో కలిగే అడ్డంకి obstruction, impediment, hurdle తీర్మానానికి పధ్నాలుగు రోజుల ముందుగా నోటీసు యివ్వవలసి వుంటుందన్న నిబంధన వారికి అవరోధం కాదని ఈ నిబంధనలో సంబంధిత భాగాన్ని తాత్కాలికంగా నిలుపు చేయడానికి తనకేమీ అభ్యంతరం లేదని సభకు హామీ ఇస్తున్నానని జక్కర్ ప్రకటించారు. (ఈ. 9.5 89)

**అవలంబించు** క్రి. *avalambıncu* ఒక విధానాన్ని పాటించు to adopt(a policy) ఉగ్రవాదుల విషయంలో దృఢ వైఖరిని అవలంబిస్తున్న బి.జె.పి.ని ప్రధాని ప్రశంసించారు. (ఈ. 20 7 89)

**అవలీలగా** క్రి.విశ. *avaliilagaa* ఎటువంటి కష్టం లేకుండా; సునాయసంగా easily సర్వీసెస్ జట్టు 8-తో బెంగాల్ జట్టును అవలీలగా ఓడించింది. (ఈ. 27 7 89)

**అవశేషాలు** వి. (బ.వ.) *avaśeeSaalu* అనంతర కాలంలో దొరికే ప్రాచీన కాలం నాటి వస్తువులు antiques ఈ త్రవ్వ కాలలో సుమారు 2వేల సంవత్సరాల నాటి అవశేషాలు బయల్పడ్డాయి. (ఆం ప్ర 10 4.88)

**అవశ్యం** అవ్య. *avaśyam* తప్పక must ... జ్యోతిబసు పలికిన హితవు అవశ్యం పాటింపదగింది. (ఈ. 3.5 89)

**అవహేళనచేయు** క్రి. *avaheeLanaceeyu* హేళనకు గురిచేయు; అవమానపరచు to deride, ridicule ఆ వ్యాసం ఉదయంలో వచ్చిన వార్తను, ఆ వార్తను ముందుగా వెలికితీసిన ఉదయం విలేఖరిని అవహేళనచేయడానికి అధిక ప్రాధాన్యం ఇచ్చింది. (ఉ. 6.12.87)

**అవాంఛనీయ చర్య** వి. *avaanchaniıya carya* ఎవరూ కోరుకోని పని

unwarranted act ఎస్.ఎఫ్.ఐ. విద్యార్థులు నిన్న సచివాలయం ముందు ప్రధాని రాజీవ్ గాంధీ దిష్టి బొమ్మను తగులబెట్టిన విషయమై కేరళ ప్రభుత్వం విచారణకు ఆదేశాలను జారీ చేస్తుందని ముఖ్యమంత్రి ఇ.కె. నయనార్ నేడు అసెంబ్లీలో హామీ ఇచ్చారు. ఈ సంఘటన అవాంఛనీయ చర్య అని ముఖ్యమంత్రి నయనార్ కాంగ్రెస్ సభ్యుడు ఊమెన్ చాంధితో అన్నారు. (ఆం.ప్ర 28.7.89)

**అవాంఛనీయ శక్తి** వి. *avaanchaniiya śakti* నీతి నియమాలకు హాని కలిగించే వ్యక్తి unwanted element కాంగ్రెస్ పార్టీకి ఎన్నో ఒడిదుడుకులను సవాళ్ళను ఎదుర్కొన్న చరిత్ర ఉన్నదని ఆయన అన్నారు. కొన్ని 'అవాంఛనీయ శక్తులు' అడపా దడపా పార్టీలో ప్రవేశించి దేశాన్ని బలహీన పరచ చూస్తున్నాయనీ ... శ్రీ రాజీవ్ చెప్పారు. (ఆం.భూ 23 7 87)

**అవాంఛనీయ సంఘటన** వి. *avaanchaniiya sanghaTana* శాంతి భద్రతలకు భంగం వాటిల్లే విధంగా జరిగిన సంఘటన untoward incident ముఖ్యమైన ప్రదేశాల్లో ఎటువంటి అవాంఛనీయ సంఘటనలు జరగకుండా కఠిన చర్యలు తీసుకున్నట్లు 'టాస్' తెలిపింది. (ఆం.ప్ర. 14 6 89)

**అవాంతరం** వి. *avaantaram* అనుకోని కష్టం; అడ్డంకి difficulty, snag *1981-82* వరకు సంస్థ *70*కోట్ల రూపాయల నష్టాల్లో ఉందని, ఆ నష్టాన్ని పూడ్చుకొనే లోపునే అవాంతరం వచ్చి పడిందని అన్నారు. (ఈ. 23 4.89)

**అవాక్స్** వి. *avaaks* ఆధునికమైన సాంకేతిక [illegible], శక్తిమంతమైన రాడార్ అమర్చిన నిఘా విమానం airborne warning and controlling system(AWACS) అవాక్స్‌లను ఎదుర్కొనే సాధన సంపత్తి, సాంకేతిక పరిణతలు భారత దేశానికి ఉన్నాయని ... చెప్పారు. (ఆం.భూ 6.6.87)

**అవాకులు చవాకులు** వి. (బ.వ.) *avaakulu cavaakulu* ఎటువంటి ఆధారాలులేని చౌకబారు నిందలు baseless allegations గాంధీ భవన్‌లో పత్రికా విలేఖరుల సమావేశంలో శ్రీ రోశయ్య మాట్లాడుతూ ప్రతి పక్షాలు బోఫోర్స్ వ్యవహారంపై ఇచ్చిన సి.ఎ.జి. నివేదికపై అవాకులు చవాకులు విసరడం తప్ప వాస్తవాలను చెప్పడంలో ప్రజలను మభ్య పెడుతున్నారని ఆయన విమర్శించారు. (ఆం.భూ 15.8.89)

**అవాక్కగు** క్రి. *avaakkagu* ఆశ్చర్యంతో మాట్లాడలేకపోవు to be stunned " ... మీ సమాజ ధోరణితో ఆంధ్ర ప్రదేశ్‌లోని 'తెలుగు దేశం' ప్రభుత్వంపై చేసిన ఆరోపణలు, వేసిన అభాండాలు చదివి 'నేషనల్ ఫ్రంట్' నాయకులు దిగ్భ్రాంతి చెందారు. అవాక్కయ్యారు." (ఆం.ప్ర. 6 7.89)

**అవార్డు** వి. *avaarDu* ప్రత్యేక రంగంలో సాధించిన స్థానానికి గుర్తింపుగా ఇచ్చే బహుమతి award ప్రముఖ కవి, నవలా రచయిత శ్రీ శివకుమార్‌కు ఈ సంవత్సరపు సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. (ఆం.ప్ర 5.6 87)

**అవిచ్ఛిన్నంగా** క్రి.విణ. *avicchinnangaa* ఆగిపోవటం లేకుండా relentless గత ఆరు వారాలుగా అవిచ్ఛిన్నంగా సాగుతున్న విద్యార్థి ఉద్యమాన్ని కఠినంగా అణచివేయడానికి ... (ఈ 30.5 89)

**అవినీతి నిరోధక శాఖ** వి. *aviniiti niroodhaka śaakha* ప్రభుత్వాధికారులలో లంచగొండితనాన్ని అరికట్టే విభాగం anticorruption bureau ...

మే(టన్ అవినీతి కార్యకలాపాలను విశ్వసనీయ వర్గాల ద్వారా తెలుసుకున్న అవినీతి నిరోధక శాఖాధికారులు హాస్టల్‌పై ఆకస్మిక తనిఖీ జరిపారు. (ఆం.భూ 19 4 88)

**అవివేక చర్య** వి. *aviveeka carya* తెలివి తక్కువతనంతో చేసేపని meaningless action *తాను గతంలో ఎప్పుడో 5 నెలల(క్రితం (ప్రజలను చెత్తాచెదారంగా తిట్టానన్నది వాస్తవం కాదని, ఆ కారణంతో రాష్ట్ర బంద్‌కు పిలుపునివ్వడం అనేది అవివేక చర్య అని ఆయన పేర్కొన్నారు.* (ఆం.ప్ర. 5 7 89)

**అవిశ్వాస తీర్మానం** వి. *aviśvaasa tiirmaanam* చట్టసభలో ప్రభుత్వం మెజారిటీ కోల్పోయిందన్న అంశాన్ని గురించి, సభలో చర్చకు, ఓటింగ్‌కు పెట్టే ప్రతిపాదన no confidence motion *స్పీకర్ మాట్లాడుతూ ఈ అంశంపై 193వ నిబంధన క్రింద చర్చకు అనుమతించానని, ప్రతిపక్ష సభ్యులు ఇంకా తృప్తి పడకపోతే ప్రభుత్వానికి వ్యతిరేకంగా అవిశ్వాస తీర్మానానికి అనుమతిస్తానని, అప్పుడు చర్చించవచ్చునని అన్నారు.* (ఆం.ప్ర 20 7 89)

**అవ్యవస్థీకృత రంగం** వి. *avyavasthıkRta rangam* కూలీలను, పనివాళ్ళను ఐక్యం చేసి, సంఘాలను నిర్మించటానికి వీలుకానిది unorganized sector *అవ్యవస్థీకృత రంగంలో పనిచేస్తున్న ఉద్యోగులస్థితి గతులపై భారతీయ మజ్దూర్ సంఘ్(బి.ఎం.ఎస్) సర్వే జరిపినట్లు నగర బి.ఎం.ఎస్ విభాగం తెలిపింది.* (ఆం.భూ 22.4.88)

**అశక్తత** వి. *aśaktata* కార్య నిర్వహణలో తగిన సామర్థ్యం లేకపోవటం; బలహీనత inability *అతిస్వల్ప వ్యవధిలో ఇంత పెద్ద మొత్తంలో విరాళాలను సేకరించడం కుదరదని అక్కడే కాంగ్రెస్ నాయకుడు, మాజీ మంత్రి ఎన్. ఆళ్వార్ దాస్ తన అశక్తతను వ్యక్తం చేశారు.* (ఆం.ప్ర 26 4.89)

**అసంతుష్ట వర్గం** వి. *asantuSTa ..rgam* ఒకే పార్టీలో నాయకత్వం పట్ల వ్యతిరేకత చూపే బృందం dissident group *ఈ గందరగోళం ఫలితంగా సేవాదళ్ అధ్యక్షుడు శ్రీ మౌలిన్ వైష్ణవ్, ముగ్గురు అసంతుష్ట వర్గం శాసన సభ్యుల బట్టలు చిరిగిపోయాయి. అసంతుష్ట వర్గంవారు నినాదాలు చేశారు.* (ఆం.ప్ర. 17 7.89)

**అసంతృప్తి** వి. *asantRpti* రాజకీయ సంస్థలలో నాయకత్వం పట్ల అనిష్టత dissatisfaction *ప్రదేశ్ కాంగ్రెస్-ఐ అధ్యక్షుడు డాక్టర్ మర్రి చెన్నారెడ్డి పనితీరు పట్ల పార్టీలో రేగిన అసంతృప్తి గురువారం ఇక్కడ జరిగిన పార్టీ ప్రచార కమిటీ సమావేశంలో ప్రస్ఫుటమైంది.* (ఆం.ప్ర. 30.6 89)

**అసంతృప్తిపరచు** క్రి. *asantRptiparacu* (ఏదైనా ఒక పనిలో లేదా పోటీలో) నిరుత్సాహపరచు to disappoint *ఆ తర్వాత షార్జాలో జరిగిన క్రికెట్ బెనిఫిట్ ఫండ్ సిరీస్ పోటీల్లో ఒక పోటీకి వెంగసర్కార్‌ను తీసుకోకుండా అతన్ని అసంతృప్తిపరిచారు.* (ఆం.ప్ర 29 11.87)

**అసభ్య పదజాలం** వి. *asabhya padajaalam* సభ్య సమాజంలో ఉపయోగించని మాటలు; బూతు మాటలు foul language ... *ఎస్.ఐ. వెంకటరత్నం కల్పించుకొని తిరిగి విలేఖరులను అసభ్య పదజాలంలో దూషించారు.* (ఉ 7 10 87)

**అసమ్మతి** వి. *asammati* కమిటీ నివేదికలలో మెజారిటీ అభిప్రాయంతో విభేదించే సభ్యుడు విడిగా ఇచ్చే భిన్నాభి

ప్రాయం dissent బోఫోర్స్ తుపాకుల కొనుగోలు వ్యవహారంపై విచారణకు నియమించిన సంయుక్త పార్లమెంటరీ కమిటీలోని ఇద్దరు సభ్యులు కమిటీ నివేదికలో తమ అసమ్మతిని చేర్చడానికి వీలుకల్పించినట్లు లోక్‌సభ స్పీకర్ శ్రీ బలరాం జక్కర్ ప్రకటించారు. (ఉ 26 4 88)

**అసమ్మతి పత్రం** వి. *asammati patram* కమిటీ నివేదికలలో భిన్నాభిప్రాయాన్ని కలిగిన సభ్యుడు ఇచ్చే వివరణ dissent note ప్రభుత్వ ఫర్నిచర్‌ను మాజీ మంత్రులు వాపస్ చేయక పోవడంపై శాసన సభా సంఘం సమర్పించిన నివేదికలో తన అసమ్మతి పత్రంలేదని కాంగ్రెస్(ఐ) ఎం.ఎల్.ఎ. డాక్టర్ వై.యస్. రాజశేఖర రెడ్డి ఫిర్యాదు చేశారు. (ఉ 11 4.88)

**అసమ్మతి వర్గం** వి. *asammati vargam* ప్రభుత్వంతో అభిప్రాయ భేదాలు కలిగిన అధికార పార్టీ సభ్యులు dissident group పో.చూ. అసంతుష్ట వర్గం; సోమవారం జరగనున్న శాసన సభా పక్షం సమావేశంలో తాము అనుసరించదగు వ్యూహాన్ని గురించి చర్చించడం కోసం ఆదివారంనాడు అసమ్మతి వర్గం శాసన సభ్యులు సమాలోచనలు జరుపుతున్నారు. (ఆం.ప్ర. 6 2 89)

**అసమ్మతి వాది** వి. *asammati vaadi* ఒకే పార్టీలో నాయకత్వంపై నిరసన తెలిపే వ్యక్తి dissident ... పాపం అనవసరంగా వారిని అసమ్మతి వాదులు అంటారెందుకు? వారికి తోచిన సలహా వారిచ్చారు. దయచేసి దాన్ని అసమ్మతి అనకండి అని చెన్నారెడ్డి వివరించారు. (ఈ 16 7 89)

**అసాధారణ సమావేశం** వి. *asaadhaaraNa samaaveeśam* తక్షణ ప్రాముఖ్యంగల విషయాలను చర్చించేందుకు ఏర్పాటు చేసిన ప్రత్యేక సభ extra ordinary meeting, special session పదేళ్ళ విరామం తర్వాత ఈజిప్టు తిరిగి అరబ్ లీగ్‌లో చేరుతుంది. మొరాకోలో ఈ నెల 23న జరిగే అరబ్‌లీగ్ అసాధారణ సమావేశంలో ఈ విషయం ప్రకటించనున్నారు. (ఆం.ప్ర. 18 5.89)

**అసెంబ్లీ** వి. *asemblii* శాసన సభ్యులతో కూడి రాష్ట్ర ప్రభుత్వాన్ని నడిపే చట్ట సభ; విధాన సభ assembly త్రిపుర అసెంబ్లీలో తీవ్ర గలభా సృష్టించిన 18 మంది ప్రతి పక్ష శాసన సభ్యులను గురువారంనాడు ఒక్కరోజు పాటు సభ నుండి బహిష్కరించారు. (ఆం భూ 19 89)

**అస్తమయం** వి. *astamayam* ప్రముఖ వ్యక్తి చనిపోవటం demise, death ఆంద్రి గ్రోమికో అస్తమయం. (ఆం భూ)

**అస్తవ్యస్తం** వి. *astavyastam* అన్ని రంగాలలో నిలకడలేకపోవటం chaos దేశం అభివృద్ధి పథంలో పయనిస్తున్న వాస్తవిక చరిత్ర తెలియని రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ రామారావు దేశం బ్రిటిష్ పాలన కంటె అస్తవ్యస్తంగా వుందని వ్యాఖ్యానించడం శోచనీయమన్నారు. (ఆం భూ 17 8 89)

**అస్థిరత** వి. *asthirata* ప్రభుత్వ పటిష్టత తగ్గి, అన్ని రంగాలలో నిలకడ లేకపోవటం instability దేశంలో ప్రస్తుత అస్థిరతని అంతమొందించాలంటే కాంగ్రెస్-ఐ పార్టీని వెంటనే అధికారం నుంచి తొలగించాలని జనతాదళ్ అధ్యక్షుడు వి.పి. సింగ్ పిలుపునిచ్చారు. (ఆం జ్యో 15 10 88)

**అస్థిరపరచు** క్రి. *asthiraparacu* ప్రభుత్వాలను ప్రయత్న పూర్వకంగా బలహీన పరచు to destabilize దేశంలోని నాన్-కాంగ్రెస్ ప్రభుత్వాలన్నిటినీ అస్థిరపరచాలనే సమగ్ర వ్యూహంలో భాగంగానే కాంగ్రెస్(ఐ)

కర్నాటకలోని జనతాదళ్ ప్రభుత్వాన్ని కూల దోసిందని ... సింగ్ ఆరోపించారు. (ఈ. 26.4 89)

అస్వస్థత వి. *asvasthata* అనారోగ్యం, జబ్బుతో బాధ పడటం indisposed, sick త్రిపాఠీకి అస్వస్థత. (ఉ. 8.4.88)

ఆ

ఆంక్షలు వి. (బ.వ.) *aankSalu* 1. వ్యక్తి లేదా సంస్థ కార్యాకలాపాలకు విధించే అదుపు restriction *1857 లో సిపాయి తిరుగు బాటు వలన పత్రికలపై ఆంక్షలు ఎక్కువయ్యాయి.* (ఉద. 23 9 88) 2. ఒక దేశం (జాతి విచక్షణ దురాక్ర మణ వంటి) అక్రమాలకు పాల్పడినప్పుడు, ఇతర ప్రపంచ దేశాలు శిక్షా పూర్వకంగా విధించే ఆర్థిక, సాంస్కృతిక పరమైన నిషేధం sanctions *జాతి దురహంకార దక్షిణాఫ్రికా ప్రభుత్వంపై ఆర్థిక ఆంక్షలను కఠి నతరం చేయటానికి కామన్వెల్త్ వర్కింగ్ గ్రూప్ నేడు అనుకూలత వ్యక్తం చేసింది.* (ఆంప్ర 16.10.87) 3. కార్యక్రమాల అమలును తాత్కాలికంగా ఆపివేస్తూ ప్రభుత్వం జారీ చేసే నిషేధాజ్ఞ ban *ఆరు నెలలకు మించి ఖాళీగా ఉన్న ప్రభుత్వ ఉద్యోగాలను తిరిగి భర్తీ చేయరాదని గతంలో విధించిన ఆంక్ష లను ప్రభుత్వం ఎత్తివేస్తూ ఆదేశాలు జారీ చేసింది.* (ఆంప్ర. 6.10.88) 4. ఒక పని చేయటానికి పెట్టె షరతు condition ... *ఈ సహాయం ఇచ్చే ముందు పథక వ్యయంలో సగ భాగం ఆయా పురపాలక సంఘాలు భరించాలని ఆంక్ష విధించినట్టు తెలిసింది.* (ఉ. 17 10.87)

ఆంతరంగిక అత్యవసర పరిస్థితి వి. *aantarangika atyavasara paristhiti* దేశంలో ఆర్థిక, రాజకీయ సంక్షోభం ఏర్పడినప్పుడు పౌరహక్కులను కత్తి రిస్తూ ప్రభుత్వం ప్రకటించే ప్రత్యేక పాలనా వ్యవస్థ internal emergency *దేశంలో ఆంతరంగిక అత్యవసర పరిస్థితులు విధించే అవకాశం ఉందన టాన్ని కాంగ్రెస్(ఐ) ప్రధాన కార్యదర్శి ... తోసి పుచ్చారు.* (ఉ. 22.12.87)

ఆంతరంగిక వ్యవహారం వి. *aantarangika vyavahaaram* బయటి వారి జోక్యం అనుమతించని, తమకు మాత్రమే సంబంధించిన విషయం internal affair or matter ... *చైనా ఆంత రంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకోవద్దని విదేశీయులను హెచ్చరించారు.* (ఉ. 7.10.87)

ఆంతరంగిక సమస్య వి. *aantarangika samasya* బయటి వారి జోక్యం లేకుండా తమలో తామే పరిష్కరించు కోవాల్సిన సమస్య internal problem *సింహళ, తమిళ జాతుల మధ్య శత్రుత్వం శ్రీలంక ఆంతరంగిక సమస్యే కావచ్చు.* (ఆంప్ర. 29.7.89)

ఆంతర్యం వి. *aantaryam* ఒక పని చేయటంలో దాగి ఉన్న అసలు ఉద్దేశ్యం (real)intention, purpose, motive *శ్రీ మహంత రాకలో ఆంతర్యం ఏమిటని ప్రశ్నించగా "ఏమీ లేదు వస్తామని కబురు చేశారు అంతే!" అని శ్రీ రామారావు బదులిచ్చారు.* (ఆంజ్యో. 5 6 87)

ఆందోళన వి *aandooLana* 1. ఒక నిర్ణయానికి నిరసనగా సానుకూల నిర్ణయం సాధించటానికి జరిపే పోరాటం agitation *దాదాపు నాలుగు నెలల నుంచి జరుపుతున్న నిబంధనల మేరకు పని ఆందోళనను విరమించాలని ప్రభుత్వ డాక్టర్లు నిర్ణయించారు.* (ఈ 10 8.88) 2. అవాంఛ నీయమైన పరిస్థితులు, సంఘటనల పట్ల కలిగే ఆదుర్దా concern, worry ... *జాతీయ ఐక్యత పట్ల, దేశం ఎదుర్కొం టున్న పలుసమస్యల పట్ల తీవ్ర ఆందోళనను*

శ్రీ జైల్ సింగ్ వ్యక్తం చేశారని శ్రీ సూర్జిత్ పేర్కొన్నారు. (విశా 26.6.87)

**ఆందోళనకరం** వి. *aandooLanakaram* ప్రాణాపాయస్థితిలో ఉండటం anxious condition, critical ప్రజలతో జరిగిన ఘర్షణలో ఇద్దరు సర్కిల్ ఇన్‌స్పెక్టర్లు గాయ పడగా, పోలీసులు లాఠీ చార్జిలో పాతిక మంది పైగా గాయపడ్డారు. వారిలో నలుగురి పరిస్థితి ఆందోళన కరంగా ఉంది. (ఆం.ప్ర. 7.10.88)

**ఆందోళనకారుడు** వి. *aandooLana kaaruDu* ఆందోళన జరిపే వ్యక్తి agitator ఆందోళనకారులతో సర్దుబాటు ధోరణి లేనే లేదు. తాడో పేడో తేల్చుకుం టామని, రాష్ట్ర ప్రభుత్వంకూడా దృఢమైన నిర్ణయానికి వచ్చింది. (ఆం.భూ. 19.4.88)

**ఆంధ్రోద్యమం** వి. *aandhroodyamam* ఆంధ్ర ప్రదేశ్‌ను విభజించి ఆంధ్ర ప్రాంత జిల్లాలను వేరే రాష్ట్రంగా చేయాలని సాగిన ఆందోళన ; ప్రత్యేక ఆంధ్రా ఉద్యమం Andhra agitation ... 1972లో అందులో నివాసం ఉన్న శ్రీ పి. వి. నరసిం హారావు ఆంధ్రోద్యమాన్ని ఎదుర్కొన్నారు. (ఆం.జ్యో 1.1.88)

**ఆకట్టుకొను** క్రి. *aakaTTukonu* ఇతరు లను తమకు అనుకూలంగా తిప్పుకొను to attract, win over ... ఇది రాజకీయ ప్రచారానికి, బి.సి.లను ఆకట్టుకు నేందుకు దోహదపడగలదనే అంచనా ఉంది. (ఆం.భూ. 26.5.89)

**ఆకర్షణ శక్తి** వి. *aakarSaNa śakti* వ్యక్తిగత ప్రత్యేకతలలో ఎదుటి వారిని ఆకట్టు కొని, ప్రభావితం చేసే సామర్థ్యం charisma శ్రీమతి గాంధీకి ఉన్న ఆకర్షణ శక్తి కారణంగానే అస్సాంలో కాంగ్రెస్(ఐ) గతంలో గెలుపొందిందని, రాజీవు గాంధీ సమయంలో ఓడిపోయిందని ఆయన వ్యాఖ్యా నించారు. (ఆం.ప్ర 22.8.89)

**ఆకలి చావు** వి. *aakali caavu* పేదరికం, కరువు కాటకాల కారణంగా తిండి లేక మర ణించటం starvation death భారత దేశంలో కరువు కారణంగా ఆకలి చావులు సంభవించాయన్న వార్తను భారత ప్రధాని రాజీవ్ గాంధీ ఖండించారని ... పేర్కొంది. (ఈ. 5.10.87)

**ఆకళించుకొను** క్రి. *aakaLincukonu* విష యాన్ని పూర్తిగా అవగాహన చేసుకొను; గ్రహించు to grasp నియమావళిని సవ రించకపోతే ప్రాప్తించే అనర్థత గురించి శ్రీ బూటాసింగ్ హెచ్చరిస్తే. ఆకళించుకోలేని దుస్థితిలో అకాలీలు లేరు. (ఈ. 5.7.89)

**ఆకస్మిక తనిఖీ** వి. *aakasmika tanikhii* ముందుగా తెలియజేయకుండా వెళ్ళి - కింది ఉద్యోగుల పనితీరుని పరి శీలించటం surprise inspection or check అనేక మారు మూల మండల కేంద్రాల్లో అధికారులు ఉండటం లేదన్న ఆరో పణలు పురస్కరించుకొని తాను ఆయా కేంద్రాల్లో ఆకస్మిక తనిఖీ జరిపానని- మంత్రి చెప్పారు. (ఆం.ప్ర. 2.9.89)

**ఆకస్మిక దాడి** వి. *aakasmika daaDi* శత్రు లక్ష్యాలపైన హఠాత్తుగా దెబ్బ తీసే ప్రయత్నం surprise attack, raid(on enemy's target) భారత శాంతి దళం వెళ్తున్న వాహనాలపై టైగర్లు ఆకస్మిక దాడులు జరిపి మోర్టార్లు రాకెట్లు ప్రయోగించటంతో ... (ఆం.భూ 17.11.89)

**ఆకాంక్షించు** క్రి. *aakaankSincu* మంచి జరగాలని కోరుకొను to hope, desire, wish for sth good ఇండో, గల్ఫ్ దేశాల మధ్య పారిశ్రామిక సంబంధాలు మరింత పెరగాలని, తద్వారా బీదరికం, నిరుద్యోగ సమస్యలు నిర్మూలన కావాలని ఆకాంక్షించారు. (ఈ 11.7.89)

**ఆకాశ రక్షణ** వి. *aakaaśa rakSaNa* శత్రువుల దాడి నుంచి దేశపు ఆకాశ సరిహ

ద్దులను కాపాడుకోవటం air defence, defence of air limits *ఆకాశ రక్షణ: పాకిస్తాన్‌తో శ్రీలంక చర్చలు* (ఆం.ప్ర. 9 6 87)

ఆకాశ హర్మ్యం వి. *aakaaśa harmyam* అనేక అంతస్థులతో కూడిన ఎత్తైన భవనం sky-scrapers *ఆకాశ హర్మ్యాల్లో సంభవించే అగ్ని ప్రమాదాలు అగ్ని మాపక దళాలు ఎక్కడా ఎదుర్కోని ప్రత్యేక సమస్యలు కల్పిస్తాయి.* (ఈ. 2 7 87)

ఆక్ట్రాయ్ పన్ను వి. *aakTraay pannu* దేశంలో ఒక రాష్ట్రం నుంచి మరో రాష్ట్రానికి తీసుకెళ్ళే సరుకులపై విధించే సుంకం octroi tax *ఆక్ట్రాయ్ పన్నుపై చర్చించడానికి అన్ని రాష్ట్రప్రభుత్వాలకు కేంద్రం కొన్ని మార్గ దర్శక సూత్రాలను ...* (ఆం.భూ. 30.6.87)

ఆక్రమణ వి. *aakramaNa* 1. (తమది కాని భూమిని) అక్రమంగా సొంతం చేసుకోవటం occupied country, illegal occupation, encrochment of land *కంపూచియా ఆక్రమణను ఖండించని ఇండియా* (ఆం.జ్యో 16.10 87) 2. (పోలింగ్ కేంద్రాన్ని) దౌర్జన్యంగా తమ స్వాధీనంలోకి తెచ్చుకోవటం capturing(as of a polling booth) *పోలింగ్ కేంద్రాల ఆక్రమణకు తాను వ్యతిరేకమని స్పష్టం చేశారు.* (ఈ. 24 11 89)

ఆక్రమించు క్రి. *aakramincu* 1. (పోటీలలో) నిర్ణీత స్థానాన్ని పొందు to occupy(a position in a contest or competition) *ఏడు మత పార్టీల కూటమి ఇస్లామిక్ డెమొక్రాటిక్ అలయన్స్ రెండవ స్థానం ఆక్రమించింది.* (ఆం.జ్యో 1.12.88) 2 (నిర్ణీత పరిమాణం గల ప్రదేశంలో) వ్యాపించి ఉండు to occupy, fill up, spread over an area *సైన్స్ ఎగ్జిబిషన్ పదహారువేల చదరపుటడుగుల ప్రదేశాన్ని ఆక్రమించిందనీ ముఖ్యాంశాలలో సైన్స్ ఎగ్జిబిషన్ పరిధిని కుదించి ...* (ఉ. 15.6.87)

ఆక్రమిత ప్రాంతం వి. *aakramita praantam* అక్రమంగా సొంతం చేసుకున్న భూభాగం occupied territory, enchroached area *ఆక్రమిత ప్రాంతాలలో ఇజ్రాయిల్ జరుపుతున్న ఆగడాలను ఐక్యరాజ్య సమితి ఖండించింది.* (ఆం.ప్ర. 22 4 89)

ఆక్షేపణ వి. *aakSeepaNa* ఇతరుల పని పట్ల వ్యక్తం చేసే అసమ్మతి; అభ్యంతరం objection *ఎం.సి.హెచ్‌ను సంప్రదించకుండా ప్రభుత్వం కార్పొరేషన్ అధికారాలను దత్తం చేసుకోవడం పట్ల ఆక్షేపణ తెలిపారు.* (ఆం.ప్ర. 16 6 87)

ఆగడం వి. *aagaDam* హింస, దౌర్జన్యంతో కూడిన చర్య atrocity *పోలీసు శాఖ ఎంత ప్రయత్నించినా టెర్రరిస్టుల ఆగడాలు ఆగటం లేదు.* (ఉ. 21.4.88)

ఆచరణ వి. *aacaraNa* (ఆచరణలు, సిద్ధాంతాలు మొ. వాటిని) నిజ జీవితంలో అమలు చేయటం practice (of a theory) *కమ్యూనిస్టు సిద్ధాంతమూ, ఆచరణా ఏ విధంగా ఉన్నాయో ఒకసారి పరిశీలిద్దాం.* (ఆం.ప్ర 21 8 89)

ఆచి తూచి క్రి.విణ. *aaci tuuci* పొరపాట్లకు అపార్థాలకు అవకాశం ఇవ్వని విధంగా cautiously *మా ప్రతినిధి అడిగిన ప్రశ్నలకు ఆయన ఆచి తూచి మరీ మాట్లాడారు.* (ఆం.ప్ర 23 6 87)

ఆచూకీ వి. *aacuukii* వ్యక్తుల ఉనికికి సంబంధించిన సమాచారం; జాడ

where-abouts ... రాములును గత ఫిబ్రవరి నెలలో పోలీసులు అర్ధరాత్రి నిర్బంధించి ఇంతవరకు అతని ఆచూకీ తెలియజేయక పోవటం పట్ల ... (ఆం.భూ. 21.4 89)

**ఆజ్యంపోయు** క్రి. *aajyampooyu* ఉన్న సంక్షోభాన్ని ఆగ్రహావేశాలను మరింతగా పెంచు to add fuel to the fire ఈ ప్రాంతాల్లో ఇప్పటికీ చెలరేగుతున్న అగ్నులకు ఇది ఆజ్యంపోస్తున్నది. (ఈ. 6.3 88)

**ఆటకట్టించు** క్రి. *aaTakaTTincu* ఎదుటి వారి ఆధిపత్యాన్ని, కార్యకలాపాలను పూర్తిగా దెబ్బతీసి నిర్వీర్యం చేయు to check, curb తమిళుల ప్రయోజనాలను దెబ్బతీసే శక్తుల ఆటకట్టించటానికే శాంతి సైన్యం కృషి చేస్తోంది. (ఆం.ప్ర. 28 12 87)

**ఆటపట్టు** వి. *aaTapaTTu* ఘర్షణలు లేదా రాజకీయాది కార్యకలాపాలకు అనువైన ప్రదేశం; నిలయం, నెలవు arena ఉప ఖండం అగ్ర రాజ్యాల ఆటపట్టు కావటానికి తానే కారణమవుతున్నది. (ఈ. 5 6.87)

**ఆటవిడుపు** వి. *aaTaviDupu* పని మధ్యలో దొరికే విరామం; విశ్రాంతి respite వారం రోజుల పాటు ఎడతెరిపి లేకుండా ప్రాక్టీసు చేసిన భారత్ క్రికెట్ బృందానికి ఆదివారం 'ఆటవిడుపు' లభించింది. (ఆం.జ్యో 14.9.87)

**ఆటుపోట్లు** వి. (బ.వ.) *aaTupooTlu* జీవితంలో ఎదురయ్యే కష్టాలు; ఒత్తిడులు ups and downs (in life) జీవితంలో ఎదురయ్యే ఆటుపోట్లను తృణప్రాయంగా స్వీకరిస్తూ, దేశసేవకు అంకితం కావాలని ఆయన కాడెట్లకు పిలుపునిచ్చారు. (ఈ. 15.6 89)

**ఆడిపోసుకొను** క్రి. *aaDipoosukonu* ఆదే పనిగా ప్రత్యర్థులను నిందించు to criticise with bias తెలుగు దేశం నాయకులు కేంద్ర ప్రభుత్వాన్ని, కాంగ్రెస్ పార్టీ కార్య కలాపాలను ఆడిపోసుకోవడం ... (ఆం.భూ 21.4 89)

**ఆత్మ న్యూనత** వి. *aatma nyuunata* తనను తాను తక్కువగా భావించుకోవటం feeling of inferiority ఆత్మ విమర్శ అనేది ఆత్మ న్యూనతగా మారరాదని ఆయన ప్రతిపక్షాలకు హితవు చెప్పారు. (ఈ. 3.5.89)

**ఆత్మ పరిశీలన** వి. *aatma pariśiilana* తాము చేస్తున్న పనుల మంచి చెడ్డలను తామే పరిశీలించి తెలుసుకోవటం introspection ... ఇటువంటి పరిస్థితులు ఏర్పడటానికి తామెంత బాధ్యులమనే విషయాన్ని పార్టీ కార్యకర్తలు ఆత్మ పరిశీలన చేసుకోవాలని ఆయన కోరారు. (ఆం.ప్ర 12.10.87)

**ఆత్మ ప్రబోధం** వి. *aatma praboodham* చూ. అంతరాత్మ ప్రబోధం; రక్షణ శాఖ అవినీతి కుంభకోణాల కారణంగా దేశ ప్రతిష్ఠ, గౌరవం దేశ విదేశీ స్థాయిలో మంట కలిసిన కారణంగా రానున్న రాష్ట్రపతి ఎన్నికలో కాంగ్రెసు వారు ఆత్మ ప్రబోధాన్ని పాటిస్తారన్న విశ్వాసాన్ని ... వ్యక్తం చేశారు. (ఈ. 9 7 87)

**ఆత్మ విశ్వాసం** వి. *aatma viśvaasam* తన శక్తి సామర్థ్యాలపై తనకున్న నమ్మకం self confidence ఇటీవల విఫలమవుతున్న రవిశాస్త్రి పాక్‌తో తొలి టెస్టు, తొలి ఇన్నింగ్స్‌లో 45 పరుగులు చేయడం వల్ల ఆత్మ విశ్వాసం చేకూరినట్లు కనిపించింది. (ఈ 21 11.89)

**ఆత్మ స్థైర్యం** వి. *aatma sthairyam*

ఎదురయ్యే సమస్యలను తట్టుకొని లక్ష్యం సాధించగలమనే ధీమా morale జిల్లాలో తమ పార్టీ కార్యకర్తలు, సానుభూతి పరుల్లో ఆత్మ స్థైర్యం పెంచే యత్నంలో నక్సలైట్లు ఈ దాడులు తీవ్రం చేశారని తెలుస్తోంది. (ఆం.ప్ర. 17 8 89)

ఆత్మహత్యా సదృశం వి. *aatma-hatyaa sadRśam* (తన చర్యల ద్వారా) తన వినాశనాన్ని కొని తెచ్చుకోవటం suicidal (action) ప్రభాకరన్ పట్టు వదలకుండా భారత సైన్యాలతో పోరాటానికి దిగారనీ, ఇది ఆత్మహత్యా సదృశమని ... (ఈ. 24.10.87)

ఆత్మావలోకనం వి. *aatmavalookanam* చూ. ఆత్మపరిశీలన; ఇందులో తమ వంతు బాధ్యత ఎంతన్నది కూడా న్యూఢిల్లీ ఆత్మావలోకనం చేసుకోవాలి. (ఈ. 5.6.87)

ఆత్మాహుతి వి. *aatmaahuti* తనకు తాను నిప్పంటించుకొని ప్రాణ త్యాగం చేయటం self-immolation మద్యానికి బానిసైన వ్యక్తి తుదకు ఆత్మాహుతి చేసుకొన్నాడు. (ఆం.భూ. 20.6.87)

ఆత్యయిక పరిస్థితి వి. *aatyayika paristhiti* చూ. అత్యవసర పరిస్థితి; ఇండియన్ ఎక్స్‌ప్రెస్ గ్రూపు పత్రికా సంస్థలపై జరిపిన దాడులను దేశంలో 'ఆత్యయిక పరిస్థితి' (ఎమర్జెన్సీ) విధించడానికి ముందు సూచనగా అభివర్ణించడం తప్పు అని అన్నారు. (ఆం.భూ. 4.9 87)

ఆదరా బాదరా క్రి.విశే. *aadaraa baadaraa* తగినంత ఆలోచన, వ్యవధి లేకుండా; హడావుడిగా hurry burry కర్షక పరిషత్తు ఎన్నికలు ఇంత ఆదరా బాదరా జరిపించాలన్న పట్టుదల ముఖ్యమంత్రిదే. (ఈ. 22.6.89)

ఆదర్శ గ్రామం వి. *aadarśa graamam* ఏదైనా పథకం కింద ప్రయోగాత్మకంగా సంక్షేమ కార్యకలాపాలను అమలు చేయటానికి ఎంపికైన ఊరు model village వయోజన విద్యా శాఖ ఆధ్వర్యంలో పైలట్ ప్రాజెక్టు కింద ప్రతి మండలంలోను ఆదర్శ గ్రామం పథకాన్ని ఈ నెల 15 నుంచి ప్రారంభించ నున్నట్లు వయోజన విద్యా శాఖ ... (ఆం.ప్ర. 4.5.89)

ఆదర్శ జిల్లా వి. *aadarśa jillaa* అన్ని రంగాలలో అభివృద్ధి చేయటానికి ప్రభుత్వం మచ్చుకి ఎంపిక చేసిన వెనుకబడిన జిల్లా model district రాష్ట్రంలో చిత్తూరు జిల్లాను ఆదర్శ జిల్లాగా చేయటానికి తోడ్పడాలని .... విజ్ఞప్తి చేశారు. (ఆం.భూ. 27.10.87)

ఆదాయపు పన్ను వి. *aadaayapu pannu* ఆదాయం ఒక పరిమితి దాటిన తర్వాత ఒక నిష్పత్తి ప్రకారం ప్రభుత్వానికి చెల్లించవలసిన సుంకం income tax ... ఇందిరా గాంధీ తిరిగి 1980లో అధికారంలోకి వచ్చాక మరోసారి పత్రిక ఆదాయపు పన్ను అంచనాలను అధికారులు తిరగతోడారు. (ఆం.ప్ర. 17.8.89)

ఆదుర్దా వి. *aadurdaa* పని తొందరగా చేయాలనే తపన anxiety (to do sth) తెలుగు భాషను ఏదో విధంగా పరిపాలనా భాషగా అమలు పరచాలన్న ఆదుర్దా అర్థం చేసుకోవచ్చు. (ఆం.భూ. 1.5 89)

ఆదేశించు క్రి. *aadeeśincu* 1. ఒక పని చేయవలసిందిగా ఉత్తర్వు లేదా ఆజ్ఞ జారీ చేయు to direct, order ఈ రిట్ పిటిషన్లను వచ్చే జూలై రెండో వారంలో ఒక డివిజన్ బెంచ్ ముందుంచాలని ఆయన ఆదేశించారు. (ఈ. 5.6 87) 2. (న్యాయ విచార

ణకు) ఏర్పాటు చేయు to order(an enquiry) ... రాష్ట్రపతి పాలన విధించ టంతో పాటు సుప్రీంకోర్టు ప్రస్తుత న్యాయ మూర్తి చేత విచారణకు ఆదేశించాలని వారు కోరారు. (ఆంజ్యో 8 4 88)

**ఆదేశిక సూత్రాలు** వి. *aadeeśika suutraalu* రాజ్యాంగం ప్రకారం ప్రజా శ్రేయస్సు కోసం ప్రభుత్వం, పాటించ వలసిన విధులు(చట్టాలను రూపొం దించేటప్పుడు ప్రభుత్వం వీటిని దృష్టిలో పెట్టుకోవలసి ఉంటుంది. కానీ మౌలిక హక్కుల విషయంలో లాగా వీటి అతిక్ర మణపై న్యాయస్థానాన్ని ఆశ్రయించటా నికి అవకాశం ఉండదు.) directive principles రాజ్యాంగాన్ని సవరించవచ్చు. అయితే అది ఆదేశిక సూత్రాలకు, ప్రాథమిక హక్కులకు భంగకరంగా ఉండరాదు అంటూ ఆయన ఇందుకు సుప్రీంకోర్టు తీర్పును ఉదా హరించారు. (ఆంప్ర 16 5 89)

**ఆధారం** వి. *aadhaaram* విషయాన్ని ధ్రువీకరించటానికి ఉపయోగ పడే వ్యక్తి లేదా పత్రం source దేశాయ్ అమెరికాకు భారత ప్రభుత్వ రహస్యాలను చేర వేశారన టానికి తన వద్ద రెండు ఆధారాలున్నట్లు హెర్ష్ తన గ్రంథంలో తెలియ జేయటం జరిగింది. (ఆంప్ర 23 9.89)

**ఆధారపడు** క్రి. *aadhaarapaDu* ఒక విషయం మరొక విషయం చేత నిర్ణయం అగు to depend on sth ప్రజలను మత ప్రాతిపదికపై విభజించ చూచే జాతి వ్యతిరేక శక్తుల పట్ల జమ్ము కాశ్మీర్‌లోని కాంగ్రెస్ అసమ్మతి వాదులు అనుసరించే వైఖరిని బట్టి మా నిర్ణయం ఆధారాపడి ఉంటుంది. (ప్రజా. 27.10.87)

**ఆధికారికం** వి. *aadhikaarikam* ప్రభుత్వం లేదా ఏదైనా సంస్థ పూర్తి బాధ్యత వహిస్తూ చేసేపని official ఇండి యాలో పాకిస్తాన్ హైకమీషనర్‌గా బషీర్ ఖాన్ బబ్బర్‌ను నియమించినట్లు నేడిక్కడ ఆధికారికంగా ప్రకటించారు. (ఆంప్ర. 18 10 89)

**ఆధిక్యం** వి. *aadhikyam* (పోటీలలో) ఎదుటి వారికన్నా ఎక్కువ పాయింట్లు, ఓట్లు మొ. సంపాదించటం lead(in sports elections etc.) ... ఆ జట్టుకు ఇప్పటికే *270* పరుగుల ఆధిక్యం లభించింది. (ఈ. 29 8 89)

**ఆధిక్యత** వి. *aadhikyata* చూ. ఆధిక్యం; ప్రథమార్ధం ముగిసే సరికి రాజస్థాన్ *4-0* ఆధిక్యత సంపాదించింది. (ఆంప్ర 29.7.89)

**ఆధిపత్యం** వి. *aadhipatyam* ప్రభుత్వం అధికారంలో ఉండటానికి అర్హత కలి గించే కనీస మెజారిటీ majority ... బొమ్మయ్ ప్రభుత్వం సభలో ఆధిపత్యం కోల్పోయినట్లు గవర్నర్ అభిప్రాయ పడ్డార న్నారు. (ఈ 22 4 89)

**ఆధునీకరణ** వి. *aadhunıikaraNa* ఉన్న వాటి రూపురేఖలు, సామర్థ్యాన్ని సమకా లీన సాంకేతిక జ్ఞానంతో మెరుగు పర చటం , నవీకరణ modernization కొత్తగూడెం విద్యుత్ కేంద్రం ఆధునీకరణ పని పూర్తికాగానే వార్షిక విద్యుదుత్పాదన *1125* మెగా యూనిట్లకు పెరగగలదని తెలి పారు. (ఆంభూ 20.4 88)

**ఆధ్వర్యం** వి. *aadhvaryam* కార్య నిర్వ హణ బాధ్యత వహించటం auspices,

aegis గతంలో కమ్యూనిస్టు పార్టీకి మంచి పలుకుబడి ఉన్న గ్రామంలో దాదాపు ఏడు సంవత్సరాల తర్వాత కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో బహిరంగ సభ జరిగింది. (విశా. 10 6.87)

**ఆనవాయితీ** వి. *aanavaayitii* ఎంతో కాలం నుంచి ఆచరిస్తూ వస్తున్నది; సంప్రదాయం, అలవాటు convention, practice సి.ఏ.జి. నివేదికలకు అత్యంత గౌరవం ఇవ్వటం ఆనవాయితీగా వస్తున్నది. (ఆం.భూ. 25.7.89)

**ఆపద్ధర్మ ప్రభుత్వం** వి. *aapaddharma prabhutvam* చట్ట సభలు రద్దయినప్పుడు తిరిగి ఎన్నికలు నిర్వహించి కొత్త ప్రభుత్వం ఏర్పాటయ్యే వరకు రాజ్యాంగాధినేత అనుమతి మేరకు కొనసాగే ప్రభుత్వం caretaker government లోక్ సభ రద్దయితే ఆపద్ధర్మ ప్రభుత్వంగా తన మంత్రి వర్గమే కొనసాగి ఉండేది. (ఆం.ప్ర. 28 7.89)

**ఆపద్ధర్మ ముఖ్యమంత్రి** వి. *aapaddharma mukhyamantri* మంత్రి వర్గం రాజీనామా చేసినపుడు కొత్త ప్రభుత్వం ఏర్పాటయ్యే వరకు రాజ్యాంగాధినేత కోరికపై కొనసాగే ముఖ్య మంత్రి caretaker chief minister ... అయితే ఆపద్ధర్మ ముఖ్యమంత్రిగా పదవిలో కొనసాగాల్సిందిగా బన్సీలాల్‌ను గవర్నర్ కోరారు. (ఆం.జ్యో 20.6 87)

**ఆపరేషన్ బ్లాక్‌బోర్డు** వి. *aapareeSan blaakboorDu* అన్ని పాఠశాలలకు మౌలిక సదుపాయాలు కల్పించే కార్యక్రమం Operation Black Board(programme meant for strengthening school education by providing basic facilities to all the Schools) ఆపరేషన్ బ్లాక్‌బోర్డు కింద గ్రామాల్లో పాఠశాల భవనాలను గత సంవత్సరం చేపట్టి పూర్తికాకుండా ఉన్న వాటిని రోజ్‌గార్ నిధులతో పూర్తి చేయాలని ఆయన కోరారు. (ఆం.ప్ర. 3.7.89)

**ఆపరేషన్ బ్లూస్టార్** వి. *aapareeSan bluusTaar* పంజాబ్ స్వర్ణ దేవాలయంలో తిష్ఠ వేసిన టెర్రరిస్టులను బైటకు వెళ్ళగొట్టటం కోసం తీసుకున్న సైనిక చర్య Operation blue star(a military operation meant for flushing out terrorists from the Golden Temple in Punjab) పంజాబ్ స్వర్ణ దేవాలయంలో ఆపరేషన్ బ్లూస్టార్ తరువాత తాను రాసిన లేఖపై ప్రభుత్వం ఆగ్రహించిందని ... చెప్పారు. (ఆం.భూ 4 6.89)

**ఆపాదించు** క్రి. *aapaadincu* లేనివి ఉన్నట్లుగా అంటగట్టి చెప్పు to attribute స్పీకర్‌కు ఉద్దేశాలు ఆపాదించటం మంచిది కాదని ఆయన చెప్పారు. (ఈ. 30.7 87)

**ఆమరణ నిరాహార దీక్ష** వి. *aamaraNa niraahaara diikSa* కోర్కెల సాధనకు అన్నపానీయాలు ముట్టకుండా మరణ పర్యంతం ఆందోళన చేయటం fast unto death డిమాండ్ల సాధన కోసం ఈనెల అయిదో తేదీ నుండి ఆమరణ నిరాహారదీక్షలో ఉన్న ... (ఆం.ప్ర. 11.5 89)

**ఆమోదం** వి. *aamoodam* ఒక పనికి తెలిపే అంగీకారం, సమ్మతి, అనుమతి approval, consent ఈ ఒడంబడికకు ఇండియా లాంఛన ప్రాయంగా ఆమోదం తెలపటం జయవర్ధనేకు విజయంవంటిది. (ఈ. 28.1 88)

**ఆమోద ముద్ర** వి. *aamooda mudra* ఒక విషయానికి అధికారికంగా తెలిపే అంగీకారం (official) consent or approval *అనేక మంత్రిత్వ శాఖల పద్దులను స్పీకర్ జక్కర్ చర్చ జరక్కుండానే సభ ఆమోదానికి పెట్టిన అనంతరం బడ్జెట్‌పై ఆమోద ముద్ర పడింది.* (ఈ 27.4.89)

**ఆమోదించు** క్రి. *aamoodincu* 1. ఒక పనికి తన సమ్మతిని వ్యక్తం చేయు to approve(sb's action) *కాంగీ పభ్యుల ప్రవర్తనను ప్రధాని బాహాటంగా ఆమోదించటాన్ని ఆ రోజు రాజ్యసభలో ఉన్న వారందరూ చూశారని బి.జె.పి. నాయకుడు ... చెప్పాడు.* (ఈ 26.2.88) 2. ఏదైనా తీర్మానాన్ని అంగీకరించు to pass (a resolution) *తమ శాసన సభ్యత్వానికి రాజీనామా చేయాలని డిమాండ్ చేస్తూ తెలుగు దేశం లెజిస్లేచర్ పార్టీ గురువారం నాడిక్కడ ఒక తీర్మానాన్ని ఆమోదించింది.* (ఆంప్ర 11.12.87)

**ఆమ్లవర్షం** వి. *aamlavarSam* (వాతావరణంలోని అతికాలుష్యం వల్ల) వృక్ష జాలానికి ప్రమాదకరమయిన రసాయనిక పదార్థాలతో కూడుకొని పడే వాన acid rain *నైరుతి చైనాలోని సిచువాన్ ప్రాంతంలో ఆమ్ల వర్షాలు ఆరు వేల హెక్టార్ల దేవదారు వనాన్ని 90 శాతం వరకు ధ్వంసం చేశాయని అధికార పత్రిక ... తెలిపింది.* (ఆంప్ర 21.10.87)

**ఆయకట్టు** వి. *aayakaTTu* చెరువులు( ప్రాజెక్టు) కాలువలు వంటి నీటి వనరుల కింద సాగయ్యే భూమి విస్తీర్ణం ayicut *శ్రీ రాంసాగర్ ప్రాజెక్టు ఆయకట్టు కింద గత సంవత్సరం 52 శతకోటి ఘనపుటడుగుల నీటిని 3.82 లక్షల ఎకరాల పంట భూమికి అందించారు.* (ఆంప్ర. 22.4.88)

**ఆయత్తమగు** క్రి. *aayattamagu* (కార్య సాధన కోసం తగిన) సన్నాహాలు పూర్తి చేసుకొను; సిద్ధమగు to be prepared, poised ... *దేశం 21వ శతాబ్దంలోకి ప్రవేశించేందుకు ఆయత్తమవుతుండగా న్యాయ పరిపాలనా విభాగం మాత్రం 19వ శతాబ్దంలోనే తచ్చాడుతోందని విమర్శించారు.* (ఈ. 4.7.89)

**ఆయారాం గయారాం** వి. *aayaaraam gayaaraam* స్వార్థమే పరమార్థంగా ఎప్పటికప్పుడు పార్టీలు మార్చే నాయకులు defectors *కాంగ్రెస్(ఐ) 36స్థానాలు సంపాదించి మైనారిటీలో పడింది. అయినా ... భజన్ లాల్ ఎత్తులు జిత్తులు ఫలించి ఆయారాం గయారాంల సాయంతో అధికారంలోకి రాగలిగింది.* (ఆంభూ 20.6.87)

**ఆయుధ పటిమ** వి. *aayudha paTima* అధునాతన యుద్ధ సామగ్రి ద్వారా ఒక దేశం సంపాదించుకున్నబలం military might, armed strength *ఏ దేశానికి కూడా తన ఆయుధ పటిమతో మానవాళిని పణంగా పెట్టే అధికారంలేదని అన్నారు* (ఆం.భూ 2.4.89)

**ఆయుధ పోటీ** వి. *aayudha pooTii* దేశాలు ఒక దానిని మించి మరొకటి ఆయుధాలు సమకూర్చుకోవడానికి ప్రయత్నించటం arms race *భారత దేశానికి ఎదురౌతున్న సమస్యలను ప్రస్తావిస్తూ ... ఆయుధ పోటీని గొంతెత్తి ఖండించినందుకు తమపై ఒత్తిడి తీసుకువస్తున్నారని ప్రధాని ఆరోపించారు.* (ఉ. 2.7.87)

**ఆయుధ సంపత్తి** వి. *aayudha sampatti* ఒక దేశం దగ్గర ఉన్న యుద్ధ సామగ్రి armed strength ... *శత్రు దేశాలు*

విభిన్న పద్ధతుల ద్వారా పెంచుకొంటున్నా ఆయుధ సంపత్తికి దీటుగా మనదేశం కూడా ఆయుధ సంపత్తిని పెంచుకోవలసిన అవసరం ... (ఆం.జ్యో 20.6.87)

**ఆయుధీకరణ** వి. *aayudhiikaraNa* ఆయుధాలను సమకూర్చటం arming ... మన రాష్ట్రంలో మనం 'ఆయుధీకరణ'కు పూనుకోవటం నిస్సందేహంగా తిరోగమన చర్య. (ఆం.ప్ర. 21.4 89)

**అరగాణి** వి. *aaragaaNi* చెరువులకు, నదులకు వర్షపు నీరు అందించే పరిసర ప్రాంతం catchment area ఇటీవల కృష్ణా అరగాణి ప్రాంతంలో పడిన భారీ వర్షాలకు శ్రీశైలం నాగార్జున సాగర్ రిజర్వాయర్‌లలో నీటి మట్టం పెరగటంతో ... (ఈ. 13.10.87)

**ఆరాతీయు** క్రి. *aaraatiiyu* ఏదైనా గోప్యమైన విషయానికి సంబంధించిన వివరాలు సేకరించు to probe, enquire మంత్రుల గైరు హాజరుకు కారణ మేమిటో ఆరాతీస్తున్నానని, అది తెలిసాక రాజీనామాలపై నిర్ణయం తీసుకుంటానని శ్రీ దేవిలాల్ తెలిపారు. (ఈ. 29.7.89)

**ఆరుతడి** వి. *aarutaDi* మెట్ట పంటలకు మాత్రమే సరిపోయేటట్లుగా అప్పుడప్పుడు సేద్యపు నీరు అందించటం periodical supply of water for dry crops ... శ్రీరాంసాగర్ ప్రాజెక్టు కింద రెండున్నర లక్షల 76 వేల ఎకరాలకు, రబీ సీజనులో ఆరుతడి కింద మెట్ట పంటలకు నీటి సరఫరా చేయాలని ... నిర్ణయించింది. (ఆం.జ్యో 16.10 87)

**ఆరుబైలు జైలు** వి. *aarubailu jailu* ఖైదీలు ఎల్లప్పుడూ గదులకే పరిమితం కాకుండా, పరిమిత స్వేచ్ఛతో తిరుగాడే అవకాశం ఉన్న జైలు open air jail ... వారిని నిర్బంధంలో ఉంచాలన్న కక్ష సాధింపు ఆలోచన ప్రభుత్వానికి లేదని "ఆరుబైలు జైళ్ళు" కూడా ఏర్పాటు ... (ఆం.జ్యో. 5.10.88)

**ఆరోపణ** వి. *aaroopaNa* 1. తప్పుడు పని లేదా నేరానికి పాల్పడినట్లు చేసే నిందాత్మకమైన ప్రకటన allegation, accusation శ్రీ రెడ్డి విలేఖరుల సమావేశంలో తెలుగు దేశం పార్టీ ఎన్నికల కమిటీ కన్వీనరుపై తాజాగా మరొక ఆరోపణ చేశారు. (ఆం.జ్యో.18.11.87) 2. న్యాయస్థానంలో ఒక వ్యక్తిపై మోపే నేరం charge ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావుపై కోర్టులో నిరాధారమైన 193 ఆరోపణలు చేసిన శ్రీ ద్రోణంరాజు సత్యనారాయణకు ... (ఆం.ప్ర. 13 4.88)

**ఆరోపించు** క్రి. *aaroopincu* ఇతరులు తప్పుడు పనికి లేదా నేరానికి పాల్పడినట్లు ప్రకటించు to allege, accuse కర్ణాటకలో శాసన సభ్యులను కొనటానికి బేరాలు జరిగాయని దేశ వ్యవహారాల మంత్రి బూటాసింగ్ ఆరోపించారు. (ఈ. 26.5.89)

**ఆర్జించు** క్రి. *aarjincu* ధనం, ఆస్తులు, పేరు మొ. సంపాదించు to earn 1953-83 సంవత్సరాల మధ్య సినీ నటుడుగా తాను 108 కోట్ల రూపాయలు ఆర్జించానని చెప్పటం సత్యదూరమని ... ప్రముఖ సినీ నటుడుగా తాను కొన్నాళ్ళపాటు బాగా ఆర్జించిన విషయం నిజమేనన్నారు. (ఆం.ప్ర. 10.12.87)

**ఆర్జిత సెలవు** వి. *aarjita selavu* పర్మనెంటు ఉద్యోగుల ఖాతాలో సంవత్సరాంతంలో చేరే కాలదోషం పట్టని సెలవు దినాలు earned leave ప్రస్తుతం పాత

శాలల్లో పనిచేసే సిబ్బంది ... ఆర్జిత సెలవు తీసుకోవాలన్న డి.ఇ.ఓ. కార్యాలయం చుట్టూ తిరగాల్సి ఉంటుంది. (ఈ. 8.9 87)

ఆర్ట్ సినిమా వి. *aarT sinimaa* వ్యాపార దృష్టి లేకుండా కళాత్మక విలువలతో తీసిన సినిమా art movie ... తెలుగు నాట ఆర్ట్ సినిమా అనే ఆలోచనను సజీవంగా ఉంచటానికి కృషి చేస్తున్నారు. (ఆం.ప్ర. 23.2.89)

ఆర్డర్లీ విధానం వి. *aarDarlii Vidhaanam* పోలీసు కానిస్టేబుళ్ళు తమ పై అధికారుల ఇళ్ళల్లో చాకిరీ చేసే సంప్రదాయం orderly system ... బ్రిటి ష్ పోలీస్ వ్యవస్థలోని బానిస విధానాన్ని గుర్తుకు తెచ్చే ఆర్డర్లీ విధానాన్ని రద్దు చేయాలని ... కోరారు. (ఆం.ప్ర. 23 8.89)

ఆర్డినెన్స్ వి. *aarDinens* చట్ట సభ, సమావేశాల్లో లేనప్పుడు తక్షణ అవసరాల కోసం గవర్నర్ లేదా రాష్ట్రపతి ద్వారా ప్రభుత్వం జారీ చేసే ఉత్తర్వు ordinance మండలానికో 'న్యాయ పంచాయతీ'ని ఏర్పాటు చేసేందుకు త్వరలో ఆర్డినెన్స్ ద్వారా చట్టం అమలులోకి తేనున్నట్లు ... వెల్లడించారు. (ఈ. 19 7.89)

ఆర్థిక క్షామం వి. *aarthika kSaamam* దేశంలో తీవ్రమైన నిధుల కొరత వలన ఏర్పడిన దుర్భర పరిస్థితి financial drought కరువు కాటకాలకు దాదాపు నిలయంగా మారిపోయిన ఆఫ్రికా ఖండం ఇపుడు కొత్త రకమైన కరువు నొకదాన్ని ఎదుర్కొంటోంది. ఆర్థిక శాస్త్రనిపుణులు దానికి "ఆర్థిక క్షామం" అని పేరు పెట్టారు. (ఈ. 6.7 87)

ఆర్థిక దిగ్బంధం వి. *aarthika digbandham* ఒక ప్రాంతాన్ని చుట్టు ముట్టి బయటి ప్రపంచంతో ఆర్థిక, వాణిజ్య కార్యకలాపాలు జరగనీయకుండా నిరోధించటం economic blockade తమిళుల ఊచకోత జాఫ్నాపై ఆర్థిక దిగ్బంధం వల్ల పరిస్థితి మరింత విషమించిందని శ్రీ తివారి చెప్పారు. (ఆం.ప్ర. 9.6 87)

ఆర్థిక నేరం వి. *aarthika neeram* పన్నుల చెల్లింపు వంటి ఆర్థిక విషయాల్లో ప్రభుత్వాన్ని మోసగించటం economic offence రాబడి పన్ను, సంపద పన్ను చట్టాల ఉల్లంఘన నేరం ఆరోపిస్తూ తనపై, తన కుటుంబ సభ్యులపై దాఖలయిన కేసుల సందర్భంగా ముఖ్యమంత్రి ... ఆర్థిక నేరాలకు సంబంధించిన ప్రత్యేక కోర్టుకు హాజరవుతారు. (ఆం.భూ. 19.4.88)

ఆర్థిక నేరస్తుడు వి. *aarthika neerastuDu* ఆర్థిక నేరాలకు పాల్పడిన వ్యక్తి economic offender ఆర్థిక నేరస్తులకు రాజీవ్ రక్షణ- శ్రీ రామ కృష్ణ హెగ్డే ఆరోపణ.

ఆర్థిక పరివర్తన వి. *aarthika parivartana* ఒక దేశం ఆర్థిక స్వరూపాన్ని సమూలంగా మార్చటం; ఆర్థిక పునర్ వ్యవస్థీకరణ financial restructuring మాల్దీవుల్లో ప్రస్తుతం జరుగుతున్న చారిత్రాత్మకమైన ఆర్థిక పరివర్తనలో పాల్గొనే అవకాశం లభించినందుకు భారత దేశం గర్విస్తున్నదని ఆయన అన్నారు. (ఆం.ప్ర. 26.7.89)

ఆర్థిక ప్రతిష్టంభన వి. *aarthika pratiSTambhana* ప్రభుత్వ ఆదాయ వ్యయాలకు పొత్తు కుదరక ఏ పని జరగక నిలిచిపోయే పరిస్థితి financial stalemate రాష్ట్రాల ఆదాయపు వనరులకూ, రాష్ట్ర ప్రభుత్వాలు నిర్వహించవలసిన సంక్షేమ కార్యక్రమాల వ్యయానికి పొత్తు

కుదరనందువల్ల ఆర్థిక ప్రతిష్టంభన ఏర్పడి .. (ఉ. 22.8 87)

**ఆర్థిక బిల్లు** వి. *aarthika billu* చట్ట సభల్లో నిధుల మంజూరుకు ఉద్దేశించిన శాసనం చిత్తుప్రతి money bill అనేక కొత్త పొదుపు పథకాలతో కూడిన ఆర్థిక బిల్లును నేడు లోక్ సభ ఆమోదించింది. (ఆంప్ర. 3 5 89)

**ఆర్థిక వనరులు** వి. (బ.వ.) *aarthika vanarulu* ప్రభుత్వానికి ఆదాయాన్ని సమకూర్చే మార్గాలు financial resources తగిన ఆర్థిక వనరులతో ప్రాతిపదిక వ్యవస్థతో అంతర్గత జలమార్గాలను అభివృద్ధి పరచడానికి సమన్వయ పూర్వక జాతీయ ప్రణాళికను ఇప్పటి వరకు రూపొందించలేదు (ఈ. 5.7 89)

**ఆర్థిక సంక్షోభం** వి. *aarthika sankSoobham* ఉత్పత్తులు పడిపోయి, వనరులు తగ్గిపోవటంవల్ల ఏర్పడే ఆర్థిక దుస్థితి financial crisis దేశం ఆర్థిక సంక్షోభంలో కొట్టు మిట్టాడు తున్నప్పుడు ప్రతిపక్షాలు తలపెట్టిన బంద్ దేశ ప్రయోజనాలకు పూర్తిగా హాని కలిగించేదని ... అన్నారు (ఆంప్ర 29 8 89)

**ఆర్థిక సంవత్సరం** వి. *aarthika samvatsaram* ప్రభుత్వ, ప్రభుత్వేతర ఆదాయ వ్యయాల లెక్కల ముగింపుకై ఏర్పాటయిన 12 నెలల కాలం (ఏప్రిల్ మొదటి నుంచి మార్చి చివరి వరకు) financial year, fiscal year; ఈ ఆర్థిక సంవత్సరం ఎంపిక చేసిన 10 మండలాల్లో 35 మంది మహిళలకు ఆర్థిక సహాయం అందజేయాలని కలెక్టర్, జిల్లా స్త్రీ సంక్షేమాధికారిని కోరారు. (ఆంప్ర 3 7 89)

**ఆర్థిక సహాయం** వి. *aarthika sahaayam* డబ్బు రూపంలో ఇచ్చే మద్దతు financial assistance అఖిల భారత కాంగ్రెస్(ఐ) కమిటీ నుండి 15 లక్షల ఆర్థిక సహాయాన్ని కూడా ప్రధాని ప్రకటించారు. (ఉ. 15 10 88)

**ఆర్థిక స్వాతంత్ర్యం** వి. *aarthika svaatantryam* ఇతరులపై ఆధారపడకుండా ద్రవ్య విధానాలు స్వేచ్ఛగా రూపొందించ గలిగే స్థితి economic freedom మాట్లాడ్డానికి అయితే స్వాతంత్ర్యం వచ్చింది. కాని 40 ఏళ్ళయినా దేశంలో ఆర్థిక స్వాతంత్ర్యం రాలేదని ఆయన ఆరోపించారు (ఉ 8.4 88)

**ఆలనా పాలనా** వి. *aalanaa paalanaa* (ఆరంభ దశలో) ఒక సంస్థ నిర్వహణను జాగ్రత్తగా పర్యవేక్షించటం care ఎన్నికలు జరిగి రైతు ప్రతినిధులు బాధ్యతలు స్వీకరించే వరకు కర్షక పరిషత్ ఆలనా పాలనా చూడటానికి రాష్ట్ర స్థాయిలో ఒక అడ్‌హాక్ బాడీని సృష్టించారు. (ఈ 26 5 89)

**ఆలయ లాంఛనాలు** వి. (బ.వ.) *aalaya laanchanaalu* ప్రముఖులు సందర్శించినపుడు దేవాలయం తరపున చేసే సంప్రదాయ సిద్ధమైన మర్యాదలు temple rituals స్వామిజీ తిరుపతి సిటీలోకి ప్రవేశించినప్పుడు గోవిందరాజ స్వామి ఆలయం వద్ద టి.టి.డి అధికారులు సకల ఆలయ లాంఛనాలతో స్వాగతం చెప్పారు. (ఆంభూ 3 7.87)

**ఆలవాలం** వి. *aalavaalam* అవాంఛనీయ విషయాలకు లేదా అసామాన్య సంఘటనలకు మూలం; నెలవు fountain-head, centre అవినీతికి ఆలవాలమై భూస్వామ్య విధానాలకు ప్రతిరూపమైన ప్రభుత్వం మరెంతో కాలం మను

గడ సాగించలేదని, దీనికి త్వరలోనే నూకలు చెల్లుతాయని ఆయన జోస్యం చెప్పారు. (ఆంభూ. 2.5.89)

**ఆలోచనచేయు** క్రి. *aaloocanaceeyu* ఒక పనికి సంబంధించిన సాధ్యాసాధ్యాలను గురించి నిశితంగా పరిశీలించు to contemplate ఇంకా కొంచెం ముందుకు వెళ్ళి కాంగ్రెస్(ఐ) తో కలిసి మిశ్రమ ప్రభుత్వం ఏర్పాటు చేయవచ్చని గూడా . ... ఆలోచన చేసినట్లు వార్తలు ఉన్నాయి. (ఈ. 4.11.88)

**ఆలౌట్** వి. *aalauT* క్రికెట్ ఆటలో టీములోని బ్యాట్స్‌మెన్ అందరూ(పది మంది) తమ వికెట్లను కోల్పోవటం allout ఇండియా 183 పరుగులకే 'ఆలౌట్' కావటంతో ఇండియా పని అయిపోయిందని క్రికెట్ పండితులు జోస్యం చెప్పారు. (ఆంప్ర. 8 10 87)

**ఆవహించు** క్రి. *aavahincu* కోపం, నిరాశ వంటి భావాలు మనసుని ఆక్రమించుకొను to seize(the mind as a negative passion like despair, depression etc.) ప్రధాన మంత్రి రాజీవ్ గాంధీ నానాటికీ పట్టు కోల్పోతున్నారు. దాంతో ఆయన్ని నిరాశ ఆవహిస్తోంది ... (ఈ. 26 8 89)

**ఆవిర్భవించు** క్రి. *aavirbhavincu* వెలుగులోనికి వచ్చు to emerge రాష్ట్ర కాంగ్రెస్‌లో శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డి అసమ్మతి వర్గ నాయకుడుగా ఆవిర్భవించిన తర్వాత శ్రీ జనార్ధన రెడ్డి కొంతకాలం వెంగళరావుకు సన్నిహితం అయ్యారు. (ఆంజ్యో. 13.11 88)

**ఆవిర్భావ సదస్సు** వి. *aavirbhaava sadassu* ఏదైనా ఒక కొత్త సంస్థ రూపు రేఖలు రచించటానికి ఏర్పాటైన తొలి సమావేశం preparatory convention లోక్ దళ్ అధ్యక్షుడు హెచ్.ఎన్. బహుగుణ, జనమోర్చా కన్వీనర్ రామ్‌ధన్ కూడా 'జనతా దళ్' ఆవిర్భావ సదస్సుకు హాజరుకాలేదు. (ఆంజ్యో. 12.10.88)

**ఆవిష్కరించు** క్రి. *aaviSkarincu* 1. ఏదైనా ఒక కొత్త పుస్తకం, విగ్రహం మొ. వాటిని లాంఛనంగా ప్రజల సమక్షంలో వాటి మీద కట్టిన రిబ్బన్ ఉన్న కాగితం లేదా తెరను తొలగించి ప్రదర్శించు to launch, unveil (a book, statue etc.) ... పుస్తకాన్ని ఆవిష్కరించి మొదటి ప్రతిని డాక్టర్ నరోత్తమ్ పూరికి బహూకరించారు. (ఆం.జ్యో. 5 6.87) అంజయ్య తైల వర్ణ చిత్ర పటాన్ని గవర్నర్ ఆవిష్కరించారు. (ఆంజ్యో 19 10.87) 2. (జెండాను) ఎగుర వేయు to hoist(a flag) ఈ సదస్సులో పార్టీ పతాకాన్ని పార్టీ వ్యవస్థాపకుల్లో ఒకరైన వసంత నాగేశ్వర రావు ఆవిష్కరించి, పతాకాన్ని గురించి వివరించారు. (ఈ. 8.5 89)

**ఆశాజనకం** వి *aaśaajanakam* భవిష్యత్తు సంతృప్తికరంగా ఉంటుందనే నమ్మకం కలిగించేది promising, encouraging, hopeful మార్కెట్ పరిస్థితి మెరుగు పడటంవల్ల డి.ఎం.టి. ధరలు తగ్గుముఖం పట్టటంవల్ల జరుగుతున్న సంవత్సరానికి పని తీరు మరింత ఆశాజనకంగా ఉంటుందని ... తెలిపింది. (ఈ. 25.8.89)

**ఆశాభావం** వి. *aaśaabhaavam* మంచి జరుగుతుందనే తలంపు hope స్వాతంత్ర్య సమర యోధుల నాయకత్వంలో గ్రామాలలో శాంతి కమిటీలు ఏర్పరిస్తే మంచి ఫలితాలు ఉంటాయని ఆయన ఆశాభావం

వ్యక్తం చేశారు. (ఆం.భూ 28.8 89)

**ఆశ్రమ పాఠశాల** వి. *aaśrama paa-Thaśaala* విద్యార్థులకు వసతి సౌకర్యాలు కలిగించి శ్రద్ధగా చదువు చెప్పే ప్రభుత్వం నడిపే బడి residential school ... వెనుక బడిన వర్గాల వారి పిల్లలకోసం రాష్ట్రంలో మరి మూడు ఆశ్రమ పాఠశాలలు ఏర్పాటు చేస్తున్నారు. (ఆం.భూ. 28.7 87)

**ఆశ్రయ కల్పనా సంవత్సరం** వి. *aaśraya kalpanaa samvatsaram* ప్రజలకు గృహ వసతి కల్పించటం ఒక ఉద్యమంగా ప్రభుత్వాలు చేపట్టిన సంవత్సరం year of house building అంతర్జాతీయ ఆశ్రయ కల్పనా సంవత్సరాన్ని పురస్కరించు కొని తపాల శాఖ నిన్న రంగుల స్టాంపును విడుదల చేసింది. (ఆం.ప్ర. 7.10 87)

**ఆశ్రయించు** క్రి. *aaśrayincu* తప్పని సరి పరిస్థితుల్లో ఒక పద్ధతిని అనుసరించు; ఆధార పడు to resort to sth, recourse to sth ... దీని వల్ల ద్రవ్యోల్బణం వత్తిడి ఎక్కువ అవుతుందని కొందరు నిపుణులు హెచ్చరికలు చేస్తూనే ఉన్నా, గత్యంతరం కనిపించక కేంద్ర ప్రభుత్వం ఏటా ఈ విధానాన్ని ఆశ్రయిస్తూనే వుంది. (ఆం.ప్ర. 20.9.87)

**ఆశ్రిత పక్షపాతం** వి. *aaśrita pak-Sapaatam* తమ సన్నిహితులైన వ్యక్తులకు అర్హతలు లేకున్నా పదవులు, ఇతర సౌకర్యాలు కట్టబెట్టడం favouritism విచ్చల విడి, లంచగొండి తనం, ఆశ్రిత పక్షపాతం ఈ సంస్థల్లో ఉన్నది. (ఆం.ప్ర 26 4.89)

**ఆషామాషీ** వి. *aaShaamaaShii* చాల తేలికైన విషయం light, easy, simple, unimportant బోఫోర్స్ వ్యవహారంపై సి.ఎ.జి. సమర్పించిన నివేదికను ఆషామాషీగా తీసుకోవటానికి వీల్లేదని ... అన్నారు. (ఈ. 21.8.89)

**ఆస్కారం** వి. *aaskaaram* అనుమానం, వైషమ్యం మొ. ఏర్పడటానికి ఉన్న అవకాశం; చోటు, తావు scope, room ... భారత్ శ్రీలంక నిర్ణయించు కుంటే అనవసరపు వైషమ్యాలకు ఆస్కారం లేకుండా చేసుకోవచ్చని ... (ఆం.ప్ర 6.6 87)

**ఆహార సంక్షోభం** వి. *aahaara sankSoobham* (దేశంలో) తిండి గింజల ఉత్పత్తి అవసరాలకు ఏ మాత్రం చాలక పోవడంవ ఏర్పడే తీవ్ర కొరత లేదా గడ్డు పరి తి food crisis ఆసియాను ఆహార సం ం నుండి పచ్చ పైరుల విప్లవం కాపాడింది. (ఆం.ప్ర. 14.10 87)

**ఆహార సరుకులు** వి. (బ.వ.) *aahaara sarukulu* బియ్యం పప్పులు మొ. నిత్యావసర వస్తువులు food stuff ముట్టడికి గురైన జాఫ్నా తమిళులు అత్యవసర మందులు, ఆహార సరుకులను విమానాల నుండి ... (ప్రజా 5 6 87)

**ఆహుతిఅగు** క్రి. *aahutiagu* అగ్ని ప్రమాదాలు లేదా హింసాత్మక సంఘటనల్లో ప్రాణాలు కోల్పోవు to get killed టెర్రరిస్టులు సృష్టించిన మరో బీభత్సకాండలో ఒకే కుటుంబానికి చెందిన ఎనిమిది మంది ఆహుతి అయ్యారు. (ఉ. 15 6 87)

**ఆహూతులు** వి. (బ.వ.) *aahuutulu* సభలకు, సమావేశాలకు పిలవగా వచ్చినవారు invitees అంతకు ముందు ఎన్. పి. సి. ఎల్. చైర్మన్ శ్రీ వి. ఎన్. నాదకర్ణి ఆహూతులకు స్వాగతం చెప్పారు. (ఆం.భూ 1.5 89)

## ఇ

**ఇంగితజ్ఞానం** వి. *ingitajnaanam* చుట్టూ ఉన్న ప్రపంచాన్ని పరిశీలించడం ద్వారా వచ్చే మామూలు తెలివి తేటలు; సాధారణ జ్ఞానం common sense ఇంగిత జ్ఞానం ఉన్న వారెవరైనా ఇలాంటి అభిప్రాయానికి ఎలా వస్తారో నాకు అర్థంకాదు. (ఈ 8.9 89)

ఇంజక్షన్ వి. *injakSan* ఒక వ్యక్తి లేదా సంస్థ కా కలాపాలను నిరోధిస్తూ న్యాయ స్థానం ఇ ౹ లిఖిత పూర్వకమైన ఆదేశం injunct on ముఖ్యమంత్రి ఇక అధికారంలో కొనసాగకుండా తక్షణం ఇంజక్షన్ జారీ చేయాలని ఆయన వాదించారు. (ఆం.భూ. 6.6 89)

ఇంటర్‌పోల్ వి. *inTarpool* నేర కార్యకలాపాల నిరోధంకోసం ఏర్పాటైన అంతర్జాతీయ నేర పరిశోధనా సమాఖ్య Interpol(International Police Commission) ... 9 వ ఇంటర్ పోల్ ఆసియా ప్రాంతీయ సమావేశానికి 39 ఇంటర్‌పోల్ దేశాల నుండి 80 మంది భద్రతాధికారులు హాజరయ్యారు. జపాన్ జాతీయ పోలీస్ ఏజెన్సీ ఏర్పాటు చేసిన ఈ సమావేశంలో ప్రధానంగా ఆసియాలో నేరస్తుల సమస్య, మత్తు పదార్థాల దొంగ రవాణా సమస్యలపై చర్చలు కేంద్రీకరించబడుతాయని ... (విశా 3 7 87)

ఇంటర్‌వెన్షన్ వి. *inTarvenSan* సమస్య ఉత్పన్నమయినప్పుడు పరిష్కరించడానికి బాధ్యతాయుతమైన వ్యక్తి లేదా సంస్థ కలుగజేసుకోవటం; జోక్యం intervention ఈ పిటిషన్ వల్ల చెలరేగిన సమస్యల వలయం నుంచి బోర్డును రక్షించడానికి ఐదు రాష్ట్రాల క్రికెట్ సంఘాలు నేడు సుప్రీంకోర్టులో ఇంటర్ వెన్షన్(జోక్యం) పిటిషన్లు దాఖలు చేశాయి. (ఆం.ప్ర 9 9 89)

ఇంటర్‌సర్వీసెస్ వి. *inTarsarviises* వివిధ ప్రభుత్వ సంస్థల మధ్య జరిగేవి (ఆటల పోటీలు) interservices ఇండియన్ నేవీ - ఇండియన్ ఎయిర్ ఫోర్సు జట్ల మధ్య జరుగుతున్న ఇంటర్ సర్వీసెస్ క్రికెట్ ఛాంపియన్‌షిప్ పోటీల సెమీ ఫైనల్స్‌లో ... పరుగులు చేసింది. (ఈ 5 6.87)

ఇంటరాగేట్‌చేయు క్రి. *inTaraageeT-ceeyu* (పోలీసు అధికారులు) సమాచారం రాబట్టేందుకు నిందితులను తీవ్రంగా ప్రశ్నించు to interrogate పది రోజుల పాటు నలుగురు విదేశీయుల్ని వివిధ ఇంటలిజెన్స్ సంస్థలు క్షుణ్ణంగా ఇంటరాగేట్ చేశాయి. (ఈ 28.6 89)

ఇంటరాగేషన్ వి. *inTaraageeSan* పోలీసులు నేర పరిశోధనలో భాగంగా వ్యక్తుల్ని ఒత్తిడి చేస్తూ ప్రశ్నించటం interrogation ఇంటరాగేషన్ సందర్భంగా పోలీసులు పెట్టిన చిత్రహింసలకు తట్టుకోలేక డాక్టర్ రామమోహన్ గుప్తా మరణించారు. (ఆం జ్యో 18.6 87)

ఇంటలిజెన్స్ బ్యూరో వి. *inTalijens byuuroo* శాంతి భద్రతలకు సంబంధించిన రహస్య సమాచార సేకరణ, విశ్లేషణ జరిపే కేంద్ర ప్రభుత్వ గూఢచారి సంస్థ intelligence bureau ఇటీవల ఇంటలిజెన్స్ బ్యూరో ఉన్నతాధికారి ఒకరు అమృతసర్ జిల్లా జైలులో నిర్బంధంలో ఉన్న శ్రీ తోహ్రాను కలుసుకున్నప్పుడు ఆయన తమ వైఖరిని స్పష్టం చేశారు. (ఆం.జ్యో 27 4 89)

ఇంటెన్సివ్‌కేర్ యూనిట్ వి. *in-Tensivkeer yuuniT* ఆరోగ్య పరిస్థితి బాగా ఆందోళనకరంగా ఉన్నప్పుడు, ఆపరేషన్ తర్వాత రోగుల చికిత్స కోసం ఆస్పత్రిలో ప్రత్యేకంగా ఉన్న ఒక విభాగం intensive care unit ఆపరేషన్ తర్వాత అతన్ని ఇంటెన్సివ్‌కేర్ యూనిట్‌లో పెట్టి వైద్యులు గమనిస్తున్నారు. (ఉ. 15 6 87)

ఇంటెరిమ్ విశే. *inTerim* తుది నిర్ణయం

కోసం ఆగకుండా మధ్యలోనే అప్పటి పరిస్థితిని బట్టి నిర్ణయించేది; తాత్కాలిక, మధ్యంతర interim ఒక ఇంటెరిమ్ ఆర్డరు ద్వారా సభా సంఘం ఏర్పాటును నిలిపివేసిన హైకోర్టు రేపు శాసన సభ కార్యకలాపాలను ఒక్క అంగుళం మేరకూడా కదలనివ్వకపోవచ్చునన్న ఆందోళనను సభ్యులంతా వ్యక్తం చేశారు. (ఉ. 14.8.87)

**ఇండియన్ మార్కెట్ రిసెర్చ్ బ్యూరో** వి. *inDiyan maarkeT riserc byuuroo* విపణి వీధిలో వస్తువుల క్రయ విక్రయాల ధోరణులను పరిశీలించే పరిశోధనా సంస్థ Indian Market Research Bureau *'సండే' వార పత్రిక ఆధ్వర్యంలో ఇండియన్ మార్కెట్ రిసెర్చ్ బ్యూరో(ఐ.ఎం.ఆర్.బి) ఈ నెల 2వ తేదీ నుంచి 5 రోజుల పాటు ఈ సర్వే నిర్వహించింది.* (ఆం.ప. 24.9.87)

**ఇంధన నిధి** వి. *indhana nidhi* అపారమైన విద్యుత్ నిల్వలు energy treasure *భౌతిక శాస్త్ర రంగంలో అనూహ్యమైన విజయాలు సాధించిన అమెరికా శాస్త్రవేత్తలే తరగని విద్యుత్ సంపద సృష్టించబోతున్నారు ... శాస్త్రవేత్త జరిపిన ప్రయోగం వల్ల ఇప్పుడు యావత్ మానవాళికి "ఇంధన నిధి" లభించబోతుంది.* (ఆం.జ్యో 18.9.87)

**ఇతోధికంగా** క్రి.విశే. *itoodhikangaa* అవసరాలకు సరిపడినంతగా; చాలినంతగా, తగినంతగా sufficiently, adequately *1. పంచాయితీలకు ఇతోధికంగా నిధులు దక్కాలన్న సదాలోచన హర్షణీయమే.* (ఈ 8.5.89) *2. ఉభయ సభల్లోనూ వివేచన, ఓర్పు, సహనం ఇతోధికంగా ఉండాలి అని సోవియట్ నాయకుడు అన్నట్లు 'టాస్' తెలిపింది.* (ఈ 16.5.89)

**ఇతోధికమగు** క్రి. *itoodhikamagu* ఉన్నదాని కన్నా ఎక్కువగు; పెరుగు to increase *ఏజెన్సీ ప్రజలకు ఉపాధి అవకాశాలు ఇతోధికమవుతాయి.* (ఈ. 8.3.88)

**ఇదమిత్థంగా** క్రి.విశే. *idamitthangaa* అనుమానాలకు తావులేకుండా; ఖచ్చితంగా, స్పష్టంగా surely, definitely *నెల రోజులు గడిచినప్పటికీ శ్రీ పెండేకంటి వెంకట సుబ్బయ్యగారు అప్పుడు రాజీనామా చేసిందీ లేనిదీ ఎవరూ ఇదమిత్థంగా చెప్పలేక పోతున్నారు.* (ఆం.ప్ర 26.4.89)

**ఇనుపతెర** వి. *inupatera* వ్యక్తులు, సంస్థలు లేదా దేశాల మధ్య స్వేచ్ఛా సంబంధాలను నిరోధించే వ్యవస్థా పరమైన అడ్డంకి iron-curtain *రాష్ట్రపతికీ, ప్రధానికీ మధ్య ఇనుపతెర గానీ, రహస్యంగానీ లేదని శ్రీ అయ్యర్ అభిప్రాయపడ్డారు.* (ఆం.ప 26.6.87)

**ఇనుమడింపజేయు** క్రి. *inumaDimpajeeyu* ఉన్నదాని కన్నా ఎక్కువజేయు; పెంచు to strengthen, boost up *దీనితో పాటు పార్టీ ప్రతిష్ఠను ఇనుమడింపజేయడమే ఈ సభల ఆశయంగా కనిపిస్తున్నది.* (ఆం.ప్ర. 22.4.88)

**ఇన్నింగ్స్** వి. *innings* క్రికెట్ ఆటలో ఒక్కసారి బ్యాట్ చేయడానికి ఒక టీముకు లభించే సమయం innings *వెస్టిండీస్ మొదటి ఇన్నింగ్స్‌లో 530 పరుగులు (6వికెట్లకు) చేసిన సంగతి తెలిసిందే.* (ఆం.ప్ర. 1.1.88)

ఇబ్బడి ముబ్బడి వి. *ibbaDi mubbaDi* లెక్కకు మిక్కిలిగా ఉండటం; అధికం abundance, plenty ... రాజకీయ *రంగంలోకి ఇబ్బడి ముబ్బడిగా ప్రవేశిస్తున్న సంఘ వ్యతిరేక శక్తుల్ని అరికట్టాలని ఆయన నొక్కి చెప్పారు.* (ఆం.జ్యో. 5.12.88)

ఇమిగ్రేషన్ వి. *imigreeSan* 1. ఒక దేశ పౌరులు మరో దేశానికి జీవనోపాధి కోసం వెళ్ళటం; వలస 2. అన్య దేశీయుల రాకపోకలను పరిశీలించి అనుమతించు లేదా నిరాకరించే ప్రభుత్వ అధికార శాఖ immigration *సిక్కులుగా అనుమానిస్తున్న ఈ 174 మంది ప్రయాణీకులు చెబుతున్న వివిధ రకాల కథనాలను జోడించి వారి నుంచి అసలు విషయం రాబట్టడానికి ఇమిగ్రేషన్ అధికారులు ప్రయత్నిస్తున్నారు.* (ఈ. 14.7.87)

ఇమేజ్ వి. *imeej* సంఘం దృష్టిలో ఒక వ్యక్తి లేదా సంస్థ సంపాదించుకున్న స్థానం; ప్రతిష్ఠ image *ఏ ఎన్నికలలోనైనా శ్రీ ఎన్టీఆర్ ప్రధానంగా తన "ఇమేజ్"పై ఆధారపడటం రివాజు.* (ఆం.ప్ర. 25.11.87)

ఇరకాటం వి. *irakaaTam* ఏమి చేయాలో తెలియని పరిస్థితి; సంకటం difficult situation, tight spot, fix *లోకాయుక్తగా ఢిల్లీ హై కోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజేంద్రనాథ్ అగర్వాల్‌ను నియమించడంలో జాప్యంచేస్తూ ప్రజలు ఎన్నుకున్న రాష్ట్ర ప్రభుత్వాన్ని ఇరకాటంలో పడవేస్తున్నదని . . ఒక టెలెక్స్ సందేశం పంపారు.* (ఆం.జ్యో. 24.11.88)

ఇరాన్‌గేట్ వి. *iraangeeT* అమెరికన్ ప్రభుత్వం సెనేట్ అనుమతి లేకుండా ఇరాన్‌కు రహస్యంగా ఆయుధాలు అమ్మిన సంఘటనకు సంబంధించిన వివాదం Iran-gate(a scandal involving the American government in selling arms to Iran against the resolution by the Senate) *ఇరాన్‌గేట్ వ్యవహారమంతా అమెరికా అధ్యక్షుడు రీగన్ అనుమతితోనే జరిగిందని ... వెల్లడించింది.* (విశా 7.7.87)

ఇరికించు క్రి. *irikincu* (ఒక వ్యక్తిని) నేరంతో సంబంధం లేకున్నా ఉన్నట్లుగా ఆరోపించి చేర్చు to implicate *కేవలం ప్రిన్సిపాల్‌ను ఘెరావ్ చేసిన నేరానికి గూండా కేసుల్లో ఇరికించారని ఆయన తెలిపారు.* (ఈ. 5.6.87)

ఇరిగేషన్ పథకం వి. *irigeeSan pathakam* పంట పొలాలకు నీరు అందించేందుకు ఉద్దేశించిన ప్రణాళిక irrigation scheme *ప్రస్తుతం దేశంలో అమలు జరుగుతున్న కొన్ని ఇరిగేషన్ పథకాలను మెరుగు పరిచేందుకు ...* (ఈ. 27.4.89)

ఇరుకునపెట్టు క్రి. *irukunapeTTu* ఎదుటి వారిని ఇబ్బందికరమైన పరిస్థితులలో పడవేయు to put on defence, to embarass, to corner *శాంతి భద్రతల పరిస్థితిపైనే కాంగ్రెస్(ఐ) అధికార పక్షాన్ని ఇరుకునపెట్టాలని ప్రయత్నిస్తోంది.* (ఈ. 6.9.89)

ఇర్రేడియేషన్ వి. *irreeDiyeeSan* ఆహార పదార్థాలను నిలువచేయడానికి ఉపయోగించే ఒక ఆధునిక ప్రక్రియ irradiation *ఇర్రేడియేషన్ అంటే ... ఆహార పదార్థాల్ని చిరకాలం తాజాగా నిలువచేసే ఒకానొక ఆధునిక పద్ధతి ...* (ఈ. 9.10.87)

ఇష్టాగోష్ఠి వి. *iSTaagooSThi* అనధికార సమావేశం informal meet అమ్మకం పన్నుల విధానంలో తీసుకొనదలిచిన మార్పులపై నిన్న మంత్రి వర్గ సభ్యుల ఇష్టా గోష్ఠి సమావేశంలో సమగ్రంగా చర్చించి ఈ నిర్ణయాలు తీసుకున్నట్లు ... చెప్పారు. (ఈ. 5.6.87)

ఈ

ఈషణ్మాత్రం వి. *iiSaNmaatram* అవసరమైన దాంట్లో కనీసమైనది; కొంచెం least, slightest ప్రజల సమస్యలు ఈషణ్మాత్రం పట్టించుకోకుండా ప్రధానిని, కాంగ్రెస్(ఐ) పార్టీని దూషించడమే జాతీయ ఫ్రంట్ నాయకులు పనిగా పెట్టుకున్నారని ... విమర్శించారు. (ఆం.భూ. 30.6.89)

ఉ

ఉక్కిరిబిక్కిరిఅగు క్రి. *ukkiribikkiriagu* తట్టుకోలేని పరిస్థితికి లోనగు to suffocate, to suffer *28* సంవత్సరాలుగా యుద్ధంలో ఉక్కిరిబిక్కిరిఅవుతున్న ఇథియోపియాలో కూడా మహిళలు భూమిని సంపాదించడం కోసం పోరాటం చేయక తప్పడం లేదు. (ఆం.భూ. 17.8.89)

ఉక్కు కౌగిలి వి. *ukku kaugili* మితిమీరిన అధికారంతో స్వాధీనంలో ఉంచుకోవటం strong grip ఢిల్లీ ఉక్కు కౌగిట్లో విద్య. (ఆం.ప్ర. 8.10.88)

ఉక్కు చట్రం వి. *ukku caTram* మార్పుకు అవకాశం లేని వ్యవస్థ rigid system ఇండియన్ సివిల్ సర్వీస్‌ను (ఐ.సి.యస్) "ఉక్కు చట్రం" steel frame అనేవాళ్ళు. (ఆం.జ్యో. 24.6.87)

ఉక్కు పాదం వి. *ukku paadam* నిర్దాక్షిణ్యమైన అణచివేత merciless supression, iron hand రెండేళ్ళ కిందట పంజాబ్‌లో రాష్ట్రపతి పాలన విధించిన తర్వాత కేంద్రం ఉక్కు పాదంతో తీవ్రవాదుల రిజాన్ని అణచి వేయగలుగు తుందన్న ఆశలు అడియాసలయ్యాయి. (ఆం.భూ. 22.7.89)

ఉక్కు పిడికిలి వి. *ukku piDikili* స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హరించివేసే తీవ్రమైన అదుపు iron fist, tight grip ప్రపంచ వ్యాప్తంగా పత్రికలపై ఉక్కు పిడికిలి. (ఆం.ప్ర. 16.10.88)

ఉక్కు హస్తం వి. *ukku hastam* నిర్దాక్షిణ్యమైన చర్య iron hand, ruthlessness నిజామాబాద్ జిల్లాలో నక్సలైట్ల కార్యకలాపాలను 'ఉక్కు హస్తం'తో ఎస్.పి. శ్రీ రామ చంద్రరావు అణచి వేయడం వల్లనే ఆయనను నక్సలైట్లు తమ లక్ష్యంగా పెట్టుకున్నారని పోలీసు వర్గాలు భావిస్తున్నాయి. (ఆం.జ్యో. 24.7.87)

ఉగ్రవాది వి. *ugravaadi* లక్ష్య సాధనకై హింసా మార్గం అవలంబించే దౌర్జన్యవాది terrorist బస్సు ప్రయాణీకులను దారుణ మారణకాండకు గురిచేసిన ఉగ్రవాదులతో రెట్టింపు దీక్షతో పోరాటం జరపాల్సి ఉందని ప్రధాని చెప్పారు. (ఆం.భూ. 8.7.87)

ఉజ్జాయింపు వి. *ujjaayimpu* (వస్తువుల గుణం, పరిమాణం మొ. వాటి గురించి)వాస్తవానికి దగ్గరగా ఊహించి చెప్పటం approximation, rough estimate ఎన్నికల సందర్భంగా ప్రజల అభిప్రాయాన్ని సేకరించి రంగంలో ఉన్న పార్టీ విజయావకాశాలను ఎన్నికల ఫలితాలకు ముందే ఉజ్జాయింపుగా తెలియజెప్పేందుకు కొన్ని పత్రికలు, సంస్థలు సర్వే నిర్వహించడం పరిపాటి. (ఆం.భూ. 20.11.89)

ఉటంకించు క్రి. *uTankincu* ఇతరులు

వెలిబుచ్చిన అభిప్రాయాన్ని (రాతలో గానీ, మాటలరూపంలోగానీ) మార్పులు లేకుండా మళ్ళీ ప్రస్తావించు to quote ప్రేమదాసను ఉటంకిస్తూ శ్రీలంకన్ బ్రాడ్ కాస్టింగ్ కార్పొరేషన్ గురువారం ఈ వార్తను ప్రసారం చేసింది. (ఆం.జ్యో 5 6 87)

**ఉడాయించు** క్రి. *uDaayincu* తప్పించు కొని దూరంగా పారిపోవు to run away బోఫోర్స్ శతఘ్నుల సమస్యపై పార్లమెంటులో చర్చలలో పాల్గొనకుండా ఉడాయించింది ప్రతి పక్ష పార్టీలే కాని కాంగ్రెస్(ఐ) కాదని .. ప్రధాని అన్నారు. (ఆం.భూ 10.8.89)

**ఉడుకెత్తిపోవు** క్రి. *uDukettipoovu* (ఇత రుల విజయాల పట్ల) అసూయతో కూడిన కోపంతో మండిపడు to simmer with anger or annoyance వ్యవసాయ కూలీలు సాధిస్తున్న విజయాలను చూసి భూస్వాములు ఉడుకెత్తి పోతున్నారు. (విశా. 12 10 87)

**ఉత్కంఠ** వి. *utkanTha* విషయ పరిణామాలపై అధికమైన ఆసక్తి suspense, curiosity బూటాసింగ్ ప్రకటన చేసే ముందు లోకసభలో తీవ్ర ఉత్కంఠ నెలకొంది. (ఈ. 22.4 89)

**ఉత్తరాధికారి** వి. *uttaraadhikaari* వ్యక్తుల ఆస్తి పాస్తులపై వారి తదనంతరం హక్కులు లభించే వ్యక్తి; వారసుడు లేదా వారసురాలు heir కోడళ్ళు వారి అత్త మామల ఆస్తి పాస్తులకు ఉత్తరాధికారులుగా చేసే చట్టం రావాలని ఆయన కోరారు. (ఆం.ప్ర 11 8 89)

**ఉత్తర్వు** వి. *uttarvu* విధి విధానాలపై ప్రభుత్వం జారీ చేసే అధికారిక ఆదేశం order(official) ప్రతి గ్రామానికి రెండు తుపాకులకు లైసెన్సులు ఇవ్వడానికి రాష్ట్ర ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వు ఉపసంహరించేలా చేయడానికి ... (ఆం.ప్ర 27 4.89)

**ఉత్తీర్ణత** వి. *uttiirNata* పరీక్షల్లో విజయం పొందటం pass or good result(in an examination) మొత్తం 23 జిల్లాలలో ప్రకాశం జిల్లా అత్యధిక శాతం ఉత్తీర్ణత సాధించింది. (ఈ 8 5.89)

**ఉత్తేజపరచు** క్రి. *utteejaparacu* ఒక పని చెయ్యడానికి అవసరమైన ఉత్సాహాన్ని కలిగించు to inspire రైతులను ఉద్యమ బాటలో నడిపించడానికి ఉత్తేజ పరచే అఖిల భారత రైతు మహా సభలు ... ప్రారంభమవుతున్నాయి. (ఈ 26 4 89)

**ఉత్తేజితంచేయు** క్రి. *utteejitamceeyu* అభివృద్ధి కరమైన చలనం లేదా కదలికను తీసుకొని వచ్చు to activate ఏడో ప్రణాళిక లక్ష్యసాధనకు గాను రాజకీయ సంకల్పంతో అంకితభావంతో వ్యవసాయ రంగాన్ని ఉత్తేజితం చేయాలన్న ప్రధాని విజ్ఞప్తిని ... అంగీకరించారు. (ఈ 19.3.88)

**ఉత్పత్తిచేయు** క్రి. *utpatticeeyu* సరుకులు, పాడి పంటలు మొ. వాటిని శ్రమ ద్వారా సృష్టించు to produce ఈ మినీ ఆవులు రోజుకు మూడు నాలుగు లీటర్ల పాలను ఉత్పత్తిచేస్తున్నాయి (ఆం.జ్యో 5 6 87)

**ఉత్పన్నమగు** క్రి. *utpannamagu* (క్లిష్ట పరిస్థితులు, సమస్యలు)కొత్తగా ఏర్పడు to arise రైతులతో సమావేశం ఏర్పాటు చేసి విద్యుత్ కోతవల్ల ఉత్పన్నమైన సమస్యలు చర్చించనున్నట్లు పేర్కొన్నారు. (ఈ 22 4 89)

**ఉత్పాదకత** వి. *utpaadakata* కర్మాగారాల్లో వస్తువులను తయారు చేయగల సామర్థ్యం productivity ఉత్పాదకత పెంపుదలకు కృషి చేయాల్సిందిగా ఆర్థిక మంత్రి పిలుపునిచ్చారు. (ఈ 5.1 88)

**ఉత్పాదకవ్యయం** వి. *utpaadaka vyayam* కర్మాగారాల్లో వస్తువులను తయారు చేయటానికయ్యే ఖర్చు cost of production సాంకేతిక పరిజ్ఞానం పద్ధతిలో నెలకొల్పిన చిన్న సిమెంటు పరిశ్రమల ఉత్పాదకవ్యయం అధికం అని ... (ఆం.ప్ర 26 4 89)

**ఉత్పాదన సామర్థ్యం** వి *utpaadana saamarthyam* ఆ యా కర్మాగారాల్లో వస్తువులు, విద్యుత్తు మొ. వాటిని ఉత్పత్తి చేయగల శక్తి production capacity ఇప్పటికే రంగంలో ఉన్న విద్యుత్ కేంద్రాల ఉత్పాదన సామర్థ్యాన్ని మెరుగ్గా వినియోగించుకోవటం, విద్యుత్ సరఫరా నష్టాలను తగ్గించడం ... రాష్ట్రాల కార్యక్రమాలుగా ఉన్నాయి. (ఈ 22.5 89)

**ఉత్ప్రేరకం** వి. *utpreerakam* శారీరకంగా కృత్రిమ ఉత్సాహాన్నీ, శక్తిని ఇచ్చే మత్తు మందు steroid ఏ అథ్లెట్ అయినా సరే ఉత్ప్రేరకాలు వాడినట్టు ప్రమాణ పూర్వకంగానో, లిఖిత పూర్వకంగానో వెల్లడిస్తే అథ్లెట్ కు సంబంధించిన రికార్డులను, పుస్తకాల నుంచి తొలగించి వేయాలని ... (ఈ. 6 9 89)

**ఉదాసీనం** వి. ***udaasiinam*** **తగినంత** ఆసక్తి చూపించక **పోవటం,** పట్టీ పట్టనట్టు ఉండటం indifference పత్రికా స్వాతంత్ర్యానికి ఎదురవుతున్న ప్రమాదాల పట్ల కూడా పత్రికా ఉద్యోగుల ఉద్యమం ఉదాసీనంగా ఉండరాదు. (విశా 18 10.87)

**ఉదాసీన వైఖరి** వి *udaasiina vaikhari* పట్టించు కోని స్వభావం. నిరాసక్త ధోరణి, నిర్లిప్త సరళి indifferent attitude హంగులన్నీ ఉన్నా తెలుగు అమలు విషయంలో అధికారులు ఉదాసీన వైఖరిని అవలంబించటం వల్ల తెలుగు అమలు ఆశయం నీరుకారి పోతున్నది. (ఆం.ప్ర 4 5 89)

**ఉద్ఘాటించు** క్రి. *udghaaTiincu* ఒక విషయాన్ని రూఢిగా చెప్పు; నొక్కి చెప్పు to assert, stress(some point) జిల్లా తెలుగు దేశం పార్టీలో ముఠాలు లేనే లేవని రాజేశంగౌడ్ మరోసారి ఉద్ఘాటించారు. (ఆం.ప్ర. 18.4 88)

**ఉద్దేశించు** క్రి. *uddeeśiincu* ప్రత్యేకంగా పాఠకుల్నిగాని, (శ్రోతల్నిగాని) దృష్టిలో పెట్టుకొను to address(sb) అంతకు ముందు బస్ రోకో కార్యక్రమంలో పాల్గొన్న కార్యకర్తలను ఉద్దేశించి ప్రసంగిస్తూ, 36 కోట్ల రూపాయల మేరకు బస్ చార్జీలు పెంచడం ఒక లెక్కలోనిది కాదని ... (ఆం జ్యో 6 12 88)

**ఉద్యమం** వి. *udyamam* లక్ష్య సాధన కోసం సామూహికంగా చేసే ప్రయత్నం movement స్వాతంత్ర్యానంతరం తలెత్తిన రైతు ఉద్యమాలలో తెలంగాణా సాయుధపోరాటం ఒక మైలురాయిగా నిలిచింది (ఆం.ప్ర 18.4.88)

**ఉద్యమకారుడు** వి. *udyamakaaruDu* ఉద్యమ లక్ష్య సాధన కోసం పని చేసే కార్యకర్త agitator చిత్తూరు రైల్వే స్టేషన్ వద్ద మరో రెండు రైళ్ళను కూడా ఉద్యమకారులు నిలిపివేశారు. (ఆం.ప్ర 5 11.88)

**ఉద్యమబాట** వి.*udyamabaaTa* పోరాటం ద్వారా కోరికలు సాధించుకునే మార్గం agitational path రైతులను సంఘటిత పరచి వారిని ఉద్యమబాటలో నడిపించడానికి ఉత్తేజ పరిచే అఖిల భారత రైతు సభలు ... ప్రారంభమవుతున్నాయి. (ఈ. 26.4 89)

**ఉద్యమించు** క్రి. *udyamiincu* లక్ష్య

సాధనకై సామూహికంగా ప్రయత్నించు to agitate, start a movement ప్రజలే ఉద్యమించాలి. (ఈ 14.8 87)

**ఉద్యమింపజేయు** క్రి. *udyamimpajeeyu* లక్ష్య సాధనకై ప్రయత్నింప జేయు to bring into movements కేంద్ర ప్రభుత్వ అవినీతి కుంభకోణాలకు వ్యతిరేకంగా ప్రజలను ఉద్యమింపచేసే పనిలో తెలుగు దేశం పార్టీ విశేషంగా కృషి చేస్తున్నది. (ఉ. 15.6 87)

**ఉద్యుక్తంఅగు** క్రి. *udyuktamagu* ఒక పని చేయడానికి సంసిద్ధం అగు; to be ready, prepared కేంద్రంపై ఆందోళనకు ఉద్యుక్తమవుతున్నారని ... (ఈ 5 6 87)

**ఉద్రిక్తత** వి. *udriktata* భిన్నవర్గాలు లేదా జాతులకు చెందిన ప్రజల మధ్య వైషమ్యాలు ఏర్పడి ఘర్షణలు జరిగే అవకాశ ముంద నిపించే తీవ్రమైన పరిస్థితి tension (situational) ఇద్దరు పోలీసు కానిస్టేబుళ్ళను నక్సలైట్లు ... కిడ్నాప్ చేసినప్పటి నుండి హుస్నాబాద్‌లో ఉద్రిక్తత ఏర్పడి, ఏ క్షణాన ఏమి జరుగుతుందో నన్న భయం కలిగిస్తున్నది. (ఆం.ప్ర 29 8 89)

**ఉద్రిక్త పరిస్థితి** వి. *udrikta paristhiti* చూ. ఉద్రిక్తత; కృష్ణా జిల్లా ఉయ్యూరులో రెండువర్గాల మధ్య కొట్లాట ఫలితంగా ఏర్పడ్డ ఉద్రిక్త పరిస్థితిని నివారించేందుకు పోలీసులు గాలిలో కాల్పులు జరిపారు. (ఈ 20.7 89)

**ఉద్రిక్త వాతావరణం** విణ. *udrikta vaataavaraNam* చూ. ఉద్రిక్తత ఎన్నికలు జరగడానికి నాలుగు రోజులు వ్యవధి ఉండగానే ఎన్నికల్లో పోటీ చేస్తున్న బి.జె.పి, కాంగ్రెస్ పార్టీ కార్యకర్తల మధ్య విభేదాలు తలెత్తి ఉద్రిక్త వాతావరణం ఏర్పడింది. (ఈ.ఆను 24 11 89)

**ఉద్వాసనచెప్పు** క్రి. *udvaasanaceppu* పదవి నుంచి తొలగించు to remove రుమేనియా అధ్యక్షుడు నికోలాయ్ సెసెక్యూ మొన్న మరో నలుగురు మంత్రులకు ఉద్వాసనచెప్పారు. (విశా 6.10 87)

**ఉద్వాసనపలుకు** క్రి. *udvaasanapaluku* చూ. ఉద్వాసనచెప్పు ఈ సారి ముఖ్యమంత్రి కొంత మంది మంత్రులకు ఉద్వాసన పలకవచ్చు (ఉ. 9 6.87)

**ఉధృతం** వి. *udhRtam* తీవ్ర స్థాయి పొందటం intensification కేరళలో రాష్ట్రపతి పాలన విధించే సమయంలో తీవ్ర వినాశమో, ఉధృతమో తప్ప మరో మార్గం కనపడలేదని, కేరళలో రాష్ట్రపతి పాలన విధింపు ఆవశ్యకతను దాదాపు అందరూ అంగీకరించారని నెహ్రూ చెప్పారు. (ఆం.భూ. 1.5 89)

**ఉధృతంచేయు** క్రి. *udhRtamceeyu* (ఏదైనా కార్యకలాపాల్ని) తీవ్ర స్థాయికి తీసుకొనిపోవు to intensify ప్రభుత్వం వెంటనే బస్సు చార్జీలు తగ్గించకపోతే ఆందోళన ఉధృతంచేస్తామని వారు హెచ్చరించారు. (ఆం.జ్యో. 21 11 88)

**ఉధృతి** వి. *udhRti* గాలి, నీరు వంటి ప్రకృతి శక్తుల కదలికలోని, ఉద్యమాలలోని తీవ్రత force వాగు ఉధృతి తగ్గిన తర్వాత అయిదు శవాలు బయట పడ్డాయని ... పేర్కొన్నారు. (ఈ. 19.7 89)

**ఉనికి** వి. *uniki* 1. ఒక ప్రదేశంలో కొంతకాలం పాటు(ప్రత్యేకమైన కార్యంపై) నిలిచి ఉండటం presence (of troops, police etc.)

శ్రీలంకలో భారత శాంతి సేన ఉనికికి నిరసనగా సింహళ తీవ్ర వాద సంస్థ జనతా విముక్తి పెరమున ఇచ్చిన పిలుపు మేరకు ... జరిపారు (ఈ 19.7 89) 2. ఇతరుల దృష్టిలో తమకున్న ప్రత్యేకమైన మనుగడ identity జాఫ్నా పతనమైతే తమిళులు రాజకీయంగా ఉనికి కోల్పోతారు. (ఈ. 5.6 87)

**ఉన్నత ప్రమాణాలు** వి *unnata pra-maaNaalu* ప్రజా జీవనంలో ఇతరులకు ఆదర్శప్రాయంగా నిలిచే ప్రవర్తన లేదా విలువలు high standards బోఫోర్స్ గన్‌ల కొనుగోలు వ్యవహారంలో శ్రీ రాజీవ్ గాంధీ ప్రమేయం ఉన్నట్లు సి.ఎ.జి. నివేదిక విస్పష్టంగా పేర్కొన్నదని అందువల్ల రాజీవ్ ఉన్నత ప్రమాణాలను నెలకొల్పడానికి గాను వెంటనే రాజీనామా చేయాలని ఆయన కోరారు (ఆం.ప్ర 20 7 89)

**ఉన్నత స్థాయి** వి. *unnata sthaayi* (అధికార) వ్యవస్థలో విధాన నిర్ణయాలు చేసే ప్రముఖులతో కూడిన పై అంచె high level చర్చలు జరిపేందుకు బోఫోర్స్ అధినేత నేతృత్వంలో ఉన్నత స్థాయి బృందం ఢిల్లీకి రహస్యంగా వచ్చింది. (ఈ 12.7 89)

**ఉన్నతాధికారి** వి. *unnataadhikaari* అధికార యంత్రాంగంలో విధాన నిర్ణయాధికారాలు కలిగిన పై ఉద్యోగి senior officer కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు వేతనాలు పెరగకుండా ఉన్నతాధికారులు అడ్డుకుంటున్నారని ఆయన విమర్శించారు. (ఆం.ప్ర 26 4.89)

**ఉప ఎన్నిక** వి. *upa ennika* చట్ట సభల్లో స్థానం ఖాళీ అయినప్పుడు సభాకాలం మధ్యలో జరిపే ఎన్నిక by-election కల్లోలిత ప్రాంతాలయిన ఉత్తర, తూర్పు శ్రీలంకలోని 16 పార్లమెంటరీ నియోజక వర్గాలలో ఉప ఎన్నికలు ప్రకటించి ... అందరినీ ఆశ్చర్య చకితుల్ని చేశారు. (ఆం.జ్యో 26 6 87)

**ఉపక్రమించు** క్రి. *upakramincu* పనిచేయటానికి ప్రారంభించు, పని మొదలు పెట్టు to start, begin with ... అటు పోలీసులను, ఇటు ప్రజలను భయపెట్టేందుకు తీవ్రవాదులే ఈ దాడికి ఉపక్రమించారని వారు భావిస్తున్నారు. (ఆం.జ్యో. 6.3.88)

**ఉపగ్రహం** వి. *upagraham* భూమి చుట్టూ తిరుగుతూ సమాచారాన్ని సేకరించే అంతరిక్ష పరికరం satellite ఉపగ్రహం పంపిన తాజా సమాచారం ప్రకారం గతంలో చెప్పినట్టు కాక దేశంలో ప్రస్తుతం 19 శాతం మేరకు అడవులున్నాయని ఆయన తెలిపారు. (ఆం ప్ర 21 2.89)

**ఉపన్యసించు** క్రి. *upanyasincu* ఒక విషయం గురించి (నాయకులు, మేధావులు) బోధించు to lecture బస్సు పూర్తిగా దగ్ధమయ్యేవరకు నక్సలైట్లు అక్కడే ఉన్నారని, దళం ప్రధాన నాయకుడు చంద్రమౌళి ప్రయాణీకుల నుద్దేశించి 45నిమిషాల సేపు ఉపన్యసించినట్లు తెలిసింది. (ఆం.ప్ర. 3 5.89)

**ఉపపట్టణం** వి. *upa-paTTaNam* ప్రధాన పట్టణానికి అనుబంధంగా శివారులో అభివృద్ధి చేసిన ప్రాంతం satellite town విశాఖపట్నం, హైదరాబాద్, విజయవాడ వంటి నగరాలకు వెలుపల ఉప పట్టణాలను (శాటిలైట్ టౌన్స్) ఏర్పాటు చేయడానికి ... (ఆం.జ్యో 10 9 87)

**ఉపరితల రవాణా** వి. *uparitala ravaaNaa* భూమిపైన లేదా జలమార్గం పైన మనుషులుగాని, సరుకులుగాని ఒక

చోటు నుండి మరోచోటికి చేర్చడం surface transportation బకింగ్ హోమ్ కాల్వను ఒక రవాణా మార్గంగా అభి వృద్ధి చేయాలని పార్లమెంటు సభ్యుడు ... కేంద్ర ఉపరితల రవాణా శాఖ మంత్రి శ్రీ రాజేశ్ పైలట్‌కు వ్రాసిన ఒక లేఖలో విజ్ఞప్తి చేశారు. (ఆం.భూ 30.10 87)

**ఉపశమనం** వి. *upaśamanam* ఆందో ళన, ఇబ్బందులు మొ. వాటి నుంచి కలిగే ఊరట relief, solace ... విజ్ఞా పన పత్రంలోని దాదాపు అన్ని అంశాలను ముఖ్యమంత్రి అంగీకరించడంతో కరీం నగర్ జిల్లా నుంచి వచ్చిన తెలుగు దేశం నాయ కులు ఉపశమనం పొందినట్లు కనిపించింది. (ఆం.భూ. 20 4.89)

**ఉపశమన కార్యక్రమం** వి. *upaśamana kaaryakramam* బాధల్లో ఉన్న ప్రజలకు సహాయం అందించడానికి చేపట్టిన పని relief programme, palliation రాష్ట్రంలో కరువు ఉపశమన కార్యక్రమాలు చేపట్టడానికి కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభు త్వానికి ఎటువంటి సహాయం చేయకుండా ... (ఆం.ప్ర 8 2 89)

**ఉపసంఘం** వి. *upasangham* ఒక విషయం పూర్వాపరాలు పరిశీలించేం దుకు ఒక సముదాయంలోని కొంత మందిని ఎంపికజేసి వాళ్ళతో ఏర్పాటు చేసిన కమిటీ sub-committee రాష్ట్ర ప్రభుత్వం వ్యవసాయ, నీటి పారుదల, విద్యు చ్ఛక్తి శాఖల మంత్రులతో ఒక ఉపసంఘాన్ని నియమించిన విషయం తెలిసింది. (ఆం.ప్ర 4.10 87)

**ఉపసంహరణ** వి. *upasamha-raNa* (సైన్యం, దరఖాస్తు, ఆరోపణలు వంటివాటిని)తిరిగి వెనక్కి తీసుకోవటం withdrawal ఆఫ్ఘనిస్తాన్ నుంచి రష్యన్ సేనల ఉపసంహరణకు అవకాశమిచ్చే చారి త్రాత్మకమైన ఒప్పందం మీద పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్‌లు నేడు లాంఛనప్రాయంగా సంత కాలు చేశాయి. (ఆం.ప్ర. 15 4 89)

**ఉపాధి** వి. *upaadhi* పనిచేయడం ద్వారా జీవనానికి అవసరమైన డబ్బు సంపాదించుకునే మార్గం; జీవనోపాధి employment ఈ వర్క్‌షాప్‌లో 350 మందికి ఉపాధి లభిస్తుందని ... చెప్పారు. (ఆం జ్యో 1.12 88)

**ఉపేక్షించు** క్రి. *upeekSincu* తెలిసికూడా జోక్యం చేసుకోకపోవు to ignore జాఫ్నాలో బాధితులకు 'మానవతా సహాయం' పేరుతో తమిళనాడు ముఖ్యమంత్రి నాలుగు కోట్ల రూపాయలను తిరుగుబాటు గెరిల్లా వర్గాలకు అందించడాన్ని న్యూ ఢిల్లీ ఉపేక్షిం చడం తమ పట్ల శత్రు వైఖరికి నిదర్శనంగా ... పరిగణించింది. (ఈ 5 6.87)

**ఉప్పెన** వి. *uppena* విపరీతమైన వేగంతో కూడుకొని చుట్టు ప్రక్కల ప్రాంతాన్ని సముద్రం నీటితో ముంచి వేసేంతటి తీవ్ర మైన తుఫాన్ hurricane రాష్ట్రంలో ఇప్పుడు ఉన్నది ఒట్టి కాంగ్రెస్(ఐ) అనుకూల 'గాలి' కాదని 'ఉప్పెన' అని పి.సి.సి-ఐ అధ్య క్షుడు ... అన్నారు. (ఆం.భూ. 17.11 89)

**ఉప్పొంగు** క్రి. *uppongu* అమిత సంతో షంతో పొంగిపోవు to over flow with joy బెర్లిన్ ఒలింపిక్స్‌లో నాలుగు బంగారు పతకాలు సాధించిన జెస్సీ ఓవెన్స్ భారత దేశం వచ్చినపుడు ఇక్కడి ప్రజలు చూపిన ఆదరాభిమానాలకు ఉప్పొంగిపో యాడు. (ఈ 19 9 89)

**ఉబలాటం** వి. *ubalaaTam* ఒక పని చేయాలనే తొందరతో కూడిన కోరిక;

తహతహ to be eager పార్లమెంట్ బడ్జెట్ సమావేశాల తేదీ రాగానే దేశంలో వ్యాపారస్థులు వస్తువుల ధరలు పెంచేందుకు ఉబలాటపడిపోతుంటారు (ఆం.భూ 9 5.89)

**ఉబుసుపోక** వి. *ubusupooka* సరదాగా సమయం గడిపివేయడం; కాలక్షేపం leisured activity కాసేపు ఈ సినిమాల, ఉబుసుపోకకు రాసే దరిద్రపుగొట్టు నవలల ప్రభావాన్ని బుర్రలోంచి తరిమివేసి సమాజంలో మనుషులను వారి చరిత్రలను, స్వభావాలను పరిశీలించండి. (ఆంభూ. 21.4.89)

**ఉభయ తారకం** వి. *ubhaya taarakam* రెండు పక్షాలకూ ప్రయోజనకరమైనది mutually beneficial ఉచిత వైద్యంలా ఉచిత న్యాయ సహాయం ప్రజల కందించాలనేది రాష్ట్ర ప్రభుత్వం చిరకాల వాంఛ. ఈ వాంఛ నెరవేరాలంటే యువన్యాయవాదులను ఉపయోగించుకోవాలి. ఉభయ తారకంగా ఉంటుందని తెలుపుతున్నాను. (ఆం.భూ. 20 4 89)

**ఉమ్మడి అభ్యర్థి** వి. *ummaDi abhyarthi* ఎన్నికలలో బలమైన ఒక రాజకీయ పార్టీని ఎదుర్కొనేందుకు దానికి వ్యతిరేకమైన వివిధ పార్టీలు కలిసి తమ అందరి తరపునా పోటీ చేయడానికి ఎంపిక చేసిన అభ్యర్థి common candidate వచ్చే సార్వత్రిక ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీకి వ్యతిరేకంగా కలిసికట్టుగా ఉమ్మడి అభ్యర్థిని నిలబెడతామని ప్రతి పక్షాల నాయకులు నేడిక్కడ ప్రకటించారు. (ఆం ప్ర. 26 9 89)

**ఉమ్మడి కార్యక్రమం** వి. *ummaDi karyakramam* కొన్ని రాజకీయ పక్షాలు కలిసి నిర్వహించే కార్యకలాపాల ప్రణాళిక common programme అసలు బి.జె.పి.తో రాజకీయంగా ఎటువంటి ఉమ్మడి కార్యక్రమాలలో సి.పి.ఎం. పాల్గొనరాదని ... ఆయన తెలిపారు. (ఆం.ప్ర 29 7 89)

**ఉమ్మడి చట్టం** వి. *ummaDi caTTam* (అంతర్జాతీయ స్వభావం కలిగిన నేర కార్యకలాపాల్ని సమర్థవంతంగా ఎదుర్కోవటంకోసం) ఒకటి కన్నా ఎక్కువ దేశాలు కలిసి రూపొందించుకున్న ఒకే రకమైన చట్టం common law సార్క్ సభ్యత్వ దేశాలలో న్యాయ నిపుణులు త్వరలోనే సమావేశమై తమతమ దేశాలలో టెర్రరిజం అణిచివేతకు ఉమ్మడి చట్టాలను రూపొందించే అంశాన్ని ప్రత్యేకంగా చర్చిస్తారు. (ఆంభూ. 20 6.89)

**ఉమ్మడి చిహ్నం** వి. *ummaDi cihnam* (భిన్నరాజకీయ పార్టీలు) కలిసి పోటీచేయటానికి ఎంపికచేసుకున్న ఒకే ఎన్నికల గుర్తు common symbol ఫ్రంట్ భాగస్వామ్య పార్టీలు లోకసభ ఎన్నికల్లో ఉమ్మడి చిహ్నంతో పోటీ చేసినా, అసెంబ్లీ ఎన్నికల్లో స్వంత చిహ్నాలతో పోటీ చేయదలిస్తే చేయవచ్చునని ... (ఆంభూ 26 4.89)

**ఉమ్మడి జాబితా** వి. *ummaDi jaabitaa* రాజ్యాంగం ప్రకారం కేంద్ర రాష్ట్రాల రెండింటి అధీనంలోనూ ఉన్న పరిపాలనా విషయాల లిస్టు (విద్య, ఆరోగ్యం మొ.) concurrent list ... రాష్ట్ర ప్రభుత్వ అజమాయిషీలో ఉన్న అనేక శాఖల్ని కేంద్ర ప్రభుత్వం ఉమ్మడి జాబితాలోకి చేర్చడం శోచనీయమని ముఖ్యమంత్రి అన్నారు. (ఆంభూ 22.4 88)

**ఉమ్మడి పర్యవేక్షక కేంద్రం** వి. *ummaDi paryaveekSaka keendram* అవాంఛనీయ సంఘటనలు జరగకుండా ఇరుగు పొరుగు దేశాలు కలిసి ఏర్పరచుకున్న నిఘా వ్యవస్థ joint vigilance post

... భారత శ్రీలంక సైనిక దళాలు ఉమ్మడి పర్యవేక్షక కేంద్రాల్ని ఏర్పాటు చేస్తున్నాయని ... తెలిపారు. (ఆం.ప్ర 4.10 87)

**ఉమ్మడి పోరు** వి. *ummaDi pooru* ప్రతిపక్షాలు కలిసికట్టుగా కొన్ని సమస్యలపై అధికార పక్షానికి వ్యతిరేకంగా చేసే పోరాటం joint struggle *దీనితో అవినీతికర, అసమర్థ రాజీవ్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉమ్మడి పోరుకు ప్రతిపక్షాలు నడుము బిగించినట్లయింది.* (ఆం.ప్ర 27.7 89)

**ఉమ్మడి మార్కెట్** వి. *ummaDi maarkeT* కొన్ని దేశాలు వాణిజ్యం, వ్యవసాయాది రంగాలలో కలిసి వ్యవహరించటానికి ఏర్పాటు చేసుకున్న సంస్థ Common Market *1992 నాటికి యూరప్ లో బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, స్పెయిన్, నెదర్లాండ్స్, బెల్జియం, గ్రీసు మొ. దేశాలు ఉమ్మడి మార్కెట్‌లో విలీనంకానున్నాయి.* (ఆం.ప్ర 16 5 89)

**ఊరక ప్రమాదం** వి. *uraka pramaadam* ప్రాజెక్టు ఆయకట్టు ప్రాంతంలో ముంపు ఏర్పడి నీటిపారుదలకి అవాంతరమేర్పడటం water logging *పోచంపాడు ప్రాజెక్టు ఆయకట్టులో ఉరక ప్రమాదాన్ని(వాటర్ లాగింగ్) నిరోధించడానికి రెండు నెలల క్రితం పైలట్ ప్రాజెక్ట్‌ను రూపొందించామని ... వెల్లడించారు.* (ఈ. 24 11 87)

**ఉరికించు** క్రి. *urikincu* ఉన్నపళంగా ఒక ప్రదేశానికి పంపించు; పరుగుతీయుంచు to rush sb ... *దాంతో కొన్ని వార్తా పత్రికలు 'సత్యాన్వేషణార్థం' తమ విలేకరులను ప్రత్యేకంగా ఆదరబాదరగా అక్కడికి ఉరికించాయి.* (ఉ. 6 12 87)

**ఉరిశిక్ష** వి. *urिśikSa* ఘోరహత్యలాంటి తీవ్ర నేరాలకు న్యాయస్థానం విధించే మరణ దండన death sentence *అయితే ఉరిశిక్షలనే రద్దుచేయించుకుంటున్న ఈకాలంలో ఈరకంగా నేరస్తుల్ని చంపడం అనాగరికమే కాగలదు.* (ప్ర.శ. 15.10.87)

**ఉర్రూతలూగించు** క్రి. *urruutaluug-incu* (ఉపన్యాసం, నృత్యం, గానం మొ. వాటి ద్వారా ఇతరులలో)అమితమైన ఉత్సాహం లేదా ఆనందోద్రేకాలు కలిగించు to get excited(esp. through some performance like speech, dance etc.) *వీనుల విందైన ప్రాశ్చాత్య సంగీతం వినిపిస్తుండంగా క్రీడాకారులు తమ కండరాల ప్రదర్శనకోసం చేసిన కొన్ని నృత్య భంగిమలు ప్రేక్షకులను ఉర్రూతలూగించాయి.* (ఈ. 19 9 89)

**ఉర్రూతలూపు** క్రి. *urruutaluupu* చూ. ఉర్రూతలూగించు; *పుట్టిన ఏ కొత్త పార్టీగాని పురోభివృద్ధి చెందడమన్నది ప్రజల్ని ఉర్రూతలూపగల నాయకత్వం ఉన్నప్పుడే సాధ్యం.* (ఈ. 9.5.89)

**ఉలుకూపలుకూ** వి. *ulukuupalukuu* ఒక ప్రతిపాదన లేదా ప్రకటనకు సంబంధిత వ్యక్తి లేదా సంస్థ తెలిపే సమాధానం; ప్రతిస్పందన response, reaction *రెండేళ్ళు దాటినా ఢిల్లీ నుంచి ఉలుకూపలుకూ లేదు.* (ఈ. 29.7 89)

**ఉల్లంఘన** వి. *ullanghana* చట్టం, నియమం మొ. వాటిని తప్పి ప్రవర్తించటం violation *రాబడి పన్ను, సంపద పన్ను చట్టాల ఉల్లంఘన నేరం ఆరోపిస్తూ తనపై, తన కుటుంబ సభ్యులపై దాఖలయిన కేసుల సందర్భంగా ... కోర్టుకు హాజరవుతారు.* (ఆంభూ 19 4 88)

**ఉవాచ** వి. *uvaaca* ఒక విషయం లేదా సంఘటనపై తెలిపే అభిప్రాయం (వ్యంగ్యార్థంలో వాడతారు) comment *ఆరోపణలకు విలువలేదట! శ్రీ వసంత నాగేశ్వరరావు ఉవాచ.* (విశా 24 11 87)

**ఉసిగొల్పు** క్రి. *usigolpu* ఇతరులపై దాడికి ప్రోత్సహించు to instigate, encourage (to attack sb ...) *వారు పోలీసులతో కుమ్మక్కై అక్కడ బీభత్సం సృష్టిస్తున్నారని, అమాయకులపై పోలీసులను ఉసిగొల్పుతున్నారని ... ఆరోపించారు.* (ఆంభూ. 18.5 89)

ఊ

**ఊకదంపుడు** వి. *uukadampuDu* కార్యాచరణతో సంబంధం లేకుండా కేవలం పదాడంబరంతో కూడుకొని ఉండేది (మాటలు, ఉపన్యాసం మొ.) empty or high-flown talk *కళ్ళు చెదిరే లక్ష్యాల కార్యక్రమాల ఊకదంపుడు యావత్తూ హైకోర్టు తీర్పుతో గాలిలో కలిసిపోయింది.* (ఈ. 26.5 89)

**ఊగిపోవు** క్రి. *uugipoovu* తీవ్రమైన ఆవేశం లేదా కోపంతో ప్రతిస్పందించు to rage ... *దూరదర్శన్‌లో స్వాతంత్ర్య దినోత్సవం నాడు తన ప్రసంగానికి తెలుగు భాష తెలీని స్టేషన్ డైరెక్టర్ అడ్డు చెప్పాడంటూ మరింత కోపంగా శ్రీ రామారావు ఊగిపోయారు.* (ఈ. 21 8.89)

**ఊగిసలాట** వి. *uugisaluu ta* ఒకటికన్నా ఎక్కువ మార్గాలున్నప్పుడు ఏది ఎంచుకోవాలో తెలియని మానసికస్థితి; సందిగ్ధం, డోలాయమానం wavering, dilemma *విప్లవ ప్రతీఘాతకులకు దోహదం చేసే ఊగిసలాట కూడదన్నారు.* (ఆంభూ. 5.5.89)

**ఊగిసలాడు** క్రి. *uugisalaaDu* ఒకటికన్నా ఎక్కువ మార్గాలున్నప్పుడు ఏది ఎంచుకోవాలో అని సందేహించు to waver *రావు బీరేంద్ర సింగ్‌కు సన్నిహితుడైన మరో కాంగ్రెస్ మాజీమంత్రి కాంగ్రెస్‌లో కొనసాగడమా లేక పార్టీని వదలిపెట్టాలా అని ఊగిసలాడుతున్నట్లు తెలిసింది.* (ఈ. 14.8.89)

**ఊచకోత** వి. *uucakoota* విచక్షణారహితంగా పెద్ద ఎత్తున చంపటం; మూకుమ్మడి హత్యాకాండ massacre *ఒకే రాత్రి మొత్తం ఆరుచోట్ల సింహళీయులను టైగర్లు ఊచకోత కోశారు.* (ఆంజ్యో. 8.10.87)

**ఊడబెరుకు** క్రి. *uuDaberuku* వ్యక్తి లేదా సంస్థలకున్న అధికారాలు లేదా వసతులు తీసివేయు; లాగివేయు to take away (as powers or privileges from subordinates) *ఇప్పుడు పంచాయితీలపై రాష్ట్ర ప్రభుత్వాలకున్న అధికారాన్నికూడా ఊడబెరకటంకోసమే రాజ్యాంగ సవరణను తలపెట్టారు.* (ఆంభూ. 9.5 89)

**ఊడ్చివేయు** క్రి. *uuDciveeyu* విపరీతంగా వాడి ఖాళీ చేయు to exhaust, drain *విదేశీ మారక ద్రవ్యాన్ని ఊడ్చివేస్తున్న ఎలక్ట్రానిక్స్, ఆటోమొబైల్స్, తదితర పరిశ్రమలను దేశీయం చేయడం తప్పనిసరిగా జరగాలని శ్రీ వి. పి. సింగ్ నొక్కి చెప్పారు.* (ఆంప్ర. 15 10 87)

**ఊతం** వి. *uutam* వ్యక్తి లేదా వ్యవస్థ బలపడటానికి అవసరమైన మద్దతు impetus, support *ఈ బడ్జెట్ ఉత్పాదకతకు ఊతమిస్తుందని ద్రవ్యోల్బణానికి ఏ మాత్రం దారితీయదని అన్నారు.* (ఈ. 19 3.88)

**ఊపందుకొను** క్రి. *uupandukonu* (ఒక కార్యక్రమం)అభివృద్ధి మార్గంలో చెప్పుకో దగిన స్థాయికి చేరుకొను to gather momentum రాష్ట్రంలో ఇటీవల ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగుభాష వాడకం ఊపందు కుందని ఆయన అన్నారు. (ఆంప్ర 22.9.88)

**ఊపిరిపోయు** క్రి. *uupiripooyu* (జాతి, ఉద్యమం మొ. వాటిలో స్తబ్దత ఏర్ప డినప్పుడు) కొత్త చైతన్యం కలిగించు to inject fresh life, to revive విదేశీ దాడులవల్ల అణగారిపోయిన జాతికి, నిస్తేజంలో పడిపోయిన జాతికి, మరింత నీరసించి పోకుండా ఒక దశలో భక్తి ఉద్యమాలు ఊపిరి పోశాయి. (ఆం.భూ. 28.8.89)

**ఊబి** వి. *uubi* (తప్పించుకొని బైటపడడానికి వీలులేని, క్లిష్ట పరిస్థితి trap దేశం అప్పుల ఊబిలో ఇరుక్కోకుండా చూసేందుకు నిపు ణులు ఓ వ్యూహాన్ని సిద్ధం చేస్తున్నారని పంజా అన్నారు. (ఈ. 10.5 89)

**ఊరట** వి. *uuraTa* నిరుత్సాహ సమ యంలో కలిగే ఉపశమనం relief, comfort హాడ్లీ వస్తున్నాడన్న ప్రకటన నిర్వాహకులకు కాస్త ఊరట కలిగించింది. (ఉ. 22.3.88)

**ఊరడించు** క్రి. *uuraDincu* కష్టకా లంలో పలకరించి ఓదార్చు to console తుఫాను బాధితులను ఊరడించ డానికి ప్రధాని ఆ రాష్ట్రానికి వెళ్ళారని అన్నారు. (ఆం.ప. 8.10.87)

**ఊరేగింపు** వి. *uureegimpu* ఉత్సవం లేదా ప్రదర్శనలో భాగంగా మనుషులు గుంపులు గుంపులుగా గానీ బారులు తీరిగానీ ఒకచోటి నుంచి నిర్ణీత స్థలానికి చేరుకోవటం procession, rally పాఠ్య పుస్తకాలు సరఫరా చేయా లని కోరుతూ భారత విద్యార్థి సమాఖ్య బుధవారంనాడు సికింద్రాబాద్ నుంచి సచివాలయం వరకు ఊరేగింపు జరిపింది. (ఆం ప్ర. 29.6 87)

**ఊహాజనితం** వి. *uuhaajanitam* వాస్తవం ఏ మాత్రం లేకుండా కేవలం ఊహించు కున్నది లేదా సృష్టించినది imaginary(things), a work of imagination 'ఈనాడు'లో వచ్చిన వార్త ఆధారరహితంగా, ఊహాజనితంగా ఉందని పి.సి.సి.(ఐ) అధ్యక్షుడు ... అన్నారు. (ఈ. 16.7 89)

**ఊహాతీతం** వి. *uuhaatiitam* ఆలో చనకు లేదా కల్పనకు అందని లేదా జరుగుతుందని ఎవరూ భావించనిది unimaginable, unforeseen, beyond expectation శ్రీ వి. పి. సింగ్ ప్రభంజనం ఉత్తరాదిలో ఊహాతీతంగా ఉందని ... ఆయన వివరించారు. (ఈ. 16 8.89)

## ఎ

**ఎంక్వయిరీ** వి. *enkvayirii* నిజనిర్ధా రణకోసం జరిపే పరిశీలన; విచారణ enquiry రాష్ట్రాలలోప్రజలచే ఎన్నుకోబ డిన రాష్ట్రాధి నేతలతో సంప్రదించకుండా రాష్ట్రాధినేతలపై కేంద్రం సి.బి.ఐ. ఎంక్వయి రీని జరిపించడం రాష్ట్రాధికారాలను హరించ డమేనని ... ఆయన అన్నారు. (ఆంప్ర 20 7.89)

**ఎండగట్టు** క్రి. *enDagaTTu* 1. ఇతరుల లోపాలను, దుర్గుణాలను బట్టబయలు చేయు expose (as of one's fault or misdeeds) పాలక పక్షం వినసప్పుడు,

సద్విమర్శను పెడచెవిని పెట్టినప్పుడూ ప్రజా వ్యతిరేక చర్యలను బహిర్గతంచేసి ప్రజల ముందు ఎండగట్టే హక్కు ప్రతి పక్షానికి ఉంది. (ఆం.భూ. 25 7 89) 2. లేమికి గురి చేయు to subject to paucity or shortage(of funds, facilities etc.) పంచాయితీలకు ఏళ్ళ తరబడి ఎన్నికలు నిర్వహించకపోవడం, నిధులివ్వకుండా ఎండ గట్టడం, స్థానిక సమస్యలను పరిష్కరించడానికి అవసరమైన అధికారాలను లేకుండా చేయడం ... (ఈ. 3 5 89)

**ఎంపిక** వి. *empika* అందుబాటులో ఉన్న వ్యక్తులలో లేదా వస్తువులలో ఒకదానిని ఎంచుకోవటం selection జిల్లా కమిటీ అధ్యక్ష పదవులకు తగిన అభ్యర్థుల ఎంపిక విషయమై పార్టీ అధ్యక్షుడు ... (ఆం.ప్ర. 20.4.88)

**ఎంపికచేయు** క్రి. *empikaceeyu* అందుబాటులో ఉన్న సమూహంలో నుంచి ఒకవ్యక్తిని లేదా వస్తువుని ఎన్నికచేయు to select, choose శాసన సభ్యులు, మంత్రుల నుంచి కొందరిని ఎంపికచేయవలసి వస్తుందేమోనని శ్రీ రామారావు అన్నారు. (ఆం.జ్యో 8.4.88)

**ఎక్కవేయు** క్రి. *ekkaveeyu* ఇతరులతో ఘర్షణకు దిగేలా రెచ్చగొట్టు; ఉసిగొల్పు, పురికొల్పు to incite, instigate ఒక పక్క అమెరికా పాకిస్తాన్‌ను అన్ని విధాలా ఎక్కవేస్తూ వుంటే, ఇండియా మాట పాకిస్తాన్‌కు ఎందుకు ఎక్కుతుంది (ఆం.జ్యో. 22.10.87)

**ఎక్కించు** క్రి. *ekkincu* జాబితాలోకి చేర్చు to include, add ఉత్తర ప్రదేశ్ ఉన్నత పాఠశాల చరిత్ర పుస్తకాల్లో వివాదం పుట్టించగల కొత్త అంశమేమీలేదు గానీ స్వాతంత్ర్య యోధులని టెర్రరిస్టులుగా వర్ణించి టెర్రరిస్టుల జాబితాకి ఎక్కించారట. (ఈ. 13.3 88)

**ఎక్కుపెట్టు** క్రి. *ekkupeTTu* ఇతరులపై ప్రయోగించటానికి గురిపెట్టు; సంధించు to aim at ఎన్టీఆర్ రాష్ట్రంలో 'తుపాకీ రాజకీయాలను' ప్రోత్సహిస్తున్నారని ఆయన విమర్శించారు. ఈ ఆయుధాలను కాంగ్రెస్(ఐ) కార్యకర్తలపై ఎక్కుపెట్టగలరనే ఆందోళనను ఆయన వ్యక్తం చేశారు. (ఆం భూ 1.5.89)

**ఎక్స్‌గ్రేషియా** వి. *eksgreeSiyaa* ప్రకృతి వైపరీత్యాలు, తదితర దుర్ఘటనల్లో నష్టపోయిన వారికి ప్రభుత్వం సానుభూతితో అందించే ధన సహాయం ex gratia వరదలలో చనిపోయిన వారి కుటుంబాలకు కనీసం 10వేల రూపాయల చొప్పున ఎక్స్‌గ్రేషియా చెల్లించాలని విజ్ఞప్తి చేశారు. (ఆం.ప్ర. 19.7.89)

**ఎగదోయు** క్రి. *egadooyu* ఇతరులలోని అసంతృప్తి, అసమ్మతి మొ. వాటిని మరింత పెంచు to fan, stir up (dissidence, ill feelings etc.) మహారాష్ట్ర కాంగ్రెస్‌లో అసమ్మతిని ఎగదోసేందుకు ఇప్పుడు ముగ్గురు మాజీలు తయారయ్యారు. (ఆం.భూ. 3.5.89)

**ఎగవేయు** క్రి. *egaveeyu* విధిగా కట్ట వలసిన పన్ను, అప్పు మొ. వాటిని చెల్లించకుండా తప్పించుకొను to evade (as tax, loan etc.) సంపద రిటర్నులు దాఖలు చేయడంతో పాటు ఎంత మేరకు

పన్ను ఎగవేశారనే అంశం ...
(ఆంజ్యో. 21 4 88)

**ఎగుమతిచేయు** క్రి. *egumaticeeyu* సరుకులను వాణిజ్యంకోసం విదేశాలకు పంపించు to export నమిలే పొగాకు, నశ్యం పాశ్చాత్య దేశాలకు ఎగుమతిచేయడానికి అవకాశాలు ఆశాజనకంగా ఉన్నాయని ఓ అధ్యయనంలో వెల్లడైంది. (ఈ 13.7.87)

**ఎగువసభ** వి. *eguvasabha* పార్లమెంటరీ వ్యవస్థలో పరోక్ష ఎన్నికల ద్వారా ఎన్నికయిన ప్రజా ప్రతినిధుల చట్ట సభ; ఎగువ సభ upper house (in a parliamentary system) పార్టీకి మరింత నష్టం జరగక ముందే యునో తప్పుకోవాలని గతరాత్రి ఎగువసభ్యులు డిమాండ్ చేయడంతో యునో రాజీనామా చేయక తప్పలేదు. (ఆం.భూ. 25 7 89)

**ఎగ్జంప్షన్ ఫీజు** వి. *egjampSan fiiju* తరగతులకు హాజరుకానవసరం లేకుండా పరీక్షలు రాయటానికి విద్యార్థులు సంబంధిత విద్యాసంస్థకు చెల్లించే రుసుం exemption fee ఇంటర్మీడియట్ పరీక్షలకు హాజరయ్యే ప్రైవేటు విద్యార్థులు దరఖాస్తుతో పాటు వంద రూపాయల ఎగ్జంప్షన్ ఫీజు చెల్లించాలి. (ఆం.ప్ర. 8 5.89)

**ఎగ్జిబిషన్ పోటీ** వి. *egjibiSan pooTii* అనధికారికంగా జరిగే ఆట exhibition match అమెరికాలో భారత జట్టు, వెస్టిండీస్, పాకిస్తాన్ జట్లతో కొన్ని ఎగ్జిబిషన్ పోటీలు ఆడతారట. (ఈ 27 4 89)

**ఎజెండా** వి. *ejenDaa* సమావేశంలో చర్చించాల్సిన విషయాలతో ముందుగా ఒక క్రమంలో రూపొందించిన జాబితా agenda ఎన్టీఆర్‌పై ప్రాసిక్యూషన్‌కు నిరసనగా మంత్రివర్గం సమావేశం నేడు ఎజెండాలో ఉన్న ఏ అంశాన్ని చేపట్టకుండానే రేపటికి వాయిదాపడింది. (ఆం.ప్ర. 21 4.88)

**ఎత్తిపోతలు** వి. (బ.వ.) *ettipootalu* చూ. లిఫ్ట్ ఇరిగేషన్; ప్రకాశం జిల్లా రావులపాలెం గ్రామంలో 5 లక్షల రూపాయల వ్యయంతో నిర్మితమైన, ఎత్తిపోతల పథకానికి రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖా మంత్రి ... ప్రారంభోత్సవం చేశారు. (ప్ర.శ 20.8.87)

**ఎత్తుగడ** వి. *ettugaDa* ఒక ప్రయోజనాన్ని ఆశించి చాకచక్యంగా వేసిన పథకం move, ploy, strategy ఎన్నికల గడువు సమీపిస్తున్నందున కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సరికొత్త ఎత్తుగడలు వేస్తున్నాయని ... ఆరోపించారు. (ఆం.భూ. 14.5 89)

**ఎదురుకాల్పులు** వి. (బ.వ.) *edurukaalpulu* (నక్సలైట్లు, టెర్రరిస్టులు మొ.)సాయుధ బృందాలు కాల్పులు జరిపినపుడు రక్షక దళాలు తిరిగి వారిపై జరిపే కాల్పులు encounter ఫరీద్‌కోట్ జిల్లాలో నేటి ఉదయం భద్రతా దళం జరిపిన ఎదురుకాల్పులలో గుర్తు తెలియని టెర్రరిస్టు చనిపోయాడు. (ఆం.ప్ర. 18.11 89)

**ఎదురుదాడి** వి. *edurudaaDi* ఎదుటి పక్షం వాళ్ళు చేసే విమర్శకు దీటైన ప్రతి విమర్శ counter attack వరద సహాయక కార్యక్రమాలు అమలు జరుగుతున్న తీరుపై కాంగ్రెస్ పక్షం చేసే విమర్శల్ని, కేంద్రం సాయం అందించక పోవడాన్ని చెప్పి ఎదురుదాడి చేయాలని ... (ఈ. 6 9 89)

**ఎద్దడి** వి. *eddaDi* నీటికొరత, తాగేనీరు

లభించక పోవటంవల్ల కలిగే ఇబ్బందికర పరిస్థితి scarcity(of water) తానం చెర్ల గ్రామంలో మంచినీటి ఎద్దడి నివారణకు ఒక బోర్‌వెల్ వేయించారు. (ఆం.ప్ర. 25 4 89)

ఎద్దేవాచేయు క్రి. *eddeevaaceeyu* పరిహాసం చేయు; ఎగతాళి చేయు to redicule, mock at, deride పేద వారి రక్షణకు గ్యారంటీ ఇవ్వలేని రాష్ట్ర ప్రభుత్వం ప్రజలకు తుపాకులకు లైసెన్సులు ఇస్తానంటోందని ఎద్దేవాచేశారు. (ఈ 22.6 89)

ఎన్‌కౌంటర్ వి. *enkaunTar* చూ. ఎదురు కాల్పులు; పౌరహక్కుల కార్యకర్తలు ఎన్‌కౌంటర్లను పోలీసులు జరుపుతున్న రాజకీయ హత్యలుగా పేర్కొనటంలో నిజంలేక పోలేదు. (ఆం భూ 14 5 89)

ఎన్నిక వి. *ennika* ప్రజాస్వామ్య పద్ధతిలో ఒక పదవికి పోటీలో ఉన్నవారి నుంచి ఒక వ్యక్తిని మెజారిటీ ద్వారా నిర్ణయించటం election ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న అలహాబాద్ లోక్‌సభ స్థానం ఎన్నిక కార్యక్రమాన్ని ఎన్నికల సంఘం ప్రకటించడంతో ఈ ఎన్నిక వాయిదా వేయించడానికి ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం చేసిన విజ్ఞప్తులను తిరస్కరించిన ట్లయింది. (ఆం.ప్ర. 20.4.88)

ఎన్నికల గోదా వి *ennikala goodaa* పోటాపోటీలుగా ఉండే ఎన్నికల రంగం election fray ఎన్నికల గోదాలో మిగిలిన అభ్యర్థులు ఎందరైనా పోటీ ప్రధానంగా ప్రతి నియోజక వర్గంలోనూ ఇద్దరు ముగ్గురు అభ్యర్థుల మధ్యనే జరుగుతుంది. (ఆం.భూ 21.11 89)

ఎన్నికల పొత్తు వి. *ennikala pottu* ఎన్నికలలో కలసి పోటీ చేయటానికి భిన్న రాజకీయ పక్షాలు కుదుర్చుకున్న ఒప్పందం poll-alliance భారత దేశంలో ముస్లిం లీగ్‌ను మతతత్వానికి ప్రతీకగా పేర్కొంటూ. దక్షిణాది రాష్ట్రాల్లో ముస్లింలీగ్‌తో ఎన్నికల పొత్తు కుదుర్చుకున్న కాంగ్రెస్ విజ్ఞతను ఆయన ప్రశ్నించారు. (ఆం ప్ర 14 6.89)

ఎన్నికల ప్రణాళిక వి. *ennikala praNaaLika* ఎన్నికల సందర్భంగా రాజకీయ పక్షాలు తమ సిద్ధాంతాలను, ముందు ముందు తమ కార్యాచరణనూ ప్రజలకు వివరించటానికి తయారు చేసే పత్రం election manifesto నేషనల్ ఫ్రంట్ ఎన్నికల ప్రణాళిక నెలరోజుల్లో ఖరారవుతుంది (ఈ. 7.6 89)

ఎన్నికల బరి వి. *ennikalā bari* చూ. ఎన్నికల గోదా మజ్లిస్‌కి గుర్తింపు తేవాలన్న లక్ష్యంతోనే నలభై ఆరు అసెంబ్లీ స్థానాలకు స్వతంత్రంగా ఎన్నికల బరిలోకి దిగినట్లు ఆ పార్టీ అధినేత ... చెబుతున్నారు. (ఈ.అను 17 11 89)

ఎన్నికల సంఘం వి. *ennikala sangham* దేశంలో ఎన్నికలు నిర్వహించటానికి ఏర్పాటయిన స్వయం ప్రతిపత్తిగల సంస్థ election commission అమేథీలో మళ్ళీ పోలింగ్ జరపాలా వద్దా అన్నది నిర్ణయించవలసినది ఎన్నికల సంఘమేనని ఆయన ఒక ప్రశ్నకు సమాధానంగా అన్నారు. (ఆం.ప్ర. 24 11 89)

ఎన్నికల సంవత్సరం వి. *ennikala samvatsaram* ఎన్నికైన ప్రభుత్వం పదవీకాలం ముగిసి మళ్ళీ ఎన్నికలు జరిపే సంవత్సరం election year ఇటీవల ఏర్పడిన కొన్ని పరిణామాల దృష్ట్యాను, ఎన్ని

కల సంవత్సరం అయినందున భద్రతా ఏర్పా ట్లను కట్టుదిట్టంచేయాలని నిర్ణయించారు. (ఆం.ప్ర 26 4.89)

ఎన్నికల సంస్కరణలు వి. (బ.వ.) *ennikala samskaraNalu* ఎన్నికలను మరింత కట్టుదిట్టంగా, న్యాయబద్ధంగా నిర్వహించటానికి ఉద్దేశించిన మార్పులు electoral reforms ప్రస్తుత పార్ల మెంట్ సమావేశాల్లోనే ఎన్నికల సంస్కరణల బిల్లును ప్రవేశపెట్టాలని ప్రభుత్వం భావిస్తు న్నట్లు ఎన్నికల సంస్కరణలపై ప్రతిపక్షాల నాయకులతో జరిపిన సమావేశంలో చెప్పి నట్లు ... (ఆం.ప్ర 29 11.88)

ఎన్నికల స్టంట్ వి. *ennikala sTanT* ఎన్నికలలో గెలవటంకోసం వేసే ఎత్తు గడ election stunt ప్రతిపక్షాలు చర్య హుందాగా లేదని ఉత్త ఎన్నికల స్టంట్ అని ... విమర్శించారు. (ఆం.ప్ర 25 7.89)

ఎన్యూమరేషన్ వి. *enyuumareeSan* నిత్యావసర వస్తువుల పంపిణీ కోసం, ఓటర్ల జాబితాలకోసం అర్హులైన వారిని క్రమపద్ధతిలో నమోదు చేసే కార్య క్రమం enumeration నారాయణ పేట పట్టణంలో రేషన్ కార్డుల ఎన్యూమరేషన్ సక్రమంగా జరగలేదని ప్రజలు తెలిపారు. (ఆం భూ 6 6 87)

ఎఫ్.ఐ.ఆర్. వి. *ef.ai.aar.* నేరం జరిగిన వెంటనే బాధితులు ఇచ్చిన ప్రాథ మిక సమాచారం ఆధారంగా పోలీ సులు తయారు చేసే తొలి నివే దిక First Information Report కాంగ్రెస్ సభ్యుడు శ్రీ వంగవీటి మోహన రంగారావు హత్య కేసులో ... ను దోషిగా ఎఫ్.ఐ.ఆర్.లో పేర్కొనడం జరి గింది. (ఆం భూ 21 5 89)

ఎమర్జెన్సీ వి. *emarjensii* చూ. అత్యవసర పరిస్థితి; 1975, జూన్ 26వ తేదీన ఎమర్జెన్సీ విధించిన తర్వాత ఎన్నికల చట్టం (సవరణ) బిల్లునొక దానిని ఆగస్టు 5వ తేదీన లోక్‌స భలో, ఆ మరునాడు రాజ్యసభలో ప్రభుత్వం ప్రవేశపెట్టి ఆమోదింప జేసింది. (ఆం.ప్ర 3 7 89)

ఎమికస్‌క్యూరీ వి. *emikaskyuurii* అత్యంత ప్రాముఖ్యం కలిగిన విషయాలపై న్యాయస్థానాలకు సలహాలిచ్చే న్యాయ నిపు ణుడు amicuscuriae ముఖ్యమంత్రి సినిమాల్లో నటించడం రాజ్యాంగ బద్ధమా, కాదా అన్న విషయంలో జరుగుతున్న విచారణలో తమకు "ఎమికస్‌క్యూరీ" హోదాలో (కోర్టు మిత్రుడు) తోడ్పడవల సిందిగా ఫుల్‌బెంచ్ భారత అటార్నీ జనరల్ శ్రీ పరాశరన్‌ను కోరింది. (ఈ 18 8.89)

ఎయిడ్స్ వి. *eyiDs* మనిషిలోని రోగ నిరోధక శక్తిని హరించి వేసి మరణానికి దారితీసే భయంకరమైన సుఖ వ్యాధి AIDS (Acquired Immune Deficiency Syndrome) చికిత్సకు అందకుండా, రోగిని పరలోకానికి పంపే ఎయిడ్స్ వ్యాధి నుంచి పురుషులు రక్షణ పొందడానికి సుంతీ చేయించుకోవడం మంచిదని ఇటీవలి కాలంలో జరిగిన కొన్ని పరిశోధనలలో వెల్లడైంది. (ఆం.భూ. 10.8.89)

ఎయిర్ కండిషన్‌చేయు క్రి. *eyir kan-DiSanceeyu* గది ఉష్ణోగ్రతను యంత్ర సహాయంతో క్రమబద్ధం చేయు to air condition లేపాక్షి షోరూం గ్రాండ్

ఫ్లోర్‌ను పూర్తిగా ఎయిర్ కండిషన్‌చేసినట్లు ఆయన తెలిపారు. (ఆంప్ర 8 10.87)

**ఎయిర్‌బస్ మంత్రివర్గం** వి. *eyirbas mantrivargam* అనవాయితీని మించి అత్యధిక సంఖ్యలో మంత్రులున్న మంత్రి వర్గం air-bus cabinet ఆంధ్రప్రదేశ్‌లో అతిపెద్ద మంత్రివర్గం ఏర్పాటు చేసిన ఘనత శ్రీ టంగుటూరి అంజయ్యది ... తన మంత్రివర్గాన్ని 'ఎయిర్‌బస్'తో పోల్చి, విమానం ఎంత పెద్దదయితే, ప్రయాణం అంత హాయిగా వుంటుంది కదా అని తన చర్యను సమర్థించుకున్నారు. (ఆం-జ్యో 21 7.87)

**ఎరియర్స్** వి. *eriyars* సవరించిన లేదా పెంచిన జీతభత్యాల విషయంలో యాజమాన్యం బాకీపడ్డ సొమ్ము arrears ఎరియర్స్ మొత్తాన్ని వెంటనే చెల్లించాలని కార్మికులు కోరుతున్నారని, అయితే ఇది సాధ్యం కాదని ఆయన స్పష్టం చేశారు. (ఆం-జ్యో 26.6 87)

**ఎస్.ఓ.ఎస్. సందేశం** వి. *es.oo.es. sandeeśam* తక్షణ అవసరం తెలుపుతూ లేదా సహాయం కోరుతూ పంపే వర్తమానం s.o.s (save our souls) message గుంటూరు జిల్లా పర్యటనలో ఉన్న హోంమంత్రి డాక్టర్ కోడెల శివప్రసాదరావును కూడా సామవారం తెల్లవారేసరికి ఎస్.ఓ.ఎస్. సందేశం ద్వారా నగరానికి రప్పించారు. (ఉ. 2912 87)

**ఎసరుపెట్టు** క్రి. *esarupeTTu* అపకారం చేయటానికి ఒడిగట్టు to take aim at or to target sb or sth (with the intention of doing harm) తమ నిజస్వరూపం బట్టబయలు కాకుండా చూసేందుకు పార్లమెంటు అధికారాలకే ఎసరుపెట్టారని ఆయన వివరించారు. (ఈ. 26 5 89)

**ఎస్కార్ట్** వి. *eskaarT* ప్రయాణంలో వెంట ఉండి రక్షణ కల్పించే సాయుధ భటులు లేదా వాహనాలు escort తీవ్రవాదుల ప్రాబల్యం ఉన్న ప్రాంతాలకు ముందు జాగ్రత్తగా బస్సులను పోలీసు ఎస్కార్ట్ సహాయంతో నడిపిస్తున్నారు (ఈ. 26 6.87)

## ఏ

**ఏంటెన్నా** వి. *eenTennaa* వాతావరణం నుంచి ధ్వని దృశ్య తరంగాలను సేకరించే టెలివిజన్ పరికరం antenna(television) ఇక్కడ నాలుగైదు ఇళ్ళ పైకప్పుల నుంచి టెలివిజన్ ఏంటెన్నాలు మాయం కావటం పట్టణంలో సంచలనం కలిగించింది. (ఆంప్ర 26 4 89)

**ఏకగవాక్ష విధానం** వి. *eekagavaakSa vidhaanam* రైతులకు రకరకాల పరపతి సౌకర్యాలను ఒకే చోట నుంచి కల్పించే పథకం single window system తెలుగు దేశం ప్రభుత్వం ప్రవేశ పెట్టిన ఏకగవాక్ష(సింగిల్ విండో) విధానాన్ని రద్దుచేసే సూచనలు కనిపిస్తున్నాయి. (ఆంప్ర 14.12 89)

**ఏకగ్రీవం** వి. *eekagriivam* ఎటువంటి పోటీ లేకపోవటం unanimous, unopposed కార్యవర్గ సభ్యులుగా జి. సత్యనారాయణ, డి. శ్రీనివాస్‌లు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. (విశా. 6 10 87)

**ఏకచ్ఛత్రాధిపతి** వి. *eekacchatraadhipati* (సంస్థపై) తిరుగులేని అధికారాన్ని చలాయించే నాయకుడు లేదా అధికారి

sole monarch ప్రభుత్వరంగ సంస్థలు తమ వ్యక్తిగత సంస్థలుగానూ, వాటికి తామే ఏకచ్ఛత్రాధిపతులుగానూ, అధికారులు భావించరాదని ... (ఆంప్ర 12.4.88)

**ఏకపక్షం** వి. *eekapakSam* 1. ఒక వ్యవహారంతో సంబంధమున్న ఇతర పక్షాల అభిప్రాయం లేదా మద్దతుతో నిమిత్తం లేకుండా నిర్ణయం చేయటం unilateral ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గం జాబితాను పి.సి.సి.ఐ. అధ్యక్షుడు శ్రీ ఎన్.జనార్ధన రెడ్డి ఏకపక్షంగా ప్రకటించటం పట్ల ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్ గాంధీ ఆగ్రహం వ్యక్తం చేసినట్లు తెలిసింది. (ఆంప్ర. 23.2.89) one-sided ఇక్కడ శివాజీ స్టేడియంలో ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్ జట్ల మధ్య బుధవారం జరిగిన మ్యాచ్ ఏకపక్షంగా సాగింది. 2. పూర్తిగా ఒకే పక్షం ఆధిపత్యం కొనసాగటం

**ఏకరువుపెట్టు** క్రి. *eekaruvupeTTu* ఒక విషయాన్ని పదేపదే చెప్ప లేదా భిన్న విషయాలను ఒకేసారి వరుసగా చెప్ప to list out or narrate(repeatedly) తనను వేధిస్తున్న సమస్యలన్నిటికీ 'రా'(ఆర్.ఎ. డబ్ల్యు) యే కారణమని సభా ప్రసంగాలలోనూ, ఆంతరంగిక చర్చలలోనూ ఏకరువు పెడుతున్నారు. (ఈ. 22.8 89)

**ఏకసూత్రత** వి *eekasuutrata* వేర్వేరు విషయాలను ఒక్కటిగా కలిపి ఉంచే అంశం unifying aspect or factor ఎన్ని విభిన్న ధోరణులున్నప్పటికీ ఇండియా అంతటినీ కలిపే ఏకసూత్రత ఒకటి ఉంది. (ఆం.భూ. 10.8.89)

**ఏకాభిప్రాయం** వి. *eekaabhipraayam* ఒక విషయంపైన భిన్న వ్యక్తుల లేదా గ్రూపుల మధ్య ఏర్పడే ఒకే మోస్తరు అవగాహన consensus వివాదాస్పదమైన పంచాయితీరాజ్, నగర పాలికా బిల్లులపై అనుసరించాల్సిన వ్యూహానికి సంబంధించి ప్రతిపక్ష పార్టీల నాయకులు ఏకాభిప్రాయం సాధించక పోవడం వల్ల రేపు రాజ్యసభలో భిన్నాభిప్రాయాలు వ్యక్తంచేసే సూచనలు కనబడుతున్నాయి. (ఈ 14.8.89)

**ఏరివేత** వి. *eeriveeta* (రాజకీయాల్లో) తీవ్ర సమస్యగా పరిణమించిన ప్రత్యర్థి వ్యక్తుల్ని లేదా గ్రూపుల్ని నిర్మూలించటం liquidation (of political opponents) ఆ ప్రాంతంలో దాగున్న గెరిల్లాల ఏరివేత నెపంతో నిరాయుధులు, నిరపరాధులు అయిన సాధారణ తమిళ పౌరులను ... ఊచకోత కోయడం మొదలు పెట్టింది. (ఆంజ్యో. 26 6.87)

**ఏలుబడి** వి. *eelubaDi* ఒక నేత లేదా పార్టీ పరిపాలించిన కాలం rule, tenure(in office) ఎమర్జెన్సీ అత్యాచార పర్వంలో విచ్చల విడిగా విజృంభించి ... కుమారుడి ఏలుబడి లో పరాకాష్ఠకు చేరింది. (ఈ 20 4 89)

**ఏవరేజ్** వి. *eevareej* క్రికెట్ ఆటలో ఒక బ్యాట్స్‌మెన్ ఆడిన ఇన్నింగ్స్ సంఖ్యతో చేసిన పరుగులను భాగించినప్పుడు, బౌలరు తీసుకున్న వికెట్లతో అతడు ఇచ్చిన పరుగులను భాగించినప్పుడు వచ్చే సంఖ్య; సరాసరి average ఇక ఈ సిరీస్‌లో 'ఏవరేజ్'ల విషయంలో బ్యాటింగ్‌లోనూ, బౌలింగ్ లోనూ

కూడా ఆస్ట్రేలియన్లదే పైచేయిగా ఉంది. (ఆం.ప్ర. 31 8 89)

ఏహ్యాభావం వి. *eehyabhaavam* వ్యక్తులు లేదా విషయాల పట్ల ఏర్పడే తీవ్రమైన అయిష్టత లేదా ఏవగింపు aversion మేధావులూ, విజ్ఞులూ రాజకీయ సినిమా రంగాలకు దూరంగా ఉంటున్నారు. అవి తమకు పనికిరావన్నట్టుగా ఏహ్యాభావాన్ని పెంచుకుంటున్నారు. (ఆం.భూ. 15 7 89)

ఐ

ఐక్యంగా క్రి.విశ. *aikyangaa* భిన్న వ్యక్తులు సంస్థలు ఒకే విధమైన అవగాహన, ఆచరణలతో కలిసికట్టుగా; ఒకటిగా unitedly తద్వారా ప్రతిపక్ష పార్టీలు ఉమ్మడి వేదికపై ఐక్యంగా వ్యవహరించడానికి వీలవుతుంది. (ఈ 22.8.89)

ఐక్య కార్యాచరణ పథకం వి. *aikya kaaryaacaraNa pathakam* భిన్న బృందాలు కలిసికట్టుగా వ్యవహరించేందుకు తయారు చేసుకున్న ఉమ్మడి కార్యక్రమ ప్రణాళిక joint-action plan కొన్ని ప్రత్యేక సమస్యలపై ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఐక్య కార్యాచరణ పథకం రూపొందించేందుకు ప్రతిపక్ష పార్టీలు బుధవారం సమావేశం కానున్నాయి. (ఉ 9.9 87)

ఐక్య ప్రతిపక్షం వి. *aikya pratipakSam* భావ సారూప్యం కలిగిన వివిధ రాజకీయ పక్షాల కూటమి united opposition జనతాపార్టీ, జనమోర్చా, లోక్‌దళ్, కాంగ్రెస్(ఎస్)లతో అక్టోబర్ 11వ తేదీన ఆవిర్భవించనున్న ఐక్య ప్రతిపక్ష పార్టీకి శ్రీ విశ్వనాథ ప్రతాప్ సింగ్ 17మంది సభ్యులతో కూడిన సారథ్య సంఘాన్ని నేడు ప్రకటించారు. (ఆం ప్ర. 30 9 88)

ఐక్యరాజ్యసమితి వి. *aikyaraajyasamiti* అంతర్జాతీయ సహకారం, శాంతి భద్రతల పరిరక్షణకోసం సభ్యదేశాలతో ఏర్పడిన సంస్థ United Nations Organisation గవర్నర్ జనరల్ గని లాపు అధికార హోదానే తాము గుర్తిస్తామని న్యూజిలాండ్ విదేశాంగ మంత్రి రస్సెల్ మార్షల్ ఐక్యరాజ్యసమితిలో స్పష్టం చేశారు. (ఆం ప్ర 9 10 87)

ఐదు నక్షత్రాల హోటల్ వి. *aidu nakSatraala hooTal* అత్యంత ఖరీదైన పరుపాయాలతో కూడిన విలాసవంతమైన హోటల్(హోటల్ స్థాయిని బట్టి నక్షత్రాల సంఖ్యను కేటాయిస్తారు) five-star hotel చారిత్రాత్మకమైన మహారాష్ట్ర ముఖ్యమంత్రి అంతూలే అవినీతి కుంభ కోణాల్లో టాటా గ్రూప్‌కు చెందిన అయిదు నక్షత్రాల తాజ్ హోటళ్ళు పీకలదాకా కూరుకు పోయిన సంగతి జగమెరిగిన సత్యమని ఆయన అన్నారు. (ఆం.జ్యో 11.6.87)

ఒ

ఒంటెద్దు పోకడ వి. *onTeddupookaDa* ఎవరితోనూ కలవక ఒంటరి విధానం అనుసరించటం driving or leading in his own way నియంతృత్వ స్వార్థ పూరిత విధానాలతో ఒంటెద్దు పోకడలతో రాష్ట్రాభివృద్ధిని విస్మరించి జాతీయ నాయకత్వానికి ఎదగడానికి పథకం ప్రకారం పనిచేస్తూ... (ఆం.భూ. 27.4 89)

**ఒ.ఎన్.జి.సి.** వి. *o.en.ji.si.* చమురు సహజ వాయువుల ఉత్పత్తి పంపిణీ మొ. వ్యవహారాలను చూసేందుకు ఏర్పాటయిన సంస్థ; చమురు సహజవాయువుల కమీషన్ Oil and Natural Gas Commission (ONGC) *అమలాపురం పట్టణానికి పాతిక కిలోమీటర్ల దూరాన సముద్ర గర్భంలో చమురు, సహజవాయువు నిక్షేపాలను ఒఎన్‌జిసి గుర్తించింది.* (ఈ. 22.7 87)

**ఒజ్జబంతి** వి. *ojjabanti* ఒక రంగంలో ప్రతిభా నైపుణ్యాలతో ఇతరులకు ఆదర్శప్రాయమైన వ్యక్తి; మార్గదర్శి model *నాటకరంగంలో గోవిందరాజుల సుబ్బారావు, స్థానం, మాధవపెద్ది, వేమూరి గగ్గయ్య, గరికపాటి రాజారావు ఒజ్జబంతులయ్యారు.* (ఆం.భూ. 1 6.89)

**ఒడంబడిక** వి. *oDambaDika* ఇరు వర్గాల మధ్య ఒక సమస్యపై కుదిరే అంగీకారం; ఒప్పందం pact, treaty, agreement *కోర్టు నిర్ణయాలతో ఈ వివాదం పరిష్కారం కాకపోవచ్చునని పలువురు అభిప్రాయ పడటంతో, ఈ సమస్య పరస్పర ఒడంబడిక ద్వారా పరిష్కారమయితే ...* (ఈ. 18.5 89)

**ఒడిగట్టు** క్రి. *oDigaTTu* కూడని పనులకు పాల్పడు to resort to(undesirable action) *స్థానిక సమస్యలను పరిష్కరించడానికి అవసరమైన అధికారాలను కూడా లేకుండా చేయడం వగైరా దుశ్చర్యలకు రాష్ట్ర ప్రభుత్వాలు ఒడిగట్టిన మాట యథార్థం.* (ఈ. 3 5 89)

**ఒడిదుడుకులు** వి. (బ.వ) *oDiduDukulu* స్థిరత్వం, భద్రతలేని స్థితి insecure and unstable conditions, hardships *చైనా, సోవియట్ దేశ చరిత్రలు, పార్టీ వ్యవహారాలు ఎన్నో మిట్టపల్లాలను, ఒడిదుడుకులను చూశాయని ఆయన అన్నారు.* (ఆం.భూ 17.5 89)

**ఒత్తిడి** వి. *ottiDi* ఇతరుల నిర్ణయాలను ప్రభావితం చేసేందుకు ఉపయోగించే పలుకుబడి లేదా అధికారం pressure, influence *కేవలం దేశంకోసమే, అది కూడా భారత క్రికెట్ బోర్డు మాజీ కార్యదర్శి ... ఒత్తిడి వల్లనే రిటైర్ కావాలన్న తన నిర్ణయాన్ని మార్చుకున్నానని పాటిల్ వివరించారు.* (ఈ. 2 9.89)

**ఒనగూడు** క్రి. *onaguuDu* ఏదైనా మంచి చేకూరు లేదా సిద్ధించు to get(a favourable result) *సి.హెచ్. రాజేశ్వరరావు మాట్లాడుతూ ఎటువంటి విధులునిధులు లేక నామ మాత్రమై పోతున్న పంచాయితీరాజ్ వ్యవస్థలకు ఈ బిల్లు వలన పరిమితమైన ప్రయోజనాలు మాత్రమే ఒనగూడుతాయని అన్నారు.* (ఈ.అను 15.6.89)

**ఒన్ వే** వి. *on vee* రోడ్లపై వాహనాలు ఒకవైపుకే ప్రయాణించటం one-way *ట్రాఫిక్‌ను సుగమం చేయడానికి ఒన్ వే రూల్స్‌ను అధిగమించాల్సివచ్చింది.* (ఆం.ప్ర 28.8.87)

**ఒప్పందం** వి. *oppandam* చూ. ఒడంబడిక. *40 లక్షల యూనిట్ల విద్యుత్ సరఫరా చేయడానికి మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ ప్రభుత్వాలు అంగీకరించాయి. ఈ విషయమై ఒక ఒప్పందం కూడా కుదిరిందని ముఖ్యమంత్రి*

... తెలియజేశారు. (ఆం.జ్యో. 19 4.88)

**ఒరగబెట్టు** క్రి. *oragabeTTu* ప్రయోజనం చేకూర్చు to help, contribute *ఈ సందర్భంగా మాట్లాడుతూ గత ఆరు సంవత్సరాలు తెలుగుదేశం పాలన ఏమి ఒరగబెట్టిందని ప్రశ్నించారు* (ఆం.భూ 11.7 89)

**ఒలకబోయు** క్రి. *olakabooyu* లేని ప్రేమ, అభిమానం చూపించు to pretend false love or affection *సార్వత్రిక ఎన్నికలను దృష్టిలో ఉంచుకొని స్థానిక సంస్థలపై ప్రేమను ఒలకబోస్తున్నారని అన్నారు.* (ఈ 2.6 89)

**ఒలింపిక్ క్రీడలు** వి. (బ.వ.) *olimpik kriiDalu* అంతర్జాతీయ క్రీడల పోటీలు(ఇవి నాలుగేళ్ళ కొకసారి నిర్ణీత దేశంలో జరుగుతాయి) olympic games *ఇరవై నాలుగవ ఒలింపిక్ క్రీడలు జరుగనున్న సియోల్ అన్ని హంగులతో ముస్తాబుకు తల మునకలై ఉంది.* (ఆం.భూ 25.11.87)

ఓ

**ఓటరు** వి. *ooTaru* ఎన్నికలలో ఓటు వేయటానికి అర్హతకల పౌరుడు(18 ఏళ్ళు నిండిన వ్యక్తి) voter *మొదటి దశ పోలింగ్‌లో 2,569 మంది అభ్యర్థులు సుమారు ఇరవై కోట్ల పది లక్షల మంది ఓటర్ల తీర్పుకోసం ఎదురు చూస్తున్నారు.* (ఆం.ప్ర 20 11 89)

**ఓటర్ల జాబితా** వి. *ooTarla jaabitaa* ఎన్నికలలో ఓటువేయటానికి అర్హత ఉన్న పౌరుల పేర్ల లిస్టు voters list *ప్రతిఫలం చాలనందున ఓటర్ల జాబితాపని తిరస్కరించినందుకు గాను నాగార్జున సాగర్ ఉపాధ్యాయులు నలుగురిని సస్పెండ్ చేయడాన్ని* ... (ఆం.భూ 21.7.87)

**ఓట్ఆన్అకౌంట్ బడ్జెట్** వి. *ooTaan-akaunT baDjeT* (సమయం తక్కువగా ఉన్నప్పుడు) పూర్తి వివరాలు లేకుండా క్లుప్తంగా రూపొందించే బడ్జెట్; vote on account budget *వచ్చే మార్చి నెలలో ప్రతిపాదించవలసిన రాష్ట్ర బడ్జెట్ పూర్తి స్థాయిలో కాకుండా 'ఓట్ఆన్అకౌంట్' బడ్జెట్ మాత్రమే ప్రవేశపెట్టాలని రాష్ట్ర నూతన ప్రభుత్వం భావిస్తున్నది.* (ఆం.ప్ర 15 12 89)

**ఓటువేయు** క్రి. *ooTuveeyu* ఎన్నికలలో తనకు నచ్చిన అభ్యర్థిని బ్యాలెట్ పత్రం ద్వారా సూచించు to vote *అనారోగ్య పరిస్థితిలో ఉన్న వృద్ధులు కూడా ఓట్లు వేశారు.* (ఆం.ప్ర. 24 11.89)

**ఓటు హక్కు** వి. *ooTu hakku* బ్యాలెట్ పత్రం ద్వారా తనకు నచ్చిన అభ్యర్థిని ఎంపిక చేసే అధికారం franchise, right to vote *హర్యానా శాసన సభకు నేడు జరిగిన ఎన్నికల్లో మొత్తం 84 లక్షల మంది ఓటర్లలో దాదాపు 67శాతం మంది తమ ఓటు హక్కును వినియోగించుకొన్నారు.* (విశా 18 6 87)

**ఓట్ల నిధి** వి. *ooTla nidhi* ఎన్నికలలో ఒక పార్టీకి మూకుమ్మడిగా ఓట్లు వేసే వర్గం(మైనారిటీలు, స్త్రీలు, బడుగువర్గాలు మొ.) vote bank *కాంగ్రెస్(ఐ) అసమ్మతి వర్గీయులు, ఇంకా ప్రతిపక్షాలు అన్నీ కలిపినా కాంగ్రెస్(ఐ) ఓట్ల నిధికి గండి కొట్టలేమనుకుంటున్నారు.* (ఆం.ప. 24.9 87)

**ఓట్ల బ్యాంకు** వి. *ooTla byaanku* చూ. ఓట్లనిధి; *శ్రీ ఖుర్షీద్ అహమ్మద్‌కు వ్యక్తిగతంగా గణనీయమైన ఓట్ల బ్యాంకు ఉంది.* (ఆం.ప్ర. 18.11 89)

**ఓపెనర్** వి. *oopenar* క్రికెట్ ఆటలో ఇన్నింగ్స్‌ను ప్రారంభించే బ్యాట్స్‌మన్ opener(as in cricket) ఓపెనర్‌గా వచ్చి ఇన్నింగ్స్ ముగిసే వరకు నాటౌట్‌గా వుండే ప్రత్యేకతను డెస్మండ్ హెయిన్స్ కొద్దిలో కోల్పోయారు. (ఆం.జ్యో. 27.11.87)

**ఓలలాడించు** క్రి. *oolalaaDincu* తన్మయత్వంలో ముంచి తేల్చు to immerse జ్ఞానేశ్వర్, శంకర్‌దేవ, నామదేవ, కబీర్, తుకారాం, బసవ, నర్సిమెహతా, సూరదాసు, మీరాబాయి, గురునానక్ యావదాంధ్ర దేశాన్ని తమతమ భక్తి ఉద్యమాలతో ఓలలాడించారు. (ఆం భూ 28.8.89)

**ఓవర్** వి. *oovar* క్రికెట్ ఆటలో బౌలరు ఒక విడతలో వేసే ఆరు బంతులు over(as in cricket) ఇండియా, వెస్టిండీస్‌ల మధ్య చాలెంజ్ సీరిస్‌లో ఓవర్లు తక్కువ వేసిన జట్టుకు జరిమానా విధించాలని ఇండియా, వెస్టిండీస్ క్రికెట్ బోర్డులు అంగీకరించాయి. (ఆం.జ్యో. 26 11 87)

**ఓవర్‌టేక్‌చేయు** క్రి. *oovarTeekceeyu* ముందుగా వెళ్ళే వాహనాన్ని వెనక వచ్చే వాహనం దాటి పోవు to overtake హైదరాబాద్ విజయవాడ జాతీయ రహదారిపై వెళ్ళే లారీ మరో వాహనాన్ని ఓవర్‌టేక్‌చేస్తుండగా ఈ ప్రమాదం జరిగింది. (ఆం.భూ. 1.5.89)

**ఓవర్ డ్రాఫ్టు** వి. *oovar DraafT* ఖాతాదారులు తమ ఖాతాలో ఉన్న నిలవకు మించి డ్రా చేయడానికి అనుమతించిన మొత్తం overdraft రాష్ట్రాల విషయంలో బకాయీలు ఉండరాదని, ఓవర్ డ్రాఫ్టులు అంగీకరించేది లేదని పదేపదే శ్రీరంగనీతులు చెప్పడం పరిపాటి అయింది. (ఆం.ప్ర. 20 2.89)

క

**కంకణం కట్టుకొను** క్రి. *kankaNam kaTTukonu* ఒక పనిని ఖచ్చితంగా సాధించాలని నిశ్చయించు to be determined ముఖ్యమంత్రి నియంతృత్వ ధోరణుల నుంచి రాష్ట్ర ప్రజలను విముక్తుల్ని చేసేందుకు కంకణం కట్టుకున్నామని ... అన్నారు. (ఈ. 8.5.89)

**కంచుకోట** వి. *kancukooTa* తిరుగులేని మద్దతు ఉన్న ప్రాంతం bastion, a place of strong hold ఆలూరు కాంగ్రెస్‌కు కంచుకోటని, తె.దే. పార్టీ ఎన్ని ఆశలు పెట్టినా ఎన్నికల్లో తిరిగి ... (ఉ 29.6.87)

**కంటగింపు** వి. *kanTagimpu* ఇతరుల స్థితి, ప్రవర్తనను చూసి ఓర్వలేని తనం eyesore మెదక్ జిల్లా కలెక్టర్ ఎటువంటి రాజకీయ వత్తిడులకు లొంగకుండా స్వతంత్రంగా వ్యవహరిస్తుండడం, అభివృద్ధి కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనడంవల్ల 'దేశం' కార్యకర్తలకు కంటగింపుగా తయారైంది. (ఆం భూ. 18.5.89)

**కంటితుడుపు చర్య** వి. *kanTituDupu carya* కేవలం ఇతరులను సంతృప్తి పరచేందుకు తీసుకునే నామ మాత్రపు చర్య an eyewash బోఫోర్స్ వ్యవహారంలో 'కమీషన్' మింగిన విన్ చెద్దాపై ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ ఇటీవల జరిపిన దాడి ప్రజలను తప్పుదారి పట్టించేందుకు ఆడిన నాటకమని, కంటితుడుపు చర్య అని ... వ్యాఖ్యానించారు. (ఆం.జ్యో 11.6.87)

**కంటోన్మెంట్** వి. *kanToonmenT* శాశ్వత సైనిక శిబిరం cantonment భారత్ బంద్ ప్రభావం కంటోన్మెంట్ ప్రాంతంపై రవ్వంత కూడా పడలేదని, దుకాణాలు తెరిచే ఉన్నాయని ... పేర్కొన్నారు.

(ఆంప్ర 1989)

**కంట్రోలుధర** వి. *kanTrooludhara* ప్రజలకు సరఫరా చేయాల్సిన వస్తువులకి ప్రభుత్వం అనుమతించిన ధర controled rate, price regulated by government ... ఈ పరిశ్రమల్లో ఇంధనంగా ఉపయోగించే ప్రత్యేక బొగ్గును కంట్రోలుధరకు సరఫరా చేయాలని ... (ఆంప్ర 26.4.89)

**కండబలం** వి. *kanDabalam* దౌర్జన్యంగా, బలప్రయోగం ద్వారా పనులను సాధించుకోడానికి ప్రముఖులు చేరదీసే అసాంఘిక శక్తుల బృందం power derived by keeping a group of anti-social elements to threaten one's rivals; muscle power ధనబలం కండబలంతో అధికారం చేజిక్కించుకోవాలన్న ఆశ, ఆసక్తి తమ పార్టీకి లేదని ... అన్నారు (ఈ. 26.4.89)

**కంప్యూటర్** వి. *kampyuuTar* సమాచారాన్ని అతివేగంగా విశ్లేషించడానికి, అపరిమితంగా దాచడానికి ఉపయోగపడే ఎలక్ట్రానిక్ యంత్రం computer పూర్తి స్వదేశీ పరిజ్ఞానంతో తయారైన పర్సనల్ కంప్యూటర్ రానున్న రెండు నెలల్లో మార్కెట్‌లోకి విడుదల అవుతున్నట్లు ... (ఆంప్ర. 21.4.88)

**కంప్యూటర్ వైరస్** వి. *kampyuuTar vairas* కంప్యూటర్‌లో నిక్షిప్తం చేసిన సమాచారాన్ని దెబ్బతీసే దురుద్దేశంతో ప్రవేశపెట్టిన ఒక ప్రణాళిక computer virus 'కంప్యూటర్ వైరస్'లకు సంబంధించిన కేసులను సవివరంగా పరిశీలించేందుకే ఎలక్ట్రానిక్ శాఖ నిపుణుల సంఘాన్ని ఏర్పాటు చేసిందని ... తెలిపారు. (ఆం.భూ 26.4.89)

**కకావికలుచేయు** క్రి. *kakaavikaluceeyu* చెల్లాచెదరు చేయు to shatter (the defence of opponents) ఆట తొలి అర్థ భాగంలో పాక్ రక్షణ వలయాన్ని కకావికలుచేసిన దక్షిణ కొరియా 2-0 ఆధిక్యం సంపాదించింది. (ఈ. 27.12.89)

**కక్కుర్తి** వి. *kakkurti* డబ్బు మొ. వాటి విషయంలో చూపించే అత్యాశ greed రాజకీయ పక్షపాతంతో డబ్బు కక్కుర్తితో పోలీసులు ఆ వర్గానికే దన్ను కాస్తున్నారని ఆయన ఆరోపించారు. (ఆంభూ 27.4.89)

**కక్కుర్తిపడు** క్రి. *kakkurtipaDu* డబ్బు మొ.ప్రలోభాలకు లోనగు to be greedy (for wealth, money etc.) ... అమెరికా, కెనడాలకు చల్లగా జారుకొని సులువుగా కొంచెం డబ్బు చేసుకోవడానికి కక్కుర్తిపడ్డారు. (ఈ 14.8.89)

**కక్షసాధింపు చర్య** వి. *kakSasaadhimpu carya* ప్రతీకారం తీర్చుకోవడమే ఉద్దేశ్యంగా చేసేపని vindictive action, an act of harassment నేషనల్ ఫ్రంట్ అధికారంలోకి వస్తే రాజకీయ ప్రత్యర్థులపై కక్షసాధింపు చర్యలకు పాల్పడబోదని ... అన్నారు (ఆంప్ర 15.11.89)

**కక్షిదారు** వి. *kakSidaaru* ఇతరులు తన మీద పెట్టిన కేసులో తాను తప్పు చేయలేదని వాదించుకోవాల్సిన వ్యక్తి defendant (legal) పన్ను ఎక్సయిజ్, దేవాదాయ సంస్థలు పోలీసు కమీషనర్‌ను తన అఫిడవిట్‌లో కక్షిదారులుగా పిటిషనర్ చేశారు. (ఆంభూ 2.5.89)

**కటకటపడు** క్రి. *kaTakaTapaDu* లేమితో తీవ్రమైన ఇబ్బందులు ఎదుర్కొను to suffer from(poverty or lack of some essential items) ఉత్తర

దక్షిణాది ప్రాంతాల ప్రజలు త్రాగే నీటికి ఎంతో కటకటపడుతున్నారు. (ఆం భూ 22.4 89)

**కటకటాలు** వి. (బ.వ.) *kaTakaTaalu* నేరస్థుల్ని నిర్బంధించే ఖైదు; జైలు prison *యజమాని మెప్పుకోసం పాత బాకీ వసూలు చేసేందుకు వేసిన చిట్కా బెడిసికొట్టి సదరు వ్యక్తులు కటకటాల పాలైన ఉదంతం ... జరిగింది.* (ఆం భూ 3 7 89)

**కటౌట్** వి. *kaTauT* ప్రచారంకోసం తయారుచేసిన నాయకుల లేదా సినిమా తారల భారీసైజు బొమ్మ cutout *శంఖ చక్ర గదాధారిగా శ్రీ మహా విష్ణువు పాత్రలో ఉన్న ఎన్టీఆర్ కటౌట్‌ను అమర్చిన ఓపెన్ టాప్ జీపును ... తెచ్చారు.* (ఆం.ప్ర 27.4 88)

**కట్టబెట్టు** క్రి. *kaTTabeTTu* పదవి,సౌకర్యాలు మొ. కల్పించు to provide (a position or facility etc.) *తెలుగుదేశం పార్టీకి చెందిన అస్మదీయులకే చౌక డిపో డీలర్‌షిప్‌లు కట్టబెట్టడానికి ... కొత్త ఎత్తు వేశారు.* (ఈ. 12.5 89)

**కట్టుకథ** వి. *kaTTukatha* నిజాన్ని దాచిపుచ్చేందుకు చెప్పే కథనం false story, concocted story *అటవీ శాఖ అధికారులకు లంచాలుదొరకకుండా చూశానన్న కోపంతో అటవీశాఖ అధికారులు ఇటువంటి కట్టుకథలు ప్రచారం చేస్తున్నారని ఆయన ఒక ప్రకటనలో పేర్కొన్నారు.* (ఆం జ్యో. 8.4 88)

**కట్టుదిట్టంచేయు** క్రి *kaTTudiTTam-ceeyu* ఉన్న వ్యవస్థను లోటుపాట్లు లేకుండా మరింత సమర్థవంతంగాచేయు to tighten up *ఎన్.టి.ఆర్ భద్రతా చర్యలను గురువారం నుంచి మరింత కట్టుదిట్టంచేశారు.* (ఈ 12 5.89)

**కట్టుబడు** క్రి. *kaTTubaDu* నియమాలకు, నిర్ణయాలకు లోబడు to obey, stick to, abide *బాబరీ మసీదు-రామ జన్మభూమి వివాదంపై కోర్టు తీర్పునకు కట్టుబడి ఉండడానికి విశ్వహిందూ పరిషత్ అంగీకరించిందని ... తెలిపారు* (ఈ. 28 7 89)

**కట్టుబాటు** వి. *kaTTubaa-Tu* ఏ కార్యక్రమానికైనా, సంస్థకైనా సంబంధించిన నియమం rule, regulation, restriction *ప్రొఫెషనల్ కట్టుబాట్లను ఉల్లంఘించిన క్రీడాకారునికి 7,50,000 డాలర్ల వరకు జరిమానా విధించ వచ్చని ఇటలీ సాకర్ నిబంధనలు నిర్దేశిస్తున్నాయి.* (ఈ 24 8 89)

**కట్టుబానిస** వి. *kaTTubaanisa* పనికి తగ్గ ప్రతిఫలం లేకుండా చాకిరీ చేసే వ్యక్తి bonded labourer *నాల్గవతరగతి ఉద్యోగులు ఏండ్ల తరబడి కట్టుబానిసలుగా పనిచేస్తున్నా వారి వేతనాలలో మార్పులేదని ... అన్నారు.* (ఆం భూ 26 4 89)

**కఠిన చర్య** వి. *kaThina carya* నియమాలు అతిక్రమించినా, నేరాలు చేసినా వేసే తీవ్రమైన శిక్ష serious action *సమ్మె చేస్తే కఠిన చర్యలు తీసుకోవడం జరుగుతుందని ...* (ఆం జ్యో. 1.7 87)

**కఠోర వాస్తవం** వి. *kaThoora vaastavam* నమ్మితీరవలసిన నిజం; hard fact *ఈ సంవత్సర కాలంలో వెల్లడైన కఠోర వాస్తవాలతో ఫలానా ప్రముఖుడికి లంచాలు ముట్టలేదని చెప్పడానికి వీలులేదని తేటతెల్లమైంది* (ఈ 27 7 89)

**కడగండ్లు** వి. (బ.వ.) *kaDa-ganDlu* మితిమీరిన కష్టాలు ordeals, hardships, troubles ... *బహుశా కరువు తెచ్చిన కడగండ్లు ఆ గుండెలను*

రాటుదేల్చి ఉంటాయి. (ఆం.భూ. 18 5 89)

కడతేరు క్రి. *kaDateeru* బాధలు, కష్టాలు తీరిపోవు to come to an end, absolve from నేషనల్ కాన్ఫరెన్స్ కాంగ్రెస్(ఐ) మిశ్రమ ప్రభుత్వంలో తమ బాధలు కడతేరు తాయా అన్న సందేహం స్థానిక ముస్లిం ప్రజానీకంలో చోటు చేసుకుంది. (ఈ. 28 7 89)

కత్తిరించు క్రి. *kattirincu* (అధికారాలను, నిధులను, ప్రణాళికలను) పరిమితం చేయు; తగ్గించు to cut down (powers, funds etc.) జిల్లా పరిషత్ ఛైర్మన్‌లకు దాఖలు పరిచిన అధికారాలను కత్తిరిస్తూ ప్రభుత్వం ఇటీవల ఉత్తర్వులు జారీచేసింది. (ఉ. 18.12.87)

కత్తులునూరు క్రి. *kattulunuuru* ప్రత్యర్థి పక్షాల కార్యకలాపాలపై తీవ్ర అసంతృప్తిని వ్యక్తం చేయు to cross swords with బోఫోర్స్ ఆధారంగా కాంగ్రెస్ పార్టీపైనా ముఖ్యంగా రాజీవ్ గాంధీపైనా దాడి ప్రారంభించాలని ప్రతిపక్షాలు కత్తులునూరుతున్నాయి. (ఆం భూ 25.7 89)

కథనం వి. *kathanam* ఒక సంఘటన గురించి ఒక పక్షం చెప్పిన సమాచారం version పోలీసుల కథనానికి విరుద్ధంగా ఈ ఎన్‌కౌంటర్‌పై పట్టణంలో అనేక వదంతులు వ్యాపించాయి. (ఆం జ్యో. 7.11 88)

కదంతొక్కు క్రి. *kadamtokku* ఉత్సాహంతో అడుగులు వేస్తూ ముందుకు వెళ్ళు to march forward చైనా ప్రధాని లీపింగ్ రాజీనామా చెయ్యాలని నిలదీస్తూ లక్షమంది ప్రజలు గురువారం బీజింగ్ వీధుల్లో కదంతొక్కారు. (ఈ. 26.5.89)

కదలించివేయు క్రి. *kadalinciveeyu* ఆవేదనకు గురిచేయు, స్పందింపచేయు to move, arouse with compassion ... మరొక పక్క ఈనాటి రాయలసీమ విషాదగీతికలు ఆయన హృదయాన్ని కదిలించివేశాయి. (ఆం.జ్యో. 22.10 87)

కదలిక వి. *kadalika* స్పందించి పనిచేసే సూచన response, move ఉద్యోగుల కోర్కెలను పరిష్కరించే విషయంలో ప్రభుత్వంలో కదలిక వచ్చిందని, ప్రభుత్వ ఉద్యోగులు, ఉపాధ్యాయులు చెప్పారు. (ఆం.జ్యో. 2.2.89)

కనపరచు క్రి. *kanaparacu* వ్యక్తం చేయు to show, evince interest వివిధ సబ్జెక్టులపై ఆసక్తి కనపరుస్తున్న ఈ విద్యార్థులకు ... (ఆం.ప. 28.10.87)

కనిపెట్టు క్రి. *kanipeTTu* 1. తెలియని విషయాన్ని తెలుసుకొను to discover కార్లలో లోపాలను కనిపెట్టేందుకు ఇన్నాళ్ళుగా వాడుతున్న కాలం చెల్లిన యంత్రాలు స్థానే ఈ సెంటర్‌లో అమర్చిన అధునాతన యంత్రాలను వాడవచ్చు. (ఈ. 8.3.88) 2. అనారోగ్య కారణాలను తెలుసుకొను to diagnose ఫిలిప్పీన్స్ ప్రజల్లో ఎయిడ్స్ వ్యాధి లక్షణాలు కనిపెట్టేందుకు ప్రారంభించిన ... (ప్రజా. 27 10 87)

కనుగొను క్రి. *kanugonu* అన్వేషణ ద్వారా తెలుసుకొను to find out నావత్కూలి, కొప్పాయ్‌ల మధ్య ఐ.పి.కె.ఎఫ్. ఐదు మృతదేహాలను కనుగొన్నది. (విశా. 12.10.87)

కనుమరుగగు క్రి. *kanumarugagu* కంటికి కనిపించకుండాపోవు ; అరుదగు to disappear ... టెస్ట్ పోటీలపై రాబడి తగ్గిపోతే ఇక టెస్టుల నిర్వహణ తగ్గుతుందని చాలమంది అసలుసిసలైన క్రికెట్ కనుమరుగవుతుందని భావిస్తున్నారు. (ఈ. 22.12.87)

కనువిప్పు వి. *kanuvippu* వాస్తవ స్పృహ లోనికి రావటం realization రాష్ట్రంలో కాంగ్రెస్-ఐ వారి చేతుల నుండి అధికారం పోయినా వారికి కనువిప్పు కలగలేదని ఆయన అన్నారు. (ఆం.భూ 28 8 89)

కన్నుకప్పు క్రి. *kannukappu* ఎదుటివారిని వారికి తెలియకుండా మోసగించు to cheat, decieve గత ఇరవై రోజుల క్రితం పోలీసుల కన్నుకప్పి పారిపోయిన పీపుల్స్ వార్ గ్రూప్ నక్సలైట్ నాయకుడు ... లొంగిపోయినట్లు తెలిపారు. (ఆం.ప్ర 3.10.88)

కన్నుమూయు క్రి. *kannumuuyu* చని పోవు to die ... సుప్రసిద్ధ తెలుగు విమ ర్శకులు, బహుభాషావేత్త డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి బుధవారం సాయంత్రం ఇక్కడ గుండెపోటుతో హఠాత్తుగా కన్నుమూశారు. (ఆం.భూ. 27 4 89)

కన్నువేయు క్రి. *kannuveeyu* (స్వార్థ చింతనతో) ఇతరుల ఆస్తులను, కార్యకలాపాలను రహస్యంగా గమనించు, దృష్టి సారించు to keep an eye ముఖ్యంగా ఉత్తర సైబీరియా అభివృద్ధి కాంట్రాక్టుల మీద దక్షిణ కొరియా కన్నువే సింది. (ఆం.భూ 25.5 89)

కన్విక్షన్ వి. *kanvikSan* నేరం చేసిన ట్లుగా నిరూపితమై కోర్టులో శిక్ష పడటం conviction ఇలా అరెస్టు చేసిన ఎన్ని సందర్భాలలో పోలీసులు 'కన్విక్షన్' సాధిం చారు. (ఉ. 6 1 88)

కప్పదాటు ధోరణి వి. *kappadaaTu dhooraNi* పూర్తి సమాచారాన్ని ఇవ్వ కుండా అక్కడకొంత అక్కడకొంత చెప్పటం evasive tactics అతి ముఖ్య మైన ప్రశ్నలకు కూడా ఆమె సరైన సమా ధానం ఇవ్వక కప్పదాటు ధోరణిలో వ్యవహ రించారు. (ఆం.భూ. 10 8 89)

కప్పదాటు సమాధానం వి. *kappadaaTu samaadhaanam* సరైన సమాచారం ఇవ్వకుండా తప్పించుకొనే ధోరణితో బదులు చెప్పటం evasive reply ఎం.ఎల్.ఎ.ను రక్షించేందుకు ముందు చర్యలు చేపట్టాలని ప్రతిపక్షాలు చేసిన సూచనను పాటించక కప్పదాటు సమాధానాలతో ఇద్దరు మహిళా తీవ్రవాదులు బెయిల్‌పై విడుదల అయ్యారని ... (ఈ. 26.12.89)

కప్పిపుచ్చు క్రి. *kappipuccu* అవినీతి, అక్ర మాలు ఇతరులకు తెలియకుండా దాచు to hide, to hush up అవినీతిని కప్పిపుచ్చుతూ ప్రజలముందు కొచ్చేవారి అసలు స్వరూపం బయటపెట్టడం తమ పత్రిక ప్రధాన విధిగా నిర్ణయించుకొన్నట్టు ... చెప్పారు. (ఈ 30.12.87)

కప్పిపెట్టు క్రి. *kappipeTTu* చూ. కప్పి పుచ్చు; ఎయిడ్స్ వ్యాధికి సంబంధించిన వాస్త వాలు కప్పిపెట్టాలని అమెరికా చూస్తోంది అని సుప్రసిద్ధ బ్రిటీ ష్ శాస్త్రవేత్త ... వ్యాఖ్యానించారు. (ప్ర.శ. 27 10 87)

కబంధ హస్తం వి. *kabandha hastam* విడిపించుకోడానికి వీలులేని దుర్మార్గపు పట్టు clutches మాల్దీవుల రాజధానిని కిరాయి సైనికుల కబంధ హస్తాల నుంచి విడిపించడంకోసం భారత ప్రభుత్వం తీసు కొన్న సైనికచర్య పట్ల అమెరికా 'సమ్మతి' వ్యక్తంచేసింది. (ఆం.ప్ర. 5 11 88)

కబ్జా వి. *kabjaa* ఇతరుల లేదా ప్రభుత్వ స్థలాన్ని అనుమతి లేకుండా ఆక్రమించటం encroachment నార్త్‌లాలాగూడాలోని 30ఎకరాల రైల్వే భూమిని ఇళ్ళులేని బీద ప్రజలు సుమారు 30 ఏళ్ళ క్రితం కబ్జా

చేసుకొని నివాసం ఏర్పాటు చేసుకున్నారు. (ఈ అను 24 5.89)

**కబ్జాదారుడు** వి. *kabjaadaaruDu* ఇతరుల స్థలాన్ని అక్రమంగా ఆక్రమించేవాడు encroacher జంటనగరాల్లోని వివిధ దేవాలయాలకు చెందిన దాదాపు డెబ్బయ్ ఎకరాల భూమి కబ్జాదారుల దురాక్రమణకు గురయింది. (ఈ అను 1.6.89)

**కమిటీ** వి. *kamiTii* ఒక ప్రత్యేక బాధ్యతను నిర్వహించటానికి ఏర్పడిన సభ్యుల బృందం committee వరంగల్ వ్యవసాయ మార్కెట్ కమిటీ మాజీ ఛైర్మన్ శ్రీ రమేష్ బాబు హైదరాబాద్ ఆకాశవాణి సలహా సంఘం సభ్యునిగా నామినేట్ అయ్యారు. (ఆం ప్ర 25 4 88)

**కమీషన్** వి. *kamiiSan* ఇరువర్గాల మధ్య జరిగే లావాదేవీల్లో మధ్యవర్తులకు వచ్చే లాభం; ముడుపు commission రక్షణ వ్యవహారాలలో కేవలం 'ఏజెంట్ల'కే గాకుండా 'ఇతరులకు' కూడా చెప్పుకోదగ్గ మొత్తాలు 'కమీషన్'గా ముట్టినట్లు స్వీడన్ ఆడిట్ బ్యూరో కనుగొనడం ... (ఆం ప్ర 6 6 87)

**కమీషనరేట్** వి. *kamiiSanareeT* ప్రత్యేకమైన విధులను నిర్వహించటానికి ఏర్పాటయిన ప్రధాన కార్యాలయం commissionarate కాలుష్య నివారణ యంత్రాలను ఏర్పాటుచేసిన పరిశ్రమలకు పన్నులు రాయితీ ఇచ్చే విషయాన్ని పరిశీలించాలని విచారణ సంఘాల కమీషనరేటు అధ్యక్షులు సూచించారు (ఆం భూ 6 6 89)

**కమెండో** వి. *kamenDoo* శత్రువులపై వేగంగా దాడి చేసేందుకు ప్రత్యేక శిక్షణ పొందిన వ్యక్తి commando న్యూ ఢిల్లీలో ఐదువేల మంది ప్రజలను చంపుతామని ఖలిస్తాన్ కమెండో ఫోర్స్(కె.ఒ.ఎఫ్) మంగళవారం ఒక హెచ్చరిక చేసింది. (ఉ. 9.7.87)

**కమెండోదళం** వి. *kamenDoodaLam* శత్రువులపై వేగంగా దాడి చేసేందుకు ప్రత్యేక శిక్షణ పొందిన (సైనికుల) బృందం commando force రాష్ట్రంలో నక్సలైట్లను అణచివేయడానికి కొత్తగా కమెండో దళాన్ని, గ్రేహౌండ్స్‌ను ఏర్పాటు చేయాలని ... (ఆం భూ. 20.4 89)

**కమ్ముకొను** క్రి. *kammukonu* ఒక్కుమ్మడిగా అలుముకొను to spread in no time, to shroud మారిషస్‌లో దిగడానికి పది నిమిషాల ముందు విమానంలో పొగలు కమ్ముకున్నట్లు దక్షిణాఫ్రికా రేడియో పేర్కొంది. (ఈ. 29 11 87)

**కమ్యూనల్ అవార్డు** వి. *kamyuunal avaarDu* కులమత ప్రాతినిధ్యంకోసం తాత్కాలికంగా ఏర్పాటు చేసే ఒప్పందం a temporary agreement between the people of different castes and religions to elect their representatives in the state governments కమ్యూనల్ అవార్డుకు, పూనా సంధికి కాలం చెల్లిపోయినా వాటిని స్వాతంత్ర్యానంతరం స్వార్థ ప్రయోజనంకోసం అధికార పక్షాలు ఎప్పటికప్పుడు సంస్థాగతం చేసి కూర్చున్నాయి. (ఆం భూ 29 5 89)

**కమ్యూనిటీ హాలు** వి. *kamyuuniTii haalu* ఒక ప్రదేశంలో నివసించే ప్రజలు సాంఘిక, సాంస్కృతికాది కార్యక్రమాలు నిర్వహించే భవనం a community hall భారత రెడ్‌క్రాస్ సొసైటీ హైదరాబాదు విభాగం ఈ నెల 29వ తేదీన తిరుమలగిరిలోని మహాత్మా గాంధీ కమ్యూ

నిటీ హాలులో నేడు చికిత్సా శిబిరాన్ని నిర్వహించింది. (ఆం.భూ 27 4 89)

**కయ్యానికి దిగు** క్రి. *kayyaaniki digu* పోట్లాటకు సిద్ధపడు to indulge in quarrelling ... ఇద్దరు క్రికెట్ ప్రముఖులు బిషన్ సింగ్ బేడి, చేతన్ చౌహన్ ఈ విషయంపై రచ్చకెక్కి ఒకరినొకరు విమర్శించు కుంటున్నారు. నువ్వు పిరికివాడివంటే నువ్వు పిరికివాడివని కయ్యానికి దిగుతున్నారు. (ఈ. 8 3 88)

**కరచాలనం** వి. *karacaalanam* ఇద్దరు పరిచయస్తులు సౌహార్దంగా పరస్పరం చేతులు కలపటం shakehand తనకు చాలా కాలంగా వ్యక్తిగతంగా తెలిసిన అనేకమంది విలేఖరులతో శ్రీ వెంకట్రామన్ కరచాలనం చేశారు. (ఉ 15 6 87)

**కరపత్రం** వి. *karapatram* అందరికీ ఆసక్తి కలిగించే లేదా ఏదైనా రాజకీయ సమాచారం ఉన్న కాగితం లేదా చిన్న పుస్తకం pamphlet ... ముఖ్యమంత్రి చేస్తున్న అబద్ధపు ప్రకటనలను నమ్మవద్దని మాత్రమే వాళ్ళు కరపత్రం ద్వారా ప్రజలను కోరారని ప్రభుత్వం చెబుతున్నదని సంఘ సభ్యులు చెప్పారు. (ఆంప్ర 29 8 89)

**కరసేవ** వి. *karaseeva* భక్తులు స్వచ్ఛందంగా చేసే సేవ voluntary service of the devotees ఆలయ నిర్మాణానికి ఉద్దేశించబడిన స్థలంలో 'కరసేవ'కు ఉత్తర ప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం అనుమతి నిరాకరించటాన్ని వి.హెచ్.పి. ఢిల్లీ శాఖ ఖండించింది (ఆంప్ర 13 11 89)

**కరాకండిగా** క్రి.విశే. *karaakanDigaa* ఖచ్చితంగా very explicitly, in no uncertain terms, without mincing words ఏటా అయిదో పదో కోట్లు ఖర్చుపెట్టి రైతాంగాన్ని సంతృప్తి పరచడం సాధ్యం కాదని ఆయన కరాకండిగా చెప్పారు. (ఈ 29 7 89)

**కరిగిపోవు** క్రి. *karigipoovu* పెట్టుకున్న ఆశలు జరగకుండాపోవు to melt away (as hopes, feelings) to vanish ఉమ్మడి విప్లవం కోసం నేషనల్ ఫ్రంట్ నాయకులు కన్నకలలు ప్రస్తుతానికి కరిగిపోయాయి. (ఈ. 7 6.89)

**కరుడుగట్టిన** విశే. *karuDugaTTina* జాలి, దయ లేకుండా హింసాత్మక చర్యలకు పాల్పడే dreaded కపుర్తల జిల్లాలో పోలీసులు రెండు టెర్రరిస్టుల ముఠాల ఆచూకీ తీయడమే గాకుండా కరుడుగట్టిన ఆరుగురు ఉగ్రవాదులను పట్టుకున్నారు. (ఈ 8 12 87)

**కరువు భత్యం** వి. *karuvu bhatyam* పెరుగుతున్న ద్రవ్యోల్బణానికి అనుగుణంగా ఉద్యోగులకు చెల్లించే డబ్బు dearness allowance రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకు ఇవ్వవలసి ఉన్న కరువు భత్యం బకాయిని చెల్లించాలని ... తెలిసింది (ఈ. 5 1 88)

**కర్ఫ్యూ** వి. *karfyuu* అల్లర్లు, కల్లోల పరిస్థితులు ఏర్పడినపుడు వీధుల్లో జనసంచారాన్ని నిషేధించే ఉత్తర్వు curfew పట్టణంలో మధ్యాహ్నం 2గంటల నుంచి కర్ఫ్యూ విధించి సైన్యం వీధుల్లో గస్తీ జరిపింది (ఆం.భూ. 21.4 89)

**కర్షకపరిషత్** వి. *karSakapariSat* రైతుల ప్రయోజనాలకోసం ఏర్పాటయిన ఆంధ్ర ప్రదేశ్ అధికారిక సంస్థ an official organization which provides the needs of agriculturists

రాష్ట్ర ప్రభుత్వం రైతుల ప్రయోజనాలు కాపాడ్డంకోసం దళారీల బారి నుంచి రక్షించడంకోసం కర్షకపరిషత్ చట్టం చేసిందని ... స్పష్టం చేశారు. (ఉ. 13.8 87)

**కలంపోటు** వి. *kalampooTu* వ్యతిరేక నిర్ణయాలకు ఎక్కువ సంజాయిషీ ఇవ్వకుండా ఒక్క ఉత్తర్వుతో అమలు చేయటం pen-stroke *1983లో ఏర్పడిన లోకాయుక్త కార్యాలయ సిబ్బందిలో గత ఆరు సంవత్సరాలుగా పనిచేస్తున్న సిబ్బందిని ఒక్క కలంపోటుతో ప్రభుత్వం తొలగించడం పట్ల సిబ్బంది పెద్ద ఎత్తున నిరసన వ్యక్తం చేశారు.* (ఆంభూ. 22.4 89)

**కలగూరగంప** వి. *kalagu-uragampa* వివిధ అంశాలు(విషయాలు, వ్యక్తులు, సంఘటనలు) కలిసి ఉండటం conglomeration ... *బి.జె.పి. వంటి ఫాసిస్టు శక్తులు, లోక్‌దళ్‌లో ఉన్న భూస్వాములు, తెలుగుదేశంలో వున్న అవినీతిపరులు కలసిన కలగూర గంపే ఈనాడు మనదేశంలోని ప్రతి పక్షాలని ఆయన విమర్శించారు.* (ఆంభూ 2.5 89)

**కలత** వి. *kalata* భేదాభిప్రాయాల వల్ల వచ్చిన మనస్పర్థ misunderstanding ... *తనకు శ్రీ రామారావుకు మధ్య కలతలు లేపి ఏదో చేయాలనుకున్నారు.* (ఉ. 12.10 87)

**కలర్ గ్రాఫిక్ వెదర్ సాటిలైట్** వి. *kalar graafik vedar SaaTılaıT* ధ్రువ కక్ష్యలోను, భూస్థిర కక్ష్యలలోను తిరిగే ఉపగ్రహాలు సేకరించే వాతావరణ చిత్రాలను పూర్తి రంగులతో భూమికి అందించే కేంద్రం colour graphic weather satillite station *కలర్ గ్రాఫిక్ వెదర్ సాటిలైట్ ఆధునిక కంప్యూటర్ సాంకేతిక పరిజ్ఞానంతో తయారైంది. ధ్రువ కక్ష్యలోను, భూస్థిర కక్ష్యలోను తిరిగే ఉపగ్రహాలు సేకరించే వాతావరణ చిత్రాలను ఈ సాధనం పూర్తి రంగులతో గ్రహించి భూమికి అందజేయ గలదు.* (ఉ 29 6 87)

**కలవరం** వి. *kalavaram* విషయ పర్యవసానానికి సంబంధించిన ఆందోళన anguish, perturbation ... *కనీసం 28 మంది అధికారులు సస్పెండ్ అయ్యే అవకాశముందని అప్రమత్తంగా ఉండవలసిందని ఈ సందేశం పేర్కొన్నట్లు తెలిసింది. దీంతో సిబ్బందిలో కలవరం మొదలైంది.* (ఆంప్ర. 26 4 89)

**కలవరపరచు** క్రి. *kalavaraparacu* అవాంఛనీయ సంఘటనలు జరిగినప్పుడు ఆందోళన కలిగించు to perturb ... *రాష్ట్రంలో ఈ మధ్య చాలా గ్రామాల్లో చెలరేగుతున్న కులమత కక్షలు ప్రతీకార చర్యలు ప్రజాస్వామ్యవాదుల్ని కలవరపరుస్తున్నాయి.* (ఈ. 12 7 89)

**కలవరపెట్టు** క్రి. *kalavarapeTTu* చూ. కలవరపరచు; *కులాల ప్రాతిపదికపై ఉద్యోగాల పద్ధతి మొదలై 125 సంవత్సరాలు గడిచినా ఈ సమస్య తమిళనాడు ప్రభుత్వాన్ని, రాజకీయ పార్టీలను ఇంకా కలవరపెడుతూనే వుంది.* (ఆంజ్యో 28.11 88)

**కలిసివచ్చు** క్రి *kalısıvaccu* అదనంగా ప్రయోజనం చేకూరు to fetch, be helpful *కాంగ్రెస్(ఐ) వర్గాలను ఒక్క తాటిపై నిలపడంలో శ్రీ ఆస్కార్ ఫెర్నాండెజ్ చూపిన చొరవ, సామర్థ్యం జాతీయ స్థాయిలో ఉపయోగపడితే పార్టీకి బాగా కలిసి వస్తాయని అధిష్ఠానవర్గం భావించి ఉండవచ్చుననుకొంటున్నారు.* (ఆంప 20 9 87)

**కలుగజేయు** క్రి *kalugajeeyu*

కల్పించు, సృష్టించు to create కాంగ్రెస్(ఐ) నాయకులతో తిరుగుతూ గవర్నర్ రాష్ట్ర ప్రభుత్వానికి ఇబ్బందులు కలుగజేస్తున్నారని ... (ఈ. 28.1 88)

**కలుగజేసుకొను** క్రి. *kalugajeesukonu* జోక్యం కలిగించుకొను to interfere ... తీవ్రవాదులు మరికొన్ని కోర్కెలు కోరటానికి ప్రయత్నిస్తుండగా పరిశ్రమల కార్యదర్శి యుగంధర్, పౌరహక్కుల సంఘం నాయకుడు కన్నాభిరన్‌లు స్వయంగా కలుగజేసుకొని పరిస్థితిని చక్కదిద్దారని ... చెప్పారు. (ఈ. 31.12.87)

**కలుపు** క్రి. *kalupu* ఏకం చేయు to unite, merge ఉభయ కమ్యూనిస్టు పార్టీలు తమంతట తాముగా ఏకం కాకపోతే ప్రజలే కలుపుతారని సినీ నిర్మాత మాదాల రంగారావు అన్నారు. (ఆం.జ్యో. 26 4 88)

**కల్పించు** క్రి. *kalpıncu* ఏర్పాటు చేయు to provide సింధు శాఖలో పదకొండు కువైట్ టాంకర్లను అమెరికా జెండాలతో సహా సైనిక రక్షణను కల్పించిన తమ విధానాన్ని ఆయన సమర్థించుకున్నారు. (ప్ర.శ. 24.10 87)

**కల్లోలం** వి. *kalloolam* శాంతి భద్రతలు క్షీణించిన పరిస్థితి; ఆలజడి disturbed situation, tussle, chaos కాంగ్రెస్‌లో కల్లోలం ... (ఈ 31.10 89)

**కల్లోల పరిస్థితి** వి. *kalloola paristhitı* రాజకీయ ఆర్థిక, సాంఘిక కారణాల వల్ల ఏర్పడిన అశాంత పరిస్థితి chaotic situation పార్లమెంట్ సమావేశాల్లో లేవనెత్తాలని తెలుగుదేశం పార్టీ నిర్ణయించుకున్న అంశాలలో "శ్రీలంక సమస్య, భారత్ నేపాల్ సంబంధాలు, పంజాబ్‌లో కల్లోల పరిస్థితి" ... రాష్ట్రానికి సంబంధించి పెండింగ్ ప్రాజెక్టులు ఉన్నాయని వివరించారు. (ఈ 16 7.89)

**కల్లోలిత ప్రాంతం** వి. *kalloolıta praantam* శాంతి భద్రతలు తీవ్రంగా దెబ్బతిన్నట్లు ప్రభుత్వం ప్రకటించిన ప్రాంతం disturbed area నక్సలైట్లు పోరాటవాదులు ప్రబలంగా ఉన్న దేశంలోని వివిధ ప్రాంతాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించి ... (ఆం.భూ 31 12 87)

**కళంకం** వి. *kaLankam* చెడ్డ పేరు, మాయని మచ్చ blemish, bad name రాజ్యాంగానికి విరుద్ధంగా, రాజ్యాంగ సూత్రాలకు కళంకం తెచ్చే విధంగా వ్యవహరిస్తూ కాంగ్రెస్ నాయకుల మెరమెచ్చులకోసం పనిచేస్తున్న రాష్ట్ర గవర్నర్ ... (ఆం.జ్యో 23.11 88)

**కళంకితంచేయు** క్రి. *kaLankıtamceeyu* గౌరవాన్ని పోగొట్టు to blemish, smudge సత్సంప్రదాయాలకు తలకొరివి పెట్టే కార్యక్రమానికి అంకితమైన 'పెద్ద మనుషులు' నేడు తాము అలంకరించిన పదవుల్ని కళంకితంచేస్తున్నారు. (ఈ. 12.5.89)

**కళకళలాడు** క్రి. *kaLakaLalaaDu* కొత్త మెరుగులతో ప్రకాశించు to brighten, embellish రెండోరోజు మైదానమంతా అతని ప్రతిభతోనే కళకళలాడింది. (ఈ. 6 9.89)

**కళాత్మక విలువలు** వి. (బ.వ.) *kaLaatmaka viluvalu* (చిత్రాలలో) వ్యాపార ధోరణి లేని ఉన్నతమైన భావాలు artistic values ప్రస్తుత మార్గ దర్శక సూత్రాల ప్రకారం కళాత్మక విలువలుగల చిత్రాలను మాత్రమే ప్రసారం చేస్తారని ... పేర్కొన్నారు. (ఆం జ్యో 20.4 88)

**కళ్ళెంవేయు** క్రి. *kaLLemveeyu* అదుపులో పెట్టు to prevent, bridle మత కల్లోలాలకు కళ్ళెంవేయాలి. (ఆం జ్యో 24 6.87)

**కవాతు** వి. *kavaatu* సైనికుల లేదా ప్రదర్శకుల క్రమబద్ధమైన పద విన్యాసాలు marching ఆదివారంనాడు దాదాపు 20 మండలాల నుంచి వచ్చేసిన 80 వేల మంది విద్యార్థులు బీజింగ్ వీథుల్లో కవాతు జరిపారు. (ఆం.భూ 29 5 89)

**కవ్వింపు చర్య** వి. *kavvimpu carya* ఎదుటివారిని రెచ్చగొట్టే కార్యకలాపం provocation ... ముఖ్యంగా పూంచ్ ప్రాంతంలో ఎటువంటి కవ్వింపు చర్యలు లేకుండా సుమారు 20 సార్లు కాల్పులు జరిపాయి. (ఈ. 2.1.88)

**కస్టడీ** వి. *kasTaDii* నిందితుడు పోలీసుల నిర్బంధంలో గాని లేదా న్యాయమూర్తి ఆదేశాలమేరకు(బెయిల్ వచ్చే వరకు) జైలు నిర్బంధంలోగాని ఉండే స్థితి custody నక్సలైటు దంపతులను జ్యుడిషియల్ కస్టడీలోకి పంపిస్తామని, చట్ట పరమైన చర్యలు తీసుకుంటామని ఆయన అన్నారు. (ఆం.భూ 7.7 89)

**కస్టమ్స్ అధికారి** వి. *kasTams adhikaari* ఎగుమతి, దిగుమతుల మీద సుంకం వసూలు చేసే అధికారి customs officials బొంబాయి వాయవ్య దిశలోని అంధేరీ, వెర్సొవా ప్రాంతాల్లో కస్టమ్స్ అధికారులు గత రెండు రోజులుగా ఆకస్మిక దాడులు జరిపి ... (ఆం.భూ 6 7 89)

**కాంట్రాక్టు** వి. *kaanTraakTu* రెండు సంస్థలు లేదా ఇద్దరు వ్యక్తుల మధ్య ఒక పనికోసం కుదుర్చుకునే లిఖిత పూర్వక ఒప్పందం contract తుపాకుల కొనుగోలుపై బోఫోర్స్ సంస్థతో కుదుర్చుకున్న కాంట్రాక్టును రద్దుచేసేది లేదని ... (ఈ 18 6.87)

**కాంట్రా గెరిల్లాలు** వి. (బ.వ.) *kaanTraa gerillaalu* నికరగ్వా దేశంలో కొంతకాలం అధికారంలో ఉన్న సాండినిస్టా విప్లవ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడిన బృందాలు contra guerillas నికరగ్వా కాంట్రా గెరిల్లాలకు 80 లక్షల డాలర్ల సైనికేతర సాయం అందించేందుకుగాను వైట్‌హౌస్ అధికారులకు మధ్య శనివారంనాడు ఒక ఒప్పందం కుదిరింది. (ఈ 21 12.87)

**కాందిశీకుడు** వి *kaandiśiikuDu* ఉన్నచోట భద్రత లోపించినపుడు మరోదేశంలో తలదాచుకునేవాడు; శరణార్థుడు refugee కాశ్మీర్‌లో పెద్ద ఎత్తున పాకిస్తాన్ కాందిశీకులు ఉన్నారన్న విషయం భారత ప్రభుత్వానికి తెలిసి నప్పటికీ ... (ఆం ప్ర 19.9 89)

**కాకతాళీయం** వి. *kaakataaLiiyam* ముందుగా అనుకోకుండా లేదా తెలియకుండా పని జరగటం accidental coincidence బోఫోర్స్‌తో ఒప్పందానికి రక్షణ మంత్రి అంగీకారం తెలిపినట్టు రక్షణ శాఖ కార్యదర్శి ప్రధానికి తెలిపారు. అయితే కాకతాళీయంగా అప్పుడు రక్షణ మంత్రిత్వ శాఖను అరుణసింగ్‌తో కలసి ప్రధానమంత్రియే నిర్వహించారు. (ఆం.భూ 19.7.89)

**కాకస్** వి. *kaakas* ప్రధాన సమస్యలపై నిర్ణయాలు తీసుకునే పలుకుబడిగల కొద్దిమంది వ్యక్తుల బృందం caucus ఓపెన్ యూనివర్సిటీని ఏలుతున్న 'కాకస్' (ఆం.భూ. 29.6.87)'

**కాకి లెక్కలు** వి. (బ.వ.) *kaaki lekkalu* అబద్ధపు లెక్కలు false statistics *నివేశన స్థలాల కేటాయింపులో ప్రభుత్వం చూపుతున్న లెక్కలన్నీ 'కాకి లెక్కలు'గా ఆయన అభివర్ణించారు.* (ఈ 22.7.87)

**కాగ్** వి. *kaag* ప్రభుత్వ ఆర్థిక, వాణిజ్య వ్యవహారాలను నిశితంగా సమీక్షించి లోటు పాట్లు ఉన్నట్లయితే ఎత్తిచూపుతూ నివేదించే స్వయంప్రతిపత్తి కలిగిన సంస్థ(కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ అన్న దానికి ఆంగ్లంలో సంక్షిప్త రూపం) CAG(Comptroller and Auditor General) *"బోఫోర్స్" ఒప్పందానికి సంబంధించిన ఫైళ్ళను కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్(కాగ్)కు అందించకుండా రక్షణ మంత్రిత్వ శాఖ రెండేళ్ళ పాటు తాత్సారం చేసింది.* (ఆం.ప్ర. 20.7 89)

**కాజ్‌వే** వి. *kaajvee* నీటి పైన గాని, నీరు సరిగా పారక గుంటగా ఏర్పడిన ప్రదేశంలో కాని కట్టిన తక్కువ ఎత్తుగల వంతెన causeway *గత సంవత్సరంలో వరదకు కొట్టుకొనిపోయిన కాజ్‌వేను గ్రామస్థుల సహాయంతో నాలుగు వేల రూపాయల ఖర్చుతో శీతాకాలం, వేసవి కాలంలో నడవడానికి వీలుగా మట్టిపోయించామని ...* (ఆం.భూ. 11.7 89)

**కాన్ఫిడెన్షియల్ రిపోర్టు** వి. *kaan-fiDenSiyal ripoorTu* వ్యక్తి లేదా సంస్థ పనితీరు గురించి సంబంధిత అధికారికి పంపే రహస్య నివేదిక confidential report *కానిస్టేబుల్ నుంచి ఎస్.పి వరకు ఎలా పనిచేస్తున్నారు, వారికున్న సంబంధాలు, ఇతర విషయాలపై 'కాన్ఫిడెన్షియల్' రిపోర్టులను సేకరిస్తున్నట్లు ముఖ్యమంత్రి తెలిపారు.* (ఆం.భూ 14 6 89)

**కాపిటలిస్టు సమాజం** వి *kaapiTalisTu samaajam* పెట్టుబడిదారీ విధానాన్ని అవలంబించే సాంఘిక వ్యవస్థ; పెట్టుబడిదారీ వ్యవస్థ capitalist society *రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత రష్యా సేనల సహాయంతో 'హంగరీ' కాపిటలిస్టు సమాజం నుంచి విముక్తి అయి సోషలిస్టు దేశం అయింది.* (ఆం.భూ. 26 4.89)

**కాపిటేషన్ ఫీజు** వి *kaapiTeeSan fiiju* (వృత్తివిద్య కళాశాలల్లో చేరటానికి) విద్యార్థుల నుండి అదనంగా పెద్ద మొత్తంలో వసూలు చేసే రుసుం capitation fees *వృత్తి విద్యా కళాశాలల్లో కాపిటేషన్ ఫీజు వసూలుకు వ్యతిరేకంగా ఇతర విద్యార్థి సంఘాలతో కలిసి త్వరలో ఆందోళన చేయాలని ... నిర్ణయించింది.* (ఆం.జ్యో 24 6.87)

**కాపీయింగ్** వి. *kaapiiying* (పరీక్షలలో) ఇతరుల సమాధానాలను లేదా తెచ్చుకున్న చీటీలను చూసిరాయటం copying (in examinations) ... *విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో ఆదివారం ఇక్కడ జరిగిన బిఇడి ఎంట్రన్స్ పరీక్షలో పెద్ద ఎత్తున కాపీయింగ్ జరిగింది.* (ఈ 5.10 87)

**కాపీరైటు** వి. *kaapiiraiTu* రచయిత, ముద్రాపకులు మొ. వారికి తిరిగి పుస్తకాన్ని అచ్చువేయటానికి చట్ట సమ్మతంగా ఉన్న హక్కు copyright ... *109 ముద్రాపకులకు ఒకటి నుంచి 10వ తరగతి వరకు పాఠ్యపుస్తకాలను అచ్చువేసి అమ్ముకో*

డానికి 'కాఫీ రైటు' కడచిన జూన్ నెలలో యిచ్చింది. (ఆం.ప్ర. 19.7.89)

**కాఫీపోసా** వి. *kaafiipoosaa* స్మగ్లర్ల కార్యకలాపాలను నిరోధించే చట్టానికి ఇంగ్లీషు అక్షరాల్లో సంక్షిప్త రూపం COFEPOSA (Control of Foreign Exchange and Prevention of Smuggling Act) మొత్తం 189 డిటెన్షన్ ఉత్తర్వులను 'కాఫీ పోసా' చట్టం క్రింద జారీ చేశారని ... తెలిసింది. (ఆం.భూ. 16.89)

**కామన్వెల్త్ దేశం** వి. *kaamanvelt deeśam* ఒకప్పుడు బ్రిటిషు వారి పరిపాలనలో ఉండి తర్వాత ఒక సంఘంగా ఏర్పడ్డ సభ్యదేశం commonwealth nation దక్షిణాఫ్రికాలోని జాత్యహంకార ప్రభుత్వానికి సంబంధించి కామన్వెల్త్ దేశాల మధ్య ఐక్యత నెలకొనకుండా ఉండేలా చేయడానికి ... (ఆం.జ్యో. 25.6.87)

**కామ్రేడ్** వి. *kaamreeD* వామపక్ష పార్టీలలో క్రమశిక్షణతో పనిచేసే కార్యకర్త comrade కామ్రేడ్ సుందరయ్యగారి ఏరిన రచనలు. (ప్ర.శ. 15.7.87)

**కాయకల్ప చికిత్స** వి. *kaayakalpa cikitsa* మౌలికమైన మార్పులతో ఒక వ్యవస్థను బాగుచేయటం purging an organization రాజీవ్ గాంధీ యువ నాయకత్వంలో కాంగ్రెస్(ఐ)కి కాయకల్ప చికిత్స జరుగుతుందని ... ఆశించారు. (ఆం.జ్యో. 28.6.87)

**కార్పొరేటర్** వి. *kaarporeeTar* నగర పాలక సంస్థలోని ప్రజాప్రతినిధి corporator జంట నగరాలలోని కాంగ్రెస్(ఐ) కార్పొరేటర్లందరూ ఎలాంటి అవాంఛనీయ సంఘటనలు జరగకుండా ప్రశాంతంగా బంద్ నిర్వహిస్తారని ఆమె చెప్పారు. (ఆం.భూ. 9.8.89)

**కార్పొరేషన్** వి. *kaarporeeśan* నగరంలో ప్రజల అవసరాలను తీర్చటానికి ఏర్పాటయిన స్థానిక స్వపరిపాలనా సంస్థ; నగర పాలక సంస్థ corporation మద్రాస్ కార్పొరేషన్ త్రిశతాబ్ది ఉత్సవాన్ని జరుపుకొంది. (వి.శా. 30.9.87)

**కార్యకర్త** వి. *kaaryakarta* రాజకీయ పక్షాలలోగాని, స్వచ్ఛంద సంస్థలలోగాని క్రియాశీల పాత్ర నిర్వహించే వ్యక్తి member of a particular political party or voluntary organization who takes active part in all its programmes (party cadre) అబిడ్స్‌లో ఉదయం భారతీయ జనతా యువమోర్చాకు చెందిన కార్యకర్తలు ఆరు బస్సుల మీద రాళ్ళు రువ్వి ... టైర్ల గాలి తీసేశారు. (ఆం.ప్ర. 23.11.88)

**కార్యకర్తల సదస్సు** వి. *kaaryakartala sadassu* కార్యకర్తల కోసం ఏర్పాటయిన సభ meeting of a active members of a political party or voluntary organization ఆదివారం గాంధీ భవన్ ఆవరణలో జరిగిన రాష్ట్ర కాంగ్రెస్(ఐ) కార్యకర్తల సదస్సులో ఆయన మాట్లాడుతూ ... స్పష్టం చేశారు. (ఈ. 22.5.89)

**కార్యకలాపం** వి. *kaaryakalaapam* ఒక పని యొక్క ఆచరణాత్మక దశ

activity ఔత్సాహికుల కార్యకలాపాలు పెచ్చు పెరగడంతో బర్నాలా ప్రభుత్వాన్ని రద్దు చేసి *1987* మే *17*న కేంద్రం రాష్ట్ర పాలనా బాధ్యతను చేపట్టింది. (ఈ 5 5 89)

**కార్యక్రమం** వి. *kaaryakramam* నిర్ణయించుకొన్న పనితీరు programme ప్రముఖ సినీవార పత్రిక 'జ్యోతిచిత్ర' గోద్రెజ్ వారి 'ఫ్రెస్కా' సంయుక్తంగా నిర్వహించిన 'సూపర్ స్టార్స్-*86*' అవార్డుల కార్యక్రమం శనివారం సాయంత్రం ఇక్కడ జరిగింది. (ఉ 13.7 87)

**కార్యనిర్వాహకవర్గ సభ్యుడు** వి. *kaaryanırvaahakavarga sabhyuDu* సంస్థల నిర్వహణ బాధ్యతను చేపట్టేందుకు ఎన్నుకోబడిన కార్యవర్గంలో ఒకరు executive committee member *1091* మండల కర్షక పరిషత్‌లకు అధ్యక్షులుగా ఎన్నికైన వారి నుంచి రాష్ట్ర కర్షక పరిషత్‌కు తొమ్మిది మంది కార్య నిర్వాహకవర్గ సభ్యుల ఎంపిక జరుగుతోంది. (ఈ 22 5 89)

**కార్యాచరణ** వి *kaaryaacaraNa* లక్ష్య సాధన కోసం ఒక పద్ధతిలో సాగే పని (programme of)action గిరిజనులు తమ అభివృద్ధికి తామే స్వేచ్ఛగా కార్యాచరణకు దిగే అవకాశం కల్పించడంవల్ల ఫలితం ఉండవచ్చు. (ఆంప్ర 5 7 89)

**కార్యాచరణప్రణాళిక** వి. *kaaryaacaraNapraNaaLıka* లక్ష్యసాధన కోసం తయారు చేసుకున్న కాలబద్ధమైన పథకం action plan జపాన్‌కు చేసే ఎగుమతులను రెట్టింపు చేసేందుకు కార్యాచరణప్రణాళికను రూపొందించినట్టు భారత ప్రధాని జపాన్ ప్రధానికి తెలిపారు. (ఆంభూ 16.4 88)

**కాలం చెల్లిపోవు** క్రి. *kaalam-cellıpoovu* (మారిన పరిస్థితులలో) ప్రాముఖ్యం కోల్పోవు to become irrelevant బ్రిటిష్ కాలంలో ప్రవేశపెట్టిన వాయిదా తీర్మానం పద్ధతికి కాలం చెల్లిపోయిందని శాసన సభ స్పీకర్ ... స్పష్టం చేశారు. (ఈ 23 3 88)

**కాలదోషంపట్టు** క్రి. *kaaladooSam-paTTu* (ఒప్పందం)గడువు తీరిపోవు to lapse నేపాల్‌తో వాణిజ్య సంబంధాల గురించి ప్రస్తావిస్తూ ఒప్పందాలు కాల దోషం పట్టడానికి నేపాల్‌దే బాధ్యత అని ఆయన అన్నారు. (ఆంభూ 18 7 89)

**కాలధర్మం** వి. *kaaladharmam* వృద్ధాప్యంలో సంభవించే మరణం death (as in old age) రజాలీ కాలధర్మం: ప్రముఖ పత్రికా రచయిత శ్రీ సయ్యద్ రజాలీ గురువారం ఉదయం ఇక్కడ మరణించారు (ఆంప్ర 11 3 88)

**కాల పరిమితి** వి. *kaala parimıti* ఒక పనిని పూర్తి చేయటానికి నిర్ణయించిన గడువు time limit బోఫోర్స్ కమిటీ కాల పరిమితి ఆరోజుతో ముగుస్తుంది (ఆంభూ 23 4 88)

**కాల పరీక్ష** వి. *kaala parıkSa* ఒక విధానం అమలులో ఉన్న సమయంలో ఎదురయ్యే ఒడిదుడుకులు test of time ప్రస్తుత ఎన్నికల వ్యవస్థ 'కాల పరీక్షకు' తట్టుకొని నిలబడిందని, వి.ఎన్ గాడ్గిల్ నాయకత్వాన గల ఈ కమిటీ అభిప్రాయపడింది. (ఆంప్ర 15 10 88)

**కాలబద్ధ ఒప్పందం** వి. *kaalabaddha oppandam* ఒక పరిమితి గల గడువు లోపల అమలులో ఉండేటట్లు(దేశాల లేదా సంస్థల మధ్య) కుదిరిన అంగీకారం time-bound agreement *ఈ కాల బద్ధ ఒప్పందంపై సోవియట్ యూనియన్ తరపున ఆ దేశ సైన్సెస్ అకాడమీ అధ్య క్షుడు సరిమార్టుకే, భారత దేశం తరపున ప్రధానమంత్రి సైంటిఫిక్ సలహాదారు సి.ఎన్. రావు సంతకాలు చేశారు.* (ఉ. 29.6.87)

**కాలయాపనచేయు** క్రి. *kaalayaa-panaceeyu* పని చేయకుండా కావాలని ఆలస్యం చేయు to delay *పార్లమెం టరీ దర్యాప్తు ఆదేశించి కాలయాపనచేయటం రాజీవ్ ధ్యేయంగా కన్పిస్తున్నదని ...* (ఉ. 29.6.87)

**కాలరాయు** క్రి. *kaalaraayu* (స్వేచ్ఛ, హక్కులు మొ. వాటిని)నిరంకుశంగా అణచి వేయు; to suppress (freedom, rights etc.) ... *మూడేళ్ళ కిందట ప్రజాస్వామ్య ఆందోళనను విదేశీ బూచిని ఉటంకించి అణచి వేసినట్టే ప్రస్తుత ఉద్యమాన్ని కాలరాయాలన్న పెడధోరణి వ్యక్తమవుతుంది.* (ఈ. 31.5.89)

**కాలహరణం** వి. *kaalaharaNam* సమయం వృథా అవటం delay పో.చూ. కాలయాపన చేయు, *ప్రస్తుత పరిస్థితిలో న్యాయం పొందటానికిఎంతో ఖర్చు అవుతోం దని, కాలహరణ మవుతున్నదని ఫలితంగా సామాన్య ప్రజలు బాధ పడవలసి వస్తున్నదని ఆయన పేర్కొన్నారు.* (ఈ. 16.8.89)

**కాలానికి నిలుచు** క్రి. *kaalaaniki nilucu* (విధానాలు, పద్ధతులు మొ.)అనేక సమయాలలో ఏర్పడే ఒడిదుడుకులకు తట్టుకొని పటిష్ఠంగా ఉండు to stand up to the test of time *రాజ్యాంగంలో పెద్ద మార్పులు చేయాల్సిన అవసరం కూడా లేదని రాజ్యాంగ ప్రాథమిక నిబంధనలు కాలానికి నిలిచాయని కమిషన్ భావించింది.* (ఈ. 30.1.88)

**కాలుదువ్వు** క్రి. *kaaluduvvu* ఘర్షణ పడే ధోరణిలో ప్రవర్తించు to be belligerent, be aggressive *అస్సాంలో ఎ.జి.పి. బహిష్కరించిన ఎన్నికలను తూతూ మంత్రంగా నిర్వహించి అధికారం కైవసం చేసుకున్న పాపిష్టి పద్ధతినే కాంగ్రెస్(ఐ) రేపు పంజాబ్‌లోనూ, పునరావృతం చేయాలని కాలుదువ్వుతున్నది.* (ఈ. 5.7.89)

**కాలుమోపు** క్రి. *kaalumoopu* మొదటి సారి ప్రవేశించు; పాదం పెట్టు to step on, enter(for the first time) *సయిద్ అయిటా, కార్ల్ లూయిస్ లాంటి ప్రపంచ ఖ్యాతి పొందిన పరుగుల వీరులు భారత గడ్డపై కాలుమోపుతున్నారు.*

**కాల్ గరల్** వి. *kaal garal* డబ్బుకోసం పడుపు వృత్తి చేసే స్త్రీ callgirl *తమ వలలో చిక్కిన గృహిణులను ముఠా నాయకులు బ్లాక్ మెయిల్ చేస్తూ, వారిని కాల్‌గరల్స్‌గా హోటల్స్‌కు తరలిస్తున్నారు.* (ఈ. 6.10.88)

**కాల్ లెటర్** వి. *kaalleTar* ఒక ఉద్యోగానికి అభ్యర్థి ఎంపిక కోసం జరిపే ఇంటర్వ్యూ లేఖ call letter *నగరంలో ఉపాధికల్పనా కేంద్రంలో పేర్లు నమోదు చేసుకొని ఎన్ని*

సంవత్సరాలు గడిచినా 'కాల్ లెటర్స్' సూచ నలు కూడా లేని నిరుద్యోగులు ఎందరో ఉన్నారని ... (ఆంభూ 3787)

**కాలుష్యం** వి. *kaaluSyam* మలినకరం, హానికరం అయిన పదార్థాలు చేరటం ద్వారా గాలి, నీరు, పరిసరాలలోని స్వచ్ఛత దెబ్బతినటం pollution కాలుష్యాన్ని నివారించటంలో పరిశ్రమల యజమానులు ఏఐఐసి కాలుష్య నియంత్రణ బోర్డు ... (ఆంప్ర 6687)

**కాల్పుల విరమణ** వి. *kaalpula viramaNa* పోరాటం నిలిపి వేస్తున్న గుర్తుగా కాల్పులను ఆపివేయటం ceasefire టైగర్లు ఎట్టకేలకు వాస్తవాన్ని గుర్తించి కాల్పుల విరమణకు పూనుకోవటం తమకు సంతోషమేనని ... చెప్పారు. (ఆంభూ 1789)

**కావలికారు** వి. *kaavalikaaru* గ్రామ విష యాలను కనిపెట్టి చూసే వ్యక్తి; తలారి village servant దగడపల్లి గ్రామానికి చెందిన బోయరాముడు(50) అనే కావలికా రును ఎవరో గుర్తు తెలియని వ్యక్తులు చంపినట్లు స్థానిక పోలీసులు తెలిపారు (ఆంప్ర 19.9 87)

**కాసుల నీతి** వి. *kaasula niiti* నైతిక విలువలతో సంబంధం లేకుండా కేవలం డబ్బుతోనే వ్యవహారం నడిపే సంస్కృతి money culture కాంగ్రెస్‌ది కాసుల నీతి, ఢిల్లీ నుంచి నేతలు డబ్బుతో, విమానా లలో దిగుతున్నారనీ, డబ్బే కాంగ్రెస్ నీతి, రీతీ అని, నల్లధనం విరజిమ్మి ప్రజల్ని ఆకట్టు కోవటానికి కాంగ్రెస్ యత్నిస్తోందని ఆయన ఆరోపించారు. (ఆంజ్యో 30 11.87)

**కింగ్‌మేకర్** వి. *kingmeekar* (రాజకీయా లలో)ఉన్నత పదవులలోనికి తను కోరిన వ్యక్తిని తీసుకొని రాగలిగే సమర్థుడిగా పేరు పొందిన సీనియర్ నాయకుడు king maker కాగా దేవీలాల్ హర్యానా 'కింగ్‌మేకర్' అని చెప్పవచ్చు. (ఆంజ్యో 25687)

**కించపరచు** క్రి. *kincaparacu* (వ్యక్తిని లేదా సంస్థని)తక్కువ చేస్తూ మాట్లాడు లేదా ప్రవర్తించు to belittle(person or institution etc.) డాక్టర్ రాజ శేఖర్ రెడ్డి పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని కించ పరచే విధంగా స్పీకరుకు దురుద్దేశాన్ని ఆపాదిస్తూ ... (ఆంప్ర 13.4.88)

**కిటుకు** వి *kiTuku* నేర్పరితనంతో కూడిన ఉపాయం clue ఓ క్రికెట్ అధికారి ఎదుటి జట్టు బౌలర్ల వద్దకు చేరి జిమ్మిని అవుట్ చేసే కిటుకులు చెప్పేడట. (ఈ 18889)

**కిడ్నాప్‌చేయు** క్రి. *kiDnaapceeyu* చూ. అపహరించుకు పోవు; ... ఈ నెల అయిదు అర్ధరాత్రి 12.30 గంటల ప్రాంతంలో కరీం నగర్ జిల్లా తాడిచెర్ల మండలాధ్యక్షుడు బి. మల్హర్ రావును కిడ్నాప్ చేశారు (ఈ 7689)

**కిడ్నాప్ పర్వం** వి. *kiDnaap parvam* వ్యక్తులను అపహరించుకు పోయే సంఘ టనల పరంపర; పో చూ. కిడ్నాప్ చేయు series of kidnaps నక్సలైట్లు లొంగు బాటుకు రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన గడువు మరో నాలుగు రోజుల్లో ముగియనుండగా, మరో పక్క నక్సలైట్లు నిరాఘాటంగా 'కిడ్నాప్ పర్వం' కొనసాగిస్తున్నారు. (ఆంప్ర 28889)

**కితాబు** వి. *kitaabu* ఇతరుల ప్రతి భను గుర్తిస్తూ అనే మెచ్చుకోలు మాట appreciation పశ్చిమ బెంగాల్‌లో

వామపక్ష ఐక్య సంఘటన ప్రభుత్వం కింద పంచాయితీలు పటుతరంగా ఉన్నాయని ప్రధాని రాజీవ్ గాంధీయే కితాబు ఇచ్చారు. (ఈ. 3.5.89)

**కిమ్మను** క్రి. *kimmanu* ఏమిటి అని ప్రశ్నించు(ఇది వ్యతిరేకార్థంలోనే వస్తుంది) to question *అమెరికా ఇరాన్‌కు రహస్యంగా ఆయుధాలు అమ్మటంపై వివాదం చెలరేగినప్పుడూ బుష్ కిమ్మనలేదు.* (ఈ. 19.3.88)

**కిసాన్ సభ** వి. *kisaan sabha* రైతులు తమ సమస్యలపై ఐక్యంగా పోరాడేందుకు ఏర్పరుచుకొన్న సంఘం a farmers association(to fight for their problems) *26వ అఖిల భారత కిసాన్ సభల ముగింపు సందర్భంగా జరిగిన సభలో లక్షలాది మంది ప్రజలు పాల్గొన్నారు.* (ఆం.భూ. 1.5.87)

**కిస్తీ** వి. *kistii* వాయిదాలుగా చెల్లించే డబ్బు instalment, premium *తనను ఎవరైనా కిడ్నాప్ చేసిన పక్షంలో కోట్ల డాలర్లు పరిహారం ఇచ్చే, ప్రముఖ టెన్నిస్ ఆటగాడు బోరిస్ బెకర్, భీమా పాలసీ తీసుకున్నాడు. ఈ పాలసీకి ఏటా అతను లక్షా 60వేల డాలర్లు కిస్తీగా చెల్లిస్తారు.* (ఈ. 13.9.89)

**కీచులాట** వి. *kiiculaaTa* ఒకే వర్గంలో జరిగే అంతఃకలహాలు internal squabble *జిల్లా కాంగ్రెస్‌లో కీచులాటలు లేవంటూనే కీచులాడుకుంటున్న ...* (ఆం.భూ. 25.5.89)

**కీలకం** వి. *kiilakam* చాల ప్రాధాన్యం కలిగినది crucial, strategically important *వైద్య సదుపాయం వంటి ఆంతరంగిక విషయాలు అధ్యక్ష ఎన్నికల్లో కీలకమైన అంశాలుగా మారాయి.* (ఆం.జ్యో. 8.11.88)

**కీలు బొమ్మ** వి. *kiilu bomma* (పాలనా వ్యవహారాల్లో) స్వంత అభిప్రాయాలతో కాకుండా మరొకరి ఆదేశాల కనుగుణంగా నడుచుకునే వ్యక్తి puppet *పబ్లిక్ అకౌంట్స్ కమిటీ ఛైర్మన్ నియామకం విషయంలో లోక్‌సభ స్పీకర్ బలరాం జక్కర్ కేంద్ర ప్రభుత్వం చేతిలో 'కీలు బొమ్మ'గా వ్యవహరించారని ... ఆరోపించారు.* (ఆం.భూ. 19.5.89)

**కుంటి సాకు** వి. *kunTi saaku* బాధ్యతను తప్పించుకోవటానికి లేక దాటవేయటానికి చెప్పే పసలేని కారణం lame excuse *రశీదు పుస్తకాలు అయిపోయాయని త్వరలో తెచ్చిన తర్వాత ఇస్తామని కుంటి సాకులు చెప్పారు.* (ఈ. అను. 10.5.89)

**కుంటుపడు** క్రి. *kunTupaDu* (కార్యక్రమాలు) సమర్థంగా నడవకపోవు to suffer, affected (as the pace of an activity) *ఇప్పుడు మహిళా సంక్షేమ శాఖలో విలీనం చేయటంవల్ల సంస్థ కార్యకలాపాలు కుంటుపడ వచ్చని అభిప్రాయపడ్డారు.* (ఈ. 5.6.87)

**కుంభకోణం** వి. *kumbhakooNam* అవినీతి కార్యకలాపం, పెద్ద ఎత్తున జరిగే లాలూచీ scandal, fradulent activity *బోఫోర్స్, జర్మనీ జలాంతర్గాములు తదితర ఆయుధ కొనుగోలు ఒప్పందాలకు సంబంధించిన కుంభకోణాలను మసిపూసి మారేడుకాయ చేయడానికి ...* (ఆం.ప్ర. 25.4.88)

**కుటుంబ నియంత్రణ** వి. *kuTumba niyantraNa* తక్కువ సంతానాన్ని కనడం ద్వారా కుటుంబాన్ని పరిమితం చేయటం family planning

కుటుంబ నియంత్రణకోసం ఏర్పాటు చేసిన కుటుంబ సంక్షేమ కేంద్రాలు ఎందుకూ కొరగాకుండా తయారవుతున్నాయి. (ఈ 5.6.87)

**కుటుంబ పార్టీ** వి. *kuTumba paarTii* ఒకే కుటుంబంలోని వ్యక్తులు కీలక పాత్రలను నిర్వహించే రాజకీయ పక్షం a political party run by the members of the same family దేశం కాకూడదు కుటుంబ పార్టీ: శీనయ్య. (ఈ 26 10 87)

**కుటుంబ పాలన** వి. *kuTumba paalana* ఒకే కుటుంబ సభ్యుల జోక్యం ఎక్కువగా ఉండే పరిపాలన family rule ... అటువంటప్పుడు శ్రీ ఎన్.టి. రామారావు కుటుంబ పాలన చేస్తున్నట్లు అని ఆయన ప్రశ్నించారు. (ఉ 14 4 88)

**కుట్రదారుడు** వి. *kuTradaaruDu* హత్యలు, ప్రభుత్వాలను కూలదోయటం వంటి చట్ట వ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొన్న వ్యక్తి conspirator జోగా సింగ్ హత్యకేసులో తనను కుట్రదారునిగా పేర్కొంటూ, పేరొందిన వార్తాసంస్థలు ఆరోపించడంపట్ల ఆశ్చర్య పోయానని పేర్కొన్నారు. (ఆం భూ 12 5 89)

**కుట్ర రాజకీయం** వి. *kuTra raajakiiyam* మోసపూరితమైన రాజకీయాలు conspiratorial politics 'అన్న' కు కుట్ర రాజకీయం తెలియదు. (ఆం భూ 7 10 87)

**కుతకుతలాడు** క్రి. *kutakutalaaDu* (ఒక సంస్థ లేదా సంస్థల మధ్య) విభేదాలు లోలోపల తీవ్ర స్థాయిలో కొనసాగు to simmer (as in group differences) పశ్చిమ బెంగాల్ అధికార వామపక్ష సంఘటన భాగస్వాముల మధ్య కుతకుతలాడుతున్న విభేదాలు ఇటీవల రచ్చకెక్కాయి. (ఆం జ్యో 19 2 88)

**కుదించు** క్రి. *kudincu* అదుపులో ఉంచటంకోసం తక్కువ చేయు; తగ్గించు to cut short, to belittle పంచాయితీరాజ్ సంస్థల నిర్వహణలో రాష్ట్రాలకున్న అధికారాలను కుదించే ప్రసక్తే లేదని ప్రధాన మంత్రి రాజీవ్ గాంధీ మరోమారు స్పష్టం చేశారు. (ఈ 11.5 89)

**కుదిపివేయు** క్రి *kudipiveeyu* తీవ్రమైన సంక్షోభం కలిగించు to rock (country, parliament etc.) మతకలహం ఒకప్పుడు భారతదేశాన్నంతా కుదిపివేయగా కాశ్మీర్‌లోని చినార్, కేసర్ పర్వత ప్రాంతాలు, ఇతర నదీ ప్రాంతాలు తమ సహజ శాంతి ధోరణిలోనే ఉండిపోయాయి. (ఆం భూ 26.5 89)

**కుదుటపడు** క్రి. *kuduTapaDu* మామూలు పరిస్థితి ఏర్పడు; స్థిమితపడు to come back to normalcy ... రెండేసి మార్లు వాయిదా వేయాల్సి వచ్చింది. అయినప్పటికీ పరిస్థితి కుదుట పడకపోవడంతో ఇక బుధవారానికి సభా కార్యక్రమాలను ముగించాల్సి వచ్చింది. (ఈ 20 7 89)

**కుదుర్చుకొను** క్రి. *kudurcukonu* భిన్న పక్షాలు ఒక అంగీకారానికి వచ్చు to reach to enter into(an agreement) సరిహద్దుల్లో సైనికీకరణకు తావులేని విధంగా సోవియట్ యూనియన్, చైనా దేశాలు ఒప్పందం కుదుర్చుకోబోతున్నాయి (ఈ 18 5 89)

**కుప్పకూలు** క్రి. *kuppakuulu* (హఠాత్తుగా) పూర్తిగా పడిపోవు to collapse ... కర్నాటకలో పాలక పక్షం దానంతటదే కుప్పకూలి పోయిందని, దీనికి గవర్నర్

బాధ్యులు కారని అన్నారు. (ఈ. 25 4 89)

**కుప్పతెప్పలు** వి. (బ.వ.) *kuppateppalu* లెక్కకు మించిన సంఖ్య abundance వెళ్ళిన చోటల్లా ప్రజలు పోలీసుల వేధింపు గురించి, అత్యాచారాల గురించి కుప్పతెప్ప లుగా ఫిర్యాదులు చేయడం కనబడింది. (ఆం.భూ. 6 7.89)

**కుమ్మక్కగు** క్రి. *kummakkagu* (దురు ద్దేశంతో కూడిన) రహస్య అవగాహనకు వచ్చు; లాలూచీ పడు to collude గవర్నర్లతో కుమ్మక్కై కేంద్రం అన్ని కాంగ్రె సేతర రాష్ట్ర ప్రభుత్వాలను కూలదోస్తుందనే భయాన్ని కూడా .. వ్యక్తపరిచారు. (ఆం ప్ర. 1.5.89)

**కుమ్మరించు** క్రి. *kummarincu* (సొమ్ము) ఎక్కువ మొత్తంలో వెదజల్లు to pour (money) ఇక్కడ కాంగ్రెస్ అభ్యర్థి భోస లేని గెలిపించేందుకు ఆ పార్టీ డబ్బు సంచులు గుమ్మరించిందని దండావతే ఒక ఇంట ర్వ్యూలో ఆరోపించారు. (ఈ 23 11 89)

**కుమ్ములాట** వి. *kummulaTa* చూ. కీచులాట; ఇప్పటి వరకు బేగం పేట విమా నాశ్రయానికే పరిమితమైన సిటీ కాంగ్రెస్ కుమ్ములాటలు గాంధీ భవన్‌కు వ్యాపించడం ఇదే మొదటిసారి. (ఈ 22 5 89)

**కుల ప్రాతిపదిక** వి. *kula praatipadika* కులాన్ని ఆధారం చేసుకోవటం (on) the basis of caste కుల ప్రాతిపది కపై రాజకీయాలు నడిపే మధ్యయుగాల సంస్కృతి ఏనాడో సమాధి అయిందని శ్రీ మాధవ రెడ్డి స్పష్టం చేశారు. (ఆం జ్యో 1.12.87)

**కుహనా రాజకీయం** వి *kuhanaa raajakiiyam* మోసపూరిత బూటకపు రాజకీయం hypocritical politics అధికారిక రహస్యాల చట్టాన్ని సంస్కరిస్తా మని తెలుసుకునే హక్కును నిలబెడతామని నిర్ద్వంద్వంగా మాట యిస్తేనే ఓటు, నీళ్ళు నమిలితే వేటు అని ఖరాఖండిగా స్పష్టీక రించడమే అధికారిక రహస్యాల కుహనా రాజకీయానికి విరుగుడు. (ఈ. 20 4.89)

**కూటమి** వి. *kuuTami* వివిధ వ్యక్తుల లేదా రాజకీయ శక్తుల కలయిక alliance పాకిస్తాన్‌లోని ఏడు పార్టీలకు చెందిన తిరు గుబాటు దారుల కూటమి ఈ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. (ఆం భూ 4 5 89)

**కూడగట్టు** క్రి. *kuuDagaTTu* అభిప్రాయా లను, బృందాలను, ఒక తాటి మీదికి తెచ్చు to unite, consolidate రాజీవ్ గాంధీ అవినీతి, అసమర్థ ప్రభుత్వానికి వ్యతి రేకంగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టేందుకు రూపొందించిన దేశ వ్యాప్త ఉద్యమ కార్యక్ర మంలో ... (ఈ. 27.7 89)

**కూడబెట్టు** క్రి. *kuuDabeTTu* (డబ్బు లేదా ఆస్తులను) సమీకరించు to amass wealth or property ... ప్రభుత్వ ఆసుపత్రిలో డిప్యూటీ సివిల్ సర్జన్‌గా పని చేస్తున్న వ్యక్తి అవినీతి చర్యలకు పాల్పడి అక్రమ మార్గాల ద్వారా ఆదాయాన్ని మించిన ఆస్తులు కూడబెట్టినట్లు అవినీతి నిరోధక శాఖ దాడులలో వెల్లడయిందని .. (ఆం జ్యో 19 10.87)

**కూపీ** వి *kuupii* రహస్య సమాచారాన్ని బయటకు లాగటం probe, enquiry ఖాతాల కూపీకి వి పి. డిమాండ్ (ఈ. 20 6 87)

**కూరుకుపోవు** క్రి. *kuurukupoovu* వెలుప లికి రాలేనంత లోతుగా చిక్కుకు పోవు to get deeply involved, steep in తెలుగు దేశం ప్రభుత్వం అవినీతిలో కూరు

కుపోయిందని ... కొందరు సభ్యులు చేసిన సూచనలకు ప్రధాని స్పందించారు (ఈ 23 12 87)

**కూలంకషం** వి. *kuulankaSam* పూర్వాపరాలను సంపూర్ణంగా సమీక్షించటం thorough and detailed (review) *దేశంలో మత పరిస్థితిపై బుధవారం ఇక్కడ జరిగిన ప్రధాన కార్యదర్శుల సదస్సులో కూలంకషంగా సమీక్షించారు.* (ఈ 28 6 89)

**కూలగొట్టు** క్రి. *kuulagoTTu* (ఇళ్ళను, నిర్మాణాలను) పడగొట్టు to demolish *లాలాగూడా ఇందిరా నగర్ కాలనీలో 14 ఇళ్ళను రైల్వేవారు మంగళవారం ఉదయం ఆకస్మికంగా కూలగొట్టారు.* (ఈ. అను 24 5 89)

**కూలదోయు** క్రి. *kuuladooyu* ప్రభుత్వాలను అక్రమంగా పడగొట్టు to topple (a government) *కర్నాటకలో జనతాదళ్ ప్రభుత్వాన్ని అప్రజాస్వామికంగా కూలదోసినందుకు నిరసనగా* ... (ఆం ప్ర 23 4 89)

**కూలిపోవు** క్రి. *kuulipoovu* అకస్మాత్తుగా పడిపోవు to crash, collapse or to crumble ... *ఆఫ్ఘనిస్తాన్‌లో గాని లేదా ఆఫ్ఘనిస్తాన్ సమీపంలో గాని ఈ సైనిక హెలికాప్టర్ కూలిపోయి ఉండవచ్చని సూచన ప్రాయంగా తెలిసింది* (విశా 24 10 87)

**కూలీ** వి. *kuulii* రోజు పనికి లభించే వేతనం daily wage *నీటి పారుదల ప్రాంతాల్లో ఏడాదికి 120 రోజులు కూలీలకు 'కూలీ' దొరుకుతుంది.* (ఆం ప్ర 20 4.88)

**కూల్చివేయు** క్రి. *kuulciveeyu* చూ. కూలదోయు, *ఊహాజనితమైన నిర్హేతుకమైన ఇలాంటి కారణాలతో కేంద్రం ఏ రాష్ట్ర ప్రభుత్వాన్ని అయినా యథేచ్ఛగా కూల్చివేయవచ్చు.* (ఆం. ప్ర 6 5.89)

**కృంగిపోవు** క్రి. *kRngipoovu* నష్టాలకు గురయి అసంతృప్తిచెందు to get disappointed *ఖరీఫ్ సీజన్ ప్రారంభంలోనే వేసుకున్న పంటలు వరదపాలు కావడంతో రైతులు కృంగిపోతున్నారు.* (ఈ. 27.7 89)

**కృతనిశ్చయం** వి. *kRtaniścayam* అనుకున్నది చేసి తీరాలనే గట్టి పట్టుదల కలిగిన నిర్ణయం strong conviction or firm determination ... *పార్లమెంట్ ఉభయ సభల కార్యకలాపాలను స్తంభింప జేయాలన్న తమ కార్యక్రమాన్ని కొనసాగించాలని ప్రతిపక్ష పార్టీలు కృతనిశ్చయంతో ఉన్నాయి.* (ఈ 21.7 89)

**కృత్రిమ వర్షం** వి. *kRtrima varSam* శాస్త్ర విజ్ఞానం వినియోగించి మబ్బులను ఒక దగ్గర కేంద్రీకరించి కురిపించే వాన artificial rain *మేఘ సృష్టి చేసి కృత్రిమ వర్షాలు కురిపించి రాష్ట్రంలో మంచి నీటి సంక్షోభాన్ని పటాపంచలు చేసేందుకు విధానాలు సూచించాలని ... విజ్ఞప్తి చేశారు.* (ఆం ప్ర 20 3 88)

**కృత్రిమ హృదయకవాటం** వి. *kRtrima hRdayakavaaTam* మానవుని శరీరంలోని హృదయ కవాటం పని చేయనప్పుడు శస్త్ర చికిత్స ద్వారా అమర్చే ప్లాస్టిక్ పరికరం artificial heart volve *దేశంలోనే కృత్రిమ హృదయకవాటాల ఉత్పత్తి.* (ఉ 6 10 87)

**కృష్ణ జన్మస్థానం** వి *kRSNa janmasthaanam* జైలు, చెరసాల (చెరసాలలో కృష్ణుడు జన్మించినట్లు పురాణగాథ) prison *అవినీతికి పాల్పడితే తన కుమారుడినైనా శిక్షించే చండశాసనుడు ఆయననీ*

అవినీతి పరులు తప్పక శ్రీ కృష్ణ జన్మస్థానం చూస్తారని, అది తప్పదని రాష్ట్ర రెవిన్యూ మంత్రి ... అన్నారు. (ఉ. 9 6 87)

**కెలుకు** క్రి. *keluku* స్తబ్దంగా ఉన్న వివాదాన్ని తట్టిలేపు to rake up (a problem) 'ఖల్సాను కెలికింది ప్రభుత్వమే' అసలు ఒక రకంగా చరిత్ర పుటల్లో నిద్రపోతున్న 'సర్బత్ ఖల్సా'ను తట్టిలేపి, ముస్తాబు చేసి ముందుకు నెట్టింది ప్రభుత్వమే. (ఉ. 22 10 87)

**కేంద్రపాలిత ప్రాంతం** వి. *keendra paalita praantam* ప్రత్యక్షంగా కేంద్ర ప్రభుత్వ పాలనలో ఉన్న ప్రదేశం union territory ... ఢిల్లీ, పాండిచ్చేరీలు రెండూ ఎన్నికలు జరగాల్సి ఉన్న కేంద్ర పాలిత ప్రాంతాలు. (ఈ 28 9 89)

**కేంద్ర వేతన సంఘం** వి. *keendra veetana sangham* కేంద్ర ప్రభుత్వ ఉద్యోగుల వేతనాల పెంపుదల గురించి సిఫారసులు చేసే బృందం central wage board నాలుగో కేంద్రవేతనసంఘం ప్రాతిపదికను సవరించిన రేట్ల ప్రకారం కేంద్ర సిబ్బందికి ఈ ఏడాది జూలై నుంచి డి. ఎ. లభించాల్సింది. (ఈ. 20.9 89)

**కేంద్రీకృతం అగు** క్రి. *keendriikRtam agu* 1. ఒక అంశానికి ప్రాముఖ్యం ఇచ్చు to focus, centre around చైనా నాయకులతో జరిపిన చర్చలు ఎంతో సంతృప్తికరంగా ఉన్నాయని, ద్వైపాక్షిక సంబంధాల పైనే ఈ చర్చలు ప్రధానంగా కేంద్రీకృతమయ్యాయని సోవియట్ అధినేత ... తెలిపారు. (ఈ 18 5 89) 2. (వ్యక్తులు లేదా పదార్థాలు) ఒక దగ్గర వచ్చి చేరు to centre, concentrate పెద్ద సంఖ్యలో చైనా సైన్యం సెంట్రల్ బీజింగ్‌లో కేంద్రీకృతమవుతునాయి. (ఈ. 20.5.89)

**కేటగిరీ** వి. *keeTagirii* ఒకే తరహాకు చెందిన లక్ష్యం category నీటి తీరువా విధించడానికి ఆయకట్టు భూములను రెండు కేటగిరీలు చేశారు. (ఆం జ్యో 18 6.87)

**కేటాయించు** క్రి. *keeTaayincu* (అర్హతలు, అవసరాలనుబట్టి) సౌకర్యాలు, డబ్బు మొ. ప్రత్యేకించు to allocate, earmark, allot ... 'తెలుగు గంగ' శ్రీశైలం ఎడమగట్టు కాల్వ ప్రాజెక్టుల పనుల కోసం చెరి వందకోట్ల రూపాయలు కేటాయించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. (ఉ 2 7.87)

**కేడర్** వి. *keeDar* రాజకీయ పార్టీలలో కింది స్థాయిలో పని చేసే కార్యకర్తల సమూహం cadre ఆ సమ్మె సందర్భంగా జరిగిన కాల్పుల్లో 200 మంది కార్మికులు, సి. పి. ఐ కేడరు ప్రాణాలు కోల్పోయారు. (విశా 13 9 87)

**కేబినెట్ కమిటీ** వి. *keebineT kamiTii* (భిన్నాభిప్రాయాలున్న) విషయాలపై అధ్యయనం చేసేందుకు మంత్రివర్గం నియమించే మంత్రులతో కూడిన సంఘం cabinet committee సమాచార హక్కును రాజ్యాంగ బద్ధం చేసే వివరాలను తయారు చేసేందుకు త్వరలోనే కేబినెట్ కమిటీని వేస్తారు. (ఆం. భూ. 7 12 89)

**కేసు మాఫీ** వి. *keesu maafii* ఆరోపణలపై జరుగుతున్న కోర్టు విచారణను అక్రమ పద్ధతుల ద్వారా రద్దు చేయించటం hushing up of a court case పశ్చిమ గోదావరి జిల్లా పెనుగొండ సమీపంలోని నెగ్గిపూడి గ్రామంలో నిన్న వెలుగు చూసిన కల్తీ విస్కీ, బ్రాందీల కేసుమాఫీకి మురా సంబందితులు బారీ ఎతున తెరవె

నుక తతంగం నిర్వహిస్తున్నట్లుగా స్థానికంగా వార్తలు వినవస్తున్నాయి. (ఉ. 18 12 87)

**కైంకర్యంచేయు** క్రి. *kainkaryamceeyu* (ప్రజాధనం) స్వప్రయోజనాలకోసం వాడుకొను లేదా దిగమింగు to embezzle public funds ప్రతి జిల్లాలో 30 నుండి 40 సొసైటీల అధ్యక్షులు బినామీ పేర్లతో నిధులు కైంకర్యం చేసినట్లు ఆయన చెప్పారు. (ఉ 23 9.87)

**కైవసంచేసుకొను** క్రి. *kaivasam-ceesukonu* (పతకాలు, భూభాగం మొ.) పోరాడి చేజిక్కించుకొను, హస్తగతం చేసుకొను, పొందు to capture, bag ఈ సారి మెజారిటీ లోకసభ స్థానాలు కైవసం చేసుకోవచ్చని కాంగ్రెసువారు ఆశాభావం వ్యక్తం చేసుకున్నారు. (ఆం భూ 21 4 89)

**కొండంత అండ** వి. *konDanta anDa* పెద్ద ఎత్తున ఇచ్చే మద్దతు indomitable support దేశ ప్రజ, కాంగ్రెస్ పార్టీ ఈ పాటికే ఈ తిరోగమన శక్తుల ఉద్దేశాలను గమనించాయని దేశానికి ఎదురవుతున్న అనేక సవాళ్ళను ఎదుర్కోవడంలో ప్రధానికి కొండంత అండగా నిలిచాయనీ వారన్నారు. (ఈ. 24 7 89)

**కొట్టిపారవేయు** క్రి. *koTTipaaraveeyu* నిజంకాదని తోసిపుచ్చు to discount, rebut దేవిలాల్ ప్రభుత్వాన్ని రాష్ట్రపతి డిస్మిస్ చేసే అవకాశాలను ఇక్కడి రాజకీయ పరిశీలకులు పూర్తిగా కొట్టి పారేస్తున్నప్పటికీ ... (ఈ 17 11 89)

**కొట్టివేయు** క్రి. *koTTiveeyu* (న్యాయస్థానం పిటీషన్లు ప్రభుత్వ విధానాలు మొ. పరిశీలించి) చట్ట సమ్మతం కాదని తిరస్కరించు to reject the plea, strike off (an order or a policy of the govt. etc.) కాంగ్రెస్(ఐ) కార్యకర్తల విడుదల కోరతూ శ్రీ సుధీర్ కుమార్ ఒక హెబియస్ కార్పస్ పిటీషన్‌ను ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టులో దాఖలు చేయగా కోర్టు దానిని కొట్టివేసింది. (ఆం ప్ర 1.5.89)

**కొట్టుమిట్టాడు** క్రి. *koTTumiTTaaDu* (సమస్యలతో) సతమతమగు to struggle (with problems) కోట్లాది మంది చేనేత కార్మికులు ఆర్థిక ఇబ్బందుల్లో కొట్టుమిట్టాడుతున్నారని ఆయన ఆవేదన వ్యక్తం చేశారు. (ఆం. భూ. 17 5.89)

**కొత్తపుంతలు తొక్కు** క్రి. *kottapuntalu tokku* గుణాత్మకమైన, అభివృద్ధికరమైనదిశలో అడుగు ముందుకువేయు to enter into new arena రక్షణ రంగంలో పరస్పర సహకారానికి ఇటీవల తీసుకున్న చొరవవల్ల రెండు దేశాల మధ్య సంబంధాలు కొత్తపుంతలు తొక్కగలవని అమెరికా అధికారులు అన్నారు. (ఈ 17.3 88)

**కొనసాగించు** క్రి. *konasaagincu* (ఒక వ్యక్తిని అదే పదవిలో) అలాగే నిలిపి ఉంచు to allow to continue నిజామాబాద్ జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడుగా బాల్‌రెడ్డిని కొనసాగించాలని ... కోరారు. (ఆం. ప్ర 13.6 89)

**కొనసాగు** క్రి. *konasaagu* 1. (ఒకపని) ఆగకుండా జరుగు to continue (as an activity) జిల్లాల్లో దాడులు కొనసాగుతున్నాయని పేరు మోసిన వారితో సహా బట్టికలోవాలో 39 మందిని అరెస్టు చేసినట్లు సైనికవర్గాలు వెల్లడించాయి. (విశా 12.10 87)

**కొనితెచ్చుకొను** క్రి *koniteccukonu*

స్వయంగా కల్పించుకొను to invite (trouble, difficult etc. అవగాహన లోపం కారణంగానే శ్రీ రెడ్డి అనవసరమైన మనస్పర్థలు కొని తెచ్చుకొని లేనిపోని వివాదాలు సృష్టిస్తున్నారని ... (ఆం. ప. 28.10.87)

**కొనియాడు** క్రి. *koniyaaDu* ఇతరుల పనులను లేదా గుణగణాలను కీర్తించు లేదా మెచ్చుకొను to appreciate, admire శ్రీలంకలో శాంతి పునరుద్ధరణకు భారత దేశం నిర్వహిస్తున్న పాత్రను కనపోనే కొనియాడారు. (విశా. 13.10.87)

**కొమ్ముకాయు** క్రి. *kommukaayu* కొన్ని ప్రయోజనాల నాశించి ఒక పక్షాన్ని సమర్థించు to support sb (with connivance) కాంగ్రెస్‌ను ఓడించడమే తమ ధ్యేయమని చెప్పకొనే ఈ పార్టీలు కొద్దిపాటి సీట్లకోసం ఎన్. టి. ఆర్. కొమ్ము కాస్తున్నాయి. (ఆం. భూ. 21.5.89)

**కొరత** వి. *korata* అవసరానికి సరిపడ సరుకులు లభ్యం కాకపోవటం scarcity రానున్న దీపావళి పండుగ వరకూ రాష్ట్రంలో చక్కెరకు తీవ్రమైన కొరత ఏర్పడే అవకాశాలు ఉన్నాయని మార్కెట్ వర్గాలు భావిస్తున్నాయి. (ఈ. 27.7.89)

**కొరవడు** క్రి. *koravaDu* తగినంత లేక పోవు; తక్కువ అగు to lack ప్రజలతో సజీవ సంబంధాలు కొరవడుతున్నాయి. (ఈ. 3.5.89)

**కొరియర్** వి. *koriyar* అజ్ఞాతంగా ఉండే విప్లవకారులకు సమాచారం అందించే నమ్మకస్తుడు courier రాజమండ్రి జైలులో ఉన్న ఎనిమిది మంది నక్సలైట్లలో ఇద్దరు వ్యక్తులు అతిముఖ్యమైన 'కొరియర్స్'గా భావిస్తున్నారు. (ఆం. ప్ర. 30.12.87)

**కొర్రీలువేయు** క్రి. *korriiluveeyu* (ఫైళ్ళను పరిశీలించేటప్పుడు అధికారులు) నిబంధనలకు సంబంధించిన అభ్యంతరాలను లేవనెత్తు to query, raise doubts పై వాళ్ళ బూరకు బ్యురలూపే బ్యూరాక్రాట్లు కొరమాలిన కొర్రీలువేయడంలో విశారదులు. (ఈ. 29.1.88)

**కొలిక్కివచ్చు** క్రి. *kolikkivaccu* తుది రూపం సంతరించుకొను to come to a final shape or stage వ్యవసాయ రంగం ప్రయోజనాలకు పాటుపడడానికి జాతీయ స్థాయిలో ఐక్య సంఘటన ఏర్పరచేందుకు తొమ్మిదేళ్ళుగా సాగుతున్న ప్రయత్నాలు ఎట్టకేలకు ఒక కొలిక్కి వచ్చాయి. (ఈ. 18.7.89)

**కొల్లగొట్టు** క్రి. *kollagoTTu* ఆర్థికంగా దోపిడీ చేయు to exploit, loot సంపన్న దేశాలు, పేద దేశాల, వర్ధమానదేశాల అపారమైన వనరుల్ని కొల్లగొట్టడానికి ... (ఆం. భూ. 19.7.89)

**కోఆప్షన్ పద్ధతి** వి. *koo aapSan paddhati* (ప్రత్యక్షంగా ఎన్నిక కాకుండా) ఒక వ్యక్తి ఒక కమిటీ లోని ఆ కమిటీ సభ్యుల ఇష్టప్రకారం సభ్యత్వం పొందే విధానం co-option method ... ప్రతినిధులను నామినేషన్, కోఆప్షన్ పద్ధతుల ద్వారా నియమించ కుండా ప్రజాస్వామ్య పద్ధతిలో ఎన్నుకోవాలని తీర్మానం సూచించింది. (ఈ. 11.5.89)

**కోచ్** వి. *kooc* క్రీడాకారులకు శిక్షణ నిచ్చే నిపుణుడు coach (as in sports) క్రీడా సంస్థ అధికారుల ప్రోత్సాహంతో అథ్లెట్లను ఇంగ్లాండ్ పర్యటనకు పురికొల్పిన ఇద్దరు కోచ్‌లపై చర్య తీసుకోవాలని సమాఖ్య భావి

స్తున్నది. (ఆం౹ప్ర 15 7 89)

కోత వి. *koota* (నిధులు, విద్యుచ్ఛక్తి మొ. వాటికి సంబంధించి) గతంలో నిర్ణయించిన మొత్తాన్ని తగ్గించటం cut (as of electricity, funds etc.) విద్యుత్ కోతవల్ల ఉపాధి కోల్పోయిన వేలాది మంది కార్మికులకు ప్రత్యామ్నాయంగా ... (ఆం. ప్ర 3 5 89)

కోమా వి. *koomaa* తీవ్ర అనారోగ్యం వల్ల ఏర్పడిన అపస్మారక స్థితి coma శ్రీ ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ సోమవారం సాయంత్రం గాఢమైన 'కోమా' లోకి జారిపోయినట్టు . . చెప్పారు. (ఆం. ప 7 7 87)

కోర్కె వి.*koorke* సామాజిక రాజకీయ సంబంధమైన డిమాండు demand థక్కర్ కమీషన్ నివేదిక పూర్తి పాఠాన్ని ప్రజలకు తెలియజేయాలన్న తమ పార్టీ కోర్కెలను ఆయన పునరుద్ఘాటించారు. (ఆం. ప్ర. 26.4 89)

కోర్టుకెక్కు క్రి. *koorTukekku* న్యాయం కోసం న్యాయ స్థానంలో కేసును దాఖలు చేయు to approach a court (for justice) 'ఎన్నికల గుర్తుకోసం కోర్టుకెక్కుతారు' (ఆం. జ్యో 7 3 88)

కోర్టు పరిధి వి. *koorTu paridhi* ఒక వివాదాంశం (కేసు) న్యాయ స్థానపు విచారణలో ఉన్న స్థితి purview of the court ఈ అంశం కోర్టు పరిధిలో ఉన్నందున వాయిదా తీర్మానం ఆమోదించడం లేదని డిప్యూటీ స్పీకర్ శ్రీ తంబిదురై చెప్పారు. (ఆం జ్యో 21 4.88)

కోర్టు మిత్రుడు వి. *koorTu mitruDu* అత్యంత ప్రాముఖ్యం కలిగిన విషయాలపై న్యాయస్థానాలకు సలహాలిచ్చే న్యాయ నిపుణుడు amicus curiae హైకోర్టు విజ్ఞప్తి మేరకు శ్రీ పరాశరన్ కోర్టు మిత్రుడుగా ఈ కేసులో సహకరిస్తున్న విషయం పాఠకులకు తెలిసిందే. (ఈ 3012 87)

కోర్టు రుసుం వి. *koorTu rusum* దావాలకు, న్యాయ సంబంధమైన వివాదాలకు సంబంధించిన కేసుల విషయంలో న్యాయస్థానానికి చెల్లించవలసిన డబ్బు court fees కోర్టు రుసుమును ఎత్తివేసే సమస్యే లేదని ఒక ప్రశ్నకు సమాధానంగా మంత్రి తెలిపారు. (ఆం. జ్యో 27.11.87)

కోర్టుల బహిష్కరణ వి. *koorTula bahiSkaraNa* న్యాయవాదులు తమ నిరసనను తెలిపేందుకు న్యాయస్థానానికి హాజరు కాకపోవటం boycotting the courts (by lawyers) కృష్ణా జిల్లా అంతటా కోర్టుల బహిష్కరణ నిర్ణయం. (ఆం. ప 17 10 87)

కోర్కెల దినం వి. *koorkela dinam* తమ కోర్కెలను తీర్చాలని కార్మికులు లేదా ఉద్యోగులు తమ అభిప్రాయన్నీ, నిరసననూ తెలిపేందుకు ఎంచుకొన్న రోజు demands day ఈ నెల 31న బీడీ కార్మికుల కోర్కెల దినంగా పాటించాలని కూడా తీర్మానించారు. (ఆం. భూ. 2.10 87)

కోలుకొను క్రి. *koolukonu* అనారోగ్యం నుంచి బయటపడు to convalesce, recover from illness కోలుకొంటున్న మదర్ థెరిసా (ఆం భూ 20.9 89)

కోల్‌బెల్ట్ వి. *koolbelT* (రాక్షస) బొగ్గు లభించే ప్రాంతం coal belt వరంగల్ జిల్లా పరకాల నియోజకవర్గంలో కల ఈ భూపాల పల్లెతో బాటు, వెంకటాపురం, గణపురం, గోవిందరావుపేట మండలాలను కలిపి ములుగు కోల్‌బెల్ట్‌గా నామకరణం చేశారు. (ఆం ప్ర 29.6 89)

కోల్పోవు క్రి. *koolpoovu* (ఉన్నదాన్ని)

పోగొట్టుకొను to lose జర్మలిస్టుగా జీవితం కొనసాగించడం మూలంగా సృజనాత్మకతను కోల్పోయామన్నారు. (ఆం భూ. 21.10 87)

కోస్టుగార్డ్ వి. *koosTgaarD* సముద్ర తీరాన్ని కాపలాకాసే రక్షకదళం coast guard *దొంగ బంగారం విషయంలో కోస్ట్ గార్డ్ సహాయం కూడా తీసుకోవాలని కస్టమ్స్ శాఖ యోచిస్తోంది.* (ఆం భూ 1589)

కౌంటర్ అఫిడవిట్ వి. *kaunTar afiDaviT* న్యాయ స్థానంలో తన మీద వచ్చిన ఆరోపణలకు సమాధానమిస్తూ దాఖలు చేసే వివరణాత్మకపత్రం. counter affidavit పో. చూ. అఫిడవిట్; *ఒక కౌంటర్ అఫిడవిట్ దాఖలు చేసి ఆరోపణలను ఎందుకు ఖండించలేదని అడగ్గా . .* (ఆం ప్ర. 4.1 88)

క్యాంపు వి. *kyaampu* కొంప గోడు కోల్పోయినవారిని ఆదుకునేందుకు తాత్కాలికంగా ఏర్పాటు చేసిన సామూహిక వసతిప్రదేశం; శిబిరం camp (for refugees, displaced persons etc.) *కావలసిన అన్ని చర్యలను తీసుకుందామని శరణార్థుల క్యాంపుల్లో ఉన్న టర్కులకు ధైర్యం చెప్తూ ఈ నాయకులిద్దరూ ఫర్గాలోనే గడిపారు.* (ఆం ప్ర 15 6 89)

క్యాంపు రాజకీయం వి *kyaam[illegible]uja kiiyam* పై కమిటీలను ఎన్నుకొనే సభ్యులను ఎన్నికకు కొన్ని రోజుల ముందు నుంచీ ఒక దగ్గర చేర్చి ( రాజకీయ పార్టీలు) ఉంచటం; శిబిర రాజకీయం maintaining political camps *క్యాంపు రాజకీయం ప్రారంభం: ప్రాథమిక సహకార పరపతి సంఘాలకు ఎన్నికలు ముగిసీ ముగియక ముందే జిల్లా కేంద్ర సహకార బ్యాంకులు, జిల్లా మార్కెటింగ్ సొసైటీలకు అకస్మాత్తుగా ప్రభుత్వం ఎన్నికలు ప్రకటించడంతో 'శిబిర రాజకీయాలు' మొదలయ్యాయి.* (ఆం జ్యో. 3 7 87)

క్యాచ్ వి. *kyaac* క్రికెట్ ఆటలో బ్యాట్స్‌మన్ కొట్టిన బంతిని నేలతాకక ముందే ఫీల్డర్ పట్టుకోవటం (అంటే బ్యాట్స్‌మన్ అవుటవటం) catch *లోగికి క్యాచ్ ఇచ్చి ఔటయ్యాడు.* (ఆం ప్ర 22.4 89)

క్యాజువల్ కార్మికుడు వి. *kyaajuval kaarmikuDu* రోజు కూలీ మీద పని చేసే శ్రామికుడు casual labourer *తంతి తపాలా శాఖలో ఏడాది నుంచి క్రమం తప్పకుండా పనిచేస్తున్న క్యాజువల్ కార్మికుల సర్వీసును క్రమబద్ధం చేయడానికి ...* (ఈ 29 10 87)

క్యాపిటేషన్ ఫీజు వి. *kyaapiTeeSan fiiyu* (వైద్యం, ఇంజనీరింగ్ లాంటి వృత్తి విద్యా కోర్సులలో) ప్రవేశం కోసం అధిక మొత్తంలో చెల్లించే రుసుం capitation fee *మహారాష్ట్రలో వృత్తి విద్యాకోర్సులకు సంబంధించి క్యాపిటేషన్ ఫీజును నిషేధించినందున ...* (ఈ. 5 6 87)

క్యూరేటర్ వి. *kyuureeTar* మ్యూజియం, జంతుప్రదర్శనశాలలాంటి సంస్థల సంరక్షకుడు; నిర్వహణాధికారి curator *సరైన రక్షణలేక అత్యంత విలువైన కళా సంపద అంతరించి పోతోందని అమెరికాలోని లాస్‌ఏంజల్స్ కంట్రీ మ్యూజియంలో సీనియర్ క్యూరేటర్ డాక్టర్ ప్రతాపాదిత్యపాల్ అన్నారు.* (ఈ 15 9 87)

క్రమబద్ధంచేయు క్రి. *kramabaddham-ceeyu* 1 చట్ట బద్ధం చేయు to

regularize మూడు నెలల్లో ఇళ్ల స్థలాల పట్టాలను క్రమబద్ధంచేయనున్నట్లు ఆయన ప్రకటించారు. (ఆం. ప్ర. 5.12.89) 2.ఒక పద్ధతిని పాటించేటట్లుగా చూచు to regulate రేపటి నుంచి రాష్ట్ర సచివాలయానికి వచ్చే సందర్శకులను క్రమబద్ధంచేయడానికి ప్రభుత్వం కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవడానికి సంకల్పించింది. (ఆం జ్యో 1.7 87)

**క్రమబద్ధీకరణ** వి. *kramabaddhiikaraNa* ఒక పద్ధతికి కట్టుబడి నడిచేటట్లుగా చూడటం regularizing (as in timing of the trains, water supply etc.) ఈశాన్య రైల్వే రేపటికి కొన్ని క్రమ బద్ధీకరణ, రద్దులను ప్రకటించింది. (ఆం ప్ర 5 6.87)

**క్రమబద్ధీకరించు** క్రి. *kramabaddhiika rincu* చూ. క్రమబద్ధం చేయు; ప్రస్తుతం అనుసరిస్తున్న విధానాలలోని లొసుగులను సవరించి వచ్చే ఏడాది నుంచి బదిలీల విధానాన్ని క్రమబద్ధీకరిస్తామని రాష్ట్ర విద్యాశాఖ మంత్రి ... తెలిపారు. (ఆం ప 30 11 87)

**క్రమబద్ధ ఎన్నిక** వి. *kramabaddha ennika* చట్ట ప్రకారం సకాలంలో జరిగే ఎన్నిక regular election పంచాయితీరాజ్ సంస్థలకు క్రమబద్ధ ఎన్నికలు, వీటిలో బలహీన వర్గాలవారికి రిజర్వేషన్లు ... బిల్లులో పొందుపరుస్తారు. (ఈ 10 5 89)

**క్రమశిక్షణ** వి. *kramaśikSaNa* కొన్ని నియమాలను (స్వంతంగా విధించుకున్నవి లేదా సంస్థాగతమైనవి) పాటిస్తూ ప్రవర్తించటం discipline తన కోసం ఎవరూ బెనిఫిట్ మ్యాచ్ నిర్వహించవద్దని కోరిన ... మంత్రి గొప్ప క్రమశిక్షణపరుడుగా పేరు తెచ్చుకున్నాడు. (ఈ 18 8 89)

**క్రమశిక్షణసంఘం** వి. *kramaśikSa-Nasangham* ఒక సంస్థలోని సభ్యులు నియమాలను పాటించేటట్లుగా చూడటానికి ఏర్పాటయిన అధికారబృందం disciplinary committee "నా లాయరు ఎదురు చూస్తున్నారు. ఆయనను నాతోపాటు సమావేశానికి అనుమతించండి" అని మొహిందర్ ఆదివారం మరోసారి క్రమశిక్షణ సంఘాన్ని అభ్యర్థించారు. (ఈ 30.1 89)

**క్రమశిక్షణా చర్య** వి. *kramaśikSaNaa carya* సంస్థ నియమాలకు, ప్రయోజనాలకు భంగకరమైనవిధంగా ప్రవర్తించిన సభ్యులకు విధించే దండన dispciplinary action పార్టీలోని అసమ్మతివాదులపై క్రమశిక్షణా చర్య తీసుకునే విషయమై తానింకా ఒక నిర్ణయానికి రాలేదని ఆయన అన్నారు. (ఆం. జ్యో. 26 4 88)

**క్రాంతిపథం** వి. *kraan-tipatham* సామాజిక అభివృద్ధికి ఉద్దేశించిన నిర్మాణాత్మక కార్యక్రమాలు a governmental programme of developmental activities కరీంనగర్ క్రాంతి పథం పనులు భ్రాంతి నుంచి కాంతివైపు కదులుతున్నాయి. (ఉ 17 9.87)

**క్రాస్ ఎగ్జామినేషన్** వి. *kraas egjaam-ineeSan* కోర్టు విచారణలో ఎదుటి పక్షం న్యాయవాది (సాక్షులను లేదా నేరస్థుని) తరచి తరచి ప్రశ్నించటం cross examination న్యాయవాది శ్రీ యు. వి. పాండురంగారావు క్రాస్ ఎగ్జామినేషన్‌లో అడిగిన ప్రశ్నకు తాను ఫోటో చూసి బాబ్జీని గుర్తుపట్టలేనని .. (ఆం ప్ర 1.5 89)

**క్రాస్ ఓటింగ్** వి. *kraas ooTing* ఒక రాజకీయ పక్షం సభ్యులు మరో రాజకీయ పక్షానికి అనుకూలంగా (రహస్యంగా) ఓటు

చేయటం cross voting కాంగ్రెస్(ఐ)కి చెందిన పార్లమెంట్ సభ్యులు, శాసన సభ్యులు భారీ ఎత్తున క్రాస్ ఓటింగ్‌కు పాల్పడితే తప్ప ప్రతిపక్ష ఉమ్మడి అభ్యర్థి ... (ఉ 29 6.87)

**క్రిమినల్** విశే. *kriminal* (శిక్షా స్మృతిలో) నేరాలకు సంబంధించిన criminal మంత్రి వర్గం బుధవారం ఇక్కడ సమావేశమై సంపదపన్ను చట్టం కింద క్రిమినల్ ఫిర్యాదులపై .. (ఆం ప్ర 21.4 88)

**క్రిమిసంహారక మందు** వి. *krimi samhaaraka mandu* పైరు పంటలను దెబ్బతీసే పురుగులను చంపివేసే ఔషధం pesticide వేపకాయల నుంచి కొత్త రకం క్రిమి సంహారక మందును ఇక్కడి ప్రాంతీయ పరిశోధనా ప్రయోగశాల రూపొందించింది (ఆం. భూ. 20 6 87)

**క్రియాశీలక ప్రణాళిక** వి *kriyaaśiilaka praNaaLika* నిర్దిష్టమైన కార్యక్రమాలను సూచిస్తూ అలసత్వం లేకుండా ఆచరణలో పెట్టే పథకం action programme దేశంలో మత దురహంకారాన్ని అణచివేసేందుకు ఒక క్రియాశీలక ప్రణాళికను రూపొందించినట్లు కేంద్ర హోంమంత్రి ... చెప్పారు. (ఉ 22 8 87)

**క్రియాశీలక ప్రతిపక్షం** వి. *kriyaaśiilaka pratipakSam* పాలక పక్షం తప్పొప్పులను సవిమర్శకంగా ఎత్తిచూపుతూ నిర్మాణాత్మకంగా పనిచేసే పాలక వ్యతిరేక పార్టీ active opposition ... తమిళనాడు కాంగ్రెస్(ఐ) అధ్యక్షుడు పళయాండి కూడా తమ పార్టీ 'క్రియాశీలక ప్రతిపక్షం'గా వ్యవహరిస్తుందని నొక్కి చెప్పారు. (ఆం ప్ర. 5 1 88)

**క్రియాశీల కార్యకర్త** వి. *kriyaaśiila kaaryakarta* ఒక రాజకీయ పార్టీలో ఉంటూ, ఆ పార్టీ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనే సభ్యుడు active volunteer of a political party ఇంతకుముందు క్రియాశీల కార్యకర్తలు కాలేకపోయినవారు ఈ నెల 20 నుంచి ప్రారంభమయ్యే సభ్యత్వపు పునరుద్ధరణ కార్యక్రమంలో రూ. 32 లు చెల్లించి క్రియాశీల కార్యకర్తలుగా గుర్తింపు పొందవచ్చని ఆయన తెలిపారు. (ఈ 9 8 87)

**క్రియాశీల పాత్ర** వి. *kriyaaśiila paatra* రాజకీయ (పార్టీల) కార్యకలాపాలలో ముఖ్యమైన బాధ్యతలు ఒప్పుకొని నిర్వహించటం active role (in politics) అటు ప్రతిపక్ష పార్టీల నుంచి, ఇటు కాంగ్రెస్(ఐ) తిరుగు బాటు దారుల నుంచి తీవ్రమైన ఆరోపణలకు గురియైన శ్రీ అమితాబ్ బచ్చన్ ఇక రాజకీయాలలో క్రియాశీల పాత్ర వహించరనీ, అయితే ... (ఉ. 17 9 87)

**క్రియాశీల రాజకీయం** వి. *kriyaaśiila raajakiiyam* (పార్టీల) రాజకీయ వ్యవహారాలలో ప్రత్యక్షంగా పాల్గొనటం active politics తమిళనాడు గవర్నరు శ్రీ పి. సి. అలెగ్జాండర్ క్రియాశీల రాజకీయాల్లో పాల్గొనాలని భావిస్తున్నారు. (ఆం ప్ర 23 7 89)

**క్రియాశీల సభ్యుడు** వి. *kriyaaśiila sabhyuDu* చూ. క్రియాశీల కార్యకర్త; ఇంతకుముందు తను ఏ రాజకీయ పార్టీలోనూ క్రియాశీల సభ్యునిగా పనిచేయలేదనీ, కాంగ్రెస్(ఐ) అభిమానిగా ఉంటూ వస్తున్నాననీ డాక్టర్ సుబ్బరామిరెడ్డి అన్నారు. (ఆం భూ 27.4.89)

**క్రియాశీల సహకారం** వి. *kriyaaśiila sahakaaram* కేవలం మాటలతో సరి

పెట్టకుండా (కార్యక్రమ నిర్వహణలో) నిజంగా పాలుపంచుకోవటం active co-operation కేంద్రంలో అధికారంలో ఉన్న పార్టీ కూడా క్రియాశీల సహకారం అందిస్తే చేరదలచిన గమ్యం చేరువవు తుంది. (ఈ 27.10.87)

క్రీజు వి. *kriiju* (క్రికెట్ ఆటలో) పిచ్ రెండు చివరల్లో బ్యాట్స్‌మెన్, బౌలర్ల కదలికలను నియంత్రిస్తూ గీసినగీతలకూ, వికెట్లకూ మధ్యనున్న స్థలం crease (as on a cricket pitch) అజారు ద్దీన్ వెనక్కు తిరిగి వెళ్ళాడు కానీ ఆయన క్రీజులోకి చేరుకునే లోపునే వికెట్ కీపర్ దూజాన్ బెయిళ్ళు పడగొట్టాడు. (ఆం భూ 14 12 87)

క్రీడాకారుడు వి. *kriiDaakaaruDu* ఆటల్లో నైపుణ్యం సాధించిన వాడు; ఆటగాడు sportsman ప్రభుత్వం క్రీడా కారులకు ప్రోత్సాహం అందించాలని ఆయన కోరారు. (ఆం. ప్ర. 18 5 89)

క్రీడాగ్రామం వి. *kriiDaagraamam* (పెద్ద ఎత్తున క్రీడల పోటీలు నిర్వ హిస్తున్నప్పుడు) ఆటలకు, ఆటగాళ్ళకు అవసరమైన అన్ని వసతులతో ప్రత్యే కంగా ఏర్పాటుచేసిన ఊరు sports village 'ఏషియాడ్' క్రీడాగ్రామం, స్పోర్ట్స్ సెంటర్ కూడా విలేఖరులు చూసిన వాటిలో ఉన్నాయి. (ఆం ప్ర 22.8 89)

క్రీడా సన్యాసం వి. *kriiDaa sanyaasam* క్రీడల నుంచి శాశ్వతంగా వైదొలగటం quitting the field of sports or games for ever ... ఆయన గత 47 ఏళ్ళుగా బాల్, రాకెట్ల జోలికి పోవడంలేదు. మోచేయి విరిగి చేయి పనికి రానిదయి పోవడంతో ఆయన క్రీడా సన్యాసం చేశారు. (ఆం ప్ర 4 7 89)

క్రూర నిర్ణయం వి. *kruura nir-Nayam* ఉచితానుచితాలు దయా దాక్షి ణ్యాలు పట్టించు కోకుండా తీసుకునే నిర్ణయం cruel decision ప్రభుత్వం ఏదో క్రూర నిర్ణయం ప్రకటించబోతున్న ట్లుగా ఉందని, తాము దాన్ని వ్యతిరేకిస్తామని జైపాల్ రెడ్డి అన్నారు. (ఈ 22.4 89)

క్రోడీకరణ వి. *krooDiikaraNa* (నియమ నిబంధనలను) స్పష్టంగా, క్రమ పద్ధతిలో ఒకచోట కూర్చి ఉంచటం codification చట్ట సభలలోని సభ్యుల హక్కులు, రక్షణల క్రోడీకరణపై తన వ్యక్తి గత అభిప్రాయం గురించి అడగ్గా ... (ఈ. 27 4 89)

క్లయిమ్ వి. *klaym* తనకు చెందాల్సిన హక్కుగా ఒక వ్యక్తి తెలిపేది claim పాలసీ అమలులోకి వచ్చిన కాలంతో నిమిత్తం లేకుండా చెల్లించని ప్రీమియం మొత్తాన్ని మాత్రం మినహాయించుకొని క్లయిమ్ చెల్లి స్తారు. (ఆం భూ 6 9.87)

క్లాజు వి. *klaaju* (చట్టాలు, ఒప్పందాలలో) నిబంధనలు లేదా షరతులకు సంబం ధించిన ఒక అంశం clause ... అన్ని పత్రాలను పార్లమెంట్ ముందు ఉంచవలసిన బాధ్యత నుంచి తప్పించే క్లాజు వాస్తవానికి జారీ చేసిన ఆర్డినెన్స్‌లోగానీ, బిల్లులోగానీ లేదు. (ఆం. ప్ర 25 4 89)

క్లీన్ఇమేజ్ వి. *kliin imeej* జనం దృష్టిలో మచ్చలేని వ్యక్తిత్వం కలిగి ఉండటం clean image ఈ ఎన్నికలో మాత్రం ఆయన తన వ్యూహాన్ని మార్చి తన పెద్దల్లుడు వైద్య, ఆరోగ్యశాఖ మంత్రి డాక్టర్ వెంకటేశ్వ రరావు 'క్లీన్ ఇమేజ్'ను ప్రయోగిస్తున్నారు. (ఆం. ప్ర 25 11.87)

క్లీన్‌బౌల్డ్ అగు క్రి. *kliinbaulD agu* బౌలర్ విసిరిన బంతి బ్యాట్‌కు తగల కుండా నేరుగా వికెట్లను కూల్చటం వల్ల అవుట్ అగు to be clean bowled (as in cricket) *మొహిసిన్ మదన్ చేతిలో క్లీన్ బౌల్డ్ అయ్యాడు.* (ఈ 26 6 87)

క్వార్టర్ ఫైనల్ వి. *kvaarTar fainal* (ఆటల్లో) సెమీఫైనల్‌కి అర్హులను నిర్ణ యించడానికి నాలుగు మ్యాచ్‌లు నిర్వ హించే దశ quarter final ... *మైకేల్ చాంగ్‌ను మాయొాట్ ఓడించి అతను క్వార్టర్ ఫైనల్‌కు వెళ్ళకుండా అడ్డుపడ్డాడు.* (ఆం. ప్ర 4 7.89)

క్షతగాత్రులు వి. (బ.వ.) *kSatagaatrulu* (యుద్ధాలు లేదా దారుణ ప్రమాదాలలో) గాయపడినవారు injured persons *విమానం నేలపై పడినప్పుడు రేగిన మంటల్లో అనేక మంది గ్రామస్తులు చనిపోయారని, 60 మందికి పైగా క్షతగాత్రులను ఆస్పత్రిలో చేర్చినట్టు కూడా రేడియో తెలిపింది.* (ఆం ప్ర. 5 9 89)

క్షమాభిక్ష వి. *kSamaabhikSa* (ప్రభుత్వం) మానవతా దృష్టితో నేరస్థులకు శిక్షని తగ్గిం చటం లేదా పూర్తిగా లేకుండా చేయటం amnesty, mercy, clemency ... *అలాగే లొంగి పోయిన నక్సలైట్లకు క్షమా భిక్ష ప్రసాదించాల్సిన అవసరంలేదని చట్టం ప్రకారం వారిని శిక్షించాల్సిందేనని* ... (ఆం ప్ర 14 6.89)

క్షామ పీడిత ప్రాంతం వి. *kSaama piiDita praantam* తరచు తీవ్రమైన కరువు కాటకాలతో బాధపడుతున్న ప్రాంతం draught-prone area *తుంగభద్ర హైలెవెల్ కెనాల్ పనులను సకాలంలో పూర్తి చేయనందువల్ల అటు అనంతపురం, ఇటు కడప జిల్లాలోను క్షామ పీడిత ప్రాంతా లలోని రైతులకు అన్యాయం జరుగుతోందని ముఖ్యమంత్రి చెప్పినదానిలో* ... (ఉ 2 7.87)

క్షాళన వి. *kSaaLana* (అవాంఛనీయ శక్తులను తొలగించి సంస్థలను) పరిశుద్ధం చేయటం purge *మంత్రి వర్గాన్ని క్షాళన చేయండి.* (ఈ. 16.7.87)

క్షిపణి వి. *kSipaNi* సుదూర ప్రాంతా లలో ఉన్న లక్ష్యాలని తాకి పేల్చివేసే రాకెట్ ఆయుధం missile *'అగ్ని' క్షిపణి విషయంలో విమర్శనాత్మక ప్రతిస్పం దనను కమిటీ వ్యక్తం చేసింది.* (ఆం ప్ర 4 5.89)

క్షిపణి పరీక్ష వి. *kSipaNi pariikSa* క్షిపణి సామర్థ్యాన్ని తెలుసుకునేందుకు జరిపే మాదిరి ప్రయోగం testing of a missile *గతంలో క్షిపణి పరీక్ష జరి గినపుడు ప్రభుత్వ యంత్రాంగం 2,200 కుటుంబాలకు 4 లక్షల 74 వేల రూపా యలు పరిహారం కింద చెల్లించారు.* (ఆం భూ. 1.5 89)

క్షీణించు క్రి. *kSiiNincu* క్రమంగా దెబ్బ తిని పోవు to deteriorate *క్షీణించిన శాంతి భద్రతలు.* (ఉ. 27.11.87)

క్షీర విప్లవం వి. *kSiira viplavam* (మేలుజాతి పాడి పశువుల ద్వారా) పాల ఉత్పత్తిని పెంచటానికి ప్రభుత్వం రూపొం దించిన పథకం white revolution *ఇండియాలో పాల ఉత్పత్తి ఈ విధంగా పెరగడానికి 'క్షీర విప్లవం' మొదటి రెండు దశలూ దోహదం చేశాయి.* (ఆం ప్ర 8.10.87)

## ఖ

ఖంగుతిను వి. *khangutinu* (ఆశ్చర్య కరంగా) ప్రతికూల పరిస్థితిని ఎదుర్కొను to receive a serious jolt or set back *అతను మాజీ ముఖ్యమంత్రి*

వీర బహుద్దుర్ సింగ్‌తో, రాజీవ్ గాంధీతో కలిసి ఉన్న ఫోటోలున్నాయన్న వాస్తవాలు బయటపడేసరికి కాంగి పెద్దలు ఖంగుతి న్నారు. (ఈ. 26.5.89)

**ఖండాంతర వేధిత క్షిపణి** వి. *khan-Daantara veedhita kSipaNi* భిన్న ఖండాలలో ఉన్న సుదూర లక్ష్యాలను ఛేదిం చగలిగిన క్షిపణి inter-continental ballistic missile అమెరికాకు చెందిన మొట్టమొదటి ఖండాంతర వేధిత క్షిపణి అట్లాస్ అనేక అంతరిక్ష వాహక నౌకలకు రూపునిచ్చింది. (ఆం. ప్ర 13.10.88)

**ఖండించు** క్రి. *khanDincu* ఇతరుల అభిప్రా యాలను, కార్యకలాపాలను తప్పని గట్టిగా చెప్పు to condemn మృతుల కుటుంబా లకు సానుభూతి తెలుపలేదనీ, ఉగ్రవాదిజాన్ని ఖండించలేదనీ రాజీవ్ విమర్శించారు. (ఈ 20.7.89)

**ఖండితంగా** క్రి.వి.*khanDitangaa* అస్పష్ట తకు తావులేని విధంగా categorically బోఫోర్స్‌తో తమ కాంట్రాక్టులు రద్దు చేసు ందుకు బోఫోర్స్ సంస్థ ఒప్పందం రద్దు ఛా .. చెల్లించిందని ఎ. ఇ. సర్వీసెస్ స్వె స్కా సంస్థ ఖండితంగా చెప్పాయని చిదంబరం అన్నారు. (ఈ 26.7.89)

**ఖచ్చితమైన** విశ. *khaccitamaina* నిజ మైన; అసలైన real తమదే అసలైన సంఘమని, తామే ఖచ్చితమైన వారసులమని సి. పి. ఎం. అనుబంధ రైతుసంఘ నాయకులు చెబుతున్నారు. (ఈ 26.4.89)

**ఖతంచేయు** క్రి. *khatamceeyu* నాశనం చేయు to liquidate; destroy తాము సృష్టించిన వారిని తామే ఖతంచేసి తమ అవినీతి, దోపిడీ వాటాలను కప్పిపుచ్చా లని విఫలయత్నం చేసి తమ రంగు మరింత బయట పెట్టుకున్నారు. (ఆం భూ 11.7.89)

**ఖరాఖండిగా** క్రి.వి. *kharaakhanDigaa* చాలా స్పష్టంగా outrightly, unambiguously, in no uncertain terms సి. ఎ. జి. నివేదిక ప్రభుత్వాన్ని అభిశంసించిన దరిమిలా, ప్రధాని రాజీనామా చేయాలన్న డిమాండ్‌ను ప్రభుత్వం ఖరాఖం డిగా తిరస్కరించడంతో ప్రతిపక్షాలు అనూ హ్యారీతిలో రాజీనామాలను సమర్పించాయి. (ఆం ప్ర 25.7.89)

**ఖరారుచేయు** క్రి. *kharaaruceeyu* తుది రూపు నిచ్చి సిద్ధం చేయు to finalise జూలై అయిదవ తేదీన జరుగనున్న రెండు అసెంబ్లీ ఉపఎన్నికలకు తెలుగు దేశం పార్టీ కూడా తన అభ్యర్థుల పేర్లను ఖరారు చేసింది. (ఆం. జ్యో 11.6.87)

**ఖరీఫ్ పంట** వి. *kharif panTa* తొలకరి నుంచి సాగు చేసి పండించే తొలివిడత పంట kharif crop, first crop after monsoon అనావృష్టి మూలంగా ఈ ఖరీఫ్ కాలంలో వరిపంట బాగా దెబ్బ తిన్నందు వల్ల సబ్సిడీ బియ్యం పథకం అమ లుకు కావలసిన బియ్యం సేకరించటం ... (ఆం ప 10.10.87)

**ఖలిస్థాన్** వి. *khalisthaan* సిక్కుల కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేయాలని, ఉగ్రవాదులు కోరుతున్న దేశం పేరు khalisthan ఖలిస్థాన్ మద్దతు దారు డిగా భావించి ఒక యువకుడిని ప్రసంగించ వలసిందిగా ... (ఆం ప 8.6.87)

**ఖలిస్థాన్ వాది** వి. *khalisthaan vaadi* సిక్కులకోసం ప్రత్యేక దేశం ఏర్పాటు చేయాలని కోరుతున్న ఉగ్రవాది protagonist of khalisthan ఖలి స్థాన్ వాదులంతా దేశ వినాశనానికి ప్రయ త్నిస్తున్న శత్రువుల చేతిలో కీలు బొమ్మలని, శత్రువుల డబ్బు తీసుకుంటూ వారు చెప్పి నట్టు ఆడుతున్నారని దుయ్యబట్టారు. (ఆం. జ్యో 16.10.87)

**ఖాకీలు** వి. *khaakiilu* పోలీసులు (ఖాకీ దుస్తులు వాళ్ళ యూనిఫాం కాబట్టి ఈ

పేరు వ్యాప్తిలోకి వచ్చింది) police గిరి జనులను వేధిస్తున్న ఖాకీలు. (ఆం భూ 29.6.87)

**ఖాతరుచేయు** క్రి. *khaataruceeyu* దేనినైనా పట్టించుకొని ఆలోచించు; లెక్క చేయు, ఆలోచించు to care for, respect శ్రీ రాచయ్య, శ్రీమతి లీలాప్రసాద్ మళ్ళీ ఇచ్చిన లేఖలను గవర్నర్ ఖాతరుచేసినట్టు లేదని ఆయన పేర్కొన్నారు. (ఆం భూ. 21 4 89)

**ఖాతాదారు** వి. *khaataadaaru* బ్యాంకు లేదా వాణిజ్య సంస్థతో క్రమం తప్పకుండా ఆర్థిక లావాదేవీలు జరిపే వ్యక్తి customer ఒక బ్యాంకు ఖాతాదారు వద్ద నుంచి దాదాపు 29 వేల రూపాయల్ని అపహరించుకుని పారిపోయారు. (ఉ. 15 6 87)

**ఖాయం** వి *khaayam* తప్పనిసరిగా జరిగేది certain బలహీన వర్గాలవారు, హరిజన, గిరిజనులు, వెనుకబడిన వర్గాలవారు పోటీ చేయకుండా నిరోధించడానికి వారందరినీ చెప్పు చేతుల్లో వుంచుకొనడానికి వాడేది ఖాయం అని ... అన్నారు. (ఆం ప్ర 21 4 89)

**ఖాయమై పోవు** క్రి. *khaayamai poovu* నిర్ణయం అయిపోవు to be decided పాకిస్తాన్ ప్రధానిగా బెనజీర్ భుట్టో నియామకం దాదాపు ఖాయమై పోయింది. (ఆం జ్యో 1.2 88)

**ఖాయిలాపడు** క్రి. *khaayilaapaDu* (పరిశ్రమ) ఉత్పాదకత దృష్ట్యా దెబ్బతిని పోవు, నష్టాలలో పడిపోవు to go sick (as an industry) భివాండీలోని ఖాయిలాపడిన ఆర్యావర్త ప్లైవుడ్ యూనిట్‌ను బూటా సింగ్ కుమారులు ఒక ప్రైవేట్ సంస్థకు లీకో విక్రయించినట్టు పత్రికలు వెల్లడించగానే ఈ బదిలీ జరిగిపోయింది. (ఆం ప్ర. 29 4 89)

**ఖూనీచేయు** క్రి *khuuniiceeyu* నాశనం చేయు to murder (an institution), butcher కర్నాటకలో ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేశారని నినాదాలు ఇచ్చారు. (ఆం ప్ర 25 4.89)

## గ

**గంగవెర్రులెత్తు** క్రి. *gangaverrulettu* తీవ్రమైన ఆందోళనకులోనగు to go berserk రోజురోజుకు పెరిగిపోతున్న నిరుద్యోగం, దారిద్ర్యం వీరిని అశాంతి పాలు చేస్తున్నవి గ్రామీణ యువత తన అస్తిత్వం కోసం, జీవనంకోసం గంగవెర్రులెత్తిపోతోంది (ఆం. భూ. 6 7 89)

**గండికొట్టు** క్రి. *ganDikoTTu* ఇతరుల కార్యకలాపాలను, అవకాశాలను దెబ్బ తీయు to arrest the thrust of sth కోట్ల రూపాయల విలువగల విదేశీమారక ద్రవ్యాన్ని దేశం నుండి దూరం చేసే స్మగ్లింగ్ కార్యక్రమాలకు గండికొట్టాల్సిన బాధ్యత ప్రభుత్వంపై మున్ముందు ఎంతైనా వుంది. (ఆం. భూ. 1.5 89)

**గండిపడు** క్రి *ganDipaDu* రహదార్లు, చెరువులు మొదలైన వాటికి నీటి వత్తిడి వల్ల రంధ్రం ఏర్పడు to get breached (as roads, tanks, vote banks etc.) హైదరాబాద్-విజయవాడల మధ్య జాతీయ రహదారిపై ... సమీపంలో గండిపడి రాకపోకలు స్తంభించి పోవడానికి రోడ్లు, భవనాల శాఖ అధికార్ల నిర్లక్ష్యమే కారణమని . . (ఈ 26 7.89)

**గందరగోళం** వి. *gandaragooLam* అర్థం కాని అయోమయ పరిస్థితి; గొడవ din, confusion తీర్మానాన్ని తిరస్కరించటంతో సభలో గందరగోళం ఏర్పడి ఎవరు మాట్లాడుతున్నారో వినిపించని పరిస్థితి ఏర్పడింది. (ఆం ప్ర 28 7 89)

**గగనతల క్షిపణి** వి *gaganatala kSipaNi* ఆకాశంలో నుంచి ప్రయోగించే క్షిపణి air to air missile స్వదేశీ పరిజ్ఞానంతో తయారైన ఒక గగనతల క్షిపణిని పాకిస్తాన్ ఇటీవల పరీక్షించినట్టు ... వార్తా పత్రిక

ప్రచురించింది. (ఆం ప్ర 5 7 89)

**గగన పరిధి** వి. *gagana paridhi* ఒక దేశానికి సంబంధించిన ఆకాశపు ప్రాంత సరిహద్దు air-space *శ్రీలంక గగన పరిధిని భారతదేశం ఆక్రమించింది.* (ఆం. భూ 6 6 87)

**గగ్గోలు** వి. *gaggoolu* జరగకూడనిది జరిగినప్పుడు చేసే ఆక్రందన hue and cry *పార్టీ అధిష్ఠానవర్గం తమ నాయకుని ప్రయోజనాలు పట్టించుకోకుండా నిలువునా ముంచుతున్నారని గగ్గోలు పెడుతున్నారు.* (ఆం భూ 26 5 89)

**గజ ఈతగాడు** వి. *gaja iitagaaDu* నీటిలో మునిగిన మనుషులను, వస్తువులను కనుగొనేందుకు, నీటిలో మునిగి చాకచక్యంగా ఈదగలవ్యక్తి diver, swimmer *ప్రమాద వార్త తెలిసిన వెంటనే నదిలో మృతదేహాల గాలింపుకు గజ ఈతగాళ్ళను రప్పించినట్టు ... తెలిపారు.* (ఉ. 9 6 87)

**గజగజలాడించు** క్రి. *gajagajalaaDincu* భయంతో విపరీతంగా వణికిపోయేట్లు చేయు to shake (sb), rock sth *కమ్యూనిస్టు నాయకత్వాన్ని గజగజలాడించిన విద్యార్థి ఉద్యమాన్ని అణిచివేసే యత్నంలో భాగంగా ...* (ఈ. 20 5 89)

**గట్టెక్కించు** క్రి. *gaTTekkincu* క్లిష్ట పరిస్థితుల్లో నుంచి బయటపడేట్లు చేయు to tide over a crisis, surmount *రాష్ట్రాన్ని కనీవినీ ఎరుగని విద్యుచ్ఛక్తి సంక్షోభం నుండి గట్టెక్కించటానికి పొరుగు రాష్ట్రాలైన మధ్యప్రదేశ్, మహారాష్ట్రల నుండి అదనపు విద్యుచ్ఛక్తి ...* (ఆం. ప్ర 14 4 89)

**గడువుతీరు** క్రి. *gaDuvutiiru* ఇచ్చిన కాల పరిమితి దాటిపోవు to get expired (of medcines etc.) *గడువుతీరిపోయిన (ఎక్స్‌పైర్డ్) మందుల్ని ఉపయోగిస్తున్న సంఘటనలు కొన్ని ... బయట పడ్డాయి.* (ఆం భూ 20 4.89)

**గడ్డు కాలం** వి. *gaDDu kaalam* కష్టాలు ఎదుర్కొంటున్న సమయం critical period *సిమెంట్ పరిశ్రమకు గడ్డుకాలం- ఆంధ్రప్రదేశ్‌లో సిమెంట్ పరిశ్రమ తీవ్ర సంక్షోభంలో పడింది.* (ఆం ప 2.7 87)

**గడ్డు పరిస్థితి** వి. *gaDDu paristhiti* కష్టాలు ఎదురయిన పరిస్థితి critical situation *ఒక ప్రక్క యుద్ధం ప్రపంచాన్ని నాశనం చేస్తుండగా గాంధీజీ ఏమీ చేయలేని గడ్డు పరిస్థితి ఏర్పడిందని ... తెలిపారు.* (ఆం జ్యో 7.11.88)

**గడ్డు రోజులు** వి. (బ.వ.) *gaDDu roojulu* కష్టకాలం baddays *పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి గడ్డురోజులొచ్చాయని గుండెబాదుకొనే కన్నా దానిని ఉన్న పరిమితుల్లో ఎలా రక్షించాలో ప్రత్యామ్నాయ మార్గాల గురించి ఆలోచించాలి.* (ఆం. భూ 20 4 89)

**గడ్డు సమస్య** వి. *gaDDu dsamasya* పరిష్కారం సులువుగా దొరకని విషయం serious problem *వచ్చే శతాబ్దం ఆరంభానికి జనాభా సమస్య గడ్డు సమస్యగా పరిణమించగలదని నిపుణులు హెచ్చరిస్తున్నారు.* (ఆం ప. 6 6.87)

**గణతంత్ర దినం** వి. *gaNatantra dinam* వలస పాలకుల నుంచి స్వాతంత్ర్యం సంపాదించుకొన్న తర్వాత సర్వసత్తాక రాజ్యంగా ప్రకటించుకున్న రోజు republic day *... మళ్ళీ వివాదం తెచ్చిన గణతంత్ర దినం.* (ఉ. 28.1.88)

**గణతంత్ర రాజ్యం** వి. *gaNatantra raajyam* సర్వసత్తాక దేశం republic *లౌకిక ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యమని సగర్వంగా చెప్పుకొనే మనదేశంలో ...* (ఈ 18.11 89)

**గణనీయం** విణ. *gaNaniiyam* చెప్పుకోదగినంత reasonably, fairly to a

great extent, considerable ఈ డ్రైవర్లు మరికొంత జాగ్రత్తగా, అప్రమత్తంగా ఉన్న పక్షంలో ప్రమాదాల సంఖ్యను గణనీయంగా తగ్గించ వచ్చని ఆయన తెలిపారు. (ఆం. ప్ర 14.6 89)

గణాంక వివరాలు వి. (బ.వ.) *gaNaanka vivaraalu* ఒక విషయానికి సంబంధించి సేకరించిన సంఖ్యా వివరాలు statistical data or details అధికార గణాంక వివరాల ప్రకారం ... 30 లక్షల మంది .. వెళ్ళారు. (ఆం. ప్ర. 19 4.89)

గతించు క్రి *gatincu* (ఒక సంఘటన తర్వాత నియమిత కాలం) గడిచిపోవు to elapse వీరిని అరెస్టు చేసి నాలుగేళ్ళు గతించినందున నిందితులను తక్షణం విడుదల చేయాలని ... అన్నారు. (ఆం. ప్ర. 13 88)

గత్యంతరం వి. *gatyantaram* ఒక పని స్థానంలో చేయదగిన మరోపని alternative ... శ్రీ కృష్ణారావు దగ్గర నుంచి సమాధానం లేకపోవడం వలన ఈ చర్య తీసుకోవడం మినహా తనకు గత్యంతరం లేకపోయిందని ఆయన అన్నారు. (ఈ 27.4 89)

గదమాయించు క్రి. *gadamaayıncu* నోటితో బెదిరించు to threaten orally ... ఇద్దరు కానిస్టేబుళ్ళు సత్యనారాయణ వద్దకు వచ్చి, నీ వద్ద ఉన్నది దొంగ నోట్లని గదమాయించి తమతో రావాలని ఆజ్ఞాపించారు. (ఆం. భూ 6.7 89)

గద్దించు క్రి. *gaddıncu* చూ గదమాయించు; ... శ్రీ ... రెడ్డి ఒక పోలీసు అధికారిని ఆవేశంగా గద్దించడం వినిపించింది. (ఉ 15 6 87)

గద్దె చోడో డే వి. *gadde cooDoo Dee* అధికారంలోంచి తొలగిపొమ్మని ఒత్తిడి తీవ్రంగా తీసుకురావడానికి నిర్ణయించిన రోజు quit the chair-day ఆగస్టు9 'గద్దె చోడో డే'గా పరిగణించాలని బి. జె. పి. ఇదివరకే నిర్ణయించిన విషయం విదితమే. (ఆం ప్ర. 25 7 89)

గ దించు క్రి. *gaddedincu* ఉన్న (పదవి) తి నుండి భ్రష్టం చేయు, అధికారాలను లోపునట్లు చేయు; తొలగించు to oust, remove from power or seat కేంద్రంలో కాంగ్రెస్ ప్రభుత్వాన్ని గద్దెదింపడానికి కార్మికులు, కర్షకులు ఏకం కావాలని ... కోరారు. (ఆం. జ్యో. 1 7.87)

గద్దెదిగు క్రి. *gaddedıgu* అధికారం/పదవి వదలిపెట్టు to step down బోఫోర్స్ వివాదంలో గద్దెదిగడానికి ప్రధాని రాజీవ్ గాంధీ నిరాకరించినందుకు నిరసనగా ... (ఈ 24.7 89)

గమనార్హం వి. *gamanaarham* పరిశీలించదగినది notable 'మావారు' లఘుచిత్రం కూడా ఉత్తమ బహుమతి నందుకోవడం గమనార్హం. (ఆం ప్ర 21.4 89)

గరిష్ఠపరిమితి వి. *gariSThaparımiti* పరిమాణం, స్థాయిలో అంతకంటె ఎక్కువ ఉండటానికి వీల్లేని స్థాయి upper limit, ceiling విద్యావంతులు, నిజాయితీపరులు అయిన వారిని అర్హులుగా గుర్తించి లైసెన్సులు జారీ చేయగలమని, ఈ సంఖ్యకు గరిష్ఠ పరిమితి లేదని... చెప్పారు. (ఈ. 20.4 89)

గరీబీ హఠావో కార్యక్రమం వి. *gariibıi haThaavoo kaaryakramam* పేదరికాన్ని పారద్రోలాలన్న ఉద్దేశ్యంతో దివంగత ప్రధాని ఇందిరాగాంధీ ప్రారంభించిన కార్యాచరణ పథకం a programme to eradicate poverty in India advocated by Smt. Indira Gandhi ఆమె చేపట్టిన 'గరీబీ హఠావో' కార్యక్రమాన్ని ప్రధాని గుర్తుచేశారు. (ఈ. 14 8 87)

గర్భస్రావం వి. *garbhasraavam* తమ

ఇష్ట ప్రకారం వైద్య సహాయంతోగానీ, లేదా సహజమైన కారణాల వల్లగానీ తల్లి కడుపు లోని పిండం అకాలంగా బయటపడటం; కడుపుపోవడం లేదా తీయించుకోవడం abortion *సోవియట్ యూనియన్‌లో మహిళ జీవితకాలంలో సగటున రెండు నుంచి నాలుగుసార్లు గర్భస్రావాలు చేయిం చుకుంటోంది.* (ఆం ప్ర. 28 9 87)

**గర్వకారణం** వి. *garvakaaraNam* ఒక జాతి తమ గురించి తాము గొప్పగా అను కోవడానికి వీలుకల్పించే విషయం a reason to feel proud ... *ప్రపంచ చెస్ జూనియర్ ఛాంపియన్ షిప్ సాధిం చిన ఆనంద్, ఐర్లాండ్‌లోని బెల్‌ఫాస్ట్‌లో బిలియర్డ్స్ కిరీటాన్ని నిలుపుకున్న గీత్ సేథీ భారతీయులకు గర్వకారణ మయ్యారు.* (ఈ. 1.1 88)

**గర్హనీయం** వి. *garhaniiyam* ఖండిం చదగినది (చెడ్డపని) sth which is deplorable ... *ఒక నిరాధార లేఖను పట్టుకొని వారు శ్రీ పవార్‌కు వ్యతిరేకంగా ప్రచారం జరపడం గర్హనీయమని ఆయన వ్యాఖ్యానించారు.* (ఆం ప్ర. 26.4 89)

**గర్హించు** క్రి. *garhincu* ఇతరుల చర్య అన్యాయమని నిరసించు; నిందించు to deplore *ఇండియా చర్యను గర్హించేం దుకు దక్షిణాసియా ప్రాంతీయ సహకారసంస్థ (సార్క్) అత్యవసర సమావేశాన్ని ఏర్పా టుచేయాలని శ్రీలంక ప్రధాని భావిస్తున్నట్టు తెలిసింది.* (ఆం. భూ. 6 6 87)

**గలభా** వి. *galabhaa* విపరీతమైన గొడవ pandemonium, bedlam *దేవీ చౌక్ వద్ద జెండా దిమ్మ విషయంలో తెలుగు దేశం, కాంగ్రెస్ పార్టీల కార్యకర్తల మధ్య కనీవినీ ఎరుగని రీతిలో గలభా జరిగింది.* (ఈ. 6 10.88)

**గల్లంతు అగు** క్రి. *gallantu agu* ప్రమాదాల లోగానీ, అక్రమాలవల్లగానీ కనిపించకుండా పోవు to miss, disappear *"పడవ మునిగి 60 మంది గల్లంతు" అయ్యారు.* (ఆం భూ. 18 7 89) *ప్రభుత్వ జూనియర్ కళా శాల స్థాపనకు కళాశాల కమిటీ 1980లో ప్రజల దగ్గర నుండి వసూలు చేసిన లక్ష రూపాయలు గల్లంతయినట్లు తెలియవచ్చింది.* (ఆం భూ. 11 5 89)

**గళంవిప్పు** క్రి. *gaLamvippu* (వివాదాస్పద విషయాలపై) అభిప్రాయాలను నిర్దిష్టంగా వ్యక్తం చేయు to speak out *ఇన్నాళ్లూ మౌనం పాటించిన మాజీ స్పీకర్ శ్రీ జి. నారాయణరావు మళ్ళీ గళంవిప్పారు.* (ఆం. భూ 19 11.89)

**గస్తీ** వి. *gastii* నేరస్తుల, శత్రువుల కార్యకలాపాల్ని అదుపులో పెట్టేందుకు, సంబంధిత ప్రదేశంలో రక్షణదళాలు/రక్షక భటుల నిరంతర పహరా patrol *అంత ర్రాష్ట్ర సరిహద్దుల వెంబడి గట్టి గస్తీ ఏర్పాటు చేశారు.* (విశా. 18.6.87)

**గాడితప్పు** క్రి. *gaaDitappu* సవ్యమైన మార్గం నుంచి తొలగిపోవు to deviate sth, go wrong *గాడితప్పితే 'గంగ'ను అనుమతించం.* (ఆం. ప్ర 29 9.89)

**గాభరాపడు** క్రి. *gaabharaapaDu* మాన సికంగా ఖంగారుపడు to be in a disturbed state *జిల్లా తెలుగు దేశం పార్టీలో ప్రారంభమైన ఈ 'ముసలం' ఎలా పరిష్కరించాలని 'దేశం' నేతలు గాభరాప డుతున్నారు.* (ఆం భూ. 21 6 89)

**గాలంటరీ అవార్డు** వి. *gaalanTarii avaarDu* అపరిమిత ధైర్య సాహసా లను ప్రదర్శించినందుకు ఇచ్చే పురస్కారం gallantry award ... *రైలు ప్రయా ణీకులను కాపాడటంలో ధైర్య సాహసాలు ప్రదర్శించిన ఇద్దరు ఆంధ్ర యూనివర్సిటీ విద్యార్థులకు దక్షిణ మధ్య రైల్వే జనరల్ మేనేజరు గాలంటరీ అవార్డులను అందజే శారు.* (ఆం ప. 21 8 87)

**గాలించు** క్రి. *gaalıncu* వ్యక్తులు లేదా వస్తువులను కనుగొనడంకోసం (ఒక ప్రదేశంలో) తీవ్రంగా వెదుకు to search, conduct combing operations *నిందితులకోసం పోలీసులు మంగళవారం రాత్రి నుంచే తీవ్రంగా గాలిస్తున్నారు.* (ఆం జ్యో 31 12 87)

**గాలికొదులు** క్రి. *gaalıkodulu* నియమాలు, భావాలు మొ. వాటిని విస్మరించు to leave sth to winds, ignore *సంకుచిత, స్వార్థ రాజకీయ నీతినియమాలను గాలికివదిలేసిందని ... వి. పి. సింగ్ తీవ్రంగా దుయ్యబట్టారు.* (ఈ 22 4.89)

**గాలి మోటారు** వి. *gaalı mooTaaru* ఆకాశంలో ఎగిరే వాహనం; విమానం aeroplane *'గాలి మోటార్ల' సేవలపై ...ఇండియన్ ఎయిర్‌లైన్స్ సేవలు ఏ మాత్రం సంతృప్తికరంగా లేవంటూ రాజ్యసభలో అధికార పక్ష సభ్యులు నేడు తమ తీవ్ర కోపావేశాలను వ్యక్తంచేశారు* (ఆం ప్ర 17.11 88)

**గావుకేక** వి. *gaavukeeka* ఆవేశం/భయం లాంటి భావాలను వ్యక్తపరుస్తూ గట్టిగా అరవటం screaming, shout *అరుణ్‌శౌరి కోరుతున్నట్లుగా అనుమానం, ఆవేశం వచ్చిన వెంటనే ఇంటికప్పు ఎక్కి గావుకేకలు పెట్టే మనిషినికాను.* (ఈ 8 9.89)

**గింగిరాలుతిరుగు** క్రి. *gıngıraalu tırugu* ఏదైనా దెబ్బతగిలి తల్లడిల్లిపోవు to be seriously hurt *ఇప్పటికే చుక్కలంటే ధరలతో గింగిరాలుతిరుగుచున్న సామాన్య మానవుడిని ప్రభుత్వం తీసుకున్న ఈ నిర్ణయం మరింత దెబ్బ తీస్తుందని సి. పి. ఐ. పేర్కొంది.* (ఈ 23 3 88)

**గిట్టుబాటు ధర** వి. *giTTubaaTu dhara* ఒక వస్తువుకి దాని ఉత్పాదక విలువతో పాటు కొంత లాభం కలుపగా వచ్చే రేటు remunerative price ... *పండించిన పంటలకు న్యాయమైన గిట్టుబాటు ధరలను సాధించేందుకు రైతులంతా ఐక్యంగా సమరశీల పోరాటాలు నిర్వహించాలని ...* (విశా 8 12 87)

**గిడ్డంగి** వి. *giDDangı* ధాన్యం మొదలైన వస్తువుల్ని నిలువజేసే పెద్ద చోటు లేదా గోదాము go down *కొత్తగా 209 గ్రామీణ గిడ్డంగులు ...* (ఈ. 24 5.89)

**గిరాకి** వి. *gıraaki* ఒక వస్తువు కొనే విషయంలో వినియోగదారులకున్న ఆసక్తి/కోరిక demand *నగరాలలో ఇళ్ళ స్థలాలకు, ప్లాట్లకు పలికేధర, వాటికున్న గిరాకి అలాంటిదిమరి.* (ఆం. భూ. 3.5 89)

**గిరిజనులు** వి. (బ.వ.) *girıjanulu* అడవులలో నివసిస్తూ లేదా సంచార జీవనం గడుపుతూ ఆదిమ సంస్కృతితో ఉండే తెగలు tribal people *గత కొద్దిరోజులుగా ఈ గ్రామంలోని గిరిజనులు అక్రమంగా అడివి నుంచి కట్టెలు కొట్టి తెచ్చుకుంటున్నారని ...* (ఆం. ప్ర 25 4 88)

**గిలెటెనింగ్** వి. *gileTening* సమయం చాలదనుకున్నప్పుడు చట్ట సభలలో ప్రవేశ పెట్టిన బిల్లులను చర్చలేకుండానే ఆమోదించటం guillotining *వందల కోట్ల రూపాయల విలువగల మంత్రిత్వ శాఖల పద్దులపై చర్చించకుండానే తప్పించి (రూ. 80726 కోట్లు) సభా సమయాన్ని కోత పెట్టి "చరిత్ర సృష్టించిన" ఘనత మన లోక్‌సభకు ఉంది దీన్నే "గిలెటెనింగ్" అన్నారు.* (ఆం భూ 13 1.89)

**గీటురాయి** వి. *giıTuraayı* నిర్ణయాత్మకమైన విషయం; కొలబద్ద, ప్రమాణం parameter *ఈ చిత్రంలో రిజర్వేషన్లకు కులం కాకుండా ఆర్థిక స్థితిగతులు గీటురాయి కావాలనే సందేశం ఉంది.* (ఈ. 21.4 89)

**గీపెట్టు** క్రి. *gıipeTTu* విపరీతంగా గోల చేయు, అరిచి గోల చేయు to raise hue and cry *బోఫోర్స్ శతఘ్నుల కొను*

గోలులో అవకతవకలు జరిగాయని సి. ఎ. జి. తన నివేదికలో ప్రభుత్వాన్ని తప్పు పట్టి నట్లు తెలియగానే ప్రధాన మంత్రి రాజీనామా చేయాలని ప్రతి పక్షాలు గీ పెట్టాయి. (ఆం భూ 27.7 89)

**గుంజుకొను** క్రి. *gunjukonu* ఇతరుల నుంచి ఏదైనా వస్తువుని బలవంతంగా లాక్కొను to snatch, to take away ఏప్రిల్ 10న రాష్ట్ర సంఘ ఉపాధ్య క్షుడు శ్రీ నర్సయ్యను పోలీసులు అరెస్టు చేసి కొట్టి, తిట్టి 300 రూపాయలు గుంజుకొని వెళ్ళగొట్టారని ... (ఆం. భూ 3 5.89)

**గుండెపోటు** వి. *gunDepooTu* రక్త ప్రస రణ అధికం కావడం వల్ల హృదయంపై ఏర్పడిన పీడనం వల్ల వచ్చే నొప్పి heart attack ... శాసనసభ్యుడు శ్రీ పి. కోటేశ్వరరావు నేటి రాత్రి నిజాం వైద్య విజ్ఞాన సంస్థ ఆసుపత్రిలో గుండెపోటుతో మరణించారు. (ఆం ప్ర 5 10 89)

**గుట్టు మట్టులు** వి. (బ.వ.) *guTTu maTTulu* రహస్య వ్యవహారానికి సంబం ధించిన వివరాలు/సమాచారం secrets రక్షణ శాఖ లావాదేవీల్లో అధికార పక్షంలోని ప్రముఖులు లక్షణంగా భోంచేసిన గుట్టు మట్టులు తాను రట్టు చేయడానికి పూను కొన్నానన్న కక్షతోనే ... (ఈ. 12.5 89)

**గుడ్‌బైచెప్పు** క్రి. *guDbaiceppu* పూర్తిగా తెగతెంపులు చేసుకొను to bid fare well ... తెలుగుదేశం పార్టీలో నాకున్న సంబంధలకు గుడ్‌బై చెప్పడం మంచిదనిపిం చింది. (ఆం. భూ. 24.5 89)

**గుణపాఠంచెప్పు** క్రి *guNapaaTham-ceppu* ఇతరుల దుష్ప్రవర్తనకు తగిన జవాబు ఇచ్చు; బుద్ధి చెప్పు to teach a lesson పాక్‌కు తగు గుణపాఠంచెప్తాం. (ఈ. 11.2.88)

**గుణాత్మక ఆవశ్యకత** వి. *guNaatmaka aavaśyakata* కొనదలచుకొన్న వస్తువు విషయంలో కావలసిన కనీసమైన ప్రమా ణాలు qualitative requirement కొత్తగా ఏదైనా ఆయుధాలను కొనాలను కుంటే వాటి సామర్థ్యం, పనిచేయడంలో సులువు బరువులు నిర్వహణా విధానం మొద లైనవి ఎలా ఉండాలో సైన్యానికి చెందిన జన రల్ స్టాఫ్ (జి. ఎస్) కొన్ని ప్రమాణాలను రూపొందిస్తుంది. దీనిని గుణాత్మక ఆవశ్య కత (క్వాలిటేటివ్ రిక్వైర్‌మెంట్) అంటారు. (ఆం ప్ర. 26.8 89)

**గుణాత్మక విద్య** వి. *guNaatmaka vidya* కేవలం పరిమాణం కాకుండా విలువలను పెంపొందించడం ప్రధాన ఉద్దే శ్యంగా కలిగిన చదువు qualitative education పోటీ పరీక్షలలో ఇతర విద్యా ర్థులవలె సత్ఫలితాలను సాధించేందుకు గిరి జన విద్యార్థులకు కూడా గుణాత్మకమైన విద్య అవసరమని ... (ఆం. ప్ర. 6 5 89)

**గుత్త పెట్టుబడిదారు** వి. *gutta peT-TubaDidaaru* ఏదైనా ఒక వస్తువు ఉత్పత్తి సరఫరా విషయంలో పూర్తి ఆధి పత్యం కలిగి ఉన్న వ్యక్తి; బడా పారిశ్రామిక వేత్త monopolist (industry) ప్రజ లను గుత్త పెట్టుబడిదారులు, భూస్వాములు దోచుకునే ప్రస్తుత సామాజిక వ్యవస్థను కొన సాగించడానికి పేదలకు యిలాంటి (రెండు రూపాయల కిలో బియ్యం) పథకాలు ఎర జూపుతారు. (విశా. 26.6 87)

**గుత్త యజమాని** వి.*gutta yajamaani* ఏదైనా ఒక వ్యాపార రంగంలో పూర్తి గాకానీ, అధిక శాతంకానీ తమ అధీ నంలో ఉంచుకున్న వ్యాపార వేత్త monopolist (business) వజ్రాల రంగంలో 43 మంది గుత్తయజమానులదే పైచేయి. (ఆం. ప్ర 26.4.89)

**గుత్తాధిపత్యం** వి. *guttadhipatyam* ఏదైనా ఒక రంగంలో పూర్తి ఆధిపత్యం కలిగి ఉండటం monopoly సారాయి

... కాంట్రాక్టర్ల గుత్తాధిపత్యాన్ని తొలగించి రాష్ట్ర ఆదాయం మరింత పెంచే ఉద్దేశ్యంతో ప్రభుత్వం 1985 నుంచి గ్రూప్ వేలం పద్ధతిని రద్దు చేసింది. (ఆం జ్యో. 29 87)

**గుత్తాధిపత్య రాజకీయాలు** వి. (బ.వ.) *guttaadhipatya raajakiiyaalu* ఇతరులపై పెత్తనం చేస్తూ నడిపించే రాజకీయ కార్యకలాపాలు political hegemony *గత కొద్ది సంవత్సరాలుగా ప్రపంచంలో ఇంకేదీ ముఖ్య సంఘటన జరగనట్లుగా ఈ ప్రకటనలో అణ్వాయుధాలు భయోత్పాత సిద్ధాంతం, గుత్తాధిపత్య రాజకీయాలు వంటి అంశాలు ఉన్నాయని ... వ్యాఖ్యానించారు.* (ఆం ప్ర 15 6 87)

**గుప్తధనం** వి. *guptadhanam* ద్రవ్య చలామణిలో ప్రభుత్వ లెక్కలోకి రాని ధనం; నల్లధనం black money *కొత్త నోట్ల వల్ల గుప్తధనం వెలికిరాదు.* (ఆం. భూ 14.12.87)

**గుప్పించు** క్రి. *guppincu* ఎదుటి వారిని తికమక పెట్టేంత వేగంగా ప్రశ్నలు, విమర్శలు మొ. వాటిని వెంటవెంటనే ప్రయోగించు to shoot (volley of questions, criticisms etc.) *ఇద్దరు సుప్రీం కోర్టు న్యాయమూర్తులు రూపొందించిన నివేదికపై వారు తీవ్రమైన విమర్శలు గుప్పించారు.* (ఆం ప్ర. 19.12 87)

**గుబులురేపు** క్రి. *gubulureepu* తమ పనుల ద్వారా ఎదుటి వారిలో భయం, ఆందోళన రేకెత్తించు to cause concern *ఈ నేపథ్యంలో రాజకీయాలకు సంబంధం లేనిదంటూ శ్రీ మిశ్రా ప్రారంభించిన 'బీహార్ వికాస్ మంచ్' సంస్థ కాంగ్రెసు నాయకుల గుండెల్లో గుబులు రేపుతోంది.* (ఆం. జ్యో. 5 12 88)

**గుమికూడు** క్రి. *gumikuuDu* చాలామంది మనుషులు ఒకచోట చేరు to throng, gather *దేశ రాజధాని కూడలి ప్రాంతంలో ప్రదర్శకులు గుమికూడి నియంతృత్వాన్ని కూలదోయాలని, పత్రికలకు స్వేచ్ఛనివ్వాలని ...* (ఈ 25 4 89)

**గురిపెట్టు** క్రి. *guripeTTu* ఆరోపణలు, విమర్శలను ఒక వ్యక్తికి వ్యతిరేకంగా లక్ష్యించు to aim, target *శ్రీనివాసుల రెడ్డిగారు ఆరోపణల అస్త్రాలను ప్రయోగించడం ప్రారంభించినపుడు శ్రీ చంద్రబాబు నాయుడు గారి మీదనే ఆయన వాటిని గురిపెట్టిన మాట నిజం.* (ఆం. ప్ర. 27 11.87)

**గుర్తించు** క్రి. *gurtincu* వ్యక్తి లేదా వస్తువు అసలు ఉనికిని కనుగొను to identify, recognise *చనిపోయిన తీవ్రవాదిని పీపుల్స్‌వార్ గ్రూపునకు చెందిన కె. నాగరాజు అలియాస్ నిషాకర్ అలియాస్ శ్రీధర్ ... బాబుగా గుర్తించినట్లు ఆయన తెలిపారు.* (ఈ 25 1 89)

**గుర్తింపు** వి. *gurtimpu* ఒకపని లేదా సంస్థ మొ. వాటి ఉనికిని చట్టపరంగా ఒప్పుకొనటం recognition *పేదరైతులకు ఉచితంగా ఇచ్చిన ప్రభుత్వ బంజరు భూములను పేదరైతుల నుంచి మరెవరైనా కొనుగోలు చేస్తే, ఆ కొనుగోలుకు చట్టపరమైన గుర్తింపు ఉండదు.* (ఆం. ప్ర 27.7.89)

**గుర్తింపు కార్డు** వి. *gurtimpu kaarDu* ఒక వ్యక్తి ఏదైనా సంస్థకి లేదా ప్రదేశానికి సంబంధించిన వాడు/సంబంధించినది అని తెలుపుతూ అధికారులు జారీచేసే ధృవపత్రం (ఇందులో ఆ వ్యక్తి ఫోటో విధిగా ఉంటుంది) identity card *చివరకు ఓ మూల 'నరసింహారావు' పేరుతో ఉన్న గుర్తింపు కార్డు ఒకటి పోలీసులకు చిక్కడంతో ఎవరైనది/ ఆ తర్వాత గుర్తించ*

గలిగారు. (ఆం. భూ. 4 10 87)

**గుర్తుచేయు** క్రి. *gurtuceeyu* గతంలో జరిగిన దానిని జ్ఞాపకం చేయు; జ్ఞప్తికి తెచ్చు to remind శ్రీ ఎన్. టి. ఆర్ పై ఏడు సందర్భాలలో అవినీతికి పాల్పడినట్లు ప్రాథమిక సాక్ష్యాధారాలు ఉన్నాయని కోర్టులు అభిప్రాయ పడ్డాయని భగత్ గుర్తు చేశారు. (ఈ. 29 7.89)



**గుర్రుగా ఉండు** క్రి. *gurrugaa unDu* అసూయతో కూడిన కోపం కలుగు to grumble, be angry ( out of jealousy) రెవెన్యూ మంత్రిగా శ్రీ డి. వీరయ్య చౌదరిని తీసుకోవడం కొందరికి గుర్రుగా ఉంది. (ఆం భూ. 17 89)



**గుసగుసలాడు** క్రి. *gusagusalaaDu* పక్కవారికి వినపడకుండా రహస్యంగా మాట్లాడు to whisper ఎవరి తప్పులకో మనమెందుకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి అని కొందరు గుసగుసలాడుతున్నారు. (ఈ. 2.5 89)



**గూండా** వి. *guunDaa* హింస, దౌర్జన్యాలను జీవన విధానంగా చేసుకొని బ్రతికేవాడు rowdy సారా కాంట్రాక్టర్లు పెంచిపోషించే గూండాలు జీపులో వెళుతుండగా ఒంటరిగా పొలంలో ఉన్న అమ్మాయిని చూచి జీపు ఆపి అఘాయిత్యం చేశారు. (ఆం. భూ 22.1 88)

**గూండాయిజం** వి. *guunDaayijam* రౌడీల హింసాత్మక చర్యలు goondaaism (rowdy behaviour) రాష్ట్రంలో గూండాయిజాన్ని అరికట్టి శాంతి భద్రతలను మెరుగుపరిచేందుకు ... నిర్ణయించారు. (ఈ 22.7.87)

**గూఢచర్యం** వి. *guuDhacaryam* ఇతర దేశాలకు సంబంధించి రాజకీయ, ఆర్థిక, రక్షణ ఇత్యాది రంగాలకు సంబంధించిన సమాచారాన్ని రహస్యంగా గూఢచారుల ద్వారా సేకరించే కార్యకలాపాలు espionage కాశ్మీర్‌లో ఎన్నో ఏళ్ళుగా సాగుతున్న పాకిస్తానీ గూఢచారి వ్యవస్థను పోలీసులు ఎట్టకేలకు విచ్ఛిన్నం చేయగలిగారు. తీవ్ర సంచలనం సృష్టించిన సాంబా గూఢచర్యం కేసులో ప్రధాన నిందితుడైన ... (ఆం. భూ 3.7.87)

**గూఢచారి వర్గాలు** వి. (బ.వ.) *guuDhacaari vargaalu* గూఢచారి శాఖకు సంబంధించిన అధికారులు intelligence sources ఈ ఘర్షణలో 10 మంది తమిళ మిలిటెంట్లు కూడా మరణించినట్లు గూఢచారివర్గాల సమాచారం ద్వారా తెలియవచ్చిందని అన్నారు. (విశా 7.7.87)

**గూఢచారి శాఖ** వి. *guuDhacaari śaakha* శాంతి భద్రతలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించి, విశ్లేషించి ప్రభుత్వానికి తెలిపే విభాగం intelligence department ... కార్యకర్తలతో సమావేశమైనపుడు గూఢచారి శాఖ సిబ్బందికి అక్కడే ఉండటానికి అభ్యంతరం తెలుపుతూ ... (ఆం. ప్ర. 23 4.89)

**గృహనిర్బంధం** వి. *gRha nirbandham* ఇంటి నుంచి బయటికి వెళ్ళకుండా కట్టడి చేయటం house arrest రెవిన్యూ అధికారి శ్రీ జగన్ మోహన్ శర్మ ప్రజాప్రతినిధి అయిన సర్పంచ్ ఇంటికి కాపలా పెట్టి ఇంట్లోంచి ఎవరినీ బయటికి కదలనీయకుండా గృహనిర్బంధం చేశాడని రెవిన్యూ సిబ్బంది ... (ఆం ప్ర. 18.5.89)

**గృహ సముదాయం** వి.*gRha samu-*

daayam ప్రజలకోసం ప్రభుత్వం లేదా ఏదైనా సంస్థ ఒక ప్రదేశంలో ప్రణాళికా బద్ధంగా నిర్మించే ఇళ్ళ సమూహం housing complex బంజారాహిల్స్‌లో మంత్రుల గృహసముదాయ నిర్మాణం 18 నెలల్లో పూర్తి అవుతుందని ... చెప్పారు. (ఉ 17.4.88)

గెజెట్ వి. gejeT పాలనా వ్యవహారాలను, ప్రభుత్వ ఉత్తర్వులను, చట్టపరమైన మార్పులను ప్రకటించే రాజ పత్రం gazette శ్రీ శ్రీనివాసులురెడ్డి మంత్రి కారని రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక గెజెట్ నోటిఫికేషన్ జారీ చేసింది. నవంబరు 12వ తేదీతో ఈ అసాధారణ గెజెట్ ప్రకటన జారీ అయింది. (ఆం భూ. 19.11.87)

గెరిల్లా వి. gerillaa చిన్న చిన్న గ్రూపులుగా ఏర్పడి రహస్య కదలికలతో ప్రభుత్వంపై పోరాటం చేసే సాయుధ బృందంలోని వ్యక్తి guerrilla నాగాలాండ్ నేషనల్ సోషలిస్టు కౌన్సిల్‌కు చెందిన అజ్ఞాత గెరిల్లాలు నేడు పదిమంది సి. ఆర్ పి. ఎఫ్. జవాన్లను కాల్చి చంపారు. ఆటోమేటిక్ తుపాకులు, ఇతర ఆయుధాలు ధరించిన ఈ గెరిల్లాలు ... (ఆం. ప్ర. 20.4.88)

గెరిల్లాజోన్ వి. gerillaajoon గెరిల్లాల ఆధిపత్యం ఉన్న ప్రాంతం guerrilla zone గెరిల్లాజోన్‌లో నక్సలైట్లు స్వేచ్ఛగా సంచరిస్తారు. ఈ ప్రాంతంలో ఎవరూ ప్రవేశించేందుకు అవకాశం ఉండదు. (ఆం ప్ర 5.7.87)

గెలుచుకొను క్రి. gelucukonu పోటీలో ఇతరుల మీద ఆధిపత్యాన్ని ప్రదర్శించడం ద్వారా సాధించుకొను to win మహిళల సింగిల్స్‌పై టైటిల్‌ను కె. నాగమణి గెలుచుకుంది (ఈ 29.1.88)

గైరు హాజరగు క్రి. gairu haajaragu (ఏదైనా కార్యక్రమానికి) వెళ్ళటం మానివేయు to be absent, not to turn up పార్టీ కార్యకర్తల్ని కలుసుకోడానికి తెలుగు విజయానికి తెలుగు దేశం పార్టీ అధ్యక్షుడు శ్రీ ఎన్టీరామారావు శుక్రవారం నాడు గైరుహాజరయ్యారు. (ఈ 6.6.87)

గొంతుమార్చు క్రి. gontumaarcu అంతకు ముందు తను చెప్పిన అభిప్రాయానికి తనే భిన్నంగా మాట్లాడు to change one's opinion గొంతు మార్చిన వి. సి. శుక్లా- కాంగ్రెస్(ఐ) కేంద్ర నాయకత్వంలో మార్పు చేయాలని తాను డిమాండ్ చేస్తున్నట్లు వచ్చిన వార్తలు నిరాధారమైనవని ... శ్రీ వి. సి. శుక్లా ఖండించారు. (ఆం. ప్ర. 25.6.87)

గొంతువిప్పు క్రి. gontuvippu (కొంత మౌనం తర్వాత) ఒక విషయంపై మాట్లాడటం మొదలు పెట్టు to start talking సభ్యులకు నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. కానీ ప్రతిపక్షాలు వినలేదు. దానితో అధికార పక్షం వారు కూడా గొంతువిప్పారు. (ఆం భూ. 22.4.89)

గొట్టపు బావి వి. goTTapu baavi యంత్ర సహాయంతో గొట్టం ఆకారంలో భూమిలోకి రంధ్రం చేసి తవ్విన బావి borewell రోజు రోజుకు ఎండలు ముదురుతున్నాయ్. గొట్టపు బావులలోని నీరు ఇంకిపోతున్నాయ్. (ఆం. ప్ర 18.5.89)

గొడుగుపట్టు క్రి. goDugupaTTu ఏదో ఒక రాజకీయ పార్టీకి/సంస్థకి స్వప్రయోజనాల కోసం మద్దతు తెలుపు to toe the line of ఏ పార్టీకి గొడుగు పట్టను; ఏ వ్యక్తికి బాకా ఊదను. (ఉ 28.1.88)

గొడ్డలి పెట్టు వి. *goDDali peTTu* తీవ్రంగా దెబ్బ తీసేది serious set back, destroyer ఢిల్లీలో కూర్చొని జిల్లాలను ఏలాలన్న దుర్బుద్ధి తాత్కాలిక రాజకీయ లబ్ధికి దోహదం చేయవచ్చేమో గాని, అంతిమంగా దేశ ... హితానికి గొడ్డలి పెట్టుగా పరిణమిస్తుంది. (ఈ. 3 5 89)

గోచరించు క్రి. *goocarincu* కనిపించు to be visible, appear ప్రతిపక్షాలలో అది నేషనల్ ఫ్రంట్ అయినా లేక జనతా దళ్ అయినా కులమత తత్వమనే నినాదం కింద రాజకీయ పార్టీలు చేతులు కలుపుతున్న విషయమే గోచరిస్తుంది అని ప్రధాని అన్నారు. (ఈ. 26 7 89)

గోడు వి. *gooDu* కష్టనష్టాలలోని వేదన; బాధ woe నిరాహార దీక్షల సందర్భంగా పట్టణానికి వచ్చిన నాయకులతో ప్రజలు తమ గోడు తెలిపారు. (ఆం జ్యో. 2.2.89)

గోతులుతవ్వు క్రి. *gootulutavvu* (చాటుమాటుగా) దెబ్బతీయు to stab, sabotage ఆటలో ఓడిపోవడమన్నా, తన వెనుక గోతులు తవ్వే వాళ్ళన్నా అతనికి పరమ అసహ్యం. (ఈ. 26 7.89)

గోదాలో నిలుచు క్రి. *goodaaloo nilucu* పోటీలో పాల్గొను to be in the fray ఇపుడు గోదాలో నిలబడిన ఇరువురు ప్రధాన అభ్యర్థులు వ్యక్తులుగా, రాజకీయవేత్తలుగా ఎంతో యోగ్యులైనవారు, మచ్చలేనివారు. (ఆం జ్యో. 24 6.87)

గోలపెట్టు క్రి. *goolapeTTu* (అన్యాయం జరిగిందని) పెద్దగా గొడవ చేయు to cry, clamour పంచాయితీలకు నేరుగా అధికారాలు యివ్వడంవల్ల కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు గోలపెడుతున్నట్లు ... అన్నారు. (ఆం. భూ. 4 6 89)

గోష్ఠి వి. *gooSThi* ఏదైనా ఒక అంశంపై ఆ రంగంలోని నిష్ణాతులు కలసి చర్చించే కార్యక్రమం symposium మహాకవి గురజాడ ఆధునిక సాహిత్యానికి గురువు అన్న అంశంపై శ్రీ కశిరెడ్డి దుర్గారెడ్డి జూనియర్ కళాశాలలో గోష్ఠి జరిగింది. (ఆం. ప్ర. 28.9 89)

గౌరవ డాక్టరేట్ వి. *gaurava DaakTareeT* ఏదైనా ఒక రంగంలో నిష్ణాతులైన వ్యక్తికి విశ్వ విద్యాలయాలు సన్మాన సూచకంగా ఇచ్చే బిరుదం honorary doctorate శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం రెండవ స్నాతకోత్సవం సందర్భంగా ఈ నెల 29 న ముగ్గురు ప్రముఖులకు గౌరవ డాక్టరేట్ పట్టాలు ఇస్తారు. (ఆం. భూ. 20.6.87)

గౌరవ భృతి వి. *gaurava bhRti* ప్రముఖుల సేవలను ఉపయోగించుకున్నందుకు (జీతంలా కాకుండా) మర్యాదపూర్వకంగా చెల్లించే ఏకమొత్తం సొమ్ము honorarium వారిలో కొందరికి కొంత హోదా, గౌరవ భృతి ఉంటాయి. (ఆం. ప్ర. 23.4.89)

గౌరవ వందనం వి. *gaurava vandanam* ప్రత్యేకమైన సందర్భాలలో ప్రభుత్వాధిపతులకు రక్షక దళాలు చేసే అభివందనం guard of honour వాద్య బృందం ఉభయ దేశాల జాతీయ గీతాలను ఆలపిస్తుండగా గౌరవ వందనం కమాండింగ్ అధికారి శ్రీ రాజీవ్ గాంధీకి సాల్యూట్ చేశారు. తదుపరి శ్రీ రాజీవ్ గాంధీ ... గౌరవ వందనం స్వీకరించారు. (ఆం. ప్ర. 3.7.87)

గ్యారంటీ మనీ వి. *gyaaranTii manii* ఒప్పందంలో భాగంగా హామీ కోసం కార్య

క్రమ నిర్వాహకులు ముందుగా చెల్లించే మొత్తం guarantee money ఈ మ్యాచ్ కోసం క్రికెట్ బోర్డుకు హెచ్. సి. ఏ. ఆరు లక్షల రూపాయలను గ్యారంటీ మనీగా చెల్లించాలి. (ఈ 24 8 89)

గ్యాస్ వి. *gyaas* ఘన, ద్రవ రూపాలలో లేని వాయువులాంటి పదార్థం gas భోపాల్ పాతనగరంలోని జయ ప్రకాశ్‌నగర్‌లో ఉన్న ఐస్ ఫ్యాక్టరీ నుంచి సోమవారం అర్ధరాత్రి అమ్మోనియా గ్యాస్ లీక్ అయింది. (ఆం. జ్యో 24 6 87)

గ్రంథ చౌర్యం వి. *grantha cauryam* ఇతరుల రచనలలోని సమాచారాన్ని దొంగిలించి తనదిగా చెప్పకోవటం plagiarism .... శ్రీ .... రెడ్డి పిహెచ్.డి. పరిశోధనా వ్యాసం సమర్పించిన సందర్భంగా గ్రంథ చౌర్యానికి పాల్పడినట్లు వచ్చిన ఆరోపణపై విచారణ జరిగిందని ... వెల్లడించారు. (ఆం. జ్యో 21 7 87)

గ్రహణం వి. *grahaNam* (ప్రతిభా సామర్థ్యాలు) తాత్కాలికంగా మరుగున పడటం eclipse (of brilliance) వచ్చే ఏడాదైనా ఇంగ్లాండ్‌కు పట్టిన గ్రహణం తొలగుతుందేమోనని ఇక్కడి క్రికెట్ అభిమానులు ఎదురు చూస్తున్నారు. (ఈ. 23 11 89)

గ్రహణ శక్తి వి. *grhaNa śaktı* విషయాన్ని గ్రహించి అర్థం చేసుకునే శక్తి comprehension ప్రవేశ పరీక్ష, ఇంటర్వ్యూ ద్వారా పిల్లల గ్రహణ శక్తిని పరీక్షించి ఎంపిక చేస్తున్నాం అని చెపుతున్నా ... (ఉ. 15.6 87)

గ్రహాంతర వాసి వి. *grahaantara vaasi* భూమి కాకుండా ఇతర గ్రహాలలో నివసిస్తున్నట్లు అనుకొంటున్న జీవి extra terrestrial being ... ఇపుడు ప్రప్రథమంగా గ్రహాంతర వాసుల ఉనికి నిజమేనని నిరూపించే సాక్ష్యధారాలు రష్యన్ల చేతికి చిక్కాయని వదంతులు వినవస్తున్నాయి. (ఈ. 1 9.89)

గ్రాండ్‌శ్లామ్ టోర్నమెంట్ వి. *graanDślaam ToornamenT* టెన్నిస్‌లో ప్రముఖమైన నాలుగు పోటీలలో ఒకటి (వింబుల్డన్, యు. ఎస్. ఓ, ఆస్ట్రేలియన్ ఓపన్, ఫ్రెంచ్ ఓపన్ టోర్నమెంట్లు) grand slam tournament క్రిస్ 'గ్రాండ్ శ్లామ్' టోర్నమెంటుల్లోనూ, గ్రాండ్ ప్రీ టోర్నమెంటుల్లోనూ పాల్గొనదు. (ఆం. ప్ర. 7 9.89)

గ్రామ సహాయకుడు వి. *graama sahaayakuDu* గ్రామస్థాయిలో రెవిన్యూ కార్యకలాపాలను చూసుకునే ప్రభుత్వోద్యోగి village assistant గ్రామాధికారులను, గ్రామ సహాయకులుగా నియమించాలన్న ఉద్దేశం ప్రభుత్వానికి ఉన్నట్టు కనపడటం లేదన్నారు. (ఈ. 22.7.87)

గ్రామ స్వయం సంరక్షణ సమితి వి. *graama sVayam samraksaNa samıtı* గ్రామంలో శాంతి భద్రతలను పరిరక్షించడానికి గ్రామంలోని వ్యక్తులతోనే ఏర్పాటయిన కమిటీ village self protection committee గ్రామ స్వయం సంరక్షణ సమితుల పేరిట గ్రామస్తులకు ఆయుధాలను ఇవ్వాలనే నిర్ణయం చేసేముందు ముఖ్యమంత్రి గాని, ఆయన సలహాదారులు గాని లోతుగా ఆలోచించినట్టు కనిపించడం లేదని ... వ్యాఖ్యానించారు. (ఆం ప్ర. 22.4 89)

గ్రామీణ పరిశ్రమ వి. *graamiiNa pari śrama* గ్రామాలలో అందుబాటులో ఉన్న

ముడిపదార్థాల ఆధారంగా ఏర్పాటు చేసిన పరిశ్రమ village industry ... అభివృద్ధి చెందుతున్న దేశాలలో గ్రామీణ పరిశ్రమలను అభివృద్ధి పరచడంలో ... (ఆం జ్యో. 10 11.87)

గ్రీన్ కార్డ్ వి. *griin kaarD* అమెరికాలో విదేశీయులకు పౌరసత్వం స్థాయి కల్పిస్తూ జారీ చేసే పత్రం green card విన్ ఛాదాకు మాత్రమే కాక అతని కుమారుడు హర్ష్ ఛాదాకు కూడా అమెరికా నివాసం, పౌరసత్వం కల్పించే "గ్రీన్ కార్డ్" వుందని ... తెలిపారు. (ఆం. ప్ర. 5.10.87)

గ్రీన్ సిగ్నల్ వి. *grin signal or light* ఒక పని చేయడానికి పై కమిటీ లేదా అధికారులు ఇచ్చే అనుమతి green signal పంచాయితీ రాజ్ సంస్థల విషయంలో ప్రభుత్వం తలపెట్టిన సంస్కరణలకు అఖిల భారత కాంగ్రెస్ కమిటీ గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. (ఆం. భూ 10.5 89)

గ్రూప్‌వేలం పద్ధతి వి. *gruupveelam paddhati* ఒక ప్రాంతంలోని సారా దుకాణాలను కలిపి ఏకంగా కాంట్రాక్టర్ల మధ్య పాటకు (కొనుగోలుకు) పెట్టే విధానం group auction system (of arrack shops) ఆదాయం పెంచడమే లక్ష్యంగా ఏ విధంగానైనా పాట నిర్వహించవచ్చని ఎక్సైజ్ సూపరింటెంట్లకు ప్రభుత్వం అధికారం ఇచ్చింది. ఫలితంగా అధికారులు తిరిగి "గ్రూప్ వేలం పద్ధతి"నే నిర్వహిస్తూ వచ్చారు. (ఆం. జ్యో. 2 9.87)

గ్రేస్ మార్కు వి.*grees maarku* పరీక్షల్లో నిజంగా వచ్చిన మార్కులకి ప్రభుత్వం ఉదారంగా కలిపే అదనపు మార్కు grace mark అన్ని సబ్జెక్టులలోను మంచి మార్కులు వచ్చి, ఏదో ఒక సబ్జెక్టులో తప్పిన విద్యార్థులకు పదేసి గ్రేస్ మార్కులు కలిపి వారికి ఒక విద్యా సంవత్సరం వృధా కాకుండా చూడాలని ... (ఆం. భూ. 20.6.87)

గ్రేహౌండ్స్ వి. *greehaunDs* నక్సలైట్లను అణచివేయడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఏర్పాటు చేసిన సాయుధ దళం grey hounds నక్సలైట్ల కార్యకలాపాలను అణిచివేసే ప్రత్యేక సాయుధ దళం గ్రేహౌండ్స్‌ను ఏర్పాటు చేస్తూ రాష్ట్ర ప్రభుత్వం ... ఉత్తర్వులు జారీ చేసింది. (ఆం. భూ. 14.6.89)

గ్లోబల్ టెండర్ వి. *gloobal tenDar* సరుకును కొనుక్కోవడానికి ప్రపంచ వ్యాప్తంగా వ్యాపారస్థులను ఆహ్వానిస్తూ ఇచ్చే ప్రకటన global Tender అక్రమ రవాణా దారుల నుంచి స్వాధీన పరచుకున్న ఎర్ర చందనం దుంగలను బహిరంగ వేలంలో విక్రయించడానికి త్వరలో గ్లోబల్ టెండర్లను పిలవాలని నిర్ణయించినట్లు చెప్పారు. (ఈ. 2.2.88)

## ఘ

ఘంటాపథం వి. *ghanTaapatham* సందిగ్ధతకి తావులేనిది something said with force రాష్ట్రానికి నే నేదయినా చేయాలని అధిష్ఠాన వర్గానికి ఇష్టముంటే నన్ను ముఖ్యమంత్రిని చేయాల్సిందేనని శరద్ పవార్ ఘంటాపథంగా చెప్పారు. (ఈ 5 12.87)

ఘనవిజయం వి. *ghanavijayam* చెప్పుకోదగిన ఆధిక్యంతో పొందిన గెలుపు a resounding victory గ్రూప్ "ఎ"లో నేడు ప్రెస్ క్లబ్ జట్టుపై "ఇండియన్ ఎక్స్‌ప్రెస్ (విజయవాడ)" జట్టు ఘన విజయం సాధించింది. (ఆం. ప్ర. 13.4.88)

ఘనస్వాగతం వి. *ghanasvaagatam* సకల లాంఛనాలతో ఎదురేగి తీసుకు రావటం grand or tumultuous welcome నార్వే ప్రధాని శ్రీమతి

గ్రోహార్లెం బ్రంట్‌లాండ్‌కు ఢిల్లీ విమానాశ్రయంలో ప్రధాని శ్రీ రాజీవ్ ఘన స్వాగతం పలికారు. (విశా. 7 7.87)

**ఘరానా వ్యక్తి** వి. *gharaanaa vyakti* రాజకీయ, సామాజిక రంగాలలో పేరు పొందిన మనిషి important person ఈ ఆయుధ విక్రయం కాంట్రాక్టు పొందడంలో సహకరించినందుకు ప్రతిఫలంగా బోఫోర్స్ సంస్థ దేశంలోని ఘరానా వ్యక్తులకు దాదాపు యాభై కోట్ల రూపాయలు లంచం పెట్టిందని ... రుజువైంది. (ఈ 5 6 87)

**ఘర్షణ** వి. *gharSaNa* మాటలతో కానీ, సాయుధంగా కానీ మరొకరితో పోట్లాడటం clash, conflict కొలంబోతో ఘర్షణ తగదు. (ఈ 5 6 87)

**ఘర్షణపడు** క్రి. *gharSaNapaDu* పరస్పరం తీవ్రమైన అభిప్రాయ భేదాలు వ్యక్తం చేయు to clash ... ఆ దేశానికి సహాయం కొనసాగించాలా లేదా అన్న విషయంపై రీగన్ ప్రభుత్వం పార్లమెంట్ ఒక దానితో మరొకటి ఘర్షణపడుతూనే ఉన్నాయి. (విశా 12 10.87)

**ఘర్షణ వైఖరి** వి. *gharSaNa vaikhari* గొడవపెట్టుకొనేధోరణి లేదా విధానం hostile or belligerent attitude శ్రీలంక ప్రభుత్వంతో ఘర్షణ వైఖరిని విడనాడాలని లిబరేషన్ టైగర్స్ ఆఫ్ తమిళఈలం (ఎల్. టి. టి. ఇ) నిర్ణయించుకుంది. (ఈ. 29.6.89)

**ఘాటు** వి. *ghaaTu* చాల తీవ్రమైనది strong, severe భారతీయ జనతా పార్టీ, జనతా దళ్‌లు దేశ ప్రగతికి అడ్డు పడే యత్నం చేస్తున్నాయని ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ నేడిక్కడ ఘాటుగా విమర్శించారు. (ఆం ప్ర 14.6.89)

**ఘాతుక చర్య** వి. *ghaatuka carya* దారుణం, అమానుషం అయిన పని ghastly act గురువారం లుధియానాలో తమ నాయకుడు కృష్ణమహాజన్‌ను కాల్చి చంపిన తీవ్రవాదుల ఘాతుక చర్యకు నిరసనగా ... పిలుపునిచ్చింది. (ఈ. 6 6 87)

**ఘెరావ్** వి. *gheraav* కోర్కెల సాధనకోసం అధికారంలో ఉన్న వ్యక్తులను చుట్టు ముట్టి కదలకుండా నిర్బంధించటం gherao తెలుగు దేశం పార్టీలోని ఇరువర్గాల విభేదాల వలన ముగ్గురు మంత్రులను తెలుగు దేశం కార్యకర్తలు సోమవారంనాడు ... ఘెరావ్ చేశారు. (ఆం ప్ర 4.5.89)

**ఘోరకలి** వి. *ghoorakali* మనుషుల్ని దారుణంగా అధిక సంఖ్యలో చంపివేయటం carnage, massacre ఆదివారంనాడు ... పట్టణంలో జరిగిన ఘోరకలికి ప్రధానకారణం ఈ అలసత్వమే. (ఆం. భూ 27 6 89)

**ఘోషించు** క్రి. *ghooSincu* ఎలుగెత్తి చాటు to appeal vehemently ఈ నేపథ్యంలో కవితలు, సాహిత్యం షావుకార్ల వ్యవస్థను రూపుమాపాలని ఘోషించాయి. (ఆం ప్ర. 26 4 89)

## చ

**చక్కదిద్దు** క్రి. *cal diddu* సరిగా లేని పరిస్థితిని మెరుగు పరచు; సరిచేయు to set right మున్సిపల్ సంస్థలను చక్కదిద్దడానికి రాజ్యాంగ సవరణ తేవాలన్న ప్రతిపాదనకు ఆంధ్ర ప్రదేశ్, హర్యానా, కేరళ, తమిళనాడు తీవ్రంగా వ్యతిరేకించాయి. (ఆం భూ. 1.7.89)

**చట్టనిర్మాణ సంస్థ** వి. *caTTanirmaaNa samstha* రాష్ట్ర స్థాయిలోనూ, జాతీయ స్థాయిలోనూ ఎన్నికైన ప్రజాప్రతినిధులు

ప్రభుత్వ విధానాలను నిర్ణయించే శాసన వేదిక legislative body చట్ట నిర్మాణ సంస్థలతో సుప్రీంకోర్టు చాలా సాధారణంగా తల దూరుస్తున్న తీరు తనకు బాధ కల్గి స్తోందని అన్నారు. (ఆం ప్ర 15 89)

**చట్టబద్ధంచేయు** క్రి. *caTTabaddham ceeyu* శాసన పరమైన సమ్మతిని కల్పించు to legalize తన అధికారాన్ని చట్టబద్ధం చేసుకోవడం కోసం 1984 డిసెంబర్‌లో జనరల్ జియా ఒక రెఫరెండం నిర్వహించారు. (ఆం. జ్యో. 12.12.88)

**చట్టబద్ధత** వి. *caTTabaddhata* శాసనాల రీత్యా సరిగా ఉండటం; శాసన సమ్మతి legality శాసన సభ్యులకున్న ప్రత్యేకమైన హక్కులకు ఇంతవరకు చట్టబద్ధత లభించక పోవడం దురదృష్టకరమని అన్నారు. (ఈ 3 5 89)

**చట్ట సభ** వి. *caTTa sabha* చూ. చట్ట నిర్మాణ సంస్థ; చట్ట సభల్లో మంది బలంతో తాము ఏమి చేసినా చెల్లుతుందన్న ధీమా అయినా కావాలి. (ఈ. 11 6 87)

**చట్ట సమ్మతం** వి. *caTTa sammatam* న్యాయ సూత్రాల పరిధిలోనిది legally valid ద్రోణం రాజు రిట్ చట్ట సమ్మతం కాదు. (ఆం. ప్ర 9 12.87)

**చతుర్ముఖ పోటీ** వి. *caturmukha pooTii* ఎన్నికల్లో ఒకే స్థానానికి నలుగురు అభ్యర్థుల మధ్యే ప్రధానంగా పోటీ ఉండటం four cornered contest (in an election) కాగా, జనవరిలో జరిగిన శాసనసభ ఎన్నికల్లో చతుర్ముఖ పోటీలు జరిగాయి. (ఆం ప్ర 21 8 89)

**చప్పబడిపోవు** క్రి. *cappabaDipoovu* ఉత్సాహం నీరుగారి పోవు to become inactive నాగభూషణ్ పట్నాయక్, భువన్ మోహన్ పట్నాయక్, రేబీదాస్, గుణనాథ్ పాత్ర వంటి ప్రముఖ నక్సలైట్ నాయకులు చప్పబడి పోవడంతో ఒరిస్సాలో నక్సలైట్ కార్యక్రమాలు దాదాపు అంతమయ్యాయి. (ఈ 21 88)

**చమురు కేంద్రం** వి. *camuru keendram* పెట్రోలు వెలికి తీతకు ఉపయోగించే నిర్మాణం oil platform దక్షిణ సింధు శాఖలో నేటి ఉదయం ఇరాన్‌కు చెందిన చమురు కేంద్రాలపై అమెరికా యుద్ధ నౌకలు దాడి చేశాయి. (ఆం ప్ర 19 4.88)

**చమురు క్షేత్రం** వి. *camuru kSeetram* పెట్రోలియం ముడి పదార్థాలు వెలికి తీసేందుకు ఉపయోగించే నిర్మాణాలున్న ప్రదేశం oil field 'ఇరాన్ చమురు క్షేత్రంపై అమెరికా దాడి' - ఇరాన్‌కు చెందిన ఒక చమురు క్షేత్రాన్ని అమెరికా యుద్ధ నౌక సోమవారంనాడు ధ్వంసం చేసింది. (ఓ. 21 10 87)

**చమురు నిక్షేపం** వి. *camuru nikSeepam* భూగర్భంలో ఉన్న పెట్రోలియం మొ. ముడిపదార్థాల నిల్వ oil deposit గోదావరి బేసిన్‌లో లభించిన చమురు నిక్షేపాలను రాష్ట్ర ప్రభుత్వం పూర్తిగా సద్వినియోగం చేసుకొని పరిశ్రమలు, విద్యుత్కేంద్రాలు నెలకొల్పాలని ఆయన కోరారు. (ఆం ప్ర 3.10 87)

**చమురు బావి** వి. *camuru baavi* పెట్రోలు నిల్వలను వెలికి తీసేందుకు చేసిన త్రవ్వకం oil well తీరానికి ఐదు కిలోమీటర్ల దూరంలో ఈ చమురు బావి ఉంది. (ఈ 22 7.87)

**చరమ గీతం** వి. *carama giitam* ఒక వ్యవస్థకు అంతిమదశ death knell

అన్ని విధాలా కాంగ్రెస్(ఐ) పీకల దాకా మునిగి ఉందని, హర్యానా ఎన్నికల్లో ఓటమి ఆ పార్టీకి చరమ గీతమవుతుందని ఆయన అన్నారు. (ఈ. 17.6 87)

చర్చ వి. *carca* 1. చట్ట సభలలో, సమావేశాలలో జరిగే పరస్పర అభిప్రాయాల మార్పిడి discussion పాక్కు సహాయంపై త్వరలో అమెరికా కాంగ్రెస్‌లో పెద్ద ఎత్తున చర్చ ప్రారంభం కావచ్చు. (ఆం. భూ. 2.10 87) 2. ముఖ్యుల మధ్య (రాజకీయ, దౌత్య స్థాయిలలో) జరిగే సంభాషణ talks (between leaders or officials) అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఆర్థిక సుస్థిరత లోపించినట్లయితే రాజకీయ సంక్షోభం తలెత్తుతుందని చైనా ప్రధానమంత్రి లీ పెంగ్ బంగ్లాదేశ్ అధ్యక్షుడు ఎర్షాద్‌తో జరిపిన చర్చలో వివరించారు. (ఈ. 6.7 90)

చర్చకు వచ్చు క్రి. *carcaku vaccu* చట్ట సభలో ఒక అంశం పరిశీలనకు తీసుకొనబడు to be taken up for discussion ఇటీవల రాష్ట్రంలో సంభవించిన తుఫాను కారణంగా ఏర్పడిన పంట నష్టం గురించి ప్రస్తుతం నెలకొని ఉన్న దుర్భిక్ష పరిస్థితులకు సంబంధించి రేపటి శాసన సభా సమావేశంలో చర్చకు వస్తుందని స్పీకర్ నేడు శాసన సభలో ప్రకటించారు. (ఆం. ప్ర. 16.12 87)

చర్య వి. *carya* 1. అక్రమంగా వ్యవహరించిన వారిని దండించటం action (against the offenders) అజితాబ్‌పై చర్య కోరడమే నా నేరం. (ఆం. ప్ర 26 4 89) 2. లక్ష్య సాధనకోసం ఎప్పటికప్పుడు తీసుకొనే జాగ్రత్త measure సస్యరక్షణ చర్యలు చేపట్టేందుకు 14 వేల టన్నుల క్రిమి సంహారక మందులను సరఫరా చేయాలని నిర్ణయించారు. (ఈ. 6.7.89)

చలామణి వి. *calaamaNi* ప్రాబల్యం కలిగి ఉండటం; చెల్లుబాటు being in circulation ఒక పక్క రాజకీయాలు చలామణీ అవుతుంటే తెలుగు దేశం ప్రభుత్వం మాత్రం ఎప్పుడు ఆరోపణలు వచ్చినా విచారణలు జరిపి రాజకీయాలను పరిశుద్ధం చేస్తున్నదని ఆయన అన్నారు. (ఆం. ప. 5 8.87)

చలాయించు క్రి. *calaayincu* (అధికారాన్ని) మితిమీరి ఉపయోగించు to use (power) excessively రాష్ట్రంలోని కాంగ్రెస్ అధీనంలోగల మున్సిపాలిటీలపై రాష్ట్ర ప్రభుత్వం తన ఆధిపత్యాన్ని చలాయించడానికి పూనుకొంటోందని ఈ సమావేశం ఆరోపించింది. (ఈ. 22.4 89)

చలో వి. *caloo* ఏదైనా ప్రదర్శనకు ఒక చోటికి కదలి రమ్మని పార్టీలు లేదా సంస్థలు ఇచ్చే పిలుపు (స్థలాల, సంస్థల పేర్లతో కూడి ముందు పదంగా వస్తుంది.) call given to proceed towards a place or an institution in support of a demand (political, social etc) రాష్ట్ర ప్రయోజనాలకై చలో ఢిల్లీ. (ఈ 25.7 87)

చల్లబడు క్రి. *callabaDu* ఉద్రేకం తగ్గి నెమ్మదించు to cool down బిల్లుకు అభ్యంతరం తెల్పుతూ నోటీసు ఇచ్చిన ప్రతి ఒక్క సభ్యుడిని పిలవడానికి స్పీకర్ అంగీకరించడంతో ప్రతిపక్ష సభ్యులు చివరకు చల్లబడ్డారు. (ఈ. 16 5 89)

చవకబారు విశ. *cavakabaaru* స్థాయికి తగని cheap రీగన్ మూర్ఖత్వం మీద చవకబారు చేష్టల మీద అమెరికాలో చాల

జోకులు ప్రచారంలో ఉన్నాయి. (ఆం భూ 21 4 89)

చవిచూచు క్రి. *cavicuucu* అనుకోని అను భవాన్ని ఎదుర్కొను; రుచి చూచు to taste, experience మధ్యప్రదేశ్, రాజస్థాన్‌లలో కాంగ్రెస్ ఘోర పరాజయాన్ని చవి చూడబోతోంది. (ఈ 31 5 89)

చారిత్రక నేపథ్యం వి. *caaritraka neepathyam* ఒక విషయానికి సంబంధించి అంతకు ముందు జరిగిన సంఘటనలు historical background ... లా కమీషన్, సుప్రీంకోర్టు ఈ చారిత్రక నేపథ్యాన్ని గుర్తించాయి కూడా. (ఆం. ప్ర 25 4 89)

చారిత్రాత్మకం వి. *caaritraatmakam* రాబోయే కాలంలో, తరువాతి తరాలపై చెప్పుకోదగిన ప్రభావం చూపించగలిగినంతటి ప్రాముఖ్యం ఉన్నది historic చైనా-సోవియట్ సరిహద్దులలో నిస్సైనికీకరణకు సంబంధించిన చారిత్రాత్మక ఒప్పందంపై సంతకాల కార్యక్రమాన్ని పూర్తి చేసుకొని ... (ఈ 19 5 89)

చార్జి వి. *caarji* పదవీ బాధ్యతల స్వీకారం charge పుల్లన్నను నియమిస్తూ జారీ చేసిన ఉత్తర్వును వెంటనే రద్దు చేయకుండా చార్జి తీసుకోవద్దని పుల్లన్నను ఆదేశించారు. (ఈ 4 5 90)

చార్జిషీటు వి. *caarjiSiiTu* నిందితునిపై నేరారోపణ చేస్తూ తయారు చేసిన అభియోగ పత్రం charge sheet దాడి కేసుపై ఇంతవరకు చార్జిషీటు కూడా పెట్టలేదని ... (ఆం. భూ. 5 5.89)

చాలాన్ చేయు క్రి. *caalaan ceeyu* (నిబంధనలు పాటించని వారి వద్ద నుండి అధికారులు) అపరాధ రుసుము వసూలు చేయు to fine హెల్మెట్ ధరించలేదన్న కారణంగా సర్దార్జీనే చాలాన్ చేసిన సంఘటన మీరెప్పుడైనా విన్నారా? (ఆం ప్ర 18 8.87)

చావు దెబ్బ వి. *caavu debba* కోలుకోలేని విధంగా ఓడిపోవటం; ఘోర పరాజయం disastrous defeat, rout పశ్చిమ బెంగాల్ కేరళ శాసన సభా ఎన్నికల్లో చావు దెబ్బతిన్న కాంగ్రెస్(ఐ)కి హర్యానా ప్రజలు కూడా తగిన విధంగా బుద్ధి చెప్పారని . . (ఆం ప్ర 19 6 87)

చిందర వందరగు క్రి. *cindara vandaragu* ముక్కలై చెల్లా చెదురుగా పడిపోవు to be shattered ప్రేలుడు ధాటికి క్రింది అంతస్తులోని కిటికీ రెక్కలే కాక పై అంతస్తులో కిటికీ రెక్కలు సైతం చిందర వందర అయ్యాయి. (ఆం. ప 26 10 87)

చిక్కు వి. *cikku* సమస్య problem శాంతియుతమైన రాజకీయ విధానాల ద్వారా భారత దేశం నేపాల్ మధ్య వచ్చిన చిక్కులను త్వరలో పరిష్కరించుకోవాలని కోరారు. (ఆం. ప్ర)

చిక్కునపెట్టు క్రి. *cikkunapeTTu* ఇబ్బందికరమైన పరిస్థితిలో పడవేయు to embarass ... జక్కర్‌ను చిక్కున పెట్టిన పశుగ్రాస యంత్రాల వ్యవహారంపై కొత్తగా ఎంక్వయిరీ చేసి కూపీలాగవలసింది ఏమీలేదు. (ఈ 10 5 89)

చిచ్చుపెట్టు క్రి *ciccupeTTu* వైషమ్యాలను కలిగించు to create a rift ఒక పథకం ప్రకారం హరిజనులకూ, గిరిజనులకూ మధ్య చిచ్చు పెడుతున్నాడని ఆయన అభిప్రాయపడ్డారు. (ఆం భూ. 22 4 89)

చిత్తశుద్ధి వి. *cittaśuddhi* చెప్పింది చేసే నిజాయితీ sincerity ఉద్యోగాలకు గల ఖాళీల్లో భర్తీకి షెడ్యూల్డ్ కులాలు తెగల

అభ్యర్థుల నిమిత్తం ప్రత్యేకంగా జరుగుతున్న నియమాకాల్లో ప్రభుత్వం చిత్త శుద్ధితో వ్యవహరిస్తుందని ... అన్నారు (ఆం ప్ర 25 7 89)

**చిత్తుచేయు** క్రి. *cittuceeyu* పూర్తిగా ఓడించు to defeat, counter సెంట్రల్ జిల్లాల్లో కాంగ్రెస్(ఐ) ఎత్తుగడలను చిత్తుచేయడానికి ఈసారి ప్రముఖ నాయకుణ్ణి ఎన్టీఆర్ తన మంత్రి వర్గంలో చేర్చుకోవచ్చు. (ఆం భూ 5 6 89)

**చిత్తు జాబితా** వి. *cittu jaabitaa* తుది జాబితా తయారు చేసేముందు ఒక అభిప్రాయానికి రావడానికి తయారు చేసే జాబితా; తాత్కాలిక జాబితా provisional list లోక్‌సభకు అసెంబ్లీకి అభ్యర్థుల చిత్తు జాబితాను అధిష్ఠాన వర్గం ఇప్పటికే సిద్ధం చేసింది. (ఆం ప్ర. 21 10 89)

**చిత్ర పరిశ్రమ** వి. *citra pariśrama* సినిమాలు తీసేందుకు ఏర్పడ్డ వ్యవస్థ film industry ప్రముఖ నటుడు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు రాజకీయరంగ ప్రవేశం పై చిత్ర పరిశ్రమలో తాజాగా ఊహాగానాలు వినిపిస్తున్నాయి. (ఆం. భూ 26 4 89)

**చిత్రహింస** వి. *citrahimsa* మనసుకు గాని, శరీరానికిగాని కలిగించే తీవ్రమైన బాధ torture రెండేళ్ళ నుండి కట్నం కోసం అత్త పెడుతున్న చిత్రహింసలు భరించలేక ఆత్మహత్య చేసుకున్నది. (ఆం భూ. 7 8 87)

**చిత్రించు** క్రి. *citrincu* వాస్తవాన్ని కప్పిపుచ్చి మరో విధంగా చూపించు to depict హత్యను కరెంటు షాకుగా చిత్రించారు. (ఆం ప్ర. 9.2.89)

**చిత్రీకరించు** క్రి. *citriikarincu* 1. సెల్యులాయిడ్‌పైకి ఎక్కించు to film ఇది కాక మేనక విశ్వామిత్రుల డ్యూయెట్‌కు సంబంధించిన కొన్ని షాట్లను చిత్రీకరించారు. 2. చూ. చిత్రించు; నైపుణ్యంలేని వలస కార్మికులను నేరస్థులుగా చిత్రీకరించడం వల్ల వీరు తమ యజమానులకు వ్యతిరేకంగా న్యాయస్థానానికి వెళ్ళలేకపోతున్నారు. (ఉ 28 10 87)

**చిన్న చూపు** వి. *cinna cuupu* తగినంత ప్రాముఖ్యం ఇవ్వకపోవటం indifference కాంగీ అధిష్ఠాన వర్గం తనను చూస్తున్న చిన్న చూపువల్ల మూపనార్ మనస్సు గాయపడ్డ విషయం కాదనలేని సత్యం. (ఈ 2.5 89)

**చిన్న తరహా** విణ *cinna tarahaa* తక్కువ పెట్టుబడి, పరిమాణం కలిగిన minor, small scale రాష్ట్ర ప్రభుత్వం తెలుగు గంగ ప్రాజెక్టు పనులను యథావిధిగా కొనసాగిస్తుందని చిన్నతరహా నీటి పారుదల శాఖామంత్రి శ్రీ తుమ్మల నాగేశ్వరరావు తెలిపారు. (ఉ. 2.7 87)

**చిన్నబుచ్చు** క్రి. *cinnabuccu* తక్కువ చేయు to belittle ప్రధానమంత్రి నేరుగా వారితో మాట్లాడట మేమిటి? ఇది రాష్ట్రాలను చిన్నబుచ్చుటమేనని ముఖ్యమంత్రి అన్నారు. (ఈ 22 4.88)

**చిన్నబోవు** క్రి. *cinnaboovu* ఆనందం, ఉత్సాహం లేకపోవటం to lack attraction, be lack lustre అయితే అరబ్బు క్రికెట్ ప్రియులు అత్యంత ఉత్సాహంతో జరుపుకునే ఈ క్రికెట్ పండుగ ఈసారి చిన్నబోయినట్లు కనిపిస్తోంది. (ఉ. 22.3 88)

**చిప్కో ఉద్యమం** వి. *cipkoo udyamam* వృక్ష సంపదను విచక్షణా రహితంగా నరికి వేయటాన్ని వ్యతిరేకిస్తూ చేప

ట్టిన ఉద్యమం chipco movement (against deforestation) ప్రఖ్యాత పరిసరాల నిపుణుడు చిప్కో ఉద్యమ నిర్మాత శ్రీ సుందర్‌లాల్ బహుగుణ ... (ఆం జ్యో 10 12.87)

చిలవలు పలవలు వి. (బ.వ.) *cilavalu palavalu* జరిగినదానికి రకరకాలుగా కల్పించి చెప్పటం things or incidents blown out of proportion హజారీబాగ్‌లో జరిగిన మత కలహాల ఉదంతం చిలవలు పలవలుగా లోయ అంతటా వ్యాపించింది. (ఆం. భూ. 26 5 89)

**చీకటి అధ్యాయం** వి *ciikaTi adhyaayam* చరిత్రకు సంబంధించిన ప్రగతిలేని నిరాశాజనకమైన కాలం dark period తెలుగు దేశం పాలన రాష్ట్ర చరిత్రలో 'చీకటి అధ్యాయం'గా మిగిలి పోతుందని ఆయన అన్నారు. (ఆం. భూ 19 11 89)

**చీకటి కోణం** వి. *ciikaTi kooNam* (సాంఘికంగా, సంస్థాపరంగా) అన్యాయంతో కూడి మరుగున బడిన అంశాలు dark corners (of a society or an institution etc.) సమాజంలోని చీకటి కోణాలను తనదైన బాణీలో బయట పెట్టిన కళాకారుడాయన. (ఈ 25 4 89)

**చీకటి రాజ్యం** వి. *ciikaTi raajyam* అన్యాయాలకు, అక్రమాలకు నెలవైన పరిపాలన లేదా ప్రాంతం dark rule శ్రీ తివారీ ప్రసంగిస్తూ తెలుగు దేశం పాలనలో ఉన్న రాష్ట్రాన్ని చీకటి రాజ్యంగా అభివర్ణించారు. (ఉ 21.10.87)

**చీకటి శక్తి** వి. *ciikaTi śakti* దేశ సమైక్యతను, సమగ్రతను దెబ్బతీసే వ్యక్తి లేదా బృందం dark or evil force ప్రస్తుతం దేశంలోని హింసా జ్వాలలను ప్రజ్వరిల్ల జేసే చీకటి శక్తులు ... (ఉ 20 1.88)

చీఫ్ విప్ వి. *ciif vip* చట్ట సభలలో అధికార పార్టీ సభ్యుల మధ్య సమన్వయం ఉండేటట్లు చూసే బాధ్యతను నిర్వహించే ఆ పార్టీకి చెందిన ప్రతినిధి chief whip అధికార తెలుగు దేశం పార్టీ చీఫ్ విప్ కె. వి. నారాయణరావుకు ... (ఆం ప్ర 26 4 89)

చీలిపోవు క్రి. *ciilipoovu* విడిపోవు to be split, to be divided ప్రతిపక్షాల ఓట్లు చీలిపోతుండడం వల్లనే ఇన్ని సంవత్సరాలుగా కాంగ్రెస్ అధికారంలో ఉండగలిగిందని ... (ఆం. ప్ర 12 12.89)

చీల్చిచెండాడు క్రి. *ciilciicenDaaDu* తీవ్రంగా విమర్శించు to flay, to tear into pieces ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా చేసిన ప్రసంగంలో వాడిన పదాలు 'దేశద్రోహం', 'విద్రోహం' మొదలైన వాటిపై ప్రభుత్వం పై చేసే ప్రకటనను చీల్చిచెండాడు దామనుకున్న ప్రతిపక్షాలకు నిరాశే మిగిలింది. (ఆం. భూ 19 8 89)

చుక్కలంటు క్రి. *cukkalanTu* (ధరలు) విపరీతంగా పెరుగు to sky-rocket (as prices) చుక్కలంటిన 'చాయ్‌పత్తి' ధర. (ఈ 3 9.89)

చుక్కెదురగు క్రి *cukkeduragu* వ్యతిరేకంగా జరుగు to suffer a set back రెండో గేమ్‌లో సర్ జీత్ సింగ్ చాలా బాగా ఆడి విజయం సాధించాడు. కానీ కీలకమైన మూడో గేమ్‌లో ఫరూక్ పండోల్‌కు చుక్కెదురైంది. (ఈ 30 1.88)

చుక్కెదురు వి. *cukkeduru* వ్యతిరేకత ఉండటం being at logger

heads ఇందులోని వాస్తవాల విషయం ఎలా ఉన్నా పోలీసులకు, పౌరహక్కుల సంఘాలకు చుక్కెదురని ఎవరికైనా అర్థమవుతుంది. (ఆం భూ 14 5 89)

చుట్టుముట్టు క్రి. *cuTTumuTTu* 1. ఒక్కసారిగా ఆవరించు to engulf నలభై ఏళ్ళ చరిత్రలో కనీ వినీ ఎరుగని సంక్షోభం కమ్యూనిస్టు చైనాను చుట్టుముట్టింది. (ఈ 31 5 89) 2. తప్పించుకోడానికి వీలులేకుండా వ్యక్తి లేదా ప్రదేశం చుట్టూ వలయం పన్ను to encircle, to surround టెర్రరిస్టులు ఉపయోగించిన కారు లభించిన ప్రాంతాన్ని పోలీసులు చుట్టుముట్టి ఆ ప్రాంతాన్ని ప్రతి ఇంటినీ సోదా చేస్తున్నారు. (ఉ. 15 6 87)

చురుకందుకొను క్రి. *curukandukonu* (కార్యకలాపాలు) వేగం పుంజుకొను to gain momentum ఈ దిశగా చురుకందుకొంటున్న పరిణామాలను రాష్ట్రాలు ప్రతి ఘటించకపోతే ఇప్పుడు ఛాయా మాత్రంగా ఉన్న ఫెడరల్ స్వరూపం కూడా రూపు మాసిపోయి ఏక కేంద్ర వ్యవస్థే నెత్తికెక్కి తొక్కుతుంది (ఈ 19 2 88)

చురుకుదనం వి. *curukudanam* కార్యక్రమంలో క్రియాశీలత activeness శిక్షణా తరగతులలో పాల్గొనే గ్రామకమిటీ అధ్యక్షుల చురుకుదనాన్ని బట్టి మార్కులు వేసి మొదటి ఆరు స్థానాలు సంపాదించిన వారిలో ... (ఆం జ్యో 6 11 87)

చూచాయగా చెప్పు క్రి. *cuucaayagaa ceppu* జరుగబోయే దాన్ని గురించి సూచన మాత్రంగా తెలియజేయు to hint at, to give a clue ... తనను కలుసుకున్న ప్రతి పక్షనాయకుల ప్రతినిధి బృందానికి చూచాయగా చెప్పనే చెప్పారు. (ఆం. ప్ర 22 4 89)

చూరగొను క్రి. *cuuragonu* ప్రయత్న పూర్వకంగా (అభిమానం, ఆదరణ నమ్మకం మొ.) పొందు to gain (confidence, appreciation etc.) వివిధ పథకాల ద్వారా రాష్ట్ర ప్రజల అభిమానాన్ని, ఆదరణను చూరగొన్న తెలుగు దేశం ప్రభుత్వం ... (ఆం భూ. 14 5 89)

చెంచా వి. *cemcaa* స్వప్రయోజనాలకోసం వ్యక్తులను ఆశ్రయించి బ్రతికే మనిషి; తొత్తు sycophant స్వప్రయోజనాల కోసం చెక్క భజన చేసే చెంచాలు 'అన్న' మీద ఈగవాలితే తమ ఒంటి నిండా తేళ్ళు, జెర్రులూ ప్రాకినట్టు బాధపడిపోవచ్చు. (ఆం. భూ 14 5 87)

చెంతనజేరు క్రి. *centanajeeru* ఒక పక్షంతో కలియు to join (a person or group) రాజకీయాలకు వచ్చిన కొత్తలో శ్రీ రామారావు పట్ల సమ్మోహితులై ఎందరో సమర్థవంతులు వీరి చెంతన జేరారు. (ఉ 9 3 88)

చెక్ పవర్ వి. *cek pavar* (కేటాయించిన (ప్రభుత్వ నిధులలోంచి) బ్యాంకులు లేదా ట్రెజరీల నుండి డబ్బును తీసుకునే అధికారం cheque drawing power మెదక్ జిల్లా దుబ్బాక మండలంలో రెండు గ్రామాల సర్పంచులు చెక్ పవర్ కోల్పోయినట్లు దుబ్బాక పంచాయితీ విస్తరణాధికారి ... తెలిపారు. (ఆం భూ 10 8.89)

చెక్కుచెదరు క్రి. *cekkucedaru* (ఏదైనా వస్తువు) స్వరూపం, స్థితి దెబ్బతిను to suffer damage మవలంకర్, నీలం సంజీవరెడ్డి, అనంతశయనం అయ్యంగార్‌ల వంటి స్పీకర్ల నేతృత్వంలో సభా మర్యాదలు సంప్రదాయాలు ప్రజాస్వామ్య విలువలు చెక్కుచెదరలేదు. (ఈ. 25.5.89)

**చెదరగొట్టు** క్రి. *cedaragoTTu* (అల్లర్లు, ఘర్షణలు వంటి సందర్భాలలో) గుంపుగా ఉన్న జనాన్ని విడగొట్టి తరిమి వేయు to disperse (a crowd) *బుడనా జిల్లా బికామ్ వద్ద ఘర్షణ పడుతున్న ఇరువర్గాలను చెదరగొట్టేందుకు పోలీసులు కాల్పులు జరిపారని ఆయన విలేఖరులకు తెలిపారు.* (ఆం ప్ర 4 7 89)

**చెదురు మదురు** విశే. *ceduru maduru* 1. తక్కువ సంఖ్యలో (లేదా స్థాయిలో) small number *రిక్షాలు, ఆటోరిక్షాలు మాత్రం చెదురు మదురుగా రోడ్లపై తిరుగుతూ కనిపించాయి.* (విశా 10 6 87) 2. (ఘర్షణకు సంబంధించి) తక్కువ స్థాయి sporadic *గుంటూరు జిల్లాలో దౌర్జన్యకర సంఘటనలు జరిగినట్లు వార్తలొచ్చాయి. విజయనగరం జిల్లాలో చెదురు మదురు సంఘటనలు జరిగాయి.* (ఈ 23.11 89)

**చెయ్యిచేసుకొను** క్రి. *ceyyiceesukonu* మరో వ్యక్తిని దౌర్జన్యంగా కొట్టు to manhandle *అమేథీలో ... పోలీసులే బ్యాలెట్ పెట్టెలలో బ్యాలెట్ పత్రాలను కుక్కుతుండడం చూసి అభ్యంతరం పెట్టగా వారు ఆయనపై చెయ్యిచేసుకొన్నారని గోస్వామి అన్నారు* (ఈ 23 11 89)

**చెయ్యితడుపు** క్రి. *ceyyitaDupu* లంచం ఇచ్చు to bribe *చెయ్యితడిపితే కాని పొలం తడవదా? నీటిని విడుదల చేయడానికి నీటిపారుదల శాఖ అధికారులు రైతుల నుంచి లంచాలు వసూలు చేశారని ... ఆరోపించారు.* (ఆం ప్ర. 10 2 88)

**చెయ్యితిరుగు** క్రి. *ceyyitirugu* (ఏదైనా రంగంలో) మంచి సామర్థ్యం, నైపుణ్యం సంపాదించు to become proficient *జూమ్ లెన్స్‌ల ఉత్పత్తి పరిజ్ఞానంలో చెయ్యితిరిగిన తర్వాత ...* (ఈ 14 8 89)

**చెలగాటమాడు** క్రి. *celagaaTamaaDu* (ప్రమాదకరమైన లేదా ప్రమాదంలో ఉన్న వాటిపట్ల) నిర్లక్ష్యంగా వ్యవహరించు to play (with lives, fire etc.) *గాంధీ ఆస్పత్రిలో ఫంగస్‌తో కూడిన సెలైన్ బాటిల్స్ వాడుతూ రోగుల ప్రాణాలతో చెలగాటమాడినందులకు బాధ్యులైన అధికారులు ఎట్టకేలకు తగిన ఫలితాన్ని అనుభవించాల్సి వచ్చింది.* (ఆం భూ)

**చెలరేగు** క్రి. *celareegu* (ఘర్షణలు, అశాంతి మొ.) ఒక్కసారిగా ఎక్కువ అగు to flare up, erupt *శాంతి భద్రతలు దెబ్బ తింటున్నాయి. మత కల్లోలాలు తరచుగా చెలరేగుతున్నాయి.* (ఈ 3 5 89)

**చెల్లాచెదురు** వి *cellaaceduru* చూ. చిందర వందర; *వాడేసిన బుల్లెట్లు గదంతా చెల్లాచెదురుగా పడి ఉన్నాయి.* (ఈ 15 7 89)

**చెల్లించు** క్రి. *cellincu* నిబంధనల మేరకు ఇవ్వవలసిన డబ్బు ఇచ్చు (వేతనాలు, ఫీజులు మొ.) to pay (as salary, fees etc.) *జూలై నుంచి చెల్లించవలసిన అదనపు కరువు భత్యాన్ని నగదు రూపంలో చెల్లిస్తారు.* (ఆం ప్ర. 20 9 89)

**చెల్లు** క్రి *cellu* చట్టపరమైన లోటుపాట్లు లేకుండా ఉండు to be valid *ఈ పద్ధతి ఇక్కడితో స్వస్తి పలకాలి. అందుకనే ఆయన ఈ ఎన్నిక చెల్లదని చెప్పేశారు.* (ఆం. ప్ర 24 11.89)

**చెల్లుచీటీ** వి. *cellucITi* అంతవరకు అములులో ఉన్న పద్ధతిని ఆపివేసే నిర్ణయం an end (to a practice, tradition etc.) *తెల్ల జాతీయుల రిజర్వేషన్‌కు*

చెల్లుచీటీ. (ప్ర శ. 20 8.87)

**చెల్లుబాటు** వి. *cellubaaTu* చట్టరీత్యా అమలులో ఉండటం being in force legally బ్యాంకులలో ఖాళీలను భర్తీ చేయగా మిగిలిన అర్థుల జాబితాతో తయారుచేసే వెయిటింగ్ లిస్టు గతంలోలా కాక ఇక నుండి రెండేళ్ళ పాటు చెల్లుబాటులో ఉంటుందని శ్రీ వెంకటరత్నం చెప్పారు. (ఈ 6 7 89)

**చేజారు** క్రి. *ceejaaru* ఒక రంగంపై ఉన్న నియంత్రణ తొలగిపోవు; పట్టుసడలిపోవు to go out of control, slip చేజారుతున్న మిరియాల మార్కెట్. (ఆం జ్యో 19.10.89)

**చేజిక్కించుకొను** క్రి. *ceejikkincukonu* (ఎన్నికలు, క్రీడలు మొ.) పోటీలో విజయాన్ని సాధించు; గెలుచుకొను to wrest (as in elections, sports etc.) ఆ తర్వాత 1983లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెస్(ఐ)ని ఓడించి ప్రాంతీయ పార్టీ అయిన తెలుగు దేశం అధికారం చేజిక్కించుకుంది. (ఆం భూ. 3 5.89)

**చేతిచమురు** వి *ceeticamuru* (ఫలితం రాని వాటి మీద) సొంత డబ్బుతో పెట్టే ఖర్చు one's own money spent on unfruitful activities చేతి చమురు వదిలినా చెమటే చివరకు శరణ్యం. (ఆం ప 10 10 87)

**చేతులుకలుపు** క్రి *ceetulukalupu* ఒక ప్రయోజనాన్ని ఆశించి విభిన్న వర్గాలు ఒకటిగా అగు to join hands ప్రజా స్వామ్య పరిరక్షణకు 12 ప్రతిపక్షాల నాయకులు చేతులుకలిపారని రామారావు అన్నారు. (ఈ. 24 7 89)

**చేతులుతడుపు** క్రి. *ceetulutaDupu* చూ. చెయ్యితడుపు; వేరుశెనగ కొరత వల్ల మిల్లులు ఆడించ లేకపోయామని వారు నివేదికలో వివరించి అధికారుల చేతులు తడుపుతుంటారు. (ఈ. 24 1 88)

**చేతులుమారు** క్రి. *ceetulumaaru* (నిబంధనలకు వ్యతిరేకంగా) రహస్యంగా ఒకరి నుంచి మరొకరికి డబ్బు అందు to change hands రాష్ట్ర ప్రభుత్వం పట్టణ భూపరిమితి చట్టం నుంచి గుట్టు చప్పుడు కాకుండా మినహాయింపు ఇవ్వడంలో పెద్దమొత్తంలో చేతులుమారాయని రాష్ట్ర రెవిన్యూ మంత్రి ... ఆరోపించారు. (ఆం. భూ 28 11 87)

**చేతులెత్తు** క్రి. *ceetulettu* ఒక పని తన వల్ల కాదని స్పష్టం చేయు to declare helplessness కలిసి వస్తారు అనుకున్న అసంతృప్తి వాదులు ఇప్పుడేగాదు అభ్యర్థి విషయం తేలక ముందే జారిపోయారు. చివరకు వి. పి. సింగ్ కూడా చేతులెత్తారు. (ప్ర శ 7.7 87)

**చేదోడు వాదోడు** వి. *ceedooDu vaadooDu* ఒకరికి ఒకరు సహాయకరంగా ఉండటం being helpful to one another న్యాయస్థానాలు పోలీసు విభాగం చేదోడు వాదోడుగా పని చేయాలనీ ... (ఆం. ప్ర 22.4 89)

**చేపట్టు** క్రి. *ceepaTTu* ఒక పనిని ఆచరణలో పెట్టడానికి పూనుకొను to take up (as a work, scheme etc.) ఒక్కొక్క ఇంటికి 12వేల రూపాయలు వ్యయం అవుతుందని, వెంటనే లక్ష ఇళ్ళ నిర్మాణాన్ని చేపడతామని ఆయన చెప్పారు.(ఉ. 25 1 89)

**చేరవేయు** క్రి. *ceeraveeyu* (వస్తువు లేదా

విషయం మొ.) ఒకచోట నుండి మరోచోటికి చేర్చు to carry, pass on (things, information etc.) బయటి నుంచి జైల్లోని నాయకులకు వారి నుంచి బయటికి రహస్య స్థావరాలకు గుప్త సమాచారాన్ని సమర్థవంతంగా చేరవేసే వారు. (ఆం ప్ర 17 3 88)

**చేరిక** వి. *ceerika* ఒక ప్రదేశానికి లేదా ఒక సంస్థ లోనికి ప్రవేశించటం arrival at a place, joining an organization *600 మంది శరణార్థులు తమిళనాడు చేరిక.* (ఉ 15.6 87)

**చేరిపోవు** క్రి. *ceeripoovu* వ్యాపించు, అందు to spread, reach ఆయన చేసిన ఆరోపణలు రాష్ట్రం నలుమూలలకూ చేరిపోయాయనడంలో సందేహంలేదు. (ఉ 24 11 87)

**చేరుకొను** క్రి. *ceerukonu* ఒక స్థలానికి వచ్చు to reach *లాగోస్‌లో ఆగష్టు 25 నుండి నిర్బంధంలో ఉన్న ముగ్గురు ఎయిర్ ఇండియా ఉద్యోగులు నేడు బొంబాయి* చేరుకున్నారు. (ప్రశ 24 10 87)

**చేరువఅగు** క్రి. *ceeruvaagu* భావ పరంగా దగ్గర అగు to come closer కాంగ్రెస్‌లోని రాజకీయ చతురుడు, సీనియర్ నాయకుడు శ్రీ కమలాపతి త్రిపాఠీ, మాజీ రక్షణ మంత్రి వి పి సింగ్ రాజకీయ ప్రయోజనాలకోసం అతిచేరువవుతున్నారు (ఆం జ్యో 5 6 87) .

**చేష్ట** వి. *ceeSTa* అనుచితమైన పని లేదా ప్రవర్తన improper act or behaviour కానీ, ఇక్కడ ఉభయ పక్షాలూ ఇస్తున్న ప్రకటనలూ చేస్తున్న చేష్టలూ అన్నీ భారత దేశాన్ని ఇరకాటంలోనే పడేస్తున్నాయి. (ఉ 7 10 87)

**చైతన్యపరచు** క్రి. *caitanyaparacu* ఉత్తేజం కలిగించు to activate ... పారిశ్రామిక రంగాన్ని పటిష్ట పరచడానికి స్టాక్ మార్కెట్‌ను మళ్ళీ చైతన్యపరచేందుకు కొత్త లెవీల ద్వారా అదనపు వనరులను సమీకరించక తప్పదు. (ఈ. 1 2 88)

**చొచ్చుకుపోవు** క్రి. *coccukupoovu* అడ్డంకి లేకుండా ముందుకు సాగు to advance, surge ఇదిలా *ఉండగా* ఇరాన్ ఆక్రమణలో ఉన్న ఫా ద్వీప కల్పంలో తమ సేనలు ముందుకు చొచ్చుకుపోతున్నట్లు ఇరాక్ ప్రభుత్వం ప్రకటించింది. (ఆం ప్ర 19.4 88)

**చొచ్చుకువచ్చు** క్రి. *coccukuvaccu* ఇతరుల భూభాగంలోకి అక్రమంగా చొరబడు to intrude సరిహద్దు ప్రాంతాల్లో పాకిస్తాన్ సైన్యం కాల్పులకు పాల్పడుతూ ఆ ముసుగులో టెర్రరిస్టులు ఇండియాలోకి చొచ్చుకువచ్చేలా ఆ దేశం సహాయ పడుతున్నదని ... (ఆం. ప్ర 15 4 88)

**చొరబడు** క్రి *corabaDu* అక్రమంగా ప్రవేశించు to barge in కుద్దం హసన్, జాఫ్రీ అనే వ్యక్తులు కారులో వచ్చి ఊరేగింపులోకి చొరబడి ఈ అఘాయిత్యం జరిపినట్టు పోలీసులు చెప్పారు. (ఆం ప్ర 11 2 87)

**చొరబాటుదారుడు** వి. *corabaaTu-daaruDu* ఒక దేశం నుండి మరొక దేశంలోకి అనుమతి లేకుండా అక్రమంగా ప్రవేశించేవాడు intruder పాకిస్తాన్ నుంచి మనదేశంలోకి అక్రమంగా ప్రవేశిస్తున్న ముగ్గురు చొరబాటుదారులను పోలీసులు ఎన్‌కౌంటర్‌లో కాల్చివేశారు. (ఆం భూ 10 5 89)

**చొరవ** వి *corava* ఒక కార్యసాధనలో అవతలివారి అంగీకారంతో నిమిత్తం లేకుండా

పూనుకొనే ప్రయత్నం initiative సరి హద్దు వివాదం పరిష్కారానికి మరింత చొరవ. (ఆం భూ 30 6 87)

చోటు చేసుకొను క్రి. *cooTu ceesukonu* స్థానమేర్పరచుకొను to figure నక్సలైట్ల కార్యకలాపాలు శాంతి భద్రతల సమస్య ... మొదలైన అంశాలు ఈ సమావేశంలో ప్రముఖంగా చోటు చేసుకొంటాయి. (ఈ 6 9 89)

చోరీచేయు క్రి. *cooriiceeyu* (ఇతరుల డబ్బు, వస్తువులు) దొంగతనంగా ఎత్తు కుపోవు to steal వేషం మార్చి 10వేలు చోరీచేసిన బాలిక. (ఆం ప్ర 10 12 87)

చౌకడిపో వి. *caukaDipoo* చౌక దుకా ణాలకు నిత్యావసర వస్తువులు సరఫరా చేసే గోదాము whole sale depot for fair price shops తెలుగు దేశం పార్టీకి చెందిన అస్మదీయులకే చౌకడిపో డీలర్ షిప్‌లు కట్టబెట్టడానికి ముఖ్యమంత్రి ... కొత్త ఎత్తు వేశారు. (ఈ. 12 5 89)

చౌకదుకాణం వి *caukadukaaNam* ప్రభుత్వం నిర్ణయించిన ధరకు నిత్యావసర వస్తువులను సరఫరా చేసే అంగడి fair price shop చౌక దుకాణాల్లో సామాన్య ప్రజలకు పంచవలసిన పామోలిన్ నూనె టాంకర్లు దారి మళ్ళించి వేల రూపాయల లాభాలను మధ్య దళారీలు కొట్టేస్తుంటే ... (ఉ 1 7.87)

చౌకబారు విశే. *caukabaaru* స్థాయికి తగని cheap ఆగష్టు 15వ తేదీన ఎర్రకో టపై నుంచి చేసినంత చౌకబారు ప్రసంగం గతంలో ఏ ప్రధాన మంత్రి చేయలేదని శ్రీ ఉపేంద్ర విమర్శించారు. (ఆం ప్ర 21 8 89)

చౌకీదారు వి. *caukiidaaru* కాపలా కాసే మనిషి watchman పోలీసు సిబ్బందిలో 30 శాతం మంది ప్రజా ప్రతినిధుల, అధికార్ల ఇండ్ల వద్ద చౌకీదార్లుగా ఉన్నారని ... (ఆం భూ 6 7 89)

## ఛ

ఛాందస వర్గం వి. *chaandasa vargam* పాతభావజాలానికి కట్టుబడి, వ్యవస్థలో తీవ్రమైన మార్పులను వ్యతిరే కించే వ్యక్తుల సమూహం orthodox section అయితే గోర్బచెవ్ మనుగడ అట్టేకాలం జరగదని ఆయన విధానాలకు సోవియట్ ఛాందస వర్గాల నుంచి సవాలు తప్పదని కొందరి అభిప్రాయం. (ఆం. ప్ర. 8 5.89)

ఛాందస వాది వి. *chaandasa vaadi* మత విషయాలలో కరడు గట్టిన సంప్రదాయవాది fundamentalist, traditionalist భారత దేశంలో జమ్మూ కాశ్మీర్ రాష్ట్ర స్థానాన్ని సవాలు చేస్తూ ముస్లిం ఛాందస వాదులు ప్రక టనలు గుప్పిస్తే తీవ్ర పరిణామాలు ఎదుర్కోవలసి వస్తుందని ... (ప్ర. శ 14 7 87)

ఛాంపియన్ షిప్ వి. *chaampiyanSip* క్రీడల్లో ఏదైనా రంగంలో ఉత్తమ క్రీడా కారుడు లేదా ఉత్తమ టీమ్‌ని నిర్ణయించ డానికై జరిపే పోటీ championship 56 ఏళ్ళ షీలా మెర్వాదేకర్ ... హర్యానాలో జరిగిన వెటరన్స్ అథ్లెటిక్ ఛాంపియన్‌షిప్ 400 మీటర్ల పరుగు పందెంలో బంగారు పతకం సాధించారు. (ఈ 5.6.89)

ఛాంబర్ వి. *chaambar* ఉన్నతాధికా రికి ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన గది chamber ఇక జక్కర్ సోమవారంనాడు ప్రతిపక్ష పార్లమెంటు సభ్యులతో తన ఛాంబ ర్‌లో మాటాడినప్పుడు కేవలం రైతుల

ప్రయోజనాల కోసమే బ్రాడీ కంపెనీకి సుంకం మినహాయింపు ఇచ్చారు ... అన్నారు. (ఆం ప్ర. 9 5 89)

**ఛానల్** వి. *chaanal* (దూరదర్శన్, రేడియోలలో) కార్యక్రమాలు ప్రసారమయ్యే ప్రత్యేక సాంకేతిక మార్గం channel (as in electronic media) జాతీయ స్థాయిలో ఒక ప్రత్యేక ఛానల్‌ను ప్రారంభించాలనీ 'ఆకాశవాణి' సంకల్పించింది. (ఆం ప్ర 27 4 88)

**ఛారిటబుల్ ట్రస్ట్** వి.*chaariTabul TrasT* విరాళాల డబ్బుతో సామాజిక ప్రయోజనాలకోసం కార్యక్రమాలు నడిపే సభ్యుల సంఘం charitable trust ఛారిటబుల్ ట్రస్ట్‌లు చిన్నా పెద్దా దేవాలయాలు జంటనగరాల్లో మొత్తం తొమ్మిది వందలా ఇరవైమూడు ఉన్నాయి. (ఈ అను 1 6 89)

**ఛాలెంజ్‌చేయు** క్రి. *chaalenjceeyu* (ఓటింగ్, గస్తీ మొ. సందర్భాలలో) వ్యక్తుల గుర్తింపుపట్ల అనుమానం వచ్చినపుడు వాళ్ళను అడ్డుకొని ప్రశ్నించు to challenge దొంగ ఓట్లు వేయడానికి వచ్చిన వారిని పోలింగ్ ఏజెంట్లు నిలదీశారు కొన్ని బూతులలో ఛాలెంజ్‌చేసి పట్టుకున్నారు. (ఆం ప్ర 24 11 89)

**ఛిన్నాభిన్నం** వి *chinnaabhinnam* క్రమం తప్పిన స్థితి, విచ్ఛిన్న పరిస్థితి disarray ముఖ్యమంత్రి .. అన్ని రంగాలలో అభివృద్ధిని నాశనం చేసి రాష్ట్ర ఖజానాలో డబ్బు లేకుండా దివాలా తీయించి ఆర్థిక వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసి అస్థిరత ఏర్పరచారని ... (ఆం భూ. 14 5 89)

**ఛీత్కరించు** క్రి. *chiitkarincu* అసహ్యించుకొను to despise కాంగ్రెస్ నాయకులు సిగ్గూ లజ్జా లేకుండా అధికారాన్ని అమ్ముకొని సొమ్ము గడించి విదేశీ బ్యాంకులలో దాచుకుంటున్న కేంద్రనాయకుల మోచేతి నీళ్ళు తాగడానికి కాళ్ళు కడగడానికి సిద్ధ పడుతున్నారని ఆయన ఛీత్కరించారు. (ఈ. 4.7 87)

**ఛైర్మన్** వి. *chairman* ఒక సంస్థకు అధ్యక్షుడు chairman or chairperson సమీక్షా మండళ్ళకు వివిధ మంత్రులను ఛైర్మన్లుగా ముఖ్యమంత్రి నామినేట్ చేశారు. (ఈ 5 6 87)

## జ

**జటిలం** వి *jaTilam* పరిస్థితిలో మరింత క్లిష్టత critical, precarious ముఖ్యంగా వెస్టిండీస్ 26 పరుగులకే 4 వికెట్లు కోల్పోయి జటిలమైన స్థితిలో పడిన దశలో ... (ఈ 21.4.89)

**జట్టు** వి. *jaTTu* ఆటలో ఒక పక్షం వైపు ఆడేందుకు ఏర్పడిన బృందం team భారత వెస్టిండీస్ జట్ల మధ్య ... (ఆం ప్ర 1.1 88)

**జడలువిప్పు** క్రి. *jaDaluvippu* (విద్రోహ శక్తులు) ఒక్కసారిగా విజృంభించు to rage రెండు లక్షల మంది సైనికులను, పారా మిలిటరీ దళాలను మోహరించినా పరిషత్ ఎన్నికల్లో హింసా శక్తులు జడలు విప్పాయంటే ప్రశాంతంగా ఎన్నికలను నిర్వహించడం సైనిక ప్రభుత్వానికి శక్తికి మించిన పనైనా అయి ఉండాలి. (ఈ 20 2.88)

**జతచేయు** క్రి. *jataceeyu* అంతకు ముందున్న దానికి మరికొంత కలుపు to add అర్షద్ తన స్కోరుకు మరో 13 పరుగులు జతచేశాడు. (ఈ. 11 88)

**జనజాగరణ ఉద్యమం** వి. *janajaa-garaNa udyamam* ప్రజలలో ఒక సమ

స్యపై అవగాహన, చైతన్యాలను కలిగించేం దుకు ఉద్దేశించిన కార్యక్రమం people's awakening movement కంచి స్వామి శ్రీ జయేంద్ర సరస్వతి విజయ దశ మినాడు తమ 'జన జాగరణ' ఉద్యమాన్ని ప్రారంభించారు. (ఆం. జ్యో. 4.10 87)

**జనజీవన స్రవంతి** వి. *janajiivana sravanti* అధిక సంఖ్యాక ప్రజలు మను గడ సాగించే పద్ధతి main stream (of life) జన జీవన స్రవంతిలో చేరడా నికి అంగీకరించి పోలీసులకు లొంగిపోయిన దృష్ట్యా వారి సత్వర పునరావాసానికి ప్రభుత్వం సిఫారసు చేయగలదని ఆయన చెప్పారు. (ఆం భూ. 7 7.89)

**జనతా కర్ఫ్యూ** వి. *janataa karfyuu* (నిరసన వ్యక్తం చేస్తూ) ప్రభుత్వ ప్రమేయం లేకుండా ప్రజలు తమకు తామే వీధులలో తిరుగ కూడదని విధించుకొని పాటించే నిషేధం civil curfew అల్ల ర్లకు దిగుతున్నారన్న కారణంగా 'బోడో' ప్రజ లను విచక్షణా రహితంగా అరెస్టు చేయడాన్ని వ్యతిరేకిస్తూ మూడురోజుల పాటు రాత్రి నుంచి ఉదయం వరకు రాత్రి వేళల్లో 'జనతా కర్ఫ్యూ'ను పాటించాల్సిందిగా అఖిల బోడో విద్యార్థుల యూనియన్ పిలుపు నిచ్చింది. (ఆం. ప్ర. 8 5 89)

**జనబల ప్రదర్శన** వి. *janabala pradarśana* ప్రజల మద్ద తును చూపించేందుకు ఎక్కువ సంఖ్యలో ప్రజలను హాజరు పర చటం demonstration of the strength of mass (support) ప్రజా బల ప్రదర్శనకు సన్నాహం ... మున్నె న్నడూ లేని విధంగా జనవరి 9వ తేదీన 'జన బల ప్రదర్శన' జరపవలసిన అవ సరం ఉన్నదని కొందరు మంత్రులు పార్టీ నాయకులకు చెప్పినట్లు తెలిసింది. (ఆం ప్ర 1.1.88)

**జనవాక్య సేకరణ** వి. *janavaakya seekaraNa* (ప్రభుత్వేతర సంస్థల ద్వారా) ఏదైనా ఒక విషయంపై ప్రజాభి[illegible] యాన్ని తెలుసుకోవటానికి శాంపుల్ స[illegible] ద్వారా చేసే యత్నం opinion po[illegible] ఈ ... జనవాక్య సేకరణనే ఆధారంగా తీసుకుంటే ... మేనక, సంజయ్‌సింగ్‌లకు ఎక్కువ ఓట్లు పడతాయని అనుకుంటున్నారు. (ఆం. ప. 24.9 87)

**జనవిజ్ఞానయాత్ర** వి. *janavijnaana yaatra* వైజ్ఞానికాభివృద్ధి సాధించిన ఫలితాలను ప్రజల దగ్గరకు తీసుకు వెళ్ళటానికి చేసే పర్యటన a tour undertaken by social activists to popularize the knowledge of science విజ్ఞాన శాస్త్రం పెంపొందించి ప్రజలందరికీ చేరువ చేయాలన్న ప్రధాన లక్ష్యంతో దేశ వ్యాప్తంగా 5 చోట్ల నుండి బయలుదేరుతున్న భారత జన విజ్ఞాన యాత్రలలో భాగంగా ... (విశా 8 9 87)

**జనసమీకరణ** వి. *janasamiikaraNa* మద్దతు ఉన్నట్లు నిరూపించుకోటా నికి రాజకీయ పార్టీల వారు ప్రజ లను తరలించుకుని రావటం mass mobilization ఏ కార్యక్రమానికైనా దాదాపు అన్ని పార్టీలు జనసమీకరణకు పూను కోవడం సహజమే. (ఆం ప్ర. 1.9 89)

**జనసాంద్రత** వి. *janasaandrata* ఒక చదరపు కిలోమీటరు వైశాల్యంగల ప్రదే శంలో నివసించే ప్రజల నిష్పత్తి density of population సెంట్రల్ ఏషియా,

మరికొన్ని జన సాంద్రత ఎక్కువగా ఉన్న ప్రదేశాలలో నిరుద్యోగం ఉందని ... అన్నారు. (ఆం. ప్ర 30 6 89)

**జనాంతిక ప్రకటన** వి. *janaantika prakaTana* వ్యక్తుల పేర్లు బయటకు రాకుండా (రహస్యంగా) అభిప్రాయాల్ని తెలపటం statement made in private పార్టీ వర్గాల జనాంతిక ప్రకటనల ప్రకారం జోషిని దోషిగా నిర్ధారించి పదవీ భ్రష్టం చేయడానికి ముఖ్య హేతువులు మూడని ప్రచారం జరుగుతున్నది. (ఈ 21.1 88)

**జనాంతిక సమావేశం** వి. *janaantika samaaveeśam* వివరాలు ఇతరులకు అందకుండా జరిపే సమావేశం closed door meeting అనావృష్టికి గురైన ప్రజలను ఆదుకోవడంలో రాష్ట్ర ప్రభుత్వం విఫలమైందని, సహాయక చర్యలు లక్ష్యానికి చాల దూరంగా వున్నాయని ప్రధాన మంత్రి రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రభుత్వాధికారులతోను జరిపిన జనాంతిక సమావేశంలో తీవ్రంగా విమర్శించారు (ఉ 8.9 87)

**జనాకర్షక కార్యక్రమం**వి. *janaakarSaka kaaryakramam* ప్రజలను (ఓట్ల కోసమై) ఆకట్టుకోవడానికి రూపొందించిన పథకం populist programme ఒక వంక వోటర్లను ఆకర్షించడానికి ఎన్నికల సమయాన జనాకర్షక కార్యక్రమాలను ప్రకటించడం, మరోవంక ప్రతి పక్షాల మీద ... నిందలు వేయడం ఆయన ద్విముఖ వ్యూహం. (ఈ. 4 7 89)

**జన్యుశాస్త్ర శాఖ** వి. *janyuśaastra śaakha* వారసత్వ గుణాలను అధ్యయనం చేసే శాస్త్ర విభాగం department of genetics మేనరికాలు చేసుకున్న వారి సంతానంలో జన్యు సంబంధ వైకల్యాలపై కూడా త్వరలో ఒక పరిశోధనాత్మక పథకాన్ని జన్యుశాస్త్ర శాఖతో కలసి చేపట్టబోతున్నట్లు ఆమె తెలిపారు. (ఆం. ప్ర 1.5 89)

**జప్తు** వి. *japtu* ప్రభుత్వ సంస్థలకు బకాయి పడ్డవారి ఆస్తి పాస్తుల్ని స్వాధీనం చేసుకోవటం confiscation ఒకవేళ రాష్ట్ర ప్రభుత్వం రాజకీయ కక్ష తీర్చుకునే ఉద్దేశంతో జప్తులు ప్రారంభిస్తే ప్రజలు ఈ ప్రయత్నాలను ప్రతిఘటించాలని ఆయన పిలుపు నిచ్చారు. (ఉ. 4 7.87)

**జమకూడు** క్రి. *jamakuuDu* ఒకచోట గుమికూడు to assemble జావా సముద్రంలో 'క్వీన్ ఎలజబెత్-2' నౌకలో వందల మంది శాస్త్రజ్ఞులు, సాహసికులు ఇప్పటికే జమకూడారు. (ఈ 13.3 88)

**జమచేయు** క్రి. *jamaceeyu* (వసూలైన) డబ్బును సంబంధిత కార్యాలయానికి చెల్లించు to credit గ్రంథాలయ సెస్ వసూలు కూడా ఎప్పటికప్పుడు చలాను ద్వారా జిల్లా గ్రంథాలయ సంస్థకు జమచేసి దాని నకలును కూడా కార్యాలయానికి అందజేయాలని ఆయన తెలిపారు.

**జయప్రదంచేయు** క్రి. *jayapradam ceeyu* విజయవంతం చేయు; సఫలం చేయు to make sth a success కార్యకర్తలు, కార్మికులు పెద్ద సంఖ్యలో పాల్గొని ధర్నాని జయప్రదం చేయాలని ... విజ్ఞప్తి చేసింది. (ప్ర శ 27.10.87)

**జరిమానా** వి.*jarimaanaa* నియమ నిబంధనలను ఉల్లంఘించినప్పుడు డబ్బు రూపేణా వేసే శిక్ష; జుల్మానా fine, penalty ప్రదర్శనలో పాల్గొన్న కార్మికులకు జరిమానా విధిస్తున్నారు. (ఈ. 30 5.89)

**జరుగు** క్రి. *jarugu* ఒక కార్య

క్రమం నిర్వహించబడు to be held, conducted ... ముట్లూరు గ్రామంలో పోలింగ్ గురువారంనాడు కాక శుక్రవారం నాడు జరుగుతుందని ... ప్రకటించారు. (ఆం. జ్యో. 3.12 87)

**జరుపు** క్రి. *jarupu* చర్చలను, కార్యక్రమాలను నిర్వహించు to hold, conduct ఆదివారం సాయంత్రం తమను నక్సలైట్లు నిర్బంధించిన విషయంగానీ, తాను వారితో మంతనాలు జరుపుతున్న సంగతిగానీ ఆమె చెప్పలేదు. (ఈ 29.12 87)

**జర్నలిస్టు** వి. *jarnalisTu* వార్తా పత్రికలలో వార్తలను, వ్యాసాలను రాసే వ్యక్తి; పత్రికా రచయిత, విలేఖరి journalist చద్దా ఢిల్లీకి చేరుకున్నప్పుడు జర్నలిస్టులను వేధించి, అవమానించేందుకు ప్రయత్నించారని ... అన్నారు. (ఆం. ప్ర. 19.4 88)

**జల దిగ్బంధం** వి. *jala digbandham* (ఒక ప్రాంతాన్ని) వరద నీరు చుట్టు ముట్టి ఇతర ప్రాంతాలతో సంబంధం లేకుండా చేయటం to be marooned కరీంనగర్ జిల్లా వేములవాడ పాత తాలూకా నిన్నటి భారీవర్షాలకు జల దిగ్బంధంలో చిక్కుకు పోయింది. (ఆం. ప్ర 24 8 89)

**జల ప్రవేశం చేయు** క్రి. *jala praveeśam ceeyu* నౌకలను, జలాంతర్గాములను కొత్తగా నీటిలోకి దింపు to commission (ships, submarines etc.) పూర్తి స్వదేశీ పరిజ్ఞానంతో నిర్మించిన మొట్టమొదటి జలాంతర్గామి 'ఐ. ఎన్ ఎస్. శాల్కి' నేడు ఇక్కడి జల ప్రవేశం చేసింది. (ఆం. ప్ర 1 10 89)

**జలమయం అగు** క్రి. *jalamayam agu* (ఏదైనా ప్రాంతం) పూర్తిగా నీటితో నిండిపోవు be submerged under water ... వరదల వల్ల సింగూరు ప్రాంతంలో పల్లపు ప్రాంతాలు జలమయం కావడంతో ... (ఆం. ప్ర 25.7 89)

**జలవిద్యుత్** వి. *jalavidyut* నీటి ద్వారా ఉత్పత్తి అయ్యే విద్యుత్తు power generated by a hydro-electric station రాష్ట్ర ప్రభుత్వం పూర్తిగా జల విద్యుత్ పైనే ఆధారపడటం వల్ల ఈ దుస్థితి ఏర్పడిందని ఆయన విమర్శించారు. (ఆం ప్ర 3 5.89)

**జలసంఘం** వి. *jalasangham* జాతీయ స్థాయిలో దేశంలోని నీటివనరుల యాజమాన్యంపై అధికారంగల కమిటీ water commission కర్నూలు జిల్లాకు చెందిన వరదరాజ స్వామి ప్రాజెక్టుకు కేంద్ర జల సంఘం ఏప్రిల్ 12 వ తేదీన అనుమతి ఇచ్చింది. (ఉ. 19 4.88)

**జలస్థాపితం అగు** క్రి. *jalasthaapitam agu* నీటి అడుగు భాగాన కూరుకుపోవు; జల సమాధి అగు to be drowned మాల్దీవుల దురాక్రమణకు విఫల యత్నం చేసిన కిరాయి సైనికుల పడవ ప్రోగ్రెస్ లైట్ సముద్ర గర్భంలో జలస్థాపితం అయింది. (ఆం జ్యో. 8 11 88)

**జలాంతర్గామి** వి. *jalaantargaami* సముద్ర జలాల లోపల పయనించగల నౌకా బలంలోని యాంత్రిక నౌక submarine స్వీడన్‌లోని ఒక సంస్థ సాంకేతికంగా ఇంత కంటే మంచి జలాంతర్గాములను తయారు చేసింది. (ఆం. ప్ర. 18 5 89)

**జలాశయం** వి. *jalaaśayam* నదులకు ఆనకట్టలు కట్టి నీరు నిల్వ చేసిన ప్రాంతం

reservoir సాగర్ జలాశయం పూర్తి నీటి మట్టం 590 అడుగులు కాగా, ఇప్పుడు 536 అడుగుల వరకే నీరు ఉంది. (ఉ 6 10 87)

**జవహర్ రోజ్‌గార్ యోజన** వి. *javahar roojgaar yoojana* పంచాయితీ పరిధులలోని పేదప్రజల అభ్యున్నతికీ, ఉపాధికల్పనకూ ఉద్దేశించి ప్రవేశపెట్టిన పథకం. (కేంద్రం నుంచి నేరుగా నిధులు అందించటం ఈ పథకం ప్రత్యేకత) a development programme for the villages by which the central govt. sanctions funds directly to the village councils 2630 కోట్ల రూపాయలు ఖర్చుకాగల గ్రామీణ ఉపాధి పథకం 'జవహర్ రోజ్‌గార్ యోజన' ను పంచాయితీల ద్వారా అమలు పరుస్తామని, ప్రతి కుటుంబంలో ఒకరికి ఉపాధి కల్పించగలమని అన్నారు. (ఆం భూ. 11 8.89)

**జవాబుదారీ** వి. *javaabudaarii* బాధ్యత వహించటం being responsible ప్రధాన మంత్రి ప్రజలకే జవాబుదారీ అని, ప్రతిపక్షానికి కాదని ... వ్యాఖ్యానించారు. (ఆం. ప్ర. 25 7 89)

**జాగీరు** వి. *jaagiiru* ఒక వ్యక్తి సంపూర్ణాధికారాలు కలిగి, హక్కుభుక్తంగా అనుభవిస్తున్న కొంత ప్రాంతం estate రాష్ట్రం ఎవరి జాగీరూ కాదు. (ఈ 28 11.89)

**జాగృతం చేయు** క్రి. *jaagRtam ceeyu* ఒక విషయాన్ని గురించి సమాజంలో విచక్షణా జ్ఞానం కలిగించు; మేల్కొలుపు to awaken, make the people aware of sth ఇటువంటి దురాచారాలను అరికట్టుటలో సాంఘిక సేవాసంస్థలు, ఇతర వర్గాలవారు ప్రభుత్వానికి సహాయపడి ప్రజలను జాగృతం చేయుటలో కృషి జరపాలన్నారు. (ఆం ప. 24 9.87)

**జాతా** వి. *jaataa* నిర్దిష్ట రాజకీయ, సామాజికాది కార్యక్రమాల్లో పాల్గొనడానికి ఊరేగింపుగా కదిలే వ్యక్తుల బృందం team, band రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలోని అమరవీరుల స్థూపాల నుండి బయలుదేరి వస్తున్న జాతాలు, ప్రచార దళాలు నవంబర్ 2వ తేదీకి ... తారనాక చౌరస్తాకు చేరాలి. (విశా 28 10 87)

**జాతిద్వయ వాదం** వి. *jaatidvaya vaadam* (హిందూ-ముస్లిం) రెండు మతాలకు చెందిన వారికి విడివిడిగా దేశాలను ఏర్పరచాలన్న ప్రతిపాదన; ద్విజాతి సిద్ధాంతం two-nation theory ఒక వైపు మహమ్మదాలీ జిన్నా జాతి ద్వయ వాదాన్ని పురస్కరించుకొని .. (ఆం జ్యో 21 1.88)

**జాతిపిత** వి. *jaatipita* దేశ ప్రజలకు ఆదర్శప్రాయమైన తండ్రి వంటి వ్యక్తి; గాంధీ father of the nation జాతిపితకు నివాళి. (ఆం. ప్ర. 3 10.87)

**జాతి వివక్ష** వి. *jaati vivakSa* తోటి జాతులను తక్కువగా చూడటం racial segregation, apartheid అమెరికాలోని నల్ల జాతీయులు నిరుపేదలుగా ఉండటానికి జాతి వివక్షే కారణమని జాతీయ పరిశోధనా మండలి స్పష్టం చేసింది. (ఆం ప్ర 29 8 89)

**జాతివెలి విధానం** వి. *jaativeli vidhaanam* చూ. జాతి వివక్ష. 'జాతి వెలి విధానం అమలుకు మరోతూరి ధ్రువీకరణ పొందిన బోధా ప్రభుత్వం' ... (ప్రజా 5.6.87)

**జాతివ్యతిరేక శక్తి** వి. *jaativyatireeka śakti* దేశ ప్రయోజనాలకు భంగక

రంగా ప్రవర్తించే వ్యక్తి anti-national elements మత విలువలు హరించిపోయే ప్రమాదం ఎదురవుతున్నదనీ, ఈ ధోరణి ఇలాగే కొనసాగితే జాతివ్యతిరేక శక్తులు లాభ పడతాయని ప్రధాని హెచ్చరించారు. (ఆం. భూ 10 7 87)

**జాతి సంక్షోభం** వి. *jaati Sanksoobham* దేశంలోని జాతుల మధ్య సంఘర్షణ ఫలితంగా ఏర్పడిన విపత్కర పరిస్థితి, పో. చూ. జాతి సమస్య ethnic crisis శ్రీలంక జాతి సంక్షోభానికి పరిష్కారం కనుగొనేందుకు ... (ఈ. 5.6 87)

**జాతి సమస్య** వి. *jaati samasya* దేశంలో భిన్నజాతుల మధ్య చెలరేగే వివాదం ethnic problem జాతి సమస్యల పరిష్కారానికి శ్రీలంక ప్రభుత్వం చేసిన తాజా ప్రతిపాదనపట్ల ... హర్షం వ్యక్తం చేసింది. (ఈ. 22 7 87)

**జాతీయ అవార్డు** వి. *jaatiiya avaarDu* దేశ స్థాయిలో ఏదో ఒక రంగంలో ప్రత్యేక కృషి చేసిన వ్యక్తులకు ఇచ్చే బహుమతి లేదా గుర్తింపు national award ... ఇద్దరు శాస్త్రవేత్తలకు జాతీయ అవార్డులను సంఘం అధ్యక్షుడు డాక్టరు ఎ. పి. మిత్ర గురువారంనాడు బహూకరించారు. (ఈ. 1 1 88)

**జాతీయ ఈక్విటీ నిధి** వి. *jaatiiya iikviTii nidhi* కేంద్ర ప్రభుత్వం వారు ఆర్థికంగా వెనుకబడిన బలహీన వర్గాలవారికీ, మధ్య తరగతివారికీ చిన్న చిన్న పరిశ్రమలు నెలకొల్పి నడుపుకోడానికి వీలుగా జాతీయస్థాయిలో ఏర్పాటుచేసిన స్థిరమైన వడ్డీలేని నిధి national equity fund ఆర్థికంగా బలహీనవర్గాలు, మధ్యతరగతివారు లఘుపరిశ్రమలు స్థాపించడానికి వీలుగా జాతీయ ఈక్విటీ నిధి నెలకొల్పు తున్నట్టు ... ప్రకటించారు. (ఆం ప 5.7 87)

**జాతీయకరణ** వి. *jaatiiyakaraNa* ప్రయివేటు వ్యక్తుల అధీనంలోని సంస్థలను ప్రభుత్వ అధీనంలోకి తీసుకురావటం nationalisation విజయవాడ సిటీబస్‌లు మొత్తం జాతీయకరణపై అడిగిన ఒక ప్రశ్నకు జవాబుగా గ్రామీణ ప్రాంతాలలో జాతీయకరణ పూర్తి అయ్యాకనే ... (విశా 8.6 87)

**జాతీయగీతం** వి. *jaatiiyagiitam* దేశభక్తిపూరితమై అధికారికంగా గుర్తింపబడిన గేయం national anthem *1950 జనవరి 24 వతేదీన జరిగిన రాజ్యాంగ సభ సమావేశంలో డాక్టర్ రాజేంద్రప్రసాద్ చే 'జనగణమన' గీతం జాతీయగీతంగా ప్రకటితమైంది.* (ఆం జ్యో 26.1 88)

**జాతీయ చిహ్నం** వి. *jaatiiya cihnam* ఒక దేశపు చారిత్రక, సాంస్కృతిక వారసత్వానికి ప్రతిబింబంగా ప్రభుత్వం ప్రకటించిన గుర్తు national symbol భారత జాతీయ చిహ్నాలలో 'జాతీయ గీతం' ఒకటి. (ఆం జ్యో 26 1 88)

**జాతీయ జీవన స్రవంతి** వి. *jaatiiya jiivana sravanti* దేశమంతటా ప్రజల ఆమోదంతో సాగే జీవిత విధానం national main stream అస్సాం, మిజోరం, పంజాబ్‌లు క్రమంగా జాతీయ జీవన స్రవంతిలోకి తిరిగి వస్తున్నాయని ఆయన అన్నారు. (విశా. 8 6 87)

**జాతీయ టెలివిజన్** వి. *jaatiiya Telivijan* ప్రభుత్వం అధీనంలో ఉండి దేశవ్యాప్తంగా ప్రసారం కలిగిన దూరదర్శన్ వ్యవస్థ national television ... అత్యవసర

సమావేశం అనంతరం జాతీయ టెలివిజన్ ఆయన నిర్ణయాన్ని ప్రకటించింది. (ఆం ప్ర 26.4 89)

**జాతీయతాభావం** వి. *jaatiiyataa bhaavam* స్వదేశం పట్ల, దేశ సాంస్కృతిక ఐక్యత పట్ల అభిమానం national spirit అయితే జాతీయతాభావం అత్యధికంగా ఉండే ఫ్రెంచి వారికి ... (ఈ 26.6 87)

**జాతీయ పత్రిక** వి. *jaatiiya patrika* దేశ వ్యాప్తంగా ప్రచారంలో ఉండే వార్తా పత్రిక national daily స్థానిక పత్రికలను, జాతీయ పత్రికలను విభజించాలని ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలను జర్నలిస్టులు భగ్నం చేశారు. (ఆం ప్ర 4 7 89)

**జాతీయ పార్కు** వి. *jaatiiya paarku* దేశస్థాయిలో ప్రకృతి సౌందర్యాన్ని పరిరక్షించడానికి ప్రభుత్వ పర్యవేక్షణలో ఏర్పాటు చేయబడిన ఉద్యానవనం national park లక్ష ఎకరాలలో జాతీయ పార్కు. (ఆంజ్యో 2.10 87)

**జాతీయ పోటీ** వి. *jaatiiya pooTii* దేశ స్థాయిలో ఎంపికైన ఆటగాళ్ళ మధ్య జరిగే ఆటలపోటీ national tournament ఒక జాతీయ పోటీలో ఆడుతున్న మొహీందర్ అమర్‌నాథ్ బాగా రాణిస్తే అతన్ని టెస్టు జట్టుకు ఎంపిక చేయవలసి వస్తుందని ... (ఈ. 18 8.89)

**జాతీయ ప్రత్యామ్నాయం** వి. *jaatiiya pratyaamnaayam* దేశ స్థాయిలో అధికారంలో ఉన్న పార్టీ స్థానాన్ని ఆక్రమించగల సత్తావున్న పార్టీ(లు) national alternative ... ప్రజాతంత్ర పార్టీలు, శక్తులు జాతీయ ప్రత్యామ్నాయాన్ని యివ్వవలసిన ఆవశ్యకత ఈనాడు ఉన్నదని కార్యవర్గం తెలిపింది. (విశా. 20 6 87)

**జాతీయ బులెటిన్** వి. *jaatiiya buleTin* దేశ మంతటా ప్రసారమయ్యే ఆకాశవాణి, దూరదర్శన్‌ల వార్తాప్రసార కార్యక్రమం national bulletin గత ఆరునెలల్లో ప్రతిపక్షాలకు సంబంధించి 4992 లైన్లను, అధికార పార్టీకి సంబంధించి 3124 లైన్లను ఆకాశ వాణి ఇంగ్లీషు జాతీయబులెటిన్‌లో ప్రసారం చేసినట్టు ఆయన తెలిపారు. (ఈ. 6 7 89)

**జాతీయ మండలి** వి. *jaatiiya manDali* జాతీయ స్థాయిలో రాజకీయ పార్టీ విధానాలనూ, కార్యక్రమాలనూ రూపొందించే సంఘం national council సి. పి. ఐ. జాతీయ మండలి ఐదురోజుల సమావేశం ముగింపు సందర్భంగా ఒక తీర్మానాన్ని ఆమోదిస్తూ ... (ఉ 24 4 88)

**జాతీయ రహదారి** వి. *jaatiiya rahadaari* కేంద్ర ప్రభుత్వ అజమాయిషీలో ఉన్న ప్రధాన మార్గం national high-way జాతీయ రహదారిపై విజయవాడ నుండి హైదరాబాద్ వెళ్తున్న రోడ్డు రవాణా సంస్థ బస్సు అదుపు తప్పి రోడ్డు ప్రక్కన గోతిలో పడటం ... (ఆం జ్యో. 11.6.87)

**జాతీయ లక్ష్యం** వి. *jaatiiya lakSyam* దేశస్థాయిలో ఉత్పత్తి రంగాలకు సంబంధించి సాధించాలనుకున్న పరిమాణం national target ... కోళ్ళ పెంపకానికి ప్రభుత్వం జాతీయ లక్ష్యాలు నిర్ణయించి, దీని అభివృద్ధికి మార్గ దర్శకత్వం వహించడం అవసరమని ... సూచించింది. (ఈ. 4.7 89)

**జాతీయ వాటర్ గ్రిడ్** వి. *jaatiiya vaaTar griD* దేశ వ్యాప్తంగా నదీజ

లాల పంపిణీ వ్యవస్థ national water grid స్వర్గీయ డాక్టర్ కె. ఎల్. రావు సూచించిన 'జాతీయ వాటర్ గ్రిడ్'ను నెల కొల్పే విషయాన్ని కొందరు లోకసభ సభ్యులు ప్రస్తావించినందుకు ... హర్షం వ్యక్తం చేశారు. (ఆం ప 20 8 87)

**జాతీయ వార్తాసంస్థ** వి. *jaatiiyai vaartaasamstha* దేశ స్థాయిలో వార్తా సేక రణ జరిపి, వార్తా పత్రికలకూ, సమాచార కేంద్రాలకు అందించే వ్యవస్థ national news agency ... కాని ఇప్పుడు బోఫోర్స్ భారతదేశానికి సమాచారం అందజే యక తప్పదని స్వీడన్ జాతీయ వార్తా సంస్థ ప్రతినిధి తెలిపారు. (ఆం. జ్యో 20 6 87)

**జాతీయ సదస్సు** వి. *jaatiiya sadassu* (సమస్యలపై, ప్రత్యేక విషయాలపై) దేశ స్థాయిలో జరిగే గోష్ఠి national seminar జనమోర్చా మొదటి వార్షిక జాతీయ సదస్సులో పై మేరకు ఒక తీర్మానం ఆమోదించారు. (ఆం. ప్ర 3 10.88)

**జాతీయ సమగ్రతామండలి** వి. *jaatiiya samagrataamanDali* దేశ సమగ్రత, సమైక్యతలను కాపాడే లక్ష్యంతో వివిధ రంగాల ప్రముఖులతో ఏర్పాటైన సంస్థ national integration council దేశంలో మతతత్వ వైరస్ వ్యాపిస్తోందని, ఇది ప్రజాస్వామ్యానికి పెద్ద ప్రమాదమన్న సభ్యుల అభిప్రాయాన్ని అంగీకరిస్తూ ... ఒక అధికార తీర్మానాన్ని ప్రవేశపెడతామని ... తర్వాత దీన్ని జాతీయ సమగ్రతా మండలి ఎదుట పెడతామని, అవసరమైన చర్యలను మండలి చేపడుతుందనీ తెలిపారు. (ఆం. భూ 9 5 89)

**జాతీయ సమస్య** వి. *jaatiiya samasya* దేశానికి సంబంధించిన వివాదాస్పదమైన అంశం national issue వరకట్నం, సతీ దురాచారం వంటి సమస్యలు స్త్రీల సమస్యలు మాత్రమే కాదని, వాటిని జాతీయ సమస్య లుగా భావించాలని ... పేర్కొన్నారు. (విశా. 24 11.87)

**జాతీయాదాయం** వి. *jaatiiyaadaayam* దేశవ్యాప్తంగా ఒక సంవత్సరకాలంలో వచ్చిన రాబడి national income 1986-87 సంవత్సరంలో మొత్తం జాతీయా దాయం 1, 43, 935 కోట్ల రూపాయ లని ... వివరాలతో పేర్కొన్నారు. (ఆం. భూ 19.2 88)

**జాతీయోత్పత్తి** వి. *jaatiiyootpatti* దేశ వ్యాప్తంగా మొత్తం తయారయిన సంపద national production వర్తమాన ధరలలో, నికర జాతీయోత్పత్తిలో ఈ డిపా జిట్ల నిష్పత్తి కూడా ... పెరగడం గమనార్హం. (ఆం ప్ర. 21 4.88)

**జాతుల వివాదం** వి. *jaatula vivaadam* ఒకే దేశంలో భిన్న సంస్కృతి సంప్రదాయాలకు చెందిన ప్రజాసముదా యాల మధ్య చెలరేగిన ఘర్షణ ethnic conflict జాతుల వివాదం పరిష్కారంలో న్యూఢిల్లీ ప్రధాన భూమిక వహించాలని జయ వర్ధనే ప్రభుత్వం కూడా అంగీకరించింది. (ఈ సం 5 6 87)

**జాప్యంచేయు** క్రి. *jaapyamceeyu* కావా లని ఆలస్యం చేయు to delay సంతకం చేయడంలో గవర్నర్ జాప్యం చేయవచ్చునేమో (ఆం జ్యో 29 11.88)

**జాబితా** వి. *jaabitaa* ఒకే అంశం కింద చేర్చదగిన వాటిని, ఒక నిర్ణీత క్రమంలో రాసిన పట్టిక list మేధావుల సమావేశానికి ఆహ్వానించే వారి జాబితాను నేటి మధ్యాహ్నం ఖరారు చేశారు. (ఆం జ్యో 16 10 87)

**జారవిడుచు** క్రి. *jaaraviDucu* (అవకాశాలను, వస్తువులను) వదలివేయు to lose, drop ... ఆ రిటర్న్ క్యాచ్‌ని మెక్‌డెర్మొట్ జారవిడిచాడు. (ఆం జ్యో 30.1 88)

**జారిపోవు** క్రి. *jaaripoovu* పట్టునుంచి తప్పిపోవు to slip away రాజ్యసభ ఎన్నికల్లో ఎమ్మెల్యేలు జారిపోకుండా ఉండటానికి ముందుజాగ్రత్త చర్యగా భద్రాచలం క్యాంపుకు తీసుకెళ్ళాలని ... నిర్ణయించింది. (ఈ 23 3.88)

**జారీచేయు** క్రి. *jaariiceeyu* ఉత్తర్వులు, ప్రకటనలు అధికారికంగా వెలువరించు; విడుదల చేయు to issue డీలర్ షిప్పుల నియామకాన్ని మంత్రులకు అప్పగిస్తూ ఈ నెల ఐదో తేదీన రాష్ట్ర ప్రభుత్వ ఆహార, వ్యవసాయశాఖ 300 నెంబర్ జి. వో. జారీచేసింది (ఈ 12 5 89)

**జిమ్మిక్కు** వి. *jimmikku* (రాజకీయంగా) ఇతరులను ఆకర్షించడానికి వేసే ఎత్తుగడ gimmick రాజకీయ జిమ్మిక్కులు, ఉత్తుత్తి హామీలు తప్ప, చేశామని చెప్పుకునేందుకు రాష్ట్ర ప్రభుత్వానికి ఏమీ లేదని ఆయన విమర్శించారు. (ఆం భూ 21.4 89)

**జిల్లా రిక్రూట్‌మెంట్ బోర్డు** వి. *jillaa rikruuTmenT boorDu* జిల్లా స్థాయిలో నియామకాలను నిర్వహించే సంస్థ district recruitment board ... ప్రతిభ, యోగ్యత కలవారినే నియమించాలని, దీనికోసం జిల్లా రిక్రూట్‌మెంట్ బోర్డులు ఏర్పాటు చేయాలని ... రాష్ట్ర ప్రభుత్వానికి సిఫార్స్ చేసింది. (ఉ 6 10 87)

**జీతభత్యాలు** వి. (బ.వ.) *jiitabhatyaalu* నెలవారీ పనిచేసే ఉద్యోగులకు ఇచ్చే వేతనం, ఇతర అలవెన్సులు pay and allowances మున్సిపల్ సిబ్బంది జీతభత్యాలకు అవసరమైన నిధులను ప్రభుత్వమే సమకూర్చాలని ... కోరింది (ఆం. జ్యో 5.6 87)

**జీరోఅవర్** వి. *jiirooavar* చట్టసభల ఎజెండాలో లేని ప్రశ్నలను సభ్యులు లేవనెత్తే సమయం (ప్రశ్నోత్తరాల సమయం కాగానే సభ్యులు సభాదృష్టికి తెచ్చేందుకు తాజా సమస్యలపై ప్రశ్నలు వేసే సమయం) zero-hour లోక్‌సభలో మంగళవారం సీనియర్ ప్రతిపక్షనాయకులు జీరోఅవర్‌లో తీవ్ర నిరసన వ్యక్తంచేశారు. (ఈ. 10.5.89)

**జీవంపోయు** క్రి. *jiivampooyu* క్షీణ దశలో ఉన్న దానిని బతికించు; ప్రాణం పోయు to give life, to revitalise ఎనిమిదేళ్ళుగా వరుసగా చాంపియన్‌షిప్‌ను గెలుస్తూవస్తున్న సయ్యద్‌మోడితో పాటు ... విమల్ కుమార్, మనోజ్ కుమారులు భారత బ్యాడ్మింటన్‌కు జీవం పోస్తున్నారు. (ఆం జ్యో 4 3 88)

**జీవనప్రమాణం** వి. *jiivanapramaaNam* నిత్యజీవితావసర వస్తువులను కొనగల స్తోమత standard of living ... నిరుపేదల జీవన ప్రమాణాలను మార్చగల పోరాటాలను సాగించడం ద్వారా తమ పార్టీ చరిత్ర గతిని మార్చగలదని శ్రీ సింగ్ అన్నారు. (ఆం. ప్ర. 12.10.88)

**జీవనవ్యయం** వి. *jiivanavyayam* నిత్యజీవితావసర వస్తువుల కొనుగోలుకయ్యే ఖర్చు cost of living ... పడిపోతున్న రూపాయి విలువ, పెరుగుతున్న జీవన వ్యయం నడుమ పట్టణాల్లో 510 రూపాయల కనీస వేతనంలో కార్మికులు ఎలా జీవించగలరని ఆయన ప్రశ్నించారు. (ఆం. ప్ర. 21 8 89)

**జీవనస్థాయి** వి. *jiivanasthaayi* చూ.

జీవనప్రమాణం ... పరిశ్రమలు నెలకొల్పి నప్పుడు ఉద్యోగాలు దొరుకుతాయని జీవన స్థాయి మెరుగు పడుతుందని సంతోషించిన ప్రజలకు ... (ఆం ప్ర 6 6 87)

**జీవనోపాధి** వి. *jiivanoopaadhi* జీవించడానికి ఆధారంగా ఉన్న వృత్తి; జీవనాధారం source of lively-hood రాష్ట్రం లోని దేవాదాయశాఖకు చెందిన భూములను బహిరంగ వేలం వేసేందుకు ప్రభుత్వం నిర్ణయించడంవల్ల తరతరాలుగా వాటిని సాగు చేస్తున్న లక్షలాది పేదరైతులు జీవనోపాధి కోల్పోతారని ... ఆందోళన వ్యక్తం చేశారు. (ఈ. 5 6.87)

**జీవితఖైదు** వి. *jiivitakhaidu* తీవ్రనేరాలకుగాను, జీవితాంతం చెరసాలలోనే గడపాలనే శిక్ష life imprisonment ... దొంగిలించారన్న నేరంపై ఇద్దరు పుచ్చకాయలమ్ముకొనే వర్తకులకు చైనా కోర్టు జీవితఖైదు విధించింది. (ఉ 15 6 87)

**జుడిషియల్ కస్టడీ** వి. *juDiSiyal kasTaDii* ప్రాథమిక దర్యాప్తు నివేదిక (యఫ్. ఐ. ఆర్.) ఆధారంగా నిందితులను కొద్ది కాలం చెరసాలలో ఉంచాల్సిందిగా కోర్టు విధించే తాత్కాలిక శిక్ష (సాక్ష్య సేకరణకూ, ఛార్జిషీటు తయారీకి నిందితులు ఇలా నిర్బంధంలో ఉండటం తోడ్పడుతుంది judicial custody నిజామాబాద్ ఒకటవ పోలీస్ స్టేషన్‌కు చెందిన ఆ ఇద్దరు కానిస్టేబుళ్ళను మిగిలిన ఐదుగురు నిందితులను జుడిషియల్ కస్టడీ లో ఉంచారు. (ఆం. భూ 6 7.89)

**జులాయి** వి. *julaayi* పోకిరిగా తిరిగే వ్యక్తి vagabond, vagrant బాల్యం లోనే జులాయిగా దేశదిమ్మరిగా తిరుగుతూ చిల్లర మల్లరనేరాలు చేసినవార్తై ఉంటారు. (ఆం భూ 18 5 89)

**జులుం** వి. *julum* అధికారాన్ని ఆసరాగా చేసుకొని ఇతరులపై విచక్షణారహితంగా సాగించే క్రూరపెత్తనం rudeness, atrocious behaviour పోలీసులు జులుంపై సవివరంగా రాష్ట్ర గవర్నర్‌కు ఒక వినతి పత్రం సమర్పించామని ... తెలిపారు. (ఈ. 5 6 87)

**జైత్రయాత్ర** వి. *jaitrayaatra* విజయోత్సాహంతో చేసే పర్యటన tour of victory ఈ నెల 11వ తేదీ నుంచి మంత్రుల 'జైత్రయాత్ర'లు ప్రారంభించాలని సూత్రప్రాయంగా నిర్ణయించారు. (ఆం ప్ర 4 10 89)

**జైల్ భరో** వి. *jailbharoo* నిరసన వ్యక్తం చేయడానికి తమంత తాముగా అధిక సంఖ్యలో అరెస్టు అయి చెరసాలను నింపటం to court arrest in large numbers and fill the jails (to register their protest) గత మూడు రోజులుగా నిరవధికంగా సమ్మె జరుపుతున్న ఆటో డ్రైవర్లు బుధవారంనాడు 'జైల్ భరో' ఆందోళన చేపట్టారు. (ఆం. జ్యో 25 6 87)

**జోక్యం** వి. *jookyam* ఒకరి వ్యవహారాలలో మరొకరు కల్పించుకోవటం intervention ఆఫ్ఘనిస్తాన్‌లో సోవియట్ జోక్యం విషయంలో భారతదేశం మౌనం వహించిందన్న వాదనను ఆయన ఖండించారు. (ఆం. ప్ర. 14 2.89)

**జోక్యంచేసుకొను** క్రి. *jookyam ceesukonu* కలగజేసుకొను to interfere ఆ సమయానికి అక్కడే ఉన్న ఓ హోంగార్డు, ఓ కానిస్టేబులు, దాడిచేసినవారు మహిళలు గనుక జోక్యంచేసుకోలేకపోయారు. (ఆం. ప్ర.

4 12 87)

**జోడించు** క్రి. *jooDincu* అంతకుముందున్న దానికి మరికొంత జతచేయు; కలుపు to add స్మాల్, కుక్‌లు తొమ్మిదో వికెట్‌కు 73 పరుగులు జోడించారు. (ఈ. 29 5 89)

**జోడు పదవులు** వి. *jooDu padavulu* ఒకే పర్యాయం నిర్వహించే రెండు పదవులు two positions మంత్రులు, శాసన సభ్యులు జోడుపదవులను నిర్వహిస్తారా లేదా అనే విషయాన్ని ఆయన స్పష్టం చేయలేదు. (ఆం ప్ర 8 4 88)

**జోస్యంచెప్పు** క్రి. *joosyamceppu* జరగబోయే దానిని ముందుగా చెప్పు to foretell ... ఆధ్వర్యంలోని సమాఖ్య గనుక అధికారంలోకి వస్తే కనీసం 28రోజులు కూడా నిలవలేదని ... జోస్యం చెప్పారు. (ఉ 9 6 87)

**జ్ఞానపీఠ్ పురస్కారం** వి. *jnaanapiiTh puraskaaram* ఏదైనా ఒక భారతీయ భాషలో విశేష కృషిసల్పి విశిష్టమైన రచనలు చేసిన వారికి జాతీయ స్థాయిలో ఎంపిక చేసి అందిచే నగదు బహుమతి jnanapith award ప్రముఖ రచయిత హరీష్‌నావల్ హాస్యరచనలకు ఈ ఏడాది భారతీయ జ్ఞానపీఠ్ అవార్డు లభించింది. (ఈ 9 10 87)

**జ్ఞాపిక** వి. *jnaapika* ప్రత్యేక సందర్భాలలో గుర్తుగా యిచ్చే బహుమతి; మెమెంటో memento రచయిత శ్రీ కృష్ణమూర్తిని మంత్రి శాలువ కప్పి జ్ఞాపికతో సత్కరించారు. (ఆం ప్ర. 10 5.89)

**జ్యుడిషియల్ కమీషన్** వి. *jyuDiiSiyal kamiiSan* న్యాయమూర్తులతో కూడిన విచారణ సంఘం judicial commission వివాదస్పదమైన ప్రతివిషయానికి విచారణ నిమిత్తం జ్యుడిషియల్ కమీషన్లను నియమించే పద్ధతిని రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్ విమర్శించారు. (ఉ 2.7.87)

## ట

**టన్ను** వి. *Tannu* వెయ్యి కిలోలకు సమానమైన తూకం లేదా బరువు tonne (a thousand kilograms) ఇందులో 25 లక్షల టన్నుల బియ్యం ప్రజా పంపిణీ కింద సేకరిస్తున్నారని తెలిపారు. (ఆం ప్ర 27 4.88)

**టర్నోవర్ పన్ను** వి. *Tarnoovar pannu* ఒక నిర్ణీత కాలంలో అమ్మిన సరుకుల విలువ మొత్తంపై విధించే సుంకం turn over tax కేరళ బడ్జెట్‌లో ప్రతిపాదించిన టర్నోవర్ పన్ను నుంచి పెట్రోల్, డీజిల్, కిరోసిన్, ఎరువులు ఈ నాలుగు సరుకులను రాష్ట్ర ప్రభుత్వం నేడు మినహాయించింది. (ఆం ప్ర 8 10 87)

**టాంటాంచేయు** క్రి. *TaamTaamceeyu* ఇతరుల విషయాలను అవసరం ఉన్నా లేకపోయినా అందరికీ తెలిసేలా దురుద్దేశంతో ప్రచారం చేయు to make a private thing public నా జుట్టు తెల్లబడిందని నువ్వేం ఊరంబడి పడి టాంటాం చేయనక్కరలేదు. (ఈ. అను. 13 3 88)

**టాడా** వి. *TaaDaa* ఉగ్రవాద దౌర్జన్యకర చర్యలను అరికట్టే చట్టం terrorist and disruptive Act ఉగ్రవాద విచ్ఛిన్నకర శక్తుల నిరోధక చట్టం (టాడా) 1987ను మరి రెండేళ్ల పాటు పొడిగించే తీర్మానాన్ని పార్లమెంట్ గురువారంనాడు ఆమోదించింది. (ఆం. భూ 12.5 89)

**టాస్** వి. *Taas* ఒక నాణెం ఎగురవేసి కింద

పడ్డ బొమ్మబొరుసుల ప్రకారం నిర్ణయం తీసుకోవటం (ముఖ్యంగా ఆటల్లో రెండు జట్లలో ఎవరు ప్రారంభించాలో నిర్ణయిం చేందుకు ఉపయోగిస్తారు.) toss వెస్టిం డీస్ జట్టు 'టాస్' గెలిచి భారత జట్టును బ్యాట్ చేయమంది. (ఆం ప్ర 17.10 89)

టాస్క్ ఫోర్స్ వి. *Taask foors* నిర్దిష్టమైన చట్టవ్యతిరేక కార్యకలాపాలను అణచివేయ టానికి ప్రత్యేకంగా నియమించిన పోలీసు దళం taskforce పది హేనురోజుల పాటు టాస్క్ ఫోర్స్ దాడులు జరిపి ఈ ఫలితాలు చూపించింది. (ఈ. అను 27.5 89)

టికెట్ వి. *TikeT* ఎన్నికలలో నిలబడేం దుకు రాజకీయ పార్టీ తమ అభ్యర్థికిచ్చే అనుమతి ticket సమాచారశాఖ మంత్రి శ్రీ కె. వివేకానందకు తిరిగి గోపాలపురం అసెంబ్లీ స్థానానికి టికెట్టు లభించింది. (ఆం ప్ర. 2 11 89)

టీకా వి. *Tiikaa* కలరా, మశూచి మొ. అంటువ్యాధులు సోకకుండా ముందుగా ఇచ్చే సూది మందు vaccination వరద ప్రాంతాలలో కలరా వంటి వ్యాధులు ప్రబ లకుండాను, బాధితులకు అంటువ్యాధులు సోకకుండా నిరోధానికి టీకాలు ఇవ్వడానికి ... అనేక వైద్య బృందాలు బయలుదేరి వెళ్ళాయి. (ఆం ప్ర. 25 7 89)

టూల్ డౌన్ సమ్మె వి. *Tuul Daun samme* హరాత్సంఘటనలకు ప్రతిస్పంద నగా కర్మాగారాల్లో పనినిలిపి వేయటం ద్వారా తెలిపే నిరసన tool down strike సికింద్రాబాద్ ఎం. సి. హెచ్ విభాగంలోని పారిశుద్ధ్య సిబ్బంది, ఎల్. ఆర్. జి. లు బుధవారం ఒకరోజు టూల్ డౌన్ సమ్మె చేశారు. (ఈ. అను 7 9 89)

టెండర్ ఓటు వి. *TenDar ooTu* ఓటరు తన పేర ముందే ఎవరో ఓటింగు చేసి నట్లు నచ్చచెబితే అతనికి ఎన్నికల అధికారి ఇచ్చే మరో బ్యాలెట్ tender vote ... మీ ఓటును అప్పుడే ఎవరోవేసి వెళ్ళా రని, మీ ఓటును మీరు వేయలేదని అక్కడి పోలింగ్ అధికారిని ఒప్పించగలిగితే మీరు టెండర్ బ్యాలెట్ ద్వారా ఓటు హక్కును వినియోగించుకోవచ్చు. (ఈ. అను. 22 11 89)

టెక్నాలజీ బదిలీ వి. *Teknaala-jii badilii* ఆధునిక శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి చెందిన ప్రాంతం నుంచి ఇతర ప్రాంతాలకు తీసుకువెళ్ళటం transfer of technology గ్రామీణ ప్రాంతాలకు టెక్నాలజీ బదిలీపై అధ్యయనం చేసే లక్ష్యంతో మానవవనరుల అభివృద్ధి మంత్రిత్వ శాఖ జాతీయ నిపుణుల సంఘాన్ని ఏర్పాటు చేసింది. (ఈ 18 1 88)

టెక్నో ఎకనమిక్ సర్వే వి. *Teknoo ekanamik sarvee* సాంకేతిక అంశాల గురించి ఆర్థిక పరమైన ప్రయో జనాల గురించి జరిపే పరిశీలన techno-economic survey టెక్నో ఎకనమిక్ సర్వేలో సాంకేతికంగా, నదిలో సరుకు రవాణాకు గల అవకాశాలు ఆర్థికంగా ఈ జల మార్గాల వల్ల కలిగే ప్రయోజనాలు మొదలైనవాటి గురించి పరిశీలన జరుపుతారు. (ఈ 11 12 87)

టెర్మినేషన్ ఖర్చులు వి. (బ.వ.) *TermineeSan kharculu* వ్యాపార ఒప్పందా లలో సంబంధిత మధ్యవర్తులతో తెగతెం పులు చేసుకొనే సందర్భంగా చెల్లించే సొమ్ము termination charges ఇన్ని సాక్ష్యాధారాలుండి కూడా బోఫోర్స్

సంస్థ తన తాజా లేఖలో "పెర్మినే షన్ ఖర్చుల" కింద చెల్లించిన సొమ్ముకు భారతదేశం ప్రసాదించిన కాంట్రాక్టుకూ బొత్తిగా సంబంధమే లేదని ...
(ఈ 14 8.87)

**టెర్రరిజం** వి. *Terrarijam* లక్ష్యసాధన కోసం హింసా మార్గంలో ప్రయత్నించటం; హింసాత్మక విధానం terrorism జన తాదళ్ అనుబంధ సంస్థ ఒకటి చండీగడ్‌లో జరిపిన సమావేశంలో 'మోగా ఊచకోత' మృతుల కుటుంబాలకు సానుభూతి తెలప లేదని, టెర్రరిజాన్ని ఖండించలేదని రాజీవ్ విమర్శించారు. (ఈ 20 7 89)

**టెర్రరిస్టు** వి. *TerrarisTu* లక్ష్యసాధ నకోసం హింసామార్గంలో ప్రయత్నించే వాడు; ఉగ్రవాది, తీవ్రవాది terrorist వి. ఐ. పి. లను హత్యచేసి కీలక కేంద్రాలను పేల్చివేయడానికి కుట్రపన్నిన మరో ఇద్దరు టెర్రరిస్టులను ఢిల్లీ పోలీసులు అరెస్టు చేశారు. (ఈ. 5 6 87)

**టెలిఫోన్ టాపింగ్** వి. *Telifoon Taaping* టెలిఫోన్ లైనుకు ప్రత్యేక సాధనం అమర్చి ఇతరుల టెలిఫోన్ సంభా షణ రహస్యంగా వినటానికి చేసే ప్రయత్నం telephone tapping టెలిఫోన్ టాపింగ్ వివాదంతో తన కథకు చరమాంకం పాడుకున్న రామకృష్ణ హెగ్డే . . (ఆం. భూ 23.4 89)

**టెలిస్కూలు పథకం** వి *Teliskuulu pathakam* టెలివిజన్, వీడియో వంటి సాధనాల ద్వారా పిల్లలకు విద్యను బోధించే ప్రణాళిక; దృశ్య శ్రవణ విద్యా విధానం teleschool programme టెలిస్కూలు పథకం కింద నాలుగు వందల ఎనభై పాఠశాలల్లో దృశ్యశ్రవణ సాధనాలతో విద్యా బోధన ప్రారంభించామని తెలిపారు. (ఆం భూ. 1.5 89)

**టెలెక్స్ సందేశం** వి. *Teleks sandeeśam* విషయాన్ని టైపు చేయటం ద్వారా మరో చోట ఆటోమేటిక్ టైపింగ్ జరిగే టెలి ప్రింటర్ సాధనాన్ని ఉపయోగించి పంపే సమాచారం telex message చైనా ఒలింపిక్ కమిటీ అధ్యక్షులు హిజెన్ లియాంగ్ ఆసియా ఒలింపిక్ కౌన్సిల్ అధ్యక్షులు షేక్ ఫహద్‌కు ఒక టెలెక్స్ సందేశం పంపారు. (ఆం భూ 14.6 89)

**టెలెక్స్ సౌకర్యం** వి. *Teleks saukaryam* టెలిప్రింటర్ ద్వారా పరస్పరం సమా చారం, సందేశం అందించుకునే వీలు కలి గించేది telex facility చేపపిల్లల ఎగుమ తిసంఘం ఇక్కడ ఒక టెలెక్స్ సౌకర్యం ఏర్ప రచుకుంటే పశ్చిమబెంగాల్ చేపల మార్కె ట్‌లో ధరలనుబట్టి ఎగుమతులకు వీలుకలు గుతుందని ఆయన సూచించారు. (ఆం భూ. 26 4 89)

**టెస్ట్** వి. *TesT* క్రికెట్, ఫుట్‌బాల్ వంటి ఆటలపోటీలలో రెండుకాని అంతకంటె ఎక్కువగా జట్ల మధ్య (ఒకే దేశానివైనా, ఇతర దేశాలవైనా) వరుసగా ఆడే (సీరిస్) ఆటల్లో ఒక ఆట test match బొంబా యిలో రెండో టెస్టు ముగిసిన తర్వాత వెంగ్‌సర్కార్‌కు బోర్డు ఈ షోకాజ్ నోటీ స్ ఇచ్చింది. (ఆం ప్ర 11 88)

**టై** వి. *Tai* (క్రికెట్ మొ.) ఆటలలో రెండు జట్ల మధ్య ఏ ఒక్కరికీ ఆధిక్యత లేకుండా సమానమైన స్కోరు రావటంవల్ల ఆట ముగియటం tie ఇంగ్లండ్ సన్ డే లీగ్ క్రికెట్ పోటీల్లో డెర్బీషైర్ హంపషైర్ జట్ల మధ్య నిన్న జరిగిన మ్యాచ్ 'టై'గా ముగిసింది.

**టైగర్లు** వి. (బ.వ.) *Taigarlu* శ్రీలంకలో

తమిళ వేర్పాటువాదంతో తమకు ప్రత్యేక రాజ్యం కోసం హింసాత్మక చర్యలకు పూనుకునే తమిళుల ఉగ్రవాద సంస్థకు చెందినవారు tigers (L.T.T.E) భట్టి కలోవా జిల్లాలోని కతనకూడి ప్రాంతంలో తమిళ టైగర్లు జరిపిన దారుణ హింసా కాండలో ... (ఆం ప్ర. 1.1.88)

**టైటిల్** వి. *TaiTil* క్రీడారంగ పోటీలలో విజయ సంకేతంగా ఇచ్చే బిరుదు title, championship ఎ. టి. పి. ఛాంపి యన్‌షిప్ పోటీల్లో బ్రాడ్ గిల్బర్ట్ టైటిల్ సాధించాడు. (ఆం. ప్ర 22 8.89)

**టైబ్రేక్** వి. *Taibreek* టెన్నిస్‌లో రెండు జట్లకీ సమానమైన స్కోరు వచ్చినప్పుడు విజేత పక్షాన్ని నిర్ణయించటం tie break ఆ సెట్ టైబ్రేక్ అయింది. (ఆం జ్యో. 25 1.88)

**టైమింగ్** వి. *Taiming* (ఆటల పోటీలలో కానీ, ఇతర సంఘటనలలో కానీ) సమయ నిర్ణయం timing ఇక మహిళల 200 మీటర్ల బ్యాక్ స్ట్రోక్‌లో హర్యానాకు చెందిన పల్లవీదత్తా 2: 40 82 టైమింగ్‌తో గమ్యంచేరి స్వర్ణ పతకం స్వంతం చేసుకుంది. (ఆం ప్ర 2 10 89)

**టోకు ధర** వి. *Tooku dhara* పెద్ద మొత్తంలో సరుకుల అమ్మకాలు, కొను గోళ్ళు జరిపినపుడు నిర్ణయమైన వెల whole-sale price బడ్జెట్ తర్వాత నాలుగు వారాల్లో అధికారిక టోకు ధర సూచిక 1.2 శాతం పెరిగింది. (ఈ 25.4 89)

**టోర్నమెంట్** వి. *ToornamenT* వివిధ జట్ల మధ్య జరిగే ఆటల పోటీల వరుస tournment పదవ అఖిల భారత ఇన్స్టిటే షన్ బాస్కెట్‌బాల్ టోర్నమెంట్‌లో సికిం దరాబాద్‌కు చెందిన సౌత్ సెంట్రల్ రైల్వే జట్టు శనివారంనాడు చిదంబర్‌నగర్ డిస్ట్రిక్ బాస్కెట్‌బాల్ అసోసియేషన్ జట్టును ఓడిం చింది. (ఆం. భూ. 14 6 89)

**టౌన్‌షిప్** వి. *TaunSip* ఒక పరిశ్ర మకు గానీ, వృత్తికిగానీ సంబంధించిన జనం నివసించే చిన్న పట్టణ ప్రాంతం township ఆదివారం బి. హెచ్. ఇ. ఎల్.కు సెలవు అయినప్పటికీ టౌన్‌షిప్‌లో సెలవు వాతావారణంలేదు. (ఉ. 15.6.87)

**ట్రస్ట్** వి. *TrasT* ఒక వ్యక్తికోసం లేదా ఏదైనా ప్రత్యేకమైన ప్రయోజనం కోసం కొంతడబ్బుకానీ; ఆస్తికానీ ఎవరైనా ఒక వ్యక్తి పేరున లేదా సంస్థ తరపున నెల కొల్పటం; ధర్మనిధి trust తన పేరిట ఒక ట్రస్ట్ ప్రారంభించిన సంగతి చెబుతూ ఈ ట్రస్ట్ పేరిట సంవత్సరానికి ఒక చిత్రం నిర్మించడం జరుగుతోంది అన్నారు. (ఆం జ్యో. 2 10.88)

**ట్రాఫిక్ జామ్** వి. *Traafik jaam* రోడ్లు రద్దీగా ఉన్నప్పుడు లేదా ఏదైనా అవరోధం కలిగినప్పుడు వాహనాలన్నీ నిలిచిపోయి ముందుకు కదిలేందుకు వీల్లేకుండా ఏర్పడ్డ పరిస్థితి traffic jam బోట్స్ క్లబ్ వద్ద శుక్రవారం రాత్రి మలుపు తిరుగబోయిన ఒక లారీ బోల్తా పడటంతో శనివారంనాడు టాంక్ బండ్‌పై చాలసార్లు ట్రాఫిక్‌జామ్ అయింది. (ఉ. 13 7 87)

**ట్రాఫిక్ లైట్లు** వి (బ.వ.) *Traafik laiTlu* కూడలి ప్రదేశాల్లో వాహనాలను నియం త్రించటానికి ఏర్పాటు చేసే ఎరుపు, పసుపు, ఆకుపచ్చరంగుల కాంతులతో కూడిన ఆటోమాటిక్ సిగ్నల్స్ traffic lights పాడైపోయిన ట్రాఫిక్ లైట్లను బాగు చేయించడం, అవసరమైన చోట్ల మరో 30 కొత్త లైట్లను నెలకొల్పడానికి సుమారు ఒక కోటి 40 లక్షలు ఖర్చవుతుంది. (ఆం జ్యో

26 11 87)

ట్రిపుల్ జంప్ వి. *Tripul jamp* అథ్లెటిక్స్ పందాలలో వీలయినంత ఎక్కువ దూరం మూడు దూకుడులలో అంటే రెండు సార్లు చెరోకాలుతోను మూడో సారి రెండు పాదాలతోను - మొత్తం మూడు విధాలుగా దూకే పద్ధతి triple jump ట్రిపుల్ జంప్‌లో కెన్నీ హారిసన్ విజయం సాధించి స్వర్ణ పతకం గెలుచుకున్నాడు. (ఆం. ప్ర. 21 9 89)

ట్రిబ్యునల్ వి. *Tribyunal* కొన్ని రకాల సమస్యలను లేదా వివాదాలను పరిష్కరించటానికి ఏర్పాటు చేసే న్యాయధికారుల సమూహం tribunal పాత కేసులను పునః పరిశీలించాల్సిన కేసులను హైకోర్టు పరిధిలోనే ఉంచాలని ప్రత్యేక ట్రిబ్యునల్ ఏర్పాటు చేయడం వల్ల కాలయాపన తప్ప ఫలితం ఉండదని శ్రీ సమరసింహా రెడ్డి అన్నారు. (ఆం భూ 20 9 89)

ట్రెజరీ వి. *Trejarii* పన్నుల రూపంలోను, ఇంకా ఇతరత్రా ప్రజల నుండి సేకరించిన డబ్బును నిలువచేసి ఉపయోగించే ప్రభుత్వ ధనాగార విభాగం; కోశాగారం, ఖజానా treasury ప్రభుత్వం జారీ చేసిన చెక్కులకు ట్రెజరీలు డబ్బు చెల్లించడం లేదని కాంగ్రెస్ ఆరోపించింది. (ఆం ప్ర 16 6 87)

ట్రేడ్ యూనియన్ వి. *TreeD yuuniyan* ఒకే రకమైన పనిచేసే ఉద్యోగులు, కార్మికులు తమ కోర్కెల సాధనకోసం, హక్కుల పరిరక్షణకోసం ఏర్పరుచుకున్న సంఘటిత సంస్థ; కార్మిక సంఘం trade union ట్రేడ్ యూనియన్లు గనక ఎక్కువగా గొడవ పెడితే భయపడి పి.ఎఫ్. బకాయిదార్లను గురించి పోలీసులకు కంప్లయింట్ ఇస్తుందని .. (ఆం భూ 19 7 87)

## ఠ

ఠంచన్ గా క్రి వి *Thancan gaa* నిర్ణీత సమయానికి ఖచ్చితంగా exactly on time, punctually గండిపేట తెలుగు విజయంలో మధ్యాహ్నం పార్టీ సమావేశానికి యోధానుయోధులు ఠంచన్‌గా తరలి వచ్చారు. (ఈ. 10.5 89)

ఠారెత్తు క్రి. *Thaarettu* మిక్కిలి భయపడు, బెదిరి బేజారైపోవు to be afraid of ప్రధాని ప్రచారంతో ఠారెత్తిన దేశం (ఆం. భూ 20 11 89)

ఠారెత్తించు క్రి. *Thaarettincu* మిక్కిలి భయపెట్టు, బెదిరిపోవునట్లు చేయు to frighten టోన్‌టబ్స్‌ను ఠారెత్తించిన టైసన్. (ఈ 22 3 88)

## డ

డబ్బింగ్ వి. *Dabbing* ఒక భాషా చలన చిత్రాన్ని వేరొక భాషలోకి అనువదించటం dubbing ఆ చిత్రం తెలుగు డబ్బింగ్ విడుదలై ఆడింది.

డాక్యుమెంటరీ వి. *Daakyumen-Tarii* వివరణ వ్యాఖ్యతో కూడిన సమాచార చిత్రం documentary వోటర్లకు ఈ యంత్రాల పనితీరు, ఉపయోగించే విధానం తెలియ పర్చటానికి డాక్యుమెంటరీలను, వీడియో చిత్రాలను, స్లైడ్‌లను తీస్తున్నట్టు ... చెప్పారు. (ఆం భూ 23.6.89)

డాక్యుమెంటు వి. *DaakyumenTu* విలువైన (సమాచారంతో నిండిన) సాధికారికమైన పత్రం document భారత రక్షణ శాఖకు సంబంధించిన సమాచారం తెలిపే డాక్యుమెంట్లతో పాకిస్తాన్‌లో చొరబడు తుండగా వీరిద్దరిని అరెస్టు చేశారు. (ఉ 29.6 87)

డాగ్‌స్క్వాడ్ *DaagskvaaD* నేరస్థు

లను పసికట్టగల తర్ఫీదు పొందిన జాగిలాల బృందం dog squad నక్సలైట్లను అన్వేషించటంలో పోలీసు సిబ్బందికి సహకరించేందుకు "డాగ్‌స్క్వాడ్"ను ఏర్పాటు చేశారు. (ఆం భూ 14 6 89)

**డిక్లేర్ చేయు** క్రి. *Dikleer ceeyu* (క్రికెట్ ఆటలో) సంతృప్తికరమైన స్కోరు సాధించినప్పుడు, ఇంకా వికెట్లు మిగిలి ఉన్నప్పటికీ ఇన్నింగ్స్ ముగిసినట్లు కెప్టెన్ ప్రకటించు to declare (innings closed) *తొలి ఇన్నింగ్స్‌లో 6 వికెట్లకు 602 పరుగులు చేసి డిక్లేర్ చేసిన ఆస్ట్రేలియాకన్నా, ఇంగ్లాండ్ ఇంకా 356 పరుగులు వెనుకబడి ఉంది.* (ఈ 14 6 89)

**డిటెన్యూ** వి. *DiTenyuu* సామాజిక భద్రతకు ముప్పుతెస్తారన్న కారణంతో నిర్బంధంలో ఉంచబడిన వ్యక్తి detenue *జోధ్‌పూర్ డిటెన్యూలను విడుదల చేయటం, ... చర్చలు జరపటం సమస్య పరిష్కారానికి దోహదపడవచ్చు.* (ఆం ప 17 6 87)

**డిటోనేటరు** వి. *DiTooneeTaru* దూరం నుంచి బాంబులను పేల్చటానికి ఉపయోగించే పరికరం detonator *ప్రమాద స్థలానికి 50 గజాల దూరంలో డిటోనేటర్లు పేల్చడానికి వీలుగా 22 స్విచ్‌లున్న బోర్డును తీవ్రవాదులు ఏర్పాటు చేసుకున్నారు.* (ఆం ప్ర 2 9 89)

**డిపాజిట్** వి. *DipaajiT* ఆర్థిక సంస్థలలో, బ్యాంకులలో నిర్ణీత కాలంపాటు దాచుకున్న సొమ్ము; deposit *స్విస్ బ్యాంకులోనే 13వందల కోట్లు దాచినట్లు తెలుస్తోందని, ఇక ఇతర విదేశీ బ్యాంకుల్లో మరెన్ని కోట్ల రూపాయలు డిపాజిట్ చేసి ఉంటారో అని అన్నారు.* (ఈ 20 6 87)

**డిపాజిటరు** వి. *DipaajiTaru* ఆర్థిక సంస్థలలో, బ్యాంకులలో డబ్బు దాచుకున్నవ్యక్తి depositor *డిపాజిటర్లకు డబ్బు తిరిగి చెల్లించి తమ వ్యాపారాన్ని కొనసాగించడానికి తీవ్రంగా కృషి చేస్తున్నామని ఇందుకు డిపాజిటర్లు తమతో సహకరించాలని ... కోరారు.* (ఈ అను 29 7 89)

**డిప్యుటేషన్** వి. *DipyuTeeSan* ప్రభుత్వ సర్వీసులలో ఉన్నవారు ఒక శాఖనుంచి మరో శాఖకు ప్రత్యేక బాధ్యతలను స్వీకరించడానికి తాత్కాలికంగా వెళ్ళటం deputation *సర్కారియా కమీషన్ సిఫార్సు చేసినట్టు కేంద్ర సర్వీసుల ఆఫీసర్లు కనీసం ఒక టరమ్ కాలమైనా కేంద్ర ప్రభుత్వం క్రింద డిప్యుటేషన్‌పై పనిచేయాలని సమావేశం ఏకగ్రీవంగా కోరింది.* (ఆం భూ 29 6 89)

**డిఫాల్టర్** వి. *DifaalTar* ఆర్థిక సంస్థలలో అప్పు తీసుకొని, నిర్ణీత కాలానికి డబ్బు చెల్లించని వాడు; బకాయిదారుడు defaulter ... *ఎన్నికలలో పాల్గొనేందుకు వీలుగా సహకార సంఘాల చట్టం (1964) సెక్షన్ 21(ఎ)(బి)ల నుంచి మినహాయింపు ఇస్తూ ప్రభుత్వం గురువారం ఉత్తర్వులు జారీ చేసింది. దీంతో ... ఈ ఎన్నికలకు అవరోధంగా ఉన్న 'డిఫాల్టర్' సమస్య పరిష్కారమైంది.* (ఈ. 4 7 87)

**డిఫెండర్** వి. *DifenDar* ఆటలో ప్రత్యర్థులు గోల్ చేయకుండా అడ్డుకునే ఆటగాడు defender *ప్రథమార్థంలో ఉత్తర ప్రదేశ్ ఎక్కువ గోల్స్ సాధించలేకపోవడానికి ఆంధ్ర డిఫెండర్లు చూపించిన సామర్థ్యమే కారణం.* (ఆం ప్ర. 28 7 89)

**డిఫెన్స్** వి. *Difens* క్రికెట్ ఆటలో వికెట్‌ను కాపాడటం defence *మార్షల్ వేసిన ఒక బంతిని డిఫెన్స్ ఆడబోయి ...* (ఆం ప్ర 22 4 89)

**డిబార్** వి. *Dibaar* తప్పుడు పద్ధతులు

కలంబించటంవల్ల, పరీక్ష రాసుకునే క్కు తొలగించటం; బహిష్కరించటం bar జూనియర్ కళాశాలలో ... విద్యార్థి పీ కొడుతుండగా పట్టుబడడంతో విద్యార్థిని బార్ చేశారు. (ప్రజా 10 10 87)

చరు వి. *Dibencaru* ప్రభుత్వం వా కంపెనీ జారీ చేసే అప్పు పత్రం ebenture వెస్టరన్ హేచరీస్ దాదాపు కోట్ల అంచనాతో తలపెట్టిన వాటాలను జలకు విడుదల చేయాలని నిర్ణయించినట్లు ప్పారు. (ఆం భూ 11 5 89)

ాండ్ వి. *DimaanD* ఆధికారికంగా క్కుగా అడగటం ; గట్టిగా కోరటం emand నారాయణదత్ తివారీ రాజీ మా చేయాలని .. పార్టీలు డిమాండ్ శాయి. (ఆం ప్ర. 14 6 89)

జన్ బెంచి వి. *Divijan benci* హైకో ర్టులో, సుప్రీంకోర్టులో ఇద్దరు న్యాయమూ ర్తులతో కూడిన ధర్మాసనం division ench ఈ డాక్యుమెంట్లను సోమవారం గా తాము దాఖలు చేస్తామని, అందువల్ల ఈ కేసును సోమవారంనాడు విచారణకు ీపట్టవలసిందిగా ఇద్దరు న్యాయవాదులు డివి జన్ బెంచిని కోరారు. (ఆం ప్ర 3 6.89)

డెండ్ వి. *DiviDenD* వాణిజ్య సంస్థలు టా వాటాదారులకు చెల్లించే లాభంలో ాటా dividend ఈ ఏడాది మార్చి 30 ాటికి అంతమైన 15 నెలల కాలానికి డివి డెండ్ కింద 8కోట్ల 74 లక్షల రూపాయల మేర ... అందజేశారు. (ఆం భూ. 16 89)

ార్జి వి. *Diścaarji* చికిత్స తర్వాత రోగు ను ఆసుపత్రి నుంచి విడుదల చేయటం ischarge ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ను ఆదివారం ఆస్పత్రి నుంచి డిశ్చార్జి చేస్తారు. ఆం జ్యో 16 8,87)

**డిస్పెన్సరీ** వి. *Dispensari* రోగులను పరీక్షించి, మందులిచ్చే (పడకలు మొ. సౌకర్యాలులేని) వైద్యశాల dispensary మందమర్రి ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో కనీససౌకర్యాలు లేవని రవీందర్ రావు వివరిం చగా, అది కేవలం డిస్పెన్సరీ మాత్రమేనని సంబంధిత అధికారి సమాధానమిచ్చారు. (ఆం భూ. 20 5 89)

**డిస్మిస్‌చేయు** క్రి. *Dismisceeyu* అధి కారం నుంచి శిక్షగా తొలగించు to dismiss దేశంలో కాంగ్రేసేతర ప్రభుత్వా లను డిస్మిస్ చేయడానికి కేంద్రం ప్రయత్ని స్తోందని ఆయన ఆరోపించారు (ఆం. భూ 28 8 89)

**డీలర్‌షిప్** వి. *DiilarSip* ప్రభుత్వ ప్రకటన రేట్ల కనుగుణంగా నిత్యావసర వస్తువులు పంపిణీ చేసే బాధ్యత dealership తెలుగుదేశం పార్టీకి చెందిన అస్మదీయులకే చౌకడిపో డీలర్‌షిప్‌లు కట్టబెట్టడానికి ... కొత్త ఎత్తువేశారు. (ఈ 12.5 89)

**డెప్యుటేషన్** వి. *DepyuTeeSan* చూ. డిప్యుటేషన్. సైదులు డెప్యుటేషన్ రద్దు చేయాలి (ఈ 18.6 87)

**డొనేషన్** వి. *DoneeSan* విద్యార్థుల చదువుకోసం లేదా మంచి పనులకోసం విరాళంగా యిచ్చే సొమ్ము; చందా donation ఒకవైపు డొనేషన్లు లేవని చెబుతూనే మరోవైపు రహస్యంగా డొనేషన్లు వసూలుచేస్తూ వాటికి రసీదులు ఇవ్వటం లేదని, ప్రభుత్వ పాఠశాలల్లో విద్యాబోధన సరిగా లేని కారణంగా ప్రైవేటు పాఠశాలలకు డొనేషన్లు చెల్లించి ... (ఆం. భూ 29.6.87)

**డోలాయమానం** వి. *Doolaayamaanam* ఎటూ తేల్చుకోలేని పరిస్థితి; ఊగిస లాట dilemma ప్రతిపక్ష పార్టీల్లో వేదు

డోలాయ మానంలో పడ్డాయని శ్రీ రాజీవ్ గాంధీ ... బహిరంగ సభలో ప్రసంగిస్తూ అన్నారు. (ఆం. భూ 18.5 89)

**డ్రా** వి. *Draa* ఆటలో ఇరుపక్షాలూ సమ ఉజ్జీ కావటం draw *భారత-వెస్టిండీస్ జట్ల మధ్య కలకత్తాలో జరిగిన మూడో క్రికెట్ టెస్ట్ 'డ్రా' అయింది.* (ఆం ప్ర. 1.1 88)

**డ్రిల్లింగ్ చేయు** క్రి *Drilling ceeyu* (భూమి మీద, నీళ్ళలోను) యంత్రంతో లోతుగా తవ్వు to drill (as in oil and gas exploration) *లోతు జలాల్లో చమురు బావులు డ్రిల్లింగ్ చేయడంలో ఒ. ఎన్. జి. సి. ఇప్పటికే కొంత అనుభవం సంపాదించింది.* (ఈ. 22.7.87)

ఢ

**ఢక్కామొక్కీలుతిను** క్రి. *Dhakkaa mokkiilutinu* ఎదురు దెబ్బలు తిను; అనుభవం గడించు to face ups and downs during one's life *ముఖ్య మంత్రి పీఠం నుంచి దిగి, ప్రదేశ్ కాంగ్రెస్ పీఠం ఎక్కేలోగా డాక్టర్ చెన్నారెడ్డిగారు చాలా ఢక్కామొక్కీలు తిన్నారు.* (ఆం. ప్ర 4 5 89)

**ఢిల్లీ దర్బారు** వి. *Dhillii darbaaru* ఢిల్లీలో అగ్రశ్రేణి నాయకుల అధికారం; ఢిల్లీ పెత్తనం high command in Delhi *ఢిల్లీ దర్బారుకు దయ తప్పినపుడు ఎవరైనా ఇంటిదారిపట్టవలసిందే.* (ఈ 21 1 88)

**ఢీ** వి. *Dhii* ఆటల్లో పోటాపోటీగా పరస్పరం ఎదుర్కొనటం competing (as in final matches) *ఫైనల్లో నందిని, రమ ఢీ.* (ఈ 21 1 88)

**ఢీకొను** క్రి. *Dhiikonu* ఎదురెదురుగా, వేగంగా వస్తున్న వాహనాలు గుద్దుకొను to collide *తిరుపతి రోడ్డులోని కలరోడ్ గ్రామం వద్ద శుక్రవారం ఒకకారు, లారీ ఢీకొనడంతో ఇద్దరు మరణించారు.* (ఆం భూ 20.6 87)

**ఢోకా** వి. *Dhookaa* రాబోయే అడ్డు, భయం insecurity *మరో ఆరేడేళ్ళ పాటు ఈ రైలు మార్గానికి ఎటువంటి ఢోకాలేదని ఆయన చెప్పారు.* (ఈ 25 4.89)

త

**తండోపతండాలు** వి. (బ.వ.) *tan-DoopatanDaalu* చాలా అధికమైన సంఖ్య (జనం) (people in) large numbers ... *శివసేన అధిపతి శ్రీ బాల్ థాకరే సభకు కూడా జనం తండోపతండాలుగా హాజరయ్యారు.* (ఈ 22.11.89)

**తందనాలాడు** క్రి. *tandanaalaaDu* ఎక్కువ జల్సాచేయు, కులాసాగా కాలం గడుపు to make merry ... *కొందరు ప్రతిపక్షనాయకులను ప్రస్తావిస్తూ వారు మహిళల హక్కులను కాలరాస్తున్నారని, తందనాలాడుతున్నారని, వేర్పాటువాద శక్తులతో చేయి చేయికలుపుతున్నారని శ్రీ రాజీవ్ గాంధీ దుయ్యబట్టారు.* (ఈ 16 8 89)

**తక్షణ సహాయం** వి. *takSaNa sahaayam* పరిస్థితి మదింపుకోసం ఎదురుచూడకుండా ప్రభుత్వం బాధితులకు వెంటనే అందించే సహాయం immediate relief *పంజాబ్, హర్యానా రాష్ట్రాలలో వరద సహాయ చర్యల నిమిత్తం 142 కోట్ల రూపాయలు తక్షణ సహాయంగా మంజూరు చేస్తున్నట్లు ప్రధాని ... ప్రకటించారు.* (ఉ 15 10 89)

**తక్షణ సహాయ కార్యక్రమాలు** వి. (బ.వ.) *takSaNa sahaaya kaaryakramaalu* బాధితులకు వెంటనే సహాయపడే ఉద్దేశ్యంతో చేపట్టే పనులు immediate

relief measures రాష్ట్రంలో వరదలకు గురైన ఆరు జిల్లాలలో తక్షణ సహాయ కార్య క్రమాలు చేపట్టేందుకుగాను ... మంజూరు చేసింది. (ఆం ప్ర 27 7 89)

**తగవుపడు** క్రి. *tagavupaDu* ఇతరులతో భిన్నాభిప్రాయం వచ్చినపుడు తీవ్రంగా వాదోపవాదాలు చేయు to pick up a quarrel ... ఒక గిరిజన యువతి ఎంత వేడుకున్నా కాదని భీమ్లా ఆమెపై అత్యాచారం జరపటం చూచిన చంద్రమౌళి అతనితో తగవు పడ్డాడని తెలిసింది. (ఆం. భూ. 4.7 89)

**తగ్గు** క్రి. *taggu* ఒక సరుకు పట్ల ఆదరణ లేదా వస్తువు ధర అంతకుముందుకంటే తక్కువ అగు, వెలపడిపోవు to come down (prices, demand) ... ఈ మందువల్ల ఇతర కాస్మొటిక్స్ గిరాకీ తగ్గే ప్రమాదం ఉందని అనుకోవచ్చు. (ఈ. 13 3.88)

**తగ్గుముఖం** వి. *taggumukham* సాధారణంగా పెరుగుదల చూపించే క్రమం తగ్గుదల చూపటం downward trend రాష్ట్రంలో జననాల రేటు తగ్గుముఖం. (ఆం ప్ర. 1.8.87)

**తచ్చాడు** క్రి. *taccaaDu* సరైన లక్ష్యం లేకుండా ఒకే ప్రదేశంలో లేదా ఒకే విషయ పరిధిలో తిరుగాడు to pace up and down, ఎగుమతులు బాగా పెరిగి ప్రపంచంలో పెద్ద కేంద్రంగా రూపొందినా, ప్రపంచ ఎగుమతులలో మనదేశం వాటా ఇంచు మించు 8 శాతం దగ్గరే తచ్చాడుతూ ఉండటంతో ... చెప్పుకోదగ్గ ఘనత ఉందనేందుకు వీలులేదు. (ఆం ప్ర. 18 11 88) ... దేశం 21వ శతాబ్దంలోకి ప్రవేశించేందుకు ఆయత్తమవుతుండగా పరిపాలనా విభాగం మాత్రం 19 వ శతాబ్దంలోనే తచ్చాడుతోందని విమర్శించారు. (ఈ 4 7.88)

**తటపటాయించు** క్రి. *taTapaTaayincu* ఒక పనిచేసే విషయంలో సందేహించు; ముందు వెనుకలాడు to hesitate ... తమ పార్టీలో చేరవలసిందిగా కాంగ్రెస్(ఐ) వారు కూడా పదేపదే రాయబారాలు పంపుతున్నారు. ఆయన తటపటాయించడానికి కారణం లేకపోలేదు. (ఆం. భూ 24 5 89)

**తటస్థ అంపైర్** వి. *taTastha ampair* పోటీలో పాల్గొంటున్న దేశాల నుంచి కాకుండా మరో మూడో దేశానికి చెందిన అంపైర్ neutral umpire భారత జట్టుకూ, పాకిస్తాన్ జట్టుకూ మధ్య త్వరలో జరిగే సీరీస్‌ను పర్యవేక్షించడానికి తటస్థ అంపైర్లకోసం ... అన్వేషిస్తోంది. (ఆం. ప్ర 21 9.89)

**తటాక కుటీరం** వి. *taTaaka kuTiiram* (లేక్‌వ్యూ కాటేజీలు) కనీసం ఒకవైపు సరస్సు హద్దుగా నిర్మించిన విశ్రామ గృహం lake-view cottage నగరంలో తటాక కుటీరాలు- లేక్‌వ్యూ కాటేజీలు అని పిలిచే వీటిలో అత్యంత ఆధునికమైన సౌకర్యాలను కల్పిస్తారు. (ఈ. 2 1 88)

**తట్టుకొను** క్రి. *taTTukonu* కొత్త పరిస్థితిని అర్థం చేసుకొని భరించు to withstand the change or changed situation ఒక్క రోజులోనే కాంగ్రెస్, తెలుగుదేశం అధికార, ప్రతిపక్షాలుగా మారిపోవటాన్ని తట్టుకోలేకపోతున్నారు. (ఈ అను. 30 11 89)

**తడాఖా** వి. *taDaakhaa* ఇతరుల్ని ఎదుర్కొనగలిగిన శక్తి సామర్థ్యాలు strength, grit, power కాంగ్రెస్(ఐ) పార్టీ 42 పార్లమెంట్ సీట్లకు, 294 అసెంబ్లీ సీట్లకు ఒంటరిగా ఎన్నికల్లో

డోలాయ మానంలో పడ్డాయని శ్రీ రాజీవ్ గాంధీ ... బహిరంగ సభలో ప్రసంగిస్తూ అన్నారు. (ఆం. భూ 18.5 89)

డ్రా వి. *Draa* ఆటలో ఇరుపక్షాలూ సమ ఉజ్జీ కావటం draw భారత-వెస్టిండీస్ జట్ల మధ్య కలకత్తాలో జరిగిన మూడో క్రికెట్ టెస్ట్ 'డ్రా' అయింది. (ఆం ప్ర 11.88)

డ్రిల్లింగ్ చేయు క్రి. *Drilling ceeyu* (భూమి మీద, నీళ్ళలోను) యంత్రంతో లోతుగా తవ్వు to drill (as in oil and gas exploration) లోతు జలాల్లో చమురు బావులు డ్రిల్లింగ్ చేయ డంలో ఒ. ఎన్. జి. సి. ఇప్పటికే కొంత అనుభవం సంపాదించింది. (ఈ 22 7 87)

ఢ

ఢక్కా మొక్కీలుతిను క్రి. *Dhakkaa mokkiilutınu* ఎదురు దెబ్బలు తిను; అనుభవం గడించు to face ups and downs during one's life ముఖ్య మంత్రి పీఠం నుంచి దిగి, ప్రదేశ్ కాంగ్రెస్ పీఠం ఎక్కేలోగా డాక్టర్ చెన్నారెడ్డిగారు చాలా ఢక్కా మొక్కీలు తిన్నారు. (ఆం. ప్ర 4.5.89)

ఢిల్లీ దర్బారు వి. *Dhilhı darbaaru* ఢిల్లీలో అగ్రశ్రేణి నాయకుల అధికారం; ఢిల్లీ పెత్తనం high command in Delhi ఢిల్లీ దర్బారుకు దయ తప్పినపుడు ఎవరైనా ఇంటిదారిపట్టవలసిందే. (ఈ 21 1 88)

ఢీ వి. *Dhıi* ఆటల్లో పోటాపోటీగా పరస్పరం ఎదుర్కొనటం competing (as in final matches) ఫైనల్లో నందిని, రమ ఢీ. (ఈ 21.1.88)

ఢీకొను క్రి. *Dhıikonu* ఎదురెదురుగా, వేగంగా వస్తున్న వాహనాలు గుద్దుకొను to collide తిరుపతి రోడ్డులోని కలరోడ్ గ్రామం వద్ద శుక్రవారం ఒకకారు, లారీ ఢీకొనడంతో ఇద్దరు మరణించారు. (ఆం భూ 20.6 87)

ఢోకా వి. *Dhookaa* రాబోయే అడ్డు, భయం insecurity మరో ఆరేడేళ్ళ పాటు ఈ రైలు మార్గానికి ఎటువంటి ఢోకాలేదని ఆయన చెప్పారు. (ఈ 25.4 89)

త

తండోపతండాలు వి. (బ.వ.) *tanDoopatanDaalu* చాలా అధికమైన సంఖ్య (జనం) (people in) large numbers ... శివసేన అధిపతి శ్రీ బాల్ థాకరే సభకు కూడా జనం తండోప తండాలుగా హాజరయ్యారు. (ఈ 22.11 89)

తందనాలాడు క్రి. *tandanaalaaDu* ఎక్కువ జల్సాచేయు, కులాసాగా కాలం గడుపు to make merry ... కొందరు ప్రతిపక్షనాయకులను ప్రస్తావిస్తూ వారు మహిళల హక్కులను కాలరాస్తున్నారని, తందనాలాడుతున్నారని, వేర్పాటువాద శక్తు లతో చేయి చేయికలుపుతున్నారని శ్రీ రాజీవ్ గాంధీ దుయ్యబట్టారు. (ఈ 16 8 89)

తక్షణ సహాయం వి. *takSaNa sahaayam* పరిస్థితి మదింపుకోసం ఎదురుచూడకుండా ప్రభుత్వం బాధితు లకు వెంటనే అందించే సహాయం immediate relief పంజాబ్, హర్యానా రాష్ట్రాలలో వరద సహాయ చర్యల నిమిత్తం 142 కోట్ల రూపాయలు తక్షణ సహాయంగా మంజూరు చేస్తున్నట్లు ప్రధాని ... ప్రకటించారు. (ఈ 15 10 89)

తక్షణ సహాయ కార్యక్రమాలు వి. (బ.వ.) *takSaNa sahaaya kaaryakramaalu* బాధితులకు వెంటనే సహాయపడే ఉద్దే శ్యంతో చేపట్టే పనులు immediate

relief measures రాష్ట్రంలో వరదలకు గురైన ఆరు జిల్లాలలో తక్షణ సహాయ కార్య క్రమాలు చేపట్టేందుకుగాను ... మంజూరు చేసింది. (ఆం ప్ర 27.7 89)

**తగవుపడు** క్రి. *tagavupaDu* ఇతరులతో భిన్నాభిప్రాయం వచ్చినపుడు తీవ్రంగా వాదోపవాదాలు చేయు to pick up a quarrel ... *ఒక గిరిజన యువతి ఎంత వేడుకున్నా కాదని భీమ్లా ఆమెపై అత్యాచారం జరపటం చూచిన చంద్రమౌళి అతనితో తగవు పడ్డాడని తెలిసింది.* (ఆం. భూ. 4.7.89)

**తగ్గు** క్రి. *taggu* ఒక సరుకు పట్ల ఆదరణ లేదా వస్తువు ధర అంతకుముందుకంటే తక్కువ అగు, వెలపడిపోవు to come down (prices, demand) ... *ఈ మందువల్ల ఇతర కాస్మొటిక్స్ గిరాకీ తగ్గే ప్రమాదం ఉందని అనుకోవచ్చు.* (ఈ. 13 3 88)

**తగ్గుముఖం** వి. *taggumukham* సాధారణంగా పెరుగుదల చూపించే క్రమం తగ్గుదల చూపటం downward trend *రాష్ట్రంలో జననాల రేటు తగ్గుముఖం.* (ఆం ప్ర 18.87)

**తచ్చాడు** క్రి. *taccaaDu* సరైన లక్ష్యం లేకుండా ఒకే ప్రదేశంలో లేదా ఒకే విషయ పరిధిలో తిరుగాడు to pace up and down, *ఎగుమతులు బాగా పెరిగి ప్రపంచంలో పెద్ద కేంద్రంగా రూపొందినా, ప్రపంచ ఎగుమతులలో మనదేశం వాటా ఇంచు మించు 8 శాతం దగ్గరే తచ్చాడుతూ ఉండటంతో ... చెప్పుకోదగ్గ ఘనత ఉందనేందుకు వీలులేదు.* (ఆం ప్ర 18 11 88) ... *దేశం 21వ శతాబ్దంలోకి ప్రవేశించేందుకు ఆయత్తమవుతుండగా పరిపాలనా విభాగం మాత్రం 19 వ శతాబ్దంలోనే తచ్చాడుతోందని విమర్శించారు.* (ఈ. 4.7 88)

**తటపటాయించు** క్రి. *taTapaTaayincu* ఒక పనిచేసే విషయంలో సందేహించు; ముందు వెనుకలాడు to hesitate ... *తమ పార్టీలో చేరవలసిందిగా కాంగ్రెస్(ఐ) వారు కూడా పదేపదే రాయబారాలు పంపుతున్నారు. ఆయన తటపటాయించడానికి కారణం లేకపోలేదు* (ఆం. భూ 24.5 89)

**తటస్థ అంపైర్** వి. *taTastha ampair* పోటీలో పాల్గొంటున్న దేశాల నుంచి కాకుండా మరో మూడో దేశానికి చెందిన అంపైర్ neutral umpire *భారత జట్టుకూ, పాకిస్తాన్ జట్టుకూ మధ్య త్వరలో జరిగే సీరీస్‌ను పర్యవేక్షించడానికి తటస్థ అంపైర్లకోసం ... అన్వేషిస్తోంది.* (ఆం ప్ర 21.9 89)

**తటాక కుటీరం** వి. *taTaaka kuTiiram* (లేక్‌వ్యూ కాటేజీలు) కనీసం ఒకవైపు సరస్సు హద్దుగా నిర్మించిన విశ్రామ గృహం lake-view cottage *నగరంలో తటాక కుటీరాలు- లేక్‌వ్యూ కాటేజీలు అని పిలిచే వీటిలో అత్యంత ఆధునికమైన సౌకర్యాలను కల్పిస్తారు.* (ఈ 2 1 88)

**తట్టుకొను** క్రి. *taTTukonu* కొత్త పరిస్థితిని అర్థం చేసుకొని భరించు to withstand the change or changed situation *ఒక్క రోజులోనే కాంగ్రెస్, తెలుగుదేశం అధికార, ప్రతిపక్షాలుగా మారిపోవటాన్ని తట్టుకోలేకపోతున్నారు.* (ఈ అను. 30 11 89)

**తడాఖా** వి. *taDaakhaa* ఇతరుల్ని ఎదుర్కొనగలిగిన శక్తి సామర్థ్యాలు strength, grit, power *కాంగ్రెస్(ఐ) పార్టీ 42 పార్లమెంట్ సీట్లకు, 294 అసెంబ్లీ సీట్లకు ఒంటరిగా ఎన్నికల్లో*

పోటీ చేస్తుందని, తెలుగుదేశం కూడా ఒంటరిగా పోటీచేస్తే తడాఖా చూపిస్తామని శ్రీ వెంగళరావు సవాలు చేశారు. (ఆం భూ 28.8.89)

**తడిసిమోపెడగు** క్రి. *taDisimoopeDagu* అనుకున్నదానికన్నా ఆర్థికభారం ఎక్కువగు to become over burdened తాను ఆర్థిక మంత్రిగా ఉన్నప్పటికీ, ఇప్పటికీ వడ్డీభారం తడిసి మోపెడయిందన్నారు. (ఈ 27.4.89)

**తడుముకొను** క్రి. *taDumukonu* అనిశ్చిత స్థితికిలోనగు, తడబడు to fumble (to say the right thing), to hesitate ... ఉత్సాహంగా వేచి ఉన్న లక్షల మందిని నిరుత్సాహపరుస్తూ ప్రధాన మంత్రి రాజీవ్ గాంధీ ప్రసంగం 25 నిమిషాలు హిందీలో చప్పచప్పగా సాగింది. మధ్యలో రాజీవ్ గాంధీ తడుముకోవటం కనిపించింది. (ఈ 22.6.89)

**తణుకు బెణుకు** వి. *taNuku beNuku* భయం, సందేహాలతో కూడుకున్న మానసిక స్థితి; అదురు బెదురు fumbling, hesitation వివిధ సమస్యలపై స్పష్టమైన అభిప్రాయాలను కలిగి తణుకు బెణుకు లేకుండా ముక్కుసూటిగా జవాబు చెప్పగలిగే మంత్రిగా .. బాగా తెలుసు. (ఆం. భూ 3.5.89)

**తతంగం** వి. *tatangam* లక్ష్య శుద్ధిలేని కార్యక్రమం ritual farce ... బోఫోర్స్ శతఘ్నుల వ్యవహారంపై సమర్పించిన నివేదిక తాము ముందుగా ఊహించినట్లుగానే తప్పులను కప్పిపుచ్చుకునే తతంగంగా ఉందని ప్రతి పక్షనాయకులు నేడు వర్ణించారు. (ఆం ప్ర. 27.4.88)

**తదుపరి** విశే. *tadupari* వ్యవధానం లేకుండా వెంటనే చేపట్టే; తరువాతి next, immediate ... తెలుగుదేశం ప్రభుత్వాన్ని పడగొట్టాలని కాంగ్రెస్(ఐ) తదుపరి లక్ష్యంగా పెట్టుకున్నట్లు ఆయన చెప్పారు. (ఈ 26.4.89)

**తనిఖీ** వి. *tanikhii* సక్రమంగా ఉన్నదీ లేనిదీ తెలుసుకోడానికి ఉన్నత స్థానాలలో ఉన్న వ్యక్తులు చేసే పరీక్ష/పరిశీలన check, checking, search ప్రభుత్వ అధికారులు ఎప్పటికప్పుడు తనిఖీలు జరపకుంటే ప్రభుత్వ పాఠశాలల్లో విద్యా బోధన మెరుగుపడటం జరుగదని ... వెలిబుచ్చుతున్నారు. (ఆం భూ 29.6.87)

**తనిఖీ బృందం** వి. *tanikhii bRndam* కార్యక్రమం సక్రమంగా అమలు జరుగుతున్నదీ లేనిదీ పరిశీలించే అధికారుల సముదాయం; పర్యవేక్షక బృందం inspecting body or team కరువు నిధుల వ్యయంపై కేంద్ర తనిఖీ బృందం రాష్ట్ర ప్రభుత్వం ప్రదర్శించిన వైఖరిపట్ల అసంతృప్తి చెందినందువల్లనే ఈ పర్యవేక్షక బృందాన్ని ఏర్పాటు చేయాలన్న నిర్ణయం తీసుకున్నారు. (ఆం. భూ. 17.10.87)

**తనువు చాలించు** క్రి. *tanuvu caalincu* ప్రాణాలు పోగొట్టుకొను; చచ్చిపోవు, మరణించు to put an end to one's own life, to die ఆత్మాభిమానం దెబ్బతిన్న 25 ఏళ్ళ యువతి మందుతాగి తనువు చాలించింది. (ఈ 29.1.88)

**తపన** వి. *tapana* కార్యాన్ని సాధించాలనే అమితమైన ఆసక్తి zeal ఇరుదేశాల మధ్య అడపాదడపా అధికారుల స్థాయిలో సాగుతున్న చర్చలకు కొంత ప్రయోజనం చేకూర్చాలనే 'తపన' ఉభయత్రా గోచరమౌతోంది. (ఆం భూ 26.5.89)

**తపించు** క్రి. *tapincu* మిక్కిలిగా అభిల

షించు to crave for ... రాజీనామా చేయాలని నిర్ణయించటం ద్వారా చౌకబారు రాజకీయ ప్రచారంకోసం తపిస్తున్నారు తప్ప వారు చేస్తున్న గొప్ప త్యాగమేమీ లేదని ... అన్నారు. (ఈ 24 7 89)

**తప్పించు** క్రి. *tappıncu* ఒకరి నుంచి తీసి వేయు; తొలగించు to take away (some responsibility), divest చౌక డిపో డీలర్ల నియామకాన్ని జిల్లా కలెక్టర్ల నుంచి తప్పించి వేసి తమ మంత్రులకు అప్పగించేశారు. (ఈ 12 5 89)

**తప్పిదం** వి. *tappıdam* తెలియక చేసే పని; పొరపాటు mistake, misdeed పైగర్లు ఇప్పుడిప్పుడే తమ తప్పిదాలను తెలుసుకొంటున్నారనీ, జాతి కలహాల వల్ల అమాయకులు సైతం అనేక మంది ప్రాణాలను కోల్పోయారని ఆయన చెప్పారు. (ఆం. భూ 20 5 89)

**తప్పుకొను** క్రి. *tappukonu* పోటీ నుంచి, బాధ్యతల నుంచి వైదొలగు to withdraw, to get relieved భగత్‌రాంకు అనుకూలంగా జనతాదళ్ అభ్యర్థి రంగం నుంచి తప్పుకున్నారు. (ఆం ప్ర. 21.11 89)

**తప్పుడు సమాచారం** వి. *tappuDu samaacaaram* అసత్యాలతో కూడిన అవాస్తవ విషయం wrong or false information ముఖ్యమంత్రికి అధికారులు తప్పుడు సమాచారం ఇచ్చారని ఆయన చెప్పారు. (ఆం భూ. 14 10 87)

**తప్పుదారి పట్టించు** క్రి. *tappudaarı paTTıncu* బుద్ధిపూర్వకంగా ఎదుటివారిని అపమార్గంలో తీసుకువెళ్ళు, మోసగించు; పెడదారికి తిప్పు to mislead శ్రీ సింగ్‌కు ఏ మాత్రం ధైర్యమున్నా ప్రజలను తప్పుదారి పట్టించకుండా చేసిన ఆరోపణలు నిరూపించాలని ... చెప్పారు. (ఆం. జ్యో 8 11 88)

**తప్పుదోవ పట్టించు** క్రి. *tappudoova paTTıncu* చూ. తప్పుదారి పట్టించు; బియ్యం మళ్ళింపు జరగలేదని శాసన సభను తప్పుదోవ పట్టించినందుకు తెలుగుదేశం నాయకులు తమ పదవికి రాజీనామా చేయాలని కోరారు. (ఈ 6.10 88)

**తప్పుపట్టు** క్రి *tappupaTTu* పొరపాట్లు చేసినట్లు ఎత్తిచూపు to find fault with వివాదాస్పద 'ఫెయిర్‌ఫాక్స్' వ్యవహారంపై దర్యాప్తు జరిపిన ఠక్కర్ నటరాజన్ కమీషన్లు అప్పటి ఆర్థిక మంత్రిగా వి. పి. సింగ్ వ్యవహరించిన తీరును తప్పు పట్టింది. (ఈ 10.12 87)

**తబిసీళ్ళు** వి. (బ.వ.) *tabisıiLLu* ఒక విషయానికి సంబంధించిన నిజస్వరూపం వెల్లడించే వివరాలు; గుట్టుమట్టులు incriminating details బోఫోర్స్ నిరాకరించిన రహస్యపత్రాలను తనిఖీచేస్తే గాని కుంభకోణం గ్రంధసాంగుల తబిసీళ్ళు బైటపడవు (ఈ 6 6.87)

**తబ్బిబ్బగు** క్రి. *tabbıbbagu* అధిక సంతోషంతో నిండిపోవు; ఉద్వేగం పొందు to be jubilant, overjoyed మెక్ నోపై నెగ్గిన 115 ర్యాంకు పాల్‌హోర్‌హ్యూస్ ఆనందంతో తబ్బిబ్బవుతూ తాను కుజగ్రహం నుంచి దిగి వచ్చానని అన్నాడు. (ఈ. 1.9 89)

**తయారుచేయు** క్రి. *tayaaruceeyu* వివరణ పత్రాలను రూపొందించు to prepare (a report) ఈ బృందం ఇప్పటికే తన నివేదికను తయారుచేసింది. (విశా 12.10 87)

**తరచుగా** క్రి.వి. *taracugaa* ఎక్కువ సార

often, frequently నైతిక బలం దిగజారినట్టు తరచుగా ఓటమికి గురికావడం సహజమే. (ఈ 17 8 89)

**తరలించు** క్రి. *tarahncu* ఉన్న ప్రదేశం నుంచి మరోచోటికి (వెంటనే) తీసుకు వెళ్ళు to shift sb or sth తీవ్రగాయాలతో ఉన్న సలీంఖాన్‌ను ఉస్మానియా ఆసుపత్రికి తరలించగా అక్కడ అతను చని పోయాడు. (ఆం. ప్ర 15 5 89)

**తరలివచ్చు** క్రి. *tarahvaccu* 1. శాశ్వతంగా ఉండిపోవాలనే ఉద్దేశ్యంతో ఒక ప్రదేశం నుంచి ఇంకొక ప్రదేశానికి మరలి వచ్చు to shift, come back తెలుగు నేలకు తరలిరండి ప్రభుత్వం ఏదో చేస్తూందన్న ఆశతో కాకుండా తమదీ రాష్ట్రం అనే భావనతో రాష్ట్రంలో చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధికోసం తరలిరావాలని ... పిలుపునిచ్చారు (ఆం జ్యో 26 4 89) 2. అధిక సంఖ్యలో హాజరగు to attend in large numbers కోస్తా ఆంధ్ర జిల్లాల నుంచి ఈ సభకు తరలి వస్తారని కాంగ్రెస్(ఐ) వర్గాలు చెబుతున్నాయి. (ఆం ప్ర 4 2 89)

**తరలివెళ్ళు** క్రి. *tarahveLLu* ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశానికి (సామూహికంగా) బయలుదేరి వెళ్ళు to leave in exodus అదనపు పోలీసు దళాలు ఈ ప్రాంతానికి హుటాహుటిన తరలివెళ్ళాయి. (ఉ 5.12.87)

**తరహా** వి. *tarahaa* ఒక క్రమంతో కూడిన పద్ధతి manner ఈ నివేదికలో సిఫారసు చేసిన తరహాలో ఆహార స్వీకరణ పద్ధతులు కొనసాగుతున్న దేశాలలో ... (ఆం. భూ 3.5 89)

**తరిమికొట్టు** క్రి. *tarimikoTTu* బలప్రయోగం ద్వారా దూరంగా పంపివేయు to drive away కుళ్ళిన రాజకీయాలతో కూడిన కాంగ్రెస్‌ను తరిమికొట్టడానికి తెలుగు దేశం పార్టీకి ప్రజలు పట్టం కట్టారని చెప్పారు. (ఉ 11 2 87)

**తరిమివేయు** క్రి. *tarimiveeyu* చూ. తరిమికొట్టు; గుంపులుగా గుమికూడి పోలీస్‌టికెట్లకోసం డిమాండ్ చేస్తున్న అభ్యర్థులను పోలీసులు పలుసార్లు బయటకు తరిమివేశారు. (ఈ అను 30 5 89)

**తరుణం** వి. *taruNam* ఒక పని చేయడానికి అవసరమైన సమయం time, occasion ... ఆసియాలో శాంతి సుస్థిరతల పటిష్టతకు ఉభయదేశాలు కలసి కట్టుగా కృషిచేయాల్సిన తరుణం ఆసన్నమైందని సోవియట్ అధ్యక్షుడు ... చైనాకు పిలుపునిచ్చారు (ఈ 16 5 89)

**తర్జనభర్జన** వి. *tarjanabharjana* ఒక విషయాన్ని గురించిన తీవ్రమైన చర్చ; వాదోపవాదాలు serious discussion or dialogue భగత్ అధ్యక్షతన రాష్ట్ర సమన్వయ కమిటీ తర్జనభర్జనల్ని కొనసాగించింది. (ఆం. భూ 2 5 89)

**తర్ఫీదు** వి. *tarfiidu* ఒక కార్యనిర్వహణలో కొత్తవారికి తెలిపే జాగ్రత్తలు, మెలకువలు; శిక్షణ training కమ్యూనిస్టు పార్టీ సిబ్బందికి తర్ఫీదు ఇచ్చే కమ్యూనిస్టు పార్టీ స్కూల్ ... (ఆం. భూ 21 4 89)

**తలఒగ్గు** క్రి. *talaoggu* ఎదుటి వారికి లొంగి ఉండి వారి అభిప్రాయాన్ని మన్నించు to yield, to obey శ్రీలంక మాత్రం న్యూఢిల్లీ ఏకపక్ష నిర్ణయానికి తలఒగ్గాలనడం సమంజసమా? (ఈ 5 6 87)

**తలకుమించిన** క్రి.విశే. *talakumincina* భరించగలిగిన దానికన్నా ఎక్కువగా ఉన్న unbearable beyond

one's capacity సామాన్య ప్రజలపై వివిధ రకాలుగా ఇప్పటికే తలకుమించిన భారం పడినందున పెంచిన ఆర్. టి. సి. ఛార్జీలను వెంటనే తగ్గించవలసిందిగా ... (ఆం జ్యో 29 11 88)

**తలదాచుకొను** క్రి. *taladaacukonu* ప్రకృతి వైపరీత్యాలు, దాడులు లాంటి సందర్భాలలో తాత్కాలికంగా ఒక ప్రదేశంలో ఆశ్రయం పొందు to take shelter అనేక ప్రాంతాలు ఇంకా వరదముయంలో ఉన్నాయని గ్రామం చుట్టురా నీరు ఉండటంతో మెరక ప్రాంతంలో తలదాచుకోటం కన్పించిందని చెప్పారు. (ఈ 26 7 89)

**తలదూర్చు** క్రి. *taladuurcu* (ఇతరుల వ్యవహారాలలో) సంబంధం లేకున్నా జోక్యం చేసుకొను to meddle, interfere పొరుగురాష్ట్ర ప్రభుత్వ వ్యవహారాలలో తలదూర్చడం ద్వారా శ్రీ రే రాజ్యాంగ విరుద్ధంగా ప్రవర్తించారని ... ఆరోపించారు. (ఆం ప్ర 2.9.89)

**తలపడు** క్రి. *talapaDu* 1. ఎన్నికలలో, క్రీడలలో పోటీపడు to face, confront ఈ నియోజకవర్గంలో ఆయన సి. పి. ఎం అభ్యర్థి ...తో ముఖాముఖి తలపడతారు. (ఆం జ్యో. 29.11 88) 2. దొంగతనాలకు, దాడులకు పాల్పడు to resort to దోపిడీకి తలపడిన నలుగురు యువకులు 20 నుంచి 30 సంవత్సరాల మధ్య వయస్సులోని వారే (ఆం ప్ర 28 12 87)

**తలపెట్టు** క్రి. *talapeTTu* ఏదైనా పని చెయ్యాలని ఆలోచించు to contemplate, plan వచ్చే లోకసభ ఎన్నికలను దృష్టిలో ఉంచుకొని ప్రభుత్వం ఈ కార్యక్రమం తలపెట్టినట్లు పరిశీలకులు భావిస్తున్నారు. (ఆం ప్ర 30 5.89)

**తలబిరుసు** వి. *talabirusu* మర్యాద పాటించని మనస్తత్వం rudeness, recklessness ఏప్రిల్ నెలలో బోర్డుతో తలబిరుసుగా వ్యవహరించిన క్రీడాకారులే ఇప్పుడు దయదలచమని వేడుకుంటూ ... (ఈ 14 8 89)

**తలమునకలగు** క్రి. *talamunakalagu* ఇతర విషయాలను పట్టించుకోకుండా ఏకాగ్రతతో సమయాన్నంతా వెచ్చించు to be absorbed, immerse ప్రధాని ... అయిదు ప్రధాన కేంద్రాలలో పర్యటించి సభల్లో పాల్గొనబోతున్న దృష్ట్యా సీనియర్ కాంగ్రెస్(ఐ) నాయకులు ఈ ప్రాంతాలలో ఏర్పాట్లకోసం తలమునకలై ఉన్నారు. (ఆం. భూ. 17 8 89)

**తలవంచు** క్రి. *talavancu* ఓటమిని అంగీకరించు పో. చూ. తలఒగ్గు to bow down చివరికి ఉత్తరప్రదేశ్ ఆధిక్యంముందు ఢిల్లీ జట్టు తలవంచక తప్పలేదు. (ఈ. 29 7 89)

**తలవంచుకొను** క్రి. *talavancukonu* అవమానంతో సిగ్గుపడు to feel ashamed of అదృష్టవశాత్తు కొన్ని ఇతర శాసనసభల్లో జరిగిన దురదృష్టకరమైన, తలవంచుకోవాల్సిన ఘటనలు మనరాష్ట్ర శాసనసభలో జరగనందుకు సంతోషించాలి. (ఆం. భూ 20 4 89)

**తలసరిఆదాయం** వి. *talasari aadaayam* మొత్తం ఆదాయాన్ని ఆప్రాంత జనాభాతో భాగించితే వచ్చే ఆదాయసరాసరి average income per head రాష్ట్రంలో తలసరి ఆదాయం తగ్గును. ఆంధ్రప్రదేశ్‌లో తలసరి ఆదాయం 1985-86 కంటే 1986-87లో 0.4%

పడిపోయింది. (ఆం ప్ర 23.11.88)

**తలూపు** క్రి *taluupu* సమ్మతి తెలియజేయు to approve, okay, agree ... భద్రాచలం మీదుగా కొవ్వూరు వరకు కొత్తరైలు మార్గం ప్రతిపాదనకు కేంద్రప్రభుత్వం తలూపింది. (ఈ 8 3 88)

**తలెత్తు** క్రి. *talettu* (ఏదైనా సమస్య) ఆవిర్భవించు, పుట్టుకొచ్చు to arise, crop up ఇండో-శ్రీలంక ఒప్పందం మౌలిక లక్ష్యాలను నెరవేర్చకుండా శాంతి సేనను ఉపసంహరించడం వల్ల అక్కడ తీవ్రమైన ప్రమాదకరమైన పరిణామాలు తలెత్తే అవకాశం ఉందని మంత్రి చెప్పారు. (ఈ 21 7 89)

**తల్లకిందులు** వి. *tallakindulu* పల్టీ కొట్టి తిరగబడ్డ స్థితి to be turned turtle, capsized కారు వేగంగా వెడుతుండగా టైర్ రాడ్ విరిగిపోవడంతో అదుపు తప్పి రోడ్డుకు ఓ ప్రక్కగా తల్లకిందులుగా పడిపోయింది. (ఈ 22 6 89)

**తల్లడిల్లు** క్రి. *tallaDillu* విపరీతమైన భయం, బాధలతో అల్లల్లాడిపోవు to become panicky, be in serious trouble ... లోతట్టు ప్రాంతాల్లోని ప్రజలు, ఇళ్లు మునిగిపోయి, కూలిపోయి తల్లడిల్లిపోయినా కార్పొరేషన్ ఎమర్జెన్సీ స్క్వాడ్ జాడలేదని ... విమర్శించారు. (ఈ 26 7 89)

**తవ్వి తలకెత్తు** క్రి. *tavvi talakettu* బోలెడంత సహాయం చేయు to help on a large scale తక్షణ అవసరాలు, హంగులు నిమిత్తం ప్రభుత్వం నుంచి అప్పు తీసుకోడానికి వీలు కల్పించినప్పటికీ, తానే దివాలా స్థితికి చేరిన రాష్ట్రప్రభుత్వం, పరిషత్తులు సమాఖ్యలకేదో తవ్వితలకెత్తుతుందనుకోవడం అత్యాశే. (ఈ 17.3 88)

**తహతహ** వి. *tahataha* ఒక కార్యాన్ని సాధించడంపై ఉన్న బలమైన వాంఛ desire, longing ప్రభుత్వ పాలకుంను సంతృప్తి పరచి ఇంకేదో పదవి సంపాదించాలన్న తహతహ సి. ఏ. జి. లో రేకుండా చేయటానికి ... నిషేధించారు. (ఈ 28.7 89)

**తహతహలాడు** క్రి. *tahatahalaaDu* పని త్వరగా చేసెయ్యాలని అభిలషించు; తొందరపడు, ఆరాటపడు to hasten, rush, be anxious ... ఏకపక్షంగా నిర్ణయించి, తమకు సమర్థనీయమని తోచిన అంశాలతో రూపొందించిన బిల్లును ఇప్పటికిప్పుడు పార్లమెంట్‌లో ప్రవేశపెట్టడానికి తహతహలాడటం దురాలోచనా పూరితమైన తొందర పాటు. (ఈ 8 5 89)

**తాండవించు** క్రి *taanDavincu* ఒక ప్రదేశమంతటా నిండి ఉండు to loom (fear or threat) వచ్చిపోయే ప్రయాణీకులతో ఎప్పుడూ రద్దీగా ఉండే న్యూఢిల్లీ రైల్వే స్టేషన్‌లో ఇపుడు మృత్యుభీభత్సం తాండవిస్తున్నది. (ఆం. భూ 13 6 89)

**తాకట్టుపెట్టుకొను** క్రి. *taakaTTu peTTukonu* విలువైన వస్తువులను లేదా మనస్సును స్వప్రయోజనం కోసం పరుల అధీనంలో ఉంచు; కుదువ పెట్టు to mortgage రాజకీయ శక్తి ప్రజల నాడిని బట్టి వ్యవహరించి, ఆ మేరకు బ్యూరాక్రసీని ఆదేశించుకోవాలి. రాజకీయ శక్తి తన మేధస్సును తాకట్టుపెట్టుకోకూడదు. (ఆం భూ 22 6 89)

**తాకట్టు రుణం** వి. *taakaTTu ruNam* ఆస్తి, నగలు మొ. వాటిని సంబంధిత ఆర్థిక సంస్థలకు కుదువపెట్టి తెచ్చుకున్న అప్పు mortgage loan తాకట్టు రుణాలపై వడ్డీ తక్కువగా కనిపించినా ఆ రుణాలు

మంజూరు చేయించటానికి ... తక్కువేమీ కాదు. (ఆం. ప్ర 26.4.89)

**తాజా** విశే. *taajaa* ప్రస్తుతం ఉన్న లేదా ఇటీవలే జరిగిన current, latest అవ మ్మతి వర్గంలోని అగ్రశ్రేణి నాయకులు ... జరిపిన సమావేశంలో తాజా రాజకీయ పరిస్థితిని సమీక్షించారు. (ఆం ప్ర 14 2.89)

**తాజా అభిప్రాయం** వి. *taajaa abhipraayam* ఒక విషయం గురించి ప్రస్తుతం ఉన్న ఉద్దేశం latest opinion జనమోర్చాపై తాజా అభిప్రాయం. (ఉ. 13 10 87)

**తాజా నిర్ణయం** వి. *taajaa nirNayam* ప్రస్తుతం ఖరారైన అభిప్రాయం latest decision ... శ్రీ నట్వర్ సింగ్ శ్రీలంక హైకమీషనర్ ... తిలక్ రత్నేని కలసి భారత్ తీసుకున్న తాజా నిర్ణయం గూర్చి తెలిపారు. (ఆం. జ్యో 5 6.87)

**తాజా ప్రతిపాదన** వి. *taajaa pratipaadana* ప్రస్తుతం కొత్తగా చెప్పిన అభిప్రాయం fresh or latest proposal ... మీనవ్ సారథ్యంలోని ఉన్నతస్థాయి భారతీయ బృందం ... ఎం. జి. రామచంద్రవ్‌తోను, తమిళ తీవ్రవాద ప్రతినిధులతోను సమావేశమై శ్రీలంక ప్రభుత్వం చేసిన తాజా ప్రతిపాదనను వివరించింది. (ఈ. 22 7 87)

**తాజా వైఖరి** వి. *taajaa vaikhari* పాత ఆలోచనలకు భిన్నంగా ప్రస్తుతం ఉన్న ఆలోచన current thinking చివరి రోజుదాకా నెలకొన్న అనిశ్చితస్థితి తొలగి ప్రభుత్వ తాజావైఖరి తేటతెల్లమవటంతో అయోధ్య వాసులు ఊపిరి పీల్చుకొని స్థిమితపడ్డారు. (ఈ 10 11 89)

**తాత్కాలిక ఉత్తర్వు** వి *taatkaalika uttarvu* అంతిమ తీర్పువరకు వేచి ఉండకుండా న్యాయస్థానం మధ్యలో ఇచ్చే నిర్ణయం ; మధ్యంతరతీర్పు interim order రామమందిరం శిలా న్యాసానికి (శంకుస్థాపన) ఉద్దేశించిన స్థలం, అలహాబాద్ హైకోర్టు తాత్కాలిక ఉత్తర్వులో పేర్కొన్న వివాదాస్పద భూమిలో కాకుండా వెలుపలే ఉన్నదని ... వివరణ ఇచ్చారు. (ఆం భూ 9 11.89)

**తాత్కాలిక తీర్పు** వి. *taatkaalika tiirpu* చూ. తాత్కాలిక ఉత్తర్వు ... కాంగ్రెస్(ఐ) కార్యకర్తలకు వ్యతిరేకంగా తుదితీర్పు వెలువడితే మిగతారోజులు శిక్ష అనుభవించటానికి జైలుకు వెళ్ళవలసి ఉంటుందని సుప్రీంకోర్టు ఇచ్చిన తాత్కాలిక తీర్పులో పేర్కొన్నది. (ఆం భూ 26.4 89)

**తాత్కాలిక నివేదిక** వి. *taatkaalika niveedika* (అనుకోని ప్రమాదాలపై) వెంటనే లభ్యమైన వివరాలతో పై అధికారులకు పంపే రిపోర్టు interim or ad hoc report వరదలకు సంభవించిన నష్టంపై తాత్కాలిక నివేదికను రూపొందించి ... (ఆం. ప్ర 28 7 89)

**తాత్కాలిక ప్రభుత్వం** వి *taatkaalika prabhutvam* తిరుగుబాట్లు, ప్రభుత్వ పతనాలు జరిగిన పరిస్థితులలో కొద్దికాలం పరిపాలన కోసం ఏర్పాటయ్యే పాలనా వ్యవస్థ. interim government సైనిక తిరుగుబాటు నాయకుడు ఫిజీని రిపబ్లిక్‌గా ప్రకటించిన తర్వాత . . 19 మంది సభ్యులతో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటు చేశారు. (ఆం జ్యో 8 10 87)

**తాత్కాలిక భృతి** వి. *taatkaalika bhRti* వేతనాలు మారబోతున్న సమయంలో, తుదినిర్ణయం వచ్చేలోపల ఉద్యోగులకు

వేతనంలో ఇచ్చే పెంపుదల interim relief ... ఇ సి. ఐ. ఎల్. ఉద్యోగులు నేడు నల్ల బ్యాడ్జీలు ధరించి తాత్కాలికభృతి కోసం నిరసన దినం పాటించారు. (ఈ 6.6.87)

**తాత్సారం** వి. *taatsaaram* అలక్ష్యం వల్ల (విపరీతంగా) చేసే ఆలస్యం inordinate delay ... ఒప్పందం వెంటనే అమలు కాకుండా ఆలస్యం చేయటం, ఈ తాత్సారంవల్ల దారుణ ఫలితాన్ని నేడు భారత జాతి అనుభవిస్తోంది. (ఆం భూ 3 5.89)

**తాపీగా** క్రి.వి *taapiigaa* ఆవేశం, ఆగ్రహం లాంటివి చూపించకుండా నెమ్మదిగా in a relaxed mood, leisurely విలేఖరులను అడిగిన అనేక ప్రశ్నలకు శ్రీ చెన్నారెడ్డి తాపీగా సమాధానాలు చెప్పారు. (ఈ 16 7.89)

**తాబేదారు** వి. *taabeedaaru* ఒక వ్యక్తి లేదా సంస్థ అజమాయిషీలో పని చేస్తూ వాళ్ళ అదుపాజ్ఞలలో ఉండేవ్యక్తి subservient రాజ్యాంగ చట్టంలో కీలకమైన వ్యవస్థ అని డా. బి. ఆర్ అంబేద్కర్ అభివర్ణించిన సి. ఎ. జి ప్రభుత్వానికి తాబేదారు కాదు. (ఈ 24 7 89)

**తారతమ్యాలు** వి. (బ.వ.) *taaratamyaalu* స్థాయిలో ఉండే ఎక్కువ తక్కువ భేదాలు inequalities ఈ తారతమ్యాలు సమసి పోయేలా శాంతి సంక్షేమ కమిటీ కృషి చేయాలని కోరారు. (ఈ అను 1.5.89)

**తారసపడు** క్రి. *taarasapaDu* దృష్టిలోకి వచ్చు; ఎదురుపడు to come into contact ఉద్యోగం చేస్తున్న స్త్రీ చెడిపోయినదిగా భావించే మనస్తత్వమున్న సమాజంలో ఆమెనర్థం చేసుకొని వివాహం చేసుకునే వ్యక్తి తారసపడేసరికి ఆమె వయస్సు పెరిగిపోతుంది. (ఆం భూ 21 4.89)

**తారసిల్లు** క్రి. *taarasillu* చూ. తారసపడు. మత పిచ్చి, కులవెర్రి, రాజకీయ ఉన్మాదం, ప్రాంతీయ అహంకారం ఉన్న ఇటువంటి వాళ్ళు ప్రతివాళ్ళకి తారసిల్లుతూ ఉంటారు. (ఆం భూ. 22 4 89)

**తారాస్థాయి** వి. *taaraasthaayi* చాలా ఉన్నతమైన స్థితి; ఉచ్చస్థాయి at peak, flashpoint జనతాదళ్‌లో హెగ్డే, బొమ్మయ్ వర్గాల మధ్య ఒకవంక, దేవగౌడ(జనతా) జనతాదళ్ మధ్య మరోవంక మురాతగాదాలు తారాస్థాయిలో సాగుతున్నాయి. (ఆం భూ 26 4 89)

**తారుమారగు** క్రి. *taarumaaragu* పూర్తిగా మారిపోవు to have complete change అయితే దశాబ్ద కాలంలో ఒలంపిక్స్ క్రీడల పరిస్థితి తారుమారయ్యింది. (ఆం. భూ. 30 11.87)

**తారుమారుచేయు** క్రి. *taarumaaru ceeyu* వాస్తవాలను మరుగుపరచి (ఫైళ్ళను) మార్చివేయు to tamper with (documents etc.), to change positions ఈ రికార్డులను ప్రభుత్వం తారుమారు చేస్తున్నదని తాము భయపడుతున్నామని అందువల్ల ఈ చర్య తీసుకోవాలని ఆయన కోరారు. (ఆం. ప్ర. 16.12 87)

**తాహతు** వి. *taahatu* ఒక పని చేయటానికి ఉన్న నైతికహక్కు, స్థాయి (moral)right, status ఎన్. టి. ఆర్. నాయకత్వం వహిస్తున్న నేషనల్ ఫ్రంట్ నీతులు వల్లించే తాహతు కోల్పోయింది. (ఆం. భూ 21 5 89)

**తికమకపడు** క్రి. *tikamakapaDu* ఏమి చేయాలో తెలియని మానసికస్థితిలోకి వెళ్ళు, కలవరపడు to be confused అనేకసార్లు ఆ చిన్నారి బాలిక వ్యూహాలకు వరల్డ్ ఛాంపియన్ తికమకపడాల్సి వచ్చింది. (ఉ 22 3 88)

**తికమకపరచు** క్రి. *tikamakaparacu* ఇతరులకి ఏమి చెయ్యాలో తెలియని పరిస్థితిని కలిగించు; కలవరపరచు to confuse, baffle బహిరంగ సభలో వేదికపై కుర్చీలలో కూర్చోకుండా ఇటీవల ముఖ్యమంత్రి కింద కూర్చుంటున్న అలవాటు స్థానిక అధికారులను తికమక పరిచింది. (ఆం జ్యో 19 2 88)

**తికాణా** వి *tikaaNaa* బతికేందుకు అవసరమైన కూడూ, గూడూ, బట్టా minimum facilities to survive ... పూటకు తికాణా లేకపోయినా బిచాణా ఎత్తటానికి సిద్ధంగా ఉన్న అధికారంకోసం ఖజానాలకు బొక్కపొడుస్తూనే ఉన్నారు. (ఆం భూ 30 5.89)

**తిప్పికొట్టు** క్రి. *tippikoTTu* విమర్శలను, దాడులను సమర్థవంతంగా ఎదుర్కొను to rebuff, counter ... సంఘవ్యతిరేక శక్తులు జరిపే ప్రయత్నాలను యువజన కాంగ్రెస్(ఐ) సభ్యులు తిప్పికొడతారని ... ప్రకటించారు. (ఈ 26 4 89)

**తిరకాసు** వి. *tirakaasu* దురుద్దేశంతో కూడిన సమస్య, జటిలసమస్య, గొడవ intricacy, problem భారత చర్యతో ఈ ప్రాంతానికి సంబంధించి అనేక తిరకాసులు లోతుపాతులు ఉన్నాయని ఆమె వ్యాఖ్యానించారు. (ఆం ప్ర 3 9 87)

**తిరగతోడు** క్రి. *tiragatooDu* గతించిన లేదా మరుగున పడి ఉన్న వాటిని మళ్ళీ పైకి తీసుకొచ్చు, పునర్విచారణకు తెచ్చు to [illegible] up (a pro[illegible] or controversy), revive భారత్ నుంచి పంజాబ్‌ను విడదీయడానికు తల పెట్టిన ఆనంద్‌పూర్ సాహెబ్ తీర్మానాన్ని ప్రతిపక్షాలే తిరగదోడుతున్నాయని ... ఆరోపించారు. (ఈ. 18 11 89)

**తిరగబడు** క్రి. [illegible]*Du* పై స్థానంలో ఉన్న వ్యక్తులు లేదా ప్రభుత్వాల నిర్ణయాల భావాలపట్ల తీవ్ర వ్య[illegible] ప్రకటించు; వ్యతిరేకించు to revolt కానీ తీవ్రంగా తిరగబడే బదులు స్థిరంగా పరిస్థితులు మార్చాలన్న వైఖరి తీసుకొని మధ్యంతర ఎన్నికలకు ఆమె డిమాండ్ చేశారు. (ఉ 12 10.87)

**తిరస్కరించు** క్రి. [illegible] ఒప్పుకోనకపోవు. (తోసిపుచ్చు, నిరాకరించు, వద్దను to reject, refute బోఫోర్స్ వ్యవహారాన్ని దాచుస్తున్నామన్న ఆరోపణను ప్రధాని తిరస్కరించారు. (ఉ. 15 10.87)

**తిరుక్షవరంచేయు** క్రి. *tirukSavaram ceeyu* ఘోరంగా మోసం చేయు to deceive, rob వేలాది మంది అమాయక ప్రజలకు తిరుక్షవరం చేసిన సప్తగిరి కంపెనీ ఉదంతం ఇంకా మన జ్ఞాపకాల్లోంచి చెరిగిపోకముందే ... నలుగురు మోసగాళ్ళు ... టోపీవేసి ఉడాయించారు. (ఆం. ప్ర 4 10 88)

**తిరుగుబాటు అభ్యర్థి** వి *tirugubaaTu abhyarthi* పార్టీ అనుమతి లేకుండా ఎన్నికల్లో పోటిచేసిన వ్యక్తి rebel-candidate శ్రీ సన్యాసినాయుడు గజపతినగరం అసెంబ్లీ నియోజకవర్గంలో తిరుగు బాటు అభ్యర్థిగా ఉన్నారు (ఆం భూ 21 11 89)

**తిరుగుబాటుచేయు** క్రి. *tirugubaa-*

*ceeyu* (మార్పులకోసం) సంస్థాగత విధానాలకు వ్యతిరేకంగా ప్రవర్తించు, పో. చూ. తిరగబడు to revolt *ఈ నలుగురు మంత్రులు గతవారం పార్టీకి వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు.* (ఆం. ప్ర. 21.11.89)

**తిరుగుబాటు జట్టు** వి. *tirugubaaTu jaTTu* సంబంధిత క్రీడా సంస్థ అనుమతి లేకుండా నిషిద్ధ విదేశీ పర్యటనకు వెళ్లే బృందం rebel-team *దక్షిణాఫ్రికాలో పర్యటించనున్న ఇంగ్లాండ్ తిరుగుబాటు జట్టుతో డ్రెఫిటాస్ కూడా చేయికలిపినా తర్వాత నిర్ణయం మార్చుకున్న సంగతి తెలిసిందే.* (ఆం. ప్ర. 24.8.89)

**తిరుగుబాటుదారుడు** వి. *tirugubaaTu daaruDu* ఉన్న ప్రభుత్వాన్ని పడగొట్టే ఉద్దేశంతో సాయుధులై ప్రభుత్వ సైన్యాలతో పోరాడే వ్యక్తి rebel, insurgent *మజాహుద్దీన్ తిరుగుబాటుదారులకు విమానాలు లేవు.* (ఆం. ప్ర. 19.4.88)

**తిరుగుబాటు ధోరణి** వి. *tirugubaaTu dhooraNi* పై వాళ్ళ అభిప్రాయానికి వ్యతిరేకంగా ప్రవర్తించే స్థితి rebellious attitude ... *బోధా ప్రభుత్వం తిరుగుబాటు ధోరణిలో నున్న నల్లవారిని దారికితెచ్చే పద్ధతులను ...* (ప్ర.శ. 5.6.87)

**తిరుగుముఖంపట్టు** క్రి. *tirugumukham paTTu* పై నాయకత్వం వద్దకు ఏవో కోర్కెలతో వెళ్ళిన రాజకీయ బృందం (నిరాశతో) ఇంటిదారి చూచుకొను; వెనక్కువచ్చు to return, retreat, go back *తిరుగుముఖం పట్టిన కాంగ్రెస్ కార్యకర్తలు.* (ఆం. ప్ర. 5.11.88)

**తిరుగులేని నిజాలు** వి. (బ.వ.) *tiruguleeni nijaalu* ప్రశ్నించటానికి వీల్లేని వాస్తవాలు undisputed facts ... *సింగ్ చేస్తున్న వ్యాఖ్యలను తిరుగులేని నిజాలుగా ప్రజలు పరిగణిస్తున్నారని పేర్కొన్నారు.* (ఈ. 1.1.88)

**తిలకించు** క్రి. *tilakincu* అట్టహాసంగా జరిగే కార్యక్రమాలను చూచు to watch the programmes with gaiety ... *పారిస్‌లో కళ్ళు మిరుమిట్లు గొలిపేలా ఎంతో ఆడంబరంగా సైనిక్ పెరేడ్ జరిగింది. వీనిని తిలకించిన ప్రపంచ నాయకుల్లో సంపన్న దేశాల అధినేతలు కూడా ఉన్నారు.* (ఈ. 15.7.89)

**తిలోదకాలిచ్చు** క్రి. *tiloodakaaliccu* పూర్తి గావదలివేయు to say good-bye, move away from *రాష్ట్ర ప్రభుత్వం ప్రజాస్వామ్య పంథాకు తిలోదకాలిచ్చి రాచరికపు పోకడలను అనుసరిస్తున్నదని ... విమర్శించారు.* (ఆం. ప్ర. 20.11.88)

**తిష్టవేయు** క్రి. *tiSTaveeyu* ఒకే ప్రదేశంలో దీర్ఘకాలంపాటు ఉండు; కదలక మెదలక ఉండు to settle *అభివృద్ధి నిరోధక సిద్ధాంత వేత్తలు తిష్టవేసిఉన్న బెర్లిన్ యూనివర్సిటీకి కాక జేనా యూనివర్సిటీలో థీసిస్ సమర్పించాడు.* (ఆం. భూ. 5.5.89)

**తీయు** క్రి. *tiiyu* (చలన చిత్రాలు) నిర్మించు to make (film) *ఇదివరలో మాభూమి, రంగులకల చిత్రాలు తీసి అవార్డు పొందారు.* (ఆం. ప్ర. అను. 21.4.89)

**తీరిపోవు** క్రి. *tiiripoovu* పూర్తిగా తొలగిపోవు to get resolved ... *విభేదాలు లేవని, ఏవయినా అపార్థాలు ఉన్నప్పటికీ అవి నేటితో తీరిపోయాయని ఆయన అన్నారు.* (ప్ర.శ. 8.10.87)

**తీరుతెన్నులు** వి. (బ.వ.) *tiirutennulu* (ఒక వ్యవస్థ) నిర్మాణ

స్వరూపం, నిర్వహణా విధానం; రూపు రేఖలు structure, shape (of a system), ways and means *ప్రాక్, పశ్చిమ దేశాల సంబంధాల విషయంలో చొరవ తీసుకోడానికి గట్టిగా యత్నిస్తున్న బుష్ తన పథకం 1993 నాటికి ప్రపంచంలో మొత్తం సైనిక వ్యవస్థ తీరుతెన్నులనే మార్చివేయగలదన్నారు.* (ఈ 30 5 89)

**తీర్చిదిద్దు** క్రి. *tiircididdu* (ప్రాతిపదికగా ఉండి) ఒక సవ్యమైన ఆకారాన్ని, విధానాన్ని కలుగజేయు to shape *వ్యాపారంగం తీరుతెన్నులే మన సమాజపు రూపురేఖల్ని తీర్చిదిద్దుతున్నపుడు, వ్యవసాయ రంగాన్ని వ్యాపార విలువల బారినుండి కాపాడి* ... (ఉ 3 3 88)

**తీర్పు** వి. *tiirpu* ఒక వివాదంపై న్యాయవిచారణ జరిపి న్యాయస్థానం చేసే నిర్ణయం judgement, verdict *ముఖ్యమంత్రి శ్రీ ఎన్టీరామారావు 'విశ్వామిత్ర' చిత్రంలో నటించటాన్ని నిరోధించాలని కోరుతూ దాఖలైన కోవారెంటో, మాండమస్ రిట్ పిటిషన్లపై గురువారంనాడు హైకోర్టు తీర్పును ఇస్తుంది.* (ఆం ప్ర. 31 8 89)

**తీర్పుచెప్పు** క్రి. *tiirpuceppu* (న్యాయమూర్తులుగానీ, అలాంటి నిర్ణాయకస్థితిలో ఉన్న వేరే వ్యక్తులుగానీ) ఒక వివాదం లేదా విషయంపై తమతుది న్యాయనిర్ణయం ప్రకటించు to give one's verdict or judgement *శాసన సభకు వెళ్ళాల్సిన 294 మంది అభ్యర్థులెవరో రాష్ట్రం నుంచి పార్లమెంట్‌కు పంపాల్సిన 42 మంది సభ్యులెవరో ఓటర్లు రేపు తీర్పుచెప్తారు.* (ఆం భూ. 21 11.89)

**తీర్మానం** వి. *tiirmaanam* ఒక విషయంపై అభిప్రాయ ప్రకటన చేస్తూ సమావేశంలో ఆమోదించిన నిర్ణయం resolution *ఈ ఆరోపణలు వచ్చి అబద్ధమని, బెంగుళూరులో ఒక తీర్మానంలో తమ పార్టీ ఈ ప్రయోగం పట్ల హర్షం వ్యక్తం చేసిందని ఆయన అన్నారు.* (ఆం ప్ర 23 6 89)

**తీర్మానంచేయు** క్రి. *tiirmaanam-ceeyu* ఒక విషయంపై సమావేశంలో చర్చించి అధికారిక నిర్ణయాన్ని ప్రకటించు to resolve, pass a resolution *ఢిల్లీలో పథకం ప్రకారం జరగకపోతే పి. సి. సి (ఐ) ఎందుకు తీర్మానం చేస్తుందని ఆయన అన్నారు.* (ఆం. భూ 28 8 89)

**తీర్మానించు** క్రి. *tiirmaanincu* చూ. తీర్మానం చేయు. *తెలుగుదేశం లెజిస్లేచర్ పార్టీ కార్యాలయంలో శుక్రవారం నాలుగు పార్టీలు సమావేశమై పై విధంగా తీర్మానించాయి.* (ఆం భూ. 22 7 89)

**తీవ్రంగా** క్రి.విశే. *tiivrangaa* ఒకరికొకరు తీసిపోని విధంగా; ఉధృతంగా, పోటాపోటీగా tough, seriously *ఢిల్లీతో ఉత్తరప్రదేశ్ జట్టు ఢీకొన్న పోటీ చాలా తీవ్రంగా కొనసాగింది.* (ఈ 29.7.89)

**తీవ్ర చర్య** వి. *tiivra carya* (పరిస్థితి చేయి జారిపోతుందనుకున్నస్థితిలో దాన్ని చక్క దిద్దటానికి) అధికారికంగా తీసుకునే కఠిన నిర్ణయం drastic step or serious measure ... *రాష్ట్రపతి భవన్‌కు వెళ్ళి కేంద్రం ఎందుకు ఇంత తీవ్ర చర్య తీసుకోవలసి వచ్చిందో వివరించిన తర్వాత శ్రీ వెంకటరామన్ సంతకం చేశారు.* (ఆం భూ. 22 4 89)

**తీవ్ర తరం అగు** క్రి. *tiivra taram agu* ఉన్నదానికన్నా చాల ఎక్కువ అగు; అధికం అగు to become very serious, to be intensified *గత రెండు మాసా*

లలో రాష్ట్రంలో నక్సలైట్ల కార్యకలాపాలు తీవ్ర తరమైనాయి (ఆం ప్ర 16 6 87)

**తీవ్రమైన** విశే. ... చాలా అధి కమైన; ఎక్కువైన severe, acute, very serious ... త్వరలోనే దేశానికి తీవ్రమైన ఎద్దడి ఏర్పడిందని ... అన్నారు (ఆం భూ 11 08 7)

**తీవ్ర రూపం** వి. tiivra ruupam ఆందోళన కలిగించే స్థితి serious dimension or shape serious form కర్నాటక అధికార జనతా పార్టీలో సంక్షోభం మరోసారి మరింత తీవ్ర రూపం దరించింది. (ఆం జ్యో 22 4 88)

**తీవ్ర స్థాయి** వి tiivra sthaayi ఎక్కువ ఆవేశం, ఉద్రేకాలతో కూడుకున్న దశ state of charged emotion వాజ్ పాయ్-సయ్యద్ షహాబుద్దీన్ మధ్య మరో సారి తీవ్రస్థాయిలో జరిగిన వాదోపవాదాల ఫలితంగా సమావేశంలో ఉద్రిక్తత చోటుచేసు కుంది. (ఈ 16 5 88)

**తీసికట్టు** వి. tiisikaTTu నిరాశా జనకమైన లేదా సంతృప్తికరంగా లేని స్థితి discouraging (state) దేశం లోని అన్ని ప్రాంతాలతోను పోలిస్తే దక్షిణ ప్రాంతంలో ఎనిమిదవ ప్రణాళిక కాలంలో డిమాండ్ విషయంలో విద్యుత్ విషయం లోనూ కూడా తీసికట్టు పరిస్థితి కనబడు తుంది. (ఆం భూ 6 7 89)

**తీసిపారేయు** క్రి tiisipaareeyu పనికి రానట్లుగా పరిగణించు to write off, brush aside విండీస్‌లో ఓడినందుకు దేశంలోని క్రికెట్ పండితులు మమ్మల్ని తీసిపారేస్తున్నారు (ఆం భూ 13 6 89)

**తీసిపోవు** క్రి. tiisipoovu సామర్థ్యం, నైపుణ్యం మొ. విషయాలలో ఇతరు లకన్నా తక్కువస్థాయిలో ఉండు to lag behind, be inferior ... ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంలో ఫ్రాన్స్ ఏ దేశానికి తీసిపోలేదని ఆయన అన్నారు. (ఆం ప్ర 17 10 87)

**తుంగలో తొక్కు** క్రి. tungaloo tokku నియమ నిబంధనలు పాటించకుండా ఉండు; బొత్తిగా ఖాతరు చేయకపోవు to ignore (a rule) డిగ్రీ కళాశాలలో నాలుగు లెక్చరర్ పోస్టులు ఖాళీగా ఉన్నప్పుడు అందులో మూడింటిని ... భర్తీ చేయాలని, ఒక పోస్టుకు నేరుగా నియమించాలన్న నిబం ధనలను కూడా రాష్ట్ర ప్రభుత్వం తుంగలో తొక్కిందని వారు విమర్శించారు. (ఆం భూ 25 7 89)

**తుడిచిపెట్టు** క్రి. tuDicipeTTu 1. ఎన్ని కలలో ప్రత్యర్థిని తీవ్రంగా దెబ్బతీయు to rout sb in the elections వచ్చే ఎన్నికలలో తెలుగుదేశాన్ని తుడిచిపెట్టి కాంగ్రె సును తిరిగి అధికారంలోకి తెచ్చి ... 2. ఉనికిని లేకుండా నాశనం చేయు to destroy చైనా ఈశాన్య ప్రాంతంలో పెద్ద విస్తీర్ణంలో అడవులను తుడిచిపెట్టి దాదాపు 191 మంది ప్రాణాలను బలిగొన్న . . (విశా. 8 6 87)

**తుడిచిపెట్టుకుపోవు** క్రి. tuDicipeT-Tuku poovu పూర్తిగా దెబ్బతిను; ఉనికి కోల్పోవు, లేకుండాపోవు to be wiped off ... ఆ ప్రోత్సాహకాలు ఉపయోగించుకుని చిత్ర నిర్మాణం జరుపుదా మనే ఆలోచన నిర్మాతల్లో ఉంటే అది ఈ ప్రకటనతో పూర్తిగా తుడిచిపెట్టుకు పోతుంది. (ఆం ప్ర అను 21 4 89)

**తుత్తునియలుచేయు** క్రి. tuttuniyalu ceeyu తీవ్రంగా దెబ్బతీయు to break

(the hold of sb), shatter ... *భజన్‌లాల్ ఫరీదాబాద్ నియోజకవర్గంపై ముస్లింల ఆధిపత్యాన్ని తుత్తునియలుచేసేందుకు శతవిధాలా ప్రయత్నిస్తున్నారు.* (ఈ 17.11 89)

**తుదముట్టించు** క్రి. *tudamuTTincu* పూర్తిగా నశింపజేయు; అణగదొక్కు to destroy, liquidate (politically) ... *అట్టివారిని ఏకాకులను చేసి తుదముట్టించడంలో కాంగ్రెసువాదులు సమైక్యంగా వ్యవహరించాలని ఆయన విజ్ఞప్తి చేశారు.* (ఆం భూ 22 5 89)

**తుది జాబితా** వి. *tudi jaabitaa* ఒక క్రమ పద్ధతిలో రాసిన పేర్ల వరుస final list ... *వీటి అన్నిటినీ పరిశీలించి అధిష్ఠానవర్గం తుది జాబితా రూపొందించిందని డాక్టర్ చెన్నారెడ్డి తెలిపారు.* (ఈ 4 5 89)

**తుది తీర్పు** వి. *tudi tiirpu* చూ. తీర్పు final judgement *కోర్టు తుది తీర్పు వెలువడలేదు.* (ఈ 1 5 89)

**తుది మెరుగులు** వి. (బ.వ.) *tudi merugulu* చివరిసారిగా చేసే మార్పులు చేర్పులు finishing touches ... *ఎన్నికల సంస్కరణల బిల్లుకు తుది మెరుగులు దిద్దటం జరుగుతోందని ... చెప్పారు* (ఆం జ్యో 8 10 88)

**తుది రూపం** వి. *tudi ruupam* (నివేదికలకు, పథకాలకు) ఒక ప్రతిపాదనను తయారుచేసి చేర్పులు మార్పులతో అంతిమంగా ఖరారు చేసినప్రతి final shape *తనకు అందిన సమాచారం ప్రకారం, నివేదిక ఇంకా తుది రూపం దిద్దుకోలేదని స్పీకర్ చెప్పారు.* (ఆం ప్ర. 19 7 89)

**తుది విచారణ** వి. *tudi vicaaraNa* వివాదాలను తేల్చటంలో కోర్టు సాక్ష్యాలను, వాదోపవాదాలను ఆలకించే క్రమంలో ఆఖరి ఘట్టం final hearing ... *ఫుల్ బెంచ్ ఈ రిట్ పిటిషన్ల తుది విచారణను ఆగస్టు 7వ తేదీకి వాయిదా వేసింది.* (ఆం. ప్ర 5.7 89)

**తూట్లుపొడుచు** క్రి. *tuuTlupoDucu* (ప్రభుత్వం, వ్యవస్థ, పథకం మొ. వాటిని) కుట్రతో దెబ్బతీయు to sbotage *కర్ణాటకలోని జనతాదళ్ మంత్రివర్గాన్ని విజయవంతంగా కూలదోసిన కేంద్రం ఇప్పుడు ప్రతిపక్షపాలిత ... రాష్ట్ర ప్రభుత్వాలకు తూట్లుపొడవాలని పథకం వేస్తోంది.* (ఈ 25 4.89)

**తూర్పారపట్టు** క్రి. *tuurpaarapaTTu* ఇతరులను తప్పుపడుతూ, తీవ్రంగా విమర్శించు to flay *ప్రధాని తన ప్రసంగంలో మితవాద, వామ పక్షాలవాదులను తూర్పారపట్టారు.* (ఆం భూ 22 6 89)

**తూలనాడు** క్రి. *tuulanaaDu* జరిగిన పొరపాటుకు ఒకరిని బాధ్యుల్ని చేస్తూ నిందించు to rebuke, blame *జరిగిన నష్టాలేమైనా ఉంటే వాటి నుంచి యువతరం నాయకత్వం గుణపాఠాలు నేర్చుకునేదిపోయి నిర్మాతలను మొత్తంగా తూలనాడసాగారు.* (ఆం. భూ. 5 6 89)

**తూష్ణీభావం** వి. *tuuSNiibhaavam* ఒక విషయం, వ్యక్తి, సంస్థ పట్ల తేలిక భావం, ఉపేక్షాభావం carelessness, reluctance *సుష్టుగా భోంచేసి త్రేన్చినంత తేలిగ్గా శ్రీ వెంగళరావు చెప్పిన తీరును బట్టి పత్రికలన్నా, వాటిని చదివే ప్రజలన్నా ప్రభుత్వానికున్న సానుభూతి రహితవైఖరి, తూష్ణీభావమూ వ్యక్తమవుతున్నాయి.* (ఈ 11 5 89)

**త్రుటి** వి. *tRTi* క్షణకాలం, కొద్ది narrow

(as in narrow escape) బొకారో ఎక్స్‌ప్రెస్ రైలుకు తృటిలో ప్రమాదం తప్పింది (ఆం భూ. 19 5 89)

**తృణధాన్యం** వి. *tRNadhaanyam* ఆహారంగా పనికి వచ్చే పంట గింజలు (గోధుమ, వరి మొ.) cereal, edible grain తృణధాన్యాలు-ధరవరలు. (ఆం జ్యో. 22 10 87)

**తృణీకరించు** క్రి. *tRNiikarincu* (వద్దను) తక్కువ వారిగా పరిగణించు to reject, despise, belittle ప్రస్తుత రాజకీయ నాయకులను తృణీకరిస్తూ మాట్లాడటం కూడా ఎందరినో బాధించింది. (ఆం. భూ. 30 5.89)

**తృతీయ ప్రపంచదేశాలు** వి. *tRtiiya prapanca deeśaalu* కమ్యూనిస్టు దేశాలతో గాని, పశ్చిమ దేశాలతో గాని ప్రత్యేక సైనిక సంబంధాలు లేకుండా ఇప్పుడే అభివృద్ధి చెందుతున్న ఆసియా, ఆఫ్రికా,లాటిన్ అమెరికా ఖండాలకు చెందిన రాజ్యాలు Third World Countries తృతీయ ప్రపంచ దేశాల ఆర్థిక సమస్యల పట్ల ... (ఆం ప్ర 9 9 89)

**తెగతెంపులుచేసుకొను** క్రి. *tegatempuluceesukonu* (తీవ్రమైన) భేదాభిప్రాయాలవల్ల ఇతరులతో తనకు ఉన్న సంబంధ బాంధవ్యాలను ఏక పక్షంగా ఆపివేయు to sever relations with ఇరాన్ ప్రవర్తన ఏమాత్రం ఆమోదయోగ్యంగా లేదని ఆరోపిస్తూ, ఆ దేశంతో దౌత్య సంబంధాలను నామమాత్రస్థాయికి బ్రిటన్ తెగతెంపులుచేసుకున్నది. (విశా. 20.6 89)

**తెగనరుకు** క్రి. *teganaruku* పదునైన ఆయుధంతో దాడిచేసి చంపు to hack ... ఒక గ్రామంపై దాడి చేసి 10 మంది సింహళీయులను తెగనరికారు. (ఆం. ప 16.10.87)

**తెగిపోవు** క్రి. *tegipoovu* (సంబంధాలు) పూర్తిగా దెబ్బ తినిపోవు to be severed అమెరికాతో దౌత్య సంబంధాలు తెగిపోయే ప్రమాదం ఏర్పడ్డా నెహ్రూ రాబ్సన్ 60 జన్మదినోత్సవాలలో పాల్గొన్నాడని ఆత్మకథలో పేర్కొన్నారు. (ఆం భూ 1.5 89)

**తెగేసిచెప్పు** క్రి. *tegeesiceppu* మొగమాటం లేకుండా వాస్తవాలను స్పష్టంగా వివరించు to state the facts without any fear or favour ఇలా ఆకస్మికంగా అభిప్రాయం మార్చుకోడానికి రక్షణ శాఖ ఉటంకించిన కారణాలేవీ నమ్మశక్యంగా లేవని సి. ఎ. జి. తెగేసి చెప్పారు. (ఈ. 21 7.89)

**తెప్పరిల్లు** క్రి. *tepparillu* తగిలిన దెబ్బ నుంచి కోలుకొను to recover ... దయనీయ స్థితిలో కొట్టు మిట్టాడుతున్న కృషీవలుడు తెప్పరిల్లడమే కనుక నిజంగా జరిగితే, అంతకన్నా కావలిసింది మరొకటి లేదు. (ఈ. 17 3 88)

**తెమిలిపోవు** క్రి. *temilipoovu* పని పూర్తిగా అయిపోవు to be finished, to be finalized నేరాలను అదుపు చేయడం ఒక్కరోజులో తెమిలిపోయే వ్యవహారంకాదు. (ఆం భూ. 18 5 89)

**తెర** వి. *tera* పూర్తికావటం; ముగింపు curtain, coming to a halt రేపు పోలింగు జరిగే చోట్ల ప్రచారానికి తెర.

**తెరచాటున** క్రి.వి. *teracaaTuna* పైకి కనబడకుండా; నేపథ్యంలో behind the curtain ఆఫ్ఘన్ సమస్య పరిష్కారానికి భారత దేశం తెరచాటున గణనీయమైన పాత్ర నిర్వహించింది. (ఆం భూ. 21 4 88)

**తెరపడు** క్రి. *terapaDu* (ప్రచారం, సంచలనం, సంఘటన మొ.) ముగింపునకు

వచ్చు to come to an end ... ప్రతాప్ సింగ్ ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. దీనితో గతకొద్ది రోజులుగా నాయకుడి ఎంపికపై జరుగుతున్న తర్జన భర్జనలకు తెరపడింది. (ఆం భూ. 2.12.89)

**తెరపైకి వచ్చు** క్రి. *terapaiki vaccu* సమస్యల సాధన విషయంలో ఆసక్తి కనపరుస్తూ ఆకస్మికంగా ముందుకు వచ్చు to appear on the scene (as in politics) ... అయోధ్య వివాదం విషయమై సంభాషణలు సాగిస్తే అంతా శాంతి స్నేహాలనే ఆకాంక్షించారని వి. పి. సింగ్ చెప్పారు. "మధ్యలో బూటాసింగ్ తెరపైకి" వచ్చేశారు. ఆయన ప్రయత్నాలను కొనసాగనిద్దాం అన్నారు. (ఈ 10 10 89)

**తెరమరుగవు** క్రి. *teramarugavu* ప్రాముఖ్యాన్ని కోల్పోవు to disappear (from the scene) ఇటీవల అద్భుతంగా రాణించిన మెక్నో అకస్మాత్తుగా తెరమరుగవ్వడం తనకెంతో ఆశ్చర్యం కల్గించిందని అన్నాడు. (ఈ 2 9 89)

**తెరవేయు** క్రి. *teraveeyu* ముగింపు పలుకు to bring down the curtain, put an end to కీలకమైన విశ్వాస తీర్మానం ఓటింగ్‌లో కాంగ్రెస్(ఐ) ఎవరి పక్షం వహిస్తుందన్న విషయంలో కొన్ని వారాలుగా నెలకొని ఉన్న సస్పెన్స్‌కు రాజీవ్ ప్రకటన తెరవేసింది. (ఈ. 28 1.88)

**తెలంగాణా ఉద్యమం** వి. *telangaaNaa udyamam* ప్రత్యేక రాష్ట్రంగా తెలంగాణా ప్రాంతాన్ని ప్రకటించాలని 1969 లో వచ్చిన (వేర్పాటు) ఉద్యమం Telangana agitation (1969) to declare Telangana as a separate state తొలి ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానంద రెడ్డి బ్రహ్మాండమైన తెలంగాణ ఉద్యమాన్ని ఎదుర్కోగా ... (ఆం. జ్యో 1.1 88)

**తెలియజేయు** క్రి. *teliyajeeyu* ఇతరులకు ఏదైనా విషయానికి సంబంధించిన సమాచారాన్ని లేదా అభిప్రాయాన్ని అందజేయు to convey, express, inform పరిశ్రమలు, వాణిజ్యశాఖ మంత్రి ... నేడిక్కడ పై విషయాన్ని తెలియజేశారు. (విశా. 12 10.87)

**తెలియవచ్చు** క్రి. *teliyavaccu* సమాచారం అందు (to come) to be known ఈ ఎన్నికల్లో ఒక్కో వోటర్‌కు 20 రూపాయాలు, ఒక సారాయి పాకెట్‌ను పంచినట్లు తెలియవచ్చింది. (ఆం. ప్ర 4.12.87)

**తెలుగు గంగ** వి. *telugu ganga* మద్రాసు నగరానికి మంచినీళ్ళు, రాయల సీమకు సాగునీటిని కృష్ణానది నుంచి తరలించడానికి ఆంధ్ర, తమిళనాడు రాష్ట్రాలు ఉమ్మడిగా చేపట్టిన ప్రాజెక్టు Telugu ganga (a joint project of Tamilanadu and Andhra pradesh intended to provide drinking water to Madras city and irrigation facilities to Rayalaseema region in Andhra pradesh) ఈ నిబంధన ఆంధ్రప్రదేశ్ రూపొందించిన 'తెలుగు గంగ' ప్రాజెక్టులో స్పష్టంగా లేదు. (ఆం భూ 20 4 88)

**తెలుపు** క్రి. *telupu* చూ. తెలియజేయు మున్సిపల్ పాలనా శాఖ ... ఈ నెలలో కూడ కొంత సొమ్ము విడుదల చేయడానికి సుముఖత తెలిపినట్టు ఆయన వివరించారు. (ఆం జ్యో 18.12 87)

**తెల్లబోవు** క్రి. *tellaboovu* ఊహించని సంఘటనతో ఆశ్చర్యానికిలోనగు to

be taken aback, astonished ఇందిర అనంతరం ఏమిటన్న అమెరికన్లు ఈ చర్యతో తెల్లబోయారన్నారు. (ఈ. 21 8 89)

**తేటతెల్లంచేయు** క్రి. *teeTatellamceeyu* అనుమానాలకు ఆస్కారం లేకుండా చాలా స్పష్టంగా వివరించు to reveal, make crystal clear ... కాంట్రాక్టు షరతులను కూడ ఆ సంస్థకే ఎక్కువ అనుకూలంగా మలచి తగని మక్కువ చూపారని సిఎజి నివేదిక తేటతెల్లంచేసింది. (ఈ 21 7 89)

**తేరుకొను** క్రి. *teerukonu* ఒక అనూహ్య సంఘటనవల్ల ఏర్పడిన దిగ్భ్రాంతి నుంచి బయటపడు; పో. చూ. తెప్పరిల్లు to recover (from shock, dismay etc.) ఇస్లామాబాద్, రావల్పిండి నగరాలు ఈ దుర్ఘటన, దిగ్భ్రాంతి నుంచి ఇంకా తేరుకోలేదు. (ఆం జ్యో 12 4 88)

**తేలిపోవు** క్రి. *teelipoovu* స్పష్టమగు to become clear ... వి. పి. సింగ్ మాటలను బట్టి చూస్తే బి. జె. పి. తో దళ్ పొత్తు చిక్కుల్లో పడ్డదని తేలిపోయింది. (ఈ 10 10.89)

**తేలు** క్రి. *teelu* కారణభూతమైన వాస్తవం బయటకు వచ్చు; బయటపడు to be found (as a fact) ... ఈ స్థావరాలు ఫిలిప్పీన్స్ ప్రజలకు ఎయిడ్స్‌వ్యాధి సంక్రమింపజేస్తున్నాయని ఒక పరిశీలనలో తేలింది. (ప్రజ 27 10 87)

**తేల్చిచెప్పు** క్రి. *teelciceppu* అస్పష్టతకు తావులేకుండా ఒక విషయాన్ని నిర్దిష్టంగా వ్యక్తంచేయు to make a specific statement without any vagueness, state clearly రాజ్యాంగ రీత్యా గాని, ప్రవర్తనా నియమావళిలోని నిబంధనలను బట్టిగాని ఫలానా అర్థం వస్తుందని తేల్చిచెప్పడం సాధ్యంకాదు. (ఆం. భూ 19 89)

**తేల్చు** క్రి. *teelcu* నిర్ణయించు to decide నేడు మొత్తం 1,271 మంది అభ్యర్థుల భవితవ్యాన్ని 84.10 లక్షల మంది ఓటర్లు తేల్చవలసివుంది. (విశా 18 6 87)

**తేల్చుకొను** క్రి. *teelcukonu* (బలాబలాల అంచనాపై) ఒక నిర్ణయానికి వచ్చి ఎవరిది పైచేయో నిర్ధారించు కొను to decide శ్రీ విశ్వనాథ ప్రతాప్ సింగ్ వర్గంతో బలాబలాలు తేల్చుకోవాలన్న విధానాన్ని ప్రస్తుతానికి విరమించుకోవాలని ... (ఆం ప్ర. 30 5.89)

**తైనాతీలు** వి. (బ.వ.) *tainaatiilu* స్వార్థం కోసం ఇతరుల నాశ్రయించి, వాళ్ళు చెప్పినట్లుగా నడచుకొనే మద్దతుదార్లు henchmen, minions ... దేశాన్ని దోచిన ఘరానా దొంగలు, వారి తైనాతీలు, తోడుదొంగలు మహారాజుల్లా నేటికీ వెలిగిపోతూనే ఉన్నారు. (ఈ. 27.4 89)

**తొక్కిపెట్టు** క్రి. *tokkipeTTu* ఏదైనా ఫైలునుగానీ, ప్రణాళికను గానీ ఖరారు చేయకుండా ఆపి ఉంచు to keep in pending ఇప్పుడు ఎన్టీరామారావు ఆరు వేల ఫైళ్ళను తొక్కిపెట్టి కనీసం గవర్నర్ వద్ద అయినా అనుమతి పొందకుండా తన కాలాన్నంతా సినిమాల నిర్మాణానికి వినియోగిస్తున్నారు. (ఆం భూ 21 4 89)

**తొక్కిసలాట** వి. *tokkisalaaTa* ఒక దగ్గర చేరిన గుంపులో రద్దీవల్ల ఒకరినొకరు తోసుకొనే పరిస్థితి stampede ప్రతినిధులకోసం కేటాయించిన ఎ.ఐ.సి.సి.(ఐ) కాంటీన్ దగ్గర లేత కొబ్బరికాయల కోసం తొక్కిసలాటే అయింది. (ఉ 24 4.88)

**తొత్తు** వి. *tottu* చూ. తైనాతీలు. ఆఫ్ఘనిస్తాన్‌లో నిష్పక్షపాత, విశాల దృక్పథంగల

ప్రభుత్వం ఏర్పాటుకోసం అక్కడ నుండి సోవియట్ యూనియన్ తొత్తులను తొలగించాలని పాకిస్తాన్ ప్రధాని ... పిలుపునిచ్చారు. (ఆం భూ 29 5 89)

**తొలగించు** క్రి. *tolagincu* 1. వ్యక్తిని (సంస్థ నుంచి) బయటికి పంపివేయు to remove డాక్టర్ సుబ్రహ్మణ్యస్వామి వంటి విచ్ఛిన్నకర శక్తులను జనతాదళ్ నుంచి తొలగించే ప్రయత్నాలు త్వరలో ప్రారంభిస్తామని ... తెలియజేశారు. (ఆం. జ్యో 2.2 89) 2. చట్ట సభల ప్రసంగాలలో, పుస్తకాలలో అభ్యంతరకరమైన భాగాలను తీసివేయు to expunge ఉపేంద్ర చేసిన వ్యాఖ్యలను డాక్టర్ హెప్తుల్లా రికార్డులనుంచి తొలగించారు. (ఈ 20 7 89)

**తొలగిపోవు** క్రి. *tolagipoovu* (అడ్డంకులు, భేదాలు) లేకుండా పోవు to disappear (differences etc.) ఇరువురం మనసు విప్పి మాట్లడుకొన్నాం, మా మధ్య ఉన్న పొరపొచ్చాలు తొలగిపోయాయని ఆయన అన్నారు. (ప్ర.శ. 8 10.87)

**తొలి** విశ. *toli* మొట్ట మొదటి first, earlier తొలి దశలో కె. సి. కెనాల్ వ్యవస్థను పటిష్ఠం చేసేందుకు 7కోట్లు ... (ఉ 13.4.88)

**తోకముడుచు** క్రి. *tookamuDucu* కష్టాలు, సమస్యలు ఎదురైనపుడు ఒకపని విషయంలో వెనకడుగు వేయు to retreat విస్తృత స్థాయిన ఆయుధీకరణను అనుమతించడం ద్వారా దోపిడీలు ఆగడం, తీవ్రవాదం తోకముడవడం వట్టిమాట. (ఈ 22.4 89)

**తోడ్పాటు** వి. *tooDpaaTu* కార్య నిర్వహణలో అందించే మద్దతు; సహకారం co-operation ... జయవర్ధనేకు, కామన్వెల్తు దేశాల అధినేతల సమావేశం తన సంపూర్ణతోడ్పాటును ప్రకటిస్తూ .. (విశా 19 10.87)

**తోసిపుచ్చు** క్రి. *toosipuccu* ఏదైనా డిమాండ్, సలహా మొ. వాటిని సరైనవి కావనే భావనతో అంగీకరించకపోవు; తిరస్కరించు to reject, dismiss (an appeal, demand etc.) ప్రతిపక్షాల డిమాండ్‌ను తోసిపుచ్చారు. (ఆం. జ్యో 17.11 88)

**త్యాగపత్రం** వి. *tyaagapatram* పదవిని వదలుకొంటున్నట్లు రాసిచ్చిన కాగితం; రాజీనామాలేఖ resignation letter శ్రీ దూబే త్యాగపత్రాన్ని సమర్పించి అటువెళ్ళగానే, స్వయంగా ఆయన షడ్డకుడు అయిన శ్రీ అరుణ్ శౌరి ఆ స్థానంలోకి రావడం మరింత విస్మయాన్ని కలుగజేస్తోంది. (ఆం ప 9 6 87)

**త్రవ్వకం** వి. *travvakam* ప్రాచీన నాగరికతకు సంబంధించిన అవశేషాలకోసం ఎంపిక చేసిన స్థలాల్లో మట్టిని (జాగ్రత్తగా) తిరగదోడటం వెలికితీయడం excavation ... హిస్టరీ, ఆర్కియాలజీ విద్యార్థులు 14 మంది ప్రాచీన అవశేషాలకోసం ఇటీవల త్రవ్వకాలు జరిపారు. (ఆం. ప్ర 10 4.88)

**త్రిభాషా సూత్రం** వి. *tribhaaSaa suutram* పాఠశాల స్థాయిలో మూడు భాషలను బోధించాలనే భారతీయ విద్యా విధానం (ప్రాంతీయభాష, హిందీ, ఇంగ్లీషు) three language formula తెలుగు భాషను ఇతర రాష్ట్రాలలో వ్యాపింపజేయడానికి త్రిభాషా సూత్రం అమలు కింద జాతీయ సమైక్యతా భావం పెంపొందించేందుకే తెలుగు విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో ... (ఆం జ్యో. 3 2.88)

**త్రిముఖ పోటీ** వి. *trimukha pooTii*

చూ ముక్కోణపు పోటీ. 'రాష్ట్రపతి పద వికి త్రిముఖపోటీ' ... రాష్ట్రపతి ఎన్నికలలో ముగ్గురు అభ్యర్థుల మధ్య త్రిముఖపోటీ జరుగ నున్నది. (విశా. 28.6 87)

త్రివిధ దళాలు వి. (బ.వ.) *trividha daLaalu* మూడు రకాల సైన్యబలం; వాయు, నౌక, పదాతి దళాలు three wings of the armed forces త్రివిధ దళాల అధికార్ల జీతాల పెంపు. (విశా. 20 6.87)

త్రైపాక్షిక ఒప్పందం వి. *traipaakSika oppandam* మూడు పక్షాల మధ్య కుదిరిన అంగీకారం tripartite agreement యుగోస్లావియా-ఇండియా-ఈజిప్టుల మధ్య కుదిరిన త్రైపాక్షిక ఒప్పందాన్ని మరింత విజ యవంతం చేయడానికి ... (ఈ. 14.8 89)

త్రైపాక్షిక చర్చ వి. *traipaakSika carca* మూడు పక్షాల మధ్య ఒక వివాదా స్పద విషయంపై జరిగే సంభాషణ; పో. చూ. త్రైపాక్షిక ఒప్పందం tripartite discussion తెలుగుగంగ త్రైపాక్షిక చర్చ లకు కేంద్రం ఆహ్వానించినప్పుడు ... (ఈ. 11 6.89)

త్రోసివేత వి. *troosiveeta* ఇతరులు చేసిన అభ్యర్థన, డిమాండ్లు మొదలైనవి సరై నవి కావని తిరస్కరించటం dismissal, rejection రాష్ట్రపతి ఎన్నికపై పిటిషన్ త్రోసివేత. (ఆం. భూ 17.10 87)

త్రోసిరాజను క్రి. *troosiraajanu* (సంప్ర దాయం లేదా ఒప్పందం) మన్నించకపోవు to ignore, violate ఎంతుల వారీగా ప్రతిపక్షాలకు దక్కవలసిన పబ్లిక్ అకౌంట్స్ అధ్యక్ష పదవి విషయంలో పార్లమెంటరీ సంప్ర దాయాన్ని ఇంత బాహాటంగా త్రోసిరాజనడం దేశ చరిత్రలో ఇదే ప్రథమమని అన్నారు. (ఆం. భూ. 17.5.89)

## థ

థర్మల్ విద్యుత్కేంద్రం వి. *tharmal vidyutkeendram* బొగ్గును మండించి అందులోంచి వెలువడిన ఉష్ణం ద్వారా విద్యుత్తును ఉత్పత్తి చేసే ప్రదేశం thermal power station ఎనిమిదో ప్రణాళిక లో మరి అయిదు థర్మల్ విద్యుత్ కేంద్రాల స్థాపనకు రాజస్థాన్ ప్రభుత్వం ప్రతిపాదనలు పంపింది. (ఈ. 22.5.89)

థీరీ వి. *thiirii* విడివిడి అంశాల నుంచి సాధారణీకరించిన సిద్ధాంతం theory హత్యలు, ఆత్మహత్యలు, కొట్లాటలు, నేరాలు వంటివి జరగడానికి చంద్రుని ప్రభావం కారణ మనే థీరీకి వాద ప్రతివాదనలు లేకపోలేదు. (ఆం భూ. 7 9.87)

## ద

దండకం వి. *danDakam* ఆప కుండా ఏకధాటిగా ఎవరినైనా తిట్టటం a continuous non stop use of abusive words against a person, ranting and raving తిట్ల రాజకీయాన్ని గతంలో నిరసించిన పి. సి. సి. (ఐ) అధ్యక్షుడు చెన్నారెడ్డి గురు వారంనాడు బొల్లారంవద్ద జరిగిన బహిరంగ సభలో ప్రసంగిస్తూ ముఖ్యమంత్రి ఎన్టీఆర్ పై తిట్ల దండకంతో విరుచుకుపడ్డారు. (ఈ. 8 9 89)

దండయాత్ర వి. *danDayaatra* ఒక వ్యక్తి కాని లేదా వ్యక్తుల సమూహం కాని ఇతరులపై మాటల రూపంలోగాని, చేతల ద్వారాగాని విరుచుకు పడటం attack (a verbal or physical) రానున్న శాసనసభ శీతాకాల సమావేశాలలో ప్రతి పక్షాల దాడిలో శ్రీ శ్రీనివాసులురెడ్డి "దండయాత్ర"ను ఎదుర్కొనే విషయంలో

పలువురు మేధావులు తమ సలహాలతో తెలుగుదేశం పార్టీ నాయకత్వాన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నట్టు తెలిసింది. (ఉ. 8.12 87)

**దండుకొను** క్రి. *danDukonu* స్వప్రయోజనం కోసం సేకరించు (డబ్బు, ఓట్లు మొ.) to collect (for selfish ends) ఇటీవల కొందరు తీవ్రవాద నాయకులు డబ్బు బాగా దండుకొని తర్వాత ప్రభుత్వానికి లొంగిపోయారని చెప్పారు. (ఈ. 20 4 89) ఎన్నికల్లో ఓట్లు దండుకోవడానికి రిజర్వేషన్ కోటాలను విస్తరిస్తూ పోయే క్షుద్ర రాజకీయ వ్యూహం తీరని అనర్థాలు తెచ్చిపెట్టింది. (ఈ 16 5.89)

**దండోరావేయు** క్రి. *danDooraaveeyu* అవసరమైన దానికన్నా ఎక్కువగా ప్రకటించు; చాటు to boast, propagate అవకాశం దొరికినపుడల్లా తనకు మించిన 'లెఫ్టిస్టు' 'సోషలిస్టు' లేడని దండోరావేసుకోవడం ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు అలవాటు. (ఆం. భూ. 21 4 89)

**దఖలుచేయు** క్రి. *dakhaluceeyu* బాధ్యతలను, అధికారాలను అప్పగించు to entrust, assign పై అంశాలతో పాటు ఇతర విధులు కూడా "ఉన్నత విద్యా పరిషత్"కు దఖలుచేయబడ్డాయి. (విశా. 13 8.87)

**దఖలుపరచు** క్రి. *dakhaluparacu* చూ. దఖలు చేయు; రాజ్యాంగం అమలులోకి వచ్చేనాటికి సంక్రమించిన అధికారాలనే రాష్ట్ర ప్రభుత్వాలకు తిరిగి దఖలుపరచాలని రాష్ట్ర ప్రభుత్వం సూచించింది. (ఆం జ్యో 22.4 88)

**దగాకోరుతనం** వి. *dagaakoorutanam* నమ్మించి మోసంచేయటం deceit, cheating పంచాయితీరాజ్ వ్యవస్థను పటిష్టంగా తీర్చిదిద్దడం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల సమష్టి బాధ్యత అని ఒకవైపు నమ్మబలుకుతూనే మరోవైపు ఢిల్లీ పెత్తనానికి వీలుగా చర్యలు ప్రారంభించడం దగాకోరుతనం. (ఈ. 8.5 89)

**దగాకోరు రాజకీయం** వి. *dagaakooru raajakiiyam* మోసపూరితమైన పాలనా వ్యవహారాలు politics of deceit, crooked politics ఎన్నో స్వార్థపూరిత వ్యవహారాలు, దగాకోరు రాజకీయాలు ఈనాడు సాగుతున్నాయని వాటిమీద ఎటువంటి చర్యతీసుకోవడం లేదని ... విమర్శించారు. (ఆం. జ్యో 21.4 88)

**దగాపడు** క్రి. *dagaapaDu* నమ్మకద్రోహానికి గురియగు; మోసపోవు to be deceived, be betrayed ఈ పుస్తకంలో మొదట ... ప్రజాస్వామ్యం ఏ విధంగా దగాపడింది? ... వివరాలతో అచ్చువేశారు. (ఆం. జ్యో. 16.10.87)

**దగుల్బాజీ** విశే. *dagulbaajii* మోసపూరితమైన, వంచనతో కూడిన deceitful, fraudulent ఏమైనా దగుల్బాజీ విధానాలను అనుసరించే కంపెనీ ప్రయోజనాల కంటే స్వదేశ ప్రయోజనాలు అతిముఖ్యం అని వి. పి. సింగ్ పేర్కొన్నారు. (ఆం ప్ర 25 4.88)

**దగ్ధంచేయు** క్రి. *dagdhamceeyu* కాల్చు to burn పటాంచెరువు బస్సుడిపో వద్ద కాంగ్రెస్ కార్యకర్తలు బస్సురోకో నిర్వహించి ముఖ్యమంత్రి శ్రీ రామారావు దిష్టిబొమ్మను దగ్ధంచేశారు. (ఆం. జ్యో. 6.12.88)

**దగ్ధకాండ** వి. *dagdhakaanDa* దౌర్జన్యంగా పెద్ద ఎత్తున కాల్చివేయటం; కాల్చివేత arson నక్సలైట్ల దగ్ధకాండ. (ఆం. ప్ర. 4.2.89)

**దత్తతతీసుకొను** క్రి. *dattatatiisukonu* ఒక ప్రాంతాన్ని అభివృద్ధి పరచేందుకు స్వీకరించు to adopt (a place or

an area for development) ... విలేఖరులతో మాట్లాడుతూ ఏదో గ్రామాన్ని దత్తతతీసుకొని దానిని అభివృద్ధి చేయాలని పారిశ్రామికవేత్తలను తమ ప్రభుత్వం కోరగ లదని చెప్పారు. (ఆం భూ. 1.10.87)

**దద్దరిల్లు** క్రి. *daddarillu* పెను శబ్దాల తాకిడికి తీవ్రంగా కదిలిపోవు to be rocked, be shaken వరుసగా ఆరు సార్లు బాంబు పేలుళ్ళతో శ్రీ నగర్‌లోని పలు ప్రాంతాలు దద్దరిల్లి పోయాయి. (ఈ. 16 8 89)

**దన్ను** వి. *dannu* అండ, బలం support ... కాంగ్రెస్(ఐ) పార్లమెంట్‌లో మూడింట రెండు వంతుల సీట్ల దన్నుతో 1975లో ఎమర్జెన్సీ విధించగలిగింది (ఈ 15.10 88)

**దఫా** వి. *dafaa* పర్యాయం occasion, time ఉభయ దేశాల నడుమ ఈ దఫా కుదిరే అవగాహన అప్పటితో పోల్చుకుంటే ఎంతో భిన్నంగా ఉంటుంది. (ఈ 15 5 89)

**దబాయించు** క్రి. *dabaayincu* వాస్తవం కాకపోయినా గట్టిగా వాదించడం ద్వారా ఒప్పించాలని ప్రయత్నించు to prevaricate నిజంగా వాల్మీకి మహర్షి వ్రాసిన ఉత్తరకాండ కథనే రామానందుల వారు అనుసరిస్తున్నారని దబాయిస్తున్నారు. (ఆం భూ. 23 6 89)

**దమన కాండ** వి. *damana kaanDa* 1. హింసాయుత కార్యకలాపాలు violent actions పోరాటావాదులు ఆదివారం మళ్ళీ బాంబులు విసరడం కాల్పులు జరపడం వంటి అరాచకాలతో దమన కాండ మొదలు పెట్టారు. (ఆం భూ 11 4 88) 2. అణచి వేత చర్య ruthless suppression అవినీతి అదుపు చేయాలని ... లక్ష లాది యువకులు సాగించిన అహింసాయుత ఆందోళనను అమానుష దమన కాండతో అణచివేసిన ఘాతుకాన్ని ... (ఈ 30 6 89)

**దమన నీతి** వి. *damana niiti* అణచి వేయు డానికి ప్రభుత్వం రూపొందించే విధానం, నియమం supressive methods రెండేళ్ళ కింద విద్యార్థి లోకంలో వెల్లువెత్తిన ప్రజాస్వామ్య సంస్కరణోద్యమాన్ని బీజింగ్ ప్రభుత్వం దమన నీతితో అంతమొందిం చింది (ఈ. 25 4 89)

**దయనీయం** వి. *dayaniiyam* జాలిగొ లుపునట్టిది pathetic, pitiable గత ఎన్నికల్లో మొత్తం 21 స్థానాలకుగాను, 20 స్థానాలు గెలుచుకున్న కాంగ్రెస్ పరిస్థితి ప్రస్తుతం దయనీయంగా మారింది. (ఈ. 28 11.89)

**దరఖాస్తు** వి. *darakhaastu* 1 ఉద్యోగం, సీటు మొ. వాటికోసం తమ అర్హతల వివరాలను పొందుపరుస్తూ సమర్పించే పత్రం application దరఖాస్తు పెట్టు కొన్న అభ్యర్థులందరికీ తక్షణం హాల్ టికెట్టు ఇచ్చి పరీక్షకు హాజరవనీయాలని డిమాండు చేశారు. (ఈ అను 30 5 89) 2. గతం లోని నిర్ణయాన్ని పునఃపరిశీలించాల్సిందిగా అభ్యర్థిస్తూ చేసే రాతపూర్వకమైన విన్నపం appeal, petition క్షమాభిక్ష కోరుతూ కేహార్‌సింగ్ పెట్టుకున్న దరఖాస్తును త్రోసి పుచ్చుతూ రాష్ట్రపతి ఏ విధమైన వ్యాఖ్యలు రాశారన్న విషయం తెలియలేదు. (ఆం జ్యో 11 2 88)

**దరిమిలా** అవ్య. *darimilaa* తరు వాత, అనంతరం, పిమ్మట soon after, immediately after కర్నా టక రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన విధించిన దరిమిలా ఉత్పన్నమైన తాజా పరిస్థితిని వీరు ఉభయులూ సమీక్షించారు. (ఈ. 23 4 89)

**దర్పణంపట్టు** క్రి. *darpaNampaTTu* అద్దంలోని ప్రతిబింబంవలె చూపించు; స్పష్టంచేయు to mirror, reflect *గుంటూరు జిల్లాలోనే కాంగ్రెస్ కంచుకోటగా నిలచిన తెనాలి డివిజన్‌లో శ్రీ రామారావుకు లభించిన స్వాగతం పల్లె ప్రజల ప్రేమాభిమా నాలకు దర్పణం పట్టింది.* (ఈ 10 11 89)

**దర్యాప్తు** వి. *daryaaptu* నేర, న్యాయ సంబంధమైన విషయాలను గురించి పూర్వాపరాలను తెలుసుకునేం దుకు జరిపే పరిశీలన enquiry, investigation *ఆయుధ ఒప్పందంపై సంఘంచేత సంపూర్ణ మైన సమగ్రమైన దర్యాప్తు చేయించాలని ఆయన అన్నారు* (ఆం. జ్యో 5.6 87)

**దర్యాప్తు సంఘం** వి. *daryaaptu san gham* నేర, న్యాయ సంబంధ మైన విషయాలను పరిశీలించే సభ్యుల బృందం enquiry commission *ఫెయిర్‌ఫాక్స్ వ్యవహారంపై దర్యాప్తు సంఘం సమర్పించిన నివేదికను సి పి. ఐ. సభ్యుడు శ్రీ ఇంద్రజిత్ గుప్త విమర్శించారు.* (ఉ 15 12 87)

**దర్యాప్తు సంస్థ** వి *daryaaptu sam-stha* నేర, న్యాయ సంబంధమైన విష యాలను పరిశీలించి నిర్ణయించేందుకు ప్రత్యేకంగా ఏర్పడ్డ ఆధికారిక వ్యవస్థ investigating agency *సి బి.ఐ తదితర దర్యాప్తు సంస్థలు కళ్ళ ముందు స్పష్టంగా కనిపించే విషయాలను సైతం కనుక్కోలే నంత బలహీన పడి పోవడం పట్ల లేఖలో శ్రీ సింగ్ ఆశ్చర్యం వెలిబుచ్చారు.* (ఈ 19.7 89)

**దర్శనమిచ్చు** క్రి. *darśanamiccu* కని పించు, (అనుకోకుండా) ఆగపడు to appear, be found *ప్రతి ఇంట్లో ఇద్దరు క్రికెట్ ప్లేయర్లు దర్శనమిస్తున్నారు.* (ఆం. ప్ర. 2 3 88)

**దళం** వి. *daLam* (తీవ్రవాద పార్టీలో) సాయుధ విభాగానికి చెందిన చిన్న బృందం squad (of militants) *పీపుల్స్‌వార్ ఖానాపూర్ దళమే ఈ దాడి జరిపి ఉంటుం దని భావిస్తున్నారు.* (ఆం జ్యో 2 2.89)

**దళారీ** వి. *daLaarii* వ్యాపార లావాదేవీలలో ఇరుపక్షాల మధ్య సంబంధాన్ని కుదిర్చే వ్యక్తి; మధ్యవర్తి, బ్రోకర్ middleman, agent *బోఫోర్స్ సంస్థతో ఒప్పందం కుద రడానికి దోహదం చేసిన వాణిజ్య చర్చల్లో దళారీలెవ్వరూ పాల్గొనలేదని సంయుక్త పార్ల మెంటరీ సంఘం నిర్ధారించింది.* (ఆం. ప్ర. 27 4 88)

**దళిత నాయకుడు** వి. *daLita naayakuDu* హరిజనుల పక్షాన నిలిచి వారి హక్కుల కోసం పోరాడే అదే వర్గా నికి చెందిన వ్యక్తి Dalit leader *ఈ జిల్లాలో ఇంకా 18వ శతాబ్దంనాటి ఆచారాలు సజీవంగా ఉండడంపై దళిత నాయకులుగాని, ఇటు రాజకీయ నాయకులు గాని అంతగా పట్టించుకోలేదు.* (ఆం భూ. 14 12.87)

**దళిత రచయిత** వి. *daLita racayita* హరిజనుల కష్టాల్ని జీవన సమస్యల్ని, వస్తువుగా తీసుకొని రచనలు చేసే ఆ వర్గపు వ్యక్తి Dalit writer *తొమ్మిదో తేదీనాడు దళిత రచయితలు రచించిన పుస్త కాలను ప్రదర్శిస్తారని ఆయన చెప్పారు.* (ఈ. 2 10 87)

**దళితుడు** వి. *daLituDu* అణచివేతకు గురయ్యే హరిజన వర్గానికి చెందిన వ్యక్తి Dalit *కులాల పేరిట దళితులను దూషిం చడం కించ పరచే విధంగా మాట్లాడటం నేరమని పేర్కొంటూ...* (ఆం ప్ర. 18.4.88)

**దశదిన పర్వం** వి. *daśadina parvam* పదిరోజుల పాటు జరిగే ఉత్సవం; వేడుక ten-day festival *24 సోవియట్ నగ రాల్లో భారతీయ చిత్రోత్సవాల వారోత్సవాలు దశదిన పర్వాలు ఏర్పాటు చేశారు.* (ఉ. 2 7 87)

**దశలవారీగా** క్రి.విశే. *daśalavaariigaa* అంచెలంచెలుగా, ఒకటి వెనుక (తర్వాత) ఒకటిగా in a phased manner, step by step *సోవియట్ సేనలు దశ లవారీగా వచ్చే మే 15వ తేదీ నుంచి వైదొలగుతున్నాయి.* (ఆం. ప్ర 19 4.88)

**దాక్షిణ్య హత్య** వి. *daakSiNya hatya* నయంకాని తీవ్రమైన జబ్బుతో బాధపడే వారి మరణానికి వైద్యులు సహాయపడటం mercy killing *"దాక్షిణ్య హత్య" (మెర్సీ కిల్లింగ్ లేక యుథినేషియా)ను అను మతించాలా వద్దా అని ప్రపంచవ్యాప్తంగా వైద్యులు న్యాయవాదులు కొట్టుమిట్టాడుతుం డగా న్యూజెర్సీలో ఒక 65 ఏళ్ళ వృద్ధుడు దాక్షిణ్య హత్య వల్ల మరణించాడు.* (ఉ 23 7.87)

**దాఖలా** వి. *daakhalaa* సందర్భం, నిద ర్శనం instance *గతంలోవారు ఇదే విధ మైన నేరాలు చేసి శిక్షింపబడిన దాఖలాలు కూడా లేవని తమ తీర్పులో పేర్కొన్నారు.* (ఆం. జ్యో 13.11.88)

**దాఖలుచేయు** క్రి. *daakhaluceeyu* (అప్లి కేషన్, పిటిషన్, నామినేషన్ మొ.) సమ ర్పించు to submit, file *రాజు వర్గం కార్పొరేటర్లు నామినేషన్లు దాఖలు చేయ డానికి దారితీసిన పరిస్థితులను వివరిస్తూ రత్నకుమారి వర్గంతో సహకార చక్కెర ఫ్యాక్ట రీల సభ్యులు దాఖలుచేసిన రిట్ పిటిషన్లను పురస్కరించుకుని న్యాయమూర్తి ఈ స్టే జారీ చేశారు.* (ఈ. 5 6.87)

**దాటవేయు** క్రి. *daaTaveeyu* జవాబు చెప్ప కుండా తప్పించుకొను to parry (a question) *ఈ విషయమై లోక్‌దళ్ (బి) అధ్యక్షుడు బహుగుణను ప్రశ్నించగా తొందర పడకండి వేచి చూడండి అని నవ్వుతూ దాట వేశారు.* (ఆం జ్యో 20.6 87)

**దాడి** వి. *daaDi* 1. దౌర్జన్యంగా ఆక స్మికంగా చుట్టుముట్టటం attack *తీవ్ర వాదులు ఒకరైలుపై దాడిచేసి 40 మందిని బస్సుపై దాడిచేసి 21 మందిని వధించారు.* (ఆం ప్ర 8.10 87) 2. వ్యాపార సంస్థలపై అధికారులు జరిపే ఆకస్మిక దండయాత్ర raid *ఇన్‌కమ్‌టాక్స్ అధికారుల దాడులు సమర్థించదగినవే అయినా ప్రభుత్వం నిస్స హాయ స్థితిలో ఉన్నది.* (ఆం ప్ర 26.4.89) 3. నిరంతరంగా చేసే తీవ్ర విమర్శ tirade, (verbal) attack *గవర్నర్ కుముద్‌బెన్ జోషి రిపబ్లిక్‌డే ప్రసంగంపై తెలుగుదేశం పార్టీ నాయకులు ప్రారంభించిన దాడి ఉద్దేశం హైకోర్టు తీర్పు నుండి ప్రజల దృష్టి మళ్ళించడమేనని ...* (ఆం ప్ర 2.2.88)

**దామాషా** వి. *daamaaSaa* మొత్తంగా ఉన్నదాంట్లో అందులోని భిన్న భాగాలు ఆక్రమించి ఉన్న పరిమాణాల నిష్పత్తి. proportion *బలహీన వర్గాలకు జనాభా దామాషాపై రాజకీయ కేటాయింపులు ఉండాలని ... అన్నారు.* (ఆం. ప్ర. 21 2 89)

**దామాషాపద్ధతి ఎన్నికలు** వి. (బ.వ.) *daamaaSaapaddhati ennikalu* సాధా రణ ఎన్నికలలో ఒక పార్టీకి వచ్చిన ఓట్ల మొత్తాన్ని అనుసరించి, చట్ట సభలలో స్థానాలను ఆ పార్టీకి కేటాయించే విధానం proportional representation or elevation

system ప్రస్తుత ఎన్నికల పద్ధతి స్థానే దామాషా పద్ధతి ఎన్నికలు ప్రవేశపెట్టడానికి ఎన్నికల సంస్కరణలపై సూచనలు చేయడానికి ఎ. ఐ. సి. సి. కమిటీ వ్యతిరేకత వ్యక్తం చేసింది. (ఆం ప్ర 15 10 88)

**దారితీయు** క్రి. *daarıtııyu* ఒకటి మరొక దానికి మూలమగు; ఒక పని ఫలితంగా మరొకటి పరిణమించు to lead to, give rise to అమెరికాలోని భారత జాతీయులు ఆర్థికంగా బాగా అభివృద్ధి చెందడం ఈర్ష్య అసూయలకు అనేక సమస్యలకు దారితీస్తుందని, దీనికి పరిష్కారం ... (ఈ. 27 7.89)

**దారిద్ర్యరేఖ** వి. *daarıdryareekha* సమాజంలో కడుబీద. స్థాయిని సూచించే ఆర్థిక అంతరువు poverty line దారిద్ర్య రేఖకు దిగువనున్న వారి సంక్షేమంకోసం తెలుగుదేశం ప్రభుత్వం ప్రారంభించిన కిలో రెండురూపాయల బియ్యం పథకం ... (ఉ. 10 4.88)

**దారి మళ్ళించు** క్రి. *daarı maLLıncu* 1. ఒక వాహనాన్ని ఆపి అందులోని వస్తువులను దొంగిలించేందుకు వక్ర మార్గంలో తీసుకువెళ్ళు to divert ఒక ట్రాన్స్‌పోర్ట్ కంపెనీకి చెందిన వ్యాన్‌ను మార్గ మధ్యంలో కొందరు దుండగులు దారి మళ్ళించి వ్యాన్‌తో సహా పరారైన సంఘటన తెలిసింది. (ఆం ప్ర 11 12 87) 2. (రాజకీయ ప్రయోజనాలకోసం) ఒక విమానాన్ని బలవంతంగా భిన్నమైన మరో మార్గంలోకి తీసుకు వెళ్ళు to hijack సోవియట్ యూనియన్‌కు చెందిన ఒక విమానాన్ని ఇటీవల ఇజ్రాయిల్‌కు దారి మళ్ళించిన టెర్రరిస్టులను ఆదివారంనాడు తిరిగి మాస్కోకు తీసుకువచ్చారు. (ఆం జ్యో 5 12 88)

**దారుణంగా** క్రి.విశ. *daaruNangaa* 1. పూర్తిగా totally, completely వ్యక్తిగత పోటీలలో కూడా మన క్రీడాకారులు దారుణంగా విఫలమయ్యారు. (ఆం ప్ర. 26 4.89) 2 క్రూరంగా cruelly బంకు ఆవరణలో నిద్రపోతున్న ముగ్గురు వ్యక్తులను దుండగులు ఇనుపరాడ్లు, కర్రలతో దారుణంగా కొట్టారు. (ఈ 6.6 87)

**దావావేయు** క్రి. *daavaaveeyu* కోర్టులో కేసుపెట్టు to file a case or suit తన ప్రభుత్వాన్ని రద్దు చేయడానికి రాష్ట్రపతి ఆమోదించడం న్యాయరీత్యా సక్రమం కానేరదని రాష్ట్రపతి పాలన విధింపుపై తాను సుప్రీంకోర్టులో దావా వేస్తానని రద్దయిన కర్నాటక జనతాదళ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి ... అన్నారు. (ఆం భూ. 22 4.89)

**దించు** క్రి. *dıncu* 1. (విమానాన్ని) పైనుండి కిందికి చేర్చు to land (an aeroplane) విమానాన్ని దించడానికి బీరూట్‌లో అధికారులు నిరాకరించడంతో విమానం మరోచోటికి చేరుకున్నది. (ఆం జ్యో 9 4 88)

**దింపు** క్రి. *dımpu* శాంతి భద్రతలు కొరవడినపుడు అవసరమైన రక్షణ బలగాలను తరలించు to deploy (as security forces) శాంతి భద్రతలు క్షీణించే అవకాశం ఉన్నచోట తన స్వంత బలగాలను కూడా కేంద్రం దింపుతుందని ఈ వర్గాలు తెలిపాయి. (ఆం ప్ర 26 4 89)

**దిక్కుదివాణం** వి. *dikkudıvaaNam* తగిన రక్షణ (సాధారణంగా వ్యతిరేక వాక్యంలో వస్తుంది) proper care or protection కోట్లాది రూపాయ విలువగల సరకు దిక్కుదివాణం లేకుండాః ఉంది. (ఆం భూ 22.4.88)

**దిగంబరం** వి. *digambaram* బట్టలు వేసుకోకపోవటం; నగ్నం naked కాకర (నూకరాజు) ఎమ్మెల్యేగా గెలుపొందితే ఏమి చేస్తావు అంటే దిగంబరంగా ఊరేగుతానంటున్నాడీయన. (ఈ 8 11.89)

**దిగజారు** క్రి. *digajaaru* స్థాయి, విలువ మొ. పడిపోవు to decline or come down *1982-83లో స్వేచ్ఛా విపణిలో సిమెంట్ బస్తా ధర 75 నుంచి 80 రూపాయలుంది. ఇప్పుడది 60 రూపాయలకు దిగజారింది.* (ఈ. 19 2 88) *నైతికంగా దిగజారిన తెలుగుదేశం ప్రభుత్వం త్వరలో పతనమవుతుందని ఆయన అన్నారు.* (ఆం. భూ 27.4 89)

**దిగజార్చు** క్రి. *digajaarcu* స్థాయిని, విలువను తగ్గింపజేయు to bring down *రెండు లక్షల కోట్ల రూపాయల ఋణ భారంతో దేశ ఆర్థిక పరిస్థితిని దిగజార్చిన కాంగ్రెస్ నాయకులకు తెలుగు దేశం ప్రభుత్వాన్ని విమర్శించే నైతిక హక్కు లేదని ... అన్నారు* (ఆం జ్యో 14 11.88)

**దిగతుడుపు** వి. *digatuDupu* లక్షణాల పోలికలో ఏమాత్రం సరితూగక పోవటం no match *ఆ విషయంలో మార్క్స్, ఎంగెల్సులు కూడా అతని ముందు దిగతుడుపే.* (ఆం. భూ. 21 4 89)

**దిగమింగు** క్రి. *digamingu* 1. స్వాహా చేయు to embezzle, misuse *పి. ఎఫ్ సొమ్మును లక్షల్లో, కోట్లలో దిగమింగిన మిల్లుల ప్రబుద్ధులు తమ పలుకుబడిని డబ్బునూ వినియోగించి ప్రభుత్వం తమ మీద ఎలాంటి చర్య తీసుకోకుండా తప్పించుకొంటున్నారు.* (ఆం భూ 19.7 89) 2. భరించు to bear (praise or criticism) *అందుకే ప్రశంసలు విమర్శలు రెండింటిని దిగమింగవలసివచ్చేది.* (ఈ 14 8 89)

**దిగు** క్రి. *digu* (చెడుపనులకు) పూను; కొను, పాల్పడు to resort *అసహనంతో కుట్రలకు దిగుతున్నారు.* (విశా 12 10.87)

**దిగుడు ప్రాంతం** వి. *diguDu praantam* క్రింది భాగంలోని ప్రాంతం lower area *ఉత్తర ప్రదేశ్ వాయువ్య ప్రాంతంలోని హిమాలయ పర్వతాల దిగుడు ప్రాంతం క్రమంగా ఎడారిగా మారే సూచనలు కనబడుతున్నాయని శాస్త్రవేత్తలు చెబుతున్నారు.* (ఆం. ప్ర. 4 5 89)

**దిగుబడి** వి. *digubaDi* వ్యవసాయంలో పండే పంట మొత్తం yield (from crop) *పొద్దు తిరుగుడు పంటలో అధిక దిగుబడులకు తేనెటీగల తోడ్పాటు.* (ఆం. ప్ర. 16 6.87)

**దిగుమతి** వి. *digumati* ఇతర ప్రాంతాల నుండి అవసరమైన సరుకులను తెప్పించటం import *దేశంలోని న్యూస్ ప్రింట్ ఉత్పత్తిని మన పత్రికల అవసరాలకు చాలని కారణంగా విదేశీ న్యూస్ ప్రింట్ దిగుమతి తప్పనిసరి.*

**దిగ్బంధనం** వి. *digbandhanam* ఒక ప్రదేశాన్ని చుట్టుముట్టి బయటి నుండి ఏ రకమైన సహాయం అందకుండా అడ్డుకోవటం blockade *శ్రీ లంక సైనిక దిగ్బంధనానికి గురైన జాఫ్నా తమిళులకు ...* (ప్ర శ 5.6 87)

**దిగ్భ్రమ** వి. *digbhrama* నివ్వెరపాటు dismay, be shocked *నక్సలైట్లు పదిమంది పోలీసులను ఆగష్టు 18న ఆలంపల్లి వద్ద హతమార్చారు. ఈ సంఘటనతో దిగ్భ్రమ చెందిన ప్రభుత్వం పునరాలోచనలో పడింది.* (ఆం. భూ 20.4 87)

**దిగ్భ్రాంతి** వి. *digbhraanti*

చూ. దిగ్భ్రమ; నిరాయుధులైన విద్యార్థులు వేలాది మందిని చైనా సైన్యం హతమార్చడం కొన్ని ఆసియా దేశాలకు దిగ్భ్రాంతి కలిగించింది. (ఆం ప్ర 15 6 89)

**దిగ్విజయమంఅగు** క్రి. *digvijayamagu* (సభలు, సమావేశాలు మొ.,) ఎలాంటి అవాంతరాలు, లోపాలు లేకుండా ఆశించిన విధంగా జరుగు to become a success ... సభ దిగ్విజయంఅయిందని ... అన్నారు. (విశా 19 10 87)

**దివాలా** వి. *divaalaa* ఆర్థికంగా కృశించిన లేదా క్షీణించిన పరిస్థితి bankruptcy రాష్ట్ర వ్యయం పెరిగి దివాలా పరిస్థితులకు దారి తీయడానికి శ్రీ ఎన్టీఆర్ ప్రచారసాధనాలే కారణం ... (ఆం. భూ 20.6 87)

**దివాళాకోరు** విణ. *divaaLaakooru* (రాజకీయాలు విధానాలు మొ.) విలువలులేని bankrupt (of ideas and values) దేశంలో ప్రతిపక్షాలు దివాళాకోరు విధానాలను అవలంబిస్తూ పరస్పర హననానికి ... పేర్కొన్నారు. (ఈ 26 4 89)

**దివాళాకోరుతనం** వి. *divaaLaakooru-tanam* (రాజకీయాలు, విధానాలు మొ. వాటిలో) విలువలు లేకపోవటం bankruptcy (of ideas and values) నక్సలైట్ల నుండి తమను తాము రక్షించుకొనేందుకు గ్రామానికి ఒకరికో లేదా ఇద్దరికో తుపాకులు సమకూర్చాలన్న రాష్ట్ర ప్రభుత్వ నిర్ణయం రాజకీయ ఆలోచనా ధోరణిలో దివాళా కోరుతనానికి నిదర్శనమని .. వ్యాఖ్యానించారు. (ఆం. భూ 21 4 89)

**దివాళాతీయించు** క్రి. *divaaLaatiiyincu* (సంస్థలు, ప్రభుత్వం) ఆర్థికంగా పతన స్థితికి తీసుకువెళ్ళు to bankrupt అవినీతి, తప్పుడు విధానాలతో శ్రీ రామారావు ప్రభుత్వం రాష్ట్రాన్ని దివాళాతీయించిందని ... చార్జిషీటులో ఆరోపించారు. (ఆం జ్యో 8 4 88)

**దిష్టిబొమ్మ** వి. *diSTibomma* నిరసనకు గురి అయిన వారి పేరున (కర్రలు, గడ్డి, పాత బట్టలతో) తయారుచేసిన ఆకారం (ఆందోళన కారులు దీనిని శవయాత్రగా ఊరేగించి దహనం చేస్తారు.) effigy .. బాణాసంచా కాలుస్తూ, రావణ, కుంభకర్ణ, మేఘనాథ్‌ల దిష్టిబొమ్మలను దగ్ధం చేయటాన్ని వేలాదిమంది తిలకించారు. (ఆం ప్ర 3.10 87)

**దీక్షాస్థలి** వి. *diikSaasthali* ఆందోళనా కార్యక్రమం కొనసాగే చోటు venue of an agitation ... ఇటువంటి ప్రదర్శనలు తమని భయపెట్టవని దీక్షాస్థలి నుంచి కదిలే ప్రసక్తే లేదని విద్యార్థులు స్పష్టం చేశారు. (ఈ 2 6 89)

**దీటు** వి. *diiTu* సమాన స్థాయి , సమఉజ్జీ equal (in status, capability etc.) ఫ్రంట్ కార్యక్రమాలను విస్తృతం చేసి, కాంగ్రెస్(ఐ)కి దీటుగా విశ్వసనీయమైన ప్రత్యామ్నాయంగా ప్రజలకు సమర్పించుకోవాలని తీర్మానించారు. (ఆం. భూ 24.4 89)

**దీర్ఘకాలిక ప్రతిపాదన** వి. *diirghakaalika pratipaadana* అమలులో పెట్టటానికి ఎక్కువ సమయం అవసరమయ్యే ఆలోచన long term proposal దేశంలోని వివిధ ప్రాంతాల్లో లభించే సహజవాయువు అంతటినీ కలిపి జాతీయ స్థాయి గ్రిడ్ ఏర్పాటు చేయడం అన్నది దీర్ఘ కాలిక ప్రతిపాదన అని ... (ఆం ప్ర 26 4 89)

**దీర్ఘకాలిక రుణం** వి. *diirghakaalika ruNam* ఎక్కువ వాయిదాలతో చెల్లించే

అప్పు long term loan ... అంతర్జా తీయ అభివృద్ధి సంస్థ లాంటి వాటి నుండి తక్కువ వడ్డీకి సులభతరంగా దీర్ఘకాలిక రుణా లను పొందే అవకాశాలను క్రమేపీ లేకుండా చేయడం మూలంగా ... (ఈ 20.5 89)

**దీర్ఘకాలిక వ్యూహం** వి. *dııghakaalika vyuuham* ఎక్కువ సమయాన్ని దృష్టిలో పెట్టుకొని రూపొందించిన ప్రణా ళిక long term strategy వరదలు, కరువు కాటకాలను అధిగమించి వ్యవసాయ ఉత్పత్తిలో నిలకడ సాధించడానికి అనువైన దీర్ఘకాలిక వ్యూహాన్ని రూపొందించ వలసిం దిగా కేంద్ర వ్యవసాయ మంత్రి విజ్ఞప్తి చేశారు. (ఈ. 6 10 87)

**దీర్ఘకాలిక సెలవు** వి. *dııghakaalika selavu* ఎక్కువ కాలంతో కూడిన సెలవు long leave ... సీనియర్ ఐ. ఎ. ఎస్ అధికారి శ్రీ పి. ఎస్. క్రిష్ణన్‌ను దీర్ఘకాలిక సెలవుపై వెళ్ళవలసిందిగా రాష్ట్రప్రభుత్వం ... (ఉ 28 10 87)

**దుండగుడు** వి. *dunDaguDu* హింసాత్మ కమైన పనులు చేసే వ్యక్తి miscreant థాణె జిల్లాలో మారుతీ కారులో వెళుతున్న అయిదారుగురు వ్యక్తులపై గుర్తు తెలియని దుండగులు దాడి చేసి కాల్చిచంపారు. (ఆం జ్యో. 5 12.88)

**దుందుడుకు విధానం** వి. *dunduDuku vıdhaanam* సరిగా ఆలోచించకుండా, తొందరపాటుతో ప్రవర్తించటం hasty or rash step కొంతమంది విప్లవకా రులు గత చరిత్ర నుండి సరైన పాఠాలు తీసుకోవడానికి నిరాకరిస్తున్నారని, మరో వైపు దుందుడుకు విధానాలే అనుసరిస్తున్న ఫలితంగా విప్లవోద్యమానికి తీవ్రమైన హాని జరుగుతుందని ... తెలిపారు. (ఆం భూ 18.5.89)

**దుమారం** వి. *dumaaram* అన్యాయం, అక్రమం అనిపించిన విషయాలపై తీవ్రస్థా యిలో చెలరేగే గొడవ furore యునో ప్రధాని పదవి చేపట్టిన కొద్దిరోజులకే గైషా (వేశ్య)తో సంబంధాలపై పెద్ద దుమారం చెలరేగింది. (ఆం భూ. 25 7.89)

**దుమ్ముదులుపు** క్రి. *dummudulupu* 1. (మరుగున పడిన అంశాన్ని) బయట పెట్ట టానికి సిద్ధం చేయు to clear the dust ... ఈ ప్రతిపాదనను దుమ్ముదులిపి బయటికి తీసి మరోసారి పరిశీలిస్తే ... (ఆం. భూ 20 4 89) 2. తీవ్రంగా విమర్శించు to reprimand, rebuke కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (సి. ఎ. జి.) నివేదిక ... రాష్ట్ర ప్రభుత్వాన్ని దుమ్ముదులిపింది. (ఆం. ప్ర. 20 4 89)

**దుమ్మెత్తిపోయు** క్రి. *dummettıpooyu* తీవ్రంగా విమర్శించు to criticise severely మతవాద, వామ పక్షాలు కుమ్మక్కయి తమ రాజీనామాకు డిమాండ్ చేయడం అత్యంత శోచనీయమని శ్రీ రాజీవ్ గాంధీ ప్రతిపక్షాలను దుమ్మెత్తిపోశారు (ఆం భూ. 27 7.89)

**దుయ్యబట్టు** క్రి. *duyyabaTTu* లోపా లను చూపిస్తూ ఆక్షేపించు to flay ... ప్రతిపక్షసభ్యుడు పార్లమెంట్ ప్రతిష్ఠను అన్ని రకాల సాంప్రదాయాలను మంటగలిపారని శ్రీ భగత్ తీవ్రంగా దుయ్యబట్టారు. (ఆం ప్ర 25.7 89)

**దురదృష్టకరం** వి. *duradRSTakaram* విచారించదగ్గ విషయం unfortunate రాష్ట ప్రభుత్వాలు చేపడుతున్న సంక్షేమ పథ కాలను ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ జనాకర్షక పథకాలనడం దురదృష్టకరమని ... అన్నారు. (ఉ 27 4 88)

**దురవగాహన** వి. *duravagaahana* ఇతరుల మాటల్నీ, పనుల్నీ తప్పుగా అర్థం చేసుకోవటం; అపోహ misunderstanding శ్రీ జైల్‌సింగ్ హయాంలో జరిగినట్టు కాక దేశాధినేతతో ఎలాంటి దురవగాహనకు తావుండరాదని ప్రధాని భావిస్తున్నారు. (ఆం. భూ. 4.10.87)

**దురాక్రమణచేయు** క్రి. *duraakramaNaceeyu* అక్రమంగా మరొకరి భూభాగాన్ని స్వాధీనం చేసుకొను to annex టిబెట్‌ను ... 1950లో చైనా కమ్యూనిస్టు ప్రభుత్వం దురాక్రమణచేసింది. (ఆం. ప్ర. 8.10.87)

**దురాగతం** వి. *duraagatam* దౌర్జన్యంతో కూడిన చట్ట వ్యతిరేక కార్యకలాపం cruel action గతంలో టెర్రరిస్టుల దురాగతాలకు బర్నాలా ప్రభుత్వం సాచివేత వైఖరే కారణమని ఆరోపించిన కేంద్ర ప్రభుత్వం ... (ఉ. 15.6.87)

**దుర్భాషలాడు** క్రి. *durbhaaSalaaDu* అవమానకరమైన మాటలు వాడు, తిట్టు to indulge in foul talk, abuse అబిడ్స్ పోలీస్ స్టేషన్ సబ్ ఇన్స్పెక్టర్ ... కులం పేరుతో ... దుర్భాషలాడినందుకు అరెస్టు చేయాలని ... డిమాండు చేశారు. (ఆం. భూ. 17.8.89)

**దుర్భిక్షం** వి. *durbhikSam* తీవ్రమైన వర్షాభావంవల్ల ఆహార పదార్థాల ఉత్పత్తి తగ్గిపోవటంతో ఏర్పడిన కరువు drought, famine నాలుగు సంవత్సరాలుగా తీవ్ర దుర్భిక్షాన్ని చవిచూస్తున్న రాష్ట్ర ప్రజలను ఆదుకోవటంలో ప్రభుత్వం శ్రద్ధ చూపటం లేదని ... విమర్శించారు. (ఈ. 5.6.87)

**దుర్భిక్ష ప్రాంతం** వి. *durbhikSa praantam* కరువు ఏర్పడిన ప్రదేశం famine stricken area కొన్ని దుర్భిక్ష ప్రాంతాలలో మాత్రం మంచినీటికి కరువుగా ఉందని అక్కడ మంచినీటి పథకాలు చేపట్టడంలో ప్రాధాన్యత ఇవ్వాలని ... చెప్పారు. (ఆం. ప్ర. 29.4.89)

**దుర్మరణం** వి. *durmaraNam* ప్రమాదంలో చిక్కుకొని చనిపోవటం death (due to an accident) ఇద్దరు తాపీ పనివారు శుక్రవారం మధ్యాహ్నం గోడకడుతుండగా అకస్మాత్తుగా ఆ గోడ కూలిపోవడంతో అక్కడికక్కడే దుర్మరణం పొందారు. (ఆం. ప. 6.6.87)

**దుర్వినియోగం** వి. *durviniyoogam* అక్రమమైన పద్ధతిలో లేదా స్వప్రయోజనాలకు (పదవి, అధికారం, నిధులు మొ.) ఉపయోగించటం misuse (of power, money etc.) సొంతలాభం ఉండే వాణిజ్యంలో కానీ, వృత్తి ఉద్యోగాలలో కానీ ముఖ్యమంత్రి నిమగ్నమైతే అది అత్యున్నతమైన పదవిని దుర్వినియోగ పరచినట్లేనని ... (ఆం. ప్ర. 5.7.89)

**దుశ్చర్య** వి. *duścarya* చెడు తలంపుతో చేసే పని misdeed దేవీలాల్ వ్యాఖ్యానిస్తూ ఈ దేశంలో ప్రజాస్వామ్యాన్ని భంగం చేస్తున్నారని కేంద్రం దుశ్చర్యను ఖండించారు. (ఆం. ప్ర. 22.4.89)

**దుష్ప్రచారం** వి. *duSpracaaram* ఇతరుల గురించి చెడు సమాచారాన్ని వ్యాప్తి చేయటం (bad) propaganda కాంగ్రెస్‌ను సాధారణ పద్ధతిలో విమర్శించడంతో సంతృప్తి చెందని ముస్లింలీగ్, కాంగ్రెస్ మంత్రి వర్గాలు మైనారిటీలపై అత్యాచారాలకు పాల్పడుతున్నాయని దుష్ప్రచారం సాగించాయని ... పేర్కొన్నారు. (ఆం. జో. 7.11.88)

**దుస్సాహసం** వి. *dussaahasam* సాధ్యాసాధ్యాలు, ఉచితానుచితాలు గమనించకుండా చేసే (తీవ్రమైన) పని imprudent or rash act బాధితుల సహాయానికి భారతదేశం పంపిన పడవలను తన సముద్ర జలాల్లో ప్రవేశించడానికి శ్రీలంక ప్రభుత్వం అనుమతించనందుకు ప్రతిచర్యగా న్యూఢిల్లీ ఈ వైమానిక దుస్సాహసానికి పాల్పడింది. (ఈ 5 6 89)

**దూకుడు** వి. *duukuDu* తొందరపాటు rashness తప్పులపై తప్పులు చేస్తూ దూకుడుగా వ్యవహరించడమంటే ఇదే. (ఆం ప్ర. 23.4 89)

**దూరంచేయు** క్రి. *duuramceeyu* అయిష్టతని పెంచి సాన్నిహిత్యాన్ని దెబ్బతీయు to distance ఈ నిర్ణయాలన్నీ ప్రభుత్వాన్ని ప్రజలకు మరింత దూరంచేస్తాయని ఆయన హెచ్చరించారు. (ఆం జ్యో 18 4 88)

**దూషణ** వి. *duuSaNa* ఇతరుల్ని కించపరుస్తూ మాట్లాడటం abuse ప్రభుత్వ ప్రచార సాధనాలను దూషణ నిమిత్తం ఉపయోగించిన ఘనత తివారీకి దక్కుతుంది. (ఈ 20 5 89)

**దూషించు** క్రి. *duuSıncu* ఇతరుల్ని కించపరిచే విధంగా మాట్లాడు to abuse రాష్ట్ర కార్మిక మంత్రి అసభ్యకరంగా అనాగరికంగా ప్రవర్తిస్తూ సీనియర్ ఐ. ఎ. యస్. అధికారిని .. దూషించడాన్ని ... ఖండించారు. (ఆం భూ 8 6 89)

**దూసుకొనిపోవు** క్రి *duusukonipoovu* ఏదైనా వాహనం అదుపు తప్పి ఎదుటనున్న మరో వాహనంలోకి చొచ్చుకుపోవు to ram into ... నిలిచి ఉన్న అమృతసర్-హరిద్వార్ సాంసింగ్‌లోకి వెనుగు ఒక తేలిక గక్కు ఇంజన్ ఆ తర్వాత ఒక గూడ్సు బండి దూసుకొని పోవడంతో ... (ఆం. ప్ర 17.12.87)

**దృఢనిర్ణయం** వి. *dRDhanırNayam* (ఏదైనా పని) తప్పని సరిగా చేసి తీరాలని నిశ్చయించుకోవటం firm decission ... అవసరమైతే సమ్మెకైనా సంసిద్ధమవుతామని దృఢ నిర్ణయానికి వచ్చినట్టు తెలుస్తున్నది. (ఆం. జ్యో 9.4.88)

**దృఢపరచు** క్రి. *dRDhaparacu* ఒక విషయం వాస్తవమేనని బలపరచు to strengthen, substantiate పరిశీలనాంశాల పట్టికలో ... గారి మీద అవినీతి ఆరోపణలే మొదట పేర్కొనడం ఈ అభిప్రాయాన్ని దృఢపరుస్తున్నది. (ఆం. ప్ర. 27 11 87)

**దృఢమగు** క్రి. *dRDhamagu* మరింత బలం, గట్టిదనం సంతరించుకొను to get strengthened ఈ టిస్యూను ఇస్తే కంటి కింద చర్మం దృఢమై ముడతలు లేకుండా పోతుంది. (ఈ 13 3 88)

**దృఢవైఖరి** వి. *dRDhavaikharı* వెసులుబాటుకి, వెనుకంజకి అవకాశం ఇవ్వని ఖచ్చితమైన ధోరణి firm stand ఉగ్రవాదుల విషయంలో దృఢవైఖరి అవలంబిస్తున్న బి. జె. పి. ని ప్రధాని ప్రశంసించారు. (ఈ. 20 7 89)

**దృఢసంకల్పం** వి. *dRDhasankalpam* ఒకపని ఖచ్చితంగా చేసి తీరాలనే తలంపు determination, strong conviction భారత-శ్రీలంక ఒప్పందంలో తమిళులకు ఇచ్చిన హామీలను నెరవేర్చుకోవాలని భారతదేశం దృఢసంకల్పంతో ఉన్నట్లు ... పునరుద్ఘాటించారు. (ఈ. 19.7 89)

**దృశ్య శ్రవణ విజ్ఞానం** వి. *dRśva*

*śravaNa vijnaanam* టీవీ, ఆకాశ వాణి ప్రసారాల ద్వారా పొందే విజ్ఞానం audio-visual materials సార్క్ ఆమోదించిన ఐదు కార్యక్రమాలలో ముఖ్య మైనది దృశ్య శ్రవణ విజ్ఞానాన్ని సార్క్ దేశాలు పరస్పరం మార్పిడి చేసుకోవడం. (ఆం జ్యో 20 6 87)

దృశ్య శ్రవణ విద్యాబోధన వి. *dRśya śravaNa vidyaaboodhana* దూరద ర్శన్, రేడియోలను ఉపయోగించి చదువు నేర్పటం audio-visual teaching జంట నగరాలలో వచ్చే విద్యా సంవత్సరం నుంచి నూట ఇరవై పాఠశాలల్లో దృశ్య, శ్రవణ విద్యా బోధనని ప్రవేశపెట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది. (ఈ. 28 7 89)

దృశ్య శ్రవణ విద్యా విధానం వి. *dRśya śrvaNa vidyaa vidhaanam* టీ.వీ, ఆకాశవాణి ద్వారా చదువు చెప్పే పద్ధతి audio-visual education దృశ్య శ్రవణ విద్యా విధానాన్ని ఈ. నెల 14 వ తేదీ నుంచి ప్రారంభిస్తున్నట్లు ప్రకటించారు. (ఈ 5 6 87)

దృష్టాంతం వి. *dRSTaantam* భవిష్య త్తులో ఉదాహరణగా ఉపయోగపడే సంఘ టన precedent ... శ్రీనివాసులురెడ్డి అభ్యర్థన పై ప్రకటన చేయడానికి అనుమతి ఇస్తున్నామని, ఇది కేవలం తన విచక్షణ ఉప యోగించి ఇచ్చే అవకాశమని, ఈ విషయం భవిష్యత్తులో దృష్టాంతంగా మారకూడదని చెప్పారు. (ఈ 17 12 87)

దృష్టికి తెచ్చు క్రి. *dRSTiki teccu* పరిశీ లనకోసం తెలియపరుచు to bring to the notice ... అయితే ఆ సర్క్యు లర్‌ను వారు తమ దృష్టికి తేవాలని ... అన్నారు. (ఆం. ప్ర. 23 6.87)

దృష్టి కేంద్రీకరించు క్రి. *dRSTi keen-driikarincu* ఒక అంశంపై ఏకాగ్రతను నిలుపు to concentrate స్వయంగా ఉపాధి కార్యక్రమాలను రాష్ట్ర ప్రభుత్వం సరిగా ప్రోత్సహించడంలేదని ... ప్రతి మండల స్థాయిలో పారిశ్రామికాభివృద్ధి పట్ల ప్రభుత్వం దృష్టి కేంద్రీకరించాలని ఆయన కోరారు. (ఈ 3.7 87)

దృష్టి సారించు క్రి. *dRSTi saarincu* పరిశీలనకు తీసుకొను to look at యూనివర్సిటీలు, కాలేజీల్లో లెక్చరర్ల రిక్రూ ట్‌మెంట్ కోసం ఏయే పద్ధతుల్లో అర్హతా పరీక్షలు నిర్వహించాలన్న విషయమై యు. జి. సి. ప్రస్తుతం దృష్టి సారించింది. (ఈ 28 7.89)

దెప్పిపొడుచు క్రి. *deppipoDucu* వ్యంగ్యంగా విమర్శించు లేదా తప్పులను ఎత్తి చూపు to make a caustic remark పోలీసుల అత్యాచారాలు, బరి తెగించిన ప్రవర్తన, క్రౌర్యం యధావిధిగా కొనసాగుతూనే వున్నాయని దర్బారాసింగ్ లాంటివారే దెప్పిపొడుస్తున్నారు. (ఆం. భూ 22 7.89)

దెబ్బకొట్టు క్రి. *debbakoTTu* భంగం కలి గించు, పాడుచేయు to damage, spoil కుడి కాల్వ అలైన్‌మెంట్‌ను ఆయ కట్టుకు మారిస్తే రాయలసీమకు ఎనలేని నష్టం జరుగుతుందని, అసలు సిసలైన నీటి పారుదల ప్రాజెక్టయిన కుడికాల్వ ప్రతిపాద నపై దెబ్బకొట్టవద్దని కోరారు. (ఈ. 20.7.89)

దెబ్బతిను క్రి *debbatinu* 1. పాడైపోవు to get damaged గ్వాలియర్ వైమా నిక స్థావరంలో హంగర్ కూలిపోవటంవల్ల ఎన్ని మిరేజి విమానాలు దెబ్బతిన్నాయని ... అన్నారు. (ఆం ప్ర. 25 7.83) 2. నష్టపోవు to

be affected వందలాది కుటుంబాలు నిరాశ్రయులయ్యారని ... సుమారు 175 గ్రామాలు దెబ్బతిన్నాయని జిల్లా కేంద్రానికి సమాచారం అందింది. (ఆం. ప్ర 25 7 89)

దెబ్బతీయు క్రి. *debbatiiyu* నష్టం కలిగించు to harm ప్రతిపక్షాలు ప్రజాస్వామ్యాన్ని దెబ్బతీస్తున్నాయని ... ఆరోపించారు. (ఈ 29 7 89)

దేవరహస్యం వి. *deevarahasyam* కొద్ది మంది ప్రముఖులకు మాత్రమే తెలిసి, అందరికీ అందుబాటులోకి రాని సమాచారం secret, confidential రాజకీయ పార్టీలకు విదేశీ నిధుల గురించి దశాబ్దానికి పూర్వం కేంద్ర హోంశాఖ జరిపించిన దర్యాప్తు నివేదిక నేటికీ దేవరహస్యమే. (ఈ 20 4.89)

దేశద్రోహి వి. *deeśadroohi* దేశ ప్రయోజనాలకు నష్టం కలిగించే వ్యక్తి antinational, traitor దేశద్రోహులు పార్లమెంటులోకి ప్రవేశించారంటూ ప్రధాని మంగళవారంనాడు చేసిన వ్యాఖ్యలను .. (ఆం ప్ర 17 8 89)

దేశభక్తుడు వి. *deeśabhaktuDu* దేశం పట్ల ప్రేమాభిమానాలు కలిగి ఎప్పుడూ దేశ శ్రేయస్సునే కాంక్షించే వ్యక్తి patriot ప్రభుత్వ ప్రచార సాధనాలు దేశభక్తులకు సరైన ప్రాధాన్యం ఇవ్వడంలేదని ... ఆరోపించారు (ఈ 30 1 89)

దేశభద్రతాచట్టం వి *deeśabhadra-taacaTTam* దేశ మనుగడకి ముప్పు కలిగించే అంతర్గత శక్తులను అణచటానికి అసాధారణ అధికారాలను కల్పిస్తూ తయారు చేసిన చట్టం National Security Act దేశ భద్రతా చట్టం భారత దేశంలో అంతర్గత సమస్యలు వాపోరాలలో దేశ భద్రతను కాపాడ్డంకోసం 1971లో ... అమలులోకి వచ్చింది. (ఆం ప్ర. 24 9 87)

దేశవాళీ విణ. *deeśavaaLii* స్వదేశం లోనే తయారయిన లేదా రూపుదిద్దుకున్న native, indigenous మనం అనుసరిస్తున్న సోషలిజం మన చరిత్ర, సంస్కృతి జీవన విధానం నుండి మలుచుకొన్నామని, మనది పూర్తి దేశవాళీ సోషలిజమని ప్రధాని వివరించారు. (ఉ 29 12 89)

దేశవ్యాప్తం వి. *deeśavyaaptam* దేశం మొత్తానికి వర్తించేది country-wide ఏడవ ప్రణాళికా కాలం ముగిసే నాటికి దేశ వ్యాప్తంగా దరఖాస్తు చేసుకొన్న వారందరికీ టెలెక్స్ కనెక్షన్లు ... (ఆం ప్ర 6 6 87)

దేశసమగ్రత వి. *deeśasamagrata* జాతి యావత్తు రాజకీయంగా, సాంస్కృతికంగా ఒక్కటిగా ఉండటం national integrity దేశసమగ్రత కన్నా ఎన్నికల సర్దుబాట్లు ముఖ్యమైనవి కాదని సోమవారం స్పష్టం చేసిన జనతాదళ్ అధ్యక్షుడు వి. పి. సింగ్ మాటలను బట్టి చూస్తే ... (ఈ 10.10 89)

దేశాధినేత వి. *deeśaadhineeta* దేశాన్ని పరిపాలించే నాయకుడు head of the state ... 1970 నాటి రాజ్యాంగాన్ని రద్దుచేసి తనకు తానే దేశాధినేతగా ప్రకటించుకున్నారు. (ఆం భూ 21 0 87)

దేహశుద్ధి వి *deehaśuddhi* తీవ్రంగా కొట్టటం thrashing కేరళ అసెంబ్లీలో ఎం ఎల్. ఏ. కి దేహశుద్ధి. (ఆం ప్ర 2 7 87)

దొంగ వోటు వి. *donga vooTu* తనది కాని వోటు bogus vote దొంగవోట్లు వేయడానికి వచ్చిన వారిని పోలింగ్ ఏజెంటు

నిలదీశారు. (ఆం ప్ర 24 11 89)

**దొంగ ఖాతా** వి. *donga khaataa* మారు పేర్లతో రహస్యంగా ఉండే పద్దు secret account స్విస్ బ్యాంకులో దొంగఖాతా లున్న వారిని ప్రాసిక్యూట్ చేయాలని ... (ఉ 15 6 87)

**దొంగచాటు వ్యాపారం** వి. *dongacaaTu vyaapaaram* ప్రభుత్వం కన్నుగప్పి సాగించే అక్రమవ్యాపారం clandestine business వజ్రాలు పొదిగిన నగలు ఎగుమతి ద్వారా మరింత ఎక్కువ విదేశీయ ధనం లభించగలదని చెబుతున్నారు. కాని దొంగచాటు వ్యాపారాన్ని అరికట్టడం ఎవరితరం? (ఆం ప్ర 19 8 89)

**దొడ్డిదారి** వి. *doDDidaari* న్యాయ సమ్మతం కాని అక్రమ మార్గం; back door ... శ్రీ రాజీవ్ గాంధీ దొడ్డిదారి గుండా కాంగ్రెస్ సభ్యులను ప్రవేశపెట్టడానికి యత్నిస్తున్నారని ... (ఆం ప్ర 23.4 89)

**దొమ్మీ** వి. *dommii* జనం గుంపుగా కలబడి కొట్టుకోవటం riot రాష్ట్రంలో రోజుకు ఐదు హత్యలు, పన్నెండు దొమ్మీలు చెలరేగుతున్న రోజుల్లో ... (ఈ 22 4 89)

**దోచు** క్రి. *doocu* దౌర్జన్యంగా డబ్బు, నగలు మొ. ఎత్తుకొనిపోవు to rob బస్సు రాజమండ్రి నుంచి హైదరాబాదు వెళుతుండగా పాలేరు, మోతే గ్రామాల మధ్య గుర్తు తెలియని ముగ్గురు వ్యక్తులు దోపిడి చేసి ప్రయాణీకుల నుండి 40 వేల విలువైన నగలు, నగదు దోచుకెళ్ళారు. (ఆం. ప్ర 26 4.89)

**దోచుకుతిను** క్రి. *doocukutinu* అక్రమ సంపాదనకి వాడుకొను to eat up, exploit ప్రతి సందర్భంలోనూ గాంధీజీని, [illegible]

కునేవారే ఈ దేశాన్ని దోచుకు తింటున్నారు. (ఆం ప్ర. 10 5 89)

**దోబూచులాడు** క్రి. *doobuuculaaDu* నిర్ణయించకుండా కాలయాపనచేయు to play hide and seek, delay వరల్డ్ కప్ లాంటి భారీ టోర్నమెంటు సందర్భంగా కెప్టెన్సీతో దోబూచులాడటం శ్రేయస్కరం కాదు. (ఈ. 18 6.87)

**దోహదంచేయు** క్రి. *doohadamceeyu* ఏదైనా పరిణామానికి అనుకూలంగా ఉపయోగపడు to contribute కాని ఇవి ఎలుక జాతి జంతువులలో క్యాన్సర్‌కు కారణమయ్యే రెట్రో వైరస్ ఆవిర్భావానికి దోహదంచేస్తాయి. (ఆం. జ్యో 30 12 87)

**దోహదపడు** క్రి. *doohadapaDu* అభివృద్ధికరమైన మార్పులకు, పరిణామాలకు అనుగుణంగా పనిచేయు to help ... సర్వతో ముఖ పారిశ్రామికాభివృద్ధికి కార్మికాభ్యున్నతికి దోహదపడాలన్నదే ప్రభుత్వ విధానంగా ఉందని ఆయన వివరించారు. (ఈ 2 5 89)

**దౌత్యకార్యాలయం** వి. *dautyakaaryaalayam* ఒక దేశం తన రాయబార కార్యకలాపాల కోసం విదేశాలలో నెలకొల్పిన అధికార నివాసం embassy పెకింగ్‌లోని అమెరికా దౌత్య కార్యాలయంలో తల దాచుకుంటున్న ఇద్దరు అసమ్మతి వాదులు దేశం విడిచి వెళ్ళకుండా ... ఆదేశించింది. (ఆం. ప్ర 14 6 89)

**దౌత్యనీతి** వి. *dautyaniiti* ఇతర దేశాలతో సంబంధాలను చాకచక్యంగా నిర్వహించటం diplomacy ఈ విషయంలో మన దౌత్యనీతి, సైనికనీతి నిస్సందేహంగా విఫలమయ్యాయి. (ఆం జ్యో 5.6.87)

**దౌత్యవరాలు** వి. (బ.వ.) *dautyavar-*

*gaalu* ఇతర దేశాలతో సంబంధాలు నెరపే బాధ్యతను నిర్వహిస్తూ ఆ కార్యకలాపాలకు సంబంధించిన సమాచారం తెలియజేసే అధికారులు diplomatic sources *శ్రీలంకతో ప్రత్యక్షంగా ఘర్షణ పడే ఉద్దేశం తమ ప్రభుత్వానికి లేదని ... ప్రధాని శ్రీ రాజీవ్ గాంధి తెలిపినట్లు దౌత్యవర్గాల ద్వారా వెల్లడైంది.* (ఆం. ప్ర. 25.7.89)

**దౌత్యవేత్త** వి. *dautyaveetta* ఇతర దేశాలతో సంబంధాలు నిర్వహించటం కోసం నియమించబడిన అధికారి diplomat *భారత-శ్రీలంకల దౌత్యవేత్తలతో పరిస్థితి గురించి డిక్సిట్ సంప్రదిస్తున్నారని ఆయన తెలిపారు.* (ప్ర. శ. 5.6.87)

**దౌత్య సంబంధాలు** వి. *dautya sambandhaalu* రాజకీయ, ఆర్థికాది రంగాలలో దేశాల మధ్య ఉన్న అధికారికమైన లావాదేవీలు diplomatic relations *ఉభయ దేశాల మధ్య దౌత్య సంబంధాలను నెలకొల్పుకొనడానికి థాయిలాండ్, భూటాన్ అంగీకారం కుదుర్చుకున్నాయి.* (ఆం. ప్ర. 6.7.89)

**దౌత్యస్థాయి** వి. *dautyasthaayi* (విదేశీ వ్యవహారాలకు సంబంధించి) రాజకీయ నాయకత్వానికి ప్రాతినిధ్యంవహిస్తూ అధికారులు పాల్గొనే స్థితి diplomatic level *శ్రీలంక నుండి 'భారతీయ శాంతి పరిరక్షణ దళాల' (ఐ. పి. కె. ఎఫ్)ను ఉపసంహరించుకొనే విషయమై దౌత్యస్థాయిలో తుది నిర్ణయం తీసుకోవలసిన సమయం ఆసన్నమైంది.* (ఆం. ప్ర. 25.7.89)

**దౌర్జన్యకాండ** వి. *daurjanyakaanDa* పెద్ద ఎత్తున జరిగే హింసాత్మక సంఘటనలు violence *చైనాలోని రెండు ప్రధాన పట్టణాల్లో పెద్ద ఎత్తున అల్లర్లు, దౌర్జన్యకాండ ... చెలరేగినట్లు అధికారిక వార్తలు తెలిపాయి.* (ఆం. ప్ర. 24.4.89)

**దౌర్భాగ్యస్థితి** వి. *daurbhaagyasthiti* మిక్కిలి దురదృష్టకరమైన పరిస్థితి; హీన స్థితి unfortunate situation, wretchedness *నట్టనడి చలికాలంలోనే విద్యుత్ కోత విధించవలసిన దౌర్భాగ్యస్థితి ఎందుకు దాపురించింది?* (ఆం. జ్యో. 2.12.88)

**దౌష్ట్యం** వి. *dauSTyam* దుర్మార్గంగా ప్రవర్తించటం rude behaviour *ఇరాన్ దౌత్యవేత్తపై ఫ్రాన్స్ పోలీసుల దౌష్ట్యం.* (ప్ర. శ. 14.7.87)

**ద్రవ్యోల్బణం** వి. *dravyoolbaNam* అన్ని వస్తువుల ధరలు పెరిగిపోయి ఆ మేరకి డబ్బుకున్న కొనుగోలు శక్తి పడిపోవటం inflation *రెండు ప్రధాన మెట్రోపాలిటన్ నగరాలైన మద్రాసు, బొంబాయిలలో ద్రవ్యోల్బణం రేటు తక్కిన చోట్లకంటె అధికంగా ఉంది.* (ఆం. ప్ర. 21.8.87)

**ద్వంద్వనీతి** వి. *dvandvaniiti* ఒకే అంశంపై రెండు రకాల విధానాలను అనుసరించటం double standard *రాష్ట్ర ప్రభుత్వం ద్వంద్వనీతిని పాటిస్తున్నదనే అనుమానం నక్సలైట్లలో సహితం కలగడం సహజం.* (ఆం. భూ. 18.7.89)

**ద్వంద్వప్రమాణాలు** వి. (బ.వ.) *dvandvapramaaNaalu* చూ. ద్వంద్వనీతి; *నక్సలైట్ల వ్యవహారంలో నిర్దిష్టమైన విధానం లేకుండా ప్రభుత్వం ద్వంద్వప్రమాణాలను అనుసరిస్తోందని ఆయన ఆరోపించారు.* (ఆం. ప్ర. 25.7.89)

**ద్వంద్వవైఖరి** వి. *dvandvavaikhari* చూ. ద్వంద్వనీతి; *మహారాష్ట్రలో శివసేనతో పొత్తుపెట్టుకొనే పార్టీతో సీట్ల సర్దుబాటు చేసుకోబోమని వి. పి. సింగ్*

ప్రకటించడం వారి ద్వంద్వవైఖరికి నిదర్శ నంగా ఉందని ... విమర్శించారు (ఈ 11 7.89)

**ద్విజాతి సిద్ధాంతం** వి. *dvijaati siddhaantam* చూ. జాతి ద్వయ సిద్ధాంతం; రాజ్యసభలో నేడు సర్కారియా కమీషన్ నివేదికపై మాట్లాడుతూ ఈ దేశం ఎన్నడూ ద్విజాతి సిద్ధాంతానికే అంగీకరించ నపుడు కొందరు డిమాండు చేస్తున్న బహుళ జాతి సిద్ధాంతాన్ని ఎలా అంగీకరిస్తుందని ఆయన ప్రశ్నించారు. (ఆం ప్ర 30 11 88)

**ద్విముఖ విధానం** వి. *dvimukha vidhaanam* (లక్ష్యసాధన కోసం) ఒకే సమయంలో రెండు కోణాల నుంచి ప్రయ త్నించటానికి వీలు కల్పించే ప్రణాళిక dual strategy పంజాబ్‌పై ప్రభుత్వం స్పష్టమైన ద్విముఖ విధానం రూపొందించిం దని ఆయన అన్నారు. (ఆం. జ్యో. 20 4 88)

**ద్విముఖ వ్యూహం** వి. *dvimukha vyuuham* చూ. ద్విముఖ విధానం; మత తత్వ బెడదను ఎదుర్కొనేందుకు ద్విముఖ వ్యూహాన్ని అనుసరించాల్సి ఉంది.

**ద్వైపాక్షిక** విశ. *dvaipaakSika* ఇరు దేశా లకు లేదా పక్షాలకు (మాత్రమే) సంబం ధించిన bilateral 'సార్క్' నియమావళి ప్రకారం ద్వైపాక్షిక సమస్యలను, అంశాలను చర్చకు లేవనెత్తరాదు. (ఆం భూ 6 6 87)

**ద్వైవార్షిక ఎన్నిక** వి. *dvaivaarSika ennika* రాజ్యసభకు కొత్త సభ్యులను ఎన్ను కోవటానికి రెండు సంవత్సరాల కొకసారి నిర్వహించే ఎన్నిక biennial election ద్వైవార్షిక ఎన్నికల అనంతరం 146 వ రాజ్య సభ సమావేశాలు సోమవారం ప్రారంభమ యిన వెంటనే . . (ఉ. 26 4 88)

## ధ

**ధనాఢ్యుఁడు** వి. *dhanaaDhyuDu* బాగా డబ్బుగల వ్యక్తి; ధనవంతుడు wealthy person భూస్వాములకు, ధనాఢ్యులకు ఆయుధాలు ఇచ్చి, వారు గ్రామాలలో తమ పెత్తనాన్ని పెంచుకొనడానికి ... (ఆం. ప్ర. 21 4 89)

**ధనికదేశం** వి *dhanikadeeśam* పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశం rich-nation, developed country ... చైనాపై అనుచిత ఆరో పణలు చేస్తున్నాయని పీపుల్స్ డైలీ ఈ ఏడు ధనికదేశాలను విమర్శించింది. (ఆం. ప్ర. 18.7.89)

**ధరావతు** వి. *dharaavatu* ఎన్నికలలో నిలబడటానికి అభ్యర్థి చెల్లించే సొమ్ము (తగినన్ని ఓట్లు లభించిన పక్షంలో ఈ మొత్తాన్ని అభ్యర్థికి వాపసు చేస్తారు) security deposit ... మొదటి రోజు నాలుగు నామినేషన్లు దాఖలయ్యాయి. ఒక్కరు మాత్రమే ధరావతు మొత్తం చెల్లిం చారు. (ఆం. జ్యో. 11 6.87)

**ధర్నా** వి. *dharnaa* నిరసన వ్యక్తం చేయడానికి (నిర్ణీత ప్రదేశం వద్ద) జరిపే బైఠాయింపు dharna ఆకాశవాణి, దూర దర్శన్ కేంద్రాల వద్ద ఈ నెల 26వ తేదీన ధర్నా నిర్వహించాల్సిందిగా ... విజ్ఞప్తి చేశారు. (ఆం ప్ర 15.6 89)

**ధర్మయుద్ధం** వి. *dharmayuddham* అన్యాయాలకు, అక్రమాలకు వ్యతిరేకంగా చేసే పోరు holy-war ... సభలో నాయకులు ప్రసంగిస్తూ, ప్రభుత్వంపై ధర్మ యుద్ధం చేస్తామని ప్రకటించటాన్ని కేంద్రం తీవ్రమైన విషయంగా తీసుకొన్నదని ఈ వర్గాలు తెలిపాయి. (ఆం ప్ర 26.4 89)

**ధర్మాసనం** వి. *dharmaasanam* ఒక కేసును విచారించే న్యాయాధిప

తుల బృందం bench (of judges) *భోపాల్ బాధితులకు నష్టపరిహారంగా 47 కోట్ల డాలర్ల తుది పరిష్కారం చేయడానికి కారణాలను ఈ ఉత్తర్వులో ధర్మాసనం వివరించింది.* (ఆం. భూ 5 6.89)

**ధాటి** వి. *dhaaTi* ఆటలో విజృంభించటం force (of a player in a game) ... *రిచర్డ్‌సన్ నేడు కూడా ధాటిగా బ్యాటింగ్ చేసి దురదృష్టవశాత్తు ఒకే ఒక రన్ దూరంలో 99 పరుగులకు అవుట్ కావడం విశేషం.* (ఈ 20 4 89)

**ధారపోయు** క్రి. *dhaarapooyu* (క్రికెట్ ఆటలో బౌలరు పరుగులు) ఎక్కువగా ఇచ్చివేయు to give away (runs in cricket) *పాక్ కెప్టెన్ ఇమ్రాన్‌ఖాన్ తన మొదటి ఆరు ఓవర్లలో 52 పరుగులు ధారపోశారు.* (ఉ 22.3.88)

**ధారావాహికం** వి. *dhaaraavaahikam* (నవల, ఆత్మకథలాంటి) రచనలను కొన్ని భాగాలుగా విభజించి వరుసగా (పత్రికల్లో) ప్రచురించటం లేదా (రేడియో, టీవీలలో) ప్రసారం చెయ్యటం serial *గ్రోమికో, స్మృతుల పేరిట రాసిన ఆత్మకథను 'లండన్‌టైమ్స్' అబ్జర్వర్ పత్రికలు ధారావాహికంగా ప్రకటించాయి* (ఆం భూ. 5.7.89)

**ధిక్కరించు** క్రి. *dhikkarincu* ఉద్దేశపూర్వకంగా అతిక్రమించు; ఉల్లంఘించు to violate, go aganist *ప్రభుత్వం రాజ్యాంగంలోని 151 ఆర్టికల్‌ను ధిక్కరిస్తున్నదని అందువల్ల ప్రభుత్వం సభాహక్కుల ఉల్లంఘన నేరం ఎదుర్కోవాలని ఆయన అన్నారు.* (ఆం. భూ 9 5 89)

**ధిలాసా** వి. *dhilaasaa* నమ్మకంతో కూడిన ధైర్యం; ధీమా confidence *మీ అనుమతి ఉంటుదన్న ధిలాసాతోనే ఆయన ఇలా అధికార దుర్వినియోగానికి పాల్పడుతున్నట్టుగా భావించవలసివస్తుంది.* (ఆం భూ 2.5 89)

**ధీమా** వి. *dhiimaa* చూ. ధిలాసా *ఇరువర్గాలకూ ఏదీతేల్చి చెప్పక పోవడంతో ఎవరికివారు ప్రధాని తమ పక్షాన్నే ఉన్నారనే ధీమాతో ఉన్నారు.* (ఉ 27.4.88)

**ధోబీఘాట్** వి. *dhoobiighaaT* రజకులు బట్టలు ఉతకడానికి ప్రత్యేకించిన నీటివసతి గల ప్రదేశం dhobighat (a place where washermen wash the clothes) ... *నెల్లికుదురులో ధోబీఘాట్లు లేక రజకులు ఇబ్బందికి గురవుతున్నారని ...* (ఆం. భూ 17 10 89)

**ధ్రువపత్రం** వి. *dhruvapatram* తన తరఫున మరొకరు వ్యవహరించటానికి ఇచ్చే రాత పూర్వకమైన సమ్మతి letter of authorisation *పాస్‌పోర్టుగాని, సంబంధిత ధ్రువ పత్రాలుగానీ దరఖాస్తుదారునికి లేదా ఆయన ధ్రువపత్రంతో వచ్చిన వ్యక్తికి మాత్రమే అందజేయాలన్నది నిబంధన* (ఆం ప 15 6 89)

**ధ్రువపరచు** క్రి. *dhruvaparacu* (దిగువ కోర్టు విధించిన శిక్షను) ఖరారు చేయు to uphold (a judgement) ... *యాన్‌సిరోంగ్‌లకు దిగువకోర్టు విధించిన మరణశిక్షను షాంగై ఉన్నత న్యాయస్థానం మంగళవారంనాడు ధ్రువపరిచింది.* (ఆం భూ. 22.6 89)

**ధ్రువీకరణ పత్రం** వి. *dhruviikaraNa patram* పేర్కొన్న వివరాలు నిజమేనని నిర్ధారిస్తూ అధికారి ఇచ్చే పత్రం certificate ... *కనుక వెంటనే ఎం. ఆర్. ఓ. దగ్గర ధ్రువీకరణ పత్రం తీసుకొని*

పంపించవలసిందిగా ప్రధానోపాధ్యాయులకు ఉత్తర్వులు పంపారు. (ఈ 14.4.88)

**ధ్రువీకరించు** క్రి. *dhruviikarincu* ఒక విషయం నిజమేనని (అధికారికంగా) అంగీకరించు లేదా తేల్చిచెప్పు; పో. చూ. నిర్ధారించు to confirm *అయితే ఈ వార్తను తాము ధ్రువీకరించజాలమని ఇక్కడి భారత హైకమీషన్ ప్రతినిధి ఒకరు అన్నారు.* (ఆం ప. 16.10 87)

**ధ్వజమెత్తు** క్రి. *dhvajamettu* తీవ్రమైన విమర్శచేయు to attack (verbally), criticise (severely) *మావో విధానాలపై ధ్వజమెత్తిన డెంగ్ నాయకత్వాన్ని ఇప్పుడు ప్రతిఘటిస్తున్న యువతరాన్ని సంస్కరణల పేరిట రకరకాల ఆకర్షణలు కవ్విస్తున్నాయి.* (ఆం భూ 26.4 89)

**ధ్వనికాలుష్యం** వి. *dhvanikaaluSyam* యంత్రాలు, మోటారు వాహనాల వంటివి చేసే రొద పరిమితి దాటటంవల్ల వాతావరణంలోని ప్రశాంతత తీవ్రంగా దెబ్బతినటం noise pollution *ప్రముఖ రచయిత్రి ... 'ధ్వనికాలుష్యం' పై వచనకవిత వినిపించారు.* (ఆం ప్ర. 26 4 89)

## న

**నకలుకొట్టు** క్రి. *nakalukoTTu* (పరీక్షల్లో) దొంగతనంగా చూసిరాయు; కాపీకొట్టు to copy (as in examinations) *ఒక విశ్వవిద్యాలయంలోని కళాశాలలో భారీ ఎత్తున విద్యార్థులు నకలు కొడుతున్నారన్నది బహిరంగ రహస్యం.* (ఈ 28 2.88)

**నకలు ప్రతి** వి. *nakalu prati* వివరాలు, రూపురేఖలు ఖచ్చితంగా అసలు దాన్ని సరిపోలి ఉండేట్లుగా తయారు చేసిన కాపీ duplicate (copy) *భారత కర్షక సమాజ్‌కు-సంజీవని పొడ్దార్స్‌కు మధ్య జరిగిన ఒప్పందం తాలుకు 'నకలు ప్రతి' ఒకటి కావాలని ప్రతిపక్షాలు డిమాండ్ చేశాయి.* (ఆం ప్ర 9.5.89)

**నకిలీ** వి. *nakili* 1. ఒక వస్తువులాగా పైకి కనిపించినా నిజానికి అదికానిది fake thing *నకిలీ బంగారం* 2. మరో వ్యక్తిలాగా నటిస్తూ మోసంచేసేవాడు fake (person) *నకిలీ ఐ. ఎ. ఎస్. అధికారి అరెస్టు* (ఆం. ప్ర. 23.6 87)

**నక్సలిజం** వి. *naksalijam* తుపాకీ గొట్టం ద్వారా రాజ్యాధికారం లభిస్తుందన్న విశ్వాసం, వర్గ శత్రు నిర్మూలన ధ్యేయంగా కలిగిన రాజకీయ ఆలోచనా విధానం naxalism *నక్సలిజంపై బహుముఖ సమరం* (ఆం ప్ర. 21 8 87)

**నక్సలైట్** వి. *naksalaiT* సాయుధ విప్లవం లక్ష్యంగా రహస్యోద్యమం చేపట్టి ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడే వ్యక్తి naxalite ... *నక్సలైట్ల సమస్య ఆర్థిక సామాజిక సమస్యలతో తాము గుర్తించినట్లు చెప్పారు.* (ఆం ప్ర 4.7 89)

**నక్షత్రపు గుర్తు** వి. *nakSatrapu gurtu* (చట్ట సభలలో ప్రశ్నలకి) అత్యంత ప్రాముఖ్యం ఉన్నట్లు సూచిస్తూ పెట్టే చుక్క star mark *ఈ నెల 11వ తేదీన 37 నక్షత్రపు గుర్తు లేని ప్రశ్నలను, 16 నక్షత్రం గుర్తు ఉన్న ప్రశ్నలను శాసనసభ టేబులు ముందు సభ్యులు ఉంచారు.* (ఆం. ప్ర 20 9 89)

**నగరపాలక బిల్లు** వి. *nagarapaalaka billu* కేంద్రప్రభుత్వం నేరుగా నగరపాలక సంస్థలకు ఆర్థిక సహాయం అందచేందుకు ఉద్దేశించిన బిల్లు munci corporation bill ... *పేదరిక ;*

లనకు దోహదం చేయాలన్న ఉద్దేశంతో తన ప్రభుత్వం ప్రవేశపెట్టిన పంచాయితీరాజ్, నగరపాలక బిల్లులను ప్రతిపక్షాలు అడ్డుకున్నాయని ఆయన పాతపాట పాడారు. (ఈ 17.11.89)

**నటనచేయు** క్రి. *naTanaceeyu* తనవి కానివి, నిజంగా తనకు లేనివి ఆయిన భావాలను ప్రదర్శించు to act, pretend ఈ ఆటగాడు దబ్బున పడిపోయి పెద్దదెబ్బ తగిలినట్లు బోల్డు నటనచెయ్యాలి. (ఆం భూ 30 11 87)

**నటించు** క్రి. *naTincu* చూ. నటనచేయు. సభలో గందరగోళం జరిగినంతసేపు ఏదశలోను సభ్యులను వారిస్తున్నట్లు ప్రధాని కనీసం నటించనైనా లేదని అన్నారు

**నడక పందెం** వి *naDaka pandem* వేగంగా నడవటంలో పోటీ walking (race). నిన్న జరిగిన ఇతర పోటీల్లో మహిళల షాట్ పుట్, డిస్కస్‌త్రో, పదివేల మీటర్ల నడక పందెంలో మలేషియా జాతీయ రికార్డులు స్థాపించింది. (ఆం. ప్ర 19 7 87)

**నడుంకట్టు** క్రి. *naDumkaTTu* పనిచేయటానికి ఉద్యుక్తులగు to undertake, endeavour జాతీయ స్థాయిలో ప్రచారోద్యమానికి నడుంకట్టాలని పార్టీలోని కొందరు సీనియర్ నాయకులు సూచించారు. (ఈ 27.7.89)

**నడుంబిగించు** క్రి. *naDumbigincu* చూ. నడుం కట్టు; విశ్వశాంతికోసం నిరంతరం కలలుగన్న ఈ నవభారత నిర్మాత ఆశయాలు ఫలింపజేయడానికి న్యాయవాదులు నడుం బిగించాలని ఆమె పిలుపునిచ్చారు. (ఈ అను. 1.7.89)

**నడుపు** క్రి. *naDupu* ఏదైనా సంస్థను లేదా కార్యకలాపాలను నిర్వహించు to run, organize ప్రజలకు ఉపయోగపడే విధంగా నడపాలని ముఖ్యమంత్రి వాటి అధిపతులను కోరారు. (ఆం. జ్యో 12 4 88)

**నడ్డివిరుచు** క్రి. *naDDiviirucu* అధికభారాన్ని మోపి ఇబ్బందుల పాలు చేయు to over burden ప్రభుత్వం నీటి తీరువాను రెట్టింపు చేసి రైతాంగం నడ్డి విరిచిందని అన్నారు. (ఆం ప్ర. 25 4.89)

**నమోదుచేయు** క్రి. *namooducceeyu* (పేరు, విషయం మొ.) రికార్డుల్లోకి ఎక్కించు to register ... సభ్యులను నమోదుచేసే కార్యక్రమాన్ని ఈ ప్రత్యేక అధికారులు నిర్వహిస్తారు. (ఈ. 27.4.89)

**నమ్మబలుకు** క్రి. *nammabaluku* నమ్మే విధంగా మాట్లాడు to assure పంచాయితీ రాజ్ వ్యవస్థను పటుతరంగా తీర్చిదిద్దడం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల సమష్టి బాధ్యత అని ఒకవైపు నమ్మబలుకుతూనే మరోవైపు ... (ఈ. 8 5 89)

**నమ్రత** వి. *namrata* వినయంగా ఉండటం humbleness, politeness వీరి అప్పీలు నమ్రతగా ఉన్నట్లయితే పరిస్థితి మరోవిధంగా ఉండేదేమోనని అభిప్రాయపడుతున్నారు. (ఈ. 22 8 89)

**నయమగు** వి. *nayamagu* (వ్యాధి, గాయం మొ.) మానిపోవు to get cured ... అతని బొటన వేలి దెబ్బ ఇంకా పూర్తిగా నయం కాలేదు అన్నాడు. (ఆం. జ్యో 14.10 87)

**నరమేధం** వి. *narameedham* మూకుమ్మడిగా మనుషుల్ని చంపటం carnage నేడు పంజాబ్‌లో నరమేధం 'క్రికెట్ స్కోర్'లా పెరిగిపోతోంది. (ఆం. భూ. 27.6.89)

**నరికి చంపు** క్రి. *nariki campu* మారణాయుధాలతో ఖండించి ప్రాణాలు తీయు to hack sb to death పంజాబ్ టెర్ర

రిస్టులు గత 24 గంటల్లో ఒక పూజారిని నరికి చంపారు. (ఆం జ్యో. 19.10 87)

**నర్మగర్భం** వి. *narmagarbham* నిగూఢమైన అర్థం subtle ... అప్పటిదాకా నేను ఏ ఆర్డరు జారీచేసినా అది భారత రాష్ట్రపతి నుంచి వచ్చిన ఉత్తరువే అవుతుందని నర్మగర్భంతో రాష్ట్రపతి చెప్పారట. (ఈ 14.7.87)

**నర్సరీ** వి. *narsaru* రకరకాల పూల, పండ్ల మొక్కల్ని పెంచి అమ్మే చోటు nursery ... మొక్కలు అటవీ శాఖ వారి నర్సరీల నుంచి ఉచితంగా పొందవచ్చు. (ఆం ప్ర. 22 4 88)

**నలుగు** క్రి. *nalugu* పరిశీలనలో ఉండు to be under consideration మళ్ళీ పి. సి. సి. (ఐ) అధ్యక్ష బాధ్యతలు స్వీకరించమని ... ప్రస్తుతం మాజీ ముఖ్యమంత్రి డా. మర్రి చెన్నారెడ్డి పేరు నలుగుతున్నది. (ఆం. భూ. 22.4 89)

**నలుపురోజు** వి. *nalupuroju* నిరసన వ్యక్తం చేసే దినం black day భారత స్వాతంత్ర్య దినోత్సవాన్ని 'నలుపురోజు'గా పాటించాలని పిలుపు నిచ్చిన ముస్లిం యునైటెడ్ ఫ్రంట్‌ను నిషేధించాలని ఆయన కోరారు. (ఆం భూ 17 8 89)

**నల్లచట్టం** వి. *nallacaTTam* ప్రజల హక్కులను కాలరాసే చట్టం black act కేంద్ర ప్రభుత్వం టెర్రరిస్టు చట్టం, నాసా, మీసా లాంటి .. చట్టాలు అనేకంగా తీసుకొని వచ్చి ప్రాథమిక హక్కులను కాలరాయాలని చూస్తున్నదని ... ఈ విషయంలో ప్రజలను జాగృత పరచి నల్ల చట్టాలను తిప్పి కొట్టాలని ఆయన పిలుపు నిచ్చారు. (ఆం ప్ర 11 10 89)

**నల్లజెండా** వి. *nallajenDaa* నిరసన తెలియజేయటానికి ప్రదర్శించే నలుపు రంగు పతాకం black flag ... హర్యానా ముఖ్యమంత్రి శ్రీ దేవీలాల్‌కు వ్యతిరేకంగా నల్లజెండాల ప్రదర్శన నిర్వహించడానికి ... సిద్ధం చేస్తున్నది. (ఆం. ప్ర 12.9.88)

**నల్లధనం** వి. *nalladhanam* తమ ఆదాయం గురించి ప్రభుత్వానికి తప్పుడు లెక్కలు చూపించి అక్రమంగా దాచిన డబ్బు black money జంగారెడ్డి గూడెం లోని డిస్టిలరీని 2కోట్ల 10 లక్షలకు అమ్మే యాల్సిందిగా ఒత్తిడి తెచ్చారని పైగా 30 లక్షల రూపాయలు నల్లధనంగా ఇచ్చారని ... అన్నారు. (ఆం ప్ర 8 5 89)

**నల్లబజారు** వి. *nallabajaaru* అక్రమ వ్యాపార లావాదేవీలు జరిగే వ్యవస్థ; చీకటి బజారు black market పేద ప్రజలకు అందవలసిన నిత్యావసర వస్తువులను నల్లబజారులో అమ్మేవారిపై కఠిన చర్యలు తీసుకోగలమని ప్రధాని హెచ్చరించారు. (ఆం జ్యో 2 9 87)

**నల్లబ్యాడ్జి** వి. *nallabyaaDjiu* నిరసన సూచకంగా ధరించే నలుపురంగు బట్ట ముక్క black badge పరువు నష్టం బిల్లుకు నిరసనగా రేపటి నుంచి 14వ తేదీ వరకు నల్ల బ్యాడ్జీలు ధరించాలని ... విజ్ఞప్తి చేసింది. (ఆం. ప్ర. 12 9.88)

**నవ్వులపాలగు** క్రి. *navvulapaalagu* అపహాస్యానికి గురి అగు to become a laughing stock, get ridiculed పార్టీ నాయకత్వ ధోరణి వల్ల పార్లమెంటరీ పార్టీ నలుగురి దృష్టిలో నవ్వులపాలయిందని వీరు బాధపడుతున్నారు. (ఆం భూ 30.11 87)

**నష్టపరిహారం** వి. *naSTaparihaaram* ప్రమాదంవల్ల జరిగిన నష్టాన్ని పూడ్చటానికి చెల్లించే సొమ్ము compensati

మృతుల కుటుంబాలకు ఒక్కొక్కరికి రెండు లక్షల 50 వేల డాలర్లు, ఇతర బాధితులకు లక్ష డాలర్లు నష్టపరిహారం ఇవ్వదలచినట్టు అమెరికా ప్రకటించింది. (ఆం ప్ర 19 7.89)

**నష్టపరిహార పత్రం** వి *naSTapari-haara patram* ప్రమాదం వలన తాము కోల్పోయిన దానికి ప్రత్యామ్నాయంగా పొందవలసిన సొమ్ముకోసం పెట్టుకొనే అర్జీ compensation paper భోపాల్ గ్యాస్ బాధితుల్లో ఆరు లక్షలకు పైగా బాధితులు సంబంధిత అధికారుల వద్ద నష్టపరిహార పత్రాలను దాఖలు చేశారని రాజ్యసభలో చెప్పారు (ఆం ప్ర 25 7 89)

**నాంది** వి. *naandi* ఒక కార్యక్రమానికి లేదా పరిణామానికి ప్రారంభ సూచకమైన తొలి ఘట్టం లేదా సంఘటన beginning ... ప్రదేశ్ కాంగ్రెస్(ఐ) కమిటీ నిర్వహించ తలపెట్టిన దీర్ఘ కాలిక ఉద్యమానికి నాందిగా ... విజయవాడలో బ్రహ్మాండమైన సభ జరపాలని నిర్ణయించినట్టు తెలియవచ్చింది. (ఆం ప్ర. 4 2.89)

**నాటుసారా** వి. *naaTusaaraa* దేశ వాళీ పద్ధతిలో తయారు చేసిన మద్యం country liquor గత పది రోజులలో ఎక్సయిజ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ అధికారులు దాడులు జరిపి అక్రమంగా నాటుసారా విక్రయించడాన్ని కనుగొన్నారు. (ఆం జ్యో 29 7 87)

**నాటో దేశాలు** వి. (బ.వ.) *naaToo deeśaalu* పరస్పర సహకారం కోసం ఏర్పాటయిన నార్త్ అట్లాంటిక్ ట్రీటీ ఆర్గనైజేషన్ సంస్థలోని సభ్య దేశాలు (అమెరికా, కెనడా, ఐస్‌లాండ్, టర్కీ, గ్రీస్ ఇంకా అనేక ఐరోపా దేశాలు ఇందులో ఉన్నాయి.) member countries of NATO (North Atlantic Treaty Organization) నాటో దేశాలు ఆయుధ పోటీని పెంచడం, ఉద్రిక్తతల్ని విస్తరించడం లక్ష్యంగా పెట్టుకున్నాయి. (విశా 10 6 87)

**నాణ్యత** వి. *naaNyata* పనితనం, మన్నికకు సంబంధించిన మంచి గుణం quality కేవలం నాణ్యత ఆధారంగా బోఫోర్స్ తుపాకుల ఒప్పందం కుదుర్చుకున్నట్లు ... (ఈ 27 4 88)

**నాదార్తు గ్రామం** వి. *naadaartu graamam* ప్రభుత్వ రికార్డుల్లో చేరని పల్లె naadaartu village (that which has not gone into the official records) గత పది ఏళ్ళుగాను ఈ 25 గ్రామాలు 'నాదార్తు' గ్రామాలుగానే ఉండిపోయాయి. అంటే ప్రభుత్వ రికార్డుల్లో ఈ గ్రామాలు ఉండవు. (ఆం జ్యో. 21.7 87)

**నాన్చు** క్రి. *naancu* విషయాన్ని తేల్చక అనిశ్చితంగా ఉంచు to drag బోఫోర్స్ వ్యవహారాన్ని నానుస్తున్నామన్న ఆరోపణను ప్రధాని తిరస్కరించారు. (ఈ 15 6 87)

**నాబార్డ్** వి. *naabaarD* వ్యవసాయ రంగం అభివృద్ధికోసం జాతీయ స్థాయిలో ఏర్పాటైన బ్యాంకు; జాతీయ వ్యవసాయ పరిశోధనాభివృద్ధి బ్యాంకు NABARD (National Bank for Agricultural Research and Development) మున్సిపాలిటీలకు ఆర్థిక సహాయం అందజేయడానికై 'నాబార్డు' తరహాలోనే పట్టణాభివృద్ధి బ్యాంకును స్థాపిస్తున్నట్టు ప్రధాని ప్రకటించారు. (ఆం భూ 27 6 89)

**నామమాత్రం** వి. *naamamaa-tram* పేరుకు మాత్రమే చెప్పకోదగినది; అత్యంత స్వల్పం nominal పరిశ్రమలు

గడిస్తున్న లాభాల శాతంలో నామమాత్రం ఖర్చు పెట్టినా కాలుష్యాన్ని నివారించవచ్చుననీ ... (ఆం. ప్ర. 6.6.87)

**నామినేట్ చేయు** క్రి. *naamineeTceeyu* ఒక వ్యక్తిని (ఎన్నిక ద్వారా కాకుండా నేరుగా) ఒక పదవి లేదా హోదాలో నియమించు to nominate నల్లగొండ పట్టణ ఎగ్జిక్యూటివ్‌ను కూడా డి. సి. సి. అధ్యక్షుడు నామినేట్ చేశారు. (ఆం ప్ర 27.7.89)

**నామినేషన్ పత్రం** వి. *naami-neeSan patram* ఎన్నికలలో తమ అభ్యర్థిత్వాన్ని పేర్కొంటూ సమర్పించే కాగితం nomination paper ... బస్సులో వెళ్ళి శాసన సభకు నామినేషన్ పత్రాలు దాఖలు చేసి వచ్చారు (ఆం ప్ర 18.11.89)

**నామోషి** వి. *namooSi* (ఒక పనిని) చిన్నతనంగా లేదా సిగ్గు పడాల్సిన విషయంగా భావించటం shyness, shame చాల మందికి పిల్లల్ని కనడంలో ఉన్న ఇంట్రెస్టు పెంచడంలో ఉండదు. పిల్లల్ని ఎక్కడికైనా తీసుకు వెళ్ళడానికి నామోషిగా అనిపిస్తుంది కాబోలు. (ఆం. భూ 21.4.89)

**నాయకగణం** వి. *naayaka-gaNam* పార్టీలో ప్రముఖులైన నేతలు leadership. షెడ్యూల్డు కులాల, తెగల రిజర్వేషన్ల రక్షణ మీద చాల రాజకీయ పార్టీల నాయక గణానికి ఈ మధ్య అకస్మాత్తుగా ఎందుకు గాలి మళ్ళిందో అందరికీ తెలుసు. (ఈ 16.5.89)

**నాయకత్వం** వి. *naayakatvam* 1. చూ. నాయక గణం. తన అభిప్రాయాలను డాక్టర్ చెన్నారెడ్డి మొదటనే పార్టీ నాయకత్వానికి చెప్పినట్లు తెలుస్తున్నది. (ఆం ప్ర 26.2.89) 2. (ఒక) జట్టుకి నేతృత్వ బాధ్యతలు వహించటం captaincy బోర్డర్ నాయకత్వంలో 17 మంది సభ్యులున్న ఆస్ట్రేలియా జట్టు ఆదివారంనాడు లండన్‌కు చేరుకుంది. (ఆం ప్ర 3.5.89)

**నాశనంచేయు** క్రి. *naaśanamceeyu* కోలుకోలేని విధంగా దెబ్బతీయు to ruin, destroy భారీ పెట్టుబడి, భారీ యంత్రాలు ప్రజల జీవితాలను నాశనం చేశాయి. (ఆం. భూ. 21.11.87)

**నాసిరకం** వి. *naasirakam* నాణ్యతలేనిది sub-standard దేశంలోని మార్కెట్ల లోగల మందులలో 15 శాతం నాసిరకానివని తేలిందని ... (విశా 10.8.87)

**నిందించు** క్రి. *nindincu* అనుచితమైన పనిచేసినట్లు ఆరోపిస్తూ విమర్శించు to accuse ప్రతిపక్షాలకు ప్రజాస్వామ్యంలో నమ్మకంలేదనీ, వీరి రాజీనామాలు అప్రజాస్వామికమని నిందిస్తూనే ఉన్నారు. (ఈ 25.7.89)

**నిందితుడు** వి. *ninditsuDu* నేరం చేసినట్లుగా ఆరోపించబడిన వ్యక్తి accused అత్యాచారం కేసులో నిందితుల అరెస్టు. (ఉ 29.12.87)

**నింపు** క్రి. *nimpu* మందుగుండు సామగ్రిని ప్రయోగించటానికి వీలుగా ఉంచు to load ఎస్. ఎస్. ఎన్. -7 క్షిపణులు సరఫరా కాకపోయినప్పటికీ చక్రను కొద్దిమార్పులతో ఎస్. ఎస్. ఎన్. -28 క్షిపణులతో నింపి ప్రయోగించగలిగే సామర్థ్యం భారత నావికా దళానికి ఉన్నది. (ఆం. ప్ర 1.3.88)

**నికరనష్టం** వి. *nikaranaSTam* (వ్యాపారంలో) మొత్తం ఆదాయంలో పెట్టుబడి, నిర్వహణ ఖర్చులు తీసివేసినప్పుడు వచ్చే లోటు net loss సుమారు పదిక ల్ల రూపాయలు నికరనష్టం తేలిందని ... ఆ

పారు. (ఆం. ప్ర. 21.4.88)

నికరలాభం వి. *nikaralaabham* సంపాదించిన సొమ్ములో పెట్టుబడి, నిర్వహణ ఖర్చులు తీసివేసిన తరువాత మిగిలే ఆదాయం net profit ... ఇంతవరకు ప్రభుత్వం నిధుల సేకరణ, నికరలాభం, తదితర అంశాలపై ఒక నిర్ణయానికి రాలేకపోయింది. (ఆం. ప్ర. 16.5.89)

నిక్షిప్తంచేయు క్రి. *nikSiptamceeyu* (సమాచారాన్ని) భద్రపరచు to store (information) వారు చెప్పిన సమాధానాల్ని శ్రీ ప్రణబ్ రాయ్ కంప్యూటర్లలో నిక్షిప్తంచేశారు. (ఆం. ప్ర. 20.11.89)

నిక్షేపం వి. *nikSeepam* భూమిలో ఉన్న ఖనిజాలు, తైలాలు, లోహాలు మొదలైన వాటి నిల్వ deposit ( of gold, oil etc.) కృష్ణ, గోదావరి బేసిన్‌లో రెండు కోట్ల 59 లక్షల టన్నుల గ్యాస్ నిక్షేపాలు ఉన్నట్టు ... (ఆం. భూ. 20.6.87)

నిఖార్సయిన విశే. *nikhaarsay-ina* నిజాయితీ, నైతిక విలువలతో ముక్కుసూటిగా వ్యవహరించే sincere, straightforward శ్రీలంక అధ్యక్షుడు రణసింఘే ప్రేమదాస నిఖార్సయిన వ్యక్తి అని బాలసింగం అభివర్ణించారు. (ఆం. భూ. 1.6.89)

నిగ్గదీయు క్రి. *niggadiiyu* నిలదీసి ప్రశ్నించు to question (emphatically) మహారాష్ట్ర ... మధ్యప్రదేశ్ రాష్ట్రాల్లో కేంద్రం సరఫరా చేస్తున్న బియ్యాన్ని కిలో 2.19 పైసలకు విక్రయిస్తున్న సంగతి మీకు తెలియదా? అని శ్రీ సింగ్ ప్రధానిని నిగ్గదీశారు. (ఆం. ప్ర. 6.7.87)

గ్గుతేల్చు క్రి. *nigguteelcu* (నిజానిజాలు) క్షుణంగా పరిశీలించి నిర్ణయించు to find out (truth, essence etc.) అక్రమ కార్యకలాపాల లోతులు తరచి, నిజానిజాల నిగ్గుతేల్చేందుకు కావలసిన యంత్రాంగం, ఇతర హంగులు సి. ఎ. జి. కి. ఉన్నాయి. (ఈ. 18.5.89)

నిఘా వి. *nighaa* ఇతరుల కార్యకలాపాలను ఎప్పటికప్పుడు రహస్యంగా గమనిస్తూ ఉండటం surveillance భారత రాయబార కార్యాలయంపై నేపాల్ గూఢచార సంస్థలు గట్టినిఘా వేశాయి. (ఈ. 2.7.89)

నిఘాబృందం వి. *nighaabRndam* అక్రమ కార్యకలాపాలపై కన్ను వేసి వుంచటానికి ఏర్పాటైన రక్షక దళం vigilance squad చిత్తూరు జిల్లా పీలేరులో ఒకటి, ఎర్రచందనం అక్రమ రవాణా నిరోధానికి కడపలో మరొకటి ప్రత్యేక నిఘాబృందాలు ఉన్నాయని ... (ఆం. భూ. 7.10.87)

నిఘాసంస్థ వి. *nighaasamstha* దేశ రక్షణ, శాంతి భద్రతలకు సంబంధించిన రహస్య సమాచారాన్ని సేకరించి అందించే ప్రభుత్వ సంస్థ intelligence agency చదువుల కోసం అమెరికా వెళ్ళి ఏప్రిల్ లోనే భారత దేశానికి తిరిగివచ్చారని వివిధ నిఘా సంస్థల సమాచారాన్ని బట్టి తెలుస్తోంది. (ఆం. జ్యో. 19.9.87)

నిజనిర్ధారణ బృందం వి. *ni-janirdhaaraNa bRndam* సంఘటనలకు సంబంధించిన వాస్తవ సమాచారాన్ని ప్రత్యక్షంగా సేకరించి సత్య నిరూపణ చేసే ఉద్దేశ్యంతో ఏర్పాటైన (అనధికార) సంఘం fact finding mission నక్సలైట్ల విషయంలో రాష్ట్ర ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలు అభినందనీయమని ఈ సంస్థకు చెందిన నిజనిర్ధారణ బృందం తన నివేదికలో పేర్కొందని తెలుస్తోంది. (ఈ. 18.1.88)

**నిత్య కార్యకలాపాలు** వి. (బ.వ.) *nitya kaaryakalaapaalu* (సంస్థలు) రోజు వారీ కార్యక్రమంలో భాగంగా చేపట్టే పనులు regular activities రాజకీయ పార్టీలు తన నిత్య కార్యకలాపాల నిర్వహణకు, ఎన్నికల కోసం అవసరమైన నిధులను ... (ఆం ప్ర 3 10 87)

**నిదర్శనం** వి. *nidarśanam* ఒక విషయం నిజమని నిరూపించడానికి తోడ్పడే అదే రకం దాఖలా instance ఇలాంటి నిదర్శనాలు కోకొల్లలని శ్రీ శ్రీనివాసు అన్నారు. (ఆం భూ 4 10 87)

**నిద్రకాయు** క్రి. *nidrakaayu* (రాత్రి పూట) మేల్కొని ఉండు to be awake ఈ కాలనీలో చీకటి పడితే చాలు మహిళల్ని, పిల్లల్ని ఒకచోటకు చేర్చి మగవాళ్ళు రాత్రంతా నిద్రకాస్తున్నారు (ఆం భూ 22 4 89)

**నిధి** వి. *nidhi* కార్యక్రమాల నిర్వహణకోసం అందుబాటులో ఉండే ధనం fund కలెక్టర్లు జవహర్ రోజ్‌గార్ యోజన కింద అందుకున్న నిధులను జెడ్. పి. పి., సి. డి. అకౌంట్లలో జమచేసి ... (ఆం. ప్ర 18.5 89)

**నినదించు** క్రి. *ninadincu* తమ కోర్కెలను, అభిప్రాయాలను తెలుపుతూ గొంతెత్తి అరుచు to raise slogans స్పీకర్ ఎంత వారించినా వారు నినదించడం ఆపలేదు (ఈ 13 7 89)

**నిపుణుడు** వి. *nipuNuDu* ఒక రంగంలో ప్రావీణ్యం సంపాదించిన వ్యక్తి expert ఈ బాంబు అత్యంత శక్తిమంతమైనదనీ, దాదాపు యాభై అడుగుల పరిధిమేరకు గల వస్తువులను, వ్యక్తులను నాశనం చేయగలదని ఒక నిపుణుడు తెలిపారు (ఆం. ప్ర. 13.6 89)

**నిపుణుల బృందం** వి *nipuNula bRndam* ఏదైనా ఒక రంగంలో ప్రావీణ్యంగల వ్యక్తుల జట్టు team of experts ... ప్రత్యేకించి ప్రైవేట్ రంగాన్ని పటిష్టపరచాలని జపాన్ మాజీ విదేశాంగ మంత్రి ... నాయకత్వంలోని అయిదుగురు వ్యక్తుల నిపుణుల బృందం తన నివేదికలో స్పష్టం చేసింది. (ఆం. ప్ర. 14.2 89)

**నిబంధన** వి. *nibandhana* ప్రజా జీవనంలో వ్యక్తుల లేదా సంస్థల ప్రవర్తన, పరిస్థితులకు సంబంధించి చట్టరీత్యా విధించిన నియమం rule, regulation పార్కింగ్ సూచించని స్థలంలో ఏ వాహనం నిలుపరాదని, ఈ నిబంధనను ఉల్లంఘిస్తే శిక్ష పడుతుందని ఆయన అన్నారు. (ఆం ప్ర 16 6 87)

**నిబంధనలమేరకు పని** వి. *nibandhanala meeraku pani* కేవలం నియమాల మేరకే పనిచేసి, మిగిలిన పని వదలి వేయటం ద్వారా ఉద్యోగులు తమ నిరసనను తెలియ జేసే విధానం work to rule ప్రభుత్వ డాక్టర్లు గత ఏప్రిల్ నుంచి 'నిబంధనల మేరకు పని' ఆందోళనను నిర్వహిస్తున్నారు. (ఆం. ప్ర. 23.6.87)

**నిబంధనావళి** వి. *nibandhanaavaLi* ఒక సంస్థలోని సభ్యుల ప్రవర్తనని నియంత్రించడానికి ఏర్పరచిన నియమాల పట్టిక code of conduct బి. సి. సి. ఐ మాజీ కార్యదర్శి ... ఓ ఇంగ్లీషు పత్రికతో మాట్లాడుతూ అసలు టూరు కాంట్రాక్టు మీద సంతకం పెడితే బి. సి. సి. ఐ నిబంధనావళికి కట్టుబడినట్లేనని అన్నారు. (ఈ. 22 8.89)

**నిబద్ధ న్యాయ వ్యవస్థ** వి. *nibaddha nyaaya vyavastha* పేదలు, బడుగు వర్గాల ప్రజలకు న్యాయం అందిం

చడం ప్రధాన కర్తవ్యంగా భావించి పని చేసే న్యాయ వ్యవస్థ committed judiciary ఇందిరాగాంధీ హయాంలో "నిబద్ధ న్యాయ వ్యవస్థ"కావాలని ప్రతిపాదించడమూ, ఆమేరకు సుప్రీంకోర్టు, హైకోర్టు జడ్జీలను తారుమారు చేస్తూ కొన్ని చర్యలు తీసుకోవడమూ జరిగింది. (ఆం భూ 17 8 89)

**నిమగ్నంఅగు** క్రి. *nimagnamagu* (ఒక పనిలో) పూర్తిగా మునిగిపోవు to engage or involve oneself deeply ... పార్టీని గెలిపించాలనే పట్టుదలతో గతకొద్దిరోజులుగా ఆయన పార్టీ పనులలో నిమగ్నమై వున్నారని తెలుస్తూంది. (ఉ 18 4 88)

**నిమజ్జనం** వి. *nimajjanam* దేవుడి విగ్రహాలను లేదా మృతి చెందిన వారి అస్థికలను పవిత్రంగా భావించే జలాల్లో కలిపి వేయటం immersion of idols or the ashes of a person in waters considered pious, like rivers, lakes etc. (a ritual in Hindu religion) నాలుగువేల పైచిలుకు విగ్రహాలు హుసేన్ సాగర్‌లో నిమజ్జనం చేశారు. (ఆం భూ 7 9.87)

**నిమజ్జనోత్సవం** వి. *nimajjanoot-savam* విగ్రహాలను ఊరేగించి చివరగా నీళ్ళలో కలిపే వేడుక festival of immersion of idols గణేశ్ ఉత్సవ నిర్వాహకులు నిమజ్జనోత్సవం రోజున ... (ఈ అను 7 9 89)

**నిమిత్తం** వి. *nimittam* అవసరం లేదా సంబంధం కలిగి ఉండటం concern ప్రజాభిప్రాయంతో సైనిక నియంతలకు నిమిత్తం లేదు. (ఆం. జ్యో. 9 10 88)

**నియంత** వి. *niyanta* సర్వాధికారాలను గుప్పిట్లో పెట్టుకొని, ప్రజాభిప్రాయాన్ని లెక్కచేయకుండా అణచివేత చర్యల ద్వారా ఇష్టం వచ్చినట్లు పరిపాలన చేసే వ్యక్తి dictator హరికేష్ బహదూర్ మాట్లాడుతూ వి. పి. సింగ్ 'దళ్'లోని కీలక పదవుల్లో అవినీతి పరులను నియమిస్తున్నారని, నియంతగా వ్యవహరిస్తున్నారని ఆరోపించారు. (ఆం. ప్ర 25 5 89)

**నియంతృత్వ ధోరణి** వి. *niyantRtva dhooraNi* ప్రజాస్వామ్య పద్ధతులను తోసిపుచ్చి ఇష్టారాజ్యంగా పరిపాలించే పద్ధతి dictatorial attitude or tendency శుక్లా నియంతృత్వ ధోరణికి విసుగు చెందినవారు ఈ విశ్వాసరాహిత్య తీర్మానంపై సంతకాలు చేస్తున్నట్టు తెలుస్తున్నది. (ఆం. ప 17 10 87)

**నియంతృత్వ పాలన** వి. *niyantRtva paalana* ప్రజాస్వామ్య విలువలకు తావు లేకుండా అధికారం చెలాయించటం dictatorial rule ఎన్టీఆర్ నియంతృత్వ పాలనకు నిరసనగా ... (ఈ 26 7 89)

**నియంతృత్వ పోకడ** వి. *niyantRtva pookaDa* చూ. నియంతృత్వ ధోరణి: ముఖ్యమంత్రికి ప్రజాస్వామ్యం మీద ఏ మాత్రం విశ్వాసం లేదని నియంతృత్వ పోకడతో పరిపాలన కొనసాగిస్తున్నారని విమర్శించారు. (ఈ 2 5 89)

**నియంతృత్వ వైఖరి** వి. *niyantRtva vaikhari* చూ. నియంతృత్వ ధోరణి. ... 59వ సవరణ రద్దు, పంజాబ్ ఎమర్జెన్సీ పరువునష్టం బిల్లు ప్రభుత్వ నియంతృత్వ వైఖరిని సూచిస్తున్నాయని తెలిపారు. (ఈ 26 4.89)

**నియంత్రణ** వి. *niyantraNa* అదుపు చేయుటం control డ్రగ్స్ ధరల పై కేంద్రం

నియంత్రణను తొలగించే ఆలోచన చేస్తున్నదా? (ఉ. 9.9.87)

**నియంత్రించు** క్రి. *niyantrincu* అదుపులో ఉంచు, కంట్రోలు చేయు to control తన పరిధిలోని పోలీసు అధికారుల ప్రవర్తనను నియంత్రించలేదని డి. సి. పి. అసమర్థుడని వ్యాఖ్యానించారు. (ఈ. 23 11 89)

**నియమ నిబంధనలు** వి. (బ.వ.) *niyama nibhandhanalu* ఒక సంస్థ తన వ్యవహార నిర్వహణకు ఏర్పరచుకున్న క్రమ పద్ధతులు rules and regulations, charter ఏ నిర్ణయం తీసుకోవాలన్నా సార్క్ సభ్యదేశాల సమావేశంలో హాజరు కావలసి ఉంటుందని నియమ నిబంధనల్లో ఉందని తెలిపింది. (ఈ. 29 6.89)

**నియమబద్ధం** వి. *niyam d-dham* ఒక పద్ధతికి కట్టుబడి ఉండటం systematic, according to rules ముఖ్యంగా స్థానిక సంస్థలకు నియమ బద్ధంగా ఎన్నికలు నిర్వహించడానికి పంచాయితీరాజ్ సంస్థలకు పూర్తి అధికారాలు ఉండాలని సూచించారు. (ఈ. 27.5 89)

**నియమావళి** వి. *niyamaavaḷi* సంస్థ కార్యకలాపాలను సక్రమంగా నిర్వహించటానికి రూపొందించుకున్న ప్రవర్తనా సూత్రాలు procedures శాసనసభ నియమావళిని అనుసరించే స్పీకర్ ప్రవర్తించాడని ... ఎటువంటి పక్షపాతానికి తావుఇవ్వలేదని ... (ఉ 13 4 88)

**నియమించు** క్రి. *niyamincu* ఒక పదవిలో ప్రవేశ పెట్టు to appoint డాక్టర్ మర్రి చెన్నారెడ్డిని ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కొత్త అధ్యక్షుడిగా నియమించారు. (ఈ. 3.6.89)

**నియామకం** వి. *niyaamakam* ఒక పదవిలో ప్రవేశ పెట్టటం appointment ... రెండు రోజుల క్రితం మణిపూర్ గవర్నర్‌గా నియమితులు కావడంతో ఈ నియామకం అనివార్యమైంది. (ఈ. 5.7.89)

**నియామక పత్రం** వి. *niyaa-maka patram* ఒక వ్యక్తిని ఒక పదవిలో నియమిస్తున్నట్లు అధికారికంగా జారీచేసిన ఉత్తర్వు appointment order, credentials (as of ambassadors) ... నేడు రాష్ట్రపతి జైలుసింగ్‌కు తన నియామక పత్రాలను సమర్పించారు. (ఈ 5 6 87)

**నియామక సంఘం** వి. *niyaamaka sangham* ఉద్యోగాలు భర్తీ చేయటానికి అధికారికంగా ఏర్పడిన సభ్యుల కమిటీ selection committee ... 'సర్వీస్ కమీషన్, స్టాఫ్ సెలక్షన్ కమిటీ' వంటి ఉద్యోగ నియామక సంఘాల ప్రతినిధుల సమావేశంలో ... (ఆం. ప్ర 30 5 89)

**నియోగించు** క్రి. *niyoogincu* ఒక కార్య నిర్వహణ బాధ్యతను అప్పగించు to employ ... సైన్యం బదులు సరిహద్దు భద్రతా బలాలను, భారత్-టిబెట్ సరిహద్దు పోలీసులను నియోగించాలని కూడా గుర్తించారు. (ఈ 29 12 87)

**నియోజకవర్గం** వి. *niyoojakavargam* చట్టసభలలోని ప్రజాప్రతినిధులు ప్రాతినిధ్యం వహించే ప్రాంతం constituency లోకసభ ఎన్నికలకు నామినేషన్ల ఘట్టం నేడు పూర్తయినప్పటికీ దేశంలో అనేక నియోజకవర్గాలలో ... (ఆం ప్ర 31.10 89)

**నిరంకుశం** వి. *niranku$\acute{s}$am* కఠినమైన వైఖరి అవలంబించటం; నిర్దాక్షిణ్యం cruel ప్రభుత్వాలు ప్రజా ఉద్యమాలను నిరంకుశంగా

చడం ప్రధాన కర్తవ్యంగా భావించి పని చేసే న్యాయ వ్యవస్థ committed judiciary *ఇందిరాగాంధీ లోగడ "నిబద్ధ న్యాయ వ్యవస్థ"కావాలని ప్రతిపాదించడమూ, ఆమేరకు సుప్రీంకోర్టు, హైకోర్టు జడ్జీలను తారుమారు చేస్తూ కొన్ని చర్యలు తీసుకోవ డమూ జరిగింది.* (ఆం భూ 17.8.89)

**నిమగ్నంఅగు** క్రి. *nimagnamagu* (ఒక పనిలో) పూర్తిగా మునిగిపోవు to engage or involve oneself deeply ... *పార్టీని గెలిపించాలనే పట్టు దలతో గతకొద్దిరోజులుగా ఆయన పార్టీ పనులలో నిమగ్నమై వున్నారని తెలుస్తోంది.* (ఉ 18 4 88)

**నిమజ్జనం** వి. *nimajjanam* దేవుడి విగ్రహా లను లేదా మృతి చెందిన వారి అస్థికలను పవిత్రంగా భావించే జలాల్లో కలిపి వేయటం immersion of idols or the ashes of a person in waters considered pious, like rivers, lakes etc. (a ritual in Hindu religion) *నాలుగువేల పైచి లుకు విగ్రహాలు హుసేన్ సాగర్‌లో నిమజ్జనం చేశారు* (ఆం. భూ. 7 9 87)

**నిమజ్జనోత్సవం** వి. *nimajjanoot-savam* విగ్రహాలను ఊరేగించి చివరగా నీళ్ళలో కలిపే వేడుక festival of immersion of idols *గణేశ్ ఉత్సవ నిర్వాహకులు నిమజ్జనోత్సవం రోజున ...* (ఈ అను 7 9 89)

**నిమిత్తం** వి *nimittam* అవసరం లేదా సంబంధం కలిగి ఉండటం concern *ప్రజాభిప్రాయంతో సైనిక నియంతలకు నిమిత్తం లేదు.* (ఆం. జ్యో 9 10 88)

**నియంత** వి. *niyanta* సర్వాధికారాలను గుప్పిట్లో పెట్టుకొని, ప్రజాభిప్రాయాన్ని లెక్కచేయకుండా అణచివేత చర్యల ద్వారా ఇష్టం వచ్చినట్లు పరిపాలన చేసే వ్యక్తి dictator *హరికేష్ బహదూర్ మాట్లా డుతూ వి. పి. సింగ్ 'దళ్'లోని కీలక పదవుల్లో అవినీతి పరులను నియమి స్తున్నారని, నియంతగా వ్యవహరిస్తున్నారని ఆరోపించారు.* (ఆం ప్ర 25.5 89)

**నియంతృత్వ ధోరణి** వి. *niyantRtva dhooraNi* ప్రజాస్వామ్య పద్ధతులను తోసిపుచ్చి ఇష్టారాజ్యంగా పరిపాలించే పద్ధతి dictatorial attitude or tendency *శుక్లా నియంతృత్వ ధోరణికి విసుగు చెందినవారు ఈ విశ్వాసరాహిత్య తీర్మానంపై సంతకాలు చేస్తున్నట్టు తెలు స్తున్నది.* (ఆం ప 17 10 87)

**నియంతృత్వ పాలన** వి. *niyantRtva paalana* ప్రజాస్వామ్య విలువలకు తావు లేకుండా అధికారం చెలాయించటం dictatorial rule *ఎన్టీఆర్ నియంతృత్వ పాలనకు నిరసనగా ...* (ఈ 26 7 89)

**నియంతృత్వ పోకడ** వి. *niyantRtva pookaDa* చూ. నియంతృత్వ ధోరణి: *ముఖ్యమంత్రికి ప్రజాస్వామ్యం మీద ఏ మాత్రం విశ్వాసం లేదని నియంతృత్వ పోక డలతో పరిపాలన కొనసాగిస్తున్నారని విమ ర్శించారు.* (ఈ 2 5 89)

**నియంతృత్వ వైఖరి** వి. *niyantRtva vaikhari* చూ. నియంతృత్వ ధోరణి. *కర్ణాటక అసెం రద్దు, పంజాబ్ ఎమర్జెన్సీ ఓ పరువు న బిల్లు ప్రభుత్వ నియం ... వైఖరిని చూపిస్తున్నాయని తెలిపారు.* (ఈ 26.4.89)

**నియంత్రణ** వి. *niyantraNa* అదుపు చేయుటం control *డ్రగ్స్ ధరల పై కేంద్రం*

నియంత్రణను తొలగించే ఆలోచన చేస్తు న్నదా? (ఈ 9.9.87)

**నియంత్రించు** క్రి. *niyantrincu* అదుపులో ఉంచు, కంట్రోలు చేయు to control తన పరిధిలోని పోలీసు అధికారుల ప్రవర్తనను నియంత్రించలేదని డి. సి. పి. అసమర్థుడని వ్యాఖ్యానించారు. (ఈ 23 11.89)

**నియమ నిబంధనలు** వి. (బ.వ.) *niyama nibhandhanalu* ఒక సంస్థ తన వ్యవహార నిర్వహణకు ఏర్పరచుకున్న క్రమ పద్ధతులు rules and regulations, charter ఏ నిర్ణయం తీసుకోవాలన్నా సార్క్ సభ్యదేశాలన్నీ సమావేశంలో హాజరు కావలసి ఉంటుందని నియమ నిబంధనల్లో ఉందని తెలిపింది. (ఈ 29 6 89)

**నియమబద్ధం** వి. *niyamabad-dham* ఒక పద్ధతికి కట్టుబడి ఉండటం systematic, according to rules ముఖ్యంగా స్థానిక సంస్థలకు నియమ బద్ధంగా ఎన్నికలు నిర్వహించడానికి పంచాయితీరాజ్ సంస్థలకు పూర్తి అధికారాలు ఉండాలని సూచించారు. (ఈ 27 5 89)

**నియమావళి** వి. *niyamaavaLi* సంస్థ కార్యకలాపాలను సక్రమంగా నిర్వహించటానికి రూపొందించుకున్న ప్రవర్తనా సూత్రాలు procedures శాసనసభ నియమావళిని అనుసరించే స్పీకర్ ప్రవర్తించాడని ... ఎటువంటి పక్షపాతానికి తావివ్వలేదని ... (ఉ 13 4 88)

**నియమించు** క్రి. *niyamincu* ఒక పదవిలో ప్రవేశ పెట్టు to appoint డాక్టర్ మర్రి చెన్నారెడ్డిని ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కొత్త అధ్యక్షుడిగా నియమించారు. (ఈ. [illegible].89)

**నియామకం** వి. *niyaamakam* ఒక పదవిలో ప్రవేశ పెట్టటం appointment ... రెండు రోజుల క్రితం మణిపూర్ గవర్నర్‌గా నియమితులు కావడంతో ఈ నియామకం అనివార్యమైంది. (ఈ 5.7 89)

**నియామక పత్రం** వి *niyaa-maka patram* ఒక వ్యక్తిని ఒక పదవిలో నియమిస్తున్నట్లు అధికారికంగా జారీచేసిన ఉత్తర్వు appointment order, credentials (as of ambassadors) ... నేడు రాష్ట్రపతి జైలుసింగ్‌కు తన నియామక పత్రాలను సమర్పించారు. (ఈ 5.6 87)

**నియామక సంఘం** వి. *niyaamaka sangham* ఉద్యోగాలు భర్తీ చేయటానికి అధికారికంగా ఏర్పడిన సభ్యుల కమిటీ selection committee ... 'సర్వీస్ కమీషన్, స్టాఫ్ సెలక్షన్ కమిటీ' వంటి ఉద్యోగ నియామక సంఘాల ప్రతినిధుల సమావేశంలో ... (ఆం ప్ర 30 5 89)

**నియోగించు** క్రి. *niyoogincu* ఒక కార్య నిర్వహణ బాధ్యతను అప్పగించు to employ ... సైన్యం బదులు సరిహద్దు భద్రతా బలాలను, భారత్-టిబెట్ సరిహద్దు పోలీసులను నియోగించాలని కూడా గుర్తించారు. (ఈ. 29.12 87)

**నియోజకవర్గం** వి. *niyoojakavargam* చట్టసభలలోని ప్రజాప్రతినిధులు ప్రాతినిధ్యం వహించే ప్రాంతం constituency లోక్‌సభ ఎన్నికలకు నామినేషన్ల ఘట్టం నేడు పూర్తయినప్పటికీ దేశంలో అనేక నియోజకవర్గాలలో ... (ఆం. ప్ర 31.10 89)

**నిరంకుశం** వి. *nirankuSam* కఠినవైఖరి అవలంబించటం; నిర్దాక్షిణ్యం cruel ప్రభుత్వాలు ప్రజా ఉద్యమాలను నిరంకుశంగా

అణచివేసేందుకు చర్యలు తీసుకుంటున్నట్లు ఆయన తెలిపారు. (ఆం. భూ. 25.5.89)

**నిరంకుశ పోకడ** వి. *nirankuśa pookaDa* కఠినంగా అణిచివేత చర్యలు చేపట్టటం tyrannical tendency దేశంలోని లౌకిక, వామపక్ష ప్రజాతంత్ర శక్తులు ఏకోన్ముఖంగా ఈ నిరంకుశపోకడలను త్రిప్పికొట్టవలసిన తరుణమిదేనని ఆయన పిలుపునిచ్చారు. (ఈ. 26.5 89)

**నిరంతర పోరాటం** వి. *nirantara pooraaTam* మధ్యలో ఆపకుండా నడిపే పోరు continuous struggle ... స్వార్థ శక్తులతోను, రాజకీయ పైరవీలతోను మా నిరంతర పోరాటాన్ని కొనసాగిస్తాం అని ... (ఈ. 11.5.89)

**నిరంతరాయం** వి. *nirantaraayam* (కార్యక్రమం) మధ్యలో ఎటువంటి ఆటంకం లేకపోవటం uninterrupted బీజింగ్ వీధుల్లో వేలాది విద్యార్థుల ప్రదర్శనలు నేటికీ నిరంతరాయంగా కొనసాగుతున్నాయి. (ఈ. 31 5.89)

**నిరవధికం** వి. *niravadhikam* కాలపరిమితి లేకుండా కొనసాగేది indefinite తాము తరగతులను నిరవధికంగా బహిష్కరిస్తామని బీజింగ్ విద్యార్థులు చెప్పారు. (ఆం. ప్ర. 25 4.89)

**నిరశన దీక్ష** వి. *niraśana diikSa* (కోర్కెల సాధనకోసం) ఆహారం తీసుకోకుండా కూర్చోవటం hunger strike చెరువుల్లో, జలాశయాల్లో లీజింగ్ పద్ధతిపై చేపలు పట్టే ప్రస్తుత విధానాన్ని రద్దుచేయాలని ... నిరవధిక నిరశన దీక్ష ప్రారంభించారు. (ఆం. ప్ర. 23 6.87)

**నిరసన** వి. *nirasana* అసమ్మతిని, వ్యతిరేకతను తెలియపరచటం protest మెజిస్ట్రేట్ కుటుంబంపై పోలీసులు జరిపిన దౌర్జన్యానికి నిరసనగా జిల్లా కాంగ్రెస్ కమిటీ బంద్‌కు పిలుపునిచ్చింది. (ఆం. భూ. 2.10.87)

**నిరసన దినం** వి. *nirasana dinam* అసమ్మతిని వ్యక్తం చేయటానికి ఎంపిక చేసిన రోజు black day, a day of protest శ్రీ బొమ్మయ్ ప్రభుత్వాన్ని రద్దు చేసినందుకు నిరసనగా ఈ నెల 27 వ తేదీన దేశ వ్యాప్తంగా నిరసన దినం (బ్లాక్‌డే) పాటించాలని ... (ఆం. ప్ర. 23.4 89)

**నిరసన ప్రదర్శన** వి. *nirasana pradarśana* ప్రజలు తమ అసమ్మతిని, వ్యతిరేకతను సామూహికంగా వీధుల్లోకి వెళ్ళి వ్యక్తం చేయటం demonstration (against sb or sth) దేశంలోని నిరసన ప్రదర్శనలను నిషేధిస్తూ చైనా ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. (ఈ 20 5 89)

**నిరసించు** క్రి *nirasincu* అసమ్మతిని ప్రకటించు to protest తెలుగు దేశం ప్రభుత్వం అవినీతికి పాల్పడుతున్నదని నీలాపనిందలు వేయటం పట్ల తెలుగుదేశం పార్టీ విస్తృత సమావేశం తీవ్రంగా నిరసించింది. (ఈ. 22 8 89)

**నిరాకరించు** క్రి. *niraakarincu* (ఒకపని చేయడానికి) ఒప్పుకొనకపోవు; తిరస్కరించు to refuse, decline నేషనల్ ఫ్రంట్ ముసాయిదా కార్యాచరణ పథకం గురించి వ్యాఖ్యానించేందుకు మాత్రం ఆయన నిరాకరించారు. (ఈ 29 7 89)

**నిరాటంకం** వి. *niraaTankam* చూ.

నిరంతరాయం. ... చైనా విద్యార్థులు ఉధృత నిరసనసోద్యమం నిరాటంకంగా కొన సాగడంతో ... (ఈ 16.5.89)

**నిరాయుధీకరణ** వి. *niraayudhiikaraNa* దేశాలు తమ వద్ద ఉన్న మారణాయుధాల నిల్వలను తగ్గించుకోవటం disarmament ఐక్య రాజ్య సమితి అధికారాలు పెరగాలనీ, నిరాయుధీకరణకు, ప్రపంచ ఉద్రిక్తతలను పరిష్కరించడానికి మరింత కీలక పాత్ర వహించాలని రెండు దేశాలు విజ్ఞప్తి చేశాయి. (ఆం భూ. 19.5.89)

**నిరాహారదీక్ష** వి. *niraahaaradiikSa* చూ. నిరశనదీక్ష: అధికారులు నిర్లక్ష్యంపై ఆమరణ నిరాహార దీక్షాస్త్రం. (ఉ. 15.6.87)

**నిరుద్యోగభృతి** వి. *nirudyoogabhRti* అర్హత ఉండీ ఉద్యోగాలు రానివారికి ప్రభుత్వం సహాయరూపేణా నెలవారీగా అందించే డబ్బు unemployment allowance తమ రాష్ట్రంలోని నిరుద్యోగులకు నెలకు వందరూపాయలు చొప్పున 'నిరుద్యోగభృతి' చెల్లించనున్నట్లు ... ప్రకటించారు. (ఆం ప్ర 12.10.88)

**నిరూపించుకొను** క్రి *niruupincukonu* (శక్తి, సామర్థ్యం మొ వాటిని) రుజువు చేసుకొను to establish, prove తన కున్నబలాన్ని నిరూపించుకునేందుకు తగిన వ్యవధి నివ్వకపోవటం విచారకరమని ... అన్నారు. (ఆం ప్ర 22.4.89)

**నిరోధించు** క్రి. *niroodhincu* ఒక పని లేదా సంఘటనని అడ్డుకొను, ఆపు to stop, prevent ఈ జిల్లాలో జూరాల ప్రాజెక్టును పూర్తి చేసినట్లయితే ప్రజలు ఇతర ప్రాంతాలకు వలస వెళ్ళడాన్ని నిరోధించ వచ్చునని సూచించారు. (ఆం ప్ర. 18.12.87)

**నిర్జనీకరణ** వి. *nirjaniikaraNa* (ఒక ప్రదేశంలో) ప్రజలు నివసించకపోవటం depopulation సదాశివ నగర్ 'నిర్జనీకరణ' వెనక కుట్ర. మెదక్ జిల్లా రామాయంపేట మండలంలోని 24 గ్రామాల్లో ఒక్క సదాశివనగర్ 'డిపాపులేటెడ్' గ్రామం అని మండలాధికారులు ఎందుకు పరిగణిస్తున్నారు. (ఉ. 10.9.87)

**నిర్ణయం** వి. *nirNayam* ఒక విషయం పట్ల నిశ్చితాభిప్రాయం decision రిట్ పిటిషన్లను విచారణకు స్వీకరించాలా లేదా అనే విషయాలపై నిర్ణయాన్ని రాష్ట్ర హైకోర్టు ఫుల్‌బెంచ్ వాయిదా వేసింది. (ఆం. ప్ర. 30.6.89)

**నిర్ణీతకాలం** వి. *nirNiitakaalam* ముందుగా నిశ్చయమయిన సమయ పరిమితి schedule ఎన్నికలు నిర్ణీతకాలంలో జరుగుతాయని ... (ఈ 3.5.89)

**నిర్ణీత బరువు** వి. *nirNiita baruvu* నిబంధనల ప్రకారం ఉండవలసిన బరువు prescribed weight ... డీలర్లకు యిచ్చే బస్తాలో నిర్ణీత బరువు ఉండటం లేదనే ఆరోపణ లో నిజం లేదని ... (ఉ. 6.10.87)

**నిర్ణీతవ్యవధి** వి. *nirNiitavyavadhi* చూ. నిర్ణీతకాలం. లోకసభ ఎన్నికలు నిర్ణీత వ్యవధి కన్నా ముందుగానే అంటే అక్టోబర్‌లో జరిగే పక్షంలో ... (ఈ. 28.6.89)

**నిర్ణీతసమయం** వి. *nirNiitasamayam* చూ. నిర్ణీతకాలం. ఎన్నికలు నిర్ణీతసమయంలోనే జరుగుతాయని ఆయన పేర్కొన్నారు. (ఈ 3.5.89)

**నిర్దేశించు** క్రి. *nirdeeśincu* ఆదేశం జారీ చేయు to direct ... కాలపరిమితి రుణాలకు పదిశాతం వడ్డీలు వసూలు చేయాలని గ్రామీణ బ్యాంకులను రిజర్వుబ్యాంకు నిర్దేశించింది. (ఆం ప్ర 17.12.87)

**నిర్ద్వంద్వం** వి. *nirdvandvam* ఖచ్చితం, స్పష్టం అయిన రీతి categorical ... అసాధారణ అధికారాలను గవర్నర్లకు కట్టబెట్టాలని ఏ స్థాయిలోనూ ఆలోచించలేదని కేంద్రం నేడు నిర్ద్వంద్వంగా ప్రకటించింది. (ఆం ప్ర 16.5.89)

**నిర్ధారణ** వి. *nirdhaaraNa* నిశిత పరిశీలన, అధ్యయనం ఆధారంగా చెప్పిన అభిప్రాయం conclusion ... ఆసియా ఖండ అభివృద్ధికి సమన్వయ కృషితో సహకారం సాధించే మార్గమే ఫలప్రదమైనదని ఢిల్లీ సెమినార్ చేసిన నిర్ధారణ హేతుబద్ధమైనది, వాస్తవమైనది. (విశా 6.10.87)

**నిర్ధారించు** క్రి. *nirdhaarincu* ఒక విషయం లేదా సంఘటన నిజమేనని ఆధారాల సహాయంతో బలపరచు; రూఢిపరచు to confirm ప్రదర్శనల్లో పాల్గొన్న ప్రజలను చెదరగొట్టేందుకు సైన్యాలు విషవాయువు, రసాయనిక పదార్థాలు ఉపయోగించారని సోవియట్ వైద్యనిపుణుల కమీషన్ నిర్ధారించింది. (ఆం భూ 21.4.89)

**నిర్నిబంధం** వి. *nirnibandham* ఎలాంటి ఆంక్షలు లేనిది unrestricted ప్రజాస్వామ్య వ్యవస్థకు ఆయువు పట్టు వంటిదైన పత్రికాస్వేచ్ఛ నిర్నిబంధమైంది కాదని ... ఒక రూలింగ్ ఇచ్చారు. (ఈ. 7.7.87)

**నిర్బంధం** వి. *nirbandham* 1. అరెస్టు చేసి జైల్లో పెట్టటం custody, detention దాదాపు 65 మందిని నిర్బంధంలోకి తీసుకుంటున్నట్లు ... (ఆం. ప్ర. 26.4.89) 2. ఇతరుల ఇష్టానికి వ్యతిరేకంగా తీసుకువచ్చే ఒత్తిడి force కాగా, రష్మీ దత్తత తతంగం నిర్బంధంగా జరిగిందని ... తెలిపారు. (ఆం. ప్ర. 22.8.89)

**నిర్బంధకాండ** వి. *nirbandhakaaNDa* విచ్చలవిడిగా అరెస్టులు చేస్తూ బాధించటం repression ఖమ్మం జిల్లాలో సి. పి. (ఎం. ఎల్.) పార్టీ కార్యకర్తల పైనా, ప్రజాప్రతినిధుల పైనా పోలీసులు నిర్బంధకాండను అమలు చేస్తున్నారని ... (ఈ 4.5.89)

**నిర్బంధ శిబిరం** వి. *nirbandh sibiram* యుద్ధఖైదీల పట్ల అమానుషంగా ప్రవర్తిస్తూ వారిని మూకుమ్మడిగా బంధించి ఉంచే ప్రాంతం concentration camp శాంతిదళాలు జాఫ్నాను నిర్బంధ శిబిరంగా మార్చివేశాయని ఆయన తీవ్రంగా విమర్శించారు. (ఆం ప్ర 9.12.87)

**నిర్బంధించు** క్రి. *nirbandhincu* అరెస్టు చేసి జైల్లో పెట్టు to detain, arrest బోఫోర్స్ మాజీ ఏజెంట్ విన్ చద్దాను అధికారులు నిర్బంధించారు. (ఆం. ప్ర. 15.4.88)

**నిర్బంధితుడు** వి. *nirbandhituDu* బందీ అయిన వ్యక్తి captive నిర్బంధితుల్లో ఒక వ్యక్తిని చంపామని, మిగతావాళ్ళను విడిపించాలని ప్రయత్నిస్తున్నామని ... తెలిపారు. (ఈ. 10.4.88)

**నిర్భీతి** వి. *nir hiiti* భయం లేకపోవటం fearlessness వివిధ పార్టీల ప్రభుత్వాలు స్వేచ్ఛగా, నిర్భీతిగా పనిచేసే వాతావరణం నెలకొనడం అవసరమని ... అన్నారు. (ఈ. 9.5.89)

**నిర్మాణం** వి. *nirmaaNam* (సినిమా) చిత్రీకరణ దశ production (as of a movie) నాగేశ్వరరావు చిత్రం నిర్మాణంలో వుంది. (ఆం. ప్ర. 21.4.89)

*sangham* ఒక కార్యక్రమం నిర్వహణ బాధ్యతలు చూసుకునేందుకు నియమించిన వ్యక్తుల బృందం organising committee *నెహ్రూ శతజయంతి క్రికెట్ పోటీల నిర్వాహక సంఘం కన్వీనర్‌గా వ్యవహరిస్తున్న ...* (ఈ. 29.7.89)

**నిర్వాహకుడు** వి. *nirvaahakuDu* కార్యక్రమం నిర్వహించే వ్యక్తి organiser *అక్కడి నుంచి ఆటగాళ్ళు ఇక్కడికి సకాలంలో చేరలేదనే ఉద్దేశంతో పోటీలను వాయిదా వేశామని నిర్వాహకులు తెలిపారు.* (ఈ. 3.5.89)

**నిర్వీర్యం** వి. *nirviiryam* చైతన్యం, ఉత్సాహం కోల్పోవటం; నిస్తేజం inactive, weak *స్థానిక స్వపరిపాలనా వ్యవస్థ నిర్వీర్యం కావడానికి రాష్ట్ర ప్రభుత్వాలదే ప్రధాన బాధ్యత.* (ఈ 3 5 89)

**నిలకడ** వి. *nilakaDa* (ఒక వ్యక్తి సామర్థ్యం, అభిప్రాయాలు మొ.) చీటికీ మాటికీ మారిపోకుండా స్థిరంగా ఉండటం consistency *బాగా ఆడుతున్న కొత్త తరం ఇప్పుడు ముందుకొస్తోంది. వాళ్ళలో కొందరు నిలకడగానే ఆడుతున్నారు.* (ఈ 2.9 89)

**నిలదీయు** క్రి. *niladiiyu* బలంగాకోరు to demand *చైనా ప్రధాని రాజీనామా చెయ్యాలని నిలదీస్తూ లక్ష మంది ప్రజలు గురువారం బీజింగ్ వీధుల్లో కదం తొక్కారు.* (ఈ 26 5.89)

**నిలబడు** క్రి. *nilabaDu* ఎన్నికల్లో అభ్యర్థిగా పోటీచేయు to contest (an election) *తనకు పార్టీ టికెట్ యివ్వడానికి మీరంతా అనుమతిస్తే నిలబడతానని లేదా పార్టీ నిర్ణయించిన అభ్యర్థికి తాను మద్దతు ...* (ఆం ప్ర 18 5 89)

**నిలబెట్టు** క్రి. *nilabeTTu* 1. (వ్యవస్థ గౌరవ మర్యాదలు) దెబ్బతినకుండా చూచు to uphold *న్యాయస్థానాల గౌరవప్రతిపత్తులను నిలబెట్టవలసిన న్యాయ శాఖ మంత్రి ఇలా విమర్శించటం ...* (ఆం ప్ర 4 12.87) 2. అభ్యర్థిగా పోటీలో ఉంచు to choose sb as a candidate (for a contest) *తమ పార్టీ అభ్యర్థిగా ఉపరాష్ట్రపతి శ్రీ. ఆర్. వెంకట్రామన్‌ను నిలబెట్టాలని కాంగ్రెస్(ఐ) ... నిర్ణయించింది.* (ఆం. ప. 15.6.87)

**నిలబెట్టుకొను** క్రి. *nilabeTTukonu* చేజారిపోకుండా రక్షించుకొను to retain *... నిరుటి ఛాంపియన్ రైల్వేస్ జట్టు, టైటిల్ నిలబెట్టుకొనే కృషిలో భాగంగా బుధవారం మహారాష్ట్రను 12 -0తో చిత్తుగా ఓడించింది.* (ఈ. 27.7.89)

**నిలవేయు** క్రి. *nilaveeyu* ముందుకు కదలకుండా చేయు; అడ్డగించు to stop, prevent sb (from advancing) *మమ్మల్ని నిలవేసి, రాజమండ్రి సెంట్రల్ జైల్లో ఉన్న తమ సహచరులు ఏడుమందిని విడుదల చేస్తేనే మిమ్మల్ని వదలిపెడతామని చెప్పారు.* (ఆం ప్ర 31 12 87)

**నిలుపుదల ఉత్తర్వులు** వి. (బ.వ.) *nilupudala uttarvulu* ఏదైనా కార్యక్రమాన్ని కొంతకాలంపాటు ఆపివేయమని న్యాయస్థానం ఇచ్చే ఆదేశం stay orders *స్పీకర్ తాజాగా జారీ చేసిన వారంట్లను అమలు పర్చరాదంటూ కోర్టు మళ్ళీ ఇప్పుడు నిలుపుదల ఉత్తర్వులను జారీ చేసింది.* (ఆం. ప్ర 27 9.89)

**నిలువ సామర్థ్యం** వి. *niluva saamarthyam* (గిడ్డంగులలో) వస్తువులను భద్రపరచటం కోసం ఉన్న స్థల పరిమాణం

storage capacity ఎఫ్. సి. ఐ. ఇటీవలనే కాజీపేట వద్ద పదివేల టన్నుల నిలువ సామర్థ్యం కలిగిన గిడ్డంగిని నిర్మించటం పూర్తయిందని ... చెప్పారు. (ఆం. ప్ర 28.7 89)

**నిలువునా చీలు** క్రి. *niluvunaa ciilu* (రాజకీయపార్టీ) పరస్పరమైన రెండు భిన్న పక్షాలుగా విడిపోవు to undergo a vertical split (as a political party) ... లేకుంటే బీహార్‌లో కాంగ్రెస్-ఐ నిలువునా చీలడం ఖాయమని నేటి సంఘటనలే చెబుతున్నాయి. (ఈ 30 1.89)

**నివాళి** వి. *nivaaLi* చనిపోయిన ప్రముఖుల పట్ల గౌరవం, అభిమానం ప్రకటిస్తూ మాట్లాడే మాటలు లేదా చేసే పని tribute రాజ్యసభలో డిప్యూటీ ఛైర్మన్ శ్రీమతి ప్రతిభా పాటిల్ మాట్లాడుతూ శ్రీ చరణ్ సింగ్‌కు ఘనంగా నివాళి అర్పించారు. (ఆం భూ 28 7 87)

**నివాస ధృవపత్రం** వి. *nivaasa dhRva-patram* ఒక వ్యక్తి ఒక ప్రదేశంలో నిర్ణీత కాలం నుంచి నివసిస్తున్నట్లు నిర్ధారణ చేస్తూ అధికారులు జారీ చేసే పత్రం residence certificate నివాస ధృవ పత్రం లేకుండానే కొత్తగూడెం పట్టణంలోని హజాయ్ ఇంజనీరింగ్ సంస్థలో ... డిప్లొమా చదివిన ... (ఉ 30 10 87)

**నివృత్తిచేయు** క్రి. *nivRtticeeyu* (అనుమానం, సందేహం మొ.) తొలగించు to clear (a doubt or a suspicion) పార్లమెంట్ ప్రతిష్టకోసమైనా పరిస్థితిని స్పష్టం చేస్తూ, అనుమానాల్ని నివృత్తి చేయాలని బలరాం జక్కర్‌ని ప్రతిపక్ష నాయకులు కోరారు. (ఆం భూ 4 5 89)

**నివేదించు** క్రి. *niveedincu* సమాచారం అందించు to report ... కాల్పులు కూడా జరిగినట్లు ప్రత్యక్ష సాక్షులు అధికారులకు నివేదించారు. (ఆం. ప. 30 7.87)

**నివేదిక** వి. *niveedika* ఒక విషయం లేదా సంఘటనకి సంబంధించిన అన్ని వివరాలను పొందుపరచి తయారుచేసిన సమాచార పత్రం report ఈ ప్రమాద కారణాలపై విచారణ జరుపుతున్న కమీషన్ త్వరలో నివేదిక సమర్పించగలదని ... (ఆం ప్ర. 18 4.88)

**నిశాచర జంతు సదనం** వి. *niśaacara jantu sadanam* రాత్రిళ్ళు మాత్రమే సంచరించే జంతువుల కోసం తయారు చేసిన నిర్మాణం nocturnal animal resort or house దేశంలో మొట్టమొదటి సారిగా నగరంలోని నెహ్రూ జంతుప్రదర్శనశాలలో నిర్మించిన 'నిశాచర జంతు సదనానికి' ముఖ్యమంత్రి ... ప్రారంభోత్సవం చేశారు. (ఆం. జ్యో 4.10 87)

**నిశాచర వన్యమృగ కేంద్రం** వి. *niśaacara vanyamRga keendram* చూ. నిశాచర జంతు సదనం; జూపార్క్‌లో నిశాచర వన్యమృగ కేంద్రం. (ఆం. ప్ర. 4.10 87)

**నిశితం** వి. *niśitam* (విషయ పరిశీలన లేదా పరీక్ష) అన్ని విధాలుగా సమగ్రమైనది thorough అగ్ని ప్రయోగానికి మరోసారి ప్రయత్నించేముందు మొత్తం క్షిపణిని శాస్త్రజ్ఞులు నిశితంగా మళ్ళీ పరీక్షించాల్సి ఉంటుంది. (ఈ 2.5 89)

**నిశ్చితాభిప్రాయం** వి. *niścitaabhi-praayam* దృఢమైన ఆలోచన firm opinion తియాన్మెన్ స్క్వేర్‌ను ఎట్టి పరిస్థితులలోను వదలి వెళ్ళరాదని బీజింగ్ బయటి నుండి వచ్చిన విద్యార్థులు నిశ్చితా

అభిప్రాయం వ్యక్తపరిచారు. (ఈ. 30.5.89)

నిషేధం వి. *niSeedham* కొన్ని రకాల వస్తువుల వినిమయం లేదా కొన్ని కార్య కలాపాలను ఆపుచేస్తూ జారీ చేసే ఆజ్ఞ ban, prohibition 'పాన్ మసాలా' వాణిజ్య ప్రకటనలపై వెంటనే నిషేధం విధిం చాలని ... (ఆం ప్ర 18.4.88)

నిషేధించు క్రి. *niSeedhincu* నిషేధం విధించు to prohibit, debar మాదక ద్రవ్యాలు తీసుకుని *100* మీటర్ల స్ప్రింట్‌లో పాల్గొన్నాడన్న కారణంపై జాన్స న్‌ను రెండేళ్ళ పాటు పోటీల్లో పాల్గొనకుండా నిషేధించిన విషయం తెలిసిందే. (ఆం. ప్ర 22.9.89)

నిష్కర్ష వి. *niSkarSa* ఎలాంటి మొహమాటం, దాపరికం లేకపోవటం frankness ఏటువంటి మొహమాటం లేకుండా నిష్కర్షగా అన్ని విషయాలను చర్చిం చినప్పుడే రెండు దేశాల ప్రభుత్వాలు మొండి వైఖరిని విడనాడ గలుగుతాయి. (ఈ. 25.4.89)

నిష్క్రమించు క్రి. *niSkramincu* (సంస్థ నుండి) వెళ్ళిపోవు to leave (an organisation) కాంగ్రెస్(ఐ) మాజీ (ఎం. పి, సినీనటుడూ అయిన శివాజీ గణే శన్ పార్టీ నుండి నిష్క్రమించనున్నారు. (ఆం. జ్యో 29.1.88)

నిష్పత్తి వి. *niSpatti* ఒకే సమిశ్రమంలోని భిన్న రకాలకు చెందిన పదార్థాలు లేదా వ్యక్తులు ఏఏ పాళ్ళలో ఉన్నదీ సూచించే కొలమానం ratio మట్టి, పశువుల ఎరువు 1, 2 నిష్పత్తిలో కలిపి గుంతల్లో నింపాలి. (ఈ. 28.7.89)

నిష్ఫలంచేయు క్రి. *niSphalamceeyu* (బాంబు) పేలకుండా చేయు to diffuse (a bomb) బాంబును నిష్ఫలం చేసేందుకు నిపుణులను రప్పించారు. (ఆం. భూ. 20.2.88)

నిష్పాక్షికం వి. *niSpaakSikam* పక్షపా తానికి తావులేనిది impartial తీవ్రవా దులు సృష్టించిన భయానక వాతావరణంలో నిష్పాక్షిక విచారణ సాధ్యపడదని, అందువల్ల ఈ కేసును వేరే హైకోర్టుకి బదిలీ చేయమని కోరుతూ భారత అటార్నీ జనరల్ ఈ పిటీషన్ వేశారు. (ఈ. 2.5.89)

నిస్సందేహం వి. *nissandeeham* ఎట్టు వంటి అనుమానం లేకపోవటం, నిస్సం శయం undoubted ఒప్పందాన్ని ఉల్లం ఘించి మన క్రికెటర్లు ఎగ్జిబిషన్ మ్యాచ్‌లు ఆడడం నిస్సందేహంగా తప్పే. (ఈ. 18.8.89)

నిస్సహాయుడు వి. *nissahaayuDu* ఏమీ చేయలేని స్థితిలో ఉన్న వ్యక్తి helpless person ఇద్దరు ముగ్గురు దుండగులు తుపాకి చూపించి రెండుమూడు బస్సు లను నిలిపి లూటీ చేస్తున్నా వాటిల్లోని వందలాది మంది నిస్సహాయులుగా నిలుచుం డిపోవటాన్ని ... (ఈ. 20.4.89)

వి. *nissiggu* (చెడ్డపని చెయ్యటా ... సిగ్గుపడకపోవటం shameless ప్ర ... కించి దూరదర్శన్ వార్తలను స్వాంత ప్రచారానికి నిస్సిగ్గుగా వాడుకొంటున్న ఫలి తంగా ... (ఆం. ప్ర. 22.4.89)

నిస్సైనిక మండలం వి. *nissainika manDalam* సైనిక బలాల ఉనికి లేని (సరిహద్దు) ప్రాంతం demilitarized zone ప్ర ... అశాంతిని పరిష్కరించడానికి ... న్ను ... నిక మండలంగా మార్చాలని ... లామూ ... సూచించారు. (ఆం. ప్ర ... 7)

నిస్సైనికీకరణ వి. *nissain- ikaraNa* (సరిహద్దు ప్రాంత ... )

సైనికబలాలు లేకుండా చేయటం demilitarization చైనా-సోవియట్ సరిహద్దులో నిస్సైనికీకరణకు సంబంధించిన చారిత్రాత్మక ఒప్పందంపై ... (ఈ. 19.5.89)

**నీటి తీరువా** వి. *niiTi tiiruvaa* పంటలకు సరఫరా చేసే నీటి మీద విధించే పన్ను water tax ఈ చెరువు కింద పండే భూములకు నీటి తీరువా విధించటం, వసూలు చేయటం మండల ప్రజా పరిషత్తుల ఆధీనంలో ఉంటాయని ఆయన తెలిపారు. (ఈ 5 6.87)

**నీటి మట్టం** వి. *niiTi maTTam* నదులు, జలాశయాల్లోని నీటి పరిమాణం water level బుధవారంనాడు గోదావరి నీటి మట్టం పెరుగుతూనే ఉంది. (ఆం ప్ర 24.8 89)

**నీరుకార్చు** క్రి. *niirukaarcu* (ఏదైనా పథకం, ఆలోచన మొ. వాటికి) అవరోధాలు కల్పించి నిర్వీర్యం చేయు to make ineffective (a programme, plan etc.) తెలుగుదేశం ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా భావిస్తున్న సబ్సిడీ బియ్యం పథకాన్ని నీరుకార్చటానికి కేంద్రప్రభుత్వం కుట్ర చేస్తోందని ... అన్నారు. (ఈ 30 1.89)

**నీలాపనింద** వి. *niilaapaninda* కేవలం బురదచల్లే ఉద్దేశంతో చేసే ఆధారం లేని ఆరోపణ false allegation ... కాంగ్రెస్ పార్టీ ప్రతిష్ఠాలక్కు చెందిన ప్రముఖ నాయకులపై నిరాధారమైన నీలాపనిందలు మోపి ... (ఈ 21.8 89)

**నీలిచిత్రం** వి. *niilicitram* అసభ్యకరమైన సెక్స్ దృశ్యాలతో నిండి ఉన్న బూతు సినిమా blue film సంగారెడ్డిల్లో నీలి చిత్రాలను కొత్త తరహాలో ప్రదర్శిస్తున్నారు. (ఆం. భూ. 29.1 88)

**నీలినీడలు** వి. (బ.వ.) *niiliniiDalu* (తప్పుడు విధానాలు లేదా యుద్ధం వంటి సంఘటనల ఫలితంగా) సమాజంపై కలిగే చెడు పరిణామం bad effect కోటి మంది పసివారిపై జాత్యహంకారపు నీలినీడలు అధికమని ఆ నివేదిక పేర్కొంది (ఈ. 5 3 88)

**నీలివార్త** వి. *niilivaarta* సాక్ష్యాధారాలు లేని కబురు లేదా సమాచారం rumour ... పాస్ పోర్టు పొందటానికి ప్రభుత్వ ఫీజు *2000* రూ. లు పెంచుతున్నారు, ఇది జనవరి నెల నుంచి అమలులోకి వస్తుందన్న నీలివార్త వ్యాపించటంతో వాటిని పొందే వారి సంఖ్య అకస్మాత్తుగా పెరిగింది. (ఆం ప్ర. 15 6 89)

**నూకలుచెల్లు** క్రి. *nuukalucellu* కాలం ముగిసిపోవు to come to an end భారత ప్రభుత్వంతో మాట మాత్రం చెప్పకుండా తమిళ టైగర్లను ముఖాముఖి చర్చలకు పిలిచినప్పుడే శ్రీలంకలో ఇండియా పైనవేసుకొన్న పెద్దరికానికి నూకలుచెల్లాయని తేటతెల్లమైంది (ఈ 5.6.89)

**144వ సెక్షన్** వి. *nuuTa nalab-hainaalugava sekSan* (ఘర్షణలు నివారించటానికి) ఇద్దరు లేక అంతకంటె ఎక్కువ మంది గుమిగూడరాదన్న అధికారులు విధించే నిషేధాజ్ఞ 144 section పట్టణంలో ఎటు చూసినా భయాందోళనలు నెలకొన్నాయి. ... *144వ* సెక్షన్ విధించారు. (ఆం ప్ర 7 10 88)

**నూతనాధ్యాయం** వి. *nuutanaad-hyaayam* గుణాత్మకమైన మార్పులతో కూడిన క్రొత్త దశ new chapter ... తు కూలీ పోరాటాల్లో నూతనాధ్యాయం. (ఈ 19 10 87)

**నెక్లెసింగ్** వి. *neklesing* (రాజకీయ విరోధులను) మెడ చుట్టూ పెట్రోల్ నింపిన టైరు బిగించి నిప్పంటించి చంపే పద్ధతి (ఆఫ్రికన్ దేశాలలో ఈ పద్ధతి బాగా వ్యాప్తిలో ఉంది) necklacing దక్షిణాఫ్రికా ప్రభుత్వంతో కుమ్మక్కయ్యే నల్ల జాతి యువకులను దారుణంగా చంపే "నెక్లెసింగ్" అనే ప్రక్రియను ప్రోత్సహించే దక్షిణాఫ్రికా దేశాలకు సహాయం చేయకూడదని అమెరికా నిర్ణయించింది. (ఉ. 28.6 87)

**నెగెటివ్ వోటింగ్** వి. *negeTıv vooTing* అధికార పార్టీ విధానాలు నచ్చక దాని మీద వ్యతిరేకతతో వేరే పార్టీకి ఓటు చేయటం negative voting ఆంధ్ర ప్రదేశ్‌లో కాంగ్రెస్ పార్టీ విజయం సాధించింది నెగెటివ్ వోటింగ్ జరిగినందువల్లనే అని ... అన్నారు. (ఈ 30.11 89)

**నెట్టుకొచ్చు** క్రి. *neTTukoccu* ప్రతికూల మైన పరిస్థితుల్లో చాకచక్యంగా ముందుకు సాగు to manage (inspite of the deficiencies) పాకిస్తాన్ బ్యాటింగ్ బలంగా లేకపోయినా ఎలాగో ఒకలాగ నెట్టుకొస్తున్నారు. (ఆం జ్యో 19 10 87)

**నెపం** వి. *nepam* ఒక పని వెనుక ఉన్న అసలు ఉద్దేశాన్ని కప్పి పుచ్చటానికి చెప్పే వేరే కారణం; సాకు, మిష pretext ప్రతిరోజూ ఏదో నెపంతో కార్మిక నాయకులను అరెస్టు చేస్తున్నారని ఆయన అన్నారు. (ఆం జ్యో. 5.6.87)

**నెలకొను** క్రి. *nelakonu* (సంబంధాలు) ఏర్పడు to be established (as relations) ముప్పై ఏళ్ళ సుదీర్ఘ విరామం తర్వాత చైనా సోవియట్‌ల మధ్య మళ్ళీ సాధారణ సంబంధాలు నెలకొనబోతున్నాయి. (ఈ. 15 5 89)

**నెలకొల్పు** క్రి. *nelakolpu* (ఏదైనా సంస్థ నిర్మాణం మొ.) ; ఏర్పాటు చేయు, స్థాపించు to establish, set up రెండో అణు విద్యుత్ కేంద్రాన్ని శ్రీకాకుళం సమీపాన నెలకొల్పాలన్న ప్రతిపాదన ... (ఈ. 28.6 89)

**నేచరోపతి** వి. *neecaroopati* ఔషధాలు ఇవ్వటం ద్వారాకాక స్నానాలు, ఉపవాసాలు, ఆహార నియమాలు వంటి పద్ధతుల ద్వారా వ్యాధుల్ని నయం చేసే వైద్య విధానం; ప్రకృతి చికిత్స naturopathy నేచరోపతి పరీక్షలు: ఉస్మానియా విశ్వవిద్యాలయం నిర్వహించనున్న డిప్లొమో ఇన్ నేచరోపతి రెండవ, నాల్గవ సం. వార్షిక పరీక్షలు ... తేదీ నుంచి ప్రారంభమవుతాయి. (ఆం జ్యో 29 7 87)

**నేతృత్వం** వి. *neetRtvam* అనుచరవర్గానికి మార్గ నిర్దేశం చేస్తూ ముందుకు నడిపించే బాధ్యత; నాయకత్వం leadership రష్యన్ విప్లవానికి లెనిన్‌తో పాటు నేతృత్వం వహించి ... స్థాపించి వారి పరిరక్షణలో ... (ఆం. భూ 26.4.89)

**నేపథ్యం** వి. *neepathyam* ఒక సంఘటన లేదా పరిస్థితికి కారణమైన దాన్ని ప్రభావితం చేసే పూర్వ సంఘటన(లు) back ground ... ఈ నేపథ్యంలో భద్రతా ఏర్పాట్ల విషయమై అత్యున్నత స్థాయి అధికారులతో ముఖ్యమంత్రి ... (ఆం ప్ర 26 4 89)

**నేరస్థజాతి** వి. *neerasthajaatı* ప్రభుత్వం దృష్టిలో దోపిడీలు, దొంగతనాలు చేసే

వారుగా ముద్రపడిన తెగ criminal tribe బ్రిటిష్ పాలకులు ఒకప్పుడు పిండారీల గురించి థగ్గుల గురించి కొన్ని నేరస్థ జాతుల గురించి రక్షణకోసం గ్రామాలలో రక్షణదళాలను ఏర్పాట్లు చేశారు. (ఆం. ప్ర 21 4.89)

**నేలకు ఒరుగు** క్రి. *neelaku orugu* (ఘర్షణలు, కల్లోల పరిస్థితులు వంటి వాటి కారణంగా) ప్రాణాలు కోల్పోవు to get killed ... ఏదో ఒక మూల రాత్రి పగలు అన్న తేడా లేకుండా జనం నేలకు ఒరుగుతూనే ఉన్నారు. (ఆం భూ. 22 7.89)

**నేలమట్టంచేయు** క్రి. *neelamaT-Tamceeyu* పూర్తిగా పడగొట్టివేయు to bring down, demolish ... దాదాపు 139 వంతెనలను నేలమట్టం చేశారు. (ఈ 25 4 89)

**నేషనల్ ఫ్రంట్** వి. *neeSanal franT* (కాంగ్రెస్‌పార్టీకి ప్రత్యామ్నాయంగా) జనతాదళ్ ప్రధాన భాగస్వామిగా ఏర్పడిన మధ్యేవాద రాజకీయ పార్టీల కూటమి; జాతీయ ఫ్రంట్ National Front నేషనల్ ఫ్రంట్ ఆవిర్భావం సందర్భంగా తమిళనాడు ప్రజలు స్పందించిన తీరు తనను పులకింప జేసిందని ఆయన అన్నారు. (ఆం ప్ర 20.9 88)

**నైతికం** వి. *naitikam* నీతి నియమాలకు సంబంధించినది moral ముఖ్యమంత్రి సినిమాల్లో నటించటాన్ని నైతికంగా సమర్థించలేనని ... పేర్కొనటం గుర్తుండే ఉంటుంది. (ఈ. 18 8 89)

**నైతిక పోరాటం** వి *naitika pooraaTam* నైతిక విలువలు కాపాడటం కోసం సాగించే ఆందోళన struggle for moral values హర్యానా రాష్ట్ర గౌరవ ప్రతిష్ఠలను పునరుద్ధరించేందుకు రాష్ట్ర ప్రయోజనాలను రక్షించేందుకు నైతిక పోరాటం ప్రారంభిస్తామని ... వాగ్దానం చేసింది. (ఆం భూ. 6.6.87)

**నైతిక బలం** వి *naitika balam* చూ. ఆత్మ స్థైర్యం. నైతికబలం దిగజారిన జట్టు తరచుగా ఓటమికి గురికావడం సహజమే. (ఈ 17.8 89)

**నైతిక బాధ్యత** వి. *naitika baad-hyata* (చట్ట పరమైన అంశాలతో నిమిత్తం లేకుండా) నీతికి, ధర్మానికి కట్టుబడి చెయ్యాల్సిన పని moral responsibility రాష్ట్రంలో వరదలకు గురైన ప్రాంతాలను సందర్శించటం ప్రధాన మంత్రి నైతిక బాధ్యత. (ఆం. ప్ర 28 7.89)

**నైతిక విలువలు** వి. (బ.వ.) *naitika viluvalu* నీతికి, ధర్మానికి కట్టుబడి ప్రవర్తించటం moral values ... రాజకీయాల్లో నైతికవిలువలు పడిపోయాయని భావించి శాసన సభ్యత్వానికి ... రాజీనామా చేసినట్టు ఆయన తెలిపారు. (ఈ 5 6.89)

**నైతిక హక్కు** వి. *naitika hakku* నీతినియమాలకు కట్టుబడి ప్రవర్తించటం ద్వారా వచ్చే అధికారం moral right తెలుగుదేశం పార్టీలో ఉన్నంతకాలం తమ నాయకుడు చేసిన అన్ని పనులను సమర్థించిన వారికి ప్రస్తుతం ఆ పార్టీని విమర్శించే నైతిక హక్కు లేదని ... పేర్కొన్నారు. (ఆం. ప్ర. 11.5.89)

**నైవేద్యం** వి. *naiveedyam* సొంత పనుల

కోసం చెల్లించే ముడుపు bribe హైకోర్టు తీర్పు అమలు జరగాలన్న ఉమరాన్ పోలీసులకు నైవేద్యం సమర్పించుకోవలసి వచ్చింది. (ఆం. భూ. 2.7.87)

నొక్కిచెప్పు క్రి. *nokkıceppu* (ఒక విషయానికి) ప్రాముఖ్యం ఇచ్చి మాట్లాడు to stress, emphasize పార్టీలో యువకులకు అధిక ప్రాధాన్యత యివ్వాల్సిన విషయాన్ని శ్రీ రామారావు తన ప్రసంగంలో పలుసార్లు నొక్కిచెప్పారు. (ఆం భూ 29.5 89)

నొక్కివక్కాణించు క్రి. *nokkıvakkaaN-incu* చూ. నొక్కిచెప్పు. ప్రతిపక్షాల నాయకులతో, గతనెలలో ఢిల్లీలో జరిగిన సమావేశంలో ప్రతిపక్షాల సమాఖ్య అవసరం గురించి శ్రీ ఎన్టీ రామారావు నొక్కివక్కాణించారు. (ఉ. 9.6.87)

నో కామెంట్ వి. *noo kaamenT* వ్యాఖ్యానించటానికి నిరాకరించటం no comment మళ్ళీ మీరు భారత్ జట్టు కెప్టెన్ కావాలనుకుంటున్నారా అని అడిగినపుడు ఇప్పట్లో ఆ విషయంపై నో కామెంట్ అని కపిల్ ఆ ప్రశ్నను దాటవేశారు. (ఆం జ్యో. 4.12 87)

నోచుకొను క్రి. *nooculkonu* అవకాశం పొందు to get (an opportunity) గ్రామీణ బ్యాంకులలో పనిచేస్తున్న ఉద్యోగులు సర్వత్సరాలతరబడి సర్వీసులున్నా క్లార్కులాంటి ప్రమోషన్లకు నోచుకోలేదని వారు తెలిపారు. (ఆం భూ 15 9 89)

నోటిఫికేషన్ వి. *nooTifikeeSan* ఒక విషయాన్ని తెలుపుతూ విడుదలచేసే అధికారికమైన ప్రకటన notification గడువు పూర్తికన్నా ఆరు నెలలు ముందుగనే ఎన్నికలు నిర్వహించడానికి ఎన్నికల నోటిఫికేషన్ జారీ చేయవచ్చు. (ఆం. ప్ర. 18.10 89)

నోటిఫైడ్ ఏరియా వి. *nooTi-faiD eeriyaa* ఒక నిర్దిష్ట ప్రయోజనం కోసం ప్రభుత్వం ఎంపిక చేసి ప్రకటించిన ప్రాంతం notified area పట్టణ ప్రాంతాల్లో ముఖ్యంగా మున్సిపాలిటీలు, నోటిఫైడ్ ఏరియాల్లో స్థానిక స్వపరిపాలనా సంస్థల పటిష్ఠతకు చొరవ తీసుకుంటామని రాజీవ్ గాంధీ వెల్లడించారు. (ఈ 11 5 89)

నోటిమాట వి. *nooTımaaTa* కాగితం మీద పెట్టకుండా కేవలం నోటితో చెప్పింది oral ఈ తీర్పుపై సుప్రీంకోర్టుకు రిట్ పిటిషన్ దాఖలు చేసుకొనే అనుమతి ఇవ్వాలని కోవారెంటో రిట్ పిటిషన్ తరఫున వాదించిన న్యాయవాది శ్రీ ఎన్. రామచంద్రరావు నోటిమాటగా చేసుకున్న విజ్ఞప్తిని ధర్మాసనం తోసిపుచ్చింది (ఆం ప్ర 1.9 89)

నోటిమాట వోటు వి. *nooTımaaTa vooTu* చట్ట సభలలో ఏదైనా తీర్మానంపై ఓటింగు పెట్టకుండా సభ్యులు మూకుమ్మడిగా తెలిపే నిర్ణయం voice vote షెడ్యూల్డుకులాలు, తెగల వారిపై అత్యాచారాలు జరిపే వారిని కఠినంగా శిక్షించేందుకు ఉద్దేశించిన బిల్లును లోకసభ బుధవారం నోటిమాట వోటుతో ఆమోదించింది. (ఆం భూ. 17.8 89)

నోటీసు వి. *nooTis* (వివాదం) ఏర్పడినపుడు నిర్ణీత గడువు లోపల తగిన విధంగా ప్రతిస్పందించని పక్షంలో చర్య తీసుకోవలసి వస్తుందని హెచ్చరిస్తూ ఎదుటి పక్షానికి పంపే చట్టపరమైన తాఖీదు notice

శనివారం అర్ధరాత్రి నుంచి నిరవధిక సమ్మె చేయదలచినట్లు ఎంప్లాయీస్ యూనియన్, యాజమాన్యానికి నోటీస్ ఇచ్చిన విషయం ... (ఈ 20.6 87)

**నోళ్ళుకొట్టు** క్రి. *nooLLukoTTu* న్యాయంగా రావలసిన వాటారాకుండా అన్యాయం చేయు; దోచుకొను to plunder, loot ఈ నిబంధనను అడ్డు పెట్టుకొని సంఘాల్లో ఆధిపత్యం వహించే వారు రైతుల నోళ్ళు కొడుతున్నారు (ఈ 22.4 89)

**నోళ్ళునొక్కు** క్రి. *nooLLunokku* భావ ప్రకటనని అణచివేయు to suppress the voice అవినీతిని, అన్యాయాన్ని, దోపిడీని కప్పిపుచ్చే యత్నంలో భాగంగా ప్రభుత్వాలు తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తున్న పాత్రికేయుల నోళ్ళునొక్కేందుకు పూనుకుంటున్నాయని వారన్నారు. (ఈ 30 11.89)

**న్యాయంచేకూర్చు** క్రి. *nyaayamceekuurcu* (బాధ్యత) సక్రమంగా, సంతృప్తికరంగా నిర్వర్తించు to do justice to sth పార్టీ నా పట్ల ఉంచిన విశ్వాసానికి న్యాయం చేకూరుస్తాను. (ఉ 15 6 87)

**న్యాయనిపుణుడు** వి. *nyaayanipuNuDu* చట్టాలను అన్వయించటంలో వృత్తిరీత్యా నైపుణ్యం సంపాదించిన వ్యక్తి legal expert ... బోర్డు తుది నిర్ణయం తీసుకోవడానికి ముందు న్యాయనిపుణుల అభిప్రాయాలను తెలుసుకోవటం అవసరమని భావిస్తోంది. (ఈ 24 8 89)

**న్యాయ పదకోశం** వి. *nyaaya padakoośam* న్యాయ శాస్త్రానికి సంబంధించిన పదాలను ఒకచోట చేర్చి అర్థాలు సమకూర్చి ఉన్న పట్టిక glossory of legal terminology వచ్చే నెల రెండో వారంకల్లా న్యాయ పదకోశాన్ని సిద్ధంచేసి అందజేయగలమని అధికార భాషా సంఘం తెలిపింది. (ఈ. 6 7.89)

**న్యాయ విచారణ** వి. *nyaaya vicaaraNa* ప్రభుత్వ నియామకం మేరకు న్యాయాధికారి ఒక సంఘటన పూర్వాపరాలు పరిశీలించి నిజనిర్ధారణ చేయటం judicial enquiry పోలీసు కాల్పులపై న్యాయ విచారణకు అంగీకరించిన ప్రభుత్వం .. (ఉ 15 6 87)

**న్యాయ సమీక్షాధికారం** వి. *nyaaya samiikSaadhikaaram* చట్ట పరమైన అంశాలను నిశితంగా పరిశీలించి నిర్ణయించే అధికారం power of judicial scrutiny న్యాయసమీక్షాధికారం ద్వారా సుప్రీంకోర్టు రాజ్యాంగాన్ని రక్షిస్తుంది. (ఆం జ్యో. 26.1 88)

**న్యాయ సమ్మతం** వి. *nyaaya sammatam* అక్రమానికి తావు లేకపోవటం fair ఎన్నికలు స్వేచ్ఛగా, న్యాయ సమ్మతంగా జరక్కుండా నిరోధించాలన్న తలంపు దృష్ట్యా ... (ఆం ప్ర 24 5 89)

**న్యాయ సహాయం** వి. *nyaaya sahaayam* బలహీన వర్గాలకు న్యాయ సంబంధమైన వ్యవహారాలలో ఉచితంగా సలహా సహకారాలను అందించటం legal aid పేదలకు మెరుగైన న్యాయ సహాయాన్నందించటానికి ఉద్దేశించిన ఒక బిల్లును ప్రభుత్వం వచ్చే పార్లమెంట్ సమావేశాలలో ప్రవేశ పెట్టనున్నది. (విశా 28.6.87)

**న్యాయాధికారాలు** వి. (బ.వ.) *nyaa-*

*yaadhikaaraalu* నిందితుల్ని విచారించి శిక్షించే అధికారం judicial powers రెవెన్యూ అధికారుల చేతిలో ఉన్న న్యాయాధికారాలు అన్నీ తమకే కావాలని పోలీసు అధికారులు రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరినట్లు తెలిసింది. (ఆం ప్ర 8 10 88)

న్యూస్‌ప్రింట్ వి. *nyuusprinT* పత్రికలు అచ్చువేయటానికి ఉపయోగించే కాగితం newsprint న్యూస్ ప్రింట్ కొరత ఇదే విధంగా కొనసాగితే పరిశ్రమ మనుగడకే ముప్పు కలుగుతుందని ... (ఈ 26 8 9)

ప

పంచనామా వి. *pancanaamaa* ఒక వ్యక్తి అనుమానాస్పద పరిస్థితుల్లో మరణించినప్పుడు, పెద్దల ముందు శవం వివరాలు సేకరించి అధికారులు శవ దహనానికి అనుమతి ఇవ్వటం, శవ పంచాయితీ a formality of identification and collection of facts about the dead body before its disposal, in case of death under suspicious circumstances enquiry done by officials శవాన్ని పంచనామా గాని పోస్టుమార్టంగాని చేయనిచ్చేదిలేదని ... (ఉ. 15 6.87)

పంచశీల వి *pancaśiila* దేశాల మధ్య శాంతియుత సహజీవనం సాగేందుకు అనుసరించే అయిదు సూత్రాలు (అప్పటి భారత ప్రధాని శ్రీ జవహర్ లాల్ నెహ్రూ, చైనా ప్రధాని చౌఎన్‌లైల మధ్య కుదిరిన అవగాహన) pancasiila (five principles of peaceful coexistance between neighbouring countries which were formulated by the late prime ministers of India and China, Mr Jawaharlal Nehru and Chou-en-lei) మరో దేశ వ్యవహారాల్లో జోక్యం చేసుకోవటమంటే పంచశీల సూత్రాలను ఉల్లఘించడమేనని శ్రీలంక అధ్యక్షుడు అన్నారు. (ఆం ప్ర 24 7 89)

పంచాయితీ వి. *pancaayitii* గ్రామ పాలన కోసం ఏర్పరచిన స్థానిక పరిపాలనా సంస్థ local body to administer a village or a cluster of villages బి.జె.పి. నాయకులు, కార్యకర్తలు ఆరువేల గ్రామ పంచాయితీలలో పర్యటించి ... (ఆం. ప్ర 25 4 88)

పంతం వి. *pantam* అనుకున్నది జరిగి తీరాలన్న మొండి పట్టుదల obstinate stand ఎవరేమి ఘోషించినా రాజ్యాంగ సవరణ తెచ్చితీరాలన్న ప్రధాని రాజీవ్ గాంధీ పంతం సడలదన్నది ఢిల్లీ సదస్సులో వెల్లడైంది. (ఈ 8.5 89)

పంథా వి. *panthaa* రాజకీయ, సామాజిక మొ. రంగాలకు సంబంధించి ప్రభుత్వం లేదా పార్టీలకున్న ఒక నిర్దిష్టమైన విధానం; ధోరణి political or social line తెల్లదొరల పంథాలో తెలుగు నేతలు. (ఆం భూ. 4.10 87)

పంపిణీ వి. *pampiNii* వాడకందార్లకు వస్తువులు అందించడం a system of public

distribution of commodities విద్యుత్ పంపిణీలో ఎదురవుతున్న సమస్యల పరిష్కారానికి ... అన్నారు. (ఆం జ్యో. 19 11 88)

¦పంపిణీచేయు క్రి. *pampiNiiceeyu* వాడకందార్లకు నిత్యావసర వస్తువులను, గుర్తింపు కార్డులను, అప్పులను అధికార యంత్రాంగం ద్వారా పంపకం చేయు to distribute through official machinary *బియ్యం చౌకగా పంపిణీచేయటం ద్వారా ...* (ఆం ప్ర. 12.4 88)

¦పంపిణీదారుడు వి. *pampiNiidaaruDu* చలన చిత్రరంగంలో సినిమాలను ప్రాంతాలవారీగా ప్రదర్శించేందుకు నిర్మాతల నుంచి కొనుగోలు చేసిన హక్కుదారుడు (film) distributor ... *సినిమాను ఎంతరేటైనా పెట్టికొంటామని అనేక మంది పంపిణీదార్లు ముందుకు వస్తున్నారని ఆయన చెప్పారు.* (ఆం భూ. 27 4 89)

¦పకడ్బందీ వి. *pakaDbandii* ఎటువంటి లోటుపాట్లకు అవకాశం లేకుండా కట్టుదిట్టంగా ఉన్నది firm, effective *నక్సల్స్ ముప్పును తిప్పికొట్టడానికి రాష్ట్ర ప్రభుత్వం పకడ్బందీగా వ్యూహాన్ని రూపొందించి గట్టి చర్యలు తీసుకోవాలని ఆయన సూచించారు.* (ఈ. 22.6 89)

పక్కా ఇల్లు వి. *pakkaa illu* చుట్టూ గోడలు, పైన గట్టి కప్పుతో దీర్ఘకాలం పాటు నిలిచి ఉండే ఇల్లు permanent house ... *గుడిసెలున్న చోట పక్కా ఇళ్ళు నిర్మించేందుకు ఇప్పుడున్న నియమ నిబంధనలను కూడా సవరించాలని నిర్ణయించినట్లు మంత్రి చెప్పారు.* (ఈ 6.12 88)

పక్షం వి. *pakSam* కొన్ని నిర్దిష్ట సూత్రాలు, ప్రణాళికతో పనిచేసే రాజకీయ సంస్థ political party *బి. హెచ్. ఇ. ఎల్. లో ఈ నెల 13వ తేదీన జరిగిన పోలీసు కాల్పులకు నిరసనగా వివిధరాజకీయ పక్షాలు, కార్మిక సంఘాల సారథ్యంలో ... సోమవారం బంద్ జరిగింది.* (ఉ 16.6 87)

పక్షపాత రహితం వి. *pakSapaata rahitam* ఏ ఒక్కరి పట్ల అవసరమైన దానికన్నా ఎక్కువ ప్రీతి లేకపోవడం; నిష్పక్షపాతం impartiality *పక్షపాత రహితంగా ఇళ్ళ పట్టాలు ఇస్తున్నట్లు ఆయన తెలిపారు.* (ఉ 6.10.87)

పక్షపాత వైఖరి వి. *pakSapaata vaikhari* కొందరిపట్ల అధిక ప్రీతి ప్రదర్శించే దృక్పథం partisan attitude *ముస్లింలీగ్ ఏర్పాటు చేసిన కమిటీ తన నివేదికలో ముస్లింలు, ఇతర మైనారిటీల పట్ల చూపుతున్న పక్షపాత వైఖరికి సంబంధించి ...* (ఆం జ్యో. 7.11.88)

పక్షిఘాతం వి. *pakSighaatam* ఎగురుతున్న విమానానికి ఏదైనా పక్షి ఢీకొనడం వల్ల తగిలే దెబ్బ bird-hit *భారతీయ విమానాలు కూలిపోవడానికి ప్రధాన కారణమైన పక్షిఘాతాలను ...* (ఈ. 18 4 88)

పక్షిశాస్త్రం వి. *pakSiśaastram* పక్షుల జీవన సరళి, వలస పోవటాలు వగైరా అలవాట్ల గురించి అధ్యయనం చేసే విషయం ornithology పక్షిశాస్త్రానికి చేసిన సేవ

లకు గుర్తింపుగా ... భారత ప్రభుత్వం ఆయన్ను సత్కరించింది. (ఈ. 21 6 87)

**పచ్చజెండా** వి. *paccajenDaa* ఒక పని జరిగేందుకు తెలిపే ఆమోదం; అనుమతి green signal, permission to do something చంద్ర శేఖర రెడ్డి ప్రవేశానికి పచ్చజెండా. (ఈ. 9 10.87)

**పటాటోపం** వి. *paTaaToopam* అనవసరమైన ఆర్భాటం; ఆడంబరం show(excessive) అధికోత్సాహంగల అధికారుల ప్రచార పటాటోపం వల్ల తీవ్రవాదుల పట్ల ప్రజల్లో మరో విధమైన అభిప్రాయం ఏర్పడుతున్నదని ఆయన చెప్పారు. ( 22.4 89)

**పటాపంచలుఅగు** క్రి. *paTaapancaluagu* పూర్తిగా తొలగిపోవు to be set at rest తీవ్రవాదులు పోలింగ్ జరగకుండా దౌర్జన్యానికి పాల్పడగలరన్న భయాందోళనలు దీంతో పటాపంచలయ్యాయి. (ఈ. 23 11.89)

**పటాపంచలుచేయు** క్రి. *paTaapancaluceeyu* పూర్తిగా తొలగించి వేయు to set at rest, remove నేటి చర్చలు ద్వారా ఆ అనుమానాలను బెనజీర్ పటాపంచలుచేయగలిగారు. (ఈ. 7.6.89)

**పటాలం** వి. *paTaalam* నిర్దిష్ట సంఖ్యకు సరిపడా జవానులు గల సైనిక బృందం (యూనిట్) battalion ... పసిఫిక్ సముద్రం నుంచి 12 సైనిక పటాలాలను, 11 వైమానిక దళ రెజిమెంట్లను, 16 యుద్ధ నౌకలను రష్యా ఉపసంహరించుకుంటుంది. (ఆం. ప్ర. 18 6.89)

**పటిష్ఠంచేయు** క్రి. *paTiSThamceeyu* క్లిష్టమైన పరిస్థితిని ఎదుర్కొనేందుకు వీలుగా ఒక వ్యవస్థ బలాన్ని, సామర్థ్యాన్ని పెంచు to strengthen సమస్యను ఎదుర్కొనే విధంగా పోలీసు యంత్రాంగాన్ని పటిష్ఠంచేయడమే పరిష్కార మార్గమని ... ఉద్ఘాటించారు. (ఆం ప్ర 22.4 89)

**పట్టణ వనం** వి. *paTTaNa vanam* (వాతావరణ కాలుష్యాన్ని ఎదుర్కొనేందుకు) నగరాలలో పథకం ప్రకారం పెంచే సామాజిక అడవి urban forest జంట నగరాలలో వాతావరణ కాలుష్యాన్ని నివారించేందుకు విస్తృతంగా మొక్కల పెంపకాన్ని చేపట్టాలన్న ధ్యేయంలో భాగంగా 'పట్టణ వనం' (అర్బన్ ఫారెస్ట్) పథకాన్ని చేపట్టదలచినట్లు ... చెప్పారు. (ఆం. ప్ర. 31 12 87)

**పట్టా** వి. *paTTaa* స్వంత భూమిపై హక్కును తెల్పుతూ రెవిన్యూ శాఖ ఇచ్చే అధికార పత్రం a document declaring the property right on land ప్రభుత్వ భూమిని స్వాధీన పరచుకున్న వారిలో కొందరికి పట్టాలు లభించాయి. (ఆం ప్ర 21 2.89)

**పట్టా భూమి** వి. *paTTaa bhuumi* రెవిన్యూ శాఖ ఇచ్చిన హక్కులతో వ్యక్తుల లేదా సంస్థల స్వాధీనంలో ఉన్న నేల patta land ప్రభుత్వ భూములు లేదా పట్టా భూములలో గుడిసెలు వేసుకున్నవారికి పక్కా ఇళ్ళు కట్టించి ఇచ్చే ప్రతిపాదనకు ... తెలిపారు. (ఈ 6.12.88)

**పట్టాలుతప్పు** క్రి. *paTTaalutappu* ప్రయా

ణిస్తున్న రైలు తన మార్గం నుంచి జారి పోవు to derail *గీతాంజలి ఎక్స్‌ప్రెస్ పట్టాలుతప్పడంతో పదిమంది గాయపడ్డారు.* (ఆం ప్ర 15 6 89)

**పట్టు** వి. *paTTu* రాజకీయంగా ఉన్న పలుకుబడి లేదా ప్రభావం hold or influence *శ్రీ దేవీలాల్‌కి జాట్‌వర్గంపై గలపట్టు చెక్కుచెదరలేదని మొన్నటి ఎన్నిక లలో స్పష్టమైంది* (ఆం జ్యో 20 6.87)

**పట్టుదలవహించు** క్రి. *paTTudala vahıncu* తలచుకున్న పనిపూర్తి చేయ డానికి దీక్ష బూను (sth) to be determined, to be resolute *ఎర్షాద్ మరింత అణచివేతకు పాల్పడినా భయపడక బాంగ్లాదేశ్ ప్రజలు, ప్రతిపక్షాలు ఈ లక్ష్యాన్ని సాధించడానికే పట్టుదలవహి స్తాయని ఆశిద్దాము.* (ఆం ప్ర. 11 12.87)

**పట్టుపట్టు** క్రి. *paTTupaTTu* ఒక పని జరి గితీరాలని గట్టిగా వాదించు to insist *అభ్యంతరాలు తెలుపదలచుకున్న ప్రతిసభ్యు డిని పిలవాలని సభ్యులు పట్టుబట్టారు.* (ఈ 16 5 89)

**పట్టుబడు** క్రి. *paTTubaDu* నేరం చేసిన వాళ్ళు (పోలీసులకు) దొరికిపోవు to be apprehended (by the police), be caught *ఐయిదుగురు టెర్రరిస్టులు పట్టుబడినట్టు పోలీసులు తెలి యజేశారు.* (ఆం. ప్ర. 25 4.89)

**పడగొట్టు** క్రి. *paDagoTTu* ప్రభుత్వాలను మాయోపాయాల ద్వారా అధికారం నుంచి మధ్యంతరంగా దించు to topple, overthrow *ఆంధ్ర ప్రదేశ్‌లోని తెలుగు దేశం ప్రభుత్వాన్ని పడగొట్టాలని కాంగ్రెస్(ఐ) తదుపరి లక్ష్యంగా పెట్టుకున్నట్టు ఆయన చెప్పారు.* (ఈ. 26.4.89)

**పడావు** వి. *paDaavu* సేద్యం చేయని బీడు భూమి uncultivated land *పదివేల ఎకరాల సారవంతమైన భూమి పడా వుగా పడి ఉన్నదని తెలిస్తే ఆశ్చర్యం కలుగక మానదు.* (ఆం ప్ర. 22 9.89)

**పడిపోవు** క్రి. *paDıpoovu* దిగువ స్థాయికి చేరుకొను; తగ్గిపోవు to fall, be reduced ... *పార్టీ దీనితో మైనారిటీ స్థాయికి పడిపోయింది.* (ఆం ప్ర. 22.4 89)

**పణంపెట్టు** క్రి. *paNampeTTu* ఎంతో ప్రాముఖ్యం లేదా అవసరం ఉన్న విషయా లను ఒక ఒప్పందం లేదా కార్యక్రమంలో భాగంగా పరిత్యజించు to stake *రక్షణ విషయాలలో దేశ ప్రయోజనాలను పణంపె ట్టినందున ప్రభుత్వం రాజీనామా ఇవ్వాలని గద్దిస్తోంది.* (ఆం భూ 25 7 89)

**పతనం** వి. *patanam* యుద్ధంలో ఒక కీలకమైన ప్రాంతం, దాడిచేసిన వారి ఆధీనంలోకి వెళ్ళిపోవటం fall (of a strategic location in a war) ... *స్వాధీనం చేసుకోవడం, అనేక ఎల్. టి. టి. ఇ. కంచుకోటలను సర్వనాశనం చేయడంతో జాఫ్నా పతనం అనివార్యమే కావచ్చు.* (ఈ 5 6 87)

**పతనమగు** క్రి. *patanamagu* అధికారాన్ని కోల్పోవు; పడిపోవు to collapse (as a government) *బొమ్మయ్ మంత్రి*

వర్గం ఎలాగూ పతనమవుతుందని, ఈ లోగా కాం(గెస్(ఐ) చెడ్డ పేరు తెచ్చుకోవడం ఎందుకని వీరు వాదించారు. (ఆం భూ 22 4 89)

**పతాక ఘట్టం** వి. *pataaka ghaTTam* ఒక కార్యక్రమం లేదా సంఘటన పరిణామ క్రమంలో చిట్టచివరి లేదా అత్యున్నత దశ final or last phase ... లక్షలాది మంది ప్రజలను సమీకరించాలని, పతాక ఘట్టంగా 1987 డిసెంబర్ 9వ తేదీన పార్లమెంట్ ముందు ప్రజాప్రదర్శన జరపాలని ... (విశా 19 10 87)

**పతాక స్థాయి** వి. *pataaka sthaayi* ఒక విషయం లేదా ఘటన క్రమక్రమంగా పెరిగి చివరకు చేరే అత్యున్నత దశ climax or peak of a development 1969 ఘర్షణలతో పతాక స్థాయికి చేరిన విభేదాలను, ఉద్రిక్తతలను తొలగించుకొనేందుకు ... (ఈ. 15.5 89)

**పతాక శీర్షిక** వి. *pataaka śiirSika* పత్రిక మొదటి పేజీలో ప్రధాన వార్తకు పెద్ద అక్షరాలతో పెట్టే హెడ్డింగు (ఒక వార్తకి అత్యధిక ప్రాముఖ్యం ఇవ్వటం) headline of a newspaper, banner ఆయన పర్యటనల వార్తలను భారత, సోవియట్ పత్రికలు పతాక శీర్షికలలో ప్రచురించాయి. (ఆం. ప్ర. 23 6 87)

**పతాకావిష్కరణ** వి. *pataakaa-viSkaraNa* పర్వదినాలలో జాతీయ జెండా ఎగురవేయటం unfurling the national flag ... స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా ఎర్రకోటలో పతాకావిష్కరణ అనంతరం జాతినుద్దేశించి ప్రసంగిస్తూ ... (ఆం. జ్యో 16 8 87)

**పత్రం** వి. *patram* అధికారిక సమాచారంతో కూడిన డాక్యుమెంటు document జనతాదళ్ నాయకుడికి సి.ఐ.ఎ. తో సంబంధాలున్నాయని చెబుతూ ఒక ఆంగ్ల దినపత్రిక ప్రచురించిన పత్రాలు ఫోర్జరీ పత్రాలని ఇక్కడ అమెరికన్ రాయబార కార్యాలయం అభివర్ణించింది. (ఆం. ప్ర 20.7 89)

**పత్రికా గోష్ఠి** వి. *patrikaa gooSThi* విషయ ప్రకటనకు విలేఖరులతో నాయకులు, ముఖ్య అధికారులు జరిపే సంభాషణ press conference ... తెలుగుదేశం నాయకులు ఇక్కడ పత్రికా గోష్ఠి ఏర్పాటు చేశారు. (ఆం. ప్ర. 4.7 89)

**పత్రికా ప్రతినిధి** వి. *patrikaa pratinidhi* వివిధ ప్రదేశాల నుంచి వార్తలు సేకరించి పత్రిక ప్రధాన కార్యాలయానికి చేర్చే విలేఖరి pressperson ... సోమవారం నాడు హోంమంత్రి పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ రాష్ట్రప్రభుత్వం ... (ఆం ప్ర. 25 5.89)

**పత్రికా స్వేచ్ఛ** వి. *patrikaa sveeccha* రాజ్యాంగంలో పౌరులకిచ్చిన భావ ప్రకటనా స్వాతంత్ర్యంలో భాగంగా ఆంక్షలు లేకుండా వార్తలను, వ్యాఖ్యలను ప్రచురించడానికి పత్రికలకున్న స్వాతంత్ర్యం freedom of the press పత్రికా స్వేచ్ఛ ఉందని తప్పుడు సమాచారాలు, ఊహాగానాలు ప్రజల కందివ్వవద్దని పత్రికలను ఆయన హెచ్చరించారు. (ఉ. 24 12.87)

'పదవీకాలం వి. *padaviikaalam* చట్టరీత్యా అధికారులతో కొనసాగేందుకు అనుమతించబడ్డ సమయం tenure, term వాస్తవానికి నేటితో వీరి పదవీకాలం ముగియవలసి ఉంది. (ఆం భూ 1 10 87)

పదవీచ్యుతి వి. *padaviicyuti* అధికారస్థానం చేజారటం; పదవీ భ్రష్టత dislodgement ఆంధ్రప్రదేశ్‌కు చెందిన కేంద్రమంత్రులు, కొందరు పలుకుబడిగల ఎంపీలు నేదురుమల్లి పదవీచ్యుతికి తెర వెనుక పాత్ర నిర్వహించక పోలేదు. (ఈ 4 5.89)

పదవీప్రమాణం వి. *padaviipramaaNam* ఎన్నికైన ప్రతినిధులు బాధ్యతలను స్వీకరిస్తూ రాజ్యాంగ బద్ధంగా నడుచుకుంటామని చేసే ప్రతిజ్ఞ; ప్రమాణ స్వీకారం swearing in (oath taking at the time of assuming some public position) ... పదవీప్రమాణం చేసిన మంత్రి ... తన విధులను విస్మరిస్తే ఏంకావాలి ... (ఆం ప్ర 28 6 89)

పదవీభ్రష్టుడగు క్రి. *padaviibhra-STuDagu* అధికార స్థానాన్ని కోల్పోవు to lose position చుర్హాట్ లాటరీ వివాదం ఫలితంగా శ్రీ సింగ్ పదవీ భ్రష్టుడయ్యాడు. (ఆం ప్ర 30 6.89)

పదవీబాధ్యతలు వి. (బ.వ.) *padavi-ibaadhyatalu* ఒక అధికార స్థానానికి సంబంధించిన పనులకు పూచీ charge of an office ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి కె. రామస్వామిని సుప్రీం కోర్టు న్యాయమూర్తిగా నియమించారు. ఆయన శుక్రవారంనాడు పదవీబాధ్యతలు స్వీకరిస్తారు. (ఆం ప్ర. 6 10 87)

పదవీవిరమణ వి. *padaviiviramaNa* కాల పరిమితి ముగియగానే అధికార బాధ్యతలను వదలివేయటం retirement పదవీవిరమణ చేయనున్న ముగ్గురిలో ఇద్దరు సర్వీసు జడ్జీలు. (ఆం. భూ. 1.10.87)

పదవీస్వీకార ప్రమాణం వి. *padavi-isviikaara pramaaNam* చూ. పదవీ ప్రమాణం. నేషనల్ ఫ్రంట్ పార్లమెంటరీ పార్టీ నాయకుడుగా ఎన్నికైన వి. పి. సింగ్ రేపు ప్రధాన మంత్రిగా పదవీస్వీకార ప్రమాణం చేసిన అనంతరం ... (ఆం. ప్ర 2.12 89)

పదిలం వి. *padilam* మార్పులేకుండా సురక్షితంగా ఉన్న పరిస్థితి; భద్రం safe or secure, intact శ్రీ లంకలో ఎక్కడైతే శాంతి సేన ఉందో అక్కడే శాంతి భద్రతలు పదిలంగా ఉన్న విషయాన్ని గమనించాలని ఆయనన్నారు. (ఈ. 18.7.89)

పదిలం చేసుకొను క్రి. *padilam ceesu konu* తన స్థానాన్ని సురక్షితం చేసుకొను; భద్రం చేసుకొను to safeguard (one's position etc.) పద్దెనిమిది నెలలపాటు ఉండవలసిన తన పదవిని పదిలం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. (ఆం.జ్యో. 9 10 88)

పదిల పరచు క్రి. *padilam paracu* పాడయిపోకుండా జాగ్రత్త చేయు; భద్రపరచు to preserve పాత చిత్రాలను పదిలపరచడానికి ఫిలిమ్ ఆర్కైవ్స్ ఏర్పాటు. (ఈ. 19 3 88)

పదును పెట్టు క్రి. *padunupeTTu* ఒత్తిడికి గురిచేయడం ద్వారా ఒక వస్తువు చురుకుదనం పెంచు to sharpen అందుకే అగ్రశ్రేణి ఆల్‌రౌండర్లు రిచర్డ్ హాడ్లీ, కపిల్ దేవ్ తమ శరీరాలకు పదును పెట్టి సమరానికి సర్వసన్నద్ధం కావడం ... చూడొచ్చు. (ఆం.

జ్యో 21288)

**పదేపదే** క్రి.విశ. *padee padee* వెంట వెంటనే అనేక మార్లు repeatedly హోంమంత్రి బూటాసింగ్ ఇదే విషయాన్ని సభలో పదేపదే స్పష్టం చేశారు. (ఈ. 17 8 89)

**పద్దు** వి. *paddu* ప్రభుత్వ శాఖలు తమ కవసరమైన నిధుల కోసం చట్ట సభలకు సమర్పించే వివరాల పత్రం proposal or demand (budgetory) అనేక మంత్రిత్వ శాఖల పద్దులను స్పీకర్ జక్కర్ చర్చ జరక్కుండానే సభ ఆమోదానికి పెట్టిన అనంతరం బడ్జెట్ పై ఆమోద ముద్రపడింది. (ఈ 27.4 89)

**పథకం** వి. *pathakam* ఒక కార్యక్రమం అమలుకోసం తగిన విధివిధానాలతో ఏదైనా సంస్థ లేదా ప్రభుత్వం రూపొందించే ప్రణాళిక scheme, programme వ్యవసాయం, గ్రామీణ నీటిసరఫరా మెరుగు చేసే పథకాలకు వెచ్చించడానికి ఈ డబ్బు ఉపయోగిస్తారు. (ఆం భూ 1.10 87)

**పనితీరు** వి. *panituuru* విధులను అమలుచేసే పద్ధతి functioning శ్రీ మహంతా తెలుగు విజయానికి వచ్చి పార్టీ పనితీరును తెలుసుకోదలచినట్లు ఆయన చెప్పారు. (ఈ. 5.6.87)

**పన్నాగం** వి. *pannaagam* ఎదుటివారిని మోసగించేందుకు రహస్యంగా వేసిన ఎత్తుగడ; రహస్య పథకం ploy, plot రాష్ట్ర ప్రభుత్వాలను పడగొట్టేందుకు కేంద్రం పన్నాగం పన్నిందని విమర్శించారు. (ఈ. 25 4.89)

**పబ్లిక్ టెండర్** వి. *pablik TenDar* ప్రభుత్వ పనులు (నిర్మాణాలు వగైరా) చేసేందుకు, కాంట్రాక్టర్ల నుంచి దరఖాస్తులను కోరుతూ పత్రికలలో విడుదల చేసే బహిరంగ ప్రకటన public tender అంతకు మునుపు పబ్లిక్ టెండర్‌లో ఇరవై వేలా ఏడు వందలా తొంభై ఏడు రూపాయల ఆఫర్ వచ్చింది. (ఈ 5 10.87)

**పబ్లిసిటీ** వి. *pablisiTii* ఒక వ్యక్తి లేదా విషయానికి సంబంధించిన సమాచారం ఎక్కువ మంది ప్రజలకు చేరటం publicity మొత్తం మీద ప్రభుత్వం ఇరకాటంలో పడడం కాకుండా ఆ రెండు సినిమాలకు పెద్ద ఎత్తున పబ్లిసిటీ చేసి పెట్టినట్లయింది. (ఆం భూ 20 6 87)

**పయనించు** క్రి. *payanincu* ఒక నిర్ణీత దిశలో కదలి వెళ్ళు to move towards బంగాళాఖాతంలో నిన్న ఏర్పడిన అల్పపీడన ప్రాంతం ఈశాన్య దిశగా పయనించే సూచనలు కనిపిస్తున్నాయి. (ఆం ప్ర. 22 12 87)

**పరకామణి** వి. *parakaamaNi* తిరుపతి వెంకటేశ్వరుని హుండీలో భక్తులు సమర్పించిన కానుకలను లెక్కించే కార్యక్రమం counting of money and other offerings to Lord Venkateswara at Tirupati ఆదివారం ఉదయం పరకామణి సందర్భంగా రెండునోట్ల కట్టలు అధికారుల దృష్టికి వచ్చాయి. (ఈ 29.6.87)

**పరమావధి** వి. *paramaavadhi* అంతిమంగా సాధించాలని అనుకొనే లక్ష్యం ultimate motive or aim రాష్ట్రాల అధికారాలను కబళించడమే కేంద్రం పరమావధిగా కన్పిస్తున్నదని ... (ఉ. 5.10 89)

**పరామర్శించు** క్రి. *paraamarisincu*

అనారోగ్యంగా ఉన్నవారిని పలకరించి ఆరోగ్యం గురించి వాకబు చేయు to enquire about somebody's health *ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ శ్రీమతి విజయలక్ష్మి పండిట్ నివాసానికి వెళ్ళి ఆరోగ్యాన్ని గురించి పరామర్శించారు.* (ఆం. భూ 27.10 87)

**పరపతి** వి. *parapati* వ్యవసాయం, వ్యాపారం లాంటి వృత్తి నిర్వహణ కోసం పెట్టుబడిగా వివిధ ఆర్థిక సంస్థల నుంచి అప్పు లభించే అవకాశం credit *రాష్ట్రంలో గ్రామీణ సహకార వ్యవస్థకు, ఇతర స్థానిక సంస్థలకు ఎన్నికలు జరగటం వల్ల గ్రామీణ పరపతి విస్తరణ విధానం బాగా పనిచేసే అవకాశముందని ... అభిప్రాయపడ్డారు.* (ఈ 30 1.87)

**పరపతి విధానం** వి. *parapati vidhaanam* ప్రభుత్వం, బ్యాంకుల పరంగా డబ్బును అప్పుగా ఇచ్చే పద్ధతి credit policy *వచ్చే మే నెల నుంచీ, అక్టోబరు చివరిదాకా ఆరు నెలలలోనూ అవలంబించనున్న పరపతి విధానాన్ని ఈ నెల మొదటి వారంలో ... తెలియ జేశారు.* (ఆం ప్ర 14.4.88)

**పరాకాష్ఠ** వి. *paraakaaSTha* క్రమక్రమంగా చేరే ఉన్నత దశ (అవాంఛనీయ పరిణామాల విషయంలో) climax or peak of a (usually undesirable) development *నిన్న ఆయన అంత్యక్రియలు ముగిసిన వెంటనే దౌర్జన్యకాండ పరాకాష్ఠకు చేరుకుంది.* (ఆం. ప్ర 24.4 89)

**పరార్‌అగు** క్రి *paraaragu* ఎవరికీ ఆచూకీ తెలియకుండా పారిపోవు to abscond ... *హత్య గురించి స్వచ్ఛందంగా పోలీసులకు ఫిర్యాదు చేసిన నాగేంద్రమ్మ ఎందుకు పరార్‌అయిందో అర్థంకాక పోలీసులు, అధికారులు అయోమయంలో పడ్డారు.* (ఆం. భూ. 5.5 89)

**పరిజ్ఞానం** వి. *parijnaanam* సాంకేతిక శాస్త్ర రంగాలలోని పనులు, వాటి పద్ధతులకు సంబంధించిన తెలివి తేటలు knowhow *జూమ్‌లెన్స్‌ల ఉత్పత్తి పరిజ్ఞానంలో చెయ్యితిరిగిన తర్వాత, తమ మచిలీపట్నం యూనిట్ దూరదర్శన్ స్టూడియో కెమెరాలను తయారు చేయగలదని ఆయన చెప్పారు.* (ఈ 14.8.89)

**పరిణతి** వి. *pariNati* ఒక వ్యక్తి ఆలోచనల్లోనూ, కార్య నిర్వహణ తీరులోనూ కనిపించే పరిపక్వత maturity (of thought and actions) *పరిణతి లోపించిన శ్రీ రాజీవ్ గాంధీ వ్యవహార సరళి కారణంగా ...* (ఈ 5 6 87)

**పరిగణనీయమైన** విశ. *pariganNaniiyamaina* ప్రాముఖ్యం ఇవ్వడానికి తగినంత; లెక్కించదగిన, చెప్పుకోదగిన considerable *ఈ విజయం పాక్ ప్రజలదే అయినప్పటికీ ఇందులో వ్యక్తిగతంగా ఆమెదీ, ఆమె తల్లి నుస్రత్ భుట్టోది ప్రత్యేకమైన పరిగణనీయమైన పాత్ర.* (ఆం. జ్యో 3 12 88)

**పరిగణించు** క్రి. *parigaNincu* లెక్కలోకి తీసుకొను; గుర్తించు, భావించు to consider *ఈ పరిస్థితుల్లో ఎన్నికల దృష్ట్యా దాన్ని రాజకీయ పార్టీగా పరిగణించలేమని గోయల్ వివరించారు* (ఈ 30 6 89)

**పరిణమించు** క్రి. *pariNamincu* ఏదైనా సంఘటన దశలవారీగా మార్పు చెంది చివరకు ఒక నిర్దిష్ట రూపం దాల్చు to culminate ... *విద్యార్థులు ప్రారంభిం*

చిన సామూహిక ప్రదర్శనల పర్వం నానాటికీ పుంజుకొని ప్రజాస్వామ్య హక్కుల కోసం బృహత్తర ప్రజా ఉద్యమంగా పరిణమించింది. (ఈ. 31 5 89)

**పరిణామం** వి. *pariNaamam* కొత్తగా ఏర్పడిన పరిస్థితి; మార్పు development, change *బుధవారం నాటి పరిణామాలు భారత్‌కు ఆందోళన కలిగించాయి.* (ఆం. జ్యో 5 6.87)

**పరిత్యాగంచేయు** క్రి. *parityaagamceeyu* పదవి లేదా స్థానాన్ని ఇష్టపూర్వకంగా వదలివేయు to renounce *కంచి కామకోటి పీఠం అధిపతి పదవిని శ్రీ జయేంద్ర సరస్వతి స్వామి పరిత్యాగంచేయటం అకస్మాత్తుగా జరిగినా నిర్ణయంకాదు.* (ఆం. ప్ర. 28.8 87)

**పరిధి** వి. *paridhi* పాలనాధికారాల హద్దును తెలిపే పరిమితి jurisdiction *డ్రైనేజీల పన్ను వసూలు, మరమ్మత్తులు జిల్లా ప్రజాపరిషత్తుల పరిధిలోకి తెస్తున్నట్లు మంత్రి చెప్పారు.* (ఈ 5 6 87)

**పరిపక్వదశ** వి. *paripakvadaśa* సంపూర్ణత్వం ఏర్పడిన స్థితి ripened state (as of an action or a situation) *గోర్బచేవ్ అధికారంలోకి వచ్చిన తర్వాత ఈ ప్రయత్నాలు పరిపక్వదశకు చేరుకున్నాయి.* (ఈ 15.5.89)

**పరిపాటి** వి. *paripaaTi* సామాన్యంగా జరిగే పద్ధతి routine, normal *ప్రతిసారి విశ్వ విద్యాలయం నిర్వహించే పరీక్షలలో అవకతవకలు జరగటం పరిపాటి అయిందని వారన్నారు.* (ఉ 30.10 87)

**పరిపుష్టం** వి. *paripuSTam* (నిధులు, అధికారాలు ఇచ్చి) సంస్థలను ఇంకా బలంగా తయారు చేయటం strengthening (as institutions) *1. స్థానిక సంస్థల్ని పరిపుష్టం చేసేందుకు వాటికి రాజ్యాంగ ప్రతిపత్తి కల్పించాలన్న ప్రతిపాదనకు ...* (ఈ. 22.6 89) *2. వ్యవసాయ, పారిశ్రామిక రంగాలకు తగిన రాయితీలు ఇచ్చి పరిపుష్టం చేయడం ...* (ఉ 2.3 88)

**పరిమిత అవగాహన** వి. *parimita avagaahana* మొత్తం విషయంపై కాకుండా అందులో కొన్ని అంశాలపై మాత్రమే (సంబంధిత పక్షాల మధ్య) ఏకాభిప్రాయం కుదరటం limited understanding *చైనా-సోవియట్ సరిహద్దు వివాదంపై ఉభయ దేశాలు ఇటీవలనే ఒక పరిమిత అవగాహనకు వచ్చాయి.* (ఆం ప్ర 3 2.87)

**పరిమితమగు** క్రి. *parimitamagu* కేవలం ఒక ప్రాంతం లేదా ఒక రంగానికే అందుబాటులో ఉండు to be confined (to some area) ... *పశువుల ఆసుపత్రితో సహా అన్నీ పహాడీ షరీఫ్‌కే పరిమితమై పోయాయని ...* (ఉ 27 4.88)

**పరిరక్షణ** వి. *parirakSaNa* నష్టం వాటిల్లకుండా కాపాడటం safeguarding *దేశ సమైక్యత, సమగ్రతల పరిరక్షణ ...* (ఆం. ప్ర 18 4 88)

**పరిరక్షించు** క్రి. *parirakSincu* నష్టం వాటిల్లకుండా కాపాడు to safeguard, protect *రాజ్యాంగ నిబంధనలను పరిరక్షించడంలో రాష్ట్రపతి కూడా విఫలమయ్యారని ఆయన విమర్శించారు.* (ఈ 23 4 89)

**పరిశీలకుడు** వి. *pariśiilakuDu* 1. (రాజకీయాలు, క్రీడలు మొదలైన రంగాలలో) జరిగే సంఘటనలు, పరిణామాలను బయటి నుంచి సునిశితంగా పరిశీలించే వ్యక్తి non-participant

observer ఎంతో అనుభవం ఉన్న ఎడ్ బర్గ్‌ను కొత్త కుర్రాళ్ళు ఓడించేస్తుండడం ఆశ్చర్యంగా ఉందని టెన్నిస్ పరిశీలకులన్నారు. (ఆం ప్ర. 15.6 89) 2. రాష్ట్రాలలో పార్టీ అంతర్గత వ్యవహారాలను చక్కబెట్టేందుకు గాను కేంద్ర నాయకత్వం పంపే దూత observer, a representative deputed by an organisation to co-ordinate activities at local level నాయకత్వ సమస్యపై రాజకీయ పరిష్కారం బాధ్యతను అధిష్టానవర్గానికి అప్పగించే విషయంలో, అసమ్మతి వాదులు, అధిష్టాన వర్గం పరిశీలకుల మధ్య రాజీ కుదరటంతో ... (ఆం జ్యో 2.2 89)

**పరిశీలన** వి. *pariśiilana* ఏదైనా ఒక విషయానికి సంబంధించిన మంచి చెడులను జాగ్రత్తగా విశ్లేషించడం examining, consideration ఈ సమస్య సుప్రీం కోర్టు పరిశీలనలో ఉందని ఆయన చెప్పారు. (ఈ 27 7 89)

**పరిశీలించు** క్రి. *pariśiilıncu* 1. కార్యక్రమం అమలు జరిగే విధానంలోని బాగోగుల్ని పరీక్షించు to review కడప జిల్లాలో వరదలకు గురైన ప్రాంతాలను ... రేపు సందర్శిస్తారు. ... సహాయక కార్యక్రమాలను పరిశీలిస్తారు. (ఈ 21 7 89) 2. (ప్రజల ఆర్జీలు లేదా నిపుణుల నివేదికలపై) నిర్ణయం తీసుకునే ముందు ఉచితానుచితాలను గురించి అధ్యయనం చేయు to look into (a report etc.) ... నివేదికను నెలరోజుల్లో పరిశీలించగలమని అన్నారు. (విశా 6 10 87)

**పరిశోధన కేంద్రం** వి. *parıśoodhana keendram* శాస్త్రజ్ఞులు ప్రయోగాల ద్వారా ఫలితాలను నిర్ధారించే సంస్థ; ప్రయోగశాల research centre దీనిని అంబర్‌పేటలోని ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం వారి పరిశోధన కేంద్రంలో రూపొందించారు. (ఆం భూ 15 9 89)

**పరిష్కరించు** క్రి. *pariSkarıncu* 1. సమస్యలపై నిర్ణయం తీసుకొను to dispose off an application ఇక ముఖ్యమంత్రి స్వీకరించిన 200 దరఖాస్తులనైనా ఎలా పరిష్కరించారనే విషయాన్ని పరిశీలించేందుకు విలేకరులను అనుమతించలేదు. (విశా. 6 10 87) 2. వివాదాన్ని విచారించి తీర్పు చెప్పు to settle a case ఇప్పటి వరకు 1338 లోక్ ఆదాలత్‌లు నిర్వహించి 8,28,870 కేసులను పరిష్కరించినట్టు ... వెల్లడించారు. (ఆం. జ్యో. 27.11.87)

**పరిష్కారం** వి. *pariSkaaram* వివాదాన్ని పరిశీలించి తీర్పు చెప్పడం settlement 8 లక్షల కేసుల పరిష్కారం. (ఆం. జ్యో. 27.11 87)

**పరిసర వాతావరణ శాస్త్రం** వి. *parisara vaataavaraNa śaastram* చూ. పరిసర శాస్త్రం కృత్రిమ వర్షాలను కురిపించడానికి ప్రభుత్వం ఏర్పాట్లు చేసేట్టు ప్రజాభిప్రాయాన్ని సమీకరించవలసిందని పరిసర వాతావరణ శాస్త్రవేత్త టి. శివాజీరావు ప్రజలకు విజ్ఞప్తి చేశారు. (ఆం ప్ర 6.10 87)

**పరిసర శాస్త్రం** వి. *parisara śaastram* మనుషులకి, వారి చుట్టూ ఉండే ఇతర జంతు జాలం, వృక్ష సంపద, వాతావరణం లాంటి ప్రకృతికి మధ్య ఉండవలసిన సమతూకం, సంబంధాలను గురించి వివరించే విజ్ఞానం environmental studies దేశంలోని అన్ని పాఠశాలల్లో పరిసర విజ్ఞాన శాస్త్రాన్ని (ఎన్విరాన్ మెంటల్ స్టడీస్) ఒక సబ్జెక్టుగా భావించాలని కేంద్రం నిర్ణయిం

చింది. (ఈ. 13.7.87)

**పరిహారం** వి. *parihaaram* ప్రమాదాలలో దెబ్బతిన్న బాధితులకు లేదా వారి కుటుంబాలకు (ప్రభుత్వం, సంబంధిత సంస్థలు) అందించే సహాయం ex gratia ... *ప్రమాదాలలో మరణించిన లేదా శాశ్వత అంగ వైకల్యం పొందిన వారికిచ్చే పరిహారం మొత్తాన్ని* ... (ఆం ప్ర 29.9.89)

**పరీవాహక ప్రాంతం** వి. *pariivaahaka praantam* నదులు, జలాశయాల లోనికి వర్షపునీరు వచ్చి చేరే పరిసర ప్రాంతం; ఆరగాణి ప్రాంతం catchment area *గత 24 గంటలలో కురిసిన భారీ వర్షాల మూలంగా రెండు రిజర్వాయర్లకు వాటివాటి పరీవాహక ప్రాంతాల నుంచి ప్రవాహాలు నిరంతరం వచ్చి పడుతూనే ఉండటంతో ... పెరుగుతూ వచ్చాయి.* (ఆం. భూ. 22.7.89)

**పరుగు** వి. *parugu* 1. నిర్ణీత దూరం పరిగెత్తాల్సిన పందెం run (as in a race) *పురుషుల 800 మీటర్ల పరుగులో ... ఈ పతకం సాధించాడు.* (ఆం ప్ర. 22.9.89) 2. క్రికెట్ లాంటి ఆటల్లో బంతిని కొట్టిన తర్వాత బ్యాటింగ్ చేస్తున్న ఆటగాళ్ళిద్దరూ వికెట్ల మధ్య ఒకసారి పరిగెత్తగా వచ్చే స్కోరు run (as in a cricket match) *గ్రీనిడ్జ్ 69 పరుగులు సాధించాడు* (ఆం. ప్ర 1.1.88)

**పరుగుతీయు** క్రి. *parugutiiyu* హడావుడిగా బయలుదేరి వెళ్ళు to rush *మూకుమ్మడిగా ఇంజనీర్లను సస్పెండు చేస్తున్నారని తెలియడంతో ... పలువురు ఇంజనీర్లు హైదరాబాదుకు పరుగుతీశారని తెలిసింది.* (ఆం. ప్ర. 26.4.89)

**పరుగు వేగం** వి. *parugu veegam* క్రికెట్ ఆటలో సగటున ఒక్కొ ఓవరులో తీసే పరుగుల సంఖ్య run rate *వీరి తర్వాత రిచీరిచర్డ్సన్ జట్టు పరుగు వేగం కాపాడుతూ 79 పరుగులు సాధించి నాట్ అవుట్‌గా నిలిచాడు.* (ఈ 22.3.88)

**పరువు నష్టం బిల్లు** వి. *paruvu naSTam billu* కేవలం వ్యక్తుల మాన మర్యాదలను దెబ్బతీసే ఉద్దేశ్యంతో పత్రికలలో రాసే రాతలను అదుపులో పెట్టేందుకు ఉద్దేశించిన చట్ట ముసాయిదా defamation bill *బాధ్యతారహిత జర్నలిజాన్ని అదుపులో పెట్టేందుకే పరువు నష్టం బిల్లును రూపొందించినట్లు సమర్థించుకున్నారు.* (ఈ. 4.10.88)

**పరుష పదజాలం** వి. *paruSa padajaalam* ఇతరుల మనసును నొప్పించే మాటలు strong words ... *నాయకులపై పరుష పదజాలంతో తీవ్ర విమర్శలు చేశారు.* (ఆం జ్యో. 8.4.88)

**పర్యటన** వి. *paryaTana* (నాయకులు, క్రీడాకారులు, కళాకారులు వంటి) ప్రముఖ వ్యక్తులు ఇతర ప్రాంతాలలో లేదా దేశాలలో నిర్ణీత కార్యక్రమం ప్రకారం జరిపే సందర్శనాత్మక ప్రయాణం visit, tour *భారత దేశంలో మూడు రోజుల అధికార పర్యటన ముగించుకొని మాస్కో బయలుదేరిన సోవియట్ అధ్యక్షుడు* ... (ఆం జ్యో 21.11.88)

**పర్యటించు** క్రి. *paryaTincu* నాయకులు, ఇతర ప్రముఖులు, ఇతర ప్రాంతాలలో లేదా దేశాలలో నిర్ణీత కార్యక్రమం ప్రకారం సందర్శనాత్మక ప్రయాణం చేయు to tour *శ్రీ యాదవ్ మంగళవారంనాడు తుఫాను దెబ్బతిన్న ప్రాంతాల్లో పర్యటిస్తారు.* (ఆం జ్యో. 6.12.88)

**పర్యావరణం** వి. *paryaavaraNam* సమ

తుల్యంతో ఉండే అడవులు, ప్రకృతి, పరిసరాలు, వాతావరణం environment *'తెలుగు గంగ' ప్రాజెక్టుకు పర్యావరణ అంశానికి సంబంధించి కేంద్ర ప్రభుత్వం అనుమతి ఇచ్చినట్టు ... వ్యాఖ్యానించారు.* (ఆం. ప్ర 30 9.88)

**పర్యవేక్షణ** వి. *paryaveekSaNa* కార్యక్రమాల అమలుతీరుపై ఆయా రంగాలలోని ఉన్నత స్థానాలలోని వ్యక్తులు ఎప్పటికప్పుడు చేసే పరిశీలన supervision *వీటి పంపిణీ పర్యవేక్షణ మండల ప్రజాపరిషత్ పర్యవేక్షణలో ఉంటాయని శ్రీ తుమ్మల చెప్పారు.* (ఈ 5 6 87)

**పర్యవేక్షించు** క్రి. *paryaveekSincu* కార్యక్రమాల అమలు తీరును, ఉన్నత స్థానాలలోని వ్యక్తులు ఎప్పటికప్పుడు పరిశీలించు to supervise ... *సహాయ కార్యక్రమాలను పర్యవేక్షించడానికి ముగ్గురు ఉపమంత్రులు ...* (ఆం. జ్యో 16 10 87)

**పర్యాటక ఆరామం** వి. *paryaaTaka aaraamam* సుదూర ప్రాంతాలకు వెళ్ళే ప్రయాణీకులు మధ్యలో విశ్రాంతి తీసుకోడానికి అవసరమైన వసతులున్న ప్రదేశం tourist shelter *దూర ప్రాంతాలకు ప్రయాణించే వారు మార్గ మధ్యంలో కొంత సేపు విశ్రాంతి తీసుకునేందుకు వీలుగా పర్యాటక ఆరామాలను ఏర్పాటు చేయనున్నట్లు ... తెలిపారు* (ఈ 21 10 87)

**పర్యాటక కేంద్రం** వి. *paryaaTaka keendram* చారిత్రక లేదా ప్రకృతి సంబంధమైన ప్రాముఖ్యంతో కూడి ఉండే, చూడదగిన ప్రదేశం tourist centre *రాష్ట్రంలోని పర్యాటక కేంద్రాల విస్తరణకు భారీ పథకాన్ని చేపట్ట బోతున్నామని ... ప్రకటించారు.* (ఈ. 28.9 89)

**పర్యాయం** వి. *paryaayam* వరుసక్రమంలో మరోదఫా; సారి time (as in fifth time) ... *పార్లమెంట్ స్పీకర్‌గా వరుసగా ఎనిమిదవ పర్యాయం కూడా ఎన్నికయ్యారు.* (ఆం. ప్ర. 16.6 87)

**పర్యావరణ అనుమతి** వి. *paryaavaraNa anumati* ప్రాజెక్టుల ప్రారంభానికి ముందు పరిసరాలు, అడవుల సమతుల్యాన్ని గురించి పరిశీలించి కేంద్రంలోని సంబంధిత శాఖ తెలిపే అంగీకారం environmental clearance *పర్యావరణ అనుమతి ఇవ్వడానికి సంబంధించి తన మంత్రిత్వ శాఖ వద్ద ప్రాజెక్టుల కేసులేవీ పెండింగ్‌లో లేవని అన్సారీ ప్రకటించారు.* (ఈ 20.4 89)

**పర్యావరణ నిపుణుడు** వి. *paryaa varaNa nipuNuDu* కాలుష్యం మొదలగు వాటిని నివారించడం ద్వారా ప్రకృతిలోని సమతుల్యాన్ని పరిరక్షించేందుకు కృషిచేసే వ్యక్తి environmentalist *ఆది వాసీలు భూమికి సంబంధించి ఎదుర్కొంటున్న సాధక బాధకాలను పరిశీలించి సిఫారసు చేసేందుకు ఏర్పాటుచేసిన కమిటీలో పర్యావరణ నిపుణులు సభ్యులని ప్రధాని తెలిపారు.* (ఈ 2 5.89)

**పర్వం** వి. *parvam* రాజకీయ, సామాజిక రంగాలలో ఒక ఘట్టం phase *జపాన్‌లో రిక్రూట్‌మెంట్ కుంభకోణానికి సంబంధించి కొద్ది మంది రాజకీయ నాయకులను అభిశంసించడానికి ఒక పక్క రాజకీయ నాయకుల రాజీనామాల పర్వం కొనసాగుతోంది.* (ఆం. ప్ర 18.5 89)

**పర్వదినం** వి. *parvadinam* రాజకీయ లేదా సాంస్కృతిక పరంగా చాలా ప్రాముఖ్యం కలిగి, ప్రజలు రోజువారీ బాధ్యతలకు

దూరంగా, ఆనందోత్సాహాలతో గడిపే రోజు; పండుగ రోజు festival day కార్మికులకు పర్వదినమైన 'మే డే'ను ఎంతో ఉత్సాహంగా జరుపుకునేందుకు ... (ఆం. భూ. 214.89)

**పర్సనల్ లా** వి. *parsanal laa* ఒక మతా చారాలకు మాత్రమే వర్తించే న్యాయ సూత్రాలు personal law *ఆమె చేయ గలిగిందల్లా తన మతం, 'పర్సనల్ లా'లు అనుమతిస్తే విడాకులకోసం ప్రయత్నించడం ...* (ఆం జ్యో 2 2.88)

**పర్సన్-ఇన్-చార్జ్** వి. *parsan-in-caarj* ప్రభుత్వాల, ప్రభుత్వసంస్థల పాలక మండ లులు రద్దయిన లేదా పదవీ కాల పరి మితి పూర్తిచేసుకొని వెళ్ళిపోయిన సంద ర్భాలలో పాలనా వ్యవహారాలు చూసేం దుకు తాత్కాలికంగా ప్రభుత్వం నియ మించిన అధికారి person-in-charge *రాష్ట్ర ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసేలా రాష్ట్ర గవర్నర్ ఆదేశాలు జారీ చేయాలనీ, రాష్ట్ర పాలనా బాధ్యతలు నిర్వహించడానికి 'పర్సన్-ఇన్-చార్జ్'ని నియమించేలా కేంద్ర ప్రభు త్వాన్ని ఆదేశించాలని ...* (ఆం ప్ర 28 9.89)

**పలాయన మంత్రం** వి. *palaayana mantram* ఇబ్బంది కరమైన లేదా తీవ్ర మైన పరిస్థితి ఏర్పడినప్పుడు ఎదుర్కోలేక తప్పించుకోవటం evasive action *బోఫోర్స్‌పై ముఖాముఖి చర్చకు సిద్ధమని తాము ప్రకటించగానే ప్రధాన మంత్రే పలా యన మంత్రం జపించారని అన్నారు.* (ఈ 21.8.89)

**పలుకుబడి** వి. *palukubaDi* సమాజంలో ఇతరులను తనకనుకూలంగా మార్చుకొని పనిచేయించుకోగలిగిన శక్తి influence *శ్రీ భద్దా బాగా పలుకుబడిగల వ్యాపారి కావడంతో సంతకంచేయడానికి చాలా మంది వెనుకాడారని ...* (ఆం ప్ర. 6 6 87)

**పలుచనగు** క్రి. *palucanagu* ఇన్నదాని కన్నా తగ్గిపోవు to decline (as the image of sb) *తెలుగు దేశం పార్టీ పలుకు బడి ప్రజల్లో రోజు రోజుకూ పలు చనవుతూ ఉన్నదని ... అన్నారు.* (ఆ 29 12 87)

**పల్లపు ప్రాంతం** వి. *pallapu praantam* చుట్టూ ఉన్న ఇతర ప్రాంతాలకన్నా ఎత్తు తక్కువగా ఉండి సులభంగా నీరు చేరుకునే ప్రాంతం low-lying area *మంజీర వరదలవల్ల సింగూరు ప్రాంతంలో పల్లపు ప్రాంతాలు జలమయం కావడంతో ...* (ఆం ప్ర 25 7 89)

**పవిత్ర యుద్ధం** వి *pavitra yuddham* కొన్ని విలువలు, ఆశయాలను పరిరక్షించ డంకోసం జరిపే పోరాటం holy war *ప్రజాస్వామ్య పరిరక్షణకు వీలుగా ప్రతిపక్షనా యకులు శ్రీ రాజీవ్ గాంధీ ప్రభుత్వంపై పవిత్ర యుద్ధం ప్రకటించారు.* (ఆం ప్ర. 23 4 89)

**పవిత్ర స్నానం** వి. *pavitra snaanam* మతపరమైన ప్రాముఖ్యం కలిగిన రోజున జలాశయాలలో, నదులలో భక్తులు సామూ హికంగా చేసే స్నానం holy dip *సుమారు 12 లక్షల మంది కురుక్షేత్రలోని పవిత్ర సరోవరాల్లో పవిత్ర స్నానాలు చేశారు* (ఆం. ప్ర. 24.9.87)

**పశ్చాత్తాపపడు** క్రి. *pascaattaapapaDu* తను చేసిన తప్పును గుర్తించి అందుకు విచారం వ్యక్తం చేయు to repent *పశ్చా త్తాపపడి తనను రెవిన్యూ మంత్రి పదవిలో కొనసాగనిస్తానని ముఖ్యమంత్రి చెప్పారని*

అయితే ఏ తప్పూ చేయని తాను పశ్చాత్తాపం వ్యక్తం చేయ లేదని ... (ఆం జ్యో. 3.12 87)

**పస** వి. *pasa* (వాదనలో) తగినంత బలం strength (as in an argument) రాష్ట్రంలో తిరిగి కాంగ్రెస్ అధికారంలోకి రాకుండా చేసేందుకే తెలుగు దేశం పార్టీని బలపరుస్తామన్న సి. పి. ఎం. వాదనలో పసలేదని ఆయన వ్యాఖ్యానించారు. (ఆం. జ్యో 11.6.87)

**పసిగట్టు** క్రి. *pasigaTTu* ఏదైనా రహస్యం లేదా రాబోయే ప్రమాదాన్ని కనుగొను to smell sth అయితే కాశ్మీర్‌లోని మన పరిపాలనా యంత్రాంగం ఈ ప్రమాదాన్ని ముందుగా పసిగట్టటం ... చేయలేకపోయింది. (ఆం భూ. 26 5 89)

**పసుపుపచ్చ కార్డు** వి. *pasupupacca kaarDu* (ఆంధ్రప్రదేశ్‌లో) మధ్య తరగతి, ఉన్నతాదాయ వర్గాల వారికి నిత్యావసర వస్తువులను (కిరోసిన్, నూనెలు మొ.) సరఫరా చేసేందుకు ఒక కుటుంబానికి ఇచ్చిన గుర్తింపు పత్రం yellow ration card given to a family on which essential commodities are supplied in fair price shops మధ్య తరగతి కుటుంబాలకు సమకూర్చిన పసుపుపచ్చ కార్డుపై చౌకధర దుకాణాల ద్వారా బియ్యం సరఫరాను పునరుద్ధరించే ఆలోచన ప్రస్తుతానికి లేదని ... (ఆం. ప్ర 4.5 89)

**పహాణి పత్రం** వి. *pahaaNi patram* వ్యవసాయ భూములపై రైతులకున్న హక్కు భుక్తాలను తెలిపే రెవిన్యూ శాఖ డాక్యుమెంటు government record in which the rights of ownership of land pertaining to the agriculturists are noted మండల రెవిన్యూ కార్యాలయాలలో రైతులకు సంబంధించిన పహాణి పత్రాల తయారీలో ... (ఆం భూ 31.5 89)

**పాంథిక్ కమిటీ** వి. *paanthik kamiTii* సిక్కు మతాచార్యుల మత సంఘం panthic committee అకల్ తక్త్ తాత్కాలిక ప్రధాన పూజారి ప్రొఫెసర్ దర్శన్ సింగ్ పై అయిదుగురు సభ్యుల పాంథిక్ కమిటీ 15 ఆరోపణలు చేసింది. (ఆం. ప 30 9 87)

**పాకు** క్రి. *paaku* ఇతర ప్రాంతాలకు చేరు; వ్యాపించు to spread పంచాయితీలకు పాకుతున్న తె.దే. ముఠా ఫీట్లు (ఆం. భూ 19.2 88)

**పాకులాడు** క్రి. *paakulaaDu* లాభం పొందేందుకు అన్ని విధాలా ప్రయత్నించు to crave for ... మంత్రులు ఇష్టానుడు పదవులకోసం పాకులాడుతున్నారని ... విమర్శించారు. (ఆం జ్యో 3 12 87)

**పాక్షికం** వి. *paakSikam* కొంత భాగం; అసంపూర్ణం partial ... విజయవాడలోని ప్రభుత్వ కార్యాలయాలు పాక్షికంగా పనిచేశాయి. (విశా 20.6 87)

**పాగావేయు** క్రి. *paagaaveeyu* (ఎన్నికలలో మెజారిటీ పొంది) విజయాన్ని సాధించు to capture (in election) ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు దేశం పార్టీ కోటలుగా పేరు మోసిన కొన్ని నియోజక వర్గాలలో కాంగ్రెస్ పాగా వేయటం ఖాయమని ... (ఈ 20 11 89)

**పాటవం** వి. *paaTavam* ఒక పని చేయడంలో ఉన్న సామర్థ్యం (నిర్వహణ సామర్థ్యం, శక్తి) capability ఇండియా

కొనుగోలు చేసిన 'బోఫోర్స్' శతఘ్నుల పాటవం పట్ల ప్రతిపక్షనాయకులు అనుమానాలు వ్యక్తం చేయడాన్ని ... ఖండించారు. (ఆం. భూ 4.10.87)

**పాటవ పరీక్ష** వి. *paaTava pariikSa* వస్తువు సామర్థ్యాన్ని నమూనాగా ఉపయోగించి చూసి తెలుసుకొనే కార్యక్రమం test firing ... ప్రస్తుతం ఎం. పి. లు కూడా ఈ ఫిరంగుల పాటవ పరీక్షలను ఖండించారు. (ఆం భూ. 6.10.87)

**పాటించు** క్రి. *paaTincu* నియమాలను లేదా ఆదేశాలను విధాయకంగా అనుసరించు లేదా ఆచరించు to observe లోకాయుక్త నియమాకం విషయంలో ప్రభుత్వం ప్రొసీజరును పూర్తిగా పాటించిందని ఆయన చెప్పారు. (ఆం జ్యో 24.11.88)

**పాటుపడు** క్రి. *paaTupaDu* లక్ష్యసాధనకోసం దీక్షతో పనిచేయు to strive ప్రజాస్వామ్యాన్ని రక్షించడానికి శక్తి వంచన లేకుండా పాటు పడతానని ... ఆయన చెప్పారు. (ఉ. 1.12.87)

**పాఠం** వి. *paaTham* చట్టాలు, ఉపన్యాసాలు మొ. వాటి యథాతథ లిఖితరూపం text of a resolution, speech etc. (*ఆ బిల్లు ముసాయిదా ప్రతి తనకు కూడా అందలేదని స్పీకర్ చెప్పగానే*) ప్రతిపక్ష సభ్యులు, ఈ సవరణ బిల్లు ముసాయిదా పూర్తి పాఠం ప్రచురితమైన ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రిక ప్రతులను గాలిలో ఊపుతూ ... అరిచారు. (ఆం. ప్ర 11.5.89)

**ప్రాత్రికేయుడు** వి. *paatrikeeyuDu* పత్రికలకు వార్తలు, వ్యాఖ్యలు రాసే వ్యక్తి; పత్రికా రచయిత journalist, pressperson సాయంత్రం మూడు గంటలకు శ్రీ రామారావు పాత్రికేయుల సమావేశాన్ని ఏర్పాటు చేసినట్టు అధికారులు చెప్పారు. (ఆం. జ్యో 3.12.88)

**పాదపూజ** వి. *paadapuuja* ప్రముఖుల మీద ఉన్న భయ, భక్తులతో వాళ్ళ కాళ్ళు కడిగి, మొక్కటం washing the feet of a prominent person as a mark of reverence ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు దేశం పార్టీని స్థాపించిన నాటి నుంచి జరుగుతున్న 'పాదపూజ' బుధవారం విమానాశ్రయంలో ప్రత్యేక ఆకర్షణ అయింది. (ఉ. 9.7.87)

**పాదయాత్ర** వి. *paadayaatra* ఏదైనా ముఖ్య విషయాన్ని ప్రజల దృష్టికి తెచ్చి, వారి చైతన్యాన్ని ఉద్దీపింప జేయటానికి ప్రముఖ నాయకులు కాలినడకన సాగించే ప్రయాణం a journey on foot taken up by political and social leaders to create awareness among people about an important issue శ్రీ ఆజాద్ నిన్న పాట్నా వీధుల్లో దాదాపు ఆరుకిలోమీటర్ల దూరం పాదయాత్ర జరిపారు. (ఆం ప్ర. 9.2.89)

**పాదుకొల్పు** క్రి. *paadukolpu* స్థిరపడేట్లుగా చేయు; నెలకొల్పు to create, establish పార్టీ పట్ల ప్రజల్లో విశ్వాసాన్ని పాదుకొల్పాలని ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ ఆఫీస్ బేరర్ల సమావేశం నిర్ణయించింది. (ఆం భూ. 30.5.89)

**పాయింట్ ఆఫ్ ఆర్డర్** వి. *paayinT aaf aarDar* చట్ట సభలలో ఒక సభ్యుడు ప్రసంగిస్తున్నప్పుడు మరో సభ్యుడు లేవనెత్తే అభ్యంతరం point of order శ్రీ రమణి లేవనెత్తిన పాయింట్ ఆఫ్ ఆర్డర్

తదుపరి, ముఖ్యమంత్రి ఈ ప్రకటన చేశారు. (ఆం ప్ర 25.4 89)

**పారద్రోలు** క్రి. *paaradroolu* ఒకచోటి నుంచి తొలగించివేయు; తరిమివేయు to drive out అందరం కలిసి ఈ సామాజిక నేరాన్ని పారద్రోలుదాం. (ఆం. జ్యో 22.3 88)

**పారాట్రూపరు** వి. *paaraaTruuparu* విమానంలోంచి పారాచూట్ సహాయంతో భూమి మీదకు దూకి యుద్ధకార్యక్రమం నిర్వహించే సైనికుడు paratrooper ... కిరాయి సైనికులకులను అణచివే యడంకోసం మాల్దీవులకు వెళ్ళిన భారత పారాట్రూపర్లు (సైనికులు) స్వల్పవ్యవధిలో విజయవంతంగా తమ కర్తవ్యాన్ని నిర్వహిం చారని ... (ఆం ప్ర. 5 11 88)

**పారామిలిటరీ దళం** వి. *paaraamiliTarı daLam* సాయుధ సైనిక శిక్షణ పొంది, రక్షణ విధులను నిర్వహించే (బోర్డర్ సెక్యూరిటీ ఫోర్స్ మొ.) దళం ; అర్ధ సైనికవ్యవస్థ paramilitary force వివిధ రాష్ట్రాలు కేంద్ర పాలిత ప్రాంతాలలో 1986-88 మధ్య నియుక్తులైన పారామిలిటరీ దళాలలో 150 మంది మరణించారని ... చెప్పారు. (ఆం ప్ర 9 5 89)

**పారితోషికం** వి. *paarıtooSıkam* సేవలకు గుర్తింపుగా గౌరవ పూర్వకంగా ఇచ్చే డబ్బు stipend ఆయన బతికున్నంత కాలం ప్రభుత్వం నుంచి 150 రూపాయలు, తనకు 50 రూపాయలు వచ్చేవని ... ఈ పారితోషికాన్ని నిలిపివేయడంతో జీవనం సాగడం లేదని చెప్పారామె. (ఈ 20 4 89)

**పారిశ్రామిక వేత్త** వి. *paarıśraamikaveetta* తగినంత పెట్టుబడి, యంత్ర సామగ్రి కార్మికులను కూర్చుకొని వస్తువులను ఉత్పత్తి చేసే యజమాని industrialist దరఖాస్తు చేసేవారు ప్రప్రథమంగా ఉత్పత్తి రంగంలో ప్రవేశిస్తున్న పారిశ్రామిక వేత్త అయి ఉండాలి. (ఆం. భూ. 26 4 89)

**పార్కింగ్** వి. *paarking* (రోడ్డు ప్రక్కన) వాహనాలు నిలపటానికి ఉద్దేశించిన స్థలం parking place పార్కింగ్ స్థలంలోనే వాహనాలు నిలపాలి. (ఆం ప్ర 16.6 87)

**పార్టీ టికెట్** వి. *paarTii TıkeT* ఎన్నికలలో పోటీ చేసేందుకు తమ అభ్యర్థిగా గుర్తిస్తూ రాజకీయ పక్షం ఇచ్చే అనుమతి పత్రం (political) party ticket తనకు పార్టీ టికెట్ ఇవ్వడానికి మీరంతా అనుమతిస్తే నిలబడతానని ... తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు (ఆం ప్ర. 18.5 89)

**పార్టీరహిత ప్రాతిపదిక** వి. *paarTiırahıta praatipadıka* (స్థానిక సంస్థలు, సహకార సంఘాలు మొ. వాటిలో) రాజకీయ పక్షాల ప్రసక్తి లేకుండా ఎన్నికలు జరిపే పద్ధతి non-party basis ... పార్టీరహిత ప్రాతిపదికపై ఎన్నికలు జరపాలని ప్రభుత్వం నిర్ణయించింది. (ఈ 20 5 89)

**పార్టీవ్యతిరేక కార్యక్రమాలు** వి. (బ.వ.) *paarTıivyatireeka kaaryakramaalu* ఒక రాజకీయ పక్షం విధానాలు, ప్రయోజనాలకు భిన్నంగా నష్టం కలిగించే పనులు anti-party activities పార్టీ వ్యతిరేక కార్యకలాపాలకై ఆయనను బహిష్కరించడమే సముచితం కాగలదని కాంగ్రెస్(ఐ) అధిష్ఠానవర్గం అకస్మాత్తుగా ఈ ఎదురు దెబ్బతీసి ఉంటుంది. (ఆం జ్యో. 21.7.87)

**పార్టీ సమావేశం** వి. *paarTii sama-*

*veesam* రాజకీయ పక్షం సభ్యులు ముఖ్య విషయాల చర్చలకు ఏర్పాటు చేసుకునే సభ party meeting ... పార్టీ సమావేశం పార్టీ నాయకత్వంపై చర్చించలేదని ఆయన అన్నారు. (ఆం జ్యో 20.4 88)

**పార్టీ సాహిత్యం** వి. *paarTii saahityam* ఒక రాజకీయ పక్షానికి సంబంధించిన సిద్ధాంతాలను, కార్యక్రమాలను వివరించే పుస్తకాలు, పత్రికలు, కరపత్రాలు, చిత్రాలు వగైరా party literature ... వారి వద్ద నుంచి ఎస్. బి. బి. ఇ. తుపాకిని, పార్టీ సాహిత్యాన్ని స్వాధీనం చేసుకున్నారు. (ఆం ప్ర. 23.6 87)

**పార్లమెంటరీ కమిటీ** వి. *paarlamenTarii kamiTii* (అభియోగాలు, వివాదాస్పద విషయాలను పరిశీలించేందుకు) పార్లమెంటులోని వివిధ పక్షాల ప్రతినిధులతో కూడిన సంయుక్త సంఘం parliamentary committee బోఫోర్స్ ఒప్పందంపై విచారణ జరిపేందుకు నియమించుకున్న పార్లమెంటరీ కమిటీ తన నివేదికను సమర్పించిన తరువాత ... (ఆం. జ్యో. 30.6 87)

**పార్లమెంటేరియన్** వి. *paarlamenTeeriyan* పార్లమెంటు చర్చలలో, కార్యకలాపాలలో విశేషానుభవం గడించిన ప్రజా ప్రతినిధి parliamentarian దాదాపు ఏడు దశాబ్దాలకు పైగా పార్లమెంటేరియన్‌గా ఆయన పేరు సంపాదించిన ప్రొఫెసరు రంగాపై ... ప్రశంసల వర్షం కురిపించారు. (ఆం. ప్ర 5 5.89)

**పాలకపక్షం** వి. *paalakapakSam* పరిపాలన చేస్తున్న రాజకీయ పార్టీ ruling party ఎవరు ఏమనుకున్నా సరే ప్రభుత్వానికీ, పాలక పక్షానికీ మధ్య ఉన్న సరిహద్దుల్ని రద్దు చేయాలన్నదే ముఖ్యమంత్రి లక్ష్యమైనట్లు స్పష్టమవుతుంది. (ఆం. భూ 6 6.87)

**పాలక పార్టీ** వి. *paalaka paarTii* చూ. పాలక పక్షం. సి.ఏ.జి. నివేదికపై చర్చను కోరుకుంటున్నారా అని డాక్టర్ హెప్తుల్లా సభ్యులనుద్దేశించి ప్రశ్నించారు. అవునని పాలక పార్టీ సభ్యులు చేతులెత్తారు. (ఈ. 20.7.89)

**పాలకవర్గం** వి. *paalakavargam* ఒక సంస్థ కార్యకలాపాల నిర్వహణకోసం ఏర్పరచిన కమిటీ ruling body శ్రీశైల ఆలయ పాలకవర్గం ఖాళీ అయి దాదాపు నాలుగు మాసాలయింది. (ఆం ప. 9.6 87)

**పాలనాకర్త** వి. *paalanaakarta* పాలనా పరంగా ఉన్నత స్థానంలో ఉన్న వ్యక్తి administrator పంజాబ్‌కు చెందిన పోలీసు అధికారులు, ఉన్నతస్థాయి పాలనా కర్తలతో చర్చించిన మీదట ఈ చర్యతీసుకున్నట్లు ఆయన చెప్పారు. (ఆం జ్యో 9.4 88)

**పాలనాపగ్గాలు** వి. (బ.వ.) *paalanaapaggaalu* పరిపాలనను నియంత్రించేందుకు అవసరమైన (కళ్లెం వంటి) అధికారం reigns of power రాష్ట్ర పాలనా పగ్గాలు చేతికంది ఏడు సంవత్సరాలు కావస్తున్నా పేదరికాన్ని పారదోలలేకపోయినందుకు సిగ్గుపడుతున్నానని ... ఆవేదన వెలిబుచ్చారు. (ఈ 20 7.89)

**పాలనాయంత్రాంగం** వి. *paalanaa yantraangam* ప్రభుత్వ కార్యక్రమాల నిర్వహణకు ఉద్యోగులతో అంచెలంచెలుగా ఏర్పడిన అధికార వ్యవస్థ administrative machinery ... ప్రధాన మంత్రి సమావేశానికి రంగం సిద్ధం చేసేందుకు పాలనా యంత్రాంగం ఆ

రాత్రంతా పని చేసింది. (ఆం ప్ర 21.11.89)

**పాలనాసంస్కరణ** వి. *paalanaasamskaraNa* ప్రభుత్వ కార్యకలాపాల నిర్వహణను మెరుగు పరిచేందుకు ఉద్దేశించిన మార్పు administrative reform ప్రజలకు మరింత సమర్థంగా పరిపాలనను అందించాలన్న ధ్యేయంతో రాష్ట్ర ప్రభుత్వం చేయతలపెట్టిన పరిపాలనాసంస్కరణలకు తుదిరూపు ఇచ్చేందుకు ఏర్పాటైన ... (ఈ 17.6.87)

**పాలశీతలీకరణ** వి. *paalaśiitaliikaraNa* (పాలను సేకరించి పంపిణీ చేసేందుకు) చల్లబర్చి నిలువ ఉంచే పద్ధతి cold storage of dairy milk కరీంనగర్ జిల్లా జగిత్యాలలో గల పాలశీతలీకరణ కేంద్రాన్ని పునఃప్రారంభించాలని ప్రభుత్వం నిర్ణయించినట్లు ... వెల్లడించారు. (ఆం. భూ 3.7.87)

**పాలుపంచుకొను** క్రి. *paalupancukonu* ఒక కార్యక్రమంలో తమవంతు పనిచేయు to participate or share రాష్ట్ర ప్రభుత్వం త్వరలో ఏర్పాటుచేస్తున్న వంతెనలు, రహదార్ల నిర్మాణ సంస్థలలో ప్రవాసాంధ్రులు పాలుపంచుకోవాలని శ్రీ రామారావు సూచించారు. (ఈ 11.7.89)

**పాలుపోవు** క్రి. *paalupoovu* ఆలోచనలకు అందు, మనసుకు తట్టు (వ్యతిరేక క్రియారూపంలోనే వస్తుంది) to catch an idea పంజాబ్ సమస్యకు రాజకీయ పరిష్కారం కనుగొనడానికి, సిక్కుల నాయకుల్తో చర్చించడానికి సిద్ధంగా ఉన్నామని ప్రభుత్వం పదేపదే చెప్తోంది. అకాలీల మధ్య ఉన్న చీలికలు ఎవరితో చర్చించాలో పాలుపోకుండా చేస్తున్నాయి. (ఆం భూ 22.7.89)

**పాల్పడు** క్రి. *paalpaDu* అవాంఛనీయమైన పనిచేయు to resort to, do sth undesirable మార్చి 29న అసెంబ్లీ ఆవరణలో ప్రదర్శన చేసి సభాధిక్కారానికి పాల్పడినందులకు 32మంది కార్యకర్తలను శిక్షించిన విషయం విదితమే. (ఈ 26.4.89)

**పావు** వి. *paavu* ఇతరుల ప్రయోజనాలకు అనుగుణంగా వాళ్ళు చెప్పినట్లు నడిచే వ్యక్తి లేదా సంస్థ pawn (of persons) ప్రజాస్వామ్య వ్యతిరేక వ్యూహంలో కర్నాటక గవర్నర్ 'పావు'గా మారారని ఆయన విమర్శించారు. (ఆం ప్ర. 23.4.89)

**పాశ్చాత్యకూటమి** వి. *paaścaatyakuuTami* అమెరికా, ఐరోపాలలోని పడమటి అభివృద్ధి చెందిన దేశాల సంఘటన western bloc ఎందుకంటే జపాను పాశ్చాత్య కూటమితో స్నేహంగా ఉంటున్నది. (ఆం భూ 16.4.88)

**పాసింగ్ షాటు** వి. *paasing SaaTu* ఆటలో బంతిని తమ ఆటగాళ్ళకు నేర్పుగా అందివ్వటం passing shot పాసింగ్ షాట్లు కూడా అద్భుతంగా కొట్టాడు. (ఆం ప్ర. 1.9.89)

**పింఛను** వి. *pinchanu* 1. ఉద్యోగ విరమణ చేసిన వారికి చట్టపరంగా ప్రభుత్వం ఇచ్చే నెలవారీ ఆర్థిక చెల్లింపు pension 2. పేదకుటుంబాలలో ఆదుకునే వారు లేని ముసలివారికి, సంక్షేమ పథకంలో భాగంగా ప్రభుత్వం అందించే నెలవారీ ఆర్థిక సహాయం pension వృద్ధాప్యపు పింఛను సౌకర్యాన్ని కల్పించేందుకు 60 సంవత్సరాలు వయోపరిమితి మించరాదని, ఈ పింఛన్లు కూడా జీవన వ్యయ సూచిని అనుసరించి పెంచుతూ ఉండాలని కమిటీ కోరింది. (ఆం ప్ర. 20.4.88)

**పికెట్** వి. *pikeT* నేరస్తులపై నిఘా వేసి

ఉంచేందుకు తగినచోట ఏర్పాటు చేసిన కొద్దిమంది పోలీసుల లేదా సైనికుల బృందం picket (police) కీలకమైన అన్ని ప్రదేశాలలో పికెట్లను ఏర్పాటు చేశారు. (ఉ. 15.6.87)

పికెటింగ్ వి. *pikeTing* కోర్కెలసాధన కోసం ప్రదర్శకులు కార్యాలయం ముందు గుమికూడి, ఇతరులను లోపలకు అను మతించకుండా నినాదాలు చేస్తూ నిరోధిం చడం picketing *ఏడాదిపాటు ఓపికతో ఉన్న అధ్యాపకులు మరో పదిరోజులు ఓపి కపట్టి ఈ నెల 9వ తేదీన తలపెట్టిన పికెటింగ్ కార్యక్రమాన్ని విరమించుకోవాలని* ... కోరారు. (ఆం జ్యో 8 12.88)

పిక్కటిల్లు క్రి. *pikkaTillu* శబ్దం హోరె త్తినట్లు ప్రతిధ్వనించు to resound *ఆయోధ్య రామయ్యకు గుడికట్టేంతవరకూ విశ్రమించబోమన్న ప్రతిజ్ఞల నినాదాలు దిక్కు* లను పిక్కటిల్లజేశాయి. (ఈ. 10.11.89)

పిచ్ వి. *pic* క్రికెట్ మైదానంలో వికెట్ల మధ్యనున్న చోటు pitch (of a cricket ground) *పిచ్‌పై ఖాదిర్ విజృంభించడంతో ఇంగ్లాండు వికెట్లు వరు సగా పడ్డాయి.* (ఆం జ్యో 26 11 87)

పిచ్‌కారిచేయు క్రి *pickaariceeyu* (పంపు సహాయంతో) క్రిమిసంహారక మందును పంటపై సన్నని ధారలుగా పడేట్లు చల్లు to spray *దీని నివారణకు థైమెన్ యం-45 మందును 2 గ్రాములు లీటరు నీటికి కలిపి హెక్టారుకు 1000 లీటర్ల మందు ద్రవాన్ని పిచ్‌కారిచేయాలి.* (ఆం. జ్యో 25.1 88)

పిటిషన్ వి. *piTiSan* న్యాయంకో రుతూ కోర్టులో దాఖలు చేసే ఫిర్యాదు petition *ప్రధాన న్యాయమూర్తి శ్రీ భాస్కరన్ వయస్సుకు సంబంధించిన ఒక పిటిషన్ జనవరి 4వ తేదీ తరువాత సుప్రీం కోర్టులో విచారణకు వస్తున్నందువల్ల* ... (ఆం ప్ర 4.1 88)

పిడివాదం వి. *piDivaadam* ఇత రత్రా సాక్ష్యాధారాలను, భిన్నాభిప్రాయా లను పరిగణించకుండా, ఒక సిద్ధాంతాన్ని, విశ్వాసాన్ని మొండిగా అనుసరించడం dogmatism *ప్రజాస్వామ్యం బూర్జువా భావన అన్న మార్క్సిస్టు పిడివాదాన్ని వమ్ము చేసినందుకు కూడా గోర్బచేవ్‌ను విశేషంగా అభినందించాలి.* (ఈ 27.5 89)

పిపాస వి. *pipaasa* లక్ష్యాన్ని సాధించాలన్న తపన thirst *నాలో పిపాస ఇగిరిపోనంత కాలం నేను పోరాడుతూనే ఉంటాను అని ధీమాగా చెప్పి* ..., (ఈ 13 9 89)

పిలుపు వి. *pilupu* సంస్థలు, నాయకులు ప్రజలను ఉద్యమాలలోనికి రావలసిందని కోరే ప్రకటన call *తీవ్రవాదుల పిలుపు మేరకు తమ దుకాణాలు మూసివేయాలని వర్తకులు నిర్ణయించుకున్నారు.* (ఆం ప్ర 14.6 89)

పిలుపునిచ్చు క్రి *pilupuniccu* సంస్థలు, నాయకులు ఆయా సమస్యలపై (పోరాడేం దుకు) కదిలి రమ్మని ప్రజలకు ఉద్బోధించు to give a call, exhort people to respond to an issue or a situation *దేశంలో అవినీతిని అంతం చేసేందుకు విద్యార్థులు, యువజనులు ఐక్యంగా పోరాడాల్సిందిగా ... నాయకులు పిలుపునిచ్చారు.* (విశా. 13 10 87)

పీకనొక్కు క్రి. *piikanokku* స్వేచ్ఛను హరించి ప్రజాస్వామ్య వ్యతిరేకంగా నియం త్రించు; అణచు to strangle, supress *'పరువు నష్టం బిల్లు' పత్రి కల పీకనొక్కడానికి కాదని ప్రధాని స్పష్టం*

చేశారు. (ఉ. 28 9.88)

**పుంజుకొను** క్రి. *punjukonu* క్రమంగా బల పడు to gain strength రాష్ట్రంలో తెలుగుదేశం బలహీనపడి, కాంగ్రెస్ పుంజు కొంటున్న దశలో కాంగ్రెస్‌లో అనైక్యత తలెత్తడం దురదృష్టకరమని ... తెలిసింది. (ఆం జ్యో 26 4 88)

**పుట్టగొడుగులు** వి. (బ.వ) *puTTago-Dugulu* (మార్కెట్‌లో ఉన్న డిమాండ్ ఫలితంగా) అధిక సంఖ్యలో పుట్టుకొచ్చే ఒకే రకం సంస్థలు, నిర్మాణాలు మొ. mush-rooms గత రెండేళ్ళలో హైదరా బాద్ నగరంలో బోగస్ ఫైనాన్స్ కంపెనీలు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చి ... ఇస్తామని ప్రచారం చేశాయి. (ఉ 15 6 87)

**పునఃపరిశీలన** వి. *punahpariśıılana* గతంలో తీసుకున్న నిర్ణయం లేదా విధానం బాగోగులపై తిరిగి జరుపుకునే సమీక్ష revision ప్రస్తుత తీర్పును పునఃపరిశీలిం చడానికి ... (ఈ 18 6 89)

**పునఃప్రారంభించు** క్రి. *punahpraaramb-hincu* గతంలో ఆగిపోయిన కార్యక్రమాన్ని తిరిగి మొదలు పెట్టు to reopen, resume ... టిప్పుసుల్తాన్ టెలీసీరియల్ షూటింగును సెప్టెంబరు పదో తేదీ నుంచి పునః ప్రారంభిస్తున్నారు. (ఈ. 14 8 89)

**పునర్వ్యవస్థీకరణ** వి. *punarvya-vasthıkaraNa* ఉన్న పద్ధతిని, నిర్మా ణాన్ని మార్చి కొత్త రూపు కల్పించటం reorganisation మంత్రివర్గ పునర్వ్య వస్థీకరణ గురించి విలేకరులు ప్రశ్నించగా ఇప్పుడిప్పుడే ఆ ఆలోచన ఏమీ లేదని స్పష్టం చేశారు. (ఆం జ్యో. 19 4 88)

**పునర్వ్యవస్థీకరించు** క్రి. *punarvyava-sthıkarıncu* ఉన్న పద్ధతిని, నిర్మా ణాన్ని మార్చి కొత్త రూపు కల్పించు to recast, reorganise పి.సి.సి.(ఐ) జోనల్ కమిటీలను కూడా పునర్వ్యవస్థీకరిం చడానికి కాంగ్రెస్(ఐ) అధిష్ఠానవర్గం సుము ఖంగా ఉన్నట్లు తెలిసింది. (ఈ 13 7 89)

**పునరంకిత దినం** వి. *punarankıta dinam* ఒక ధ్యేయంపట్ల దీక్షను మరో సారి ఉద్ఘాటించే రోజు rededication day శ్రీమతి ఇందిరాగాంధీ హంతకుల తుపాకీ గుళ్ళకు బలయిన అక్టోబర్ 31వ తేదీ జాతీయ పునరంకిత దినంగా పాటి స్తారు. (ఆం భూ. 27 10 87)

**పునరారంభ విత్తవిధానం** వి. *punar-aarambha vittavıdhaanam* బడ్జెట్ కేటాయింపులతో సంబంధం లేకుండా కార్యక్రమాలకు ద్రవ్యం వినియోగించే పద్ధతి; శూన్య విత్త విధానం zero based budget 'పునరారంభ విత్త విధానం' అధికతమ వసూళ్ళు మొదలైన మార్గాల ద్వారా కొరతను పూడ్చుకుంటా మని ఆర్థిక మంత్రి ప్రకటించారు. (ఆం ప్ర 14 7.87)

**పునరాలోచించు** క్రి. *punaraaloocincu* తీసుకున్న నిర్ణయాన్ని అమలు చేసే ముందు తిరిగి పరిశీలించు to reconsider ఆంధ్ర ప్రదేశ్ వికలాంగుల సహకార సంస్థను మహిళా శిశు సంక్షేమశా ఖలో విలీనం చేసే విషయాన్ని రాష్ట్రప్రభుత్వం పునరాలోచిస్తున్నట్లు తెలిసింది. (ఈ. 5 6 87)

**పునరావాసం** వి. *punaraavaasam* (ప్రకృతి వైపరీత్యాలు లేదా రాజకీ యాది కారణాల వల్ల సర్వం కోల్పోయిన వారికి) తిరిగి జీవితాన్ని సాఫీగా సాగిం చేందుకు తగిన వనరులు కల్పించటం rehabilitation లొంగిపోయిన వారికి

ప్రభుత్వం పునరావాసం కల్పిస్తుందని, వ్యవసాయం చేసుకునే వారికి రుణ సౌకర్యం ... అన్ని వసతులు ప్రభుత్వం అందజేస్తుందని శ్రీ రామారావు పేర్కొన్నారు. (ఆం ప్ర 30 6 89)

**పునరావృతం** వి. *punaraavRtam* గతంలో జరిగిన సంఘటనలు తిరిగి జరగటం repeated పదేండ్ల క్రితం ఉత్తర భారతమంతా కాం(గెస్(ఐ)ని తిరస్కరించిన పరిస్థితి ఈనాడు హర్యానాలో పునరావృతమైందని చెప్పవలసి ఉంటుంది. (విశా 20.6.87)

**పునరుత్థానం** వి. *punarutthaanam* ప్రాముఖ్యం కోల్పోయిన స్థితి నుంచి తిరిగి బలమైన శక్తిగా ఆవిర్భవించటం resurrection 1980లో మళ్ళీ ఇందిరా గాంధీ పునరుత్థానం చెందినపుడు . . (ఆం భూ. 20.6 87)

**పునరుద్ఘాటించు** క్రి. *punarudghaaTincu* లోగడ చెప్పిన విషయాన్నే తిరిగి నొక్కిచెప్పు to reiterate శ్రీలంక తమిళుల సమస్యను ఆదేశ ప్రాదేశిక సమగ్రత, ఐక్యతల పరిధిలోనే పరిష్కరించాలని తాము కోరుతున్నట్టు భారత ప్రభుత్వం గురువారంనాడు పునరుద్ఘాటించింది. (ఆం జ్యో. 5.6 87)

**పునరుద్ధరణ** వి. *punaruddharaNa* గతంలో అమలులో ఉండిన విధానాన్ని తిరిగి అమలులోకి తేవటం revival, restoration ఫిజీ దేశంలో ప్రజాస్వామ్యం పునరుద్ధరణకు చర్యలు తీసుకునేలా, భారత ప్రభుత్వం తన పలుకుబడి ఉపయోగించవలసిందిగా ... (ఈ. 5 6 87)

**పునరుద్ధరించు** క్రి. *punaruddharincu* గతంలో ఉండిన విధానాన్ని తిరిగి అమలుపరచు లేదా ప్రవేశపెట్టు to revive, reintroduce, restore వాణిజ్యం, సరకు రవాణా ఒప్పందాన్ని పునరుద్ధరించే విషయం నేపాల్‌రాజు శ్రీ బీరేంద్ర దృష్టికి తీసుకు వచ్చామని ... అన్నారు. (ఈ 19.7.89)

**పునర్దర్శనమిచ్చు** క్రి. *punardarśanamiccu* (కొన్నాళ్ళు మరుగున పడి) తిరిగి క్రియాశీలకార్యక్రమాలలో పాల్గొను to make a reappearance కపిల్ బదులు గవాస్కర్ మరో రెండు మూడేళ్ళు కెప్టెన్‌గా కొనసాగి ఉన్నా విశ్వనాథ్ టెస్ట్ క్రికెట్‌లో పునర్దర్శనమిచ్చి ఉండేవాడు. (ఈ. 3.3 88)

**పునర్నిర్మాణం** వి. *punarnirmaaNam* దెబ్బతిన్న కట్టడాలను తిరిగి కట్టడం reconstruction బస్రానగర్ పునర్నిర్మాణానికి కూడా ఇరాక్ దేశం అత్యంత ప్రాధాన్యత ఇస్తోంది. (ఆం ప్ర 20.9 89)

**పునశ్చరణ తరగతులు** వి. *punaścaraNa taragatulu* నేర్చుకున్న విషయాలను మరోసారి మననం చేసుకుని, కొత్త పోకడలను తెలుసుకొనేందుకు ఏర్పాటు చేసిన బోధనా కార్యక్రమం refresher course విద్యార్థులకు అర్థం అయ్యేలా సులభమైన పద్ధతులలో విద్యాబోధన చేసేందుకు ఉపాధ్యాయులకు పునశ్చరణ తరగతులు ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉందని అన్నారు. (ఆం. భూ. 9 5.89)

**పునస్సమీకరణ** వి. *punassamiikaraNa* విడివిడిగా ఉన్న బృందాలు తిరిగి ఒకటి కావడం realignment రాజకీయ శక్తుల పునస్సమీకరణ జరిగి కాం(గెస్(ఐ) పూర్తిగా ఏకాకి అయింది. (ఆం భూ. 20 6 87)

**పునస్సమీక్షించు** క్రి. *punassamiikSincu* విధానాల, కార్యక్రమాల మంచి చెడ్డ

లను మరొక్కసారి బేరీజు వేయు to reevaluate, review పన్ను ప్రోత్సాహకాలను పునస్సమీక్షించాలని ప్రభుత్వ దీర్ఘకాలిక ఆర్థిక విధానం కూడా సూచిస్తోందని ... చెప్పారు. (ఈ 6.6.87)

**పునాదులువేయు** క్రి. *punaaduluveeyu* సంస్థాగత నిర్మాణానికి తగిన ప్రాతిపదిక తయారు చేయు to prepare a base (for the growth of an organisation) గ్రామస్థాయి నుంచి రాష్ట్ర స్థాయి వరకు పార్టీ నిర్మాణానికి ఆనాడే పునాదులు వేశామని అన్నారు. (ఆం ప్ర 23.12.87)

**పురమాయించు** క్రి. *puramaayincu* ఒక పనికి సంబంధించిన బాధ్యతలు నెరవేర్చమని ఒక వ్యక్తికి అప్పగించు to entrust ఫెయిర్‌ఫాక్స్, రక్షణ ఒప్పందాల గురించిన సమాచారాన్ని సింగ్ నుంచి రాబట్టవలసిందని కూడా ఆయనను పురమాయించారు. (ఈ. 5.6.87)

**పురస్కరించుకొని** క్రి. విణ *puraskarincukoni* విషయాలను ఆధారం చేసుకొని in connection with పలువురు దాఖలు చేసుకున్న రిట్ పిటీషన్లను పురస్కరించుకొని న్యాయమూర్తి ... సస్పెన్షన్ ఉత్తర్వులు జారీ చేశారు. (ఈ 5.6.87)

**పురోగతి** వి. *puroogati* (అభివృద్ధి దశలో) ముందుకు సాగటం progress జాతి పురోగతికి అవరోధంగా పరిణమించిన అవినీతి ఆశ్రిత పక్షపాతాల నిర్మూలనకు యువకులు ఉద్యమించాలని ఉద్బోధించారు. (ఆం జ్యో. 16.8.87)

**పురోగమించు** క్రి. *puroogamincu* లక్ష్యం వైపు ముందుకు సాగు to move forward ఈ రోజున శ్రామికవర్గం ఆత్మపరిశీలనా, విమర్శలతో తమ ఉద్యమాన్ని సింహావలోకనం చేసుకుని లోటుపాట్లను సరిదిద్దుకొని పురోగమించాలనే ఆదర్శం తెరమరుగై పోయింది. (ఆం. ప్ర 1.5.89)

**పుష్కరం** వి. *puSkaram* పన్నెండు సంవత్సరాల కాలం a period of twelve years రాజేంద్ర ప్రసాద్ పదవిలో ఉన్న పుష్కరం పాటు తప్పనిసరిగా దక్షిణాది రాష్ట్రాలలో పర్యటించేవారు. (ఆం భూ 17.8.89)

**పుష్కలం** వి. *puSkalam* ఇబ్బడిముబ్బడిగా లభించటం abundance ... ఈ ప్రాజెక్టు సాంతం పూర్తయితే మొత్తం 3లక్షల ఎకరాలకు సాగునీరు లభించి వ్యవసాయం పుష్కలం కాగలదని రాజీవ్‌కు రామారావు వివరించారు. (ఈ. 28.1.88)

**పూచీ** వి. *puucii* బాధ్యతతో కూడిన హామీ undertaking నిజాయితీగా, నిస్వార్థంగా పన్నులు కడతామని వాణిజ్యం పారిశ్రామిక మండలులు పూచీ ఇస్తే ప్రభుత్వం రాయితీలు ఇస్తుంది

**పూచీకత్తు** వి. *puucikattu* నిందితులను వదలిన తర్వాత శాసనబద్ధులై ఉంటారని కోర్టులో జామీను ఇప్పించేవాళ్ళు ఇచ్చే హామీ పత్రం surety ఇద్దరు వ్యక్తుల పూచీకత్తుతో పాటు ఐదువేల రూపాయల బాండ్ తదితర ఆంక్షలు విధించి జామీను ఇచ్చారు. (ఈ 3.5.89)

**పూనుకొను** క్రి. *puunukonu* (పనిగట్టుకొని) ఒకపని చేయటానికి ఉపక్రమించు to indulge ఇంతకుముందు తీసుకున్న చర్యలను దెబ్బతీసే చర్యలకు ఏ దేశమైన పూనుకుందా అన్న విషయాన్ని కూడా పరిశీలించాలన్నారు. (ఆం ప. 16.10.87)

**పూర్ణకుంభ స్వాగతం** వి. *puurNakumbha swagatam* ఆలయాలలో

దేవాలయ సంప్రదాయాలతో ప్రముఖు లకు ఎదురేగి పలికే ఆహ్వానం a welcome given to important persons at Indian Temples with Temple honours *భారత బాలికలు గోర్బచెవ్‌కు సౌభాగ్యానికి చిహ్నమైన 'పూర్ణకుంభం'తో స్వాగతమిచ్చారు.* (ఆం జ్యో 4.7.87)

**పూర్తిబెంచి** వి. *puurtibenci* చూ. ఫుల్ బెంచి *ప్రధాన న్యాయమూర్తి శ్రీ యోగేశ్వర దయాళ్ ప్రభృతులతో కూడిన పూర్తిబెంచి ఇప్పుడు కోవారెంటో రిట్‌ను స్వీకరించినం దున మళ్ళీ విషయం చర్చనీయాంశమైంద న్నారు.* (ఆం. ప్ర. 5 7 89)

**పూర్తిస్థాయి** వి. *puurtisthaayi* లోటు పాట్లులేని సంపూర్ణ స్థితి full-scale *కాలయాపన చేయడం ధ్యేయంగా కనిపి స్తుందని, పార్లమెంటులో పూర్తిస్థాయి చర్చ జరగాలని శ్రీ జైపాల్ అన్నారు.* (ఆం ప్ర. 6.6 87)

**పూర్వభూమిక** వి. *puurvabhuumika* (ఒక సంఘటనకు) ముందుగా జరిగిన సంబంధిత విషయాల మొత్తం; నేపథ్యం background *1947లో తొట్టతొలిసా రిగా ఢిల్లీలో ఆసియా సంబంధాలపై మహా సభ జరగడానికిది పూర్వభూమిక.* (విశా 6.10.87)

**పూర్వాపరాలు** వి. (బ.వ.) *puurvaaparaalu* (ఒక సంఘటనకు) ముందు తర్వాత జరిగిన సంబంధిత విష యాలు related incidents which happen before and after an episode *సంఘటన పూర్వాపరాలు వివ రిస్తూ గతనెల 31వ తేదీన ఇద్దరు వైశ్యుల కుటుంబాల ఇళ్ళను నక్సలెట్లు దోచుకున్నా రని ఆయన చెప్పారు.* (ఆం. భూ. 3.2.89)

**పూర్వాదాన జామీను** వి. *puurvaadaana jaamiinu* అరెస్టు చేస్తారని ఊహించి ముందుగానే తెచ్చుకునే బెయిలు; ముందస్తు బెయిలు anticipatory bail *ఎక్స్‌ప్రెస్ గ్రూప్ వార్తాపత్రికల ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ శ్రీ వివేక్ ఖైతాన్‌కు మంజూరు అయిన పూర్వాదాన జామీనును బొంబాయి హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ డి. ఎన్. మెహతా బుధవారంనాడు ఖరారు చేశారు.* (ఆం. భూ. 3.9 87)

**పెండింగు** వి. *penDingu* అంతిమ నిర్ణయం తీసుకోని లేదా పరిష్కారం చెప్పని స్థితి pending *యూనియన్ కార్బైడ్‌పై భారత ప్రభుత్వం వేసిన కేసు విచారణ జిల్లా కోర్టులో గత ఏడాదికాలంగా పెండింగులో ఉంది.* (ఆం. ప. 18.9.87)

**పెంపొందు** క్రి. *pempondu* బలపడు to be strengthened *తమిళపులులు ఈసారైనా తమవద్దగల ఆయుధాలన్నిటినీ అప్పజెప్పితే జాఫ్నా ద్వీపకల్పం సుస్థిర శాంతిని పొందే అవకాశాలు పెంపొందు తాయి.* (ఆం. ప్ర 15 10.87)

**పెచ్చరిల్లు** క్రి. *peccarillu* మితిలేకుండా పెరిగిపోవు to erupt, break out *శ్రీలంకలో హింస మళ్ళీ పెచ్చరిల్లింది.* (ఈ. 15 5 89)

**పెచ్చుపెరుగు** క్రి. *peccuperugu* అతిగా పెరిగిపోవు to be on high rise *గత 15 రోజులుగా ఈ ప్రాంతంలో నక్సలైట్ల కార్యకలాపాలు పెచ్చుపెరగడంతో పోలీసులు సామాన్య ప్రజలను పట్టుకొని చిత్రహింసలకు గురిచేస్తూ విద్యుత్ సరఫరా నిలిపివేస్తు న్నారు.* (ఆం ప్ర. 10 12 87)

**పెచ్చుమీరు** క్రి. *peccumiiru* అవధులు

దాటి పెరుగు to cross the limit తెలుగుదేశం ప్రభుత్వం హయాంలో కుల తత్వం పెచ్చుమీరిందని ఆయన విమర్శిం చారు. (ఈ 22 5 89)

పెట్టు క్రి. *peTTu* అమలు చేయు, విధించు, ప్రకటించు to declare, impose అదే విధంగా రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన పెట్టాలని డిమాండ్ చేయటం కూడా సి. పి. ఐకి నచ్చలేదు. (ఈ 6 3 88)

పెట్రోలింగ్ వి. *peTrooling* శాంతి భద్ర తల రక్షణకు పోలీసులు ఏదైనా ఒక ప్రాంతంలో (వాహనాలలో) సాయుధులై తిరుగుతూ పరిశీలించటం patrolling కాశ్మీరు దక్షిణ ప్రాంతంలోని అనంతనాగ్ పట్టణంలో సి.ఆర్.పి.ఎఫ్. పెట్రోలింగ్‌పై వేర్పాటు వాదులు చేతి బాంబులు విసర టంతో నలుగురు జవాన్లతో సహా ఆరుగురు గాయపడ్డారు. (ఆం భూ 7 8 89)

పెడచెవిన పెట్టు క్రి. *peDacevinapeTTu* (ఇతరుల సూచనలను) వినకుండాపోవు, నిర్లక్ష్యం చేయు to turn a deaf ear పంజాబ్ సమస్యపై అఖిలపక్ష సమావేశం జర పాలన్న ప్రతిపాదనను కూడా కేంద్రం పెడ చెవినపెట్టడం దేశప్రజల దురదృష్టం. (ఆం. భూ 25.5.89)

పెడదారి పట్టించు క్రి. *peDadaari paT-Tincu* తప్పుడు సమాచారం ఇచ్చు; పొరబాటు అవగాహనను కలిగించు to mislead or misguide ముఖ్యమంత్రి ఆర్టీసీ బస్సు ఛార్జీల పెంపుదల విషయంలో తప్పుడు సమాచారం ఇచ్చి ప్రజల్ని పెడదారి పట్టిస్తున్నాడని వారు ఆరోపించారు. (ఈ 11.6 89)

పెడసరం వి. *peDasaram* (గౌరవం లేకుండా) నిర్లక్ష్యంతో కూడిన ధోరణి recklessness తాము వారిని మంద లిస్తే ద్వారం వద్ద ఏమి రాసి వున్నదో చదువుకోమంటూ పెడసరంగా బదులు చెప్పి దిగిపోతున్నారని వారన్నారు. (ఆం ప 15.6.87)

పెత్తందారీ పోకడ వి. *pettandaarii pookaDa* శక్తిమంతమైన ఒక ప్రభుత్వం ఇతర ప్రభుత్వాలపై అధికారం చెలాయించే ధోరణి hegemony నేపాల్-శ్రీలంక సమస్యల పరిష్కారంలో తమదేశం పెత్తం దారీ పోకడలనెంత మాత్రం అవలంబించడం లేదని ప్రకటించారు. (ఈ 18.7.89)

పెత్తనం వి. *pettanam* రాజకీయ, ఆర్థిక పరమైన నియంత్రణ; అజమాయిషీ control ఆసియా పసిఫిక్ ప్రాంతంలో గాని, ప్రపంచంలోని మరే ఇతర ప్రాంతం పైనగానీ పెత్తనం మాదంటే మాదని ఏ ఒక్కరూ వివాదానికి దిగరాదని ప్రకటించారు. (ఈ 19 5 89)

పెదవివిరుచు క్రి. *pedavivirucu* (ముఖ కవళికల ద్వారా) అసం తృప్తిని వ్యక్తంచేయు to express dissatisfaction రాష్ట్ర బడ్జెట్ సమా వేశం పూర్తి అయిన వెంటనే సమీక్షించిన ప్రతి పక్షనాయకులంతా పెదవి విరిచారు. (ఆం. భూ. 20 4 89)

పెద్దఎత్తున క్రి.విశే. *peddaettuna* ఎక్కువ పరిమాణంలో; భారీగా on large scale ప్రజాస్వామ్య సంస్కరణ లను కోరుతూ విద్యార్థులు పెద్దఎత్తున జరు పుతున్న ఆందోళన విషయం చర్చకు రాలేదని తెలిపారు. (ఆం భూ 17 5 89)

పెద్దపీటవేయు క్రి. *peddapiiTaveeyu* అధిక ప్రాముఖ్యం ఇచ్చు to give top priority or prominence జాతీ

యస్థాయిలో చేపట్టిన అయిదు సాంకేతిక ఉద్యమాల్లో మంచినీటి సరఫరా ఉద్యమానికి పెద్దపీటవేశామని ... (ఆం జ్యో 15 10.88)

పెద్దపెట్టున క్రి.విశే. *peddapeTTuna* చాల ఎక్కువ స్థాయిలో; తీవ్రంగా vehemently సభలో ప్రతిపక్ష సభ్యులు పెద్ద పెట్టున నిరసన తెలిపారు. (ఈ. 10 12.87)

పెద్దమనుషుల ఒడంబడిక వి. *peddamanuSula oDambaDika* ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడినప్పుడు అందులో భాగంగా తెలంగాణాను చేర్చేందుకు అంగీకరిస్తూ, తెలంగాణా అభివృద్ధి గురించి కొన్ని రక్షణలు ఏర్పాటుచేస్తూ ముఖ్య నాయకుల మధ్య కుదిరిన ఒప్పందం gentlemen's agreement గత 36 సంవత్సరాలుగా పెద్దమనుషుల ఒడంబడికతో సహా తెలంగాణా అభివృద్ధికి సంబంధించిన అనేక అంశాలు కాగితాలకే పరిమితమయ్యాయని ఆరోపించారు. (ఆం ప్ర 14 2 89)

పెన్‌డౌన్ స్ట్రైక్ వి. *penDaun sTraik* కార్యాలయాలలో ఉద్యోగులు పని ముట్టుకోకపోవటం ద్వారా తెలిపే నిరసన pen down strike మున్సిపల్ వైస్-ఛైర్మన్ సిబ్బంది పట్ల అనుచితంగా ప్రవర్తించినందుకు నిరసనగా ఉద్యోగులంతా పెన్‌డౌన్‌స్ట్రైక్ చేస్తున్నారు. (ఆం. ప్ర 17.3 86)

పెనాల్టీ పరుగు వి. *penaalTii parugu* (క్రికెట్ ఆటలో) ఒక జట్టు నియమ నిబంధనలను పాటించనందుకు ఎదుటి టీముకు బోనస్‌గా ఇచ్చే పరుగు penalty run గోవా ఐదు ఓవర్లు తక్కువగా వేసినందుకు పెనాల్టీ పరుగులు లభించడంతో ఆంధ్రకు గోవాపై మొదటి ఇన్నింగ్స్‌లో 23 పరుగుల ఆధిక్యత లభించింది. (ఆం. భూ. 14.12.87)

పెనాల్టీ స్ట్రోకు వి. *penaalTii sTrook* (హాకీ ఆటలో) ఒక టీము వాళ్ళు ఎక్కువగా ఫౌల్ చేసినప్పుడు దానికి శిక్షగా ఎదుటి టీముకు నేరుగా గోలు చేయడానికి ఇచ్చే అవకాశం (ఒక్క గోల్ కీపర్ మాత్రమే దాన్ని అడ్డుకోడానికి వీలుంటుంది.) penalty stroke మ్యాచ్ ప్రథమార్థంలో నరేష్ కుమార్ పెనాల్టీ స్ట్రోకును గోల్‌గా మలిచి జట్టుకు ఆధిక్యత తెచ్చిపెట్టాడు. (ఆం ప్ర. 29.7 89)

పెనుగులాట వి. *penugulaaTa* అధికారం లేదా ఆధిపత్యంకోసం వ్యక్తులు పడే ఘర్షణ struggle (for power or supremacy) అగ్రనాయకులిద్దరు పార్టీపై ఆధిపత్యంకోసం పెనుగులాట ప్రారంభించవచ్చు (ఆం భూ. 20 6 87)

పెనుదుమారం వి. *penudumaaram* ఒక సమస్యపై చెలరేగిన తీవ్రమైన వివాదం furore, serious criticism కుంభకోణాలు, కఠోర వాస్తవాలు రచ్చకెక్కిన ప్రతిసారీ ప్రభుత్వపక్షాన్ని సంకటం నుంచి తప్పించడానికి లోక్‌సభ స్పీకర్ శ్రీ బలరాంజక్కర్ చక్రం అడ్డువేస్తున్న తీరువల్ల, గౌరవనీయ సభాపతి నిష్పాక్షికత, రాజ్యాంగ నిబద్ధతలపై ఇప్పటికే కావలసినంత పెనుదుమారం రేగింది. (ఈ. 10 5 89)

పెనుభారం వి. *penubhaaram* భరించడానికి కష్టం అనిపించేంత ఎక్కువ బరువు heavy burden (financial) ఏటేటా శనిలా ముంచుకొస్తున్న ఈ ప్రకృతి వైపరీత్యంవల్ల వందలాది కోట్లరూపాయల ఆస్తి వరదలపాలవుతూ ప్రజలపై పెనుభారం పడుతోంది. (ఈ 29 7 89)

పెనుమార్పు వి. *penumaarpu* పెద్ద స్థాయిలో తేడా serious change

మల్‌హర్‌రావును నక్సలైట్లు కిడ్నాప్ చేసి, చంపేసిన దరిమిలా కరీంనగర్ జిల్లా 'తెలుగుదేశం' పార్టీలో పెనుమార్పులు వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి. (ఈ. 12 6 89)

పెనుముప్పు వి. *penumuppu* చాల ప్రమాదకరమైన పరిస్థితి serious danger జాతి వ్యతిరేక శక్తులు తిరిగి ఏకమవుతూ కాశ్మీర్‌లోని కొన్ని ప్రాంతాల్లో ప్రజల ప్రాణాలకు ఆస్తులకు పెనుముప్పుగా పరిణమిస్తున్న తరుణాన ... (ఈ 29 8 89)

పెరిస్త్రోయికా వి *peristrooyikaa* సోవియట్ సమాజ పునర్నిర్మాణంకోసం ఆ దేశాధినేత గోర్బచేవ్ ప్రవేశపెట్టిన సంస్కరణ విధానం peristroika పెరిస్త్రోయికా భారత్-సోవియట్ సినీరంగంలో కూడా ప్రవేశించింది. (ఆం భూ 18 7 89)

పెరోల్ వి. *perool* అత్యవసరమైన వ్యక్తిగత కారణాలపై కొంతకాలం జైలునుంచి విడుదలయ్యే సమయంలో తాను తప్పించుకుపోననీ, ఇతర నేరాలకు పాల్పడననీ ఖైదీ ఇచ్చేహామీ parole హబీబ్ రెండేళ్ళకు పైగా జైలుశిక్ష అనుభవించాడు. ఇంతలో ఆయన తండ్రి ఆరోగ్యం సరిగాలేని కారణంగా పెరోల్‌పై విడుదలైనాడు. (ఆం. భూ. 3.5.89)

పెర్మనెంటగు క్రి. *permanenTagu* (సంస్థలో) పూర్తికాలం ఉద్యోగిస్థాయిని పొందు to become permanent (as an employee) రోల్ కార్మికులుగా పనిచేస్తున్న వ్యక్తుల్లో కొందరు తప్పుడు సర్టిఫికెట్లు దాఖలుచేసి పెర్మనెంటయ్యారని తెలిసింది. (ఆం ప 20 9 87)

పెర్సంటేజీ వి. *persanTeeju* ప్రభుత్వం నుంచి మంజూరయిన డబ్బులో వందకు ఇంత చొప్పున కాంట్రాక్టర్లు అధికారులకు ముట్టజెప్పే మామూలు (లంచం) certain percentage of the contract amount offered by the contractors to the officials concerned as a bribe ఇంజనీర్లు తప్పుడు ధృవీకరణలు చేసి తద్వారా సంబంధిత కాంట్రాక్టర్లకు ఎక్కువ మొత్తంలో నిధులు ముట్టజెప్పి అందులో పెర్సంటేజీ రూపంలో కొంత తీసుకుంటారనే ఆరోపణ ఉన్నాయి. (ఆం ప 20 9 87)

పెల్లుబుకు క్రి. *pellubuku* ఒక్కసారిగా పైకి ఎగదన్నుకొని వచ్చు to erupt ప్రజాస్వామ్య వికేంద్రీకరణ మీద మక్కువే ప్రధాని ప్రస్తుతం పంచాయితీరాజ్ వ్యవస్థ పట్ల ప్రేమ పెల్లుబకడానికి ప్రేరణ అంటే నమ్మశక్యంకాదు. (ఈ 3 5 89)

పెవిలియన్ వి. *peviliyan* క్రికెట్ ఆటగాళ్ళు విశ్రాంతిగా కూర్చోడానికి మైదానం పక్కనే కట్టిన భవనం pavilion హెయిన్స్ ఒక్క పరుగు కూడా చేయకముందే అరడజను మంది తోటి ఆటగాళ్ళు పెవిలియన్‌కు వెళ్ళిపోయారు. (ఆం జ్యో 27 11 87)

పేకమేడ వి *peekameeDa* పునాదిబలం, గోడలబలంలేని భవంతి; అట్టముక్కలతో కట్టిన ఇల్లు house of cards ఈనాడు మనదేశంలోని ప్రతిపక్షాలను ఆయన విమర్శించారు. ఇవి సమీప భవిష్యత్తులో పేకమేడలా కూలిపోవడం అనివార్యమని ఆయన అభిప్రాయపడ్డారు. (ఆం భూ 2.5 89)

పేచీ వి *peecii* ఇరుపక్షాల మధ్య వివాదంతో కూడిన తగాదా controversy, contention తమ రెండు దేశాల మధ్య గతంలో తలెత్తిన విభేదాలు, పేచీలపట్ల ఉభయులూ తీవ్రవిచారాన్ని వ్యక్తం చేస్తూ ... (ఆం. భూ 16 5 89)

పేరుకుపోవు క్రి. *peerukupoovu* ఒక చోట పోగుపడు to pile up దీనికి తోడు ఆ మిల్లులు తమ మొత్తం ఉత్పత్తిని విక్రయించలేక పోవడంతో నిల్వలు పేరుకు పోతున్నాయి. (విశా 12.10.87)

పేరుపొందు క్రి. *peerupondu* ప్రఖ్యాతిని సంపాదించు to be wellknown, famous 30 హెచ్. పి. ల కన్నా తక్కువ సామర్థ్యంగల ట్రాక్టర్ల తయారీలో ఐషర్ తిరుగులేనిదిగా పేరుపొందింది. (ఆం. జ్యో 18.12.87)

పేర్కొను క్రి. *peerkonu* ప్రత్యేకంగా ప్రస్తావించు; తెలుపు to mention రాష్ట్రాల యొక్క కలయికే కేంద్రం అని రాజ్యాంగంలో స్పష్టంగా పేర్కొన్నారని ... (ఈ. 22.4.88)

పేల్చివేయు క్రి. *peelciveeyu* (పేలుడు పదార్థాలు ఉపయోగించి ధ్వంసం చేయు to blast తీవ్రవాదులు వావునియా జిల్లాలో వంద అడుగుల మేరకు రైలు పట్టాలను పేల్చివేశారు. (ఆం ప 9.6.87)

పేస్ •బౌలర్ వి. *pees baular* వేగంగా పరిగెత్తి బంతులు విసిరే బౌలర్ (స్పిన్నర్ బౌలింగ్ చేసే విధానానికి భిన్నం) pace-bowler భారత పేస్ బౌలర్లు ఈ రోజు పాక్ బ్యాట్స్‌మెన్‌ను ముప్పతిప్పలు పెట్టారు. (ఈ. 12.12.89)

పైచేయి వి. *paiceeyi* ఆధిక్యంలో ఉన్న స్థితి upper hand, advantage సంపాదనలో స్టైఫీదే పైచేయి. (ఆం. జ్యో. 11.6.87)

పైరవీ వి. *pairavii* పాలనా విషయాలలో తమకు అనుకూలమైన నిర్ణయాలు జరిగేందుకు ప్రముఖుల ద్వారా ఒత్తిడి తేవటం practice of resorting to pressurising people in important positions to get decisions made in one's own favour without any regard to the procedures ముఖ్యంగా పైరవీలు చేసేవారికి ఏ పదవీ ఇవ్వకూడదని ముఖ్యమంత్రి పట్టుదలగా ఉన్నారు. (ఉ. 9.6.87)

పైరవీకారుడు వి *pairaviikaaruDu* అధికార వర్గాల ప్రాపకంతో తనకు లేదా తన వాళ్ళకు అనుకూలంగా పనులు చేయించే వాడు political broker, middle man పంచాయితీరాజ్ సంస్థలను నిర్వీర్యం చేస్తున్న స్వార్థశక్తులతోను, రాజకీయ పైరవీ కారులతోను నిరంతర పోరాటాన్ని కొనసాగిస్తాం అని ప్రకటించారు. (ఈ 11.5.89)

పైలట్ ప్రాజెక్టు వి. *pailaT praajekTu* ఏదైనా కార్యక్రమాన్ని పూర్తిస్థాయిలో అమలు చేయడానికి ముందుగా కొద్దిగా పరీక్షించి చూడడానికి ఉద్దేశించిన పథకం; ప్రయోగాత్మక పరిశీలన pilot project వయోజనవిద్యాశాఖ ఆధ్వర్యంలో పైలట్ ప్రాజెక్టు కింద ప్రతిమండలంలోనూ 'ఆదర్శ గ్రామం' పథకాన్ని ఈ నెల 15 నుంచి ప్రారంభించనున్నట్లు తెలిపారు. (ఆం ప్ర 4.5.89)

పొంగిపొర్లు క్రి. *pongiporlu* (నీరు) పూర్తిగా నిండిపోయి, బయటకు ప్రవహించు to overflow పొంగిపొరలే మురుగునీటి కాల్వల వల్ల, పగిలిన మంచినీటి పైపులవల్ల జంట నగరాలరోడ్లు చెడిపోయే పరిస్థితి ఏర్పడిందని ఆందోళన వ్యక్తంచేశారు. (ఈ 19.5.89)

పొంచి ఉండు క్రి. *ponci unDu* (హఠాత్తుగా దాడి చేసేందుకు) చాటున దాగి ఉండు to hide behind sth. పాలా

లలో చొప్పగూళ్ళ మాటున పొంచి వున్న దుండగులు దాడి జరపటంతో ఆయన అక్కడికక్కడే మరణించారు (ఆం జ్యో 3 3 88)

**పొందుపరచు** క్రి. *ponduparacu* (ముఖ్యమైన పత్రాలలో) ఒక విషయాన్ని చేర్చు to incorporate తర్వాత మూడేండ్లకు తుదిరూపం యిచ్చి అమల్లోకి వచ్చిన భారత రాజ్యాంగంలో పొందుపరచిన శాంతి, వలస వ్యతిరేక, సహకార, సహజీవన సూత్రాలకే మహాసభ ఉత్తేజకరమైన నేపథ్యం. (విశా 6 10 87)

**పొట్టనపెట్టుకొను** క్రి. *poTTanapeTTukonu* నిర్దాక్షిణ్యంగా చంపు, చావుకు కారణమగు to kill తీవ్రవాదులు నేడు ఒక శక్తివంతమైన బాంబు పేల్చి నలుగురు పోలీసులను పొట్టనపెట్టుకున్నారు (ఆం ప్ర 24 4.89)

**పొడచూపు** క్రి *poDacuupu* (కొత్తగా) ఏర్పడు to arise, appear ఈ మార్పులు చేసిన తర్వాత జిల్లా పార్టీ నాయకులకు శ్రీ శివారెడ్డితో అభిప్రాయ భేదాలు పొడచూపాయి. (ఆం ప్ర 29 11 87)

**పొడిగించు** క్రి *poDigincu* (కాలపరిమితిని) హెచ్చించు to extend (time) నేటి కార్యక్రమాల గడువు ముగిసిన తరువాత మూడుసార్లు సభ సమయాన్ని పొడిగించారు. (ఆం ప్ర 22 4 89)

**పొత్తు** వి. *pottu* రాజకీయ పార్టీల మధ్య సహకారం alliance (among political parties) తమిళనాడులో ఎన్నికల నిర్వహణకి ప్రకటన వెలువడేలోగా కాంగ్రెస్(ఐ)తో తమ పార్టీ పొత్తుగురించి తుది నిర్ణయాలు తీసుకోవడం జరుగుతుందని ఆయన పేర్కొన్నారు. (ఆం. జ్యో 9 10 88)

**పొదుపు చర్య** వి. *podupu carya* ప్రభుత్వ నిర్వహణలో ఖర్చులను తగ్గించడానికి ఉద్దేశించిన పని economy measure ప్రణాళికేతర వ్యయంపైన అదుపు విధిస్తూ కొత్తగా తీసుకోదలచిన పొదుపు చర్యలను రాష్ట్ర మంత్రి మండలి ఆమోద ముద్ర పొందేందుకు వీలుగా ... (ఉ 13 4 88)

**పొరుగుదేశం** వి *porugudeesam* ఒక దేశపు సరిహద్దును అనుకొని ఉన్న మరో దేశం neighbouring country పొరుగుదేశాలు ఆయుధ పాటవంలో పురోగమిస్తున్నప్పుడు భారతదేశమూ తదనుగుణంగా మార్గాను సరణం చేయకతప్పలేదు. (ఈ 24 5 89)

**పోకడ** వి. *pookaDa* ఆలోచన, ప్రవర్తనకు సంబంధించిన తీరు, ధోరణి attitude, trend ప్రైవేట్ స్కూళ్ళ యాజమాన్యం పోకడలను నియంత్రణ చేసి న్యాయ బద్ధంగా పంతుళ్ళకు జీతాలు అందేలా చేయాలి. (ఆం భూ 3.5 89)

**పోటాపోటీగా** క్రి.వి. *pooTaapooTiigaa* ఒకరికొకరు తీసిపోని విధంగా; సమఉజ్జీగా neck to neck, close రెండో అర్ధభాగంలో రెండు జట్లు పోటాపోటీగా ఆడాయి (ఈ 27.7 89)

**పోటీ** వి. *pooTii* (క్రీడలు, ఎన్నికలు వంటి కార్యక్రమాల్లో పాల్గొని) ఒకరిపై మరొకరు గెలుపు సాధించడానికి ప్రయత్నించటం tournament, contest, competition ఈ ఏడాది ఫెడరేషన్ కప్ పోటీలు టోక్యోలో అక్టోబరు ఒకటవ తేదీ నుంచి 8వ తేదీ వరకు జరుగుతాయి. (ఆం ప్ర 19 7 89)

**పోటీచేయు** క్రి. *pooTiiceeyu* ఎన్నికలలో అభ్యర్థిగా నిలబడు to contest (elections) కాంగ్రెస్(ఐ) అభ్యర్థిగా

మాజీ శాసన సభ్యుడు శ్రీ బి. ఆర్. దొరై స్వామి నాయుడు పోటీచేస్తున్నారు. (ఆం ప్ర. 31 10 89)

**పోటీతత్వం** వి. *pooTiitatvam* ఒకర్ని ఒకరు అధిగమించాలన్న పట్టుదల competitive spirit భారతీయ పారిశ్రామిక రంగంలో సరళీకృత విధానం కొనసాగుతుందని, అలాగే పోటీతత్వాన్ని కూడా కొనసాగిస్తామని పరిశ్రమలమంత్రి చెప్పారు. (ఈ 26.5.89)

**పోటీపడు** క్రి. *pooTiipaDu* ఏదైనా ఒక పనిని సాధించడంకోసం లేదా ఫలితం పొందడంలో తన ప్రత్యర్థి మీద విజయం సాధించాలని తీవ్రంగా ప్రయత్నించు to vie, compete జిల్లా పార్టీ అధ్యక్ష పదవికి పార్టీలోని గ్రూపులు పరస్పరం పోటీ పడుతుండడంతో పార్టీ నాయకుల మధ్య ఉన్న తీవ్ర విభేదాలు వెలుగులోకి వచ్చాయి (ఆం ప్ర. 29 11.87)

**పోడియం** వి. *pooDiyam* చట్టసభలలో, సభాధ్యక్షుని వేదిక podium అధికార పక్ష సభ్యులు 'పోడియం' దగ్గరకు ఎందుకు పోయారని, ప్రశ్నించగా, ప్రతిపక్షసభ్యులు అక్కడికి పోవటంవల్ల, సభాపతిని రక్షించడానికి వెళ్ళాం అని మంత్రి అన్నారు. (ఆం. ప్ర 12.8.87)

**పోడు వ్యవసాయం** వి. *pooDu vyavasaayam* ప్రతి ఏటా కొత్తచోట అడవి నరికి వ్యవసాయం చేయటం shift cultivation పొట్ట కూటికోసం గిరిజనులు చేసే పోడు వ్యవసాయాన్ని అరికడతానని అందుకు అవసరమైతే అసెంబ్లీలో బిల్లును ప్రవేశపెడతానని ... (ఆం భూ 2.10 87)

**పోరంబోకు భూమి** వి. *poorambooku bhuumi* ఎవరి హక్కుభుక్తంలోనూ లేని స్థలం waste land ముఖ్యమంత్రి పోరంబోకు భూములతో వ్యాపారం చేయదలచుకున్నారు అని విమర్శించారు. (ఆం. భూ 14 5 89)

**పోరాట పటిమ** వి. *pooraaTa paTima* సమస్యల్ని ప్రతికూలపరిస్థితుల్ని ఎదుర్కొనేశక్తి fighting spirit లాంటి ఒక ఇంటర్వ్యూలో "నాకు అమరనాథ్ పోరాట పటిమ అంటే చాల ఇష్టం ... " అన్నాడు. (ఆం. భూ. 20 4 89)

**పోర్టుఫోలియో** వి. *poorTufoolıyoo* (మంత్రులు నిర్వహించే) పరిపాలనాశాఖ portfolio ఆదివారం పదవీ ప్రమాణం స్వీకరించిన మంత్రుల పోర్టుఫోలియోలను ఇంకా ప్రకటించలేదు. (ఆం ప్ర 5 12 89)

**పోలగు** క్రి. *poolagu* ఎన్నికలలో ఓటర్లు తమ బ్యాలట్ పేపర్లను వినియోగించుకొను to be polled కొన్ని పోలింగ్ కేంద్రాల్లో ఐతే 75 శాతానికిపైగా ఓట్లు పోలయ్యాయి. (ఈ 18 6.87)

**పోలింగ్** వి. *poolıng* ఎన్నికలలో ఓటర్లు, ఎన్నికల కేంద్రాలకు వెళ్ళి ఓటు హక్కును వినియోగించుకోవటం polling ఉదయం ఏడు గంటల నుండి మధ్యాహ్నం మూడు గంటల వరకు పోలింగ్ జరుగుతుంది. (ఆం ప్ర. 16 6 87)

**పోలింగ్ అధికారి** వి. *pooling adhıkaarı* ఎన్నికల కేంద్రంలో, ఓటర్లకు బ్యాలట్ పేపర్లు ఇచ్చి ఎన్నికల్ని నిర్వహించే ప్రభుత్వోద్యోగి polling officer ఒక పోలింగ్ అధికారిని కూడా కడప జిల్లాలోనే చంపేశారు (ఈ. 23 11 89)

**పోలింగ్ ఏజెంట్** వి. *poolıng eejenT* ఎన్నికలలో పోటీ చేసే అభ్యర్థి తరపున, ఎన్నికల కేంద్రంలో కూర్చొనే పరిశీలకుడు

**polling agent** ఒక పార్టీకి చెందిన వారు, రెండవ పార్టీకి చెందిన పోలింగ్ ఏజెంట్‌ను అనుమతించడానికి నిరాకరించడం వల్ల రెండు పార్టీల మధ్య వివాదం తలెత్తింది. (ఆం ప్ర. 24 11 89)

**పోలింగ్ కేంద్రం** వి. *pooling keendram* ఎన్నికల రోజు ఓటర్లు వచ్చి తమ ఓటు హక్కు వినియోగించుకోటానికి ఏర్పాటు చేసిన స్థలం **polling booth** *కమలాపురంలోని ఒక పోలింగ్ కేంద్రంలోకి దుండగులు వెళ్ళి బ్యాలెట్ పెట్టెలో నీళ్ళు పోశారు.* (ఈ 23 11 89)

**పోలింగ్ బూత్** వి. *pooling buut* చూ. పోలింగ్ కేంద్రం. *రాష్ట్రంలో మొత్తం పన్నెండువేల పోలింగ్ బూతులను ఏర్పాటుచేశారు.* (ఈ 18.6 89)

**పోలిట్‌బ్యూరో** వి. *pooliTbyuuroo* రాజకీయ పా లలో (సాధారణంగా కమ్యూనిస్టు పా ) ముఖ్యనిర్ణయాలు చేసే కార్య నిర్వాహక బృందం **polit bureau** *ఈ వ్యవహారాన్ని పూర్తి పోలిట్‌బ్యూరోగాని, సెంట్రల్ కమిటీగాని పరిశీలించాల్సి ఉంటుందని స్థాయీ సంఘం తెలియజేసింది.* (ఈ 20 5 89)

**పోలీసు రాజ్యం** వి. *pooliisu raajyam* ప్రజాస్వామ్య పద్ధతుల ద్వారా కాకుండా, అణచివేత చర్యల ద్వారా సాగించే పరిపాలన **police state** *"ఇదే మిరాజ్యం, పోలీసు రాజ్యం" తమకు గిట్టని వారిని హింసించడం, వారిపట్ల దౌర్జన్యంగా వ్యవహరించడం పోలీసులకు పరిపాటి అయినట్లుగా కనిపిస్తున్నదని ... పేర్కొన్నారు.* (ఆం. ప్ర. 29 7.88)

**పోస్టుమార్టమ్** వి *poosTumaarTam* మృతదేహంపై వైద్య పరీక్షలు జరిపి, మరణానికి గల కారణాలను డాక్టర్లు నిర్ధారించటం **postmortem** *తిరుపతిరావు శవాన్ని పోస్టుమార్టం జరిపేందుకు జగిత్యాల ఎస్. ఐ, ముగ్గురు కానిస్టేబుళ్ళు, ఒక డాక్టరు, మరో ఇద్దరు సహాయకులు జీపులో వెళ్ళారు.* (ఆం ప్ర 2 9 89)

**పోస్టర్** వి. *poosTar* నినాదాలు, చిత్రాలతో కూడి ఉండి రాజకీయ, సామాజిక ప్రచారాలకు ఉపయోగించే పెద్ద ప్రచార పత్రం **poster** *హిత కౌన్సిల్‌కు డిసెంబర్ 13న జరిగే ఎన్నికల ప్రచార కార్యక్రమాల్లో భాగంగా వెలువడిన ఈ పోస్టర్లపై గూర్ఖా నేత శ్రీ సుభాష్ ఘీషింగ్ చేవ్రాలు ఉంది.* (ఆం జ్యో 2 12.88)

**పౌర జీవనం** వి. *paura jiivanam* సామాన్య ప్రజల దైనందిన జీవితం **civic life** *ఎక్కువ వేతనాలు ఇవ్వాలని, కార్మిక సంఘం హక్కులకోసం దేశవ్యాప్తంగా 20 లక్షలమంది కార్మికులు 24 గంటలపాటు సమ్మె పాటించారు పౌర జీవనం స్తంభించి పోయింది.* (ఆం ప్ర 6 7 89)

**పౌర పాలన** వి. *paura paalana* ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించే (సాధారణ ఎన్నికల ద్వారా వచ్చిన) ప్రభుత్వం నిర్వహించే పరిపాలన **civic rule** *ఫిజీలో జాతివైషమ్యాన్ని తొలగించి ప్రజాస్వామ్య పద్ధతిలో తిరిగి పౌర పాలనను ఏర్పాటు చేయాలని* ... (ఆం ప్ర 14 10 87)

**పౌరసత్వం** వి. *paurasatvam* ఒక దేశ ప్రజానీకంలో ఒకరిగా రాజ్యాంగపరమైన గుర్తింపు **citizenship** *పదిలక్షల డాలర్ల పెట్టుబడి పెట్టి, కనీసం రెండేళ్ళపాటు పదిమందికి ఉపాధి కల్పించగలిగితే అయిదేళ్ళలో పౌరసత్వం ఇచ్చివేయాలని ఆ బిల్లు సూచిస్తున్నది.* (ఆం ప్ర 26 7 89)

**పౌర సరఫరా** వి. *paura sarafaraa*

ప్రజలకు ప్రభుత్వ అజమాయిషీలో నిత్యావసర వస్తువులను (పంచదార, కిరోసిన్, బియ్యం మొ.) అందజేయటం public distribution of essential commodities *పామోలిన్ ఆయిల్ కుంభకోణాలకు సంబంధించి కరీంనగర్ జిల్లా పౌర సరఫరా అధికారిని సస్పెండ్ చేశారని తెలిసింది.* (ఉ. 2.7.87)

**పౌష్టికాహారం** వి. *pauSTikaa-haaram* మానవ శరీరానికి కావలసిన పోషక విలువలు సరైన పాళ్ళలో ఉన్న భోజనం nutritious food, balanced diet *సార్క్ దేశాలలో 100 కోట్ల ప్రజలు నిరక్షరాస్యులు, పౌష్టికాహారం లోపించినవారని ... డాక్టర్ హాక్ తెలిపారు.* (ఉ 16.4.88)

**ప్రకటన** వి. *prakaTana* అధికార పూర్వకంగా వెల్లడించే విషయం announcement, statement, declaration *ఎన్నికల ప్రకటన అనంతరం ఇలాంటి సంఘటన జరగడం ఇదే ప్రథమం.* (ఆం ప్ర 15.11.89)

**ప్రకటించు** క్రి. *prakaTincu* అధికారికంగా ఒక విషయాన్ని వెల్లడించు to declare or announce *స్పీకర్ బలరామ్ జక్కర్ నేటి రాజీనామాలను ఆమోదించారని డిప్యూటీ స్పీకర్ తంబిదురై సభలో ప్రకటించారు.* (ఈ 27.7.89)

**ప్రకృతి వైపరీత్యం** వి. *prakRti vaipari-tyam* తుఫానులు, వరదలు, వర్షాభావం వంటి వాటివల్ల కలిగే భారీ నష్టం natural calamity *ప్రకృతి వైపరీత్యాలు సంభవించినపుడు పంట రుణాల వడ్డీని రద్దుచేసి సాలు మొత్తానికి వాయిదాల సౌకర్యం కల్పించాలని సభ కోరింది.* (ఈ 1.5.89)

**ప్రక్షాళన** వి. *prakSaaLana* ఒక వ్యవస్థలోని లొసుగులను, లోటుపాట్లను పూర్తిగా తొలగించటం cleansing or purifying (sth) *చైనా కమ్యూనిస్టు పార్టీలో అవినీతి ప్రక్షాళన కార్యక్రమాన్ని చేపట్టడం ద్వారా పలుకుబడిని పునరుద్ధరించుకునే యత్నాలు చేపట్టారు.* (ఆం భూ 3.7.89)

**ప్రగతినిరోధకం** వి. *pragatiniroodh-akam* సామాజికంగా ముందడుగు వేయడానికి ఆటంకమైనది reactionary, anti - progressive *ప్రగతినిరోధక శక్తులు తెచ్చే ముప్పు వామ పక్షాలు గుర్తించకపోవడం విచారకరమని ఆయన అన్నారు.* (ఉ 24.4.88)

**ప్రగతిపథం** వి. *pragatipatham* ప్రజా జీవన విధానంలో ముందడుగు వేసే మార్గం, అభ్యుదయ మార్గం progressive path *రాష్ట్రాన్ని ప్రగతిపథంలో నడిపించడమే తమ పార్టీ లక్ష్యమని వారన్నారు.* (ఈ 8.5.89)

**ప్రగతిశీలక బిల్లు** వి. *pragatiśiilaka billu* సమాజాభివృద్ధికి దోహదం చేసే అంశాలతో కూడిన చట్టపు ముసాయిదా progressive bill *ఆర్. ఎస్. పి. ల ధోరణి నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది అని శ్రీ రాజీవ్ గాంధీ అన్నారు. ఇటువంటి ప్రగతిశీలక బిల్లును లోక్‌సభలో ప్రతిపక్షాలు వ్యతిరేకించడం ఇదే మొదటిసారి కాదని ఆయన అన్నారు.* (ఈ 16.5.89)

**ప్రగతిశీల పార్టీ** వి. *pragatiśiila paarTii* సమాజాన్ని ముందుకు నడిపించే లక్ష్యాలు కలిగిన రాజకీయ పక్షం progressive party *కాంగ్రెస్, జనతాదళ్ పార్టీని భవిష్యత్తులో గుర్తిస్తే ఆ పార్టీని ఎదుర్కొనేందుకు తమ పార్టీ అన్ని ప్రగతి శీల పార్టీలతో పొత్తు*

కుదుర్చుకుంటుందని ఆయన అన్నారు. (ఆం ప్ర 26.4 89)

ప్రగతిశీల ప్రత్యామ్నాయం వి. *pragatiśiila pratyaamnaayam* అభ్యుదయ లక్ష్యాలతో కూడి, ప్రస్తుత పాలక పక్షానికి దీటుగా నిలబడగలిగిన మరో రాజకీయ శక్తి progressive and democratic alternative *ప్రగతిశీల ప్రత్యామ్నాయమే భావికి బాట.* (వి. 8.6.87)

ప్రగాఢవాంఛ వి. *pragaadhavaancha* ఎంతో కాలంగా కోరుకున్న తీవ్రమైన లేదా బలమైన కోరిక cherished wish ... *నేపాల్‌తో పరస్పర ప్రయోజనకరమైన సంబంధాలు ఏర్పరచుకోవాలన్నది భారత ప్రగాఢ వాంఛ* అన్నారు. (ఈ 27.4 89)

ప్రగాఢ విశ్వాసం వి. *pragaadha viśvaasam* గట్టి నమ్మకం strong belief *కాంగ్రెస్, దేశం అభ్యర్థులిద్దరూ తమ విజయంపై ప్రగాఢ విశ్వాసాన్ని వ్యక్తం* చేస్తున్నారు. (ఈ. 8 11 89)

ప్రచార ఉద్యమ సంఘం వి. *pracaara udyama sangham* (రాజకీయ పక్ష విధానాల గురించి) దీక్షతో ప్రజలకు తెలియజేసేందుకు ఏర్పాటయిన కమిటీ publicity committee ... *17* మందితో నేరుగా ఒక ప్రచార ఉద్యమ సంఘాన్ని కూడా ఆయన ప్రకటించారు. (ఆం. ప్ర. 3.5.89)

ప్రచారం వి. *pracaaram* ఒక విషయం గురించి ఎక్కువ మంది ప్రజలకు తెలియజేయటం publicity *ఎంత చేసినా ప్రచారం ఉంటేనే తగిన ప్రాచుర్యం లభిస్తుంది* ... (ఈ 17.6 87)

ప్రచార మాధ్యమం వి. *pracaara maadhyamam* ప్రజలతో సంబంధాలు పెట్టుకునేందుకు, విధానాలను, ఇతర విషయాలను వారికి వివరించి చెప్పేందుకు అనువైన సమాచార సాధనం (రేడియో, టి.వి., సినిమా మొ.) mass media *సినిమాల ద్వారా ప్రజల్లో పలుకుబడి పెంచుకుని ముఖ్యమంత్రులయిన వాళ్ళు ఆ ప్రచార మాధ్యమాన్ని మరొకరు ఉపయోగించుకుంటే భరించలేరు.* (ఆం భూ. 20 6 87)

ప్రచార సప్తాహం వి. *pracaara saptaaham* ప్రజలకు రాజకీయాది విషయాలను దీక్షతో వివరించేందుకు ఉద్దేశించిన ఏడు రోజుల కార్యక్రమం publicity week (a programme spanning a week intended to explain about political and other issues) *రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న కార్మిక వ్యతిరేక విధానాలను నిరసిస్తూ 7 కోర్కెలతో ఈ నెల 24 నుండి 31 వరకు ప్రచార సప్తాహాన్ని పాటించాలని ఎ.ఐ.టి.యు.సి రాష్ట్ర సమితి నిర్ణయించింది.* (వి. 10 7 87)

ప్రచార సాధనం వి. *pracaara saadhanam* చూ. ప్రచార మాధ్యమం. *కాంగ్రెస్-ఐ ప్రచార సాధనాలుగా పనిచేస్తున్న ఆకాశవాణి, దూరదర్శన్‌ల కేంద్రాల ముందు జూన్ 26న దేశ వ్యాప్తంగా పికెటింగ్ చేయాలని* ... (ఈ. 25.5 89)

ప్రచ్ఛన్న యుద్ధం వి. *pracchanna yuddham* వ్యక్తులు, సంస్థలు లేదా దేశాల మధ్య బహిరంగం కాకుండా సాగే పోరాటం coldwar *ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశం ప్రభుత్వం, రాష్ట్ర గవర్నర్ మధ్య ప్రస్తుతం కొనసాగుతున్న 'ప్రచ్ఛన్న యుద్ధం' పార్లమెంట్ వేదికకు మారనున్నది.* (ఆం. భూ 9 2.88)

ప్రజా ఆసక్తి వివాదం వి. *prajaa aasakti vivaadam* జనం ప్రయోజనాలతో ముడి పడ్డ న్యాయ సంబంధమైన విషయం public interest litigation ... ఈ విషయం ఓ వైపు న్యాయవాద వృత్తికి, మరోవైపు చట్టాన్ని అమలు పరచాల్సిన పోలీసు శాఖకు మధ్య ఏర్పడ్డ ప్రజా ఆసక్తి వివాదంగా మారి పోయినట్లు కనిపిస్తున్నదని కూడా డివిజన్ బెంచ్ అభిప్రాయపడింది. (ఆం ప్ర 17.10 87)

ప్రజాఉద్యమం వి. *prajaaudyamam* ఒక లక్ష్య సాధన కోసం అధిక సంఖ్యలో జనం పాల్గొన్న పోరాటం mass struggle కేంద్రంలో ప్రభుత్వాన్ని గద్దె దించేందుకు తమ పార్టీ ప్రజా ఉద్యమాన్ని ప్రారంభిస్తున్న దని ... చెప్పారు. (వి. 25 6 87)

ప్రజాకర్షక నినాదం వి. *prajaakarSaka ninaadam* నాయకులు లేదా రాజకీయ పక్షాలు కేవలం జనాన్ని తమవైపు తిప్పు కొనేందుకు ఇచ్చే పిలుపు populist slogan ప్రజలను మోసం చేసేందుకు ప్రతిపక్షాలు ప్రజాకర్షకనినాదాలు చేస్తున్నా యని ఆయన పేర్కొన్నారు. (ఈ 20 7 87)

ప్రజాతంత్ర ఎన్నిక వి. *prajaa-tantra ennika* అధిక సంఖ్యాక ప్రజల అభిప్రాయం ప్రకారం ప్రభుత్వాన్ని ఏర్పర చేందుకు జరిపే ఎలక్షన్ democratic election ... ప్రజాతంత్ర ఎన్నికల ద్వారా వామ పక్ష ప్రభుత్వం ఏర్పడింది. (ఆం భూ 20 6.87)

ప్రజాతంత్రం వి. *prajaatantram* ప్రజల భాగస్వామ్యంతో ప్రజా ప్రయోజ నాల కోసం పనిచేసే రాజకీయ వ్యవస్థ democracy ప్రజాతంత్రం ముసుగులో పెత్తనం కోసం జరిగిన కుస్తీని చూసి దేశం యావత్తు సిగ్గుతో తలదించుకున్న క్షణం అది. (ఆం జ్యో. 29 1.88)

ప్రజాతంత్ర శక్తులు వి. (బ.వ.) *pra-jaatantra śaktulu* ప్రజాస్వామ్య లక్ష్యా లకోసం నిబద్ధమైన రాజకీయ, సామాజిక బృందాలు democratic forces నల్ల జాతి ప్రజలు, ప్రజాతంత్ర శక్తులు జాతి వెలి విధానంపై తమ పోరాటాన్ని ఉధృతం చేస్తుండడంతో ... (ప్ర శ 5 6.87)

ప్రజాన్యాయస్థానం వి *prajaanyaa-yasthaanam* జనమే న్యాయ నిర్ణే తలుగా తగువు తీర్చి మంచి చెడు లను నిర్ణయించే బహిరంగ పంచాయితీ people's court నేను నిరాహార-దీక్ష ప్రారంభించి రంగా హత్యాకేసులో వాస్తవా లను ప్రజాన్యాయస్థానం ముందు ఉంచాను. (ఆం ప్ర 26.1 89)

ప్రజాపంపిణీ వ్యవస్థ వి. *prajaa-pampiNii vyavastha* జనానికి చౌక ధరల దుకాణాల ద్వారా నిత్యావసర వస్తువులను కోటా ప్రకారం అంద జేసే పద్ధతి public distribution system ... విలేకరుల సమావేశంలో మాట్లాడుతూ ప్రజాపంపిణీ వ్యవస్థ ద్వారా పౌర సరఫరాల శాఖ సబ్సిడీ బియ్యం పంపిణీకి ... (ఉ 10 4 88)

ప్రజాపునాది వి. *prajaapunaadi* ఒక రాజకీయ పార్టీకి ఆ పార్టీ ఆశయాలకు నిబద్ధతతో కూడిన జనం మద్దతు mass base ... చంద్ర పుల్లారెడ్డి వర్గం తమతో విడిపోయిన తర్వాత ప్రజాపునాదులు కోల్పో యారని ... (ఆం ప్ర 18 9 87)

ప్రజాప్రతినిధి వి. *prajaapratinidhi* ఒక నిర్ణీత ప్రాంతంలో ప్రజాతంత్ర ఎన్నికల ద్వారా అధిక సంఖ్యాక

ప్రజలు తమ అభ్యర్థిగా ఎన్నుకున్న వ్యక్తి, చట్ట సభలో సభ్యుడు people's representative ప్రజాప్రతినిధులనే వారు ఎప్పుడూ సేవకులుగానే ఉంటారని, పదవులను ఆశించి సేవలు చేయరని ఆయన చెప్పారు. (ఆం ప్ర 21 2 89)

**ప్రజాప్రయోజన పిటిషన్** వి. *prajaaprayoojana pıTıSan* సామూహిక ఆసక్తిగల న్యాయపరమైన వివాద విచారణకై కోర్టులో దాఖలు చేసిన అర్జీ public interest litigation petition క్రికెటర్ల నిషేధాన్ని సవాలు చేస్తూ లాయర్ వినీల్ కుమార్ ప్రజాప్రయోజన పిటిషన్ దాఖలు చేసిన సంగతి తెలిసిందే. (ఈ 24 8.89)

**ప్రజాబంద్** వి. *prajaaband* జనం స్వచ్ఛందంగా పాటించిన హర్తాళ్ a hartal observed by people voluntarily ఆగష్టు 10వ తేదీన తమ పార్టీ నిర్వహించింది ప్రజాబంద్ కాగా ఆగష్టు 30వ రాష్ట్రంలో జరుగనున్నది సర్కార్‌బంద్ అని అభివర్ణించారు. (ఆం ప్ర 28 8 89)

**ప్రజారక్షణ సంఘం** వి. *prajaarakSaNa sangham* శాంతి భద్రతలు దెబ్బ తిన్నప్పుడు ప్రజల రక్షణ చూడటానికి వాళ్ళలో నుంచే కొందరిని ఎంపికచేసి ఏర్పాటు చేసిన కమిటీ peoples protection committee నక్సలైట్ల కార్యకలాపాలను అదుపు చేసేందుకంటూ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి రామారావు నేడు ప్రకటించిన దానిలో ప్రజారక్షణ సంఘాలు తప్ప కొత్తదనమేదీ లేదని ... (ఈ. 14 6 89)

**ప్రజావిజ్ఞప్తుల దినం** వి. *prajaavijnaptula dınam* ఆధికారిక బహిరంగ సభలలో జనం కష్టనష్టాలను గురించిన అర్జీలను మంత్రి సమక్షంలో స్వీకరించే రోజు a fixed date on which a minister accepts memoranda from the public in an open meeting ప్రజల దగ్గరికి వచ్చి వారి సమస్యలు పరిష్కరించే ఉద్దేశంతో ప్రజావిజ్ఞప్తుల దినం నిర్వహించినట్టు మంత్రి తెలిపారు (ఆం ప్ర 8 9 87)

**ప్రజావిశ్వాసం** వి. *prajaaviśvaasam* ప్రభుత్వ సమర్థతపై ప్రజలకున్న నమ్మకం confidence of the people ... ఈ ప్రభుత్వం ప్రజా విశ్వాసాన్ని కోల్పోయింది దీనికి అధికారంలో కొనసాగే హక్కు లేదు (ఆం ప్ర 25 7.89)

**ప్రజావెల్లువ** వి. *prajaavelluva* ప్రవాహంలా కదలి వచ్చిన జనం people's upsurge ఎర్షాద్ వ్యతిరేక ఆందోళన ప్రజావెల్లువగా పరిణమించిందని స్పష్టమైంది. (ఈ 30 11 87)

**ప్రజావేదిక** వి. *prajaaveedika* జనం ముందు బహిరంగంగా చర్చించేందుకు ఏర్పాటు చేసిన సభాస్థలి public platform ప్రజావేదికను కానీ, హైదరాబాద్ ప్రెస్ క్లబ్‌లో పత్రికా విలేకర్ల సమావేశం కానీ, ఏర్పాటు చేస్తే ఆయన సి.ఐ.ఏ 'ఏజెంటు' అని రుజువు చేస్తానని ... తెలిపారు (ఆం భూ 17.8.89)

**ప్రజాసంబంధాలు** వి. (బ.వ.) *prajaasambandhaalu* ప్రజలకు ప్రభుత్వానికి మధ్య సంబంధాలను చక్కగా నిర్వహించే వ్యవస్థ public relations మన సమాజంలో రోజురోజుకు ప్రజా సంబంధాల ప్రాముఖ్యత పెరుగుతున్నప్పటికీ, భారత దేశంలోని ఏ ప్రాంతీయ భాషలోనూ ప్రజాసంబంధాలకు సంబంధించిన ప్రామా

ణిక గ్రంథాలు వెలువడడం లేదు. (ఆం ప 15.10 87)

ప్రజాసదస్సు వి. *prajaasadassu* ప్రజల సమస్యల పరిష్కారానికి ప్రభుత్వం ఏర్పాటు చేసే సమావేశం public meeting కడప, అనంతపురం జిల్లాల్లో తాను నిర్వహించిన ప్రజాసదస్సులు బ్రహ్మాండంగా జరిగాయని అన్నారు. (ఈ. 19.9.87)

ప్రజాసేవకుడు వి. *prajaaseevakuDu* ప్రజా సంక్షేమం కోసం ప్రభుత్వంలో పని చేసే వ్యక్తి public servant రాజ్యాంగ పరిధులలో గల న్యాయ శాస్త్రం దృష్టిలో ఆయన 'ప్రజాసేవకుడు' అయినందున లాభార్జన కలిగించే వాణిజ్య పరమైన చలన చిత్రాన్ని నిర్మించడం అందులో నటుడిగా, దర్శకుడిగా వ్యవహరించడం సమంజసం కాదని ... (ఆ ప్ర. 1.7 89)

ప్రజాస్వామిక వ్యవస్థ వి. *prajaas-vaamika vyavastha* ప్రజల చేత ఎన్నుకోబడి, పరిపాలన సాగించే ఏర్పాటు democratic system పాకిస్తాన్‌లో ప్రజాస్వామిక వ్యవస్థ నెలకొనడానికి దోహదపడే పరిణామాలు కొన్ని ఇటీవల సంభవించాయి. (ఆం. ప్ర 14.10 88)

ప్రజాస్వామ్య ఉద్యమం వి. *prajaas-vaamya udyamam* నియంతృత్వాన్ని వ్యతిరేకిస్తూ, ప్రజల హక్కుల కోసం సాగే ఆందోళన democratic movement చైనాలో తమ సోదర విద్యార్థులు సాగిస్తున్న ప్రజాస్వామ్య ఉద్యమానికి మద్దతుగా అమెరికాలోని సుమారు 3,500 మంది చైనా విద్యార్థులు ప్రదర్శన నిర్వహించారు. (ఈ. 22.5.89)

ప్రజాస్వామ్య పంథా వి. *prajaas-vaamya panthaa* ప్రజల చేత ఎన్నుకోబడి ఎక్కువమంది అభిప్రాయం ప్రకారం పరిపాలించే విధానం democratic way దేశాన్ని "ప్రజాస్వామ్య పంథా"లో సాగించేందుకు వీలుగా, తక్షణం ప్రస్తుత లోక్‌సభను రద్దుచేసి కొత్తగా ఎన్నికలు నిర్వహించాలని ప్రతిపక్షాలు పిలుపిచ్చాయి. (ఈ. 24 7.89)

ప్రజాస్వామ్య రాజ్యాంగం వి. *pra-jaasvaamya raajyaangam* ప్రజలకు ఆర్థిక, రాజకీయ, సామాజిక న్యాయాన్ని కల్పిస్తూ నియమ నిబంధనల సూత్రాలతో పొందుపరచినది democratic constitution ప్రజాస్వామ్య రాజ్యాంగంలో న్యాయవ్యవస్థ సక్రమంగాను, సమర్థంగాను, పనిచేసేందుకు అవసరమైన సాధన సంపత్తి, సదుపాయాలు కల్పించకపోతే ప్రజాస్వామ్య మనుగడకే ప్రమాదం ఏర్పడుతుందని సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి .. హెచ్చరించారు. (ఈ 4 7.89)

ప్రజాస్వామ్య వధ వి. *prajaas-vaamya vadha* ప్రజలచేత ఎన్నుకోబడిన వ్యవస్థను చంపటం murder of democracy కర్నాటకలో జరిగిన ప్రజాస్వామ్య వధపై ఏం చేస్తారని ప్రశ్నించారు. (ఆం ప్ర. 25 4 89)

ప్రజాస్వామ్య శక్తులు వి. (బ.వ.) *pra-jaasvaamya śaktulu* ప్రజల సాంఘిక, రాజకీయ, ఆర్థిక న్యాయాల కోసం పోరాడే సమరశీల బృందాలు democratic forces ... కాంగ్రెస్ పార్టీకి చెందిన సంఘవ్యతిరేక శక్తులు సి.పి.ఎం. నాయకుడు శ్రీ నంబూద్రిపాద్‌పై దాడి చేయటాన్ని ప్రజాస్వామ్య శక్తులన్నీ తీవ్రంగా ఖండించాలన్నారు. (ఆం ప్ర. 29 7 89)

ప్రజాస్వామ్యీకరణ వి. *prajaas-vaamyiikaraNa* ఎక్కువమంది అభిమతానికి అనుకూలంగా సాగే ప్రక్రియ demacratization ... అందుకే దీన్ని ప్రజాస్వామ్యీకరణ సమస్యకు సంబంధించిన సమస్యగా పరిగణించాలి. (ఉ 11 9 87)

ప్రజ్వరిల్లు క్రి. *prajvarillu* (హింస, ఆగ్రహం)ఒక్కసారిగా ఎక్కువగు; రగులుకొను erupt ... పోలింగ్ సందర్భంగా వివిధ రాష్ట్రాల్లో పెద్ద ఎత్తున హింసాకాండ ప్రజ్వరిల్లిన విషయం తెలిసిందే. (ఈ 24 11 89)

ప్రణాళిక వి. *praNaaLika* 1. దేశంలో వివిధ రంగాల అభివృద్ధిని క్రమబద్ధంగా సాధించడానికి ఉద్దేశించిన పథకం, యోజన plan దేశంలో 2002 సంవత్సరం నాటికి అందరికి ఉద్యోగావకాశాలు కల్పించాలనే బృహత్తర ప్రణాళిక నొకదానిని ప్రభుత్వం చేపట్టనుంది. ఎనిమిదవ ప్రణాళికలో రెండు శాతం మేరకు ఉద్యోగావకాశాలు కల్పించినట్టు ప్రభుత్వం పేర్కొంది.(ఆం ప్ర. 6 6 93) 2. తమ ఆశయాలను, రాజకీయ, ఆర్థిక లక్ష్యాలను వివరిస్తూ ఎన్నికలముందు రాజకీయ పక్షం ప్రకటించే పత్రం manifesto అక్టోబర్ 23, 24 తేదీలలో ఫ్రంట్ జాతీయ మహాసభలు జరుగనున్న సందర్భంగా 24న ఈ ఎన్నికల ప్రణాళిక(మేనిఫెస్టో)ను విడుదల చేయాలని ఫ్రంట్ నాయకత్వం భావిస్తున్నది (ఆం ప్ర 29 9 89)

ప్రణాళికా మండలం వి. *praNaa-Likaa manDalam* ఆర్థిక కార్యకలాపాల నిర్వహణకోసం విభజించిన ప్రాంతం planning zone వ్యవసాయ వాతావరణ పరిస్థితుల ఆధారంగా దేశాన్ని వివిధ ప్రణాళికా మండలాలుగా విభజించనున్నట్లు అఖిల భారత కాంగ్రెస్(ఐ) కమిటీ అధ్యక్షుడు, ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ప్రకటించారు. (ఉ 24 4 88)

ప్రణాళికేతర ఖర్చు వి. *praNaaLikee-tara kharcu* పద్దులోకి రాని ఇతర శాఖల కింద పెట్టే వ్యయం expenditure ప్రణాళికేతర ఖర్చులు తగ్గించడానికి అనేక చర్యలు తీసుకుంటున్నామని ... (ఉ. 13 4 88)

ప్రతిఘటించు క్రి. *pratighaTincu* ఎదురుతిరుగు, ఎదిరించు to resist ... ప్రైవేటు డీలరుకు అప్పగించుట వలన జరిగే అవకతవకలు ప్రజలకు తెలుసునని, దానిని ప్రజలే ప్రతిఘటించగలరని పేర్కొంది. (వి 20 6 87)

ప్రతిచర్య వి. *praticarya* తిరిగితీసే దెబ్బ retaliation బాధితుల సహాయానికి భారతదేశం పంపిన పడవలను తన సముద్ర జలాల్లో ప్రవేశించడానికి శ్రీలంక ప్రభుత్వం అనుమతించనందుకు ప్రతిచర్యగా న్యూఢిల్లీ ఈ వైమానిక దుస్సాహసానికి పాల్పడింది. (ఈ 5 6 87)

ప్రతినబూను క్రి. *pratinabuunu* లక్ష్యం చేరేవరకు ప్రయత్నం మానేది లేదని బాస చేయు to pledge నేటి ఊరేగింపులో పాల్గొన్న ప్రదర్శకులు "లీపెంగ్ దిగిపోయేవరకు విశ్రమించేదిలేద"ని మండుటెండలో ముందుకు సాగుతూ ప్రతినబూనారు. (ఈ. 26 5 89)

ప్రతినిధి వి. *pratinidhi* సంస్థ లేదా ప్రభుత్వం తరఫున వ్యవహరించడానికి ఎంపికయిన వ్యక్తి representative, delegate హెచ్ డి డబ్ల్యు సంస్థ జలాంతర్గాములు అమ్మ చూపిన సమయములో ఆ సంస్థ తరఫున ఏ సమయంలోను భారతీయ ఏజెంట్ లేదా ప్రతినిధి పనిచేయలేదు. (ఆం. భూ 22 4.88)

ప్రతినిధి వర్గం వి. *pratinidhi*

*vargam* సంస్థ లేదా ప్రభుత్వం తర ఫున వ్యవహరించడానికి ఎంపికైన వ్యక్తుల బృందం delegation బోఫోర్స్ తుపాకుల ఒప్పందం వ్యవహారంపై స్వీడన్‌కు ప్రతినిధి వర్గాన్ని పంపే ప్రతిపాదనను ప్రతిపక్షం దాదాపు విరమించుకున్నట్టే. (ఆం భూ. 4 9 87)

**ప్రతిపక్షం** వి. *pratipakSam* చట్టసభలలో అధికార పక్షానికి వ్యతిరేకంగా వ్యవహరించే పక్షం opposition ప్రతిపక్షాలు, కాంగ్రెస్(ఐ) అసమ్మతివాదులు ఒక అవగాహనకు వచ్చే విషయాన్ని ప్రస్తావిస్తూ ఆయన ఈ వ్యాఖ్య చేశారు. (ఈ. 22.7.87)

**ప్రతిపక్ష గ్రూపు** వి. *pratipakSa gruupu* అధికార పక్షాన్ని వ్యతిరేకించే అనేక పార్టీలు లేదా బృందం opposition groups పార్లమెంట్‌లోని మెజారిటీ ప్రతిపక్ష గ్రూపులు సోమవారం కర్నాటక గవర్నర్ ... పై విరుచుకుపడ్డారు. (ఈ 25 4 89)

**ప్రతిపక్ష ఘనాపాటీ** వి. *pratipakSa ghanaapaaTii* చట్టసభల్లో ఎదుటి పక్ష రాజకీయాలలో విశేషమైన అనుభవం ఉన్న నాయకుడు stalwart of opposition 1984 లోక్‌సభ ఎన్నికల సమయంలో నాటకీయంగా రాజకీయ రంగ ప్రవేశం చేసిన అమితాబ్ ఉత్తరప్రదేశ్‌లోని అలహాబాద్ నియోజక వర్గం నుంచి ఎన్నికయ్యారు. ప్రతిపక్ష ఘనాపాటీ బహుగుణను ఆయన ఓడించారు. (ఈ. 18 7 87)

**ప్రతిపక్ష నాయకుడు** వి. *pratipakSa naayakuDu* వ్యతిరేక పార్టీ నేత opposition leader .... మంగళవారం ఉదయం ఇక్కడకు వచ్చిన ఎన్.టి.ఆర్. రోజంతా పలువురు ప్రతిపక్ష నాయకులతో చర్చలు జరిపారు. (ఈ 22.7 87)

**ప్రతిపక్ష పార్టీ** వి. *pratipakSa paarTii* వ్యతిరేక రాజకీయ పక్షం opposition party అట్టడుగు స్థాయిలోని ప్రజానీకానికి అధికారం దక్కకుండా చేయడం కోసం ప్రతిపక్ష పార్టీలు దళారులతోనూ, స్వార్థపరులతోనూ చేతులు కలుపుతున్నాయని ప్రధాని ఆరోపించారు. (ఆం భూ. 19.5 89)

**ప్రతిపక్ష సభ్యుడు** వి. *pratipakSa sabhyuDu* చట్టసభలలో వ్యతిరేక పార్టీలకు చెందిన ప్రతినిధి opposition member రివ్యూ పిటిషన్ అతికొద్ది రోజులలోనే సుప్రీంకోర్టు పరిశీలనకు వచ్చే అవకాశం ఉందని, కోర్టు తీర్పు వచ్చిన వెంటనే తదుపరి చర్యలు చేపడుతుందని మంత్రి ప్రతిపక్ష సభ్యులకు హామీ ఇచ్చారు. (ఈ. 22 7 87)

**ప్రతిపక్షాల ఫ్రంట్** వి. *pratipakSaala franT* అధికారంలో లేని వ్యతిరేక వర్గాల కూటమి opposition front "ఒకటి రాష్ట్రపతి ఎన్నిక, రెండు-ఆందోళన కార్యక్రమం, మూడు-ప్రతిపక్షాల ఫ్రంట్ ఏర్పాటు" (ఆం జ్యో 9 9 87)

**ప్రతిపత్తి** వి. *pratipatti* (రాజకీయ సామాజిక రంగాలలో) ఒక సంస్థకు లేదా ఒక వ్యవస్థకు ఉన్న స్థానం; ప్రతిష్ఠ status జమ్మూ-కాశ్మీర్‌కు ప్రత్యేక ప్రతిపత్తిని కల్పిస్తున్న రాజ్యాంగంలోని 370 అధికరణ విషయంలో తమ పార్టీ అభిప్రాయాన్ని నవంబర్ 18న పార్టీ ఫోరం ఏర్పాటు తర్వాత స్పష్టం చేస్తామని ఆయన వెల్లడించారు. (ఆం జ్యో 13 11 88)

**ప్రతిపాదకుడు** వి *pratipaadakuDu* ఒక విషయాన్ని చర్చించేందుకు ముందుకు తెచ్చేవాడు initiator మొదటి సెట్‌లోని 15మంది ప్రతిపాదకులలో తొలుత ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ సంతకం చేశారు. (ఆం. ప్ర 16.6.87)

**ప్రతిపాదన** వి. *pratipaadana* విధాన నిర్ణయాలను పరిశీలించి ఖరారు చేసేం దుకు ఇతరుల ముందు పెట్టే సూచన proposal ప్రైవేటు ఇంజనీరింగు కళాశా లల్లో ట్యూషన్ ఫీజు పెంచాలనే ప్రతిపాదన రాష్ట్ర ప్రభుత్వ పరిశీలనలో ఉంది. (ఆం భూ. 1.10.87)

**ప్రతిపాదిత పథకం** వి. *pratipaadita pathakam* ఆమోదంపొంది అమలుపరచ డానికి నిర్దేశించిన స్కీము proposed scheme ఇది కాకుండా కేంద్ర ప్రభుత్వ ప్రతిపాదిత పథకాల కింద 9కోట్ల 33లక్షల రూపాయలు రాష్ట్రానికి లభిస్తాయి. (ఈ. 6 7.89)

**ప్రతిబంధకం** వి. *pratibandhakam* ఒక పని విజయవంతంగా జరగకుండా ఏర్పడే అడ్డు; ఆటంకం hurdle, obstacle ఈ నెల 27న బొమ్మయ్ తన బలాన్ని నిరూపించుకునేంతవరకూ ఆయన మంత్రి వర్గానికి ప్రతిబంధకాలు కల్పించరాదని ఈ బృందం రాష్ట్రపతిని కోరింది. (ఈ 22.4.89)

**ప్రతివాది** వి. *prativaadi* వాది తన పిటి షన్‌లో వ్యతిరేకిగా పేర్కొన్న వ్యక్తి లేదా సంస్థ respondant ఈ విషయంలో పిళ్ళై కమిటీ సమర్పించిన తాత్కాలిక నివే దికగానీ, దానిని ఆధారంగా చేసుకొని జారీ చేసిన అధికారిక పత్రంకానీ ఈ విషయంలో ప్రతివాదిని ఆదుకోలేవని ఆయన అన్నారు. (ఆం. ప్ర 3 7 89)

**ప్రతిష్టంభన** వి. *pratiSTambhana* చర్చ లలో ఇరుపక్షాలవారూ బిగుసుకుపోయిన పుడు ఏర్పడేస్థితి deadlock చైనా-భా రత సరిహద్దుపై అధికారుల స్థాయి చర్చలలో ప్రతిష్టంభన నెలకొనేలా ఉన్నట్లు పరిశీలకులు భావిస్తున్నారు. (ఆం భూ 1 10.87)

**ప్రతిస్పందన** వి. *pratispandana* ఒక విషయంపై లేదా సమస్యపై వ్యక్తిగానీ, దేశంకానీ, పార్టీకానీ వెల్లడి చేసే వ్యాఖ్య response, reaction తమ ఆందో ళనపై పి.సి.సి. అధ్యక్షుడి ప్రతిస్పందన ఎలా వుంటుందోనని కాంగ్రెస్ అసమ్మతి వర్గం నాయకులు వేచి చూస్తున్నారు. (ఈ. 4 7.89)

**ప్రతిస్పందించు** క్రి. *pratispandincu* ఒక సమస్యపై లేదా వివాదంపై అభిప్రాయం వెల్లడించు to respond, react ... కర్నాటక ప్రభుత్వాన్ని రద్దు చేయడంపై తీవ్రంగా ప్రతిస్పందించారు. (ఆం ప్ర. 22.4.89)

**ప్రతీక** వి. *pratiika* (ఒక ఆదర్శానికి) చిహ్నం, గుర్తు, సంకేతం symbol అందరికన్నా ముఖ్యంగా సభాపతులు దక్షతకు నిష్పాక్షికతకు ప్రతీకలుగా మన్నన పొందిన ప్పుడే పార్లమెంటరీ వ్యవస్థలు ప్రజాస్వామ్య విలువలు నిలబడతాయి. (ఈ. 25 5 89)

**ప్రతీకారం** వి. *pratiikaaram* ఎదురుదెబ్బతీయటం, పగతీర్చుకోవటం retaliation, revenge వరంగల్, కరీంనగర్ తదితర ప్రాంతాల్లో ఇటీవల పెరి గిన ఎన్‌కౌంటర్ హత్యలకు ప్రతీకారంగా నక్సలైట్లు ఈ దాడి జరిపి ఉంటారని భావి స్తున్నారు. (ఆం జ్యో 2 2.89)

**ప్రతీప శక్తులు** వి. (బ.వ.) *prati-ipa saktulu* జనసామాన్య వ్యతిరేక మైన భూస్వామ్య ధనిక స్వామ్య వర్గాలు reactionary forces తెలుగుదేశం ప్రభుత్వం ప్రతీపశక్తులకు పుట్టినిల్లుగా మారి,

వారు అనుసరిస్తున్న పెత్తందారీ ధోరణి, హరిజన, గిరిజన బలహీన వర్గాలపై జరిగిన మారణకాండకు కారణమని వేరే చెప్పనక్కర లేదు. (ఆం. భూ. 21.5.89)

ప్రత్యక్ష కార్యాచరణ వి. *pratyakSa kaaryaacaraNa* నిరసనను సామూహికంగా అనేక రూపాలలో (ఊరేగింపులు, ధర్నాలు సత్యాగ్రహాలు వగైరా) ప్రదర్శించటం direct action ఉత్తర్వులను ఉపసంహరించటానికి ప్రభుత్వం సిద్ధం కానట్లయితే, ప్రత్యక్ష కార్యాచరణకు రూపొందించాల్సిన పరిస్థితి యూనియన్‌కు ఏర్పడగలదని వారు హెచ్చరించారు. (వి. 20.6.87)

ప్రత్యక్ష చర్య వి. *pratyakSa carya* చూ. ప్రత్యక్ష కార్యాచరణ. తమ డిమాండ్లను సాధించుకొనడానికి ప్రభుత్వ ఉద్యోగులు, కార్మికులు, ఉపాధ్యాయులు ప్రభుత్వ యంత్రాంగాన్ని స్తంభింపజేయాలని నిర్ణయించుకున్నారు. స్తంభింప చేయాలన్న ప్రత్యక్ష చర్యను వారు "సరైన సమయం"లో ఆచరించాలని నిర్ణయించారు. (ఆం. ప్ర. 20.7.89)

ప్రత్యక్ష ప్రసారం వి. *pratyakSa prasaaram* జరుగుతున్న చోటు నుంచి నేరుగా కార్యక్రమాన్ని యథాతథంగా టి.వి.లో చూపించటం live telecast ప్రధానమంత్రి ఎర్రకోటపై నుంచి ప్రసంగిస్తూ ప్రతిపక్షాలను నిందించినప్పుడు ప్రత్యక్షప్రసారం చేశారని శ్రీ ఉపేంద్ర అన్నారు. (ఆం. ప్ర. 21.8.89)

ప్రత్యక్ష సాక్షి వి. *pratyakSa saakSi* ప్రమాదాన్ని చూసి అక్కడ జరిగింది జరిగినట్లు చెప్పేవాడు eye-witness ... పేలుడు సంభవించిన ప్రాంతం చుట్టూరా దాదాపు 20 అడుగులవరకు అంతా రక్తమయమే అని మరో ప్రత్యక్ష సాక్షి వివరించారు. (ఆం. ప్ర. 13.6.89)

ప్రత్యర్థి వి. *pratyarthi* (రాజకీయాల్లో) వ్యతిరేకి opponent, rival తరువాత అసెంబ్లీ లాంజ్‌లో ప్రత్యర్థి వర్గాలవారికి ఘర్షణ జరిగింది. (ఆం. ప్ర. 7.2.89)

ప్రత్యామ్నాయం వి. *pratyaamnaayam* అమలులో ఉన్నస్థితికి బదులుగా చేసుకునే ఏర్పాటు alternative రాజీవ్‌ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రత్యామ్నాయ ఏర్పాటు అంటూ పదేపదే వినవస్తున్న అంశాన్ని ప్రస్తావిస్తూ ... (ఆం. జ్యో. 9.4.88)

ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు వి. (బ.వ.) *pratyaamnaaya pratipaadanalu* ఒక రకమైన ఆలోచనలకు బదులుగా, మరొకరీతిలో ఉండే అభిప్రాయాలు alternative proposals ముఖ్యమంత్రి సమావేశాన్ని అకస్మాత్తుగా ఏర్పాటు చేయడంవల్ల తక్షణమే తగు ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు ఇవ్వడంలో వైస్ ఛాన్సలర్లు అశక్తతను వ్యక్తంచేస్తూ ... (ఆం. జ్యో. 5.6.87)

ప్రత్యేక నిఘా వి. *pratyeeka nighaa* రక్షణకోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన తనిఖీ special vigilence కీలకమైన ప్రభుత్వ కార్యాలయాల వద్ద ప్రత్యేక నిఘా ఏర్పాటు చేశారు. (ఉ. 15.6.87)

ప్రత్యేక ప్రస్తావన వి. *pratyeeka prastaavana* చట్ట సభలలో జీరో అవర్‌లో సభ్యులు ముఖ్యమైన విషయంపై చేసే ప్రసంగం special mention ఈ ప్రత్యేక ప్రస్తావన నిబంధనలకు అనుకూలంగా లేదు కాబటి తాను కూడా అనుమతించబో

నని ఆయన తొలుత అన్నారు (ఆం. ప్ర 18 11 88)

ప్రథమ చికిత్స వి. *prathama cikitsa* ప్రమాదం జరిగినపుడు డాక్టరు దగ్గరకు వెళ్ళేలోపల చేసే వైద్య సహాయం first aid *1984 జూలై 4వ తేదీన శోభ కిరస నాయిలు పోసుకుని మరణించడానికి ప్రయ త్నించిందని ఆమె అత్తవారి వైపునుండి జమ్మికుంట పోలీస్‌స్టేషన్‌కి ఫిర్యాదు అంద డంతో పోలీసులు ఆమెకు ప్రథమ చికిత్స చేయించి అనంతరం అదే రోజున వరంగల్ ఎం.జి.ఎం ఆసుపత్రిలో చేర్పించారు.* (ఆం భూ 4 10 87)

ప్రథమ ఫిర్యాదు పత్రం వి. *prathama firyaadu patram* చూ.ఎఫ్ ఐ.ఆర్. *దౌర్జన్యకాండకు సంబంధించిన ప్రథమ ఫిర్యాదు పత్రంలో 70 మందిని నిందితులుగా పేర్కొన్నారు.* (ఆం ప్ర 15 7 89)

ప్రథమ సమాచార నివేదిక వి *prathama samaacaara niveedika* చూ. ఎఫ్ ఐ ఆర్. *ఈ ప్రథమ సమాచార నివేదికలో ముప్పయి ఎనిమిది మందిని నిందితులుగా పేర్కొన్నారు.* (ఉ 14 4 88)

ప్రథమార్ధం వి *prathamaardham* నిర్ణీత కాలంలో మొదటి సగం first half *ప్రథమార్ధంలో ఉత్తరప్రదేశ్ ఎక్కువ గోల్స్ సాధించలేకపోవడానికి ఆంధ్ర డిఫెండర్లు చూపించిన సామర్థ్యమే కారణం.* (ఆం ప్ర 28 7 89)

ప్రదక్షిణ వి *pradakSiNa* పనులు పూర్తి చేసుకోవడంకోసం ప్రభుత్వ కార్యాలయాల చుట్టూతిరగటం going around (the offices) *పాపం శాసన సభ్యులు సభ జరుగుతున్న కాలంలో, జరగని కాలంలో సెక్రెటేరియట్, తదితర ప్రభుత్వ కార్యాలయాలు చుట్టూ ప్రదక్షిణలు చేస్తూనే వుంటారు.* (ఆం భూ 20 4 89)

ప్రదర్శన వి *pradarśana* 1. ప్రేక్ష కుల ముందు కళారూపాలను చూపటం stage performance *జంటనగరాల్లో బెంగాలీ నాటక రంగాన్ని ప్రోత్సహించడా నికి ఏర్పాటైన "అచల్ అధూతి గోష్ఠి" సంస్థ రవీంద్ర భారతిలో ఇటీవల రెండురో జులు ప్రదర్శనలిచ్చింది.* (ఆం ప్ర. 8 2 89) 2. సమష్టిగా నిరసన ప్రకటించటం demonstration *శ్రీలంక తమిళులు 50 మంది న్యూయార్క్‌లోని ఐరాస ప్రధాన కార్యాలయం వద్ద ప్రదర్శన జరిపారు.* (ప్ర శ 5 6 87)

ప్రదర్శనకారుడు వి. *pradarśanakaa-ruDu* సామూహిక నిరసనలో పాల్గొన్న వ్యక్తి demonstrator *బహిరంగ సభాస్థ లాన్ని వదలి, మార్గం మార్చి వారు వెళ్ళి పోగా ప్రదర్శనకారులు బసవప్ప కారుపై దాడిని కేంద్రీకరించారు.* (ఉ. 26 4 88)

ప్రదర్శించు క్రి *pradarśincu* (అలక్ష్యాన్ని) చూపించు to show *కాలుష్య నియంత్రణ బోర్డు ప్రదర్శిస్తున్న నిర్లక్ష్యవైఖరికి నిరసనగా* .. (ఆం. ప్ర 6 6 87)

ప్రదానంచేయు క్రి. *pradaanamceeyu* ప్రతిభను మెచ్చి గుర్తుగా ఏదైనా వస్తువును బహూకరించు to present *ఉత్తమ శ్రేణిలో వచ్చినందుకు రాష్ట్రపతి ఫలకం, హెడ్ క్వార్టర్స్ వెస్టర్న్ ఎయిర్ కమాండర్ ట్రోఫీ, హెడ్ క్వార్టర్స్ మెయింటెనెన్స్ ట్రోఫీ కూడా ఆయన ప్రమోద్‌కు ప్రదానంచేసి సత్కరించారు.* (ఈ 15 6.89)

ప్రధాన న్యాయమూర్తి వి. *pradhaana nyaayamuurti* సుప్రీంకోర్టు, హైకో ర్టులలో ముఖ్య న్యాయాధిపతి chief justice *సుప్రీంకోర్టు ప్రధాన న్యాయ*

మూర్తి జస్టిస్ ఇ. ఎస్. వెంకట్రామయ్యకు నేటి ఉదయం స్వల్పంగా గుండెపోటు రావటంతో ఆయనను నగరంలోని ఒక ఆసు పత్రిలో చేర్చారు. (ఆం ప్ర. 7.7 89)

ప్రధాన ప్రత్యర్థి వి. *pradhaana pratyarthi* ఎన్నికలలో ఆటలలో ముఖ్య మైన పోటీదారు main rival (in elections, sports) టైసన్ ప్రధాన ప్రత్యర్థిగా, హోలీఫీల్డ్‌ని బాక్సింగ్ ప్రధాన అధికార వర్గాలు గుర్తించాయి. (ఈ. 26 7.89)

ప్రధాన ప్రశ్న వి. *pradhaana praśna* చట్ట సభలలో సభ్యుడు అడిగిన ముఖ్య మైన విషయం (దీనిపై ఇంకా వివ రణను సభ్యులు కోరవచ్చు) main question వాయుదూత్ విమానాల కొను గోలుకు సంబంధించి సురేష్ కల్మాడి అడిగిన ప్రధాన ప్రశ్న తర్వాత సభ్యులు అనుబంధ ప్రశ్నలడిగారు. (ఆం. ప్ర. 20.7.89)

ప్రబలు క్రి. *prabalu* (అంటురోగాలు, అవి నీతి) వ్యాపించు ఎక్కువగు; విస్తరించు to become more prevelant జంటనగరాల్లో కలరా, అతిసారా వ్యాధి ప్రబలకుండా ఎం.సి.హెచ్. వైద్యాధికారులు ఎప్పటికప్పుడు కొన్ని చర్యలు తీసుకొంటున్నా అవి సమస్యని తాత్కాలికంగా మాత్రమే పరి ష్కరిస్తున్నాయి. (ఈ. అను 1.7.89)

ప్రభంజనం వి. *prabhanjanam* పెను మార్పును తెచ్చే రాజకీయ కెరటం, అను కూల పవనం political wave లోక్ దళ్ (బి) నాయకుడు దేవీలాల్ ప్రభంజ నంలో రాష్ట్రంలో కాంగ్రెస్(ఐ) తుక్కుతు క్కుగా తుడిచి పెట్టుకపోయిన విషయం విదితమే. (ఆం జ్యో 20 6 87)

ప్రభావితంచేయుక్రి. *prabhaavitamceeyu* ఒకరి గుణగణాలతో మరొ కరి వైఖరిని మార్చు to influence అలాగే ఉభయ కమ్యూనిస్టులు మిర్యాలగూడా, నల్గొండ లోక్‌సభ స్థానాల్లో మాత్రమే ఫలి తాలను ప్రభావితంచేయగలరన్నారు. (ఈ. 21.11.89)

ప్రభుత వి. *prabhuta* పరిపా లనా వ్యవస్థ government, state machinary ఏది ఏమైనా నక్సలైట్లకు ప్రభుతకు మధ్య పట్టుదలలు అమాయకుల ప్రాణాలు తీయరాదని, ఉభయ పక్షాలు తమ విధానాలను తదనుగుణంగా మలచుకోవాలని ఆశిస్తున్నాము. (ఆం ప్ర 5.9 89)

ప్రభుత్వ పంపిణీ వ్యవస్థ వి. *prabhutva pampiNii vyavastha* బియ్యం, గోధుమలు, కిరోసిన్ మొదలైన నిత్యావ సర వస్తుసామగ్రిని చౌకధరలలో ప్రజ లకు అందించే ప్రభుత్వ పర మైన విధానం public distribution system ప్రభుత్వ పంపిణీ వ్యవస్థ ద్వారా పంపిణీ చేయడానికి ఈ ఏడాది 24 లక్షల టన్నుల బియ్యం అవసరం కాగా ... (ఆం. ప్ర. 23.6.90)

ప్రభుత్వ ప్రతినిధి వి. *prabhutva pratinidhi* పరిపాలనా వ్యవస్థ తరఫున వ్యవ హరించే వ్యక్తి official spokesman (of the government) ... అసా ధారణ అధికారాలను గవర్నర్లకు ఇవ్వాలని ప్రభుత్వం సంకల్పించినట్లుగా కొన్ని పత్రికల్లో వచ్చిన వార్తలను ప్రభుత్వ ప్రతినిధి ఒకరు ఖండించారు. (ఆం ప్ర 16.5 89)

ప్రభుత్వ బంజరు భూమి వి. *prabhutva banjaru bhuumi* రాజ్య సంబం ధమైన పనికిరాని నేల waste land of goverment ఇళ్ళ స్థలాల పట్టాలు, భూమి కేటాయింపులు, సర్వే లోపాలు

ప్రభుత్వ బంజరు భూముల ఆక్రమణ తదితర విషయాలపై ... శ్రీ ఉపేంద్ర సంఘం తన నివేదికలో సూచించింది. (ఈ 17 6 87)

**ప్రభుత్వ రంగం** వి. *prabhutva rangam* ప్రభుత్వం నిర్వహించే పరిశ్రమలు, విమానయానం, రైల్వేలు వగైరా public sector కేంద్ర ప్రభుత్వం ప్రభుత్వ రంగంపై ఒక స్పష్టమైన విధాన ప్రకటన చేయాల్సిన అవసరం ఉందని అయిదుగురు ప్రముఖ న్యాయశాస్త్ర నిపుణులు నేడు పేర్కొన్నారు. (ఆం ప్ర 20 2 89)

**ప్రభుత్వ వర్గాలు** వి. (బ.వ.) *prabhutva vargaalu* పరిపాలనా వ్యవస్థకు సంబంధించిన అధికారులు; అధికారవర్గాలు official sources లక్నో తదితర ప్రదేశాల్లో ప్రస్తుతం పరిస్థితి మాత్రం ప్రశాంతంగానూ, పూర్తిగా అదుపులోను ఉందని ప్రభుత్వ వర్గాలు తెలియజేస్తున్నాయి. (ఆం. ప్ర 16 10 88)

**ప్రభుత్వ వాణిజ్య సంస్థ** వి. *prabhutva vaaNijya samstha* దేశంలోని వ్యాపార స్థలకు వీలుగా ఎగుమతులు, దిగుమతులు లాంటి వాణిజ్య కార్యకలాపాలను నిర్వహించే ప్రభుత్వ వ్యవస్థ state trading corporation పొగాకు వేలం మార్కెట్ల నుండి తక్షణం కొనుగోలు చేయవలసిందిగా ప్రభుత్వ వాణిజ్య సంస్థ (స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్)ను కోరినట్లు ... (ఆం ప్ర 26 4 89)

**ప్రభుత్వ విప్** వి. *prabhutva vip* శాసనసభలో సభ్యులు కార్యక్రమాలలో క్రమబద్ధంగా పాల్గొనేటట్టు సభా కార్యక్రమాలు సవ్యంగా జరిగేటట్టు చూడటానికి నియమితుడైన అధికార పార్టీ శాసనసభ్యుడు లేదా సభ్యురాలు. government whip ... పార్లమెంట్ సభ్యులు తమ సభ్యత్వానికి రాజీనామాలను సమర్పించడం భారత పార్లమెంట్ చరిత్రలో అపూర్వ సంఘటన అని ప్రభుత్వ విప్ తమ్మినేని సీతారాం నేడు శ్రీకాకుళంలో అన్నారు. (ఆం ప్ర 25 7 89)

**ప్రమాణం** వి. *pramaaNam* స్థాయిని తెలిపే కొలమానం standard అలా చేసినట్టయితే తక్కువ ప్రమాణాలుగల ఆయుధాలను కొనుగోలు చేయడం నివారించవచ్చు. (ఆం జ్యో. 20.6.87)

**ప్రమాణస్వీకారం** వి. *pramaaNasviikaaram* (ప్రధానమంత్రి, ప్రధాన న్యాయమూర్తి, ముఖ్యమంత్రి, మంత్రులు) పదవిని చేపట్టే ముందు విధులు సక్రమంగా నిర్వహిస్తామని చేసే ప్రతిజ్ఞ swearing in రాష్ట్రపతి భవన్‌లో బుధవారంనాడు కొందరు కేంద్ర మంత్రులు ప్రమాణస్వీకారం చేయాల్సిన కార్యక్రమం వాయిదాపడింది. (ఆం. భూ. 7.12.89)

**ప్రమాణ స్వీకారోత్సవం** వి. *pramaaNa sviikaarootsavam* ఎన్నికైన సభ్యులు పదవిని చేపట్టే సమయంలో విధులు సక్రమంగా నిర్వహిస్తామని చేసే ప్రతినకు సంబంధించిన కార్యక్రమం swearing in ceremony కాంగ్రెస్ శిక్షణ సంస్థలో రాజకీయ శిక్షణపొందిన నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాల కార్యకర్తల ప్రమాణ స్వీకారోత్సవం తదనంతరం ... పాల్గొన్నారు. (ఈ 26 4 89)

**ప్రమాదం** వి. *pramaadam* 1. అకస్మాత్తుగా జన నష్టం ఆస్తి నష్టం కల్గించే సంఘటన accident బస్సు ప్రమాదంలో నలుగురి మృతి. (ఆం జ్యో 12.4.88) 2. చెడుజరిగే అవకాశం possibility

for unwanted developments ... ఆంధ్రప్రదేశ్ టెండర్ డైజెస్ట్‌వల్ల ఆచరణలో మరింత తీవ్ర దుష్పరిణామాలకు దారితీసే ప్రమాదం ఏర్పడింది. (ఆం. జ్యో 9.4.88)

ప్రమాదకరం వి. *pramaadakaram* హాని కలిగించేది, అపాయకరమైనది precarious, dangerous గాయపడినవారిలో ఆరుగురి పరిస్థితి ప్రమాదకరంగా ఉంది. (ఈ 15 6.87)

ప్రమాద సూచిక వి. *pramaada suucika* వరదల, తుఫానుల అపాయాన్ని తెలిపే గుర్తు danger signal కాకినాడ, విశాఖపట్నం, భీమిలి, కళింగపట్నం రేవుల్లో స్థానిక ప్రమాద సూచికలను ఎగురవేశారు. (ఈ. 16 10.87)

ప్రమాద స్థలం వి *pramaada sthalam* దుర్ఘటన జరిగినచోటు spot of accident సహాయక కార్యక్రమాలను పర్యవేక్షించడానికి రైల్వేమంత్రి శ్రీ మాధవరావు సింధియా గ్వాలియర్ నుంచి హుటాహుటిన ప్రమాద స్థలానికి చేరుకున్నారు. (ఆం. ప్ర. 2.11.89)

ప్రమాద స్థాయి వి. *pramaada sthaayi* ఆస్తులు, ప్రాణాలకు ముప్పు వాటిల్లేలా అపాయానికి చేరుకున్న నది నీటి మట్టం danger level (of a river in spate) భారీ వర్షాలవల్ల ఖమ్మంజిల్లా భద్రాచలంలో గోదావరి ప్రమాద స్థాయిని దాటే విధంగా నీటిమట్టం గురువారంనాటికి పెరిగే ప్రమాదం ఉంది. (ఆం. ప్ర 24 8.89)

ప్రమాద హెచ్చరిక వి. *pramaada heccarika* వరదలు, తుఫాను మొదలైన ప్రకృతి వైపరీత్యాలు సంభవించినపుడు ప్రజలకు అపాయాన్ని గురించి తెలుపుతూ చేసే ప్రకటన warning (to alert) ఆదివారం మధ్యాహ్నం నుంచి అధికారవర్గాలు మైకులలో ప్రమాద హెచ్చరికలను చేయించి ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన లారీలలో సురక్షిత ప్రాంతాలకు తరలి వెళ్ళమని ప్రజలను కోరినా అంతగా స్పందించలేదని ఆయన తెలిపారు. (ఆం. ప్ర 25 7.89)

ప్రముఖం వి. *pramukham* మిగతా వాటికన్నా ప్రధానం prominent పాకిస్తాన్ అణు కార్యక్రమంపై ఉభయదేశాల మధ్య నెలకొన్న అభిప్రాయ భేదాలు కూడా ఈ సమావేశంలో ప్రముఖంగా ప్రస్తావనకొచ్చాయి. (ఈ 18 7 89)

ప్రమేయం వి. *prameeyam* ఒకరి విషయంలో మరొకరు జోక్యం చేసుకోవటం interference భారత ఉపఖండంపై పాశ్చాత్య వ్యూహంలో జయవర్ధనే ప్రభుత్వ ప్రమేయం పెరగడాన్ని సోవియట్ అప్రమత్తంగా కనిపెడుతోంది (ఈ. 5.6.87)

ప్రమోట్‌చేయు క్రి. *pramooTceeyu* ఒక స్థానం నుంచి ఉన్నత స్థానంలో నియమించు; పదోన్నతి కల్పించు to promote హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులుగా బయటివారిని నియమించే ప్రభుత్వ విధానానికి అదే కోర్టులోని న్యాయమూర్తిని ప్రధాన న్యాయమూర్తిగా ప్రమోట్‌చేయడం విరుద్ధం కాదని ... (ఈ. 10 12.87)

ప్రమోషన్ వి. *pramooSan* ఒక పదవి నుంచి మరొక ఉన్నత పదవిని పొందటం;పదోన్నతి promotion లెక్చరర్లకు ప్రమోషన్ అవకాశాలు రెండుసార్లు లభిస్తాయని, ఎంపిక, పిహెచ్‌డి డిగ్రీలు తొలి ప్రమోషన్‌కు ప్రధాన అర్హతలని ... (ఆం. జ్యో. 18 6.87)

ప్రయాణంచేయు క్రి. *prayaaNamceeyu*

ఒక వైఖరి నుంచి, ఎంతో తేడా ఉన్న మరో వైఖరి వైపు సాగు to come a long way దీనితో అసలు ఇజ్రాయల్ అవతరణనే గుర్తించడానికి నిరాకరించడం నుంచి దానితో శాంతియుత సహజీవనం చేయడం వరకు పి.ఎల్.ఒ ప్రయాణం చేసిందన్నమాట. (ఆం జ్యో 6 12.88)

**ప్రయత్నించు** క్రి. *prayatnincu* ఒక లక్ష్యాన్ని సాధించటానికి కృషిచేయు, పాటుబడు to strive for పార్టీలో ఐకమత్యం, అవగాహన తీసుకువచ్చే కార్యక్రమంలో భాగంగా శాసనసభ్యుల సమస్యలను పరిష్కరించడానికి పార్టీ నాయకత్వం ప్రయత్నిస్తున్నది. (ఆం జ్యో 11.12 87)

**ప్రయివేట్ వ్యక్తి** వి. *prayiveeT vyakti* ప్రభుత్వ సంస్థలకు చెందని వ్యక్తి private person హిందూపురం చక్కెర ఫ్యాక్టరీ ప్రయివేటు వ్యక్తికి అమ్మకం. (ఆం ప్ర 18 9 87)

**ప్రయోగాత్మకం** వి. *prayoogaatmakam* కొత్త పద్ధతిని ప్రవేశపెట్టే ముందు విజయావకాశాలను పర్యవేక్షించటానికి చేసే ప్రయత్నం experimental ఈ ఎన్నికలలో మొదటిసారిగా ఎక్కువమంది అభ్యర్థులను ఎన్నుకునే కొత్త విధానాన్ని ప్రయోగాత్మకంగా ప్రవేశపెడుతున్నారు. (ఆం భూ. 20.6 87)

**ప్రయోగించు** క్రి. *prayoogincu* 1. రోదసీ నౌకలను, మిస్సైళ్లను నూతనంగా ప్రవేశపెట్టు to launch భూమి ఉపరితలంపై లక్ష్యాలను ఛేదించగల క్షిపణి "పృథ్వి"ని శ్రీహరికోట కేంద్రం నుండి నేడు విజయవంతంగా ప్రయోగించారు. (ఆం ప్ర 28.9 89) 2. (భాషలో) ఉపయోగించు to use రామనాథన్ తమ నుద్దేశించి అసభ్య పరుష పదజాలం ప్రయోగించారని తివారీ ఆరోపించారు. (ఆం జ్యో 18 11.87)

**ప్రలోభం** వి. *praloobham* ఒకరిని లోబర్చుకోవటానికి వేసే వల;ఎర inducement, luring ప్రలోభాలు, బేరసారాలలో చిక్కుకున్న బొమ్మయ్ ప్రభుత్వాన్ని రద్దు చేయడంలో తప్పులేదని ఆమె అన్నారు. (ఆం ప్ర 26.4 89)

**ప్రలోభపెట్టు** క్రి. *praloobhapeTTu* ఇతరులను తనవైపు ఆకర్షించటానికి ఆశ చూపించు to induce తనపై తప్పుడు అఫిడవిట్లు పుట్టించడానికి నలుగురైదుగురు జనతాదళ్ లెజిస్లేటర్లను ప్రలోభపెట్టాలని కాంగ్రెస్ యత్నించిందని చెప్పారు. (ఈ 26.8 89)

**ప్రవర్తనా నియమావళి** వి. *pravartanaa niyamaavaLi* చట్టబద్ధంగా న్యాయంగా వ్యవహరించడానికి నిర్దేశించిన నియమాలు code of conduct హైకోర్టు తన తీర్పులో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు జారీ చేసిన ప్రవర్తనా నియమావళిలోని కొన్ని సూత్రాలను ఉటంకించింది. (ఆం. భూ. 1.9 89)

**ప్రవాస ప్రభుత్వం** వి. *pravaasa prabhutvam* దేశం వెలుపల ఉండి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయటం government in exile ఏడుగురు సభ్యులున్న టిబెట్ ప్రతినిధి వర్గం బుధవారం నాడిక్కడ రాజీవ్ భవన్‌లో రాష్ట్రపతి శ్రీ వెంకట్రామన్ కలుసుకొని దలైలామా నాయకత్వంలోని ప్రవాస ప్రభుత్వాన్ని గుర్తించాలని విజ్ఞప్తి చేసింది. (ఆం. జ్యో. 8 10.87)

**ప్రవాస భారతీయుడు** వి. *pravaasa bhaaratiiyuDu* విదేశాల్లో నివసిస్తున్న భారతీయుడు non-resident Indian (NRI) ప్రవాస భారతీయులకు భూమి కేటాయింపులో రిజర్వు బ్యాంకు నిబంధనలను, ఫెరాను, కంపెనీల చట్టాన్ని

ఉల్లంఘించారని ... ఈ వర్గాలు తెలిపాయి. (ఈ. 30.6 89)

ప్రవాసాంధ్రుడు వి. *pravaasaandh-ruDu* ఇతర దేశాలలో (రాష్ట్రాలలో కూడా) నివాసముంటున్న తెలుగువాడు non-resident Telugu person ఇతర దేశాలలో ఆర్థికాభివృద్ధి సాధించిన ప్రవాసాంధ్రులు తమ పెట్టుబడులతో రాష్ట్రంలో పరిశ్రమలు ప్రారంభించాలని ... (ఈ 11 7.89)

ప్రవేశం వి. *praveeśam* సభ్యునిగా ఒక పార్టీలో చేరటం entry into a political party ... ఇదివరకే ముఠా తగాదాలతో నిండిపోయిన కాంగ్రెస్-ఐ పార్టీకి ఆయన ప్రవేశంవల్ల మరిన్ని చిక్కులే ఎదురవుతాయి. (ఈ 4 10 88)

ప్రవేశ పన్ను వి. *praveeśa pannu* వస్తువుల్ని మార్కెట్‌లోకి విడుదల చేసేటప్పుడు ప్రభుత్వం విధించే పన్ను entry tax వస్త్రాలపై ప్రవేశపన్ను విధించడం సముచితం కాదని రాష్ట్ర విధానసభ స్పీకర్ శ్రీ జి. నారాయణరావు అభిప్రాయపడ్డారు. (ఆం ప్ర. 29.6 87)

ప్రవేశ పరీక్ష వి. *praveeśa pariikSa* విద్యా కోర్సుల్లో చేరడానికి ముందు జరిపే అర్హతా పరీక్ష entrance test ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులైన అభ్యర్థులకు ఆరునెలలపాటు శిక్షణా కార్యక్రమం నిర్వహిస్తారని .. ఆమె తెలిపారు. (ఆం ప్ర 21.8 89)

ప్రవేశపెట్టు క్రి. *praveeśapeTTu* సభలో చర్చకు తీసుకొనివచ్చు to introduce a bill or resolution కాంగ్రెస్(ఐ) కార్యకర్తల సమావేశంలో పి.సి.సి. ప్రధాన కార్యదర్శి మాజీమంత్రి మదన్‌మోహన్ ఈ తీర్మానాన్ని సభలో ప్రవేశపెట్టగా కార్యకర్తలు హర్షంతో ఆమోదం తెలిపారు. (ఈ. అను. 29.7.89)

ప్రశ్నల సమయం వి. *praśnala samayam* చూ. ప్రశ్నోత్తరాల సమయం question hour హక్కుల తీర్మానం ఆమోదించాలని జనతాపార్టీ సభ్యుడు ప్రొఫెసర్ మధుదండావతె ప్రశ్నల సమయంలో ఒత్తిడి తెచ్చినప్పుడు ... తెలిపారు. (ఆం. జ్యో. 26 4.88)

ప్రశ్నావళి వి *praśnaavaLi* సమాచార సేకరణ కోసం ముందుగా తయారు చేసుకున్న ప్రశ్నల జాబితా questionaire ... ఒక్కొక్క తరగతికి కొంతమందిని ఎన్నుకొని సుమారు 10 పేజీల ప్రశ్నావళి ద్వారా వారిని ఇంటర్వ్యూ చేస్తున్నట్లు ... (ఆం ప 22 9 87)

ప్రశ్నోత్తరాల సమయం వి. *praśnootta-raala samayam* చట్టసభలలో సభ్యులడిగే ప్రశ్నలకు మంత్రులు ఇచ్చే సమాధానాలకై కేటాయించే సమయం question hour ఉభయ సభలలోను నేడు ప్రశ్నోత్తరాల సమయం పూర్తి కాగానే మళ్ళీ ఉద్రిక్త పరిస్థితులు నెలకొన్నాయి. (ఆం. భూ. 22.7 89)

ప్రసంగ పాఠం వి. *prasanga paaTham* సభ్యుల ముందు చదవటానికి సంక్షిప్తంగా తయారుచేసిన ఉపన్యాస విషయం text of the speech కేంద్ర హోంమంత్రి శ్రీ బూటాసింగ్ బుధవారంనాడు లోక్‌సభలో బోఫోర్స్ కుంభకోణంపై చేసిన ప్రసంగ పాఠాన్ని పూర్తిగా సభా రికార్డుల నుంచి తొలగించారు. (ఆం ప్ర. 18.11 88)

ప్రసంగించు క్రి. *prasangincu* సభా వేదికపై నుంచి శ్రోతల నుద్దేశించి మాట్లాడు; ఉపన్యసించు to address (gathering) "భారత దేశం ఏ అగ్ర రాజ్యం బెదిరింపులకు లొంగబోదని" శ్రీ రాజీవ్‌గాంధీ ఇక్కడ బహిరంగ సభలో

ప్రసంగిస్తూ చెప్పారు. (ఈ 30 6 89)

**ప్రసక్తి** వి. *prasakti* ఒక విషయానికి సంబంధించిన అవకాశం possibility of an event తాము శ్రీ నాదెండ్ల భాస్కరరావు లేదా శ్రీ ఎన్. జనార్దనరెడ్డిల మద్దతు తీసుకునే ప్రసక్తిలేదని వారు స్పష్టం చేశారు. (ఆం ప్ర 26 11 87)

**ప్రసాదించు** క్రి. *prasaadıncu* సదుద్దేశంతో ఇచ్చు; కల్పించు to guarantee, provide రాజ్యాంగం ప్రసాదించిన అధికారాలతో పనిచేసే వ్యవస్థ తన పరిమితులను, పరిధిని అతిక్రమించవచ్చా? (ఈ 25 7 89)

**ప్రసారం** వి. *prasaaram* టి.వి., రేడియో ద్వారా విషయాన్ని ప్రజలకు అందించటం telecast or broadcast ఆయన సందేశాన్ని స్టేటన్ ఐలాండ్ కాలేజి సీనియర్ గ్రాడ్యుయేట్ విద్యార్థులకు ప్రసారం చేశారు. (ఆం. ప్ర 16 6 87)

**ప్రసారసాధనం** వి. *prasaarasaad-hanam* విషయాలను ప్రజలకు అందించటానికి ఉపయోగపడే పరికరం (రేడియో లేదా టి.వి.) medium దూరదర్శన్, ఆకాశవాణి మొదలైన ప్రసారసాధనాలను పార్టీ ప్రయోజనాలకోసం దుర్వినియోగం చేసే రాజీవ్‌గాంధీ ప్రభుత్వ తప్పుడు విధానాలను తీవ్రంగా నిరసిస్తున్నట్లు తీర్మానంలో పేర్కొన్నారు. (ఆం ప్ర 21 8 89)

**ప్రస్తావన** వి. *prastaavana* ఒక విషయానికి సంబంధించిన సమస్యను ప్రత్యేకంగా ఎదుటివారి దృష్టికి తేవటం mention శాసనసభ్యుడు శ్రీ వంగవీటి మోహనరంగారావు హత్య, ఆ తరువాత జరిగిన పరిణామాలపై సభ చర్చించడానికి సభలోని అన్ని రాజకీయ పార్టీలకు చెందిన 68 మంది సభ్యులు 304 నిబంధన క్రింద చేసిన ప్రస్తావనపై సభాపతి ఈ రోజు చర్చకు అనుమతించారు. (ఆం ప్ర. 23.2.89)

**ప్రస్తావించు** క్రి. *prastaavıncu* ప్రత్యేకించి ఒక విషయాన్ని ఎదుటివారి దృష్టికి తెచ్చు to mention ఫైలుతో పాటు గవర్నర్ పంపిన నోట్ పది పేరాలు వున్నదని, ప్రధానంగా ఆరు అంశాలను గవర్నర్ ప్రస్తావించారని తెలిసింది. (ఆం జ్యో 24.11.88)

**ప్రహసనం** వి. *prahasanam* అపహాస్యంతో కూడిన సన్నివేశం; నవ్వులాట farce తూర్పు ఢిల్లీలో పార్టీ అభ్యర్థి ఎంపికను దేవీలాల్ ఒక ప్రహసనంగా మార్చడం వాళ్ళకు ఎంతమాత్రం ఇష్టంలేదు. (ఈ. 20 11 89)

**ప్రాంగణం** వి. *praangaNam* భవనం చుట్టూ ఉన్న పరిసరప్రదేశం;ఆవరణ premises, campus జాఫ్నా విశ్వ విద్యాలయ ప్రాంగణానికి ఎదురుగా ఉన్న తమిళ ఈలం లిబరేషన్ టైగర్స్ ప్రధాన కార్యాలయాన్ని భారతీయ శాంతి రక్షక దళం ... స్వాధీన పరచుకుంది. (ఈ 26.10.87)

**ప్రాంతీయ ఆధిపత్యదేశం** వి. *praantıiya aadhıpatyadees̀am* చుట్టూ ఉన్న చిన్న దేశాలపై అధికారం చెలాయించే పెద్ద దేశం regional (super) power భారతదేశం 'ప్రాంతీయ ఆధిపత్యదేశం'గా వ్యవహరించడం లేదని ప్రధానమంత్రి రాజీవ్ గాంధీ స్పష్టంచేశారు. (ఈ 18.7 89)

**ప్రాంతీయ బులెటిన్** వి. *praantıiya buleTın* ప్రసారసాధనాల ద్వారా ప్రధానంగా రాష్ట్రానికి సంబంధించిన వార్తలను ఆ ప్రాంతపు భాషలో ప్రసారంచేసే వార్తా నివేదిక local news bulletin ఆకాశవాణి ప్రాంతీయ బులెటిన్‌లలో ప్రతిపక్ష ముఖ్యమంత్రులు, రాష్ట్రాలలో అధికారంలో

ఉన్న ప్రతిపక్షపార్టీలకు సంబంధించి 82,465 ప్రసారం లైన్లు ప్రసారం చేయగా ... (ఈ 6 7.89)

**ప్రాంతీయ విభేదాలు** వి. (బ.వ.) *praantiiya vibheedaalu* ఆయా ప్రాంతాల ప్రజల్లో కలిగే ప్రాంతీయ సంబంధమైన తేడాలు regional differences ... కాంగీ నాయకులు ఇపుడు పి.సి.సి.(ఐ) నేతృత్వాన్ని కూడా ఆ ప్రాంతం వ్యక్తికే అప్పగించడంవల్ల ప్రాంతీయ విభేదాలు కూడా తలెత్తే ప్రమాదం ఉందని ఆందోళన వ్యక్తంచేశారు. (ఈ. 27.4 89)

**ప్రాంతీయ సైన్యం** వి. *praantiiya saınyam* దేశంలో కొన్ని సరిహద్దు ప్రదేశాల సమగ్రతను కాపాడటానికై ఏర్పడిన సేన territorial army కన్ననూర్ (కేరళ)లో ఉన్న ప్రాంతీయ సైన్యం (టెరిటోరియల్ ఆర్మీ) లో 122 ఇన్‌ఫెంట్రీ బెటాలియన్ 'సిపాయి' ఉద్యోగాలు కొన్ని ఖాళీగా ఉన్నాయి. (ఆం ప్ర 27 8 87)

**ప్రాక్టీస్ మ్యాచ్** వి. *praakTıis myaac* శిక్షణ కోసం ఆడే పోటీ ఆట practice match సికింద్రాబాద్‌లోని జింఖానా మైదానంలో నేడు జరిగిన ప్రాక్టీస్ మ్యాచ్‌లో ఆస్ట్రేలియా 162 పరుగులతో హైదారాబాద్ ఎలెవన్ జట్టుపై గెలిచింది. (ఆం ప్ర. 18.10 89)

**ప్రాజెక్టు** వి. *praajekTu* ప్రజోపయోగంకోసం చేపట్టే నిర్మాణ కార్యక్రమం project రాజస్థాన్ ఎడారి ఆగ్నేయ సరిహద్దుదాటి విస్తరించకుండా నర్మదా ప్రాజెక్టు అరికడుతుంది. (ఆం. ప్ర 21 2 89)

**ప్రాణంపోయు** క్రి. *praaNampooyu* బతికించు to give life లకాధీ ద్వీప తీరాన కొన ఊపిరితో కొట్టు మిట్టాడుతున్న తిమింగలం పిల్లకు ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ నేడు ప్రాణంపోశారు. (ఆం. ప్ర. 31.12.87)

**ప్రాణనష్టం** వి. *praaNanaSTam* ప్రమాదంలో చనిపోయిన జనం death toll, loss of life అయితే రాత్రికి పాయకాపురం ప్రాంతంలోకి బుడమేరు వరదనీరు ప్రవహించడంతో ప్రజలు కంగారుపడి సురక్షిత స్థలాలకు తరలి వచ్చారని, మొత్తంమీద ప్రజలను అప్రమత్తంగా ఉంచడంతో ప్రాణనష్టం జరగలేదని ఆయన చెప్పారు. (ఆం. ప్ర 25 7 87)

**ప్రాణప్రతిష్ఠ** వి. *praaNapratiSTha* చితికిపోయిన దశలో ఉన్నదానికి ప్రోత్సాహం కల్పించి పనిచేసేటట్టు చేయటం; పునరుజ్జీవనం revitalization, reviving ఆంధ్రప్రదేశ్‌లోని సురభి నాటక బృందాలకు చేయూతనిచ్చి ఆ నాటక కంపెనీకి ప్రాణప్రతిష్ఠ చెయ్యడానికి నాగపూర్‌లో కల దక్షిణ మధ్య మండల సాంస్కృతిక కేంద్రం చర్యలు తీసుకోవాలనుకుంటుంది. (ఆం. ప. 5.7.87)

**ప్రాణాంతకం** వి. *praaNaantakam* మిక్కిలి అపాయకరమైనది; ప్రమాదకరం detrimental జంటనగరాల్లో పట్టుమని నాలుగు వర్షాలు పడ్డాయంటే చాలు రకరకాల వ్యాధులు ప్రబలుతాయి. వీటిల్లో అతిసారం, కలరా వ్యాధులు మరీ ప్రాణాంతకమైనవి. (ఈ అను. 1 7 89)

**ప్రాతికూల్యం** వి. *praatikuulyam* వ్యతిరేకత opposition, dissent ... రాజ్యాంగ సవరణ ఆవశ్యకత మీదే భిన్నాభిప్రాయాలు, ప్రాతికూల్యం ప్రస్ఫుటమైనా కూడా బిల్లు ప్రవేశపెట్టబోవడం ఏవిధంగా సమంజసం? (ఈ. 8 5 89)

**ప్రాతినిధ్యం** వి. *praatinidhyam* ఒక వర్గానికి లేదా ప్రాంతానికి బాధ్యతవహించటం representation (of a

region or social class) ప్రస్తుత మంత్రి వర్గంలో అన్ని ప్రాంతాల వారికి సమాన ప్రాతినిధ్యం లేకపోవడంతో త్వరలో మంత్రివర్గ విస్తరణ ఉంటుందని ప్రధాన మంత్రి శ్రీ వి.పి.సింగ్ ప్రకటించారు. (ఆం ప్ర 6.12.89)

**ప్రాతిపదిక** వి. *praatipadika* ఆధారం, మూలం base ఎటువంటి మార్పయినా గ్రామస్థాయి ప్రజలకు బాధ్యత వహించే పంచాయితి ప్రాతిపదికపైనే ఉండాలి. (ఆం ప్ర 5.6 87)

**ప్రాథమిక చర్చ** వి. *praathamika carca* ఒక విషయం పూర్వాపరాలను గురించి ప్రారంభదశలో జరిపే సంభాషణ initial discussion గతవారం తన నివాసంలో ప్రాథమిక చర్చలు జరిగినపుడు శ్రీ వి.పి.సింగ్‌గాని, బి.జె.పి. గాని ఎలాంటి షరతులు ప్రతిపాదించలేదని తెలిపారు. (ఈ. 25.5 89)

**ప్రాథమిక పరిశీలన** వి. *praathamika pariśiilana* నిజానిజాలు తెలుసుకోవటానికి చేసే తొలి ఆరా preliminary enquiry మంత్రి శ్రీ జానారెడ్డి ఆర్టీసి కారు దుర్వినియోగం చేసినట్లు వచ్చిన ఫిర్యాదును లోకాయుక్త ప్రాథమిక పరిశీలన జరిపిన తర్వాత పత్రికా ప్రకటన వెలువడడం ... ఆర్టీసి వర్గాలు విస్మయం ప్రకటించాయి. (ఉ. 1 7.87)

**ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం** వి. *praathamika Vyavasaaya sahakaara parapati sangham* రైతుల వ్యవసాయ అవసరాలకు తక్కువ వడ్డీపై ఋణసహాయం అందించే సంస్థ; సింగిల్ విండో primary agricultural co-operative society నిజామాబాద్ ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘం (సింగిల్ విండో) గత సంవత్సరం పంపిణీ చేసిన రుణాలను నూటికి నూరు శాతం వసూలు చేసి రికార్డు సృష్టించిందని ... తెలిపారు. (ఆం ప్ర. 3 7.89)

**ప్రాథమిక శిక్షణ** వి. *praathamika śikSaNa* ఒక పనిలో చేరటానికి ముందు ఇచ్చే కనీస తర్ఫీదు basic training మే మూడో తేదీ నుంచి ప్రారంభమయ్యే ఈ తరగతుల్లో కంప్యూటర్ల గురించి కూడా ప్రాథమిక శిక్షణ ఇస్తున్నట్లు ఆయన తెలిపారు. (ఆం. ప్ర. 1 5 89)

**ప్రాథమిక సమాచారం** వి. *praathamika samaacaaram* తొలిసారి అందిన విషయం preliminary report ప్రాథమిక సమాచారం ప్రకారం కనీసం 23 మంది స్థానికులు.

**ప్రాథమిక సహకార సంఘం** వి. *praathamika sahakaara sangham* చూ. ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం మంగళవారం రాష్ట్రంలోని 1731 ప్రాథమిక సహకార సంఘాలకు జరిగిన ఎన్నికలలో పలుచోట్ల ... పార్టీ కార్యకర్తల మధ్య ఘర్షణలు జరిగాయి. (ఆం జ్యో. 1.7.87)

**ప్రాథమిక సాక్ష్యాధారాలు** వి. (బ.వ.) *praathamika saakSyaadhaaraalu* ఆరోపణల రుజువుకు సంబంధించిన కేసు తొలిదశలో లభించిన సమాచారం preliminary evidence ప్రధాని రాజీవ్‌గాంధీపై ఎటువంటి ప్రాథమిక సాక్ష్యాధారాలు లేవని రాష్ట్రపతి స్పష్టం చేశారు. (ఆం భూ 23 .87)

**ప్రాథమిక సౌకర్యాలు** వి. *praathamika saukaryaalu* (రోడ్లు, నీరు మొదలైన) కనీస వసతులు లేదా సదుపాయాలు basic amenities విశాఖపట్నం, విజ

యవాడ, హైదరాబాద్ నగరాలలోగల మురి కివాడలను మెరుగుపరచి, ప్రాథమిక సౌక ర్యాలు కల్పించటానికి ... రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేకంగా ఒక సంస్థను నెలకొల్పాలని నిర్ణ యించింది. (ఆం ప్ర 7.10.88)

ప్రాథమిక స్థాయి చర్చలు praathamika sthaayi carcalu సమస్య పరిష్కారానికి ప్రారంభదశలో జరిపే సంభాషణలు preliminary discussions శ్రీలంక ప్రభుత్వంలో ప్రాథ మిక స్థాయి చర్చలు జరిపేందుకు తమిళ మిలిటెంట్ల ప్రతినిధి ఆంటోని బాల సింగం నేడు కొలంబో వచ్చారు. (ఈ. 27.4.89)

ప్రాథమిక హక్కు వి. praathamika hakku రాజ్యాంగం ప్రకారం పౌరు లకు సంక్రమించే మౌలికమైన హక్కు (ఈ హక్కుకు భంగం కలిగితే పౌరుడు న్యాయస్థానాన్ని ఆశ్రయించ వచ్చు) fundamental right మంత్రి పదవిలో ఉన్నంత మాత్రాన రాజ్యాంగం మూడో భాగంలో పేర్కొన్న ప్రాథమిక హక్కులను అనుభవించే అర్హతను కోల్పోడు. (ఈ. 1.9.89)

ప్రాదేశిక జలాలు వి. (బ.వ) praadeeśika jalaalu ఒక దేశం అధి కారానికి లోబడిన సముద్రపు నీటి ఎల్లలు territorial waters శ్రీలంక ప్రాదేశిక జలాల పరిమితి వరకు వెళ్ళి వారు అడ్డగిం చినంత మాత్రాన ఎందుకు తిరిగి రావలసి వచ్చింది? (ఆం. జ్యో 5.6.87)

ప్రాదేశిక సమగ్రత వి. praadeeśika samagrata దేశ పరిహద్దుల రక్షణ పూర్తిగా కలిగి ఉండటం territorial integrity తమ దేశ సార్వభౌమాధికా రంపై ప్రాదేశిక సమగ్రతపై దెబ్బ పెట్ట కుండా ఇండియా దాడి చేసిందని శ్రీలంక ఆరోపించింది. (ఆం జ్యో 5.6.87)

ప్రాధేయపడు క్రి. praadheeyapaDu సహా యంకోసం దీనంగా అడుగు; అర్థించు to request ఆ సమయంలో అక్కడ ఉన్న గ్రామస్థులు నారాయణరెడ్డిని హత మార్చ వద్దంటూ నక్సలైట్లను ప్రాధేయపడి వారితో పాటు వెళ్ళారు. (ఆం. భూ. 19.7.89)

ప్రాబల్యం వి. praabalyam సాంఘి కంగా ఉండే పలుకుబడి prominence; influence విద్యార్థిలోకంలో ప్రాబల్యం కోసం నక్సలైటు వర్గాలకు చెందిన విద్యార్థి సంఘాలు, ఎ.బి.వి.పి. చిరకాలంగా పోటీ పడుతున్న సంగతి విదితమే. (ఆం. ప్ర 3.10.87)

ప్రారంభ సదస్సు వి. praarambha sadassu ఉద్దేశాలను, లక్ష్యాలను గురించి పరిచయం చేయడానికి ఏర్పాటుచేసే తొలి సమావేశం inaugural session ... పార్టీ ఎన్నికల కమిటీ ఛైర్మన్‌గా కె. జానారెడ్డి వ్యవహరిస్తారని ఆదివారం నాడిక్కడ జరిగిన ప్రారంభ సదస్సులో ప్రకటించారు. (ఈ. 8.5.89)

ప్రారంభించు క్రి. praarambhincu ఒక కార్యక్రమాన్ని మొదలుపెట్టు to start, initiate పరస్పర సహకారానికి సంబంధిం చిన పెద్ద సమస్యలను గురించి చర్చించడం ప్రారంభించారు. (ఆం. ప 3.7.87)

ప్రావిడెంట్ ఫండ్ వి. praaviDenT fanD ఒక ఉద్యోగి జీతంలో నుంచి కొంత శాతాన్ని తీసి ఆ ఉద్యోగి ఖాతాలో జమ చేయగా ఏర్పడే భవిష్యనిధి provident fund ఫ్యాక్టరీల యజమానులు కోట్లాది రూపాయలమేర కార్మికుల ప్రావిడెంట్ ఫండ్ కూడా జమచేయకుండా ... (ఆం. భూ. 9.8.89)

**ప్రాసిక్యూట్ చేయు** క్రి. *praasikyu-uTceeyu* నిబంధనలను ఉల్లంఘించినందుకు న్యాయస్థానాలు విచారణ జరిపి శిక్షించు to prosecute ఉజ్బెక్ కుంభకోణంలో పార్టీ నాయకులను ప్రాసిక్యూట్ చేయడానికి సంస్కరణ వాదులైన న్యాయమూర్తులు తీవ్రంగా కృషి చేస్తున్నారు. (ఆం భూ 4 6 89)

**ప్రాసిక్యూషన్** వి. *praasikyuu-San* నిబంధనలు ఉల్లంఘించి నందుకు న్యాయస్థానం విచారించి శిక్షించటం prosecution సంచలనం సృష్టించిన కేసు దర్యాప్తు వివిధ రాష్ట్రాలతో ముడిపడి ఉన్నందున నిందితులపై దర్యాప్తు జరిపి ప్రాసిక్యూషన్ చేసే అధికారాన్ని పొందేందుకు అనుమతికోసం త్వరలో సుప్రీంకోర్టును కూడా ఆశ్రయించ నున్నట్లు శ్రీ జయ రామారావు తెలియజేశారు. (ఆం. భూ 1.9 89)

**ప్రిసైడింగ్ అధికారి** వి. *prisaiDing adhikaari* చట్ట సభలను నిర్వహించే (అధ్యక్షత వహించే) స్పీకర్ లేదా ఛైర్మన్ presiding officer బొమ్మయ్ ప్రభుత్వాన్ని కూలదోయడంలో తన జోక్యం ఏదైనా వుందేమో దర్యాప్తు చేయాలని, తన హస్తం ఉన్నట్లు రుజువైతే ప్రిసైడింగ్ అధికారి విధించే ఏ శిక్షకైనా ఒప్పుకుంటానని రాజ్యసభ ఛైర్మన్‌కు విజ్ఞప్తి చేశారు. (ఈ 27 4.89)

**ప్రిసీడియమ్** వి. *prisiiDiyam* ఒక రాజకీయ సంస్థలో విధాన నిర్ణయాలను, కార్య నిర్వహణ బాధ్యతను నిర్వహించే అధ్యక్ష మండలి presidium కేంద్రంలో కాంగ్రెసేతర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసేందుకు, ఇతర ప్రతిపక్షాల మద్దతును సమీకరించే చర్చలను జరిపేందుకై నేషనల్ ఫ్రంట్ అధ్యక్ష మండలి (ప్రిసీడియమ్) ఐదుగురు సభ్యులతో ఒక కమిటీని ఏర్పాటు చేసింది. (ఆం భూ 29 11 89)

**ప్రేరకద్రవ్యం** వి. *preerakadravyam* కృత్రిమంగా ఉత్తేజం కలగడానికి తీసుకునే మందు లేదా రసాయనం (ఇటువంటి ప్రేరకాలను వాడటం నియమ విరుద్ధం) steroid, drug ప్రేరక ద్రవ్యాలు డ్రగ్స్ వాడి తమ శక్తి సామర్థ్యాలను అక్రమంగా పెంచుకునే క్రీడాకారులను పట్టివేయడానికి అంతర్జాతీయ ఒలింపిక్ కమిటీ (ఐ.ఓ.సి) ఒక కొత్త పథకం ప్రవేశపెట్టబోతుంది. (ఆం భూ 27 4 89)

**ప్రైవేటీకరణ** వి. *praiveeTiikaraNa* ప్రభుత్వ అధీనంలో ఉన్న సంస్థలను, పరిశ్రమలను పెట్టుబడిదారులకు అప్పగించటం privatization ప్రభుత్వరంగ పరిశ్రమలను ప్రైవేటీకరణ చేయాలని ప్రభుత్వరంగ సంస్థల అధిపతులు సిఫారసు చేశారు. (వి. 8 9.87)

**ప్రైవేట్ ప్రాక్టీసు** వి. *praiveeT praak-Tiisu* ప్రభుత్వ ఆస్పత్రులలో పనిచేసే వైద్యులు, ఆ ఆస్పత్రులలో కాకుండా వేరే చోట అదనపు సమయంలో రోగులను పరీక్షించి ధనార్జన చేయటం private practice (of doctors) ప్రభుత్వ డాక్టర్ల ప్రైవేట్ ప్రాక్టీసును నిషేధించే విషయం పరిశీలించి సూచనలు చేసేందుకు గాను నిపుణుల కమిటీ నొకదాన్ని ఏర్పాటు చేయాలని ... (ఈ 26.6 87)

**ప్రొపెల్లర్** వి. *propellar* వేగం పుంజుకోవటానికి విమానానికి ముందు అమర్చిన రెక్కల చక్రం propeller అగ్ని నాలుగు దశల్లో గగనంలోకి దూసుకు పోయే రాకెట్, దీనికి లోహపు రెక్కలుగల ప్రొపెల్లర్, ద్రవప

దార్థాల సహాయంతో తిరిగే ప్రొపెల్లెంట్‌లు రెండూ ఉంటాయి. (ఆం భూ. 23. 5 89)

ప్రొబేషన్ వి. *probeeSaN* ఉద్యోగిని ఒక పదవిలో స్థిరం చేసేందుకు అతని పని విధానాన్ని పరిశీలించేందుకు నిర్దేశించిన కాలపరిమితి probation పరీక్షల ఫలితాలు ప్రచురించిన మరుసటిరోజు నుండి వీరిని రెగ్యులర్ స్కేలులోనికి మార్చి ప్రొబేషన్‌పై ఉంచుతారని ఆయన చెప్పారు. (ఆం. భూ. 28.8.89)

ప్రొరోగ్‌అగు క్రి. *proroogagu* చట్ట సభల సమావేశం లాంఛనంగా రాజ్యాంగాధినేత ఆదేశంమేరకు ముగియు; పో. చూ. విఘటన చేయు to be prorogued సభ ప్రొరోగు కాకుండా అప్పటికి మాత్రమే వాయిదా పడినప్పుడు ఆ సభకు సంబంధించినంతవరకు అది సమావేశంలో ఉన్నట్టే పరిగణిస్తారు. (ఆం.భూ. 29.4 89)

ప్రొవిన్షియల్ అటానమీ వి. *provin-Siyal aTaanamu* రాష్ట్రాలు స్వయం ప్రతిపత్తిని కలిగి ఉండటం provincial autonomy ఆనందపూర్ సాహెబు తీర్మానానికి కూడా ప్రోత్సాహం జాతీయోద్యమ కాలంలో కాంగ్రెస్ ప్రచారం చేసిన "ప్రొవిన్షియల్ అటానమీ" (స్వయం పరిపాలనా ప్రతిపత్తి) నుంచే లభించిందని మరువరాదు. (ఆం. భూ. 22.12.89)

ప్రోటోకాల్ వి. *prooTookaal* దౌత్య సంబంధాలలో, దేశాధినేతల పరస్పర సంబంధాలలో అనుసరించే ప్రవర్తనా నియమావళి protocol సోవియట్ అధ్యక్షుడు గ్రొమికో ప్రోటోకాల్‌ను కాదని ఉభయ దేశాల మధ్య కుదిరిన శాస్త్ర సాంకేతిక ఒప్పందం సంతకాల కార్య[క్ర]మానికి హాజరుకావడం విదితమే. (ఆం. ప్ర. 5.7.87)

ప్రోత్సాహం వి. *prootsaaham* కార్య[క్ర]మాల అభివృద్ధికి దోహదం చేసే విధంగ[ా] ఉత్తేజం కలిగించటం;తోడ్పాటు filli[p] encouragement స్వయం ఉపాధి ప[థ]కాలకు ప్రభుత్వం ప్రోత్సాహం ఇవ్వాలని ... (ఆం. భూ. 17 10.87)

ప్రోత్సాహకం వి. *prootsaahakan* ఒక రంగంలో మంచి కృషి జరగడాని[కి] ఎక్కువ ఫలితాలు సాధించడానికి ఇచ్చే డబ్బు, బిరుదులు, బహుమతులు వంటి[వి] incentive టూరిజం పరిశ్రమను ప్రోత్[సా]హించేందుకోసం వివిధ ప్రోత్సాహకాల[ను] ప్రకటించే యోచన చేయాలని ... కోరారు. (ఆం. ప్ర. 14 10 87)

ప్రోద్బలం వి. *proodbalam* ఒకరు ఒక పని[లో] పాల్పడేందుకు మరొకరు ఇచ్చే మద్దత[ు] instigation, support ఈ కుం[భ]కోణం కేవలం వార్డెన్లవల్ల జరిగినదికాద[ని] ఉన్నత స్థానాలలోని అధికారుల ప్రోద్బల[ం] వల్లనే జరిగి ఉండవచ్చునన్న అనుమానా[న్ని] ఆయన వ్యక్తం చేశారు. (ఆం. జ్యో. 1.12.87)

ప్లాటినం జుబ్లీ ఉత్సవం వి. *plaaTinam jublii utsavam* (ఒక సంస్థకు) 7[5] ఏళ్ళు నిండిన తర్వాత జరుపుకునే వేడు[క] platinum jublee ఈ నెల 16[న] మద్రాసులో భారతీయ చలనచిత్ర పరిశ్ర[మ] ప్లాటినం జుబ్లీ ఉత్సవాల సందర్భంగా ... (ఆం భూ 26 4 89)

ప్లాటూన్ వి. *plaaTuun* పోలీసులతో లేద[ా] సైనికులతో కూడిన ఒక ఉప విభాగ[ం] platoon ముందు జాగ్రత్త చర్యగా ఊ[రే]గింపు వెంట మూడు ప్లాటూన్ల ఆంధ్రప్రదే[శ్]

స్పెషల్ పోలీసులను నియమించారు. (ఆం భూ 1689)

**ప్లానింగ్ కమిటీ** వి. *plaaning kamiTii* ప్రణాళికలను రూపొందించి కార్యక్రమాలను సిద్ధంచేసే వ్యవస్థ planning committee జిల్లాస్థాయిలోగాని, బ్లాక్‌స్థాయిలోగాని ప్లానింగ్ కమిటీలూ, స్థానిక పథకాల సమన్వయీకరణకు ఏర్పడిన కౌన్సిళ్ళూ వాటి అధికారాలు ఊడిపోయాయి. (ఆం. భూ. 9.5.89)

**ప్లీనరీ సమావేశం** వి. *pliinarii samaaveeśam* పార్టీ విధానాలు, లక్ష్యాలపై చర్చించి, నిర్ణయాలు తీసుకునేందుకుగాను విశాల ప్రాతిపదికన ఏర్పాటైన సమావేశం; సర్వసభ్య సమావేశం plenary session చివరి ప్లీనరీ సమావేశంలో బ్రిటన్‌కు చెందిన ప్రతినిధి ఇమన్ లారెన్స్ మాట్లాడుతూ దక్షిణాఫ్రికాలో కొనసాగుతున్న శ్వేతజాతి దురహంకార ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆర్థిక ఆంక్షలను విధించడం తీవ్రతరం చేయాలని చెప్పారు. (ప్ర.శ 7.9.87)

**ప్లెబిసైట్** వి. *plebisaiT* రాజకీయ సమస్య పరిష్కారానికి ప్రజాభిప్రాయ సేకరణ జరపటం (తద్వారా) నిర్ణయం తీసుకోవటం plebiscite కాశ్మీర్‌లో ప్లెబిసైట్ నిర్వహించే ప్రసక్తిలేదని ఒక ప్రశ్నకు ఆయన జవాబు చెప్పారు. (ఆం భూ. 18.7.89)

**ప్లేకార్డులు** వి. (బ.వ.) *pleekaarDulu* ఊరేగింపులో ప్రదర్శకులు పట్టుకునే నినాదాలు రాసిన అట్టలు placards ప్రదర్శకులు జిల్లాల వారిగా పెద్ద బ్యానర్లు, ప్లేకార్డులు ధరించి ప్రదర్శనలో పాల్గొన్నారు. (వి 14.8.87)

**ప్లేగ్రౌండ్** వి. *pleegraunD* ఆటలు ఆడుకోవటానికి ఏర్పాటు చేసిన స్థలం playground మొగల్‌పురా ప్లేగ్రౌండ్‌లో స్విమ్మింగ్‌పూల్ నిర్మాణ కార్యక్రమం త్వరలో మళ్ళీ ప్రారంభమవుతుంది. (ఆం. ప్ర 22.4.89)

**ప్లేటు ఫిరాయించు** క్రి. *pleeTu firaayincu* మొదట అన్నదానికి విరుద్ధంగా మాట్లాడు; మాటమార్చు to change the word దీనితో ఆయన ప్లేటు ఫిరాయించారు. తాను ఈ మాటలు అనలేదనీ, పత్రికలే చిలువలు పలువలు సృష్టించాయని ఆయన పత్రికలపై దుమ్మెత్తిపోశారు. (ఆం ప్ర. 22.8 89)

**ప్లేటు మార్చు** క్రి. *pleeTu maarcu* చూ. ప్లేటు ఫిరాయించు ... ఇప్పుడు హఠాత్తుగా పటౌడి ప్లేటు మార్చి ఆటగాళ్ళను వెనకేసుకురావడం ఆశ్చర్యంగా ఉంది. (ఆం భూ. 15.9 89)

**ప్లేయర్** వి. *pleeyar* ఆటగాడు, క్రీడాకారుడు player, athlete, sportsman కళాశాల ఆవరణలో ఫుట్‌బాల్ ప్లేయర్ ఇందర్ బీర్ సింగ్‌ను ... (ఉ 15 6.87)

## ఫ

**ఫక్కీ** వి. *phakkii* ఒక అంశాన్ని దృష్టిలో పెట్టుకొని అదేపద్ధతిని పాటించటం; మాదిరి, పద్ధతి style సినిమా ఫక్కీలో ఇద్దరు దుండగులు ఒక ఇంటిని దోచుకుని ... (ఆం భూ 20.6.87)

**ఫర్మానా** వి. *farmaanaa* అధికారికంగా జారీ చేసే ఆజ్ఞ; ఉత్తర్వు government order తమ ఫర్మానా మేరకు దేశం వదలి వెళ్ళని భారతీయుల్ని కుట్రదారులుగా పరిగణిస్తామని ఆయన హెచ్చరించారు. (ఆం భూ 26 5.89)

**ఫలకాలువేయు** వి. *phalakaaluveeyu* నిర్మాణ ప్రారంభానికి సూచకంగా ప్రారంభకుల పేరుతో ఉన్న సిమెంటు దిమ్మెను నెలకొల్పు to lay a foundation stone ... పాలనా పరమైన అనుమతి లేకుండా మంత్రులు పథకాలకు ఫలకాలువేయడం పంచాయితీ ఎన్నికల కోసమే అన్నది తేటతెల్లమవుతున్నది. (ఆం భూ. 19.2.88)

**ఫామ్** వి. *faam* (ఆటగాళ్ళు) శారీరకంగానూ, మానసికంగానూ దృఢంగా ఉండి చక్కని నైపుణ్యం ప్రదర్శించగలిగిన స్థితి form 'ఫామ్'గురించి మాట్లాడుతూ, కనీసం ఆరు వారాలపాటు క్రికెట్ ఆడితేనే 'ఫామ్'లోకి రాగలనని ఇమ్రాన్ అన్నాడు. (ఆం ప్ర 5.10 89)

**ఫార్మసిస్టు** వి. *faarmasisTu* ఔషధాల తయారీలో ప్రావీణ్యం గల వ్యక్తి pharmacist ప్రభుత్వ ఆసుపత్రులలో పనిచేస్తున్న ఫార్మసిస్టులు చాలమంది బినామీ పేర్లతో సొంత మందుల దుకాణాలు నడుపుకుంటున్నారని ఈ దాడులలో బయటపడిందని కూడా ఆయన చెప్పారు. (ఆం భూ. 19.5.89)

**ఫార్సు** వి. *faarsu* చూ. ప్రహసనం farce రేషన్ కార్డుల పంపకం విషయంలో మంత్రులు చేసే వాగ్దానాలు ఫార్సుగా తయారయ్యాయి. (ప్ర.శ 10 10 87)

**ఫాలోఆన్** వి. *faalooaan* (క్రికెట్ ఆటలో) ఎదుటి పక్షం చేసిన పరుగుల కన్నా 200 పరుగులు తక్కువగా ఉన్నప్పుడు తిరిగి బ్యాటింగ్ చేయవలసిన పరిస్థితి follow on ఈ మ్యాచ్ తొలి ఇన్నింగ్స్‌లో 580 పరుగులు చేసిన భారత్ నుంచి ఫాలోఆన్ తప్పించుకోవాలంటే జమైకా ఇంకా తొలి ఇన్నింగ్స్‌లో 156 పరుగులు చేయాలి. (ఈ. 26.4 89)

**ఫాసిజం** వి. *faasijam* ప్రజాస్వామ్య పద్ధతులను కాలరాసి ఒకే వ్యక్తి సర్వాధికారాలను చలాయించే పాలనా విధానం (హిట్లర్, ముస్సోలినీ మొదలైన నియంతలు సాగించిన పాలన) fascism ఎన్నో దేశాలలో ఫాసిజం యిలాగే పుట్టింది. ఎప్పుడు దీనికి అంతం? అంటూ ఈ నాయకులు ఆవేదనతో ప్రశ్నించారు. (ప్ర.శ. 27 7.87)

**ఫాసిమిలీ కాపీ** వి. *faasimilii kaapii* అసలు పుస్తకం లేదా పత్రాలకు అదే విధంగా తయారు చేసిన ప్రతి; నకలు ప్రతి facsimile copy లోక్‌సభ స్పీకర్ తమిళనాడు ముఖ్యమంత్రి యం.జి.రామచంద్రన్‌కు వ్రాసిన లేఖల ఫాసిమిలీ కాపీలను 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'పత్రిక మంగళవారం ప్రచురించింది. (ఆం భూ. 10.5.89)

**ఫాసిస్టు** వి. *faasisTu* ఫాసిజంతో కూడిన పరిపాలన సాగించే నియంత fascist ఎన్.టి.ఆర్. ప్రభుత్వం, వారి పోలీసులు అనుసరిస్తున్న ఫాసిస్టు చర్యలకు ఈ సంఘటన తిరుగులేని నిదర్శనమని గణపతి ఒక ప్రకటనలో పేర్కొన్నారు. (ఆం. భూ. 1 9.89)

**ఫాసిస్టు రాజ్యం** వి. *faasisTu raajyam* నియంతృత్వ పాలనతో కూడుకొన్న వ్యవస్థ fascist state పోలీసు కేసులు ఉన్న నరసరావు పేట శాసనసభ్యుడు ... పై కేసులు ఉపసంహరిస్తూ ప్రభుత్వం జి.వో. జారీ చేయడంతో పాటు మంత్రిపదవి ఇవ్వడం వంటిదాన్ని ఫాసిస్టు రాజ్యం తప్ప శాంతి భద్రతలు పరిరక్షించే ప్రభుత్వం కాదని రుజువు అవుతుందని ఆయన విమర్శించారు. (ఆం. భూ. 23.7.87)

**ఫిరాయించు** క్రి. *firaayincu* క్రమశిక్షణ

లేకుండా ప్రలోభంతో ఒక పార్టీ నుంచి మరో పార్టీలోనికి మారు to defect ... శాసనసభ్యులు వీరప్పన్ వర్గంలోకి ఫిరాయిం చకుండా ఉండడానికి వారి నందరినీ బెంగు ళూరు చేర్చి నిఘా ఉంచినట్లు తెలిసింది. (ఆం ప్ర. 5 1.88)

**ఫిరాయింపు నిషేధ చట్టం** వి. *firaay-impu niSeedha caTTam* ఎన్నికలలో ఎన్నికైన అభ్యర్థి పార్టీలను మార్చకుండా ఉండేందుకు ప్రభుత్వం రూపొందించిన శాసనం anti-defection law ఇండి పెండెంట్ అభ్యర్థి అయినాసరే ఎన్నికయ్యాక ఏ రాజకీయ పార్టీలోనూ చేరకూడదని ఫిరా యింపు నిషేధ చట్టం నిర్దేశిస్తోంది. (ఈ. 23.11.89)

**ఫిరాయింపుల నిరోధక చట్టం** వి. *firaay-impula niroodhaka caTTam* చూ. ఫిరాయింపు నిషేధ చట్టం. ఎన్నికలలో ఒక అభ్యర్థి విజయం సాధించినట్టు ఎన్నికల కమీషన్ 'సర్టిఫికెట్'జారీ చేసిన క్షణం నుండీ ఆ అభ్యర్థి విషయంలో ఫిరాయింపుల నిరోధక చట్టం వర్తిస్తుందని ఎన్నికల కమీషన్ స్పష్టం చేసింది. (ఆం ప్ర 24 11 89)

**ఫిర్యాదీదారుడు** వి. *firyaadiidaaruDu* న్యాయంకోరుతూ కోర్టులో ఫిర్యాదు పత్రం దాఖలు చేసిన వ్యక్తి petitioner ... బాధితులకు అన్యాయం కలుగకూడ దన్న భావనతో, పరిహార సొమ్ము అంచనాకు కొన్ని ఆధారాలను తీసుకున్నామని, ఆ ఆధారాలకు ఫిర్యాదీదారులు కూడా ఎలాంటి ఆక్షేపణలు తెలుపలేదని రాజ్యాంగ బెంచ్ వివరించింది. (ఈ. 5.5.89)

**ఫిర్యాదు** వి. *firyaadu* అసంతృప్తికర మైన లేదా లోపభూయిష్టమైన పరిస్థితు లను గురించి సంబంధిత అధికారులకు పెట్టుకొనే అర్జీ complaint ... రైల్వే శాఖకు ఇలాంటి ఫిర్యాదేమీ రాలేదని మంత్రి సింధియా బదులిచ్చారు. (ఈ. 25 4.89)

**ఫిల్మ్ సెన్సార్ బోర్డు** వి. *film sensaar boorDu* చలనచిత్రాలలో కథా నిర్మాణం సాంఘిక విలువలకు సరిపోయే విధంగా ఉన్నదీలేనిదీ చూసి, అసభ్యకర సన్ని వేశాలను తొలగింప చేసే ప్రముఖు లతో కూడిన సంస్థ film censor board కేంద్ర ప్రభుత్వం అధికారంలోని ఫిల్మ్ సెన్సార్ బోర్డు ఆమోదించిన సిని మాల మీద కూడ ఆంక్షలు విధిం చడం ఈ బిల్లు మరో విశిష్టత. (ఆం. భూ 20.6 87)

**ఫీచరు** వి. *fiicar* పత్రికలలో సమకా లీన విషయాలపై వివరాలతో, విశ్లేషణలతో కూడిన వ్యాసం (సంపాదకీయపు పేజీలో ప్రచురించబడే వ్యాసాలు) features in newspapers పత్రికల ఫీచర్సు లోనూ మాండలికాల వాడుక పెరిగింది. (ఆం. జ్యో. 16.8 87)

**ఫీల్డర్** వి. *fiilDar* క్రికెట్‌లో బంతిని, పరుగులను అదుపులో పెట్టటానికి ప్రతి పక్ష జట్టులో ఉండే ఆటగాడు fielder ఫీల్డర్లను కూడా తికమకపెట్టి కేవలం 70 బంతుల్లో అదీ 55 నిమిషాల్లో 70 పరుగులు తీశాము. (ఈ. 26 6 87)

**ఫుల్‌బెంచి** వి. *fulbenci* ఐదుగురు లేదా ఏడుగురు న్యాయమూర్తులతో కూడు కొన్న ధర్మాసనం full-bench అడ్వ కేట్ జనరల్ శ్రీ వెంకట రమణయ్య ఫుల్‌బెంచి ముందు తనవాదనలు వినిపిస్తూ మంత్రివర్గం సమష్టిగా శాసనసభకు జవాబు దారీ వహిస్తుందే తప్ప న్యాయస్థానానికి, మరే ఇతర సంస్థకు జవాబుదారీ కాదని అన్నారు. (ఆం. ప్ర. 28.6.89)

**ఫెన్సింగ్** వి. *fensing* (ఆటల పోటీల్లో భాగంగా చేసే)కత్తియుద్ధం fencing *మహిళల ఫెన్సింగ్ పోటీల్లో ఫోయిల్ విభాగంలో డయానా ఈ స్వర్ణపతకం సాధించింది.* (ఆం. ప్ర. 24 8.89)

**ఫెరా** వి. *feraa* విదేశీ మారక ద్రవ్య నియంత్రణ చట్టం Foreign Exchange Regulations Act ... *ప్రధాని జోక్యం చేసుకొని ఫెరాను ఉల్లంఘించారన్న ఆరోపణపై ఛద్దా మీదా కేసు పెట్టవచ్చునన్నారు.* (ఈ. 18.6.87)

**ఫైనల్స్** వి. *fainals* ఆటలలో విజేతలను నిర్ణయించే చివరిపోటీ; ఆఖరిపోటి finals *స్వీడన్‌లోని స్కెలెఫ్టాలో జరుగుతున్న ప్రపంచకప్ చెస్ పోటీల్లో అతను అందరినీ ఓడిస్తూ ఫైనల్స్‌కు చేరుకున్నాడు.* (ఆం ప్ర 28.8.89)

**ఫైవ్‌స్టార్ సంస్కృతి** వి. *faivsTaar samskRti* సంపన్నులకే పరిమితమైన విలాసవంతమైన (హోటళ్లలోని) జీవన విధానం five-star hotel culture *పర్యాటకులను ఆకర్షించడంకోసం ఫైవ్‌స్టార్ సంస్కృతిని ప్రోత్సహించడంలో అర్థంలేదని, భారతీయ సంస్కృతిని, కళలను ప్రదర్శించడం ద్వారా టూరిజంను అభివృద్ధి చేయాలని ... అన్నారు.* (ఆం జ్యో 30.6 87)

**ఫోర్** వి. *foor* క్రికెట్‌లో బంతిని కొట్టినప్పుడు ఆ బంతి దొర్లుకుంటూ బౌండరీ దాటినప్పుడు వచ్చే నాలుగు పరుగులు four *గ్రీనిడ్జ్ 69 పరుగులు సాధించాడు. 8 ఫోర్లు, ఒక సిక్సరు కొట్టాడు.* (ఆం.ప్ర. 11 88)

**ఫోరం** వి. *fooram* (ప్రజల ముఖ్యమైన సమస్యలు పరిష్కరించటానికి) కొన్ని ఆదర్శాలు సమానంగా కలిగినవారు ఏర్పాటు చేసుకునే చర్చావేదిక forum *మొదటి సంవత్సరం స్టూడెంట్స్ ఫోరం విద్యార్థులు మంగళవారంనాడు ఒక ప్రకటన విడుదల చేస్తూ విశ్వవిద్యాలయం కొత్తగా విధించిన నిబంధనలవల్ల విద్యార్థుల జీవితాలు నాశనమయ్యే ప్రమాదం ఏర్పడిందని పేర్కొన్నారు.* (ఆం. భూ. 20.4.89)

**ఫోర్జరీ** వి. *foorjarii* ముఖ్యమైన పత్రాలలో దొంగ సంతకాలు చేయటం, సమాచారాన్ని మార్చి తప్పుడు సమాచారాన్ని ఇవ్వటం forgery *ఈ ఉత్తరం వెనుకటి తేదీవేసి వ్రాసిన 'ఫోర్జరీ'ఉత్తరం అవడంలో నాకెలాంటి సందేహం లేదు.* (ఆం. ప్ర. 23.6 87)

**ఫోర్జరీ పత్రం** వి. *foorjarii patram* దొంగ సంతకాలు, తప్పుడు సమాచారంతో సృష్టించిన నకిలీ డాక్యుమెంటు; పో. చూ. ఫోర్జరీ forged document *జనతాదళ్ నాయకుడు శ్రీ వి.పి. సింగ్‌కు సి.ఐ.ఎతో సంబంధాలున్నాయని చెబుతూ ఒక ఆంగ్ల దిన పత్రిక ప్రచురించిన పత్రాలు ఫోర్జరీ పత్రాలని ఇక్కడ అమెరికన్ రాయబార కార్యలయం అభివర్ణించింది.* (ఆం ప్ర 18 11 89)

**ఫ్యూడల్ వైఖరి** వి. *fyuu-Dal vaikhari* పెత్తందారీ మనస్తత్వం feudal attitude *ప్రభుత్వ ఏకపక్ష అప్రజాస్వామిక విధానాలకు వ్యతిరేకంగా, స్వంత రెవిన్యూ డివిజన్‌లో ఉపాధ్యాయులు పనిచేయరాదనే ప్రభుత్వ ఫ్యూడల్ వైఖరికి నిరసనగా రాష్ట్ర ఉపాధ్యాయ సంఘం పిలుపుపై నేడు సచివాలయం ముందు నల్ల బ్యాడ్జీలు ధరించి ఉపాధ్యాయులు సామూహిక ధర్నా జరిపారు.* (వి. 37 87)

**ఫ్లాగ్‌మార్చ్** వి. *flaagmaarc* అల్లర్లు జరిగిన ప్రాంతాల్లో విశ్వాసం పాదుకొల్పేందుకు సైన్యం జరిపే కవాతు flag-march

అస్సాంలోని దారంగ్ జిల్లాలోని మంగాల్డోటు సబ్‌డివిజన్‌లో గతరాత్రి నుంచి పెద్ద ఎత్తున హింసా కాండ జరగడంతో సైన్యం రంగంలోకి దిగి వీధుల్లో ఫ్లాగ్‌మార్చ్ జరిగింది. (ఆం భూ. 17.8 89)

**ఫ్లాప్‌అగు** క్రి. *flaapagu* (సినిమాలు) విజయవంతం కాకుండా నష్టాలపాలగు to flop సొమ్ము దండిగా పోగుచేసుకున్నవారు తర్వాత సినిమా గురించి పట్టించుకోకపోవటంతో సినిమాలు ఫ్లాప్‌అవుతున్నాయి. (ఆం. భూ. 6.6.87)

**బ**

**బంగారుగుడి** వి. *bangaaruguDi* (అమృతసర్‌లో ఉన్న) సిక్కుల ప్రధాన ప్రార్థనామందిరం; స్వర్ణదేవాలయం Golden Temple బంగారుగుడిలో భద్రతా దళాలు: స్వర్ణదేవాలయ సముదాయంపైన, నిషేధించిన సిక్కు విద్యార్థి సమాఖ్య కార్యాలయంపైన ... పోలీసులు, పారామిలిటరీ దళాలు పెద్దఎత్తున దాడులు నిర్వహించి దాదాపు 20 మందిని అరెస్టు చేశాయి. (ఆం జ్యో 24.9 87)

**బండారం** వి. *banDaaram* సామర్థ్యం, స్వభావం మొ. వాటికి సంబంధించి (దాగి ఉన్న) అసలు నిజం real nature గత పార్లమెంట్ సమావేశాల్లో అధికారంలో ఉన్న వారి బండారం బయట పడింది. (ఈ. 8.9.89)

**బంద్** వి. *band* (నిరసన వ్యక్తం చేయటానికి) షాపులు, కార్యాలయాలు మూసివేయటం, రవాణా వ్యవస్థను అడ్డుకోవటం వంటి చర్యలతో మొత్తం దైనందిన జీవితాన్ని స్తంభింపచేయటం bandh ఈ హత్యకు నిరసనగా మంగళవారంనాడు పట్టణ బంద్ జరిగింది. (ఆం. ప్ర. 18.4.89)

**బందీ** వి. *bandii* (కొన్ని ప్రయోజనాలను ఆశించి) ఇతరులు బలవంతంగా పట్టి నిర్బంధించిన వ్యక్తి hostage, captive వారి వెనుకనే మరి 20 మంది బందీలను కూడా హైజాకర్లు విడిచిపెట్టారు. (ఆం. భూ. 21.4.88)

**బందోబస్తు** వి. *bandoobastu* (ప్రముఖుల పర్యటనలు, ఎన్నికలు వంటి సందర్భాలలో) భద్రతకోసం రక్షణ బలగాలను అప్రమత్తంగా ఉంచటం security arrangements పోలీసు బందోబస్తును కట్టుదిట్టం చేశారు. (ప్ర శ. 5.6.87)

**బకాయి** వి. *bakaayi* సకాలంలో చెల్లించకపోవటంవల్ల బాకీ పడ్డ సొమ్ము arrears కేంద్ర ప్రభుత్వోద్యోగులకు చెల్లించవలసిన డి. ఎ. బకాయి విషయమై మే 10వ తేదీలోగా ఒక ప్రకటన చేయగలమని ప్రధాని ... (ఆం. ప్ర. 1 5.89)

**బకాయిపడు** క్రి. *bakaayipaDu* 1. సొమ్ము బాకీపడు to owe ఎన్. టి. పి. సి. కి అత్యధికంగా బకాయిపడ్డ రాష్ట్రాల్లో ఆంధ్రప్రదేశ్ రెండోస్థానంలో ఉంది. (ఆం. భూ 6 6 87) 2. (కేసులు) సకాలంలో పరిష్కారానికి నోచుకోక మిగిలిపోవు to accumulate (as court cases) కేసులు బకాయిపడి కొండల్లా పెరిగిపోతున్నప్పుడు సమ్మెలవల్ల వాటిల్లే నష్టం సామాన్యమైంది కాదు. (ఈ 4.7 89)

**బచావత్ అవార్డు** వి. *bacaavat avaarDu* పత్రికలలో పనిచేసే ఉద్యోగులకు తగిన జీతభత్యాలను సిఫార్సు చేస్తూ బచావత్ అనే న్యాయమూర్తి అధ్యక్షతన (ప్రభుత్వాదేశం మేరకు) ఏర్పడిన సంఘం సమర్పించిన నివేదిక Bachawat award జర్నలిస్టులు, నాన్ జర్నలిస్టులకు

బచావత్ అవార్డు అమలు చేసే విషయంలో తగిన చర్యలు తీసుకోవలసిందిగా రాష్ట్రంలోని ఉభయపక్షాలు ... ప్రభుత్వాన్ని కోరాయి. (ఆం. భూ 22.12.89)

**బట్టబయలుచేయు** క్రి. *baTTabayalu ceeyu* (రహస్యాలు, అవినీతి మొ.వి) బయటపెట్టు to expose నివేదికలోని ప్రతి పేరా బోఫోర్స్‌పై ప్రభుత్వ గుట్టును బట్టబయలుచేస్తున్నాయి. (ఆం ప్ర. 28.7.89)

**బడుగు దేశం** వి. *baDugu deeśam* ఆర్థికంగా వెనుక బడ్డ పేద దేశం poor nation వర్ధమాన దేశాలు ... పెట్టుబడిదారీ దేశాల సహాయ సహకారాల మీద ఆధారపడటం అంటే శాశ్వతంగా బడుగు దేశాలుగా ఉండిపోవడమే. (విశా. 10.6.87)

**బడుగువర్గం** వి. *baDuguvargam* ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడ్డ తరగతికి చెందిన ప్రజలు poor or down trodden section అట్టడుగు బడుగువర్గాల అభ్యున్నతికి అంకితమైన అన్న ప్రభుత్వంలో ... (విశా 8.6.87)

**బడ్జెట్ లీక్** వి. *baDjeT liik* ఆర్థిక సంవత్సరం ప్రారంభంలో చట్టసభలో ప్రతిపాదించే ఆదాయ వ్యయాల సమాచారం ప్రతిపాదన కన్నా ముందుగానే బయటికి పొక్కటం budget leak బడ్జెట్ లీక్ సాకుతో మంత్రి పదవుల్నుండి తొలగించబడ్డవారి జాబితాలో చేరి ... ఆందోళనకు గురవుతున్నట్లు తెల్సింది. (ఆం. భూ. 26.4.89)

**బడ్జెట్ లోటు** వి. *baDjeT looTu* సంవత్సర ఆదాయవ్యయ ప్రణాళికలో ఆదాయం కంటే వ్యయం ఎక్కువగా ఉన్న స్థితి budjet deficit ... ఓట్ల నిమిత్తం రుణ సంతర్పణలు చేయటంకోసం వందల కోట్లు విప్పల విడిగా విరజిమ్మి బడ్జెట్ లోటును పదివేలకోట్ల దరిదాపుల్లోకి తెచ్చిన ప్రభుత్వానికి ఆర్థిక క్రమశిక్షణ గురించి మాట్లాడే అర్హతలేదు. (ఈ. 23.12.87)

**బదలాయించు** క్రి. *badalaayincu* (అధికారాలు, ఆస్తిహక్కులు మొ.) ఒకరి నుంచి మరొకరికి మార్చు to transfer అధికార వికేంద్రీకరణ ద్వారా నగర పురపాలక సంస్థలకు హెచ్చు అధికారాలు బదలాయించ కపోతే ప్రజా సంక్షేమ కార్యక్రమాలను సమర్థంగా అమలు జరపటం వీలుకాదని ఆమె అన్నారు. (ఈ. 22.8.89)

**బదలాయింపు** వి. *badalaayimpu* (అధికారాలు, ఆస్తిహక్కులు మొ.) ఒకరి నుంచి మరొకరికి మార్చటం transfer బోగస్ భూమి బదలాయింపులపై విచారణ జరపాల్సిందిగా బొజ్జా తారకం డిమాండ్ చేశారు. (ఆం. ప్ర 23.6.87)

**బదిలీ** వి. *badilii* (సాధా. ఉద్యోగులను) ఒక చోటునుంచి మరోచోటికి మార్చటం transfer (usu. of employees) ... ఇప్పటికైనా ప్రభుత్వం ఉపాధ్యాయులు బదిలీ ఆయుధానికి బలికాకుండా చూడాలని ... (ఆం. భూ 4.10.87)

**బదులిచ్చు** క్రి. *badulhccu* (ఇతరుల ప్రశ్నకు లేదా వ్యాఖ్యకు) సమాధానం చెప్పు to reply, answer 'అప్పుడు ప్రతిపక్షాలు కూడా తాము చేస్తున్నట్టు ఆందోళన చేసి ఉండవలసింది' అని చెన్నారెడ్డి బదులిచ్చారు. (ఆం జ్యో 6.12.88)

**బదులుచెప్పు** క్రి *baduluceppu* (శత్రుపక్షం దాడికి) ఎదురుదాడి చేయటం ద్వారా సమాధానం చెప్పు to reply (to an attack by the enemy) అదే విధంగా ఎలాంటి సవాళ్ళు ఎదురైనా అమెరికా దళాలు బదులుచెబుతాయని రీగన్

ఈ సందర్భంగా హెచ్చరించారు. (ప్ర శ 24.10 87)

**బద్దలుకొట్టు** క్రి. *baddalukoTTu* (అంతకు పూర్వం ఉన్న అత్యున్నత రికార్డుని) అధిగమించు to break (a record) *పి. టి. ఉష 400 మీటర్ల పందాన్ని 51.90 సెకన్లలో పరుగెత్తి తన పాత రికార్డును తానే బద్దలుకొట్టింది.* (ఈ. 18.11 89)

**బద్నాంచేయు** క్రి. *badnaamceeyu* నిందలపాలు చేయు to blame *తెలుగుదేశం ప్రభుత్వాన్ని దుందుడుకు చర్యలతో బద్నాం చేస్తున్నారు.* (ఉ 15 6 84)

**బనాయించు** క్రి. *banaayıncu* (తప్పుడు కేసులు) పెట్టు file (false cases) *పోలీసులు తప్పుడు కేసులు బనాయిస్తున్నారని ఆయన ఆరోపించారు.* (ఆం భూ 30 5.89)

**బయటపెట్టు** క్రి. *bayaTapeTTu* (గుప్తంగా ఉన్న విషయాన్ని) అందరి దృష్టికి తీసుకువచ్చు to reveal *పేద ప్రజల నుండి కూడా ఈ ఆసుపత్రిలో డబ్బులు వసూలు చేస్తామని ప్రభుత్వం స్పష్టమైన ప్రకటన చేసి తన నిజ స్వరూపాన్ని బయటపెట్టాలని ఆయన డిమాండ్ చేశారు.* (ఆం ప. 16 10.87)

**బరితెగించు** క్రి. *barıtegincu* మర్యాదల్ని లేదా హద్దుల్ని నిర్లక్ష్యం చేయు to cross one's limits *లోక్‌సభ ఎన్నికలు సమీపించే కొద్దీ కేంద్రంలోని కాంగ్రెస్‌పార్టీ ప్రభుత్వం తిరిగి అధికారంలోకి రావాలనే తాపత్రయంతో బరితెగించి ప్రవర్తిస్తోందని ... అన్నారు.* (ఈ 26 5.89)

**బర్తరఫ్‌చేయు** క్రి. *bartarafceeyu* అధికారం నుండి తప్పించు to dismiss *ప్రజలకు భద్రత కల్పించలేని ప్రభుత్వాన్ని బర్తరఫ్‌చేయాలని కోరుతూ (ప్రతిపక్ష సభ్యులు ఊరేగింపుగా వెళ్ళి గవర్నర్‌కు మెమొరాండం) సమర్పించనున్నారు.* (ఆం ప్ర 18 7 89)

**బలం చేకూర్చు** క్రి. *balam ceeku-urcu* (ఆరోపణలు, అనుమానాలు) నిజం అనిపించేందుకు దోహదపడు to strengthen or support (an allegation or a suspicion) *శ్రీ చద్దా, ఆయన కుమారుడు భారత దేశానికి వచ్చి బోఫోర్స్ విషయంలో నిజానిజాలను కోర్టులో వెల్లడించడం అధికారులకు ఇష్టం లేదన్న విషయం ఆరోపణలకు బలం చేకూరుస్తోందని ఆయన అన్నారు.* (ఆం. భూ 20 2.88)

**బలగం** వి *balagam* (యుద్ధం, శాంతి భద్రతల నిర్వహణ వంటి) ప్రత్యేక కార్యనిర్వహణకోసం నియమించిన వ్యక్తుల బృందం force *రాష్ట్రంలో నక్సలైట్ల సమస్యను ఎదుర్కొనేందుకు అదనపు పోలీసు బలగాలను ఇచ్చేందుకు తమిళనాడు ప్రభుత్వం అంగీకరించిందని ముఖ్యమంత్రి వెల్లడించారు.* (ఆం ప్ర. 5.9.89)

**బలనిరూపణ** వి. *balanıruupaNa* (చట్ట సభలలో)తనకున్న మెజారిటీని చూపించటం proof of sb's majority *అసెంబ్లీలో బలనిరూపణకు జనతాదళ్ ముఖ్యమంత్రి శ్రీ ఎస్. ఆర్. బొమ్మైకు అవకాశం ఇవ్వకుండానే ... ప్రతిపక్షాలు పార్లమెంట్‌లో శ్రీ వెంకటేశ్వరపై దుమ్మెత్తిపోశాయి.* (ఈ 25 4.89)

**బలపడు** క్రి. *balapaDu* తగినంతగా శక్తి సామర్థ్యాలు సంతరించుకొను to become strong *రాష్ట్రంలో అనేక సమస్యలున్నాయని వీటిని పరిష్కరించేందుకు*

ముందు పార్టీ బలపడాలని ఆయన అన్నారు. (ఈ. 22.5.89)

బలపరచు క్రి. *balaparacu* (రాజకీయ, పరిపాలనా వ్యవహారాలలో) తమ మద్దతును ప్రకటించు to support రానున్న లోక్‌సభ ఎన్నికలలో మార్క్సిస్టు పార్టీ కాంగ్రెస్(ఐ)ని బలపరిచేందుకు ఒక రహస్య ఒప్పందం కుదిరినట్లు బొంబాయి నుంచి వెలువడే ఒక పత్రికలో వచ్చిన వార్త వాస్తవం కాదని ... (ఆం. భూ. 14.5.89)

బలపరీక్ష వి. *balapariikSa* చట్టసభలలో ఒక నాయకునికి మెజారిటీ మద్దతు ఉన్నదీ లేనిదీ తేల్చటం test of strength or majority మేలో హెగ్డే బలపరీక్ష (ఆం. భూ 20 4.88)

బలప్రదర్శన వి. *balapradarśana* సంఖ్యా పరంగా తమ శక్తి బహిరంగంగా నిరూపించే ప్రయత్నం showdown ఆ సమావేశంలో జనతా పార్టీలోని రెండు వర్గాల బల ప్రదర్శన జరుగవచ్చునని పరిశీలకులు భావిస్తున్నారు. (ఉ 21.4.88)

బలప్రయోగం వి. *balaprayoogam* (ఒక పని సాధించటంకోసం) శారీరక బలం లేదా ఆయుధాలను ఉపయోగించటం use of force సియాచిన్ ప్రాంతంలో బలప్రయోగాన్ని విడనాడుతానని హామీ ఇవ్వడానికి పాకిస్తాన్ నిరాకరించింది. (ఆం భూ 1 10 87)

బలవంతంచేయు క్రి. *balavantamceeyu* ఒక పనికి (ఇష్టం లేకపోయినప్పటికీ) ఒప్పుకొమ్మని ఒత్తిడి చేయు to force అప్పుడు కూడా స్పీకర్, తమ ప్రకటనలు నిర్ధారించుకోవాల్సిందిగా ప్రధానినికానీ, మరో సభ్యునికానీ తాను బలవంతంచేయలేనని స్పష్టం చేశారు. (ఆం జ్యో 16 11 88)

బలహీనపడు క్రి. *balahiinapaDu* బలం తగ్గిపోవు to weaken తెలుగుదేశం పార్టీకి, లోక్‌సభ సభ్యత్వాలకు రాజీనామా చేసిన ముగ్గురువల్ల పార్టీకి వచ్చిన నష్టం ఏమీలేదని, పార్టీ బలహీనపడలేదని శ్రీ ఎన్టీ రామారావు చెప్పారు. (ఈ. 16.7.89)

బలహీనవర్గం వి. *balahiinavargam* సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడిన తరగతికి చెందిన ప్రజలు weaker section రెండు రూపాయలకు కిలోబియ్యం, బలహీన వర్గాల వారికి పక్కా ఇళ్ళ నిర్మాణం గురించి చెప్తుంటే వారి ఆశ్చర్యం ఇంతా అంతా కాదు. (ఈ. 17 6.87)

బలాబలాలు వి. (బ.వ.) *balaabalaalu* పోటీపడుతున్న వ్యక్తుల లేదా బృందాల శక్తి సామర్థ్యాలు strength (of rival groups) ... కొందరు పార్టీ నాయకులు తమ బలాబలాలను జమునా సోలంకీ ఎదుట ప్రదర్శించడానికి సంతకాల సేకరణకు పూనుకొన్నట్టు తెలియవచ్చింది. (ఈ 14 8 89)

బలిఅగు క్రి. *baliagu* (ప్రమాదాలు, సంఘర్షణలు మొ. వాటి ఫలితంగా) ప్రాణాలు కోల్పోవు to fall, become a victim (of violent incidents) టెర్రరిస్టుల తుపాకి గుళ్ళకు మొత్తం ఆరుగురు బలయ్యారు. (ఆం ప్ర 18 8 7)

బసచేయు క్రి. *basaceeyu* తాత్కాలికంగా నివసించు to stay బ్రిటన్ పర్యటనకు వచ్చిన ఆమె రిట్జ్ హోటల్‌లో బసచేశారు. (ఆం. భూ 10 7 89)

బహిరంగ చర్చ వి. *bahiran-ga carca* (ఒక సమస్య గురించి) ప్రజల సమక్షంలో చర్చించటం open discussion బోఫోర్స్ కుంభకోణంపై

'కాగ్' నివేదిక గురించి బహిరంగ చర్చలో పాల్గొనేందుకు ... (ఆం ప్ర. 17 8 89)

**బహిరంగపరచు** క్రి. *bahirangaparacu* అందరికీ తెలియజేయు to make sth public, reveal జి. వో. జారీ చేయటానికి, దానిని బహిరంగపరచటానికి మధ్య నెల రోజులు పైగా ఎందుకు పట్టిందనే విషయాన్ని ప్రభుత్వం నుండి తెలుసుకొనగోరుతున్నాం. (విశా 13 10 87)

**బహిరంగ రహస్యం** వి. *bahiranga rahasyam* (సంబంధిత పక్షాలు బయట ఒప్పుకోకపోయినా) అందరికీ తెలిసి పోయిన విషయం open secret చిలీలో దాదాపు 15 సంవత్సరాల క్రితం అలెండీ పతనానికి కారణం అమెరికా విదేశీగూఢచారి సంస్థ సెంట్రల్ ఇంటలిజెన్స్ ఏజెన్సీ అన్నది బహిరంగ రహస్యమే. (ఆం జ్యో. 9 10 88)

**బహిరంగ లేఖ** వి. *bahiranga leekha* ఉద్దేశించిన వ్యక్తికే కాకుండా ప్రజలందరికీ తెలిసేటట్టుగా (వార్తా పత్రికలకు విడుదల చేయడం మొ. పద్ధతుల ద్వారా) రాసే ఉత్తరం open letter ప్రధాన మంత్రి ఈ సవాలు చేసిన వెంటనే శ్రీ సింగ్ ఒక బహిరంగ లేఖలో స్పష్టంచేసిన విషయం తెలిసిందే (ఆం ప్ర. 17 8 89)

**బహిరంగ విధానం** వి. *bahiranga vidhanam* రాజకీయ వ్యవహారాలను రహస్యంగా ఉంచకుండా జనంలో చర్చకు వీలుకల్పించే పరిపాలనాపద్ధతి open policy ప్రజాస్వామ్యంకోసం చైనా విద్యార్థులు జరుపుతున్న ఉద్యమం సత్వర రాజకీయ సంస్కరణ కోసం మరింత బహిరంగ విధానంకోసం వారు చేస్తున్న డిమాండ్లు నిర్లక్ష్యం చేయలేనివి, అణచలేనివని వారు అన్నారు. (ఆం. ప్ర 15 5 89)

**బహిరంగ వేలం** వి. *bahiranga veelam* (ఆస్తులు) అందరి సమక్షంలో పాటపెట్టి ఎక్కువ డబ్బు ఇవ్వజూపిన వ్యక్తికి విక్రయించటం లేదా స్వాధీనం చేయటం public or open auction కాగా ఆలయ ఆధ్వర్యంలోగల సర్వే నెంబరు 11లోని ఒక ఎకరం భూమిని 297లోని ఒక ఎకరం పది గుంటల భూమిని కౌలుకివ్వడానికి బహిరంగ వేలం వేయాలని దేవాలయ కమిటీ నిర్ణయించింది. (ఆం. ప్ర 30 6 89)

**బహిరంగ సభ** వి. *bahiranga sabha* ప్రజలందరూ పాల్గొనటానికి అవకాశం ఉన్న సమావేశం public meeting పూర్ణియా, అరరియా, కిషన్‌గంజ్‌లలో ఏర్పాటు చేసిన బహిరంగ సభలలో రాజీవ్ గాంధీ ప్రతిపక్షాలపై విరుచుకు పడ్డారు. (ఈ. 19.5 89)

**బహిర్గతంచేయు** క్రి. *bahirgatamceeyu* బయటికి చెప్పివేయు to disclose ఛద్దాకు సంబంధించిన నిజానిజాలన్నింటిని బహిర్గతంచేయాల్సిందిగా ఆయన ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. (ఆం. ప్ర. 19 4.88)

**బహిష్కరించు** క్రి. *bahiSkarincu* 1. (శిక్షగా) ఒక దేశం లేదా సంస్థ నుంచి పంపివేయు to expel బెల్‌గ్రేడ్‌లోని ఆస్ట్రేలియా దౌత్యకార్యాలయానికి చెందిన ముగ్గురు దౌత్యవేత్తలను తమ దేశం నుంచి బహిష్కరించినట్లుగా యుగోస్లావియా ప్రకటించింది. (ఆం జ్యో 7 12.88) 2. (నిరసనగా తరగతులు, సమావేశాలు మొ. వాటికి) హాజరుకాకపోవు లేదా పాల్గొనకపోవు to boycott (classes, an event etc.) విద్యార్థి సమస్యలపై ప్రభుత్వం అవలంబిస్తున్న నిర్లక్ష్యానికి నిరసనగా ... విద్యార్థులు తరగతులు

బహిష్కరించారు. 3. (శిక్షగా)ఎలాంటి సంబంధాలు పెట్టుకోకుండా దూరంగా ఉంచు to boycott (a person or a group) దేశ ప్రగతికి సమైక్యతకు అడ్డు తగులుతున్న శక్తులను ప్రజలు బహిష్కరించాలని విజ్ఞప్తి చేశారు. (ఆం ప్ర. 14 6 89)

బహుమతి వి. *bahumatı* ఒక రంగంలో విశేష ప్రతిభ చూపించినవారికి లేదా ఏదైనా పోటీలో గెల్చినవారికి ఇచ్చే పురస్కారం prize నోబుల్ బహుమతికి వ్యతిరేకంగా మూడవ ప్రపంచ దేశాల కోసం ఆయన ఈ బహుమతిని నెలకొల్పారు. (ఆం ప్ర. 26.4 89)

బహుమతిప్రదాన కార్యక్రమం వి. *bahumatıpradaana kaaryakramam* (విజేతలకు) బహుమతిని ఇవ్వటానికి ఏర్పాటుచేసిన (సభా) కార్యక్రమం prize distribution programme సూపర్ స్టార్స్-*86* విజేతలకు బహుమతిప్రదాన కార్యక్రమం ప్రత్యేక రీతిలో జరిగింది. (ఉ 13 7 87)

బహుముఖ కార్యక్రమం వి. *bahu-mukha karyakramam* (ఒక ఫలితం సాధించటానికి) అనేక కోణాల నుంచి ప్రయత్నించటానికి వీలుగా రూపొందించిన కార్యాచరణ పథకం multifarious programme ప్రతిష్ట తిరిగి సంపాదించడానికి ప్రధాని బహుముఖ కార్యక్రమం రూపొందిస్తున్నారని ఆయన సన్నిహిత వర్గాలు వెల్లడించాయి. (ఆం జ్యో. 20.6.87)

బహుముఖ పోటీ వి. *bahumukha pooTıı* (ఎన్నికలలో ఒక స్థానానికి) ఇద్దరికన్నా ఎక్కువమంది ప్రముఖ అభ్యర్థులు రంగంలో ఉండటం multi-cornered contest మొత్తం *87* నియోజకవర్గాలలోను బహుముఖ పోటీలు జరుగుతున్నాయి. (ఆం ప్ర 16 6 87)

బహుళజాతి కంపెనీ వి. *bahu-Lajaatı kampenii* అనేక దేశాలలో పెట్టుబడులు పెట్టి వ్యాపారం చేసే వ్యాపార సంస్థ multi-national (company) వివిధ వర్ధమాన దేశాలలో పనిచేస్తున్న బహుళజాతి కంపెనీలు సి. ఐ. ఎ. ను తోడు చేసుకొని ఆయా దేశాలలో అస్థిరతలను సృష్టిస్తున్నాయని కేంద్ర మాజీమంత్రి ... విమర్శించారు. (ప్ర. శ. 7.7.87)

బహుళజాతి దేశం వి. *bahuLajaatı deeśam* అనేక జాతులకు చెందిన ప్రజలు శాశ్వత నివాసం ఏర్పరుచుకున్న దేశం multi-racial country కొందరు ప్రజలు ప్రచారం చేస్తున్నట్టుగా ఈ దేశం బహుళజాతి దేశం కాదని బి. జె. పి. నాయకుడు .. అన్నారు. (ఆం ప్ర 30.11 88)

బహుళ పన్నుల విధానం వి. *bahuLa pannula vidhaanam* వస్తువుపై ఒక రకం పన్ను ఒకేసారి ఒకేచోట కాకుండా పలుదశలలో విడివిడిగా విధించి వసూలు చేసే పద్ధతి multi-point tax system బహుళ పన్నుల విధానాన్ని రద్దు చేసి, ఒకేచోట నుంచి ఆరుశాతం పన్నులు వసూలు చేసే పద్ధతిని అమలుపరచాలని ... మంత్రి వర్గం నిర్ణయం తీసుకొన్నది. (ఆం ప్ర. 8 2.89)

బహుళార్థ సాధక ఉపగ్రహం వి. *bahuLaartha saadhaka upagraham* (విద్యా వ్యాప్తి , వ్యవసాయం, వాతావరణ పరిశీలన వంటి) అనేక ప్రయోజనాలను సాధించే ఉద్దేశంతో రూపొందించిన ఉప

గ్రహం multi-purpose satellite సాంకేతిక కారణాలవల్ల గత రెండు నెలలుగా నిర్వీర్యంగా ఉన్న భారత జాతీయ బహుళార్ధ సాధక ఉపగ్రహం ఇన్సాట్-1సి మళ్ళీ పనిచేయటం ప్రారంభించింది. (ఆం జ్యో. 9.10 88)

**బాంబు** వి. *baambu* ఒత్తిడి తగిలితే పేలిపోయే స్వభావం కలిగిన పదార్థంతో తయారుచేసిన వినాశకరం, విధ్వంసకరం అయిన వస్తువు bomb రాజధానిలోని సిటీబస్‌లో సోమవారం ఒక ఉత్తుత్తి బాంబు ప్రయాణీకులను నిలువెల్లా వణికించింది. (ఆం. భూ 28.7 87)

**బాకా** వి. *baakaa* (ఒకరి గొప్పతనం గురించి) అనవసరంగా, అతిగా ప్రచారం చేసే సంస్థ a propaganda organ దూరదర్శన్, ఆకాశవాణిలు కాంగ్రెస్-ఐ కి బాకాలుగా మారాయని విమర్శిస్తున్న తెలుగు సమాచారం గురించి ఎందుకు మాట్లాడవని విలేకరుల సమావేశంలో పాల్గొన్న పి.సి.సి. ఉపాధ్యక్షుడు ... ప్రశ్నించారు. (ఆం భూ 15 8 89)

**బాకీపడు** క్రి. *baakiipaDu* చూ. బకాయి పడు. భవన యజమాని తనకు భవనం అద్దె క్రింద 40 వేల రూపాయలకు డైరెక్టొరేట్ బాకీపడిందంటూ కోర్టులో పిటిషన్ దాఖలు చేసుకున్నారు. (ఆం. ప్ర 11 2 87)

**బాక్సర్** వి. *baaksar* (పోటీలలో భాగంగా) చేతులకు తొడుగులు ధరించి పిడికిళ్ళతో పోరాటంచేసే ఆటగాడు boxer నిన్న జరిగిన పోటీల్లో ఆరింటిని ఉత్తర కొరియా బాక్సర్లే గెలిచారు. (ఆం. ప్ర 23 9 89)

**బాక్సింగ్** వి. *baaksing* చేతులకు తొడుగులు ధరించి పిడికిళ్ళతో పోరాడే ఒక రకం పోటీ boxing ప్రపంచ అమెచ్యూర్ బాక్సింగ్ పోటీల్లో ఉత్తర కొరియా ఆధిక్యత చూపిస్తోంది. (ఆం ప్ర 23 9.89)

**బాటవేయు** క్రి. *baaTaveeyu* ఒక కొత్త విధానం లేదా పద్ధతి ఏర్పడి కొనసాగటానికి అవసరమైన అనుకూల పరిస్థితులని ఏర్పరచు to pave the way *1982* నుంచి మనరాష్ట్రంలో ప్రాక్టికంగా డీకంట్రోలు అమలులోకి రావడంతో కొత్త ప్లాంట్ల నిర్మాణానికి, పాత ఫ్యాక్టరీల ఆధునీకరణకు బాటవేసినట్లయింది. (ఈ 19 2.88)

**బాణామతి** వి. *baaNaamati* ఇతరులను బాధించేందుకు ప్రయోగించే మంత్రతంత్రాలతో కూడిన క్షుద్రవిద్య. (కొన్ని గ్రామ ప్రాంతాల్లో ప్రబలంగా ఉన్న మూఢనమ్మకం) sorcery, witchcraft మూఢనమ్మకాలకు నిలయమైన మెదక్ జిల్లాలో మళ్ళీ గతవారం రోజుల నుండి బాణామతి భయం బాగా వ్యాపించింది. (ఆం భూ 29 1 88)

**బాతాఖానీ** వి. *baataakhaanii* కాలక్షేపానికి చెప్పుకునే కబుర్లు chatting వీరంతా ప్రజలెన్నుకున్న పార్లమెంటును బాతాఖానీ క్లబ్బుగా మారుస్తున్నారని విమర్శించారు. (ఆం భూ 5 5.89)

**బాధితుడు** వి. *baadhituDu* ప్రకృతి వైపరీత్యాలవల్లకానీ, తోటి మానవుల దుష్ప్రవర్తనవల్లకానీ కష్టనష్టాలకు గురయిన వ్యక్తి victim, person affected (by natural calamity, disaster etc.) బాధితులందరికీ పదికిలోల బియ్యం కూడా అందజేయనున్నట్లు తెలిపారు. (ఈ. 26 7 89)

**బాధ్యుడు** వి. *baadhyuDu* (అవాంఛనీయ) సంఘటనకు కారణమయిన వ్యక్తి responsible person పోలీసు కాల్పు

లకు దారితీసే పరిస్థితులు సృష్టించి దానికి బాధ్యులైన అధికారులను సస్పెండు చేయాలని పౌరహక్కుల సంఘం డిమాండ్ చేసింది. (ఉ. 15 6 87)

**బాయ్‌కాట్ చేయు** క్రి. *baaykaaTceeyu* చూ. బహిష్కరించు (2,3); ప్రతిపక్షాల ఓట్లలో క్రాస్ ఓటింగ్ జరుగుతుందని అనుకుంటున్నారా అని అడుగగా వాళ్ళ ఓట్లు మాకెందుకు ఇష్టం లేకపోతే ఎన్నికను బాయ్ కాట్ చేస్తారు అని చెప్పారు. (ఆం ప్ర 1 7.87)

**బార్‌కౌన్సిల్** వి. *baarkaunsil* (న్యాయవాద) వృత్తిని చేపట్టే ముందు న్యాయవాదులు తమ పేర్లను నమోదు చేసుకొనే సంఘం bar council బార్ కౌన్సిల్‌ను రద్దుచేయడానికి న్యాయవాదులు చట్టాన్ని కొట్టివేస్తే సరిపోతుందని పార్లమెంట్ సభ్యులు భావించడం పొరపాటని ఆయన వ్యాఖ్యానించారు. (ఆం. ప్ర [illegible])

**బారకాసులు** వి (బ.వ.) *baarakaasulu* సైనికులు కవాతు చేసే చోటుకి దగ్గర ఉండే విడిది barracks ఆ తర్వాత సైనికులు బారకాసులకు, వైమానికదళ్ విమానాలు స్థావరాలకు తిరిగి వెళ్ళాయి. (ఆం భూ 11.5.89)

**బారులుతీరు** క్రి. *baarulutiiru* (పోలింగ్ బూత్‌లు, రేషన్ షాపులు మొ. ప్రదేశాలలో) తమ వంతుకోసం ఎదురు చూస్తూ వరుసలో నిలబడు to queue up పోలింగ్ బూత్‌ల వద్ద ఉదయం ఎనిమిది గంటల నుంచి స్త్రీ, పురుష ఓటర్లు బారులు తీరి కన్పించారు. (ఉ. 5.12.87)

**బాలారిష్టం** వి. *baalaariSTam* ఆరంభ దశలో ఎదుర్కొనే ఇబ్బంది లేదా సమస్య trouble or set-back in the initial stages జనమోర్చా ఆవిర్భవించక ముందే బాలారిష్టాలకు లోనవుతోంది. (ఆం ప. 24 11 87)

**బాష్పవాయువు** వి. *baaSpavaayuvu* కళ్ళలో మంటలు పుట్టించి కన్నీళ్ళు రప్పించే ఒకరకమైన పొగ(ఆందోళనకారులను చెదరకొట్టేందుకు పోలీసులు దీన్ని ఉపయోగిస్తారు.) tear-gas భారతీయ జనతా పార్టీ కార్యకర్తలను చెదరగొట్టేందుకు పోలీసులు బాష్పవాయువు ప్రయోగించారు. (ఉ 1.8 87)

**బాసట** వి. *baasaTa* కార్యక్రమ నిర్వహణలో అందించే తోడ్పాటు; అండ support చైనా ప్రభుత్వంతో పోరాటం సాగిస్తున్న విద్యార్థి లోకానికి ఆదివారంనాడు వృద్ధులు కూడా బాసటగా నిలిచారు. (ఈ. 22.5.89)

**బాహాటం** వి. *baahaaTam* రహస్యంకానిది, అందరికీ తెలిసి జరిగేది; బహిరంగం open రామ్‌జెత్మలాని 'ఖలిస్తాన్' డిమాండును బాహాటంగా సమర్థించారని వారు పేర్కొన్నారు. (ఈ 17 8 89)

**బాహాట ప్రభుత్వం** వి. *baahaaTa prabhutvam* ఏ విషయం ప్రజల నుంచి దాచిపెట్టకుండా పరిపాలన సాగించే సర్కారు open government ఇది 'బాహాట ప్రభుత్వం' అన్న సూత్రానికే విరుద్ధం. (ఆం ప్ర 25.4.89)

**బాహాబాహీ** వి. *baahaabaahii* ఒకరితో ఒకరు కలియబడి కొట్టుకోవటం (physical) fight బెంగాల్ అసెంబ్లీలో బాహాబాహీ ... (ఆం ప్ర 12 4.88)

**బాహ్యశక్తి** వి. *baahyasakti* (సమస్య సృష్టించటానికి) దేశం వెలుపల పొంచి ఉన్న విదేశీ వ్యక్తి లేదా సంస్థ external force ప్రతిపక్షాలపై ఆయన విరుచుకు

పడ్డారు. వారి చర్యలు బాహ్య శక్తులకు వత్తాసు పలికేలా ఉన్నాయని అన్నారు. (ఈ 19 7.89)

**బిగపట్టు** క్రి. *bigapaTTu* (నిధులు మొ.) విడుదల చేయకుండా దగ్గరపెట్టుకొను to tighten (the purse) నిధులు దక్కకుండా బిగపట్టే కేంద్రం పంచాయితీ రాజ్ సంస్థల నెత్తిమీద నేరుగా సిరులవాన కురిపిస్తానని మురిపించడం చూస్తే తల్లిని పస్తు పెట్టి బిడ్డకు పాయసం పెడతానన్నట్టుగా ఉంది. (ఈ. 3 5 89)

**బిగించు** క్రి. *bigincu* (చట్టంలోని) లోపాల్ని సవరించి మరింత కట్టుదిట్టం చేయు to tighten (a law, act etc.) ఫిరాయింపుల చట్టం మ్యాగ్రి బిగించారు. (ఆం. భూ 7.10 87)

**బినామీ పేరు** వి. *binaamii peeru* (ఆస్తులు, రుణాలు మొ. లావాదేవీలలో) చట్టం కళ్ళు కప్పటం కోసం తనపేరుకి బదులుగా రికార్డులలో చూపించే మరొకరి పేరు bogus or fictitious name భూసంస్కరణల చట్టం నుంచి తప్పించుకోడానికి ఆయన భూములు బినామీ పేర్ల మీద నమోదు చేసుకున్నాడనీ ... చెప్పారు. (ఆం. జ్యో 24.6.87)

**బిల్లు** వి. *billu* కొత్తగా తీసుకురావాలనుకున్న చట్టానికి అనుమతికోసం ప్రభుత్వం చట్టసభలో ప్రవేశపెట్టే ముసాయిదా పత్రం (సభలో బిల్లుపై చర్చజరిగి మెజారిటీ ఆమోదం తెలిపినప్పుడే అది చట్టం అవుతుంది) bill ఈ సవరణను ఆర్డినెన్సు రూపంలో జారీ చేసిన తర్వాత బిల్లు రూపంలో ప్రతిపాదించారు. (ఆం ప్ర 25.4 89)

**బీట** వి. *biiTa* (ఒక సంస్థ లేదా వ్యవస్థలోని) సభ్యులు లేదా భాగస్వాములలో ఏర్పడిన అసంతృప్తి ఫలితంగా చీలికలు వచ్చి (అది) బలహీనపడిన పరిస్థితి crack ఒరిస్సాలో కాంగ్రెసుకు బీటలు. (ఆం ప్ర 4 10 87)

**బీటలువారు** క్రి. *biiTaluvaaru* (ఒక సంస్థ లేదా వ్యవస్థలో) సభ్యులు లేదా భాగస్వాములలో ఏర్పడిన అసంతృప్తి ఫలితంగా చీలికలు వచ్చి (అది) బలహీనపడు to show cracks తూర్పు యూరప్‌లో కమ్యూనిస్టు కోటలు బీటలువారుతున్నాయి. (ఈ. 9 6 89)

**బీభత్సకాండ** వి. *biibhatsakaanDa* హింస, దౌర్జన్యాలతో కూడుకున్న చర్య an act of violence, mayhem పో.చూ. హింసాకాండ ఉథోక్ గ్రామంలో టెర్రరిస్టులు సృష్టించిన మరో బీభత్సకాండలో ఒకే కుటుంబానికి చెందిన ఎనిమిది మంది ఆహుతులయ్యారు. (ఉ. 15 6 87)

**బీభత్సకారుడు** వి. *biibhatsakaaruDu* చూ. తీవ్రవాది; పంజాబ్‌లో నిన్నరాత్రి నుండి బీభత్సకారులు మరో ఎనిమిది మందిని కాల్చి చంపారు. (ఆం. ప్ర 21.11 88)

**బీరాలు పలుకు** క్రి. *biiraalu paluku* (తగిన సామర్థ్యం లేదా నిజాయితీ లేకున్నప్పటికీ) పెద్దపెద్ద పనులు చేస్తానని ఊరికే గొప్పకోసం ప్రకటనలు చేయు to make tall claims లోగడ అనేకసార్లు బోర్డు అది చేస్తా, ఇది చేస్తానని బీరాలు పలికిందే తప్ప చర్యలు తీసుకొన్న ఉదంతాలు బహు తక్కువ. (ఈ. 9.5.89)

**బుకాయించు** క్రి. *bukaayincu* అబద్ధం చెప్పు to deny, lie మొదట్లో పంజాబ్ టెర్రరిస్టులతో తమకెలాంటి సంబంధాలూ లేవని బుకాయించిన ఆనాటి పాక్ ప్రభుత్వ .. (ఆం. భూ 26 5 89)

**బుజ్జగించు** క్రి. *bujjagincu* మంచిమాటలతో సముదాయించు to console, assuage తెలుగుదేశం పార్టీ నాయకత్వంపై అసంతృప్తిగా ఉన్న ఎంపీలను పిలిపించి బుజ్జగించాలని పార్టీ అధిష్ఠాన వర్గం యోచిస్తోంది. (ఈ 4.3.88)

**బుట్టదాఖలుచేయు** క్రి. *buTTadaakha-luceeyu* (అర్జీ, ప్రతిపాదన మొ.) పనికి రానిదిగా భావించి పక్కన పడవేయు to shelve "ఇండియన్ ఎక్స్‌ప్రెస్ " దినపత్రికలో ప్రచురితమైన పంచాయితీరాజ్ బిల్లు ముసాయిదాను ఎప్పుడో బుట్టదాఖలు చేసినట్లు ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ నేడు లోక్‌సభలో ప్రకటించారు. (ఆం. ప్ర 16.5.89)

**బురదజల్లు** క్రి. *buradajallu* కేవలం అప్రతిష్ఠపాలు చేసే ఉద్దేశంతో నిరాధారమైన ఆరోపణలు చేయు to do mud slinging కేవలం కాంగ్రెస్‌పైన బురదజల్లడమే పనిగా పెట్టుకొనే పార్టీలకు కాలం చెల్లే రోజులు దగ్గర పడ్డాయని ఆయన అన్నారు (ఈ. 26 4 89)

**బులియన్ మార్కెట్** వి. *buliyan markeT* వెండి, బంగారాలు విక్రయించే బజారు bullion market తన సంఘం సభ్యుడిపై పోలీసులు చేసిన ఈ అఘాయిత్యానికి నిరసనగా 10 రోజులుగా గుంటూరు బులియన్ మార్కెట్ బంద్ ఉందని .. (ఆం. భూ 26 4.89)

**బులెటిన్** వి. *buleTin* ఒక సంస్థ తనకు సంబంధించిన సమాచారాన్ని తెలుపుతూ నియమిత కాలానుగుణంగా వెలువరించే సంక్షిప్త నివేదిక bulletin లోక్‌సభ బులెటిన్‌లో స్పీకర్ రూలింగ్ ప్రచురించిన వెంటనే 21 మంది ప్రతిపక్ష సభ్యులు పార్లమెంటు సంఘాల పదవులకు రాజీనామా లేఖలు పంపాలని నిర్ణయించుకున్నారు. (ఆం. భూ. 16 5 89)

**బుల్లెట్‌ప్రూఫ్ కవచం** వి. *bulleT pruuf kavacam* తుపాకీ గుళ్ళు శరీరంలోకి దూసుకుపోకుండా ప్రాణ రక్షణకై ధరించే జాకెట్ bullet proof jacket రాజీవ్ బుల్లెట్‌ప్రూఫ్ కవచం ధరించి ఉన్నందువల్ల తీవ్రమైన గాయం తగలకుండా కాపాడింది. (ప్ర. శ. 31 7.87)

**బూకరించు** క్రి. *buukarincu* చేసిన పనిని జంకు లేకుండా సమర్థించుకొను to contend పాక్ అణ్వస్త్ర నిర్మాత ఖాదర్ ఖాన్ పాకిస్తాన్ అటంబాంబు నిర్మిస్తున్నదని స్వయంగా ఒప్పుకున్నాడు. "నిర్మిస్తే తప్పేమిటి" అని ఒకసారి జనరల్ జియాయే బూకరించాడు. (ఆం. జ్యో. 22.10 87)

**బూజుపట్టిపోవు** క్రి. *buujupaTTipoovu* (నివేదిక, ప్రణాళిక మొ.) ఏళ్ళతరబడి అమలుకు నోచుకోకపోవు to gather dust (as a plan, report etc.) ఎన్ని నివేదికలు బూజుపట్టిపోయాయో ప్రజలకెరుకే. (ఈ 29.12 87)

**బూటకం** వి. *buuTakam* (సాధా. ఎదురు కాల్పులు) నిజంగా జరగనిది; కల్పితం fake, false నేటి వరకు రాష్ట్రంలో సుమారు అయిదు వందల యాభైమంది బూటకపు ఎన్‌కౌంటర్లలో చనిపోయారు. (ఆం భూ 14 5 89)

**బూస్టర్** వి. *buusTar* ఉపగ్రహాలు, క్షిపణులకు తొలిదశలో అవసరమైన గమన వేగాన్ని అందించే రాకెట్టు booster సున్నితమైన భూపరిశోధక పరికరాలతో కూడి ఉన్న కృత్రిమ ఉపగ్రహాల ప్రయోగానికి ఈ రాకెట్లను బూస్టర్‌లుగా వినియోగించవచ్చు అన్నారు. (ఆం భూ. 18.5 89)

**బృహత్తర ప్రణాళిక** వి. *bRhattara praNaaLika* అనేక ప్రయోజనాలు పొందటానికి రూపొందించే గొప్ప పథకం master plan *ఉపరితల జలమార్గ వ్యవస్థను అభివృద్ధి పరచడానికి ... జాతీయ స్థాయిలో ఒక బృహత్తర ప్రణాళిక రూపొందుతుంది.* (ఈ 5 7.89)

**బెంచి** వి. *benci* చూ. ధర్మాసనం. *ఆంధ్రప్రదేశ్ హైకోర్టు సమక్షంలోను తదనంతరం సుప్రీంకోర్టు సమక్షంలోను దాఖలు చేసిన పిటిషన్‌లలో స్పష్టంగా కనబడే పెక్కు "అవాస్తవాలను, నిరాధారమైన విషయాలను, పరస్పర వైరుధ్యాలను" బెంచి పరిగణనలోకి తీసుకొన్నట్లు కనిపించిందని ...* (ఆం ప్ర 1.5 89)

**బెంబేలుపడు** క్రి. *bembeelupaDu* భయాందోళనలకు లోనగు to be alarmed, worried *తెలుగుదేశం ప్రభుత్వాన్ని డిస్మిస్ చేయాలని కాంగ్రెస్(ఐ) ఎన్నడూ కోరనప్పటికీ, తెలుగుదేశం మంత్రులు అనవసరంగా బెంబేలుపడిపోయి ఏవేవో ఆరోపణలు చేస్తున్నారని అన్నారు.* (ఈ 5 6.87)

**బెంబేలెత్తు** క్రి *bembeelettu* చూ. బెంబేలుపడు. *రాష్ట్రంలో రోజురోజుకు పుంజుకుంటున్న కాంగ్రెస్‌ను చూసి తెలుగుదేశం బెంబేలెత్తి పోతుంది* (ఆం భూ 17 11.89)

**బెడద** వి. *beDada* ప్రమాదకరంగా లేదా ఇబ్బందికరంగా తయారైన సమస్య menace, nuisance *తీవ్రవాదుల బెడద కొంచెం తగ్గి ఊపిరి పీల్చుకుంటున్న సమయంలో దారి దోపిడీల బెడద ఎదురు కావటం పట్ల ...* (ఈ 25 5 89)

**బెడిసికొట్టు** క్రి. *beDisikoTTu* 1. (ఏదైనా ప్రయత్నం) ఆశించిన ఫలితం ఇవ్వకపోవు to spoil (as relations) *1978లో జనతా ప్రభుత్వ కాలంలో కుదిరిన రెండు ఒప్పందాలే సంబంధాలు బెడిసికొట్టడానికి దోహదం చేశాయని ఆయన అన్నారు.* (ఆం భూ 16.5 89) 2. ప్రయత్నం విఫలమగు to fail, misfire *ఈ విభాగం పత్రికల ద్వారా కట్టుకథలను ప్రచారంలోకి తెస్తున్నదని అయితే ఈ ప్రయత్నాలు బెడిసికొడతాయని సింగ్ అన్నారు.* (ఈ. 3 6.89)

**బెదిరింపు** వి. *bedirimpu* హాని లేదా నష్టం కలిగిస్తామని భయపెట్టటం threat *పోలీసు అధికారులను పిలిచి తనిఖీ చేయగా కేవలం బెదిరింపు మాత్రమేనని తెలిసిందని అన్నారు.* (ఆం ప్ర 15 6 89)

**బెనిఫిట్ మ్యాచ్** వి. *benifiT myaac* ఎవరైనా ప్రముఖ ఆటగాడికోసం లేదా ఏదైనా సమాజ సంక్షేమ కార్యక్రమంకోసం నిధులు సేకరించే లక్ష్యంతో నిర్వహించే ఆట benefit match *ఆయన 1981లో కొంతమంది భారత క్రికెటర్లను తీసుకొని షార్జావెళ్ళి ఆసిఫ్ ఇగ్బాల్ బెనిఫిట్ మ్యాచ్ ఆడించారు.* (ఈ 18 8.89)

**బెయిల్** వి *beyil* కేసు విచారణ సందర్భంలో అందుబాటులో ఉండే షరతుపై కొంత సొమ్ము పూచీకత్తుగా నిందితుణ్ణి విడుదల చేయటానికి న్యాయస్థానం ఇచ్చే అనుమతి ; జామీను bail *న్యాయవాదుల్లో పోటీతత్వం పెరిగిపోయిందని, కేవలం బెయిల్ ఇప్పించేందుకు పది నుంచి ఇరవై వేల రూపాయలు తీసుకుంటున్నట్లు తెలిసిందని అన్నారు.* (ఆం ప్ర 3 7 89)

**బెయిలీ వంతెన** వి. *beyilii vantena* (ఉన్న వంతెన కూలిపోయినప్పుడు లేదా అసలు వంతెన అనేది లేనిచోట) రాకపోకలు జరపటంకోసం తాత్కాలికంగా నిర్మించిన వంతెన bailee bridge

జాతీయ రహదారిపైగల వంతెన కూలిపోయి నట్లు గతరాత్రి సమాచారం వచ్చింది అక్కడ ప్రత్యామ్నాయంగా బెయిలీ వంతెన నిర్మాణం పనులు ప్రారంభించినట్లు... తెలిపారు. (ఆం. ప్ర 26 7 87)

బేరసారాలు వి. (బ.వ) *beerasaaraalu* ఒప్పందంలో భాగంగా ఇవ్వాల్సిన లేదా రావలసిన పదవులు, డబ్బు మొ. వాటి కోసం జరిపే చర్చలు ( సాధా. న్యూనార్థంలో ) bargaining, horse-trading *ఇక బి.జె.పి తనకు 35 స్థానాలు ఇవ్వాలని పట్టుబడుతోంది. ప్రతిపార్టీ సాధ్యమైనంతవరకు బేరసారాలకు దిగుతోంది.* (ఆం భూ 27 7.89)

బేరీజువేయు క్రి. *beerijuveeyu* (మంచి చెడులు, లాభనష్టాలు మొ.) జాగ్రత్తగా తారతమ్య పరిశీలన చేసి నిర్ణయించు to assess, weigh pros and cons *రాజకీయ పక్షాల గత చరిత్ర, శీలం మొదలైన గుణగణాలను ఎవరికి వారు బేరీజువేసుకొని ఓటు చేయడం ప్రజల కర్తవ్యం.* (ఆం. భూ 21.11.89)

బేషరతు వి. *beeSaratu* ఎలాంటి షరతులూ పెట్టకపోవటం unconditional *చర్చలకు ముందు ఆయుధాలు విసర్జించాలని కూడా కోరలేదని, సాధారణంగా ఎవరూ ఆయుధాలన్నీ విసర్జించరని, అందుకే బేషరతుగా చర్చలు జరుపుతున్నామని ప్రేమదాస తెలిపారు.* (ఈ. 15 5 89)

బేసిన్ వి *beesin* ఏదైనా నదికి నీరు అందటానికి ఆధారభూతంగా ఉండే పరిసర ప్రాంతం (ఇక్కడి నుంచి కాలువలు, వర్షపునీరు వచ్చి ఆ నదిలో కలుస్తాయి); పరీవాహకప్రాంతం basin (of a river) *కృష్ణా-గోదావరి బేసిన్‌లో 24.59 మిలియన్ క్యూబిక్ మీటర్ల జియాలాజికల్ నిల్వలు ఉన్నాయని ఇప్పటికే అంచనా వేయడం జరిగింది.* (ఆం జ్యో. 20.6.87)

బైటపడు క్రి. *baiTapaDu* (అప్పటివరకు దాగి ఉన్న విషయం) వెల్లడి అగు to be revealed *లోకసభకు రాజీనామా చేయడం వల్ల ప్రతిపక్షాల నిస్పృహ బైటపడుతోందని ... విమర్శించారు.* (ఈ. 29 7.89)

బైటికి పొక్కు క్రి. *baiTiki pokku* (గోప్యంగా ఉండవలసిన సమాచారం) జనానికి తెలిసిపోవు; లీక్ అగు to leak out *రాష్ట్ర బడ్జెట్‌లోని అంశాలు బైటికి పొక్కడం వలన నైతిక బాధ్యత వహిస్తూ మంత్రివర్గ సభ్యులు యావన్మందీ రాజీనామాలు సమర్పించారని ముఖ్యమంత్రి ... వెల్లడించారు.* (ఆం భూ 9.2.89)

బైఠాయించు క్రి. *baiThaayincu* 1. సమస్యల పరిష్కారంకోరుతూ లేదా నిరసన వ్యక్తం చేస్తూ ఒకచోట తిష్ఠవేయు to sit in, squat *హాల్ టికెట్లు పంపించని కారణంగా గ్రూప్-IIబి, గ్రూప్IV పరీక్షలకు దరఖాస్తులు పెట్టుకున్న వందలాది మంది అభ్యర్థులు సోమవారంనాడు ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కార్యాలయం ముందు బైఠాయించారు.* (ఈ. 30.5.89) 2. ఒక కార్యక్రమాన్ని పర్యవేక్షించటంకోసం సంబంధిత ప్రదేశంలో మకాం వేయు to camp *చిన్నతరహా పరిశ్రమల శాఖమంత్రి శ్రీ కె. రామచంద్రరాజు జిల్లా ఇన్ ఛార్జి మంత్రి ఇక్కడే బైఠాయించి ఈ ఎన్నికను పర్యవేక్షిస్తున్నారు.* (ఆం ప్ర 4 12.87)

బైఠాయింపు వి *baiThaayimpu* సమస్యల పరిష్కారం కోరుతూ లేదా నిరసన వ్యక్తం చేస్తూ ఒక చోట తిష్ఠవేయటం

squatting మంగళవారంనాడు అతి పెద్ద ర్యాలీ జరిపి తియాన్‌మెన్ స్క్వేర్‌లో బైఠాయింపును ఉపసంహరించుకుంటామని విద్యార్థులు శనివారం ప్రకటించారు. (ఆం. భూ 29 1.89)

**బైపాస్ సర్జరీ** వి. *baipaas sarjarii* రక్త ప్రసరణకు ఆటంకం ఏర్పడినప్పుడు అది సక్రమంగా ప్రవహించడానికి వీలుగా మరో మార్గం ఏర్పాటుచేస్తూ గుండెకు చేసే శస్త్ర చికిత్స bypass surgery ఒక ఐ.ఎ.ఎస్ అధికారికి బైపాస్ సర్జరీ చేయించుకోవాల్సివస్తే రాష్ట్రప్రభుత్వం ఏమీ సహాయం చేయలేదని ఆయన అన్నారు. (ఆం భూ. 17 8 89)

**బోగస్** వి. *boogas* (సర్టిఫికెట్, సంస్థ మొ.) సక్రమం, చట్టబద్ధం కానిది bogus ఆస్తులు ప్రకటించకపోతే ప్రకటించలేదని గోల చేశారు. ప్రకటిస్తే బోగస్ అంటున్నారు ఇందులో బోగస్ ఏమిటి? (ఆం. జ్యో 5 12.88)

**బోధన పరికరాలు** వి. (బ.వ.) *boodhana parikaraalu* చదువు చెప్పేటప్పుడు ఉపకరించే సామగ్రి teaching-aids అనియత విద్యా బోధకులకు వేతనాలు, బోధన పరికరాలు అందటం లేదని ... (ఆం భూ 17 10 87)

**బోను** వి. *boonu* న్యాయస్థానంలో ముద్దాయిగానీ సాక్షులుగానీ నిలబడి వాఙ్మూలం ఇచ్చే చోటు witness box or stand ఒక కేసుకు సంబంధించిన ఒక వ్యక్తి బోనులో నిలబడి తన వాఙ్మూలం ఇవ్వడం ప్రారంభించారు. (ఆం ప్ర 21 4 88)

**బోఫోర్స్** వి. *boofoors* హోవిట్జర్ యుద్ధ శతఘ్నులను సరఫరా చేసే స్వీడిష్ ఆయుధ సంస్థ bofors (a swedish gun-making firm) బోఫోర్స్ వ్యవహారంలో ఏయే ఏజెంట్లు ఎంతెంత కమీషన్ తీసుకున్నారో ఆయా ఏజెంట్ల పేర్లు బహిర్గతం చేయవలసిందిగా స్వీడిష్ ప్రభుత్వాన్ని కోరగలమని కూడా ప్రధాని ప్రతిపక్షాలకు హామీ ఇచ్చారు. (ఆం. ప్ర 5.6 87)

**బోల్తాపడు** క్రి. *booltaapaDu* (పడవ, లారీ మొ. వాహనాలు) అదుపు తప్పి తలక్రిందులుగా పడు to over turn బద్వేలు సమీపంలో మంగళవారంనాడొక ట్రక్కు బోల్తాపడినప్పుడు అయిదుగురు చనిపోయారని . .. తెలుస్తోంది. (ఆం జ్యో 25 6.87)

**బౌండరీ** వి. *baunDarii* క్రికెట్ ఆటలో బ్యాట్స్‌మన్ కొట్టిన బంతి ఫీల్డర్లకు అందకుండా మైదానం హద్దు దాటిపోయినప్పుడు ఒక్కసారిగా లభించే నాలుగు పరుగులు boundary ప్రతి భారత క్రికెటర్ సాధించే ఒక్కో బౌండరీకి ఐదు వందల రూపాయలు. (ఆం ప్ర 8 10 87)

**బౌలింగ్** వి. *bauling* క్రికెట్ ఆటలో బ్యాట్స్‌మన్‌కి బంతులు విసరటం bowling మరో ఓపెనర్ గ్రీనిడ్జ్ కూడా రవిశాస్త్రి బౌలింగ్‌లో ఔటయ్యారు. (ఆం. ప్ర 1 1 88)

**బ్యాట్స్‌మెన్** వి. *byaaTsmen* క్రికెట్ ఆటలో బౌలర్ విసిరిన బంతుల్ని బ్యాట్‌తో కొట్టి పరుగులు సాధించే ఆటగాడు batsman నిన్నటి ఆటలో బ్యారల్ బ్యాట్స్‌మెన్ త్వరగానే ఔటయినా ... (ఆం ప్ర. 22 4 89)

**బ్యానరు** వి *byaanaru* నినాదాలు, స్వాగత వచనాలు మొ.వి రాసి ఇరువైపులా రెండు కర్రలకు బిగించి ఉన్న పొడుగాటి బట్ట ముక్క banner పార్టీ జండాలు, బ్యానర్లు చేత బట్టిన కార్యకర్తలు గుంపులు గుంపులుగా

కోర్టు ఆవరణకు చేరుకున్నారు. (ఆం ప్ర 21 4 88)

**బ్యారికేడ్** వి. *byaarikeeD* 1. బహిరంగ సభలలో భద్రతా ఏర్పాట్లలో భాగంగా వెదురు బొంగులు మొ. వాటితో తాత్కాలికంగా నిర్మించిన కంచె barricade as a security arrangement కొద్ది సేపట్లో ప్రధాని వస్తారనగా పి సి.సి (ఐ) ప్రధాన కార్యదర్శి శ్రీమతి సరోజిని పుల్లారెడ్డి బ్యారికేడ్ల మధ్య నుంచి దూరి ప్రెస్ గ్యాలరీలో కూర్చొన్నారు (ఈ 22 6 89) 2. శకటాలను నిరోధించేందుకు రాళ్ళు, వాహనాలు మొ వాటితో దారిలో ఏర్పాటు చేసిన అడ్డంకి barricade, road block విద్యార్థుల బ్యారికేడ్లను తొలగించడానికి సైనిక సిబ్బంది వాహనాలతో ముందుకు దూసుకు వెళ్ళారు. (ఆం భూ 4 6 89)

**బ్యారెక్సు** వి *byaareksu* చూ. బారకాసులు; శ్రీలంక సైనికదళాలను బ్యారెక్సుకు పంపే అంశాలు ఒప్పందంలో ఉన్నాయని ప్రతినిధి గుర్తు చేస్తూ .. (ఆం భూ 30 6 89)

**బ్యాలెట్ పత్రం** వి. *byaaleT patram* ఎన్నికలలో ఓటరు తనకు నచ్చిన వ్యక్తిని ఎంపిక చేసుకోవటానికి వీలుగా రంగంలో ఉన్న అభ్యర్థుల పేర్లు, వారి ఎన్నిక గుర్తులతో ముద్రించిన కాగితం ballot paper ... పోలీసులే బ్యాలెట్ పెట్టెలలో బ్యాలెట్ పత్రాలను కుక్కుతుండడం చూసి ... (ఆం భూ 8 11 89)

**బ్యాలెట్ పెట్టె** వి. *byaaleT peTTe* ఎన్నికలలో ఓట్లు వేయటానికి ప్రత్యేకంగా తయారుచేసిన పెట్టె ballot box రాబోయే ఎన్నికలకు గాను హైదరాబాద్ ఆల్విన్ సంస్థ లక్షా అరవై వేల బ్యాలెట్ పెట్టెలను తయారుచేసింది. (ఆం ప్ర 21.11 89)

**బ్యూరాక్రసీ** వి. *byuraakrasii* ప్రజాప్రతినిధులకు సహాయకారిగా శాఖలవారీగా ప్రభుత్వ కార్యకలాపాలను నిర్వహించటం కోసం ఉన్న అధికారుల వ్యవస్థ (సాధారణంగా విమర్శించే సందర్భాలలో ప్రయోగిస్తారు) bureaucracy విప్లవాలను జయప్రదంగా నిర్వహించి సాంఘిక, ఆర్థిక రంగాలలో ప్రపంచానికి ఆదర్శంగా ఘన విజయాలను సాధించిన ఈ దేశంలోని కమ్యూనిస్టు పార్టీలు ఇప్పుడు ప్రజల సమస్యలు ముందుకు చొచ్చుకు వచ్చేసరికి అటు తమ ప్రభుత్వాలను, బ్యూరాక్రసీలను అదుపులో పెట్టుకోవడంలో విఫలమవుతున్నాయి. (ఆం భూ 28 6 89)

**బ్యూరాక్రాటు** వి. *byuraakraaTu* ప్రభుత్వ శాఖలలో పాలనా వ్యవహారాలను నిర్వహించే అధికారి bureaucrat ... కాని రెండు దేశాలలోని బ్యూరాక్రాట్లు చేసినపని అపోహలను తొలగించటంకాదు, పెంచటం. (ఆం భూ 20 4 89)

**బ్రహ్మరథంపట్టు** క్రి. *brahmaratham-paTTu* (ప్రముఖులకు ప్రజలు) అపూర్వమైన రీతిలో స్వాగత సత్కారాలు అందించి తమ మద్దతును అభిమానాన్ని ప్రకటించు to express support with a fanfare నేడు ఉదయం ఇక్కడకు వచ్చినపుడు ఆమెకు అఖండ స్వాగతం లభించింది. అడుగడుగునా ప్రజలు బ్రహ్మరథంపట్టారు. (ఈ 10 2.88)

**బ్రూట్ మెజారిటీ** వి. *bruuT me-jaariTii* (చట్ట సభలు, కమిటీలు మొ. వాటిలో) తమ చిత్తం వచ్చిన రీతిలో ప్రవర్తించటానికి, తమ ఇష్టం వచ్చిన నిర్ణ

యాలు గైకొనటానికి వీలుకల్పించే విశేష మైన సంఖ్యాబలం brute majority అంతేగాదు బ్రూట్ మెజారిటీ ద్వారా వీరు ఈ అవినీతిని సమర్థించుకుంటూ నెట్టుకొస్తున్నారని సూచనప్రాయంగా చెబుతూ ... (ఆం. భూ 5 5 89)

**బ్రెయిన్‌వాష్‌చేయు** క్రి. *breyin-vaaSceeyu* తమ మాటలతో ఇతరుల అభిప్రాయాలను పూర్తిగా మార్చివేసి వాళ్ళు తమ అభిప్రాయాలు లేదా ప్రయోజనాల కనుగుణంగా ప్రవర్తించే మానసిక స్థితిని కల్పించు to brainwash ఆశ్చర్యకరమైన రీతిలో కొంతమంది బ్రెయిన్‌వాష్‌చెయ్యటంతో రెండో సమావేశానికల్లా తన నిర్ణయాన్ని మార్చుకుందని ఆయన వ్యాఖ్యానించారు. (ఉ 4 7 87)

**బ్రోచర్** వి. *broocar* ఏదైనా సంస్థ తనకు సంబంధించిన సమాచారం ఇస్తూ ప్రచారం లేదా పరిచయార్థం ప్రచురించిన చిన్న పుస్తకం brochure ఉద్యోగుల సమస్యల పరిష్కారానికి ప్రస్తుతం జరుగుతున్న చర్చలు ప్రభుత్వ మొండివైఖరిని మొదటి బ్రోచర్‌లో వివరించదలిచామన్నారు. (ఈ. 23.4 89)

**బ్రౌన్ షుగర్** వి. *braun Sugar* మాదక ద్రవ్యం లేదా మత్తు మందు brown sugar కస్టమ్స్ అధికారులు శనివారంనాడు హైదరాబాదు విమానాశ్రయంలో 2 5 కిలోల బ్రౌన్ షుగర్‌ను ఒక ప్రయాణికుని వద్ద పట్టుకున్నారు. (ఈ 9.6 87)

**బ్లాక్‌మార్కెటీయుడు** వి. *blaakmaar-keTiiyuDu* అక్రమ పద్ధతిలో ప్రభుత్వం అనుమతించిన దానికన్నా ఎక్కువ ధరలకు వస్తువులను అమ్మి సొమ్ము చేసుకునే వ్యాపారి black-marketeer ఒక వేళ ప్రభుత్వం నిర్ణయించిన ధరను సడలించటానికి ప్రభుత్వం నిరాకరించిన పక్షంలో ఉన్నత పాఠ్య పుస్తకాలు మార్కెట్లో లభ్యం కావు. దీనితో బ్లాక్‌మార్కెటీయులు రంగ ప్రవేశం చేయటం తథ్యం. (ఆం భూ 21 5.89)

**బ్లాక్‌మెయిల్‌చేయు** క్రి. *blaakmeyil-ceeyu* ఇతరుల బలహీనతలు ఆధారం చేసుకొని డబ్బు లేదా ఇతరత్రా ప్రయోజనాలు కల్పించని పక్షంలో దెబ్బ తీస్తామని వారిని బెదిరించు to blackmail నేషనల్ ఫ్రంట్‌ను కొన్ని అంశాలలో శాసించటానికి ప్రయత్నించటమే కాక బ్లాక్‌మెయిల్‌చేయటానికి సైతం కమ్యూనిస్టులు సిద్ధపడుతున్నారని ... ఆరోపించారు. (ఈ 11.7 89)

**బ్లాక్‌లిస్టు** వి. *blaaklisTu* తప్పు చేసిన వ్యక్తులపై లేదా సంస్థలపై తగిన చర్య తీసుకునే ఉద్దేశంతో తయారు చేసిన దోషుల జాబితా blacklist ప్రజాస్వామ్యంకోసం పోరాడుతున్న విద్యార్థి నాయకులను నిర్బంధించటానికి లేదా బ్లాక్‌లిస్టులో వేయటానికి చైనా ప్రభుత్వం తలపడితే అమెరికా వ్యతిరేకిస్తుందని అన్నారు. (ఆం భూ. 30.5 89)

**బ్లాక్‌హోల్** వి. *blaakhool* విపరీతమైన గురుత్వాకర్షణ శక్తితో తన పరిధిలోకి వచ్చిన ఎలాంటి పదార్థాన్నైనా లోపలికి గుంజుకునే స్వభావం కలిగిన రోదసిలోని కొంత ప్రదేశం black-hole విశ్వంలో మనం చూడ గలిగే పదార్థం కంటే చూడలేని పదార్థమే (బ్లాక్‌హోల్స్) ఎన్నో రెట్లు అధికం. (ఆం ప్ర 18 5 89)

**బ్లూఫిల్మ్** వి. *bluufilm* చూ.నీలి చిత్రం. సుమారు 80 వేల రూపాయల పైచిలుకు విలువచేసే విదేశీ వస్తువులు, వీడియో క్యాసెట్లు, బ్లూఫిల్మ్‌లు పోలీసులు ఆ స్మగ్లర్ నుంచి స్వాధీనం చేసుకున్నారు (ఆం ప్ర 6 6 87)

బ్లూబుక్ వి. *bluubuk* అత్యంత ప్రముఖ వ్యక్తుల అధికార పర్యటనల సందర్భంగా చూడవలసిన రక్షణ ఏర్పాట్లకు సంబంధించిన నియమ నిబంధనల పుస్తకం blue book ప్రధాని పర్యటనలాంటి సందర్భాలలో ఆయన భద్రతకు సంబంధించి తీసుకునే జాగ్రత్తలలో ఈ బ్లూబుక్ ఒకటి. 48 గంటల ముందుగానే తయారయ్యే ఈ పుస్తకంలో ఎవరి పేర్లుంటే వారిని మాత్రమే ఆ సమయంలో అనుమతిస్తారు. (ఈ 22.7.87)

బ్లూస్టార్ ఆపరేషన్ వి. *bluusTaar aapareeSan* స్వర్ణ దేవాలయంలో నుంచి తీవ్రవాదులను ఏరివేయటానికి ఉద్దేశించిన సైనిక చర్య bluestar operation (a military operation aimed at flushing out terrorists from the Golden Temple) ప్రభుత్వం కనుక ఈ విషయంలో ముందుగా నన్ను సంప్రదించి ఉంటే ఆపరేషన్ బ్లూస్టార్ వద్దు అని చెప్పేవాడ్ని. (ఈ 22.7.8')

భ

భంగంకలుగు క్రి. *bhangamkalugu* (ఐక్యత, శాంతి భద్రతలు మొ.) దెబ్బతిను to be disturbed ... టెర్రరిస్టులు అణ్వాయుధాలు ఉపయోగిస్తే వారిలోనే విభేదాలు వచ్చి వారి ఐక్యతకు భంగంకలిగే అవకాశం ఉందని జెన్ కింగ్స్ అభిప్రాయపడ్డారు. (ఆం. భూ. 21.11.87)

భంగపరచు క్రి. *bhangaparacu* 1 (సంబంధాలలో ఉన్న సమతౌల్యాన్ని) దెబ్బతీయు to disturb భారత్-నేపాల్ మధ్య నెలకొని ఉన్న తులనాత్మక స్థితిని నేపాల్ ప్రభుత్వం భంగపరిచిందని ప్రధాని విమర్శించారు. (ఈ. 16.5.89) 2. (ప్రమాణం, వాగ్దానం మొ.) నిలబెట్టుకొనకపోవు to break (a promise, oath etc) శాసన సభలో హైకోర్టు న్యాయమూర్తి పట్ల అగౌరవంగా మాట్లాడి, గవర్నర్‌ను నిందించి ... రాజ్యాంగాన్ని నిలబెడతానని చేసిన ప్రమాణాన్ని భంగపరిచారని అన్నారు.

భంగపాటు వి. *bhangapaaTu* అవమానకరమైన ఎదురుదెబ్బ humiliation, set back జాఫ్నాకు పడవల్లో పంపిన ఆహార పదార్థాలను శ్రీలంక ప్రభుత్వం తిప్పికొట్టడాన్ని భంగపాటుగా పలువురు భావించే అవకాశం ఉంది. (ఈ 5.6.87)

భగీరథయత్నం వి. *bhagiirathayatnam* కష్టసాధ్యమైన పనిని సాధించటానికి విసుగు, విరామం లేకుండా చేసే ప్రయత్నం hard or tireless effort ... మాయలు, మంత్రాలలో 'దేశం' ప్రభుత్వాన్ని పడగొట్టాలని కాంగ్రెస్ నాయకులు భగీరథయత్నం చేస్తున్నారని ... విమర్శించారు. (ఈ 1.12.87)

భగ్గుమను క్రి. *bhaggumanu* తీవ్రమైన కోపాన్ని ప్రదర్శించు; మండిపడు to become furious భజన్‌పై భగ్గుమన్న ఎన్టీఆర్. (ఆం జ్యో. 18.6.87)

భజన వి. *bhajana* (ఇతరుల పనులను లేదా గుణగణాలను) గోరంతలు కొండంతలు చేసి పొగడటం trumpetting or praising (sb's achievements or qualities) ప్రభుత్వం సాధించిన ఘనవిజయాల పేరిట సమాచార శాఖ ప్రతి సంవత్సరం 20 లక్షల రూపాయలు ఖర్చు పెడుతున్నదని ఈ భజన కార్యక్రమానికి తక్షణమే స్వస్తి చెప్పాలని ఆయన సూచించారు. (ఉ 27.4.88)

భత్యం వి. *bhatyam* ప్రయాణం, భోజనం

మొ. ఖర్చులకోసం ప్రత్యేకంగా చెల్లించే సొమ్ము allowance *శిక్షణగా శిబిరానికి హాజరైన ఉపాధ్యాయులకు ఎలాంటి భత్యం చెల్లించటం లేదు.* (ఆం భూ 11.0.87)

**భద్రత** వి. *bhadrata* కష్టాలు, ప్రమాదాల నుంచి రక్షణ security ... *లక్షలాది కార్మికులకు భద్రత లేకుండా పోయింది.* (ఆం. ప్ర 26 4.89)

**భద్రతాదళం** వి. *bhadrataadaLam* శాంతి భద్రతలను కాపాడటానికి నియోగించే రక్షణ సిబ్బంది security force *శ్రీలంక దక్షిణ ప్రాంతంలోని గెరిల్లాల స్థావరాలపై భద్రతాదళాలు దాడులు జరిపాయి.* (ఆం. ప్ర 19 7 89)

**భద్రతాబలగం** వి. *bhadrataabalagam* చూ. భద్రతాదళం. *అల్లర్లు జరగడానికి అవకాశం ఉందని భావించిన కీలక ప్రాంతాలకు భద్రతాబలగాలను అప్పుడే తరలించారు.* (ఈ 21 11 89)

**భద్రతాసమస్య** వి. *bhadrataasamasya* దేశ రక్షణకు ఏర్పడే ప్రమాదం security problem *మనదేశానికి ఎటువంటి భద్రతా సమస్య కలగకుండా అవసరమైన చర్యలు చేపడతామని ఆయన అన్నారు.* (ఆం. ప్ర. 4 2.89)

**భద్రపరచు** క్రి. *bhadraparacu* (వస్తువుల్ని) పదిలమైన ప్రదేశంలో ఉంచు; జాగ్రత్త చేయు to deposit *అడ్వకేట్ జనరల్ శ్రీ మనోహర్ లేచి, ఏ రికార్డులను కోర్టులో భద్రపరచాలో వివరించమన్నారు.* (ఈ 29 12 87)

**భరతంపట్టు** క్రి. *bharatampaTTu* గుణపాఠం నేర్పు to teach a lesson *నిజంగా తెలుగుదేశం ప్రభుత్వం డిస్మిస్ జరిగితే ప్రజలు కాంగ్రెస్(ఐ) భరతంపట్టడానికి సిద్ధంగా ఉన్నారని స్పష్టం చేశారు.* (ఆం భూ 29.8.89)

**భరోసా** వి. *bharoosaa* ధైర్యంతో ఉండటం assurance, confidence *ఇంతవరకు కనీసం దక్షిణ సరిహద్దు పైనైనా, ఉద్రిక్తతకు తావులేకుండా ప్రశాంతంగా ఉన్నాయన్న భరోసా ఉండేది.* (ఈ 5.6 87)

**భర్తీచేయు** క్రి. *bhartiiceeyu* (ఖాళీగా ఉన్న స్థానాలకు)నియామకం జరుపు to fill(a position) *షెడ్యూల్డు కులాలు, తెగల అభ్యర్థుల కోసం కేటాయించిన ఉద్యోగాలలో ఖాళీగా పడి ఉన్నవాటిని భర్తీచేయనున్నట్టు ...* (ఆం. ప్ర. 19 5 89)

**భర్తీ సంస్థ** వి. *bhartii samstha* ఉద్యోగ నియామకాలను నిర్వహించే సంస్థ recruiting agency or body *రాష్ట్ర స్థాయిలో కూడా ఉపాధి కల్పనా సలహా మండలిని ఏర్పాటు చెయ్యాలని, దీని పరిధిలోకి ఎ. పి. పి. ఎస్. సి, కాలేజ్ సర్వీస్ కమీషన్, తదితర భర్తీ సంస్థలను చేర్చాలని ఆయన డిమాండు చేశారు.* (ఆం ప్ర. 3 5.89)

**భవితవ్యం** వి. *bhavitavyam* (వ్యక్తికి లేదా సంస్థకు) రాబోయే కాలంలో ఉండే (మంచి చెడుల) పరిస్థితి future ... *అడ్మిరల్ నాదకర్ణి మాట్లాడుతూ భారత నౌకాదళానికి మంచి భవితవ్యం ఉందన్నారు.* (ఈ. 1 12.87)

**భవిష్యత్ శాస్త్రం** వి. *bhaviSyat śaastram* రాబోయే కాలంలో సామాజిక పరిణామాలు, సాంకేతికమైన మార్పులు విలువలు, ధోరణులను సూచించే శాస్త్రం futurology *దేశంలోని పన్నెండు విశ్వవిద్యాలయాల్లో వచ్చే విద్యా సంవత్సరం నుంచి 'భవిష్యత్ శాస్త్రం'లో ఎం.టెక్, ఎం.ఫిల్ కోర్సులు ప్రారంభించడానికి ...* (ఆం ప్ర. 6 10 88)

**భస్మీపటలంచేయు** క్రి. *bhasmiipaTa-*

*lamceeyu* పూర్తిగా కాల్చి బూడిద చేయు to burn (sth) to ashes విద్యుత్ తీగల నుంచి వచ్చిన అగ్నికణాలు ప్రళయాగ్ని కీలలుగా మద్దనూరు గ్రామాన్ని భస్మీపటలం చేశాయి. (ఆం. భూ 20 5 89)

భాగం పంచుకొను క్రి. *bhaagam pancukonu* (ఒక కార్యక్రమంలో)ఇతరులతో కలిసి పనిచేయు; పాల్గొను to participate ... శ్రీ శ్రీనివాసులరెడ్డి ప్రచారోద్యమంలో ఇన్నాళ్ళూ భాగంపంచుకున్న సినీనటుడు నాగభూషణం ఇకపై పాల్గొనరని తెలిసింది. (ఈ. 6.3.88)

భాగస్వామి వి. *bhaagasvaami* వ్యాపారంలో వాటా ఉన్న వ్యక్తి; వాటాదారుడు partner ఈ నెల మొదటి తేదీ శనివారం నుంచి శ్రీ గణేశ్ కంపెనీ భాగస్వాములు నలుగురు తమ దుకాణాలను మూసివేసి అదృశ్యమైపోయారు. (ఆం ప్ర. 4 10 88)

భాగస్వామ్యం వి. *bhaagasvaamyam* పనిలో పాలు పంచుకోవటం share, participation వీరు చేసిన మోసంలో స్థానిక రౌడీలు, పోలీసుల భాగస్వామ్యం ఉన్నట్లు .. బాధితులు తెలిపారు. (ఆం. ప్ర. 4 10 88)

భారజలం వి. *bhaarajalam* అణుశక్తిని ఉత్పత్తిచేయటంలో ఉపయోగించే ఒక రకం నీరు (ఇందులో ప్రతి అణువు (molecule)లో రెండు భార హైడ్రోజన్ పరమాణువులు, ఒక సాధారణ పరమాణువు (atom) ఉంటుంది.) heavy water అణ్వాయుధాలను తయారు చేయటంలో వాడే భారజలాన్ని భారత దేశం అక్రమంగా పొందిందనే ఆరోపణను రుజువు చేసే ... (ఆం ప్ర. 22.4.89)

భారజల కేంద్రం వి. *bhaarajala keendram* భారజలాన్ని ఉత్పత్తి చేసే ప్రదేశం heavy water plant గత నెలలో ప్రమాదానికి గురైన బరోడా భారజల కేంద్రంలో ఉత్పత్తి త్వరలో ప్రారంభం కాగలదని ... తెలిపారు. (ఆం. ప్ర. 18.4.88)

భారత్ ఉత్సవం వి. *bhaarat utsavam* భారత సంస్కృతి, సంప్రదాయల పట్ల విదేశాలలో సదావగాహన పెంచేందుకు అక్కడ ఏర్పాటు చేసే ప్రదర్శన కార్యక్రమాలు festival of India సోవియట్ యూనియన్‌లో 3వ తేదీ నుంచి జరుగనున్న భారత్ ఉత్సవాల ప్రారంభ సంబరంలో పాల్గొనేందుకై ... బయల్దేరుతున్నారు. (ఉ 2 7 87)

భారత శాంతి సంరక్షక సేన వి. *bhaarata saanti śamrakSaka seena* శ్రీలంక ప్రభుత్వం, అక్కడి తమిళ పులుల (ఎల్.టి.టి.ఇ) మధ్య చెలరేగిన సాయుధ ఘర్షణని తొలగించి, శాంతిని నెలకొల్పే ఉద్దేశ్యంలో 80వ దశకం చివర్లో భారత్ నుంచి వెళ్ళిన సైన్యం Indian peace keeping force(IPKF) .. శ్రీ ఆర్. ప్రేమదాస ఇటీవల భారత ప్రభుత్వ దూత శ్రీ ఎల్. ఎల్ మల్హోత్రాతో మాట్లాడినప్పుడు భారత శాంతి సంరక్షక సేన నిర్వహించిన పాత్రను మెచ్చుకున్నారు. (ఆం భూ. 27 4.89)

భారీ ఏర్పాట్లు వి (బ.వ.) *bhaarii eerpaaTlu* (చాలా ప్రాముఖ్యం ఉన్న సంఘటనలకోసం) పెద్ద ఎత్తున చేసే తయారీ పనులు elaborate arrangements నాలుగు జాతీయ పార్టీలు కొత్త పార్టీగా ఆవిర్భవించే సదస్సుకోసం ఇక్కడ భారీ ఏర్పాట్లు జరుగుతున్నాయి. (ఆం. జ్యో 9 10 88)

**భారీ పోలింగు** వి. *bhaarii poolingu* అధిక శాతం ఓటర్లు తమ ఓటు హక్కు విని యోగించుకోటం heavy turn out in voting *రాష్ట్రంలోని 12 జిల్లాలలో భారీ పోలింగ్ జరిగినట్లు ... తెలుస్తున్నది.* (విశా 18.6 87)

**భారీ ప్రాజెక్టు** వి. *bhaarii praajekTu* చాలా అధిక మొత్తంలో పెట్టుబడి అవ సరమయ్యే (ఆనకట్ట, విద్యుదుత్పాదన కేంద్రం మొ.) నిర్మాణ కార్యక్రమం major project *భవిష్యత్తులో ప్రజలకు పయోగపడే ఆనకట్టల వంటి భారీ ప్రాజెక్టులకు ధనాన్ని పెట్టుబడి పెట్టడానికి బదులుగా ...* (ఆం జ్యో 25.4.88)

**భారీ వర్షం** వి. *bhaarii varSam* కుండ పోతగా కురిసే వాన heavy rain ... *రానున్న 24 గంటల కాలంలో తెలంగాణా ప్రాంత మంతటా భారీ వర్షాలు కురిసే సూచనలున్నాయని ...* (ఆం ప. 7 7 87)

**భారీ వేతనం** వి. *bhaarii veetanam* పెద్ద మొత్తంలో ఇచ్చే జీతం high or attractive salary *సైన్యాధికారులకు భారీ జీతాలు* (ఆం జ్యో 20 6 87)

**భావసారూప్యం** వి. *bhaavasaaru-upyam* (వ్యక్తులు లేదా బృందాల) అభి ప్రాయాలు, ఉద్దేశ్యాలలో ఉండే దగ్గరితనం like-mindedness *కుంభకోణాల విష యమై భావసారూప్యం కలిగిన కాంగ్రేసేతర ప్రతిపక్షాలను కలుపుకుని ఉమ్మడి ఆందోళన చేపట్టాలని ...* (ఈ. 6 6 87)

**భావసారూప్యత** వి. *bhaavasaaruupy-ata* చూ. భావసారూప్యం. ... *ప్రతి పక్ష సమాఖ్యలోని పార్టీలకు భావసారూప్యత ఇంచుకైనా లేదని ...* (ఉ 9 6 87)

**భావించు** క్రి. *bhaavincu* అభిప్రాయపడు; అనుకొను to think *దాదాపు 30, 40 మంది నక్సలైట్లు పథకం ప్రకారం ఈ దాడి నిర్వహించి ఉంటారని భావిస్తున్నారు.* (ఆం. జ్యో 2.2 89)

**భాష్యం** వి. *bhaaSyam* (అస్పష్టం, కఠినం అయిన) విషయంలో దాగి ఉన్న అర్థాన్ని (తాను అర్థం చేసుకున్న విధంగా) వివరిం చటం interpretation *ఈ విషయం స్పష్టంగా రాతలో ఉండడంవల్ల శ్రీ ... ఈ తీర్మానానికి మరో భాష్యం చెప్పే ప్రయత్నం చేయలేదు.* (ఆం. భూ 9.5 89)

**భిన్నస్వరాలు** వి. (బ.వ.) *bhinnasvaraalu* (ఒక విషయంపై) కొందరు అనుకూ లంగా మరికొందరు వ్యతిరేకంగా మాట్లా డటం mixed reactions *ప్రభుత్వ నిర్ణయంపై భిన్నస్వరాలు: నక్సలైట్ల సమస్య విషయంలో రాష్ట్ర ప్రభుత్వం మంగళవారం తీసుకున్న నిర్ణయాలపై ప్రతిపక్షనాయకులు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేశారు.* (ఆం. ప్ర 14 6 89)

**భీతావహం** వి. *bhiitaavaham* జనంలో ప్రాణ భయం వ్యాపించిన వాతావరణం panic *తమిళ పౌరులలో భీతావహం సృష్టిస్తూ, వీరుల్లా ఫోజు పెట్టిన లంక సైనికులు భీరువులై ప్రాణ రక్షణ కోసం కకావికలై ...* (ఆం ప్ర 16 6.87)

**భీతిచెందు** క్రి. *bhiiticendu* (పరిస్థితులు లేదా పరిణామాల పట్ల) విపరీతంగా భయ పడు to get scared ... *శివకు మారి(20) తమ కుటుంబ ఆర్థిక పరిస్థితికి భీతిచెంది మంగళవారంనాడు ఆత్మహత్య చేసుకొంది.* (ఈ. 26.2 88)

**భీతిల్లు** క్రి. *bhiitillu* చూ. భీతి చెందు. *తీవ్రవాదులూ, దళిత నాయకులూ ఏకమై ఎప్పుడు తమకు ఏ నష్టం కలిగిస్తారోనని*

ఇక్కడ భీతిల్లి పోతున్నారు. (ఆం. భూ. 22.4.89)

**భీమా రుణం** వి. *bhiimaa ruNam* జీవిత భీమా సంస్థ అందించే అప్పు insurance-loan ప్లాట్ల కొనుగోలుకు భీమా రుణం. (ఈ. 16.10.87)

**భీష్మించు** క్రి. *bhiiSmincu* తను తలచు కున్న విధంగానే జరగాలని పట్టుపట్టు to insist రక్షణకు సంబంధించిన నిబంధనలు అమెరికాకు అనుకూలంగా ఉండేటే టెక్నా లజీ అందజేస్తానని భీష్మిస్తోంది. (ఆం. భూ 14.6 89)

**భుజం చరుచుకొను** క్రి. *bhujam carucukonu* (తమ పనుల గురించి) గొప్పగా చెప్పుకొను to boast రైతులు తమ ఉత్పత్తులకు తామే ధరలు నిర్ణయించడం కొత్త వ్యవస్థలో విశేషమని అధికార వర్గాలు భుజం చరుచుకుంటున్నాయి. (ఈ 17.3 88)

**భూఆక్రమణ** వి. *bhuuaakramaNa* ఇత రుల (సాధా. ప్రభుత్వ) భూములను అక్రమంగా తమ అధీనంలోకి తెచ్చుకో వటం land grabbing భూఆక్రమణ లపై గతంలో ఇలాంటి విచారణ వేశామని, ఇంతవరకు అది పూర్తికాలేదని దోషులెవరో తేలలేదని అన్నారు. (ఆం. జ్యో 27.11 87)

**భూఆక్రమణదారుడు** వి. *bhuu aakramaNadaaruDu* ఇతరుల (సాధా. ప్రభుత్వ) భూములను అక్రమంగా తన అధీనంలోకి తెచ్చుకొనేవాడు; కబ్జాదా రుడు land grabber భూఆక్రమణ దారులతో పోలీసులు, రెవిన్యూ అధికారులు కుమ్మక్కై పేద ప్రజలపై లాఠీచార్జి చేయటం ... ప్రజాస్వామ్య వ్యతిరేకమని అన్నారు. (ఆం. ప్ర 20 2 89)

**భూకక్ష్య** వి. *bhuukakSya* ఉపగ్రహాలు భూమి చుట్టు తిరిగేందుకు నిర్దేశించిన మార్గం orbit ఐదు టన్నుల నుంచి తొమ్మిది టన్నుల బరువుగల ఉపగ్రహాలను దిగువ భూకక్ష్యలోకి ... ప్రవేశపెట్టేం దుకు వీలుగా ... రాకెట్లను కొత్త తరహాలో తయారు చేయనున్నట్టు చైనా ప్రకటించింది. (ఆం. ప్ర 13.10 88)

**భూకమతం** వి. *bhuukamatam* ఒక వ్యవ సాయదారుడికి అనుమతించిన సొంత భూమి land-holding భారీ ఎత్తున వివిధ రూపాలలో విభజించిన భూకమతాలను ఇంత పెద్ద ఎత్తున రికార్డు ద్వారా స్థిరీకరించే సమయంలో ... (ఆం ప్ర 27 7.89)

**భూగర్భ అణుపరీక్ష** వి. *bhuugarbha aNupariikSa* అణుశక్తిని పరి శీలించటానికి భూమిలోపల జరిపే ప్రయోగం underground nuclear test సోవియట్ యూనియన్ నిన్న స్వతంత్ర ప్రతిపత్తిగల యాకుతీయ పబ్లిక్‌లో భూగర్భ అణుపరీక్ష జరిపింది. (విశా. 8.7.87)

**భూగర్భ జలాలు** వి. (బ.వ.) *bhuugarbha jalaalu* నేల లోపలి పొరలలో ఉన్న నీరు ground water వ్యవసాయ పను లకోసం భూగర్భ జలాలను అతిగా వెలికితీయ డంవల్ల వాతావరణంలో ఏర్పడే అనర్థాలను ... సూచించారు. (ఆం ప్ర. 6.12 88)

**భూగర్భ శాస్త్రవేత్త** వి. *bhuugarbha saastraveetta* శిలలు, మట్టిపొరలు మొ. శాస్త్రీయంగా అధ్యయనం చేసి, భూమి పుట్టుక, స్వరూపం, పరిణామంలాంటి విష యాలను నిర్ధారించే వ్యక్తి geologist చెట్టూ చేమ లేని కొండల ఏటవాలు ప్రాంతం లోని భూమి నుంచి తేమ బాగా ఇగిరిపో తున్నదని, అక్కడ ఎడారిలో వచ్చే పిచ్చి మొక్కలు మొలుస్తున్నాయని భూగర్భ శాస్త్ర వేత్తలు ఆందోళన వ్యక్తం చేశారు. (ఆం. ప్ర

4.5.89)

భూగోళ నిధి వి. *bhuugooLa nidhi* పర్యావరణ పరిరక్షణకోసం ప్రపంచ వ్యాప్తంగా ధనం సమీకరించి ఉమ్మడిగా ఏర్పాటు చేసిన మొత్తం global fund *పర్యావరణ పరిరక్షణకు "భూగోళ నిధి" ఒకటి ఏర్పాటు కావాలని భారత ప్రధాని ఒక చక్కని ప్రతిపాదన చేశారు.* (ఆం ప్ర 9.9.89)

భూదానం వి. *bhuudaanam* భూమి లేని పేదలకు పంచటానికై తమ భూమిని (కొంత) ప్రభుత్వానికి ఉదారంగా ఇవ్వటం gift of land *మంచిర్యాలలో భూదానం.* (ఉ. 30.10.87)

భూబకాసురుడు వి. *bhuubakaasuruDu* చూ. భూఆక్రమణదారుడు *బంజారాహిల్స్‌లో భూబకాసురులు.* (ఆం జ్యో. 21 7 87)

భూమిక వి. *bhuumika* (విషయ నిర్ణయం, సమస్యల పరిష్కారం మొ. వాటిలో) ఒక వ్యక్తి లేదా సంస్థ నిర్వహించే బాధ్యత part, role *జాతుల వివాదం పరిష్కారంలో న్యూఢిల్లీ ప్రధాన భూమిక వహించాలని జయవర్ధనే ప్రభుత్వం కూడా అంగీకరించింది.* (ఈ. 5 6.87)

భూమి భాగోతం వి. *bhuumi bhaagootam* ప్రభుత్వ భూమిని అక్రమంగా ఆక్రమించుకోడానికి సంబంధించిన ఉదంతం land-related fraud *'భూమి భాగోతం', వరంగల్ పట్టణంలో సుమారు 80 లక్షల రూపాయల విలువ చేసే భూమిని కబ్జా చేసిన భూబకాసురుని ఉదంతం ఒకటి వెలుగులోకి వచ్చింది.* (ఆం జ్యో. 20 6 87)

భూర్జపత్రం వి. *bhuurjapatram* ప్రాచీన కాలంలో గ్రంథ రచనకోసం ఒక రకం చెట్టు బెరడు నుంచి తయారు చేసిన ఆకు a leaf made of birch bark for writing on *పూర్వకాలంలో గ్రంథ రచనకు ఉపకరించే భూర్జ పత్రాలు ఎలా ఉంటాయో చూడడానికి 1946 లోనే తాను చిన్న పుస్తకంలా కట్టించి భద్రపరచిన భూర్జ పత్ర గ్రంథం* ... (ఆం భూ 11 7.89)

భూసంస్కరణలు వి. (బ.వ.) *bhuusamskaraNalu* భూస్వాముల దగ్గర పరిమితికి మించి ఉన్న భూమిని ప్రభుత్వం స్వాధీనం చేసుకొని భూమిలేని పేదలకు పంచటం land reforms *"మనరాజకీయ వ్యవస్థ బతికి బట్టగట్టాలంటే భూసంస్కరణలనే అగ్ని పరీక్ష దాటాలి"* ... (ఆం ప్ర. 18.4 88)

భృకుటి ముడివేయు క్రి. *bhRkuTi muDiveeyu* కనుబొమలు దగ్గరకు తీసుకు రావటం ద్వారా సంశయం వ్యక్తం చేయు to look at sth with suspicion (lit. to bring one's eyebrows together) *ఎవరికీ చెందనట్లు పడి ఉన్న ఆ చెక్కపెట్టెను చూసి హైకమీషన్ భృకుటి ముడివేశారు.* (ఈ. 5 6 87)

భేటీఅగు క్రి. *bheeTiiagu* చర్చల నిమిత్తం కలుసుకొను; సమావేశమగు to meet with sb ... *జి. ఎల్. హరాలల్‌తో కలసి ఢిల్లీకి పయనంగట్టి శ్రీ రాజేష్ పైలట్‌తో భేటీఅయ్యారు.* (ఉ. 4 11.88)

భేషజం వి. *bheeSajam* తను ఉన్న స్థాయికన్నా ఉన్నతంగా కనిపించాలని ప్రయత్నించటం false prestige, pretention *రైతులు లేనిపోని భేషజాలకు పోక తమ వృత్తి ఎంత నష్టదాయకంగా నడుస్తున్నదో నిర్భయంగా తెలపాలి.* (ఆం. ప్ర. 26 4 89)

భోగట్టా వి. *bhoogaTTaa* ఒక విషయం లేదా సంఘటనకు సంబంధించి అందిన

వాస్తవ సమాచారం information జిల్లా లోని వివిధ ప్రాంతాల్లో పనిచేస్తున్న మంగి దళం, రామన్నదళం ... మొదలైన ఏడు దళాల్లో ఒక్కో దళం ఏడుగురి నుండి 30 మంది దాకా సభ్యులున్నారని భోగట్టా. (ఆం భూ. 19.7.89)

**భోళాతనం** వి. *bhooLaatanam* తనకు సంబంధించిన ఏ విషయాన్నీ దాచుకోకుండా బయటపెట్టే మనస్తత్వం openness, frankness జపనీస్ రాజకీయ వ్యవస్థలో కనీసం ఒక రకమైన భోళాతనమైనా ఉంది. (ఆం. భూ. 13.6.89)

**భ్రమపడు** క్రి. *bhramapaDu* (సంభవం) కాని దానిని అవునని, లేనిదానిని ఉన్నదని భావించు to be under illusion అసమంజసమైన, ప్రజాస్వామ్య వ్యతిరేకమైన పద్ధతుల ద్వారా సమ్మెను భంగం చేయగల్గుతామని అధికారులు భ్రమపడితే, అదిపొరపాటే కాగలదని ఆయన హెచ్చరించారు (ఈ 21.4 89)

**భ్రష్టుపట్టిపోవు** క్రి. *bhraSTupaTTipoovu* (వ్యక్తి లేదా వ్యవస్థ) పూర్తిగా పాడైపోవు to get spoiled, degenerate నలభై ఏళ్ళ పాలనలో దేశం ఏవిధంగా భ్రష్టుపట్టిపోయిందో ... చెబుతారు. (ఆం. ప్ర 16.6.87)

**భ్రూణహత్య** వి. *bhruuNahatya* కడుపులో ఉన్న శిశువుని గర్భస్రావం ద్వారా తొలగించటం (పో.చూ.గర్భస్రావం) abortion మంత్రి లిఖిత పూర్వక సమాధానమిస్తూ, గతమూడేళ్ళుగా భ్రూణహత్యలు పెరిగిపోయినట్లు వార్తలు ధృవీకరిస్తున్నాయని అన్నారు. (ఆం ప్ర 17.11 88)

## మ

**మంకుపట్టు** వి. *mankupaTTu* (ఇతరుల అభిప్రాయాలను పట్టించుకోకుండా) తను అనుకున్నదే జరగాలనే మొండితనం; మొండివైఖరి stubbornness శాంతి సేన విషయంలో ప్రేమదాస ఆదినుంచి మంకుపట్టుపట్టారు. (ఆం. భూ. 15 7.89)

**మంచిచేసుకొను** క్రి. *manciceesukonu* ఇతరులను తన కనుకూలంగా మార్చుకొను లేదా మలచుకొను to woo (to make friendship), placate ప్రస్తుత రాష్ట్రపతి ఎన్నికకున్న ప్రాధాన్యత దృష్ట్యానే అటు ప్రతిపక్షాలను, ఇటు రాష్ట్రపతిని మంచిచేసుకోవడానికి అధికార పార్టీ సకల విధాలా ప్రయత్నిస్తున్నది. (ఈ 17 6.87)

**మంజూరు** వి. *manjuuru* అధికారికంగా నిధులు మొదలైనవి ఇవ్వటం sanction రాష్ట్రంలో పట్టు పరిశ్రమ అభివృద్ధికి ప్రపంచ బ్యాంకు 118 కోట్ల రూపాయల మంజూరుకు అంగీకరించిందని తెలిపారు. (ఆం భూ. 26 5 89)

**మంటగలుపు** క్రి. *manTagalupu* పూర్తిగా నాశనం చేయు; పోగొట్టు to destroy, to damage కాంగ్రెస్(ఐ) శాసనసభ గౌరవాన్ని సాంప్రదాయాలను మంటగలిపిందని ... ఆరోపించారు. (ఆం జ్యో. 8 4 88)

**మండిపడు** క్రి. *manDipaDu* విపరీతమైన కోపం తెచ్చుకొను; కోపపడు to get enraged ప్రస్తుత వెస్టిండీస్ పర్యటనలో హీర్వాణీ అంతగా రాణించకపోవటంతో వెంగ్ సర్కార్ అతనిపై మండిపడుతున్నాడు. (ఆం భూ 20 4.89)

**మంతనాలు** వి. (బ.వ) *mantanaalu* ఏదైనా ఒప్పందం లేదా అవగాహన కుదుర్చుకునే ఉద్దేశ్యంతో సంబంధిత వ్యక్తులతో ( కొంతమేరకు రహస్యంగా) జరిపే

చర్చలు; రహస్య సమాలోచనలు talks, parleys) జిల్లా కలెక్టర్లతో రహస్యంగా మంతనాలు జరపడం, పంచాయితీరాజ్ సదస్సులు పెట్టడం ఇవన్నీ కాంగ్రేసేతర ప్రభుత్వాల్ని కూల గొట్టడానికేనని ... ఆరోపించారు. (ఈ. 1 5.89)

**మంత్రి** వి. *mantri* చట్టసభలలో దిగువ లేదా ఎగువ సభలలో ఏదైనా ఒకదానిలో సభ్యుడిగా ఉంటూ ప్రభుత్వంలో ఒకటి అంతకన్నా ఎక్కువ శాఖల పరిపాలనా బాధ్యతలు నిర్వహించే ప్రజాప్రతినిధి minister మూడో ఎంక్వయిరీ కమిటీని ఏర్పాటు చేయాలన్న ప్రతిపాదనను మంత్రి మాధవరావు సింధియా 1988లో పార్లమెంట్‌లో రైల్వే బడ్జెట్ సమర్పిస్తూ ప్రకటించారు. (ఈ. 11.11 91)

**మంత్రిమండలి** వి. *mantrimanDali* మంత్రుల బృందం council of ministers ఈ సమావేశానికి మంత్రి మండలి సభ్యులందర్నీ ఆహ్వానించామని ముఖ్యమంత్రి చెప్పారు. (ఆం భూ. 17 10.87)

**మంత్రివర్గ ఉపసంఘం** వి. *mantrivarga upasangham* ఏదైనా ఒక ముఖ్యసమస్యపై చర్చించి సలహాలు ఇవ్వటానికి మంత్రివర్గంలోని కొందరు సభ్యులతో ఏర్పాటు చేసిన కమిటీ cabinet subcommittee పరిపాలనా సంస్కరణలకు సంబంధించిన రుస్తుంజీ కమిటీ నివేదిక, శ్రీ ఉపేంద్ర కమిటీ, అధికారుల కమిటీ నివేదికలకు సంబంధించి నేడు మంత్రివర్గ ఉపసంఘం చర్చలు జరిపింది. (ఆం. భూ 19 4 88)

**మంత్రివర్గం** వి. *mantrivargam* చూ. మంత్రి మండలి. ఎన్టీఆర్‌పై ప్రాసిక్యూషన్‌కు నిరసనగా మంత్రివర్గం సమావేశం ... వాయిదా పడింది. (ఆం ప్ర. 28.4.88)

**మంత్రివర్గ పునర్నిర్మాణం** వి. *mantrivarga punarnirmaaNam* ముఖ్యమంత్రి పాలనా సౌలభ్యంకోసం తన మంత్రివర్గంలో చేసే మార్పులు, చేర్పులు (మంత్రుల సంఖ్యని తగ్గించటం, పెంచటం వాళ్ళ శాఖల్లో మార్పులు చేయటం వగైరా) cabinet reshuffle రాష్ట్ర మంత్రివర్గ పునర్నిర్మాణం త్వరలో జరిగే అవకాశాలు మళ్ళీ కనిపిస్తున్నాయి. (ఆం ప్ర. 6.10.88)

**మంత్రివర్గ విస్తరణ** వి. *mantrivarga vistaraNa* (కొత్త మంత్రులను తీసుకోవటం ద్వారా) మంత్రివర్గాన్ని పెంచటం cabinet expansion కేంద్ర మంత్రివర్గ విస్తరణను వాయిదా వేసినట్లు ... తెలిపారు. (ఉ. 28 10 87)

**మందకొడి** వి. *mandakoDi* చురుకుగా సాగకపోవటం tardiness కర్షక పరిషత్ సభ్యత్వం మందకొడిగా సాగుతోందని, ఈ విషయంలో పార్టీ పరంగా చర్యతీసుకోవాలని ఆయన సూచించారు. (ఆం భూ 26 5 89)

**మందగించు** క్రి. *mandagincu* తక్కువ అగు to slow down, be retarded ... బహిరంగ సభలో ప్రసంగిస్తూ ఆంధ్రప్రదేశ్‌లో శాంతిభద్రతలు పూర్తిగా క్షీణించాయనీ, అభివృద్ధి మందగించిందని నిశితంగా విమర్శించారు. (ఆం. భూ. 22.6 89)

**మందబలం** వి. *mandabalam* ఒక వర్గానికి లేదా పార్టీకి చెందిన వ్యక్తులు అధిక సంఖ్యలో ఉండటంవల్ల వచ్చే శక్తి; సంఖ్యాబలం brute strength అధికార పార్టీకి మందబలం దండిగా ఉన్నంతకాలం అవిశ్వాస తీర్మానాలను నెగ్గించే శక్తి ప్రతిపక్షాలకు లేకపోవచ్చు. (ఈ 10.5 89)

**మండలించు** క్రి. *mandalincu* చేసిన తప్పును ఎత్తిచూపుతూ హెచ్చరించు to admonish ... రాష్ట్రపతి శ్రీ వెంకట్రామన్ ఈ విషయాన్ని నిష్పక్షపాతంగా పరిశీలించి శ్రీమతి జోషిని మందలించాలని ... డిమాండ్ చేశారు. (ఈ. 28.1.88)

**మందుగుండు సామగ్రి** వి. *mandugunDu saamagri* ఆయుధాలలో ఉపయోగించే పేలుడు పదార్థాలు ammunition *బి.ఎస్.ఎఫ్ భారీ ఎత్తున ఆయుధాలు, మందుగుండు సామగ్రి ... స్వాధీనం చేసుకున్నాయి.* (ఉ. 24.4.88)

**మందుపాతర** వి. *mandupaatara* (శత్రుపక్షాలు తమవైపు ముందుకు రాకుండా) ఒత్తిడి తగిలిన వెంటనే పేలడానికి వీలుగా భూమిలో అమర్చిన పేలుడు పదార్థాలు landmine *ఈ రోడ్డుపైన అన్నీ గతుకులే ఉండడంవల్ల మందుపాతరలను పూడ్చడానికి జరిపిన తవ్వకాలను గుర్తించడం కష్టమే.* (ఆం. ప్ర. 2.9.89)

**మకాంపెట్టు** క్రి. *makaampeTTu* తాత్కాలికంగా నివాసం ఏర్పరచుకొను to settle (for time being), camp *సోమేశ్వరాలయం నిర్మించేందుకు పెంబర్తిలో మకాంపెట్టిన వీరు ... ఆ గ్రామంలోనే స్థిరపడిపోయారు.* (ఆం. భూ. 16.5.89)

**మకాంచేయు** క్రి. *makaamceeyu* పదవీ బాధ్యతలు నిర్వహించే సమయంలో లేదా ప్రయాణంలో దారి మధ్యలో తాత్కాలికంగా నిర్దిష్ట ప్రదేశంలో నివసించు to stay *గవర్నర్ మకాంచేసే రాజభవన్ రాజీవ్ భవన్‌లా తయారైందని ... వ్యాఖ్యానించారు* (ఈ. 28.1.88)

**మకాంవేయు** క్రి. *makaamveeyu* ఒక ప్రత్యేకమైన, పనిమీద ఒక ప్రదేశంలో కొంత కాలం నివసించు to camp at ... *ప్రధానమంత్రి కానివ్వకుండా చేయడానికి కొన్ని బడా వాణిజ్య వర్గాలు ఢిల్లీలో మకాంవేసి తమ ప్రయత్నాలను ముమ్మరం చేశాయి.* (ఈ. 30.11.89)

**మక్కువ చూపు** క్రి. *makkuva cuupu* ఒక విషయంపై ప్రత్యేకమైన ఆసక్తిచూపు to show special interest ... *ఫలితం ఒక్కరోజులో తేలే పరిమిత ఓవర్ల మ్యాచ్ లంటే సహజంగా ప్రేక్షకులు మక్కువ చూపుతుండడంతో ...* (ఆం ప్ర. 2.3.88)

**మగ్గిపోవు** క్రి. *maggipoovu* తగిన సౌకర్యాలు లేక బాధపడు; ఇబ్బంది పడు to suffer, languish *గుడిసెల్లో మగ్గిపోయేకన్నా ప్రజలు చెట్లకింద జీవించడానికి చెట్లను విరివిగా నాటించారు.* (ఆం. భూ 3.5.89)

**మచ్చు** వి. *maccu* మొత్తం వస్తువు లేదా సరుకు ఇలా ఉంటుంది అని చెప్పడానికి చూపించే అందులోని ఒక భాగం; నమూనా, మాదిరి sample, model *ముందు మంచి బంగారం మచ్చును చూపించి బేరం మొదలు పెడతారు.* (ఆం. భూ. 20.6.87)

**మట్టికొట్టుకుపోవు** క్రి. *maTTikoT-Tukupoovu* నిర్లక్ష్యానికి గురి అగు to be ignored ... *ప్రభుత్వ పరిపాలనా వ్యవస్థలో మార్పులు తేవాలన్న ప్రతిపాదనలన్నీ ఇంతవరకూ మట్టికొట్టుకుపోవడం నిజంగా దురదృష్టకరం.* (ఆం. భూ. 26.5.89)

**మట్టుపెట్టు** క్రి. *maTTupeTTu* వ్యక్తుల్ని చంపివేయు; నాశనం చేయు to kill, destroy *తన ఏజెంట్‌ల ద్వారా సామాన్యుల్ని మట్టుపెట్టడానికి చేసే ప్రయత్నమేనని*

వారు అభిప్రాయపడ్డారు. (ఆం భూ 21 4.89)

**మడతపేచీ** వి. *maDatapeecii* కేవలం అడ్డంకులు కల్పించాలనే ఉద్దేశ్యంతో లేవనెత్తే అభ్యంతరం objection (unnecessary and motivated) ... హోంమంత్రుల సమావేశంలో సరిహద్దులలో 'ఉమ్మడిగస్తీ'కి అంగీకరించి, ఆ తరువాత మడతపేచీలు పెట్టింది. (ఆం. భూ 26.5 89)

**మతకల్లోలం** వి. *matakalloolam* భిన్నమతాలకు చెందిన ప్రజల మధ్య ఘర్షణ చెలరేగి హింసాత్మక సంఘటనలు, చోటు చేసుకున్న స్థితి communal disturbance మతకల్లోలాలను ప్రస్తావిస్తూ ఇటీవలి నెలల్లో తగ్గుముఖం పట్టాయన్నారు. (ఆం జ్యో. 19.4 88)

**మతతత్వం** వి. *matatatvam* మితిమీరిన మతాభిమానం కలిగి ఉండటం fundamentalism ... దేశంలోని వివిధ ప్రాంతాల్లో తలెత్తుతున్న మతతత్వం పట్ల జాగ్రత్తగా ఉండాలని ప్రజలను హెచ్చరించారు. (ఆం ప్ర. 4.7 89)

**మతతత్వ శక్తులు** వి. (బ.వ.) *matatatva śaktulu* మితిమీరిన మతాభిమానంతో, ఇతరమతాలపై ద్వేషభావం కలిగి ఉండి దాన్ని ప్రచారం చేసే వ్యక్తులు fundmentalist forces కొన్ని ప్రతిపక్ష పార్టీలు మతతత్వ శక్తులతో ... విచ్ఛిన్నకారులతోనూ, వేర్పాటు వాద శక్తులతోను ... సమగ్రతను విచ్ఛిన్నం చేసే వారితో చేతులు కలుపుతున్నాయని విమర్శించారు. (ఆం భూ. 19.5 89)

**మతవిద్వేషం** వి. *matavidveeSam* తనదికాని మతంపట్ల విపరీతమైన అయిష్టత, అసహనం communal hatred వారణాసి,బీహార్,ఉత్తరప్రదేశ్,జమ్మూకాశ్మీర్‌లలో మతవిద్వేషాలు రెచ్చగొట్టింది కాంగ్రెస్ అని ... విమర్శించారు. (ఈ 21.11.89)

**మతసామరస్యం** వి. *matasaamarasyam* భిన్నమతాలలో నమ్మకం ఉన్న ప్రజలు ఒకరి మతంపై ఇంకొకరికి ఎలాంటి ద్వేషం లేకుండా కలసిమెలసి ఉండటం communal harmony ఈ దేశంలో ప్రజాస్వామ్యం, మతసామరస్యం, సమగ్రత పది కాలాలపాటు పరిరక్షింపబడాలంటే ... అన్నారు. (ఈ. 21.8 89)

**మతోన్మాది** వి. *matoonmaadi* తన మతం పట్ల వల్లమాలిన అభిమానం, ఇతర మతాల పట్ల విపరీతమైన ద్వేషం ఉన్న వ్యక్తి religious fanatic మైనారిటీలలోని మతోన్మాదులు దేశవ్యాప్తంగా ప్రజల మత విశ్వాసాలను రెచ్చగొడుతున్నారని పేర్కొన్నారు. (ఆం జ్యో 19 4 88)

**మదింపు** వి. *madimpu* ఖర్చులు, నష్టాల గురించి ఆర్థికమైన అంచనా estimation రాష్ట్రంలో తుఫాన్ నష్టాన్ని మదింపు చేయడానికి కేంద్ర బృందాన్ని పంపుతారా? (ఉ. 27.11.88)

**మద్దతు** వి. *maddatu* ఒక వ్యక్తి లేదా సంస్థ చేపట్టిన కార్యక్రమాలకు ఇచ్చే తోడ్పాటు support ప్రభుత్వ చర్యకు ప్రతిపక్షం నాయకులు తమ సంపూర్ణ మద్దతు ప్రకటించారు. (ఆం జ్యో 5.6 87)

**మద్దతుదారుడు** వి. *maddatudaaruDu* ఒక వ్యక్తికి లేదా పార్టీకి తోడ్పాటు అందజేసే వాడు supporter పార్టీ మద్దతుదారులు శాసనసభ్యులతో కలసి రాజభవన్‌లోకి ... (ఆం. ప్ర. 22.4 89)

**మద్దతు ధర** వి. *maddatu dhara*

రైతుల నుంచి సేకరించే ధాన్యం మొ. వాటికి ప్రభుత్వం చెల్లించే ధర support price చెరుకు మద్దతు ధరను కేంద్రం టన్నుకు 185 రూపాయలుగా ప్రకటించడాన్ని ... (ఆం. ప్ర 20.3.88)

**మథనంచేయు** క్రి. *madhanamceeyu* గత అనుభవాలను నిశితంగా పరిశీలించు; తరచి చూచు to churn అనుభవాలను మథనంచేసి అమృతమనే ఈ పంచాయితీ రాజ్ బిల్లును రూపొందించామని ప్రధాని అన్నారు. (ఆం భూ 16.5 89)

**మథించు** క్రి. *madhincu* చూ. మథనం చేయు. దేశంలో పంచాయితీరాజ్ వ్యవస్థలోని మంచి చెడ్డలను, గతానుభవాలను మథించగా పుట్టిన అమృతమే ఈ బిల్లు అని శ్రీ రాజీవ్ అన్నారు. (ఈ 16 5.89)

**మధ్యంతర ఉత్తర్వు** వి. *madhyantara uttarvu* చూ. తాత్కాలిక ఉత్తర్వు మధ్యంతర ఉత్తర్వులు (ఇంటరిమ్ ఆర్డర్స్) ఇచ్చే విషయంలోనే మీ వాదన సాగించండి ... (ఈ 28 6 89)

**మధ్యంతర ఎన్నికలు** వి. (బ.వ.) *madhyantara ennikalu* (కొన్ని అసాధారణ పరిస్థితులేర్పడినప్పుడు) చట్టసభలకు కాలపరిమితి ముగియకుండానే రద్దు చేసి నిర్వహించే ఎన్నికలు midterm elections లోకసభకు మధ్యంతర ఎన్నికలు జరగవని ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ మరోసారి స్పష్టం చేశారు. (ఉ. 18.4.88)

**మధ్యంతర క్షిపణి** వి. *madhyantara kSipaNi* ఇటు మరీ దగ్గరగా, అటు మరీ దూరంగా లేని లక్ష్యాలను భేదించటానికి ప్రయోగించే క్షిపణి (medium range) ballistic missile మధ్యంతర క్షిపణులపై త్వరలో ఒక ఒప్పందం కుదిరే అవకాశం ఉందని... చెప్పారు. (ఆం ప్ర 15 9 87)

**మధ్యంతర తీర్పు** వి. *madhyantara tiirpu* చూ. తాత్కాలిక తీర్పు. ఎన్టీఆర్‌పై వచ్చిన ఆరోపణల మీద 'మధ్యంతర తీర్పు' చెప్పడానికి హైకోర్టు అవలంబించిన అసాధారణ పద్ధతి ... (ఆం. జ్యో. 6.1.88)

**మధ్యతరహా** విశ. *madhyatarahaa* అటు మరీ పెద్దది, ఇటు మరీ చిన్నది కానటువంటి medium ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని భారీ, మధ్యతరహా, చిన్ననీటి ప్రాజెక్టులను పూర్తి చేయడానికి ... (ఆం. జ్యో. 12.10.88)

**మధ్యదళారీ** వి. *madhyadaLaarii* ఒక వ్యవహారంలో ఇరుపక్షాల మధ్య ఒప్పందం కుదరడానికి సహకరించిన ఫలితంగా మధ్యలో తాము కొంత లాభం పొందే వాడు; మధ్యవర్తి middle-man, mediator ఆయుధాల అమ్మకం వ్యవహారాల్లో మధ్యదళారులు ఉండబోరని ... (ఆం ప్ర 6 6 87)

**మధ్యవర్తి** వి. *madhyavarti* చూ. మధ్యదళారీ రక్షణ పరికరాల కాంట్రాక్టుల్లో మధ్యవర్తులు లేనేలేరు. (ఆం. ప్ర. 6.6 87)

**మధ్యవర్తిత్వం** వి. *madhyavartitvam* ఇరువర్గాల మధ్య ఒప్పందం కుదరడానికి మూడో పక్షం చేసే ప్రయత్నం; రాయబారం mediation శ్రీలంక జాతి సమస్యకు రాజకీయ పరిష్కారాన్ని కనుగొనేందుకు గతమూడు సంవత్సరాలుగా మధ్యవర్తిత్వం ద్వారా ప్రయత్నాలు చేస్తున్న ఇండియా ... (ఆం ప్ర 6.6.89)

**మధ్యేవాదపార్టీ** వి. *madhyeevaada-paarTii* అటు వామపక్ష భావాలకు ఇటు సనాతన భావాల మధ్య సమతౌల్యంగల విధానాలను లక్ష్యంగా పెట్టుకొన్న రాజ

కీయ పక్షం centrist party మధ్యేవాద పార్టీలు సమైక్యమై ఆవిర్భవించిన పార్టీపట్ల తన వైఖరి వ్యక్తం చేయడానికి ... (ఆం ప్ర 13 10 88)

**మనిషిదినం** వి. *maniSidinam* ఒక వ్యక్తి ఒక రోజులో పనిచేసే సమయం manday. సంవత్సరంలో ఆరు నెలలు కన్నా తక్కువగా ఉద్యోగం ఉన్న కుటుంబ సభ్యులలో, కుటుంబానికి ఒకరికి చొప్పున సంవత్సరానికి 50 నుంచి 100రోజుల ఉపాధికల్పిస్తారు. దాదాపు 80కోట్ల మనిషిదినాల ( మాన్ డేస్) ఉద్యోగం కల్పిస్తారు. (ఆం. ప్ర 6 7 89)

**మనుగడ** వి. *manugaDa* జీవంతో కూడిన స్థితి; ఉనికి existence ... దేశ పురోభివృద్ధికి, జాతి మనుగడకు కృషి చేయాలని ... ఉద్బోధించారు. (ఈ. 15 6 89)

**మనోవర్తి** వి. *manoovarti* చట్టబద్ధంగా విడిపోయిన తర్వాత (కోర్టు ఆదేశం మేరకు) భార్య పోషణ కోసం భర్త నెలకు లేదా సంవత్సరానికి ఇంత అని ఇచ్చే సొమ్ము; జీవన భృతి maintenance allowance given by a man to his ex-wife after divorce ... భర్త నుంచి తాత్కాలిక మనోవర్తిని డిమాండ్ చేసే హక్కు ఉందా అనే సమస్యను లేవదీసే ఒక అప్పీలును ... స్వీకరించింది. (ఉ. 13.3 87)

**మఫ్టీ** వి *mafTii* విధి నిర్వహణలో భాగంగా పోలీసులు యూనిఫారంలో లేకుండా సాధారణ దుస్తులు వేసుకుని ఉండటం mufti రౌడీల పనిపట్టేందుకు సినిమాహాళ్ళ వద్ద మఫ్టీలో కానిస్టేబుల్స్‌ను నియమిస్తున్నట్లుగా ... తెలిపారు. (ఈ 29 6.87)

**మభ్యపెట్టు** క్రి. *mabhyapeTTu* తప్పుడు అవగాహన కలిగించటం ద్వారా ఇతరులను మోసగించు to privaricate ప్రజలను మభ్యపెట్టడానికి కల్లబొల్లి కథలు ప్రచారం చేయడం ... నాయకులకే చెల్లుతుందని ఆయన విమర్శించారు. (ఉ. 24 11 87)

**మరణవాఙ్మూలం** వి. *maraNavaan-muulam* ఏదైనా ప్రమాదం, హింసాత్మక ఘటనల ఫలితంగా మరణించే వారి దగ్గర నుంచి మరణానికి ముందు, సంఘటన పూర్వాపరాల గురించి సేకరించే సమాచారం dying declaration వీరిద్దరూ స్పృహలో లేనందువల్ల మరణవాఙ్మూలం తీసుకోవడంలో మెజిస్ట్రేటు విఫలమయ్యారు. (ఉ. 29 6 87)

**మరణశిక్ష** వి. *maraNaśikSa* నేరం చేసినందుకు చట్టపరంగా చంపమని ఇచ్చే న్యాయమూర్తి ఆదేశం; ఉరిశిక్ష death-sentence ఒక అమెరికా ఆటో కార్మికుడు ...కు ఇజ్రాయిల్ కోర్టు సోమవారం మరణశిక్ష విధించింది. (ఉ. 26 4.88)

**మరపడవ** వి. *marapaDava* యంత్రం సహాయంతో కదిలే పడవ motor boat ... గుర్తు తెలియని మత్స్యకారులు 56మంది మరపడవ నొకదానిని తీసుకొని సముద్రంలోకి పారిపోయారు. (విశా 15.9 87)

**మరమ్మతు** వి. *marammatu* ఏదైనా వస్తువు లేదా రోడ్డు, వంతెన వగైరా దెబ్బ తిన్నప్పుడు దాని పూర్వరూపం తెచ్చేందుకు చేసే ప్రయత్నం repair జంటనగరాల్లో పూర్తిగా చెడిపోయిన స్థితిలో ఉన్న 42 రోడ్ల మరమ్మతులను యుద్ధప్రాతిపదికపై చేపట్టి పూర్తిచేయనున్నట్లు ... తెలిపారు. (ఈ. అను. 19.5 89)

**మర్దనశాల** వి. *mardanaśaala* (స్త్రీలు)

చేతులతో మృదువుగా శరీర భాగాలను నొక్కుతూ ఉపశమనం కలిగించే(వ్యాపార) కేంద్రం massage parlour కమలా పురి కాలనీలోని మర్దనశాలపైన ఆదివారం పోలీసులు దాడిజరిపి ... అరెస్టు చేశారు (ఈ 29 6 87)

మలుపులు తిరుగు క్రి. *malupulu tirugu* ఊహించని కొత్తదారులు తొక్కు to take turns రాజకీయ పరిశీలకులకు సైతం ఆశ్చర్యం కలిగించేలా ఉత్తరప్రదేశ్ రాజకీయాలు అనూహ్యమైన మలుపులు తిరుగుతున్నాయి. (ఆం జ్యో 5 6 87)

మల్లగుల్లాలుపడు క్రి. *mallagullaalu-paDu* (సంక్లిష్ట పరిస్థితిలో) ఏమి చేయాలో తెలియక ఇబ్బంది పడు; తర్జన భర్జనపడు to struggle, mull over ... ప్రభుత్వానికి ఏ విధంగా సంజాయిషీ ఇవ్వాలన్న విషయమై ఐ.ఏ.ఎస్. అధికారులు మల్లగుల్లాలుపడుతున్నారు. (ఆం జ్యో 31 12 87)

మళ్ళింపు వి. *maLLimpu* ఒక దిక్కు నుంచి మరో దిక్కుకు పంపు diversion ... కేంద్ర ప్రభుత్వం సరఫరా చేస్తున్న బియ్యాన్ని రాష్ట్రప్రభుత్వం ప్రజా పంపిణీ విధానానికి మళ్ళిస్తోందని ... ఆరోపించారు. (ఈ. 6 10.88)

మస్కాట్ వి. *maskaaT* ప్రాముఖ్యం ఉన్న క్రీడల పోటీలకోసం తయారు చేసిన అధికార చిహ్నం mascot రిలయన్స్ కప్ క్రికెట్ పోటీల మస్కాట్ (అధికార చిహ్నం)గా క్రికెట్ దుస్తులతో ఉన్న పావురాన్ని నిర్ణయించారు. (ఆం ప్ర 8 10 87)

మహజరు వి. *mahajaru* వ్యక్తుల, సమూహాల కోర్కెలను నివేదిస్తూ అధికారులకు సమర్పించే పత్రం; వినతి పత్రం, విజ్ఞప్తి పత్రం memorandum, representation తమిళులపై అత్యాచారాలకు స్వస్తి చెప్పవలసిందిగా కోరుతూ శ్రీలంక హై కమీషనర్ మహజరును సమర్పించారు. (ఆం భూ 6 6 87)

మహానాడు వి. *mahaanaaDu* తెలుగు దేశం పార్టీకి చెందిన రాష్ట్ర స్థాయి పార్టీ సమావేశం mahanadu (a state level convention of Telugu Desam Party) జిల్లా పార్టీలు కూడా ఆయా పదవులలో ఉన్నవారి పనితీరును మదింపు వేస్తాయని, మహానాడుకు హాజరైతే 20 మార్కులు ... (ఆం. జ్యో. 22.10 87)

మహాసభ వి. *mahaasabha* ఏదైనా పార్టీ లేదా సంస్థ తమ పరిస్థితిని బేరీజు వేసుకొని భవిష్యత్కార్యాచరణను నిర్దేశించుకోడానికి ఏర్పాటుచేసే భారీ సమావేశం congress ఆంధ్రప్రదేశ్ ... కాంగ్రెస్ మహాసభలు జూలై 12వ తేదీన హైదరాబాదులోని ఆంధ్రసారస్వత పరిషత్ హాలులో జరుగుతాయి. (ఆం ప. 3.7 87)

మాఫియా ముఠా వి. *maafiyaa muThaa* రహస్యంగా అక్రమ వ్యాపారం చేసే ముఠా; అసాంఘిక శక్తులు, గూండా ముఠాలు mafia రాష్ట్ర ప్రభుత్వాన్ని కూలదోస్తానని బెదిరించిన 'మాఫియా' ముఠాల పైనే తాను చర్యతీసుకున్నానని ... (ఆం ప్ర. 9.2.89)

మాఫియా గాంగ్ వి. *mafiyaa gaang* చూ. మాఫియాముఠా. తనకు ఏ రకమైన 'మాఫియా గాంగ్' (అసాంఘిక శక్తులు)తో సంబంధంలేదని . . ఆమె తెలిపింది. (ఆం. ప్ర 24 5 87)

మాఫియా రాజకీయాలు వి. (బ.వ.) *maafiyaa raajakiiyaalu* ఆయుధాల సహాయంతో ఇతరులను బెదిరించి లొంగ

దీసుకోవటం ద్వారా నడిపే రాజకీయ కార్యకలాపాలు mafia politics ప్రజల పేరుతో పార్టీ కార్యకర్తలకు ఆయుధాలిచ్చి మాఫియా రాజకీయాలు నడిపేందుకు ముఖ్య మంత్రి ప్రయత్నిస్తున్నాడని ... ఆరోపించారు. (ఆం ప్ర. 21. 4 89)

**మాఫీచేయు** క్రి. *maafiiceeyu* ప్రజలకు ఇచ్చిన రుణాలను తిరిగి చెల్లించనవసరం లేదని ప్రకటించు; రద్దుచేయు to write off పేదలకోసం తెలుగుదేశం ప్రభుత్వం 78కోట్ల రూపాయల వడ్డీ మాఫీచేసిందని రాష్ట్రపంచాయితీరాజ్ మంత్రి ... చెప్పారు. (ఆం భూ 16 5 89)

**మాయపుచ్చు** క్రి. *maayapuccu* చూ. మభ్యపెట్టు. ... నిన్న చేసిన ప్రతిపాదన కోర్టును తప్పుదారి పట్టించేదిగానూ, మాయపుచ్చేదిగానూ ఉందని శ్రీ పరాశరన్ అన్నారు. (ఈ. 11 88)

**మారకం విలువ** వి. *maarakam viluva* వ్యాపార దృష్ట్యా వివిధ దేశాల కరెన్సీల మధ్య ఉండే మార్పిడి విలువ exchange rate రిజర్వు బ్యాంకు రూపాయి విదేశీ మారకం విలువను హెచ్చించటంతో పౌండ్ మారకం విలువ తగ్గింది. (ఆం ప్ర 23 6 87)

**మాంద్యపరిస్థితి** వి. *maandyaparisthiti* సరకుల డిమాండ్‌కన్నా ఉత్పత్తి ఎక్కువగా ఉండటం వల్ల కలిగే స్థితి; glut ప్రస్తుతం అంతర్జాతీయ మార్కెట్‌లో చక్కెర డిమాండ్ కంటే సప్లయ్ (ఉత్పత్తి) ఎక్కువగా ఉండడంతో మాంద్యపరిస్థితి నెలకొని వుంది. (ఆం ప్ర 21 9 89)

**మాగాణి సమారాధన** వి. *maagaaNi samaaraadhana* మిగులుగా ఉన్న సేద్యపు భూమిని లేదా బంజరు భూమిని భూమిలేని నిరుపేదలకు పంచే పథకం land distribution scheme ఆగస్టు 15వ తేదీ ఆయా జిల్లాలకు మంత్రులు వెళ్ళి తెలుగు మాగాణి సమారాధన కార్యక్రమంలో పాల్గొని భూముల పంపిణీ చేస్తారని ... చెప్పారు. (ఈ 18.7.87)

**మాజీ** విశే. *maaji* గతంలో ఒక స్థానం లేదా పదవిలో ఉండి ప్రస్తుతం దాన్ని కోల్పోయినవాడు ex-, former బడ్జెట్ వివరాలు బహిర్గతమైనందుకు నైతిక బాధ్యత వహిస్తూ, రాజీనామాలు చేసినందుకు మాజీమంత్రులందరిని ముఖ్యమంత్రి ప్రశంసించారు. (ఆం. ప్ర. 16.1 89)

**మాటువేయు** క్రి. *maaTuveeyu* ప్రత్యర్థులపై దాడి చేయడానికి అనువుగా దేన్నైనా చాటు చేసుకొని దాగి ఉండు; పొంచి ఉండు to lie in ambush ఈ హిమ ప్రాంతంలో మాటువేసిన పటాలాలకు పోరాటపటిమను ద్విగుణీకృతం చేసేందుకు ఈ హెలీకాప్టర్లు ఉపకరిస్తాయి. (ఈ. 20 2.88)

**మాత్ర** వి. *maatra* దెబ్బతిన్న ఆరోగ్యాన్ని బాగు చేసేందుకు వాడే ఔషధగుళిక tablet (medicinal) ... అయితే వైద్య సలహాతో రోజుకొక మాత్ర వేసుకుంటే రక్తం గడ్డకట్టడాన్ని నిరోధించ వచ్చునేది మరో సలహా. (ఆం భూ 12 6 87)

**మాదకద్రవ్యం** వి. *maadakadravyam* (తీసుకున్న తర్వాత) మనిషిని మత్తులో ముంచివేసే పదార్థం; మత్తుపదార్థం drug, narcotic ... రూ. 15కోట్ల విలువ చేసే మాదక ద్రవ్యాలు (బ్రౌన్ షుగర్, హెరాయిన్) పట్టివేశారు. (విశా. 2 9 87)

**మాన్ ఆఫ్ ది మ్యాచ్** వి. *maan aaf di myaac* (క్రికెట్) ఆటలో మొత్తం మీద అత్యుత్తమ ప్రతిభ కనపరిచిన ఆటగాడిగా, ఎంపికయిన వ్యక్తి man of

the match 'మాన్ ఆఫ్ ది మ్యాచ్' అవార్డుల రూపంలో మొత్తం 58లక్షల రూపాయల నగదు బహుమతి ఇస్తారు. (ఆం. ప్ర. 8.10 87)

మానభంగం వి. *maanabhangam* (మహిళను) బలవంతంగా అనుభవించటం rape మందుకోసం వచ్చిన మహిళను ... ఆస్పత్రి వార్డ్‌బాయ్ మానభంగం చేసిన సంఘటన వాస్తవమేనని అంగీకరించారు. (ఉ. 13 8 87)

మానవతాదృక్పథం వి. *maana-vataadRkpatham* సాటి మనుషుల బాధలను తొలగించి వారి క్షేమానికి పాటుపడాలనే భావన; మానవతాదృష్టి humanitarian outlook జాఫ్నా ద్వీపకల్పంలోని తమిళులకు మానవతాదృక్పథంతో విమానాల ద్వారా ఆహారా పదార్థాలను అందజేసిన తర్వాత ... (ఆం ప్ర 6 6.87)

మానవతాదృష్టి వి. *maanavataadRSTi* చూ. మానవతాదృక్పథం. దెబ్బతిన్న ఓడ మరమ్మత్తుల నిమిత్తం మన ప్రాదేశిక జలాల అవతల లంగరు వేసుకొనేందుకు ప్రభుత్వం మానవతాదృష్టితో అనుమతించిందని ... (ఆం. ప్ర 28 7 89)

మానవదినం వి. *maanava dinam* చూ. మనిషి దినం. ... సంవత్సరానికి దాదాపు 60కోట్ల 'మానవ-దినాల' (మాన్‌డేస్) ఉపాధికల్పించడం జరిగింది. (ఆం. ప్ర 6.7.89)

మానవహక్కులు వి. (బ.వ.) *maanava-hakkulu* మనిషి సమాజంలో గౌరవప్రదంగా జీవించడానికి తన మనుగడకి అవసరమైన కార్యకలాపాలను కొనసాగించడానికి ఉన్న అధికారాలు human rights ఇండియాలో తీవ్రమైన రీతిలో మానవహక్కుల ఉల్లంఘన జరుగుతోందని అమెరికా ఆరోపించింది. (ఆం ప్ర. 9.2.89)

మారక ద్రవ్యం వి. *maaraka dravyam* ఇతర దేశాలతో వాణిజ్యంకోసం ప్రభుత్వం దగ్గర ఉన్న విదేశీ కరెన్సీ exchange currency దీని ప్రకారం ప్రైవేటు సంస్థలు తాము విదేశాలలో సముపార్జించిన మారక ద్రవ్యాన్ని ఇంచుమించు యథేచ్ఛగా విదేశాలలో పెట్టుబడులకు, దిగుమతులకు వాడుకోవచ్చును. (ఆం ప్ర 15 6 89)

మారణకాండ వి. *maaraNakaanDa* ఇతరులపై దాడి చేసి అధిక సంఖ్యలో చంపటం massacre, killing spree గత 24 గంటలలో పంజాబ్, హర్యానాలలో టెర్రరిస్టులు జరిపిన మారణకాండకు 19 మంది బలిచెందారు. (ఆం. జ్యో. 23 11.88)

మార్చ్యురీ వి. *maarcyurii* (గుర్తింపు కోసం) చనిపోయిన వారి శవాలను ఉంచడానికి ఆస్పత్రి ప్రాంగణంలో ఏర్పాటు చేసిన గది mortuary మృతదేహాన్ని గుర్తింపు కోసం ఉస్మానియా మార్చ్యురీలో భద్రపరిచారు. (ఆం భూ 14 6.89)

మార్జిన్ మనీ వి. *maarjin manii* అత్యవసర పరిస్థితులలో ఖర్చు చేయటానికి వీలుగా ఉంచిన డబ్బు margin money అత్యవసర ఉపయోగాలకుగానూ, రాష్ట్రం వద్ద 24కోట్ల రూపాయల 'మార్జిన్ మనీ' ఉందని ... తెలిపారు. (ఉ. 8.12.87)

మారథాన్ పరుగు వి. *maarathaan parugu* చాల ఎక్కువ దూరం లక్ష్యంగా కలిగిన పరుగు marathon వరకట్న దురాచారానికి వ్యతిరేకంగా ప్రజల మద్దతు సమీకరించడానికి 1983లో ఢిల్లీ నుంచి మారథాన్ పరుగు మొదలు పెట్టిన ... దిగ్విజయంగా పూర్తిచేసుకున్నారు. (ఆం. ప్ర 16.8.87)

**మారుమోగు** క్రి. *maarumoogu* ప్రతిధ్వనించు to echo, resound ఆయన ప్రసంగం సాగినంతసేపు మధ్యమధ్యలో హర్షధ్వానాలు, ... అనే నినాదాలు హాలంతా మారుమోగాయి. (ఈ. 21.8.89)

**మార్గదర్శక సూత్రం** వి. *maargadarśaka suutram* ఏదైనా కార్యక్రమం లేదా ప్రణాళిక ఇలా సాగాలి అని స్థూలంగా నాయకత్వం నిర్ణయించిన నియమం; నియమబద్ధమైన విధానం guideline కేంద్ర ప్రభుత్వం 'జవహర్ రోజ్‌గార్ యోజన' పథకానికి సంబంధించిన మార్గదర్శక సూత్రాలను వరంలాగా విడుదల చేస్తుంది. (ఈ 25.5.89)

**మార్గాంతరం** వి. *maargaantaram* ఒక ఫలితాన్ని సాధించటానికి అందుబాటులో ఉన్న మరో పద్ధతి లేదా దారి; గత్యంతరం, వేరేదారి alternative పంచాయతీరాజ్ సంస్థలన్నింటికీ క్రమం తప్పకుండా నిర్ణీత వ్యవధిలో ఎన్నికలు నిర్వహించడానికి రాజ్యాంగం సవరించడం తప్ప మార్గాంతరం లేదని ... (ఈ 8 5 89)

**మార్చ్ ఫాస్ట్** వి. *maarc faasT* ఏదైనా ప్రాధాన్యం కలిగిన సందర్భంలో వేదిక మీద ఉన్న ఒక ఉన్నతాధికారి లేదా ప్రముఖుడి పక్కగా సైన్యం లేదా ఎన్.సి.సి. లేదా క్రీడాకారులు అభివందన పూర్వకంగా నడచివెళ్ళటం march past పదిహేను మంది బాలక్రీడాకారులు మార్చ్ ఫాస్ట్‌లో పాల్గొన్నారు. (ఈ. 5 6.87)

**మార్కెట్‌యార్డు** వి. *maarkeTyaarDu* రైతులు తమ ఉత్పత్తిని (ధాన్యం, పత్తి, మిర్చి వగైరా) అమ్ముకోడానికి వీలుగా ప్రభుత్వం కేటాయించిన వర్తక వాణిజ్య స్థలం marketyard రాష్ట్రంలోని 18 సహకార చక్కెర ఫ్యాక్టరీలు, 300 మార్కెట్ యార్డులు కర్షక పరిషత్ పరిధిలోని వస్తాయని ... (ఉ. 24 4.88)

**మార్పిడి** వి. *maarpiDi* ఒక దాని స్థానంలో మరొకటి అమర్చటం transplantation సాధ్యమైనంత త్వరలో అవయవాల మార్పిడికి సంబంధించిన చట్టం తెచ్చేందుకు కృషి చేస్తానని హామీ ఇచ్చారు. (ఆం. ప్ర. 23.4.89)

**మార్పుచేయు** క్రి. *maarpuceeyu* ఉన్న దానిని మరో విధంగా మార్చు to change శీతాకాలంలో ప్రభుత్వ కార్యాలయాలను జమ్ముకు మార్చేక గత విధానాన్ని మార్పుచేయాలనే నిర్ణయం ... (ప్ర. శ 27 10 87)

**మార్మోగిపోవు** క్రి. *maarmoogipoovu* ప్రతిధ్వనులతో నిండిపోవు to echo పో.చూ. మారుమోగు. ... బెనజీర్ వేదికపైకి వెడుతుంటే జాతీయ అసెంబ్లీ హర్షధ్వానాలతో మార్మోగిపోయింది. (ఆం జ్యో 1.12.88)

**మాల్ ప్రాక్టీసు** వి. *maal praakTiisu* పరీక్షల్లో కాపీ కొట్టటం malpractice ... 351 మంది విద్యార్థుల ఫలితాలను 'మాల్ ప్రాక్టీసు' పేరిట నిలిపి వేసినందున ... (విశా. 20 6 87)

**మాస్ కాపీయింగ్** వి. *maas kaapiiyng* విద్యార్థులు పరీక్షల్లో మూకుమ్మడిగా చూసి రాయటం mass-copying వాస్తవానికి ఈ పరీక్షా కేంద్రంలో మాస్ కాపీయింగ్ జరగలేదని ... (విశా 20.6 87)

**మాస్టర్‌ప్లాన్** వి. *maasTarplaan* భారీ ఎత్తున తయారు చేసిన పథకం; బృహత్ పథకం master plan మున్సిపాలిటీలకు మాస్టర్‌ప్లాన్-పురపాలక సంఘాలలో మంచి

నీటి సమస్యనుపరిష్కరించేందుకుగాను 500 కోట్ల రూపాయలతో రాష్ట్ర ప్రభుత్వం ఒక బృహత్తరపథకాన్ని చేపట్టింది. (ప్రజా. 2 9 87)

**మిగులు** వి. *migulu* అవసరానికి మించి ఉన్నది surplus దేశంలో మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లు మాత్రమే విద్యుత్ మిగులు కలిగి ఉన్నాయని శ్రీ వెంగళరావు తెలిపారు. (ఉ. 27.4 88)

**మిగులు బడ్జెట్** వి. *migulu baDjeT* ఖర్చు కన్నా ఆదాయం ఎక్కువగా ఉన్న ప్రభుత్వ ఆర్థిక ప్రణాళిక surplus budget *1988-89* ఆర్థిక సంవత్సరపు రైల్వే బడ్జెట్‌లో, ప్రయాణీకుల, పార్శిల్ లగేజి ఛార్జీలు పెంచుతూ రూ. *2835* కోట్ల మిగులు బడ్జెట్‌ను రైల్వే మంత్రి ... సమర్పించారు (ఉ. 25 2 88)

**మిడిమిడి జ్ఞానం** వి. *miDimiDi jnaanam* తెలిసీ తెలియక పోవటం half-knowledge న్యాయవృత్తికి మునుపటి గౌరవం లేదనే విమర్శను ప్రస్తావించి, మిడిమిడి జ్ఞానం ఉన్నవారు ఈ వృత్తిలో చేరడమే దీనికి కారణమని ఆయన అభిప్రాయపడ్డారు. (ఆం భూ. 3.7.89)

**మిడిసిపడు** క్రి. *miDisipaDu* గర్వంతో ప్రవర్తించు to be arrogant సోషలిజమంటే తన కుటుంబపాలనే అని మిడిసిపడ్డ పెసెన్సూర్యకి ప్రజలే చరిత్ర నిర్మాతలన్న జ్ఞానం లేకపోవడంలో ఆశ్చర్యం లేదు. (ఈ. 26.12.89)

**మితవాద నాయకుడు** వి. *mitavaada naayakuDu* వ్యవస్థలో మార్పులను అంగీకరించనివాడు conservative leader ఇంత కాలం ఉద్యమాన్ని సమర్థించిన మితవాద నాయకులు వెనుకంజ వేస్తున్నారని తెలిసింది. (ఆం భూ.

**మితవాద పార్టీ** వి. *mitavaada paarTi* రాజకీయాది రంగాలలో తీవ్రమైన మార్పులను వ్యతిరేకిస్తూ యథాతథ స్థితిని సమర్థించే రాజకీయ పక్షం conservative party మితవాద పార్టీలు స్వల్పకాలిక అభివృద్ధికి, తక్షణప్రయోజనాలకు ఉబలాట పడతాయని, కాని వామపక్షాలు కూడా ఇదే మార్గాన్ని అనుసరిస్తున్నాయని ఆయన ఆరోపించారు. (ఉ 24 12.87)

**మితవాది** వి. *mitavaadi* రాజకీయాది రంగాలలో తీవ్రమైన మార్పులను వ్యతిరేకిస్తూ యథాతథ స్థితిని సమర్థించే వ్యక్తి conservative దక్షిణాఫ్రికాలో మితవాదుల పట్టు. (ప్ర శ 5 6 87)

**మితిమీరు** క్రి. *mitimiiru* సహించలేని స్థితికి చేరుకొను; ఎక్కువ అగు t exceed the limits నగరంలో ట్రాఫిక పోలీసుల వేధింపులు రోజురోజుకు మితిమీరుతున్నాయి. (ఈ 10.5 89)

**మిత్రదేశం** వి. *mitradeeśam* రాజకీయ ఆర్థికాది రంగాలలో మంచి స్నేహ సంబంధాలు ఉన్న దేశం allied country అమెరికా దాని మిత్రదేశాల మధ్య ఆర్థిక విధానాలు, సరళం చేయడం ... (విశా. 8 6 87)

**మిత్రపక్షం** వి. *mitrapakSam* రాజకీయ కార్యాచరణలో కలిసి వచ్చే రాజకీయ పార్టీ friendly party రాజకీయ లబ్ధికోసం కాక, రాజకీయ పరిష్కారంకోసం ప్రయత్నించమని మిత్రపక్షాలు మరోసారి ముఖ్యమంత్రికి సలహా ఇచ్చాయి. (ఆం.భూ. 18 7.89)

**మినహా** అవ్య. *minahaa* పేర్కొన్న విషయం తప్ప except అధ్యక్షస్థానం మినహా ఎన్నికలు జరుగుతున్న మిగిలిన

లలో ఉన్నవారే తిరిగి ఎన్నిక అవుతారని భావిస్తున్నారు. (ఆం జ్యో 8 11 88)

**మినహాయించు** క్రి. *minahaayincu* పరిధిలో నుంచి తీసివేయు to exempt అయితే ఆందోళన నుంచి ప్రైవేటు వాహనాలను మినహాయించామని ఆయన అన్నారు. (ఆం జ్యో 2 10 88)

**మినిట్స్** వి. *miniTs* ఏదైనా సమావేశంలో వ్యక్తమయిన అభిప్రాయాలు, తీసుకున్న నిర్ణయాలకు సంబంధించి నమోదు చేసిన వివరాలు minutes (of a meeting) ఈ కమిటీల సమావేశాల తాలుకు మినిట్స్ లో ఎక్కడా 'గాంధేయ రాజ్యాంగం' గురించిగాని కనీసం పంచాయితీ గురించిగాని ప్రస్తావనలేదు. (ఆం భూ 11 5.89)

**మిన్నకుండు** క్రి. *minnakunDu* (జరిగిన) విషయాన్ని పట్టించుకొనకపోవు to keep quiet, ignore అస్సాం, ఆంధ్ర ప్రదేశ్, పశ్చిమ బెంగాల్‌లో ఇటువంటి సంఘటనలు జరిగితే కేంద్రప్రభుత్వం మిన్నకుండేదా అని ఆయన ప్రశ్నించారు. (ఆం భూ 17 8.89)

**మిన్నుముట్టు** క్రి. *minnumuTTu* తీవ్ర స్థాయిలో వినిపించు to reach the skies (as sounds) నెహ్రూ ప్రసంగిస్తున్నంత సేపు సభలో కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. (ఆం జ్యో 2.12.88)

**మిమిక్రీ** వి. *mimikri* వినోదంకోసం ప్రముఖుల గొంతులను, మానవేతర ధ్వనులను అనుకరించటం; ధ్వన్యనుకరణం mimicry బాలలకు మిమిక్రీలో శిక్షణా కార్యక్రమం ఏర్పాటు చేయాలని అభినందన సాంస్కృతిక సంస్థ నిర్ణయించింది. (ఈ. 18 6.87)

**మిలాఖత్ అగు** క్రి. *milaakhatagu* చేతులు కలుపు to join hands, collude నక్సలైట్లతో మిలాఖత్‌అయ్యానని మాత్రమే కాదు, నన్నే నక్సలైటంటున్నారు మరి. (ఆం జ్యో. 31 12 87)

**మిలిటరీ చర్య** వి. *miliTarii carya* (సమస్య పరిష్కారానికి) సాయుధ బలగాలను నియోగించటం military action భారత్ మిలిటరీ చర్యకు పూనుకోవడం ద్వారా ప్రతీకారం తీర్చుకోవాలన్న అభిప్రాయంతో అందరూ ఏకీభవించడం లేదు. (ఈ 5 7 87)

**మిలిటెంట్లు** వి. (బ వ.) *miliTenTlu* చూ. తీవ్రవాదులు. మిలిటెంట్లపై పోలీసులు తమకు ఇష్టం వచ్చిన చర్య తీసుకోవచ్చునని ఆందోళన నాయకులు ... చెప్పారు. (ఆం భూ 30 6 87)

**మిశ్రమ ప్రభుత్వం** వి. *miśrama prabhutvam* చూ. సంకీర్ణ ప్రభుత్వం. కేంద్రంలో మిశ్రమ ప్రభుత్వం ఏర్పడడానికి జాతి సిద్ధంగా ఉండాలని, మిశ్రమ ప్రభుత్వం వల్ల దేశ సమైక్యతకు భంగం కలుగుతుందన్న అభిప్రాయం సరికాదని . . (ఆం ప్ర 13.3.89)

**మిశ్రమ మంత్రివర్గం** వి. *miśrama mantrivargam* చూ. సంకీర్ణ మంత్రివర్గం. జానిసే జానెటా ప్రధానిగా గ్రీసులో 22మంది సభ్యుల మిశ్రమ మంత్రివర్గం ఆదివారం ప్రమాణ స్వీకారం చేసింది. (ఆం. భూ 3 7 89)

**మిష** వి *miSa* అసలు ఉద్దేశ్యాన్ని కప్పిపుచ్చుతూ చెప్పే మరో కారణం; సాకు

pretext, alibi పంచాయితీరాజ్ సంస్థలను పటిష్టం చేయాలన్న మిషతో భారత రాజ్యాంగపు మౌలిక స్వరూపాన్ని మార్చే ఉద్దేశం తమ ప్రభుత్వానికి లేదని రాజీవ్ గాంధీ చెప్పారు. (ఈ. 11.5.89)

మిస్టరీ వి. *misTarii* అంతు తెలియని విషయం mystery తిరుమల సందర్శకులలో స్త్రీల అదృశ్యం. అంతు చిక్కని మిస్టరీ. (ఈ 6.6.87)

మిస్సైలీ వి. *missailii* సుదూర లక్ష్యాలను ఛేదించటానికి యుద్ధంలో ఉపయోగించే ఆయుధం missile ఇరాన్‌కు చైనా దాదాపు హె-2 నౌకా విధ్వంసక మిస్సైలీలను విక్రయిస్తోందని గత రెండు వారాలుగా అమెరికా ప్రభుత్వం ఆరోపిస్తున్నది. (విశా 10.6.87)

మీట్ ది ప్రెస్ వి. *miiT di pres* ఒక ప్రముఖుడిని ఏదైనా ముఖ్యవిషయంపై ప్రసంగించేందుకు పత్రికా రచయితలు ఆహ్వానించి ఏర్పాటు చేసే సమావేశం meet the press భారత ప్రెస్ క్లబ్ బుధవారం నాడిక్కడ ఏర్పాటుచేసిన 'మీట్ ది ప్రెస్' కార్యక్రమంలో మాట్లాడుతూ, "ఈ అంశంలో సూత్రరీత్యా బోర్డు పంథా తప్పు" అని కపిల్ నిర్మొహమాటంగా ప్రకటించారు. (ఈ 21.9 89)

మీదుగా క్రి.వి. *miidugaa* ఒక ప్రదేశాన్ని తాకుతూ via బవ్రాదు బొంబాయి మీదుగా లండన్ వెళుతున్నారు. (ఆం ప్ర 6.6 87)

మీన మేషాలు లెక్కపెట్టు క్రి. *miina meeSaalu lekkapeTTu* ఏమి చేయాలో తెలియక కాలం వెళ్ళబుచ్చు to be cross fingered ఇటీవల మంత్రి పదవిపోయిన శ్రీ రత్న సభాపతి కూడా మీన మేషాలు లెక్కపెడుతున్నారు. (ఆం జ్యో 26.11 87)

మీమాంస వి. *miimaamsa* చేయాలా వద్దా అనే సందిగ్ధ స్థితి dilemma ప్రాసిక్యూషన్‌పై జైల్ మీమాంస. ప్రధానిని ప్రాసిక్యూట్ చేయడానికి అనుమతించాలా వద్దా అనే విషయంపై రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్ ఇప్పటి వరకు తుది నిర్ణయం ఏదీ తీసుకోలేదు. (ఈ 14 7 87)

ముంగిలి వి. *mungili* చాలా దగ్గర; అందుబాటు doorstep అధికార యంత్రాంగం మారుమూల గ్రామాల్లోని సామాన్య ప్రజల ముంగిట్లోకి వెళ్ళి, వారికి సంబంధించిన సమస్యల్ని అక్కడికక్కడే పరిష్కరించాలని అనుకోవడం మంచిదే అయినప్పటికీ ... (ఆం భూ 26.4.89)

ముంచుకొచ్చు క్రి. *muncukoccu* ఉధృతంగా వచ్చి పైనబడు; కమ్ముకొను to flood(as troubles etc.) బొమ్మయ్‌ను కూడా ప్రత్యర్థుల జాబితాలో హెగ్డే చేర్చుకోవటంతో కర్ణాటక ప్రభుత్వానికి కష్టాలు ముంచుకొచ్చాయి. (ఆం. భూ. 23.4.89)

ముంచెత్తు క్రి *muncettu* పూర్తిగా మునుగునట్లు చేయు, ఉక్కిరి బిక్కిరి చేయు to flood, inundate గాలి వానలు, వరదలు వచ్చి గ్రామాలను పట్టణాలను ముంచెత్తి సర్వనాశనం చేసినప్పుడు మాత్రమే ప్రభుత్వాలకు మురుగు నీటి పారుదల పథకాల ఊసు జ్ఞప్తికొచ్చింది. (ఈ 29.7.89)

ముందంజ వి. *mundanja* ఇతరులకన్నా ఆధిక్యంలో ఉండటం; ముందడుగు to be ahead of others, leading నాగాలాండ్‌లో కాంగీ ముందంజ. (విశా 21.11.87)

ముందస్తు బెయిల్ వి. *mundastu*

*beyıl* చూ. పూర్వాదాన జామీను. లాహోర్ హైకోర్టు అంతకు ముందు ఆయ నకు ఇచ్చిన ముందస్తు బెయిల్‌ను పెషావర్ హైకోర్టు ధృవీకరించడానికి నిరాకరించ డంతో పోలీసులు ఈ అరెస్టు చేశారు. (ఆం. ప్ర. 23 7.89)

**ముందుంచు** క్రి. *munduncu* వాస్తవ సమాచారాన్ని తీర్పునాశించి సంబంధిత వ్యక్తుల సమక్షంలో పెట్టు to put before sb (for consideration) "తమ ప్రభుత్వం సాధించిన విజయాలను ప్రజల ముందుంచుతాం" అని ఆయన వెల్ల డించారు. (ఆం ప్ర 22.4.89)

**ముందుజాగ్రత్త చర్య** వి. *mundu-jaagratta carya* ప్రమాదం వస్తుందని పసిగట్టినప్పుడు దానిని తప్పించడానికి లేదా ఎదుర్కోడానికి తీసుకొనే చర్య precautionary measure బుధ వారంనాడు జరుగనున్న లోకసభ, శాసనసభ ఎన్నికలలో ఎటువంటి అవాంఛనీయ సంఘట నలు జరుగకుండా ముందుజాగ్రత్త చర్యలు తీసుకున్నట్లు ... (ఆం ప్ర. 21 11 89)

**ముంపు** వి. *mumpu* వరదనీరు విపరీ తంగా వచ్చి ఒక ప్రదేశాన్ని కప్పివేయటం inundation హైదరాబాద్ జిల్లాలో రెండు, కరీంనగర్ జిల్లాలో 18గ్రామాలు ముంపునకు గురయ్యాయి. (ఈ 27 7.89)

**ముక్కచెక్కలగు** క్రి. *mukkacekkalagu* పగిలి చిన్న చిన్న భాగాలుగా విడిపోవు to break into pieces భూ వాతా వరణం రాపిడికి ఇది చాలా వరకు మండు తుంది. మిగిలిన భాగం ముక్కచెక్కలై శకలాలు భూమిని తాకుతాయి. (ఈ 12 7 89)

**ముక్కుపిండు** క్రి. *mukkupinDu* బల వంతంగా వసూలుచేయు to squeeze శ్లాబ్ పద్ధతిన ముక్కుపిండి ఛార్జీలు వసూలు చేస్తూ, సక్రమంగా విద్యుత్ సరఫరా చెయ్యక వినియోగదారులను అవస్థలపాలు చేస్తున్నారు. (ఈ 22 4 89)

**ముక్కోణపు పోటీ** వి. *mukkooNapu pooTii* ప్రధానంగా మూడు పార్టీల మధ్య లేదా ముగ్గురు అభ్యర్థుల మధ్య ఉన్న పోటీ triangular contest or fight బి. హెచ్. ఇ. ఎల్ (ఆర్. బి) ఎన్నికలో ముక్కోణపు పోటీ. (ఆం ప్ర 16.6 87)

**ముక్కోణ వ్యూహం** వి. *mukkooNa vyuuham* ఒక ఫలితం సాధించటా నికి ఒకే కాలంలో మూడు విధాలుగా ప్రయత్నించటం three pronged strategy లొంగిపోయిన నక్సలైట్లకు క్షమాభిక్ష ప్రసాదించాల్సిన అవసరం లేదని చట్టప్రకారం వారిని శిక్షించాల్సిందేనని అంటూ నక్సలైట్ సమస్య పరిష్కారానికి బి. జె. పి. ముక్కోణ వ్యూహాన్ని సూచించింది. (ఆం. ప్ర. 14.6 89)

**ముక్తకంఠం** వి. *muktakanTham* అందరూ కలసి ఒకే అభిప్రాయం వ్యక్తం చేయటం unanimous ప్రధాన మంత్రి పార్లమెంట్‌కి 'అబద్ధాలు' చెబుతున్నారంటూ లోకసభ, రాజ్యసభ సభల్లో ప్రతిపక్ష సభ్యులు ముక్తకంఠంతో విమర్శించారు. (ఈ. 20.7.89)

**ముక్తసరి** వి. *muktasari* మరీ పెద్దది కానిది (సమాధానం, మాటలు మొ.); క్లుప్తం brief శ్రీ శ్రీనివాసుల రెడ్డి కాంగ్రెస్(ఐ)లో ప్రవేశిస్తారా అన్న ప్రశ్నకు 'ఏమో నాకు తెలియదు' అని ముక్తసరిగా సమాధానమిచ్చారు. (ఈ 20 11.87)

**ముక్తాయింపు** వి. *muktaayımpu* ఒక విషయంపై చివరి మాటగా వ్యాఖ్యానిం

చటం conclusion బోఫోర్స్ శతఘ్నుల కొనుగోలు వ్యవహారంలో జరిగిన అవినీతి కుంభకోణానికి వ్యతిరేకంగా కేంద్ర ప్రభుత్వంపై అసంతృప్తి పెరుగుతుంటే ఏమవుతుంది? సైనిక తిరుగుబాటు వస్తేరావచ్చు అని ఆయన ముక్తాయింపు యిచ్చారు. (ఆం. ప్ర. 31.8 89)

**ముఖాముఖి** క్రి.వి. *mukhaamukhi* ఎదురెదురుగా, నేరుగా face to face, direct రాజీవ్ పారిస్ పర్యటన అనేక దేశాల నాయకులతో మరోసారి ముఖాముఖి చర్చించి, మనసు విప్పి మాట్లాడుకుని సంబంధాలను మెరుగు పరచుకోడానికి మంచి అవకాశం కల్పించింది. (ఆం. భూ 19 7 89)

**ముఖ్యఅతిథి** వి. *mukhyaatithi* సభలు, సమావేశాలు, ఉత్సవాలు మొ. వాటికి బయటి నుంచి పిలిపించిన ప్రముఖమైన వ్యక్తి chief guest వియత్నాం కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి గ్యుయెన్‌వాన్‌లీ వచ్చే ఏడాది రిపబ్లిక్ దినోత్సవాలలో ముఖ్యఅతిథిగా పాల్గొంటారని ఆయన వెల్లడించారు. (ఆం. జ్యో 18 4 88)

**ముఖ్యభూమిక** వి. *mukhyabhuumika* చాలా ప్రధానమైన పాత్ర crucial or important role అంతర్జాతీయ ఆటగాడు ఆర్. పి. సింగ్ ఆ జట్టు విజయం సాధించడంలో ముఖ్యభూమిక నిర్వహించాడు. (ఈ. 29 7 89)

**ముగింపు ఉత్సవం** వి. *mugimpu utsavam* శిబిరాలు, క్రీడల పోటీలు మొ. వాటి చివరిరోజు ఏర్పాటు చేసే కార్యక్రమ validictory function నగరపాలక సంస్థ (ఎం. సి. హెచ్.) నిర్వహించిన వేసవి శిక్షణా శిబిరం ముగింపు ఉత్సవం బుధవారంనాడు లాల్ బహదూర్ స్టేడియంలో వైభవంగా జరిగింది. (ఈ 5.6.87)

**ముగింపు మూల్యం** వి. *mugimpu muulyam* ఒప్పందంలో అవతలి పార్టీకి వాళ్ళ సేవలకు ప్రతిఫలంగా ముట్టచెప్పే సొమ్ము termination charges అవి ముడుపులు కావని, ముగింపు మూల్యాలని పార్లమెంటరీ దర్యాప్తు కమిటీ చెప్పిందని అయితే అవి ముడుపులేనని డాక్యుమెంట్లు తేల్చి చెప్పాయని ఆయన అన్నారు. (ఆం. ప్ర. 16 11 88)

**ముగింపు సమావేశం** వి. *mugimpu samaaveeśam* ఒక కార్యక్రమంలో చివరగా జరిపే సమావేశం concluding session బెంగుళూరులో శనివారం జరిగిన దక్షిణాది రాష్ట్రాల పంచాయితీరాజ్ సమ్మేళనం ముగింపు సమావేశంలో ... (ఆం. ప్ర. 1 5 89)

**ముగియు** క్రి. *mugiyu* అంతం అగు, పూర్తి అగు to end ఆయన మృతితో హిందీ చలన చిత్ర నేపథ్యగానంలో ఒక అధ్యాయం ముగిసిందని వారన్నారు. (ఆం జ్యో. 14.10.87)

**ముచ్చటించు** క్రి. *muccaTincu* పిచ్చాపాటీ మాట్లాడు to chat రాష్ట్ర పి. సి. సి(ఐ) నాయకత్వం చేపట్టాక తొలిసారిగా కర్నూలు జిల్లా పర్యటనకు వచ్చిన చెన్నారెడ్డి పత్రికా ప్రతినిధులతో సుదీర్ఘంగా ముచ్చటించారు. (ఆం ప్ర 3.7 89)

**ముచ్చెమటలు పోయు** క్రి. *muccemaTalu pooyu* విపరీతంగా భయపడు to be terribly scared, shudder (with fear) నక్సలైట్లు, ప్రభుత్వానికి మధ్య రాయబారం నడిపిన శ్రీ రాధ మాత్రం తనకు ఈ వ్యవహారంలో ముచ్చెమటలు పోసినట్టు విలేకరులకు చెప్పారు. (ఆం ప్ర 31.12.87)

**ముట్టచెప్పు** క్రి. *muTTaceppu* ఒప్పందంలో భాగంగా ప్రతిఫలం చెల్లించు to pay *ఈ పనులు చేసినందుకు లాక్‌పీడ్ కంపెనీ 1970-75ల్లో ఈయనకు 106 మిలియన్ డాలర్లు ముట్టచెప్పిందని అంగీకరించింది.* (ఆం భూ. 17 5.89)

**ముట్టడించు** క్రి. *muTTaDincu* ఎదుటి పక్షానికి చెందిన స్థావరాన్ని తమ బలగంతో చుట్టుముట్టు to surround, lay siege *కేంద్రం ఏ ప్రతిపక్ష రాష్ట్ర ప్రభుత్వాన్నయినా భర్తరఫ్ చేస్తే ఆ మరునటి రోజే ప్రతిపక్షాలు దేశ రాజధానిని ముట్టడించగలవని హర్యానా ముఖ్యమంత్రి శ్రీ దేవీలాల్ హెచ్చరించారు.* (ఆం. ప్ర. 26.8 89)

**ముఠా** వి. *muThaa* ఒకే సంస్థ లేదా పార్టీలో స్వీయ ప్రయోజనాల పరిరక్షణ కోసం ఏర్పడిన ఉప బృందం; గుంపు group, gang *జిల్లా తెలుగు దేశం పార్టీలో ముఠాలు లేనే లేవు అని రాజేశం గౌడ్ మరోసారి ఉద్ఘాటించారు.* (ఆం ప్ర 18 4 88)

**ముఠా కార్మికులు** వి. (బ.వ.) *muThaa kaarmikulu* చిన్న చిన్న బృందాలుగా ఏర్పడి మార్కెట్లు బస్‌స్టాండ్లు వంటి ప్రదేశాలలో పనిచేసే శ్రమజీవులు gang men or labourers *'విజయవాడ ముఠా కార్మిక సంఘం మహాసభ డిమాండ్' ముఠా కార్మికుల సమస్యల సాధనకై జూన్ నెలాఖరు...* (విశా 8 6 87)

**ముఠా రాజకీయం** వి. *muThaa raajakiiyam* ఒకే పార్టీలో అంతర్గత కలహాలతో వివిధ గ్రూపులుగా చీలిపోయి వ్యవహరించటం group politics *అయితే అప్పుడు అధికారంలో వున్న కాంగ్రెస్ పార్టీ ముఠా రాజకీయాల వల్లనైతేనేమీ, ప్రతిపక్ష పార్టీల వ్యతిరేకత వల్లనైతేనేమీ ఆ భూమి కాస్తా పేదల పరమైంది.* (ఆం. ప్ర. 7 7.87)

**ముడిపడు** క్రి. *muDipaDu* ఒక విషయం మరొక దాని ఉనికి మీద ఆధారపడి, విడదీయలేని సంబంధం కలిగిఉండు to be linked *ఆ దేశంలోని భవిష్యత్ పరిణామాలు మనదేశ భద్రతతో ముడిపడి వున్నందున ...* (ఈ. 21 7 89)

**ముడిపదార్థం** వి. *muDipadaartham* సహజ స్థితిలో ఉండి ఇంకా శుద్ధి చెయ్యని పదార్థం raw material ... *సహజ వాయువును ఇంధనంగాను, ముడిపదార్థంగాను వాడడంవల్ల పారిశ్రామిక కాలుష్యాన్ని చాలా వరకు నివారించ వచ్చునన్నారు.* (ఆం. జ్యో. 22 4 88)

**ముడిపెట్టు** క్రి. *muDipeTTu* ఒక విషయానికి మరొక దానితో సంబంధం కలుపు to link *ప్రతిదాన్ని రాజకీయ ప్రయోజనాల కోసం ముడిపెడుతున్నారని ఆరోపించారు.* (ఆం ప్ర 28 7.89)

**ముడివడు** క్రి. *muDivaDu* చూ. ముడిపడు. *ఉత్పాదకతతో ముడివడిన బోనస్‌ను సరైన స్థాయిలో చెల్లించాలని కోరుతూ రైల్వే ఉద్యోగులు. .* (ఆం జ్యో 11 6 87)

**ముడుపు** వి. *muDupu* ఒక పని చేసిపెట్టినందుకుగాను ప్రతిఫలంగా ముట్టచెప్పే సొమ్ము, లంచం commission *విదేశీ కంపెనీల వద్ద ముడుపులు పుచ్చుకొని నాసిరకం ఆయుధాలను కొనుగోలు చేసిన ...* (ఈ 21 8 89)

**ముదరా** వి. *mudaraa* అసలు ధరలో ఇచ్చే తగ్గింపు concession, discount *ఓట్లు వేయమంటారు, ఉద్ధరిస్తామంటారు. రైతుకు అయిదున్నర శాతం ముదరా యిస్తే*

పద్దంటారు, ఇదేనా వారు చేసే సేవ అని శ్రీ రామారావు ఆవేశంగా ప్రశ్నించారు. (ఆం భూ. 26 5 89)

**ముద్ర** వి. *mudra* ఒక విషయానికి ఆధికారికంగా తెలిపే సమ్మతి stamp, approval బోఫోర్స్ ఒప్పందంపై దర్యాప్తునకు గాను పార్లమెంటరీ కమిటీ ఏర్పాటు చేయడానికి ఉద్దేశించిన అధికార తీర్మానాన్ని రాజ్యసభ బుధవారం ఆమోదించింది. దీంతో దీనికి పార్లమెంట్ ముద్ర పడింది (ఉ 13 8 87)

**ముద్రణాలయం** వి. *mudraNaalayam* ఏదైనా సమాచారాన్ని అచ్చువేసే ప్రదేశం printing press ఒకటి నుంచి అయిదవ తరగతి వరకు పాఠ్యపుస్తకాలన్ని పూర్తి కోటాను ప్రభుత్వ ముద్రణాలయంలోనే ముద్రించి పంపిణీ చేశారు. (ఆం ప్ర 19 7 89)

**ముద్రాపకుడు** వి. *mudraapakuDu* అచ్చువేసే సంస్థకి అధిపతి printer వీటితో పాటు 109 ముద్రాపకులకు ఒకటి నుంచి 10వ తరగతి వరకు పాఠ్యపుస్తకాలను అచ్చువేసి అమ్ముకోవడానికి 'కాపీరైటు' కడచిన జూన్ నెలలో ఇచ్చింది. (ఆం ప్ర 19 7.89)

**ముప్పు** వి. *muppu* మనుగడకు ఏర్పడిన ప్రమాదం danger జాఫ్నా పరిస్థితి ఈ ప్రాంతంలో శాంతి సమగ్రతలకు ముప్పు కలిగిస్తుందన్నారు. (ఈ. 5 6 87)

**ముప్పుతిప్పలు పెట్టు** క్రి. *mupputip-palu peTTu* ఇతరులకి బాగా సమస్యలను సృష్టించు to create serious problems భారత ఫేస్ బౌలర్లు ముఖ్యంగా వివేక్‌రజ్దాన్ ఈ రోజు పాక్ బ్యాట్స్‌మెన్‌ను ముప్పుతిప్పలు పెట్టారు. (ఈ. 12.12.89)

**ముభావం** వి *mubhaavam* ఒక విషయం గురించి ఎటువంటి అభిప్రాయం వ్యక్తం చేయకుండా మౌనం వహించటం indifferent attitude స్వర్ణాలయంలో భద్రతా సిబ్బంది పట్ల యాత్రికులు, చుట్టూ నివసించే ప్రజలు చాలా ముభావంగా వుండేవారు. (ఆం. భూ. 30.5.89)

**ముమ్మరం** వి. *mummaram* (ఏదైనా కార్యకలాపం) అధికమైన వేగం పరిమాణంతో కూడుకున్నది brisk పట్టణ ప్రాంతాల్లో పోలింగ్ ముమ్మరంగా జరిగింది. (ఈ 18 6 87)

**ముమ్మరంచేయు** క్రి. *mummaramceeyu* ఎక్కువ చేయు, తీవ్రం చేయు to increase or step up ఆదాయాన్ని పెంచేందుకు అవసరమైన పన్నుల మినహాయింపులను రద్దుచేసి, పన్నుల వసూలు ముమ్మరంచేయాలని ఆ నివేదిక పేర్కొంది. (ఉ 27.2.88)

**ముమ్మరించు** క్రి. *mummarincu* ఎక్కువ అగు, అధికం అగు to increase ఈ సమయంలోనే ఇండోనేపాల్ మైత్రికి విఘాతం కలిగించే పరిణామాలు ముమ్మరించటం ఉప ఖండంలోని ఉభయ దేశాల రక్షణకు శ్రేయస్కరం కాజాలదు. (ఆం. భూ. 20 4 89)

**ముసలం** వి. *musalam* ఒక సంస్థ నాశనానికి దారితీసే సమస్య serious trouble తన ప్రభుత్వాన్ని రద్దు చేసినందుకు బాధపడుతున్న సోమప్ప రామప్ప బొమ్మయ్ ఏప్రిల్ 18న చేసిన ప్రకటన జనతాదళ్‌లో పుట్టిపెరుగుతున్న ముసలానికి సాక్ష్యం. (ఆం భూ 23 4 89)

**ముసాయిదా** వి. *musaayidaa* అంగీకరించే ముందు చర్చకు పెట్టే

ప్రతి; చిత్తుప్రతి draft of a bill or declaration కమిటీ ఏర్పాటుపై పార్లమెంట్‌లో ప్రతిపాదించదలచుకొంటున్న తీర్మానం ముసాయిదాను తమకు ఇవ్వాలని కూడా వారు కోరారు. (ఈ 18 6.87)

**ముసాయిదా తీర్మానం** వి. *musaayidaa tiirmaanam* చిత్తుప్రతి రూపంలో ఉన్న తీర్మానం draft resolution నేషనల్ ఫ్రంట్ అధికారంలోకి వస్తే పని హక్కును రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కుల జాబితాలో చేర్చాలని కూడా ముసాయిదా తీర్మానంలో పేర్కొన్నట్లు తెలిపారు. (ఈ. 7 6.89)

**ముసాయిదా నివేదిక** వి *musaayidaa niveedika* చిత్తుప్రతి రూపంలో ఉన్న రిపోర్టు draft report ఆడిట్ రూపొందించిన ముసాయిదా నివేదికలోని పెక్కు అంశాలను మంత్రిత్వశాఖ తిరస్కరించటంతో కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ సంయుక్త సంఘం 1989 ఫిబ్రవరిలో మళ్ళీ సమావేశమై ఈ క్రింది వైఖరిని తీసుకొంది అని నివేదిక తెలిపింది. (ఆం. ప్ర 20 7.89)

**ముసాయిదా ప్రణాళిక** వి. *musaayidaa praNaaLika* చిత్తుప్రతి నమూనా ప్లాన్ draft plan ముసాయిదా ప్రణాళికను ఇప్పటికే రూపొందించామని ఫ్రంట్ ప్రిసీడియంలో దీనిపై చర్చ జరిగిందని ఆయన చెప్పారు. (ఈ. 7 6 89)

**ముసాయిదా బిల్లు** వి. *musaayidaa billu* చట్టంగా రూపొందకముందు చిత్తు రూపంలో ఉన్న తీర్మాన ప్రతి draft bill గర్భస్థ శిశువు నిర్ధారణ పరీక్షలను క్రమబద్ధం చేస్తూ ఒక ముసాయిదా బిల్లును రూపొందించి రాష్ట్ర ప్రభుత్వాల అభిప్రాయంకోసం పంపనున్నట్లు వైద్య శాఖ సహాయమంత్రి కుమారి సరోజ్ కపర్డే నేడు లోకసభలో వెల్లడించారు. (ఆం. ప్ర. 17.11.88)

**ముస్తాబుఅగు** క్రి. *mustaabuagu* ఒక కార్యక్రమాన్ని నిర్వహించడానికి అన్ని రంగాలలో సిద్ధం అగు to be dressed up , prepared ... శుక్రవారంనాడు జరగనున్న రెండో విడత పోలింగ్‌కు వివిధ రాష్ట్రాలు ముస్తాబయ్యాయి. (ఈ 24.11 89)

**ముహూర్తం** వి. *muhuurtam* ఒక కార్యక్రమాన్ని నిర్వహించటానికి నిర్ణయించిన సమయం time (as fixed for an event) నవంబర్‌లో ముహూర్తం. గ్రామ పంచాయితీలకు వచ్చే నవంబర్‌లో ఎన్నికలు జరిపే విషయం ప్రభుత్వం పరిశీలిస్తున్న దని పంచాయితీరాజ్ శాఖ మంత్రి చెప్పారు. (ఆం జ్యో 19 9.87)

**ముళ్లకంచె** వి. *muLLakance* సరిహద్దు వద్ద తీగలతో నిర్మించిన అడ్డుకట్ట fence భారత-పాకిస్తాన్ సరిహద్దు ప్రాంతంలో ముళ్ల కంచె నిర్మాణం మూడు నెలల్లో పూర్తవుతోం దని తాము భావిస్తున్నట్లు ఆయన చెప్పారు. (ఉ 27.4 88)

**మూకుమ్మడి రాజీనామాలు** వి. (బ.వ.) *muukummaDi raajiinaamaalu* రాజకీయ ఎత్తుగడగా ఒకేసారి చాలమంది తమ పదవులకు రాజీనామాలు చేయటం en masse resignations ముకుమ్మడి రాజీనామాల ప్రతిపాదనపై తాము తీసుకున్న చారిత్రాత్మక నిర్ణయాన్ని నేషనల్ ఫ్రంట్ ఛైర్మన్, తెలుగుదేశం అధినేత అయిన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఎన్టీరామారావు ఆదివారం సాయంత్రం విలేకరుల సమావేశంలో ప్రకటించారు. (ఈ 24 7 89)

**మూకుమ్మడి హత్యలు** వి. (బ.వ.) *muu-*

*kummaDi hatyalu* ఒకేసారి చాలా మందిని విచక్షణా రహితంగా చంపటం mass killings హర్యానాలోని వివిధ ప్రాంతాలలో అమాయక ప్రజల్ని మూకుమ్మడి హత్యలకు గురిచేయడానికి పంజాబ్ ఉగ్రవాదులు పన్నిన ఒక కుట్రని హర్యానా పోలీసులు విఫలం చేశారు. (ఆం. భూ 20 4 89)

**మూకుమ్మడి హత్యాకాండ** వి. *muukummaDi hatyaakaanDa* చూ. మూకుమ్మడి హత్యలు. ఇటీవల మూకుమ్మడి హత్యాకాండ జరిగి 40 మందికి పైగా దారుణ మారణ కాండకు గురైన బీహార్ రాష్ట్రం ఔరంగాబాద్ జిల్లాలోని పరిస్థితిని అధ్యయనం చేయడానికి ... వెళ్తున్నది (ఈ. 5.6 87)

**మూజువాణి ఓటు** వి. *muujuvaaNi ooTu* చూ. నోటిమాట ఓటు. voice vote రాజ్యసభలో వారి తీర్మానం మూజువాణి ఓటుతో నెగ్గిపోగా లోకసభలో ఓటింగ్‌లో ఓడిపోయింది. (ఈ 25 4 89)

**మూట్ కోర్ట్** వి. *muuTkoorT* న్యాయ శాస్త్రం అభ్యసించే విద్యార్థులు అనుభవం కోసం నిర్వహించే కల్పిత న్యాయస్థానం moot-court ఇటీవల లా కళాశాల విద్యార్థులు వరకట్న హత్యకు సంబంధించిన ఒక కేసుపై మూట్ కోర్టును నిర్వహించారు. (ఆం భూ. 7 10 87)

**మూర్తీభవించు** క్రి. *muurtiibhavincu* ఒక భావానికి ఆకృతిగా మారు; రూపుదిద్దుకొను to embody రథాన్ని చూస్తే 'హిందూత్వం' మూర్తీభవించినట్టు కనపడిన ప్పటికీ రథయాత్ర పొడవునా జరిగిన అనేక బహిరంగ సభల్లో ఆర్థిక, రాజకీయ అంశాల పైనే ఉపన్యాసాలు ఇవ్వడం జరిగింది. (ఆం భూ 21.4.89)

**మూలకునెట్టు** క్రి. *muulakuneTTu* నిర్లక్ష్యం చేయు; పక్కకు పెట్టు to set aside అభివృద్ధి కార్యక్రమాల్ని మూలకు నెట్టేసి ప్రయాణీకుల సౌకర్యాల ఊసు పట్టించుకోకుండా ఏటా అన్ని రకాల చార్జీలు పెంచుకుంటూపోయి మిగులు చూపగలుగుతున్నానని మీసాలు మెలేయటం సాధ్యమైంది. (ఈ 26.2 88)

**మూలుగు** క్రి. *muulugu* ఏదైనా విషయం పట్టింపుకు నోచుకోకపోవు to languish ఎన్నో వరకట్న మరణాల కేసులు అధికారుల నిర్లక్ష్యానికి నిదర్శనంగా ఆఫీసు ఫైళ్ళలో మూలుగుతున్నాయని తెలియజేసింది. (ఈ 10 5 89)

**మూలధన పెట్టుబడి** వి. *muuladhana peTTubaDi* వ్యాపారం, పరిశ్రమ ప్రారంభించడానికి కేటాయించిన ధనం capital investment ఈ ఏడాది ఎనిమిది కోట్ల రూపాయలను మూలధన పెట్టుబడిగా ఇచ్చిందని ఆయన తెలిపారు. (ఆం ప్ర 23 4 89)

**మూలవేతనం** వి. *muulaveetanam* ఏ రకమైన అలవెన్సులు కలపనప్పటి అసలు జీతం basic pay మూలవేతనంపై 6 నుంచి 15 శాతం హెచ్. ఆర్. ఏ. ఇవ్వాలని ... (ఆం ప్ర. 1.9 89)

**మెగావాట్** వి. *megaavaaT* పది లక్షల వాట్‌ల విద్యుత్ పరిమాణం megawatt జాతీయ థర్మల్ విద్యుచ్ఛక్తి సంస్థ రామగుండంలో నెలకొల్పుతున్న 500 మెగావాట్ల యూనిట్ ... (ఆం ప్ర. 19 4 88)

**మెచ్చుకొను** క్రి. *meccukonu* ఇతరుల పని లేదా గుణాల్ని గురించి సాభిప్రాయం వ్యక్తం చేయు to appreciate

ముగ్గురు ముఖ్య ఆటగాళ్ళు లేకుండానే ఈ జట్టు ఇంత బాగా ఆడుతున్నదంటే వారిని మెచ్చుకొని తీరాలి. (ఆం జ్యో 19 10 87)

**మెజారిటీ** వి. *mejaariTii* ఎదుటి పక్షంకన్నా సంఖ్యాపరమైన ఆధిక్యం కలిగి ఉండటం majority కొత్త లోక్‌సభలో 'జాతీయ ఫ్రంట్'కు స్పష్టమైన మెజారిటీ లభిస్తుందని ఆయన తెలిపారు. (ఆం ప్ర 21 11 89)

**మెటల్ డిటెక్టరు** వి. *meTal DiTek-Taru* (ముఖ్యమైన ప్రదేశాలలో భద్రత కోసం) వ్యక్తుల దగ్గర దాచి ఉన్న ఆయుధాలను పసిగట్టటానికి ఉపయోగించే పరికరం metal detector శాసన సభ లోపల సభ్యుల ప్రవేశ ద్వారం వద్ద 'మెటల్ డిటెక్టర్'లు గల రెండు ద్వారాలను ఏర్పాటు చేశారు. (ఉ 19 12 87)

**మెటల్ రోడ్డు** వి. *meTal rooDDu* చిన్న రాళ్ళను పరిచి ఆపైన కంకర వేసి రోలరుతో తొక్కించి వేసిన రహదారి metal road 50 వేలతో జగన్నాథ స్వామి ఆలయం నుంచి చిలువేరి చాందయ్య ఇంటివరకు ఉన్న రోడ్డును మెటల్ రోడ్డుగా మార్చడానికి ... (ఆం ప్ర 31 8 89)

**మెటలింగ్‌చేయు** క్రి. *meTalingceeyu* రోడ్డు మీద కంకర రాళ్ళు పరిచి చదును చేయు to metal (a road) ... ఇంటి నుంచి . . వరకుగల రోడ్డును మెటలింగ్‌చేయడానికి తీర్మానించామని చెప్పారు. (ఆం ప్ర. 31 8 89)

**మెడబట్టి గెంటు** క్రి. *meDabaTTi genTu* బలవంతంగా బయటకు నెట్టివేయు to neck out ... అయితే తనను మంత్రివర్గం నుంచి మెడబట్టి గెంటిన విధానాన్ని మాత్రమే ఇక్కడ చెబుతున్నానని అన్నారు. (ఆం. భూ. 17 12.87)

**మెమొరాండం** వి. *memoraanDam* ఏవైనా సమస్యలను ఉన్నత స్థానంలో ఉన్న వ్యక్తుల దృష్టికి తెస్తూ సమర్పించే పత్రం; విజ్ఞాపన పత్రం memorandum మాజీ శాసనసభ్యులు శ్రీ కె. రాఘవులుపై విషయాలనన్నింటిని ప్రభుత్వ దృష్టికి తెస్తూ ముఖ్యమంత్రికి మెమొరాండాన్ని పంపారు. (విశా 26 6 87)

**మెయిడిన్ ఓవర్** వి. *maiDin oovar* క్రికెట్‌లో ఒక్క రన్‌కూడా ఇవ్వకుండా వేసిన ఓవర్ maiden over 'మెయిడిన్ ఓవర్'కు ఐదువందల రూపాయలు. (ఆం. ప్ర 8 10 87)

**మెరక ప్రాంతం** వి. *meraka praantam* ఎత్తుగా ఉన్న ప్రదేశం upland అనేక ప్రాంతాలు ఇంకా వరదమయంలో ఉన్నాయని గ్రామం చుట్టూ నీరు ఉండడంతో మెరక ప్రాంతంలో తలదాచుకోవటం కన్పించిందని చెప్పారు. (ఈ. 26.7 89)

**మెరుగు** వి. *merugu* మరింత నాణ్యత కలిగినది better బహుమతులను గెల్చుకొని శాఖలు సంతృప్తి పడకుండా విలువైన ఖాతాదారులకు మెరుగైన సేవలను అందజేయడానికి . . (ఆం జ్యో 19 11 88)

**మెరుగుపడు** క్రి. *merugupaDu* ఉన్నదానికన్నా బాగాఅగు to improve చైనాతో మన సంబంధాలిప్పుడు మెరుగుపడ్డాయని రాజీవ్ అన్నారు. (ఆం ప్ర 19.7 89)

**మెరుగుపరచు** క్రి. *meruguparacu* మరింత సమర్థవంతమైనది, మేలైనదిగా అభివృద్ధి చేయు to improve దేశంలోని అన్ని ప్రాంతాల ప్రజలకు రవాణా సౌకర్యాలను మెరుగుపర్చేందుకు కేంద్ర ప్రభుత్వం కృషిచేస్తోందని ... తెలిపారు. (ఈ. 2.5 89)

**మెరుపు** విశే. *merupu* ఇతరులు ఊహిం

చని; ఆకస్మికమైన lightning కాశ్మీర్‌లో నేడు మెరుపుబంద్ జరిగిన సందర్భంగా శ్రీనగర్‌లోనూ, రాష్ట్రంలోని మరి కొన్ని ప్రాంతాలలోనూ హింసాకాండ జరిగింది. (ఆం. ప్ర. 14.2.89)

**మేధావుల వలస** వి. *meedhaavula valasa* వివిధ రంగాలలో నిష్ణాతులైన వ్యక్తులు మరోదేశానికి వెళ్ళి స్థిరపడటం brain drain మేధావుల వలస జరుగుతున్న ఈ రంగం నుండి ఎంత సాఫ్ట్‌వేర్‌ను ఎగుమతి చేశారని కుమార మంగళం తెలుసుకోకోరగా తన వద్ద సరైన సమాచారం లేదని మంత్రి అన్నారు. (ఆం. ప్ర. 25.7.89)

**మేనిఫెస్టో** వి. *meenifesToo* ఎన్నికల ముందు ఒక్కో రాజకీయ పార్టీ తమతమ రాజకీయ, ఆర్థిక లక్ష్యాలను వివరిస్తూ ప్రచురించే విధానపత్రం manifesto కాంగ్రెస్(ఐ) ఎన్నికల ప్రణాళిక (మేనిఫెస్టో) సోమవారంనాటికిగాని విడుదలకాదని ఎఐసిసి-ఐ ప్రతినిధి ఆనంద్‌శర్మ విలేకరులతో చెప్పారు. (ఆం. భూ. 4.11.89)

**మేళా** వి. *meeLaa* ఏదైనా విషయంపై ఆర్భాటంగా నిర్వహించే కార్యక్రమం; ఉత్సవం melaa (a festival like programme involving public on a large scale) స్థానిక ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో గత పదిహేను రోజులుగా నిర్వహిస్తున్న శ్రీ మేళా కార్యక్రమాలు ఒక ఎత్తు కాగా, శనివారంనాడు కిరణ్‌బేడి పాల్గొన్న కార్యక్రమం ఒక ఎత్తు. (ఆం. జ్యో. 13.11.88)

**మైక్రోఫిల్మ్** వి. *maikroofilm* డాక్యుమెంట్లు మొ. సమాచారాన్ని చాలా తక్కువ నిడివిలో ఫోటో తీసి నిల్వ ఉంచే రీలు micro-film రాష్ట్ర ఆర్కైవ్స్ సహకారంతో కృష్ణాపత్రికల ప్రతులను 18 రీళ్ళలో మైక్రోఫిల్మ్ తీసి పరిశోధకాలు, సాహిత్యవేత్తల ఉపయోగార్థం గ్రంథాలయంలో భద్రపరిచినట్లు తెలుగు విశ్వవిద్యాలయం ... తెలిపింది. (ఆం. జ్యో. 8.11.88)

**మైత్రీభావం** వి. *maitriibhaavam* స్నేహంతో కలిసి సహకరించుకోవాలనే తత్త్వం friendly attitude, amity అన్ని దేశాలతో మైత్రీభావంతో మనం మెలగాలి. (ఈ. 20.4.89)

**మైత్రీసదస్సు** వి. *maitriisadassu* పోలీసు విభాగానికీ, ప్రజలకూ మధ్య సంబంధాలను మెరుగుపరచడానికి ఇరువర్గాలను కలిపేందుకు ఉద్దేశించిన సమావేశం goodwill-meeting పోలీసులపై ప్రజలుచేసే ఫిర్యాదులను అక్కడికక్కడే సేకరించి ... మొత్తం ఆరు జిల్లాలలో మైత్రీసదస్సులను ప్రయోగాత్మకంగా త్వరలో నిర్వహించనున్నట్లు ... (ఆం. జ్యో. 11.10.87)

**మైనర్** వి. *mainar* చట్టబద్ధమైన హక్కులు సంక్రమించటానికి అవసరమైన దానికన్నా తక్కువ వయస్సు (18 సం.ల కన్నా తక్కువ) కలిగిన వ్యక్తి minor ... అనే యువకుడు పన్నెండు ఏళ్ళ మైనర్ బాలికను మానభంగం చేశాడు. (ఆం. భూ. 29.11.87)

**మైనారిటీ** వి. *mainaariTii* సంఖ్యలో ఇతరులకన్నా చాలా తక్కువగా ఉన్న వర్గం minority మైనారిటీల సంక్షేమానికి ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్ గాంధీ ప్రకటించిన 15 సూత్రాల కార్యక్రమాన్ని ... (ఆం. ప్ర. 3.7.89)

**మొండిచేయి** వి. *monDiceeyi* ఇతరులు ఏదైనా ఆశించినప్పుడు చేయగలిగి ఉండి చేయకపోవటం empty hand భారత్‌లో అమెరికా అనుకూల వర్గాలు ప్రచారంలో పెట్టిన ఆశలన్నిటికీ మొండిచేయి చూపెట్టిన రీగన్ ఆ పని కొంత తెలివిగా చేశారు. (విశా. 25.10.87)

**మొండిపట్టు** వి. *monDipaTTu* తను అనుకున్నదే జరగాలని చూపే పట్టుదల stubbornness దౌత్యనీతిలో మొండి పట్టు ఆత్మహత్యాసదృశం (ఆం భూ. 5.7 89)

**మొండివైఖరి** వి. *monDivaikhari* తమపట్టు నెగ్గాలనే విపరీత ధోరణి stubborn attitude ప్రభుత్వం మొండివైఖరివల్ల కృష్ణా జిల్లాలోని న్యాయ వాదులు కూడా కోర్టు బహిష్కరించడానికి నిర్ణయం తీసుకున్నారని ... చెప్పారు. (ఆం. భూ 17 10 87)

**మొక్కుబడి** వి. *mokkubaDi* నిబద్ధత లేకుండా ఏదో చెయ్యాలని చేసేపని ritual ... అయితే కొందరి అభ్యం తరంపైన చివరికి "పంచాయితీల అభివృద్ధి ప్రభుత్వ బాధ్యత" అని మొక్కుబడిగా ఆదేశిక సూత్రాలలో చేర్చారు. (ఆం. భూ 11.5 89)

**మొఖం చాటుచేయు** క్రి. *mokham caaTuceeyu* పరిస్థితిని ఎదుర్కొనడానికి ధైర్యం లేక తప్పించుకొను to hide one's own face, escape బోఫోర్స్ వ్యవహారం చర్చలు వచ్చినపుడల్లా ప్రధాని మొఖం చాటుచేస్తున్నారని సభను ధైర్యంగా ఎదుర్కోడం లేదని అయన ఆరోపించారు. (ఆం జ్యో. 16 11.88)

**మొగ్గుచూపు** క్రి. *moggucuupu* అందుబా టులో ఉన్నవాటిలో ఏదైనా ఒకదానివైపు ఎక్కువ ఆసక్తి చూపు to show one's preference, tend towards నిరు ద్యోగం, దారిద్ర్యంతో మగ్గుతున్న యువతరం పోలీసుల వేధింపులకు వెరచి తీవ్రవాదంవైపు మొగ్గుచూపుతున్నారు. (ఆం. భూ. 15 6 89)

**మొబైల్ పెట్రోలింగ్** వి. *mobail peTrooling* నేరాలను అరికట్టేందుకు పోలీసులు వాహనాలలో వీధుల్లో గస్తీ తిర గటం mobile patrolling ఒకవైపు దొంగతనాల సీజన్ నడుస్తుంటే మరోవైపు పోలీసులు మొబైల్ పెట్రోలింగ్ పూర్తిగా తగ్గించారు (ఆ ప్ర 11 5 89)

**మొరపెట్టుకొను** క్రి. *morapeTTukonu* ఏదైనా అన్యాయం జరిగినప్పుడు లేదా ఇబ్బందులు కలిగినప్పుడు పరిష్కారం కోరుతూ బాధ్యతాయుత స్థానంలో ఉన్నవారికి తెలుపు to report ఈ హెలికాప్టర్లలో ఉన్న యాంత్రిక లోపాలవల్ల సమర్థవంతంగా పనిచేయడంలేదని ఓ. ఎన్. జి. సి. అధికారులు కేంద్రానికి పదేపదే మొర పెట్టుకున్నారు కూడా. (ఆం ప్ర 26 4 89)

**మొలాసిస్** వి. *molaasis* చక్కెర తయా రుచేసే ప్రక్రియలో వచ్చేజిగురు పదార్థం (మత్తు పదార్థాల తయారీలో దీన్ని ఉప యోగిస్తారు) molasses ప్రభుత్వ నిబంధ నలకు వ్యతిరేకంగా మొలాసిస్‌కు నాటుసారా తయారీదారులకు అక్రమంగా విక్రయిస్తున్న ... (ఆం భూ. 11 5.89)

**మోక్షం** వి. *mookSam* ఒక పని కొనసాగ టానికి ఏర్పడిన అడ్డంకులు తొలగిపోవటం clearance (of obstacles) మోమి న్‌పేట శీతల కేంద్రానికి మోక్షమెప్పుడు? (ఆం. భూ 7 10 87)

**మోతాదు** వి. *mootaadu* ఒక వస్తువు లేదా భావం యొక్క పరిమాణం measure ఒక సిరీస్ ఫలితం విషయంలో ఆత్మస్థయి ర్యమో లేక నైతిక బలమో మరీ ఎక్కువ మోతాదులో ప్రభావం చూపిస్తాయనుకో వడం సరికాదు.

**మోనాస్టరీ** వి. *moonaasTari* క్రైస్తవ మతప్రచారకులు జీవించడానికి నిర్మించిన భవనం monastery మోనాస్టరీపై రిట్

స్వీకారం. ఏలూరులోని రోమన్ కాథలిక్ మిషనరీ బిషప్ జాన్ ఆధీనంలో ఉన్న తొమ్మిది మంది సిస్టర్లను ఏలూరు మోనాస్టరీలో నిర్బంధించకుండా నివారించి వారిని రక్షణలోకి తీసుకోవాల్సిందిగా రాష్ట్రప్రభుత్వానికి ... (ఈ. 24.11.87)

**మోనిటరింగ్ కమిటీ** వి. *mooniTar-ing kamiTii* ఒక కార్యక్రమం సక్రమంగా జరుగుతుందోలేదో పరీక్షించడానికి ఏర్పాటు చేసిన బృందం monitoring committee సభ్యత్వ నమోదు కార్యక్రమం పర్యవేక్షణకు జిల్లాస్థాయిలో మోనిటరింగ్ కమిటీలు ఏర్పాటు చేయాలని నిర్ణయించామన్నారు. బోగస్ సభ్యత్వాలను ఈ కమిటీ నిరోధిస్తుందన్నారు. (ఈ. 5.7.89)

**మోర్చా** వి. *moorcaa* ఏదైనా రాజకీయ లక్ష్య సాధనకు ఉద్యమించేందుకు ఏర్పడిన కార్యాచరణ వేదిక forum of action ... ఆగష్టు 23వ తేదీన జరిగిన ప్రతిపక్షనాయకుల సమావేశంలో విశాల ప్రాతిపదికపై ఒక మోర్చాను ఏర్పాటు చేయాలని ... తెలియజేశారు. (ఆం. జ్యో. 9.9.87)

**మోహరించు** క్రి. *mooharincu* సాయుధ బలగాలను సంఘర్షణ నిమిత్తమై ఒక ప్రదేశంలో నిలిపి ఉంచు to deploy మధ్యప్రదేశ్ ప్రభుత్వం బస్తర్‌లో ఒక ప్రత్యేక సాయుధ దళం బెటాలియన్‌ను మోహరించినప్పటికీ, కేంద్రం అసంతృప్తిగా ఉంది. (ఈ. 14.8.89)

**మౌఖిక పరీక్ష** వి. *maukhika pariikSa* ఒక పదవికి లేదా డిగ్రీకి అర్హతను నిర్ణయించేందుకు నేరుగా కొన్ని ప్రశ్నలు అడగటం ద్వారా జరిపే పరీక్ష interview, viva voce ఉపాధ్యాయ శిక్షణ పొందిన అభ్యర్థులనే మౌఖిక పరీక్షలకోసం ఎంపిక చేయాలన్న ఆంక్షలు విధించారు. (ఈ. 10.5.89)

**మౌనం పాటించు** క్రి. *maunam paaT-incu* మరణించిన వారికి గౌరవ సూచకంగా కొద్దిసేపు నిశ్శబ్దంగా నిలబడు to observe silence జవహర్‌లాల్ నెహ్రూ సమాధివద్ద రాష్ట్రపతి కొన్ని నిమిషాలు మౌనం పాటించారు. (ఆం. ప్ర. 15.11.89)

**మౌన ప్రదర్శన** వి. *mauna pradarśana* నినాదాలు లేకుండా చేసే ప్రదర్శన silent demonstration ఈ మధ్య దేవరాలలో జరిగిన 'సతి' దురాచారానికి నిరసనగా విద్యార్థినులతో సహా 3,000 మంది మహిళలు ఈ దురాచార నిర్మూలనోద్యమానికి మద్దతుగా, తమ సంఘీభావాన్ని ప్రకటిస్తూ మౌన ప్రదర్శన జరిపారు. (ఆం. జ్యో. 7.10.87)

**మౌలిక మార్పు** విణ. *maulika maa-rpu* పైపై విషయాలలో కాకుండా వస్తువు అసలు స్వభావంలో వచ్చే మార్పు fundamental change జయవర్ధనే నిష్క్రమణానంతరం శ్రీలంక రాజకీయాల్లో వచ్చిన మౌలిక మార్పును గమనించి ... (ఈ. 5.6.89)

**మౌలిక సూత్రం** వి. *maulika suu-tram* జాతి నిర్దేశించుకొన్న లౌకికవాదం, సమానత్వం, ప్రజాస్వామ్యం, సామాజిక న్యాయం మొ. ఉన్నత లక్ష్యాలకు సంబంధించిన ఆశయం. fundamental principle రాజ్యాంగంలో ఈ క్రింది మౌలిక సూత్రాలను పొందుపరచాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది. (ఈ. 11.5.89)

**మ్యాచ్** వి. *myaac* వ్యక్తులుగానీ, బృందాలుగానీ గెలుపుకోసం పోటీపడే ఆట match ఈ రెండు మ్యాచ్‌లలో కూడా వెంగ్‌సర్కార్‌కు బదులు అరుణ్‌లాల్ ఆడతాడు. (ఆం. ప్ర. 1.1.88)

**మ్యాన్ ఆఫ్ ది మ్యాచ్** వి. *myaan aaf di myaac* చూ. మాన్ ఆఫ్‌ది మ్యాచ్. ఈ టెస్ట్‌లో మార్షల్‌ను మ్యాన్ ఆఫ్‌ది మ్యాచ్‌గా నిర్ణయించారు. (ఆం. ప్ర. 22.4 89)

**మ్యాన్‌హోల్** వి. *myaanhool* డ్రైనేజీ మరమ్మతులకోసం రోడ్డుమీద అక్కడక్కడ మనిషిపట్టడానికి సరిపోయేంతగా ఏర్పాటుచేసిన రంధ్రం manhole గురువారం మ్యాన్‌హోల్‌లో దిగబడిన ఒక టెంపోను పైకి తీయడానికి ఇరవై మంది కూలీల సహాయం తీసుకోవలసి వచ్చింది. (ఆం జ్యో 14.11.88)

**మ్యూజియం** వి. *myuujiyam* ఆసక్తిదాయకమైన పురాతన వస్తువులను భద్రపరచిన ప్రదేశం; పురాతన వస్తుప్రదర్శనశాల museum దేశంలో మ్యూజియంల సమగ్రాభివృద్ధికి జాతీయ పథకం చేపట్టాల్సిన అవసరముందని ఆయన పేర్కొన్నారు. (ఈ 15 9 87)

**మ్యూటినీ** వి. *myuuTinii* ప్రభుత్వానికి వ్యతిరేకంగా (సైన్యంలో) ఒక వర్గం చేసే సాయుధ తిరుగుబాటు mutiny ఆ తరువాత పత్రికా ప్రతినిధులు ముఖ్యమంత్రి ఇంగ్లీషులో 'మ్యూటినీ' అన్న పదాన్ని ఏ అర్థంలో ప్రయోగించారో వివరణ ఇవ్వాలని కోరగా ... (ఆం. ప్ర 31 8 89)

## య

**యంత్రాంగం** వి. *yantraangam* అధికారులతో కూడిన అంచెలంచెల వ్యవస్థ official machinary ప్రణాళికేతర ఖర్చును తగ్గించి పరిపాలనా యంత్రాంగాన్ని మెరుగు పరచడానికి . . (ఆం ప్ర 20 4 88)

**యక్షప్రశ్నలు** వి. (బ.వ.) *yakSapraśnalu* మారుమూల వివరాలను కూడా అడిగే వేధింపు ప్రశ్నలు inquisitive questions సుందర్జీని చూడవచ్చేవారిని, ఆ భవన పరిసరాల్లో తచ్చాడేవారిని తమిళనాడు ఇంటలిజెన్స్ అధికారి ఒకరు యక్షప్రశ్నలతో పరీక్షిస్తూంటాడు. (ఈ 8 9 89)

**యాంత్రీకరణ** వి. *yaantriikaraNa* (మనుషులకు బదులు పనిచేసేందుకు) మరలను ప్రవేశపెట్టే ప్రక్రియ machanization ... రూపాయలు వెచ్చించి ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్ పాక్షికంగా యాంత్రీకరణ జరుపనున్నట్లు మైనింగ్ కార్పొరేషన్ అధ్యక్షులు ... చెప్పారు. (విశా 20 6 87)

**యాగీచేయు** క్రి. *yaagiiceeyu* అనవసరమైన దుమారంలేపు; గొడవచేయు to raise a bogey ... అయినప్పటికీ నేపాల్‌పై ఇండియా ఆర్థిక దిగ్బంధనం అమలుచేసి ఇబ్బంది పాలు చేస్తున్నదంటూ యాగీ చేస్తోంది. (ఆం. భూ 29 8 89)

**యాజమాన్యం** వి. *yaajamaanyam* పరిశ్రమల స్వంతదార్లు management (of industries, factories etc.) అయిదు కోట్ల రూపాయలు, అంతకుమించి పెట్టుబడిఉన్న పరిశ్రమల యాజమాన్యాలు ... (ఈ 2 5 89)

**యుద్ధ ప్రాతిపదిక** వి. *yuddha praatipadika* ఒక పనిని ఎలాంటి జాప్యం లేకుండా త్వరితగతిని పూర్తిచేయటం war-footing పూర్తిగా చెడిపోయిన స్థితిలో ఉన్న 42 రోడ్ల మరమ్మతు పనులను యుద్ధ ప్రాతిపదికపై చేపట్టి పూర్తి చేయనున్నట్లు ... తెలిపారు. (ఈ. అను 19 5 89)

**యూనిట్** వి. *yuuniT* (ఫ్యాక్టరీలు, పరిశ్రమలకు సంబంధించి) అన్ని హంగులతో

ఉన్న ఒక కేంద్రం unit మద్రాసుకు సుమారు 45కి.మీ. దూరంలోని గుమ్మడి పూడిలో ఈ కంపెనీ కొత్త యూనిట్‌ను ఏర్పాటు చేస్తోంది. (ఈ 18 6 87)

**యూనిటా** వి. *yuuniTaa* అంగోలా దేశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం సాగించే సంస్థ UNITA (Union for the Total Independence of Angola) ఇంతవరకూ అంగోలాలో ప్రభుత్వ వ్యతిరేక 'యూనిటా' గెరిల్లాలకు ఆయుధ సహాయం పెద్దఎత్తున అందిస్తూ అక్కడ అంతర్యుద్ధం అణగారిపోకుండా జాగ్రత్తపడుతూ వచ్చిన ప్రిటోరియా శ్వేత జాత్యహంకార ప్రభుత్వం ఇప్పుడు ప్రత్యక్షంగా అంగోలా మీద దాడిజరపడం మొదలు పెట్టింది. (ఆం. భూ. 24.12.87)

**యూనిఫారం** వి. *yuunifaaram* సంస్థలో సభ్యత్వానికి గుర్తుగా దాని సభ్యులందరూ ధరించే ఒక రకమైన దుస్తులు uniform యూనిఫారం కొనడంలో 600 లక్షలు స్వాహా : జి. కె. ఆరోపణ. (ఆం ప్ర. 11 8.87)

**యోగ్యతాపత్రం** వి. *yoogyataapatram* అర్హతలను, పనితనాన్ని ధ్రువపరుస్తూ అధికారి ఇచ్చేపత్రం merit certificate వెస్ట్‌లాండ్ హెలికాప్టర్లను సమర్థవంతమైన హెలికాప్టర్లుగా పేర్కొంటూ ఓ. ఎన్. జి. సి. ఛైర్మన్ కల్నల్ ఎస్. పి. వాహె 'యోగ్యతాపత్రం' ఇవ్వడంపట్ల ... (ఆం. ప్ర 26 4.89)

**యోచన** వి. *yoocana* ఒక కార్యక్రమాన్ని చేపట్టాలన్న ప్రాథమిక ఆలోచన idea, contemplation ఈ ఆఫీసులో పని భారం పెరిగినందున అదనపు సిబ్బందిని నియమించే యోచన ఉన్నదా అని హరిసింగ్ అడిగిన ప్రశ్నకు ... చెప్పారు. (ఈ 10.5.89)

## ర

**రంగం** వి. *rangam* (ఎన్నికలు, క్రీడలు మొ.) పోటీక్షేత్రం field ప్రస్తుతం 87 స్థానాలకు 1,272 మంది రంగంలో ఉన్నారు. (ఆం ప్ర. 16.6 87)

**రంగంలోకి దింపు** క్రి. *rangamlooki dimpu* పోటీలో పాల్గొనటానికి ఎంపిక చేయు to field మెదక్ లోక్‌సభ స్థానానికి కాంగ్రెస్(ఐ) ఈ సారి ఎన్నికల్లో రాష్ట్ర అసెంబ్లీలో తమ నాయకుడైన ఎం. బాగారెడ్డిని రంగంలోకి దింపింది. (ఆం భూ. 17.11.89)

**రంగం సిద్ధంచేయు** క్రి. *rangam siddhamceeyu* ఒక పని సాఫీగా జరిగేందుకు వీలుగా అనుకూలమైన ఏర్పాట్లను ముందుగా చేసి ఉంచు to prepare the ground (for sth) అయితే ప్రభుత్వం ఇప్పుడు సుప్రీంకోర్టు తీర్పును కూడా పెడచెవిని పెట్టి డి. ఎస్. పి. ప్రమోషన్‌ను కట్టబెట్టేందుకు రంగం సిద్ధం చేస్తున్నారని ... విమర్శిస్తున్నారు. (ఆం. జ్యో 9 4 88)

**రంగపూజ** వి. *rangapuuja* నృత్యం అభ్యసించినవారు మొదటిసారి సభికుల ముందు ఇచ్చే ప్రదర్శన ; ఆరంగేట్రం debut (dance) బేబీ ప్రవీణ ఇటీవల త్యాగరాయ గానసభలో రంగపూజ (ఆంధ్ర నృత్యం) ప్రదర్శన ఇచ్చింది. (ఈ. 14 8.87)

**రంగప్రవేశంచేయు** క్రి. *rangapravesam ceeyu* 1. (పోలీసులు) నేరాత్మక సంఘటనలు జరుగుతున్న సమయంలో ఆ ప్రదేశానికి చేరుకొను to enter the scene రెండు పార్టీల కార్యకర్తలు ఘర్షణకు దిగగా పోలీసులు రంగ ప్రవేశం చేసి వారిని చెదరగొట్టారు. (ఆం జ్యో. 1.7 87) 2. (రాజకీయాది రంగాలలో) తొలిసారిగా అడు

గుపెట్టు to enter (into public activities like politics for the first time) కాంగ్రెస్(ఐ) పాలనతో విసిగివేసారిన ఆంధ్రప్రదేశ్ ప్రజానీకం ఆనాడు ప్రత్యామ్నాయంకోసం దిక్కులు చూసిన వారి త్రక సమయంలో తెలుగుదేశం పార్టీ రంగ ప్రవేశంచేసింది. (ఈ 28 11 89)

**రంగుమార్చు** క్రి. *rangumaarcu* ఒక గ్రూపు నుంచి మరో గ్రూపుకి లేదా ఒక పార్టీ నుంచి మరోపార్టీకి ఫిరాయించు to defect అప్పుడే ... రంగుమార్చి ప్రధానికి, రక్షణ మంత్రికి మధ్యకు చేరుకున్నారు. (ఆం ప్ర. 26.4 89)

**రంగులు పులుము** క్రి. *rangulu pulumu* విషయానికి లేనిపోనివి జోడించి వక్రీకరించు to colour (an incident, issue etc.) ఏవో రహస్య సంభాషణలు జరిపినట్లు రంగులు పులిమి రాష్ట్ర ప్రభుత్వాలపట్ల అమర్యాదకరంగా ప్రవర్తించడం ఎందుకో అర్థం కావటంలేదు అని ముఖ్యమంత్రి అన్నారు. (ఆం ప్ర 15 89)

**రక్తదానం** వి. *raktadaanam* (బాధితుల, రోగుల సహాయార్థం) మానవతాదృష్టితో తమ రక్తం ఉచితంగా ఇవ్వటం blood donation ఎస్. ఎస్. యు. ఐ. కార్యకర్తలు రక్తదానం చేసినట్టు ఈ సంస్థ అధ్యక్షుడు శ్రీ పి. సుధాకరరెడ్డి ప్రకటించారు. (ఆం జ్యో 24 6 87)

**రక్తసిక్తంఅగు** క్రి. *raktasiktamagu* బాగా నెత్తురు చిందడంతో తడిసి ఎర్రగా మారు to be stained with blood పేలుడువల్ల కుడి అరచేయి చీలిపోయింది. నడుము నుంచి కాళ్ళ కిందివరకు బాంబు పేలుడు ధాటికి రక్తసిక్తమైంది. (ఈ 15 7 89)

**రక్షణ సామగ్రి** వి. *rakSaNa saamagri* శత్రువుల నుంచి దేశాన్ని కాపాడటానికి అవసరమైన ఆయుధ పరికరాలు, వాహనాలు మొ. వి. defence material or equipment రక్షణ సామగ్రి ఉత్పత్తికి అమెరికా, భారతదేశం పరస్పరం సహకరించుకోవడం గురించి ప్రస్తావిస్తూ ... (ఆం భూ 26.11.87)

**రక్షిత నీటిపథకం** వి. *rakSita niiTipathakam* (గ్రామాలలోని) ప్రజలకు పరిశుభ్రమైన, ఆరోగ్యకరమైన మంచినీటిని అందించటానికి ఉద్దేశించిన ప్రభుత్వ కార్యక్రమం protected water scheme కరీంనగర్‌జిల్లా మెట్‌పల్లి నియోజకవర్గంలోని తిమ్మాపూర్, ఆర్‌పేట్, మల్లాపూర్ గ్రామాలలో సుమారు 20లక్షల రూపాయల వ్యయంతో రక్షిత నీటిపథకాలు మంజూరయ్యాయని శాసన సభ్యులు ... తెలిపారు. (ఆం భూ 6.6 87)

**రక్షిత మార్కెట్** వి. *rakSita marKeT* విదేశీ వస్తువుల నుంచి ఎదురయ్యే పోటీవల్ల దెబ్బతినకుండా దిగుమతులపై ఆంక్షలు విధించటంద్వారా ప్రభుత్వం రక్షణ కల్పించిన వ్యాపార ఉత్పాదనా రంగాలు protected market ప్రభుత్వం ఏర్పాటు చేసిన రక్షిత మార్కెట్ ఛాయలో ఆ కంపెనీలు వటవృక్షాలై పోయాయి (ఉ 29 1 88)

**రగడ** వి. *ragaDa* సమ్మతంకాని చర్యపై చెలరేగే గొడవ; వివాదం dispute, controversy ఉద్యోగి సస్పెన్షన్‌పై రగడ. (ఆం భూ 30 9 87)

**రగిలించు** క్రి. *ragilincu* ద్వేషం, అసంతృప్తి మొ. భావాలను కలిగించు to foment జనంల్లో అసంతృప్తి జ్వాలల్ని రగిలిస్తున్న తీవ్రవాద వర్గాల ప్రభావం నుండి వారిని మరల్చడమే కాకుండా ... (ఈ 20 4 89)

రజతోత్సవం వి. *rajatootsavam* ఏదైనా సంస్థకు 25 సంవత్సరాలు నిండిన సందర్భంగా జరుపుకునే పండుగ silver jublee celebrations *కేంద్రీయ హిందీ సంస్థాన్ రజతోత్సవాల సందర్భంగా విజ్ఞాన భవన్‌లో ఈ అవార్డు బహూకరణ కార్యక్రమం ఏర్పాటు చేశారు.* (ఆం ప్ర. 14.2.89)

రజాకార్లు వి. (బ.వ.) *rajaa-kaarlu* తెలంగాణాలో నిజాం పరిపాలనకు వ్యతిరేకంగా తలెత్తిన తిరుగుబాటును క్రూరంగా అణచడానికి నియుక్తులైన నిజాం సైనికులు (1947-50) armed gangs of erstwhile Nizam employed to supress ruthlessly the popular revolt against the government *కరీంనగర్ జిల్లాలో ఎస్. పి. ... నాయకత్వంలో క్రూరమైన నిర్బంధం అమలు జరుగుతోందని, జిల్లా సామాన్య ప్రజానీకంతో పోలీసులు రజాకార్లను మరిపించే విధంగా ప్రవర్తిస్తున్నారని ప్రకటనలో తెలిపారు.* (ఆం భూ 1.9.89)

రట్టుచేయు క్రి. *raTTuceeyu* తప్పుడు పనులను, లోపాలను బహిరంగం చేయు to expose (misdeeds) *అధికార పక్షంలోని ప్రముఖులు లక్షణంగా భోంచేసిన గుట్టు తాను రట్టు చేయడానికి పూనుకొన్నా నన్న కక్షతోనే వ్యతిరేకంగా ఒత్తిడి వచ్చిందని ఆయన ఆరోపించారు.* (ఈ. 12.5.89)

రద్దుచేయు క్రి. *radduceeyu* 1. (పాలనా వ్యవస్థ) మనుగడ కాలాన్ని ముగించు to dissolve *కర్నాటకలో బొమ్మై ప్రభుత్వాన్ని రద్దుచేసి రాష్ట్రపతిపాలన విధించారు.* (ఆం ప్ర 22.4.89) 2 (ఆట, కార్యక్రమం మొ.) జరుగబోదని లేదా కొనసాగదని అధికారికంగా నిర్ణయించు to cancel *వర్షంవల్ల రెండోరోజు ఆట రద్దుచేయవలసి వచ్చింది.* (ఆం. భూ 20.6.89)

రన్‌వే వి. *ranvee* విమానాలు దిగటానికి, ఎగిరి వెళ్ళటానికి అనువుగా విమానాశ్రయం ఆవరణలో ప్రత్యేకంగా వేసినదారి runway *విమానం బీహార్ విమానాశ్రయం 'రన్‌వే' దాటి ముందుకు వెళ్ళి ఊబిలో కూరుకుపోయింది.* (ఆం ప్ర. 7.7.87)

రన్నరప్ వి. *rannarap* క్రీడా పోటీలలో (విజేతల తర్వాత) రెండో స్థానంలో నిలిచిన క్రీడాకారుడు లేదా జట్టు runner-up *స్వీడన్ ఆటగాళ్ళ మధ్యనే జరిగిన ఫైనల్లో గత పోటీల రన్నరప్ జాన్ ఓ. వాల్డనర్ అద్భుతంగా తొలిసారిగా ప్రపంచ ఛాంపియన్‌షిప్ గెలుచుకున్నాడు.* (ఆం. ప్ర 26.4.89)

రబీ పంట వి. *rabii panTa* వర్షాకాలం ముగిసిన తర్వాత పండించే పంట rabi crop *1988-89 ఆర్థిక సంవత్సరంలో ఖరీఫ్ రబీ పంటలు కలిపి 114.70 లక్షల టన్నుల ఆహారధాన్యాల ఉత్పత్తిని, 19.89 లక్షల టన్నుల నూనె గింజల ఉత్పత్తిని రాష్ట్రం సాధించింది.* (ఈ. 6.7.89)

రబీ సీజన్ వి. *rabii siijan* రబీ పంటలు పండే కాలం (అక్టోబరు-మార్చి నెలల మధ్య) rabi season *గత సంవత్సరం రబీ సీజన్‌లో 9.73 లక్షల హెక్టార్లలో మాత్రమే వరి సేద్యం జరిగింది.* (ఆం. భూ. 25.5.89)

**రబ్బర్‌స్టాంపు** వి. *rabbarsTaampu* ఇతరుల నిర్ణయాలకు కేవలం ఆమోదం తెలపటమే తప్ప తన విచక్షణాధికారాన్ని వినియోగించలేని నామమాత్రపు అధికార వ్యవస్థ rubber stamp మంత్రివర్గం తన పార్టీ సభ్యుల సంఖ్యా బలంవల్ల పార్లమెంటుని రబ్బర్‌స్టాంప్ చేస్తున్నదనే విమర్శలున్నాయి. (ఆం. జ్యో. 26.1.88)

**రభస** వి. *rabhasa* ఇష్టంలేని సంఘటన జరిగినప్పుడు కానీ, ఇతరుల్ని ఇబ్బంది పెట్టటానికి గానీ చేసే విపరీతమైన అల్లరి din, bedlam మీరట్ అల్లర్లపై ప్రత్యేక చర్చకు అనుమతించాలన్న తమ డిమాండ్‌ను స్పీకర్ తిరస్కరించడంతో రభస ప్రారంభమైంది. (ఆం. ప్ర 23.6.87)

**రమారమి** వి. *ramaarami* అంచనాగా చెప్పే సంఖ్యకి దగ్గరగా ఉండటం; సుమారు, దాదాపు rough, approximate రమారమి రెండు లక్షల ఎకరాల్లో పంటలు మునిగి పోయాయంటే రైతుల కష్టం యావత్తూ వాళ్ళ కళ్ళ ముందే గంగపాలయ్యింది. (ఈ 26.7.89)

**రవాణా ఖర్చులు** వి. (బ.వ.) *ravaaNaa kharculu* వస్తువులను ఒకచోటినుండి మరో చోటికి చేర్చటానికి (వాహనాలకు చెల్లించే సొమ్ము) transportation charges బొగ్గును కంట్రోలు ధరకు సరఫరా చేయాలని, రవాణా ఖర్చులపై సబ్సిడీ ఇవ్వాలని ఆయన కోరారు. (ఆం ప్ర 26.4.89)

**రసపట్టు** వి. *rasapaTTu* (ఆటల పోటీలు, కథలు వంటి వాటిల్లో) అమితాసక్తితో చూసి లేదా విని ఆనందించదగిన దశ interesting stage ఇండియా-పాకిస్తాన్ జట్ల మధ్య జరుగుతున్న మొదటి క్రికెట్ పోటీ రసపట్టులో పడింది. (ఆం. భూ. 20.11.89)

**రసాయనికాయుధం** వి. *rasaayanikaayudham* విషవాయువులను వెలిజిమ్మటం ద్వారా అపార ప్రాణనష్టం అంగవైకల్యం కలిగించే ఆయుధం chemical weapon పదేళ్ళ కాలంలో రసాయనికాయుధాలన్నింటినీ ధ్వంసం చేయడానికి అమెరికా సిద్ధంగా ఉందని ఆయన చెప్పారు. (ఆం ప్ర 27.9.89)

**రహదారి** వి. *rahadaari* వాహనాలు నడిచేందుకు వేసిన రోడ్డు road ఈ వంతెన పడిపోయిన కారణంగా ఏలూరు వైపు వెళ్ళడానికి రహదారి సౌకర్యం లేకుండా పోయింది. (ఆం ప్ర 25.7.89)

**రహదారి దిగ్బంధన** వి. *rahadaari digbandhana* చూ. రాస్తారోకో. అరెస్టుకు నిరసనగా ముట్టారు పోలీసుస్టేషన్ వద్ద ఈనెల 3న రహదారి దిగ్బంధన దృశ్యం. (విశా 7.7.87)

**రహస్య ఒప్పందం** వి. *rahasya oppandam* వివరాలు బయటికి పొక్కకుండా సంబంధిత పక్షాల మధ్య కుదిరిన ఒడంబడిక secret agreement or pact టెర్రరిస్టుల్లోని ఒక వర్గంతో ప్రభుత్వం రహస్య ఒప్పందం కుదుర్చుకొందని వచ్చిన ఆరోపణలను ఆయన ఖండించారు. (ఆం. ప్ర 4.7.87)

**రహస్యం** వి *rahasyam* ఇతరులకు తెలియకుండా దాచాల్సిన ముఖ్యమైన సమాచారం confidential, secret సాధారణ సమాచారానికి కూడా 'రహస్యం' అన్న ముద్ర వేస్తూ దానిని ప్రజల కంటపడకుండా జాగ్రత్త పడటానికి ... (ఆం ప్ర. 22.4.89)

**రహస్య ఖాతా** వి. *rahasya khaataa* ఖాతాదారుడి వివరాలను బయటి వారికి తెలియకుండా గోప్యంగా ఉంచే సౌకర్యం ఉన్న పద్దు secret account స్విస్

బ్యాంకులో ఇండియా పౌరులకు సంబంధిం చిన రహస్య ఖాతాలను తెలియ జేయవల్సిం దిగా స్విట్జర్లాండ్ ప్రభుత్వాన్ని ... (ఆం ప్ర 8.5 89)

రహస్య పత్రం వి. *rahasya patram* ఇతరులకు వెల్లడించకూడని అంశాలున్న నివేదిక classified document or file భారత రక్షణ శాఖకు సంబంధించిన ఒక రహస్య పత్రాన్ని స్వీకరిస్తూ పట్టుబడిన పాకిస్తాన్ సైనిక దౌత్యాధికారి బ్రిగేడియర్ జెడ్. డి. అబ్బాస్‌ని ఇరవైనాలుగు గంట ల్లోగా దేశం విడిచి వెళ్ళ వలసిందిగా భారత ప్రభుత్వం ఆదేశించింది. (ఆం జ్యో 2.12.88)

రహస్య వ్యూహం వి. *rahasya vyuuham* సంబంధిత వ్యక్తులకు తప్ప ఇతరులకు తెలియకుండా చేసే పన్నాగం secret plan ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలను ఏ విధంగా స్తంభింపజేసి ప్రసారాలను నిలిపి వేస్తారన్న ప్రశ్నకు అది రహస్య వ్యూహం, ముందుగా చెప్పం అని సమాధానం చెప్పారు. (ఆం ప్ర 23 6.89)

రహస్య సమాలోచన వి. *rahasya samaaloocana* ఇతరులకు తెలి యకుండా జరిపే చర్చలు secret parleys కాంగ్రెస్(ఐ) నుంచి బహిష్క రణకు గురైన నాయకుల ప్రతినిధి ఆరిఫ్ మహమ్మద్ ఖాన్ ఆంధ్రా ముఖ్యమంత్రితో రహస్య సమాలోచనలు జరిపారు. (ఈ 22.7 87)

రహస్య సమావేశం వి. *rahasya samaaveeśam* బయటి ప్రపంచానికి తెలి యనివ్వకుండా జరిపే చర్చలు secret meeting రహస్య సమావేశాలు జరపా ల్సిన అవసరం తనకు లేదన్నారు. (ఈ. 27.4.89)

రా వి. *raa* దేశంలోపల వెలుపల జాతీయ భద్రతకు సంబంధించిన సమాచారాన్ని సేకరించి విశ్లేషించే కేంద్ర ప్రభుత్వ గూఢ చారి వ్యవస్థ (రీసెర్చ్ అండ్ ఎనాలి సిస్ వింగ్ అనే ఆంగ్ల పదానికి సంక్షిప్త రూపం) RAW (Research and Analysis Wing) అస్సాంలో బోడో ఆందోళన వెనుక 'రా' హస్తం ఉన్నదని తాను పార్లమెంటులో డాక్యుమెంట్ల సహి తంగా చూపానని శ్రీ ఉపేంద్ర చెప్పారు. (ఆం ప్ర 21 8 89)

రాకెట్ వి. *raakeT* పకడ్బందీగా ఏర్పాటు చేసిన వ్యవస్థాగత నిర్మాణంలో అక్ర మంగా డబ్బు సంపాదించే కార్యకలాపం (జూదం, మాదక ద్రవ్యాల వ్యాపారం మొ.) racket అధికారుల ప్రమేయంతో ఈ అక్రమ వ్యాపారం ఒక రాకెట్లా జరుగు తోందని, అక్రమ వ్యాపారులపై ఏ దాడీ జరుగకుండా చూసేందుకు అంగరక్షకులు కూడా వెంట ఉంటారని తెలిసింది. (ఈ. 30.1 88)

రాక్షసపాలన వి. *raakSasapaalana* ప్రజల్ని (ముఖ్యంగా సామాన్యుల్ని) తీవ్ర కష్టనష్టాలకు గురిచేసే క్రూర మైన పరిపాలనా విధానం cruel administration ... ప్టాట్రీ రాష్ట్రంలో అధికారంలోకి వచ్చింది మొదలు ఒక పథకం ప్రకారం అగ్రకులాలవారు హరిజ నులపై దాడులు జరిపి నిర్దాక్షిణ్యంగా వారిని చంపి వేస్తున్నారని, ఇటువంటి రాక్షసపాలన ఇంతకు ముందెన్నడూ లేదని ... అన్నారు. (ఆం. ప్ర 18 7.87)

రాక్షసి తుఫాను వి. *raakSasi tufaanu* విపరీతంగా ప్రాణనష్టం, ఆస్తి విధ్వంసం కలిగించే తుఫాను (హోరు గాలి) killer cyclone గతవారం థాయ్

లాండ్ తీరాన్ని ముంచివేసి అండమాన్ మీదుగా ఆంధ్ర కోస్తా ముంచుకొస్తున్న 'రాక్షసి తుఫాను' ఒంగోలుకు వందకిలోమీటర్ల దూరంలో ఆగ్నేయ తూర్పు దిశలో కేంద్రీకృతమై ఉంది. (ఆం భూ 9.11 89)

**రాజకీయ అవగాహన** వి. *raajakiiya avagaahana* రాజకీయ పరిస్థితులను గురించిన స్థూలమైన అభిప్రాయం political understanding మూవ్‌మెంట్ ఫర్ నేషనల్ రీసెర్జెన్స్ (ఎం. ఎన్. ఆర్.) పేర సాగుతున్న ఈ జాతీయ ఉద్యమం దేశంలోని అన్ని ప్రాంతాలకు వెళ్ళి ప్రజలలో రాజకీయ అవగాహన పెంపొందిస్తుందని వారు తెలిపారు. (ఆం. ప్ర 22 8.89)

**రాజకీయ అసమ్మతి** వి. *raajakiiya asammati* రాజకీయ పరంగా పాలక పక్షం అభిప్రాయాలతో, విధానాలతో విభేదించటం political dissent పౌర హక్కుల ఉద్యమాన్ని, రాజకీయ అసమ్మతిని అణచి వేయడానికి ప్రభుత్వం చట్ట బాహ్యమైన పద్ధతులను ఉపయోగించాలని ప్రజాస్వామ్య శక్తులు వ్యతిరేకించాలని విజ్ఞప్తి చేశారు. (ఆం ప్ర. 1.9.89)

**రాజకీయ ఆశీర్వాదం** వి. *raajakiiya aaśiirvaadam* రాజకీయాలలో ప్రముఖంగా పాల్గొనటానికి సంబంధించి నాయకుడి నుంచి లభించే ఆమోదం political blessing ప్రధానమంత్రి 'రాజకీయ ఆశీర్వాదం' పొందటానికి ప్రదేశ్ కాంగ్రెస్(ఐ) అధ్యక్షుడు, ప్రభృతులు నేడు, రేపు ఢిల్లీ బయలు దేరి వెళుతున్నారు. (ఆం. ప్ర 9 5 89)

**రాజకీయ ఆశ్రయం** వి. *raajakiiya aaśrayam* స్వదేశంలో తమ ప్రభుత్వ విధానాలను వ్యతిరేకించి పారిపోయి వచ్చిన వ్యక్తికి కల్పించే రక్షణ political asylum మాడ్రిడ్ (స్పెయిన్)లో ఒక ఫుట్‌బాల్ ఆటగాళ్ళు టోర్నమెంట్ పూర్తికాకుండా నిర్వాహకుల కళ్ళుగప్పి ఫ్రాంక్‌ఫర్ట్ (పశ్చిమ జర్మనీ)కి పారిపోయారు. అయితే వారికి 'వీసా' లివ్వడంలో సమస్యలు ఎదురవ్వడంతో వారిద్దరినీ తిరిగి స్పెయిన్ పంపేశారు. దీనితో స్పెయిన్‌కు రాజకీయ ఆశ్రయం ఇవ్వక తప్పలేదు. (ఆం. ప్ర. 17.8.89)

**రాజకీయంచేయు** క్రి. *raajakiiyamceeyu* (రాజకీయంగా లబ్ధి పొందటానికి) అనవసరంగా ఒక విషయాన్ని వివాదంగా మార్చు to politicize రామజన్మ భూమి-బాబ్రీ మసీదు వివాదాన్ని రాజకీయంచేసి హిందువుల, ముస్లింల వోట్లను సంపాదించాలని ... ప్రయత్నించిందని విమర్శించారు. (ఆం ప్ర 18 11 89)

**రాజకీయ కక్ష** వి. *raajakiiya kakSa* రాజకీయ సంబంధమైన విభేదాల కారణంగా వ్యతిరేక వర్గం లేదా పార్టీవారికి అదే పనిగా ఇబ్బందులు కలిగించే ధోరణి political vendetta హైదరాబాద్ నగర పాలక సంస్థకు నిధుల విడుదలలో తాము ఎలాంటి రాజకీయ కక్ష వైఖరిని అవలంబించచటంలేదని ఆయన తెలిపారు. (ఆం ప. 17.10.87)

**రాజకీయ కుట్ర** వి. *raajakiiya kuTra* రాజకీయ ప్రయోజనం ఆశించి జరిపే కుతంత్రం political conspiracy శ్రీ భండారి ... కర్నాటకలో విజయవంతంగా 'రాజకీయ కుట్ర' జరిపిన కాంగ్రెస్ పార్టీ ఇప్పుడు జమ్మూ-కాశ్మీర్‌లో కూడా అదే రకమైన కుట్రచేసేందుకు ప్రయత్నిస్తోందని ఆరోపించారు. (ఆం ప్ర 1.5 89)

**రాజకీయ ఖైదీ** వి. *raajakiiya khaidii* ప్రభుత్వ విధానాలను వ్యతిరేకించిన ఫలి

తంగా అరెస్టయిన వ్యక్తి political prisoner రాజకీయ ఖైదీ అయితేచాలు, ఏదైనా కేసులో బెయిల్ పొంది జైలు బయట కాలు పెడితే చాలు మళ్ళీ అక్కడే అరెస్ట వుతున్నారు. (ఆం ప్ర. 18 9 89)

**రాజకీయ తీర్మానం** వి. *raajakiiya tiirmaanam* సమకాలీన రాజకీయ పరి స్థితిపై తమ అవగాహన, అభిప్రాయాలు వ్యక్తంచేస్తూ చేసే తీర్మానం political resolution దేశవ్యాప్తంగా ప్రతిపక్షాలకు చెందిన లోక్‌సభ సభ్యులు తమపదవులకు రాజీనామా చేసిన తరువాత ఏర్పడే రాజ కీయ పరిణామాలను చర్చించినట్లు చెప్పారు. ఈ మేరకు ఒక రాజకీయ తీర్మానం ఆమో దించినట్లు తెలిపారు. (ఆం. ప్ర 27 7.89)

**రాజకీయ త్రిశంకు స్వర్గం** వి. *raajakiiya triśanku svargam* రాజకీ యంగా ప్రాముఖ్యం కోల్పోయి దిక్కుతో చని స్థితి political obscurity or uncertainty ప్రతిపక్ష పార్టీల సభ్యులు పార్లమెంటు సభ్యత్వాలకు రాజీనామా చేయిం చిన శ్రీ రామారావు, వారిని ఇక రాజకీయ త్రిశంకు స్వర్గంలోకి పంపారన్న సత్యాన్ని వారు త్వరలో గమనించక తప్పదని ... విమర్శించారు. (ఆం ప్ర. 25.7.89)

**రాజకీయ దివాళాకోరుతనం** వి. *raajakiiya divaaLaakoorutanam* రాజ కీయాలకు సంబంధించి సరైన అవగా హన పరిపక్వత లేకపోవటం political bankruptcy లోక్‌సభకు ప్రతిపక్ష సభ్యులు మూకుమ్మడి రాజీనామా చేయడం వారి రాజకీయ దివాళకోరుతనానికి నిద ర్శనమని కాంగ్రెస్(ఐ) వర్కింగ్ కమిటీ అభివర్ణించింది. (ఆం ప్ర 29 7 89)

**రాజకీయ దురుద్దేశం** వి. *raajakiiya duruddeeśam* రాజకీయంగా ఎదుటివా రికి హాని కలిగించాలనే చెడు ఆలోచన political motive ప్రతిపక్ష సభ్యులు నేడు లోక్‌సభ సభ్యత్వాలకు రాజీనామా చేయడం రాజకీయ దురుద్దేశంతో కూడిన ఎన్నికల స్టంట్‌గా ఎ.ఐ.ఎ.డి.ఎం.కె ప్రధాన కార్యదర్శి జయలలిత ఖండించారు. (ఆం. ప్ర. 25 7.89)

**రాజకీయ నాటకం** వి. *raajakiiya naaTakam* కేవలం రాజకీయ ప్రయోజనాలు లేదా ప్రచారంకోసం చేసే పని లేదా చూపే ప్రవర్తన political drama or stunt అసంతృప్తికి లోనైనట్లుగా కని పించిన ప్రొఫెసర్ ఎన్. జి. రంగా మాట్లా డుతూ ప్రతిపక్షాల రాజకీయ నాటకం అభివృద్ధి నిరోధక చర్యగా వర్ణించారు. (ఆం ప్ర. 25 7.89)

**రాజకీయ నాయకత్వం** వి. *raajakiiya naayakatvam* ఒక పార్టీ లేదా కొన్ని పార్టీల సభ్యులు ముఖ్యపాత్ర వహిం చటం political leadership మీర ట్‌లో ఇటీవల మతకలహాలకు పోలీసు అధి కారులకన్నా రాష్ట్ర "రాజకీయ నాయ కత్వానిదే" ప్రధాన బాధ్యత అని ఆయన ఆరోపించారు. (ఈ 26 6 87)

**రాజకీయ పరిణామం** వి. *raajakiiya pariNaamam* రాజకీయ రంగంలో వచ్చిన మార్పును సూచించే సంఘ టన political development పార్టీ నాయకత్వం అవలంబిస్తున్న పార్టీ వ్యతిరేక ప్రభుత్వ వ్యతిరేక విధానాల వల్ల విసిగి వేసారి కొందరు అధికార పార్టీకి దూర మవడానికి అప్పుడే నిర్ణయం తీసుకున్నట్లు ఇటీవల మండలంలో జరుగుతున్న రాజకీయ పరిణామాలవల్ల తెలుస్తోంది. (ఆం. ప్ర. 3.7.89)

**రాజకీయ పరిశీలకుడు** వి. *raajaki-*

*iya pariśiilakuDu* రాజకీయ రంగంలో జరుగుతున్న సంఘటనల్ని పరిణామాల్ని నిష్పక్షపాతంగా విశ్లేషించి చూసే నిపుణుడు political observer ఎన్నికల్లో పార్టీ విజయవకాశాల్ని ఈ పరిణామాలు ఎంతవరకు దెబ్బ తీస్తాయనేది వేచి చూడాల్సిన విషయమేనని రాజకీయ పరిశీలకులు భావిస్తున్నారు. (ఈ 17 11 89)

**రాజకీయ పరిష్కారం** వి. *raajakiiya pariSkaaram* ఘర్షణల్ని అంతమొందించటానికి బలప్రయోగం కాకుండా సంబంధిత రాజకీయ పక్షాలు కలిసి చర్చించి కనుగొనే సామరస్య పద్ధతి political solution కంబోడియా సమస్యను ప్రస్తావిస్తూ, దీనికి రాజకీయ పరిష్కారమే సరైనదని, చైనా-సోవియట్‌లు అంగీకరించాయని ఆయన తెలిపారు. (ఆం ప్ర 18 5.89)

**రాజకీయ పోరాటం** వి. *raajakiiya-pooraaTam* సైద్ధాంతిక పరమైన పాలనాపరమైన ఆధిక్యంకోసం జరిగే ఘర్షణ political struggle చైనాపై పట్టు కోసం జరుగుతున్న రాజకీయ పోరాటం బుధవారం బాగా ఊపందుకొంది. (ఈ 25 5 89)

**రాజకీయ ప్రత్యామ్నాయం** వి. *raajakii-ya pratyaamnaayam* ప్రజలు ప్రస్తుతం అధికారంలో ఉన్న పార్టీ లేదా పార్టీల కూటమిని తొలగించాలనుకున్నప్పుడు దాని స్థానంలో అధికారం చేపట్ట గలిగినంత శక్తి సామర్థ్యాలు కలిగిన మరో పార్టీ లేదా పార్టీల కూటమి political alternative దేశ రాజకీయరంగంలో చాలకాలం తర్వాత కాంగ్రెస్(ఐ) పార్టీకి రాజకీయ ప్రత్యామ్నాయం రూపుదిద్దుకుందని శ్రీ సింగ్ అన్నారు. (ఆం ప్ర. 5.7 89)

**రాజకీయ ప్రదర్శన** వి. *raajakiiya pradarśana* పార్టీలు తమ రాజకీయ ఉద్దేశాలకు మద్దతుగా నిర్వహించే ధర్నా లేదా ఊరేగింపు వంటి కార్యక్రమం political demonstration రాజధానిలో రాజకీయ ప్రదర్శనలను నిషేధించినట్లు ప్రభుత్వం హెచ్చరించింది. (ఆం. ప్ర. 17 8 89)

**రాజకీయ బందీ** వి. *raajakiiya bandii* చూ. రాజకీయ ఖైదీ ; ప్రతిపక్షాలతో వేగిరం శాంతి చర్చలు జరపాలన్న ప్రయత్నంతో బంగ్లాదేశ్ ఆదివారంనాడు మరో ఆరుగురు రాజకీయ బందీలను విడుదల చేసింది. (ఉద 22 12 87)

**రాజకీయ రంగు** వి. *raajakiiya rangu* ఒక సంఘటనని లేదా సమస్యను అవసరంలేకున్నా రాజకీయ దృష్టితో చూడటం political colour ప్రతిదానికీ రాజకీయ రంగు పులమడానికి బదులు ఏపార్టీ అధికారంలో ఉన్నా స్వేచ్ఛగా విధులు నిర్వర్తించుకోవడానికి అవకాశం కల్పించాలని శ్రీ రామారావు కోరారు. (ఆం జ్యో. 22.4 88)

**రాజకీయ రాజధాని** వి *raajakiiya raajadhaani* (పరిపాలనా పరంగా రాజధాని కాకపోయినప్పటికీ) అన్ని రాజకీయ పార్టీల కార్యకలాపాలకు, వ్యూహరచనకు కేంద్రంగా ఉన్న ప్రదేశం political capital విజయవాడ రాజకీయ కార్యకలాపాలకు కీలకస్థానమై రాష్ట్ర రాజకీయ రాజధానిగా పరిగణించబడుతోంది. (ఆం. ప్ర 21.10 87)

**రాజకీయ లిటిగెంటు** వి. *raajaki-iya liTigenTu* ప్రజోపయోగం పేరిట ప్రభుత్వ కార్యకలాపాలను ఎదుర్కొనేందుకు న్యాయస్థానంలో అదేపనిగా

కేసులు నడిపే వ్యక్తి political litigant న్యాయమూర్తులు రిట్‌లు అను మతించి రాజకీయ లిటిగెంట్లకు అసంకల్పితంగానైనా పండుగ చేసుకునే సందిచ్చారు. (ఈ. 5.1.88)

**రాజకీయ వర్గాలు** వి. (బ. వ.) *raajakii-ya vargaalu* విభిన్న రాజకీయ పార్టీలకు చెందిన (ప్రముఖ) వ్యక్తులు political circles లోక్ దళ్(బి), బి జె. పి. తో కలిసి సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు చేస్తుందా లేక సొంతంగా ప్రభుత్వం ఏర్పాటు చేస్తుందా అన్న విషయమై శుక్రవారం రాజకీయ వర్గాల్లో జోరుగా చర్చలు కొనసాగాయి. (ఆం జ్యో 20 6.87)

**రాజకీయ వాతావరణం** వి. *raajakiiya vaataavaraNam* రాజకీయ కార్యకలాపాల స్థితి political atmosphere నేషనల్ ఫ్రంట్ నాయకుల ఆగమనంతో రాజధానిలోని ప్రతిపక్ష శిబిరాలలో రాజకీయ వాతావరణం వేడెక్కింది. (ఆం. భూ. 29 11.89)

**రాజకీయవాది** వి. *raajakiiyavaadi* రాజకీయాలలో ఏదో ఒక పార్టీ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనే వ్యక్తి politician రాజకీయవాదులను గవర్నర్లుగా నియమించరాదన్న సర్కారియా కమీషన్ సిఫారసులను కేంద్రం నిర్భీతిగా ఉల్లంఘించిందని విమర్శించారు. (ఆం ప్ర 5.7 89)

**రాజకీయ వారసుడు** వి. *raajakiiya vaarasuDu* రాజకీయాలలో నుంచి ఒక ప్రముఖ వ్యక్తి నిష్క్రమణ తర్వాత అతని అధికారాలను, బాధ్యతలను స్వీకరించటానికి యోగ్యుడైన వ్యక్తి political heir తన కుమారుడు శ్రీ బాలకృష్ణ తన రాజకీయ వారసుడని కూడా ప్రకటించారు. (ఆం. భూ 2.9.87)

**రాజకీయ విలువలు** వి.(బ.వ.) *raa-jakiiya viluvalu* రాజకీయాల్లో పాటించాల్సిన నైతిక ప్రమాణాలు political values ప్రతిరోజూ రాజకీయ విలువల గురించి మాట్లాడే ... నైతిక హక్కు ఎక్కడిదని ప్రశ్నించారు. (ఆం. ప్ర. 29.7.89)

**రాజకీయ విశ్వాసం** వి. *raajakiiya viśvaasam* ఒక నిర్దిష్ట రాజకీయ సిద్ధాంతంపైన ఉన్న ఖచ్చితమైన నమ్మకం political belief చైనాలో స్తంభించిపోయిన ఆర్థిక వ్యవస్థను చక్కదిద్దడానికి ప్రయోగవాద దృష్టితో డెంగ్ జియావోపింగ్ ఈ చర్య తీసుకున్నారే తప్ప, ఏదో ఒక రాజకీయ విశ్వాసంతో తీసుకోలేదన్న విషయం ఇప్పుడు స్పష్టమైంది. (ఆం. ప్ర 21.8.89)

**రాజకీయ శక్తి** వి. *raajakiiya śakti* సమకాలీన రాజకీయాలను ప్రభావితం చేయగలిగిన సామర్థ్యం ఉన్న పార్టీ political force తెలుగుదేశం పార్టీని జాతీయ స్థాయి రాజకీయ శక్తిగా తీర్చి దిద్దేందుకు కృషి చేయాలని ముఖ్యమంత్రి పిలుపు ఇచ్చారు. (ఆం ప్ర 21 8 89)

**రాజకీయ శత్రువు** వి. *raajakiiya śatruvu* ఒక వ్యక్తిని రాజకీయంగా అణచివేయాలని నిరంతరం ప్రయత్నించే ప్రత్యర్థి political enemy జియాఉల్ హక్ తిరిగి సంవత్సరం తర్వాత తన రాజకీయ శత్రువులకు గుబులు పుట్టించ బోతున్నారు. (ఆం ప్ర. 17.8 89)

**రాజకీయ సంక్షోభం** వి. *raajakiiya sankSoobham* పాలక ప్రతిపక్షాల మధ్య రాజకీయ ఘర్షణ తీవ్రస్థాయికి వెళ్ళిన ఫలితంగా అనిశ్చిత, అస్తవ్యస్థ పరిస్థితులేర్పడటం political crisis బంగ్లాదేశ్‌లో రాజకీయ సంక్షోభం తొలగించటానికి

వీలుగా చర్చలు జరపాలన్న బంగ్లా ప్రభుత్వ ప్రతిపాదనను రెండు ప్రధాన ప్రతిపక్షాలు తిరస్కరించాయి. (ఆం ప్ర 25 7 89)

**రాజకీయ సంఘర్షణ** వి. *raajakiiya sangharSaNa* భిన్న రాజకీయ సిద్ధాంతాలు అనుసరిస్తున్న పక్షాల మధ్య ఆధిపత్యంకోసం జరిగే పోరాటం political conflict నక్సలైట్లకూ, రాష్ట్రప్రభుత్వానికీ మధ్య జరుగుతున్న రాజకీయ సంఘర్షణలో ఎవరిది గెలుపు, ఎవరిది ఓటమి అని ఆలోచించకుండా ఉండలేము. (ఆం. ప్ర 18 7 89)

**రాజకీయ సన్యాసం** వి. *raajakiiya sanyaasam* క్రియాశీల రాజకీయాలలో నుంచి శాశ్వతంగా వైదొలగటం retirement from politics రాజకీయ సన్యాసం తీసుకోవలసిన శ్రీ నాదెండ్ల భాస్కరరావు కాంగ్రెస్ పార్టీలో చేరడం హాస్యాస్పదంగా ఉందని శ్రీ రెడ్డి అన్నారు. (ఆం. ప్ర 18.5 89)

**రాజకీయ స్టంట్** వి. *raajakiiya sTanT* రాజకీయ ప్రయోజనాలకోసం ఇతరులను మభ్యపెట్టే ఎత్తుగడ political stunt వచ్చే ఎన్నికలను దృష్టిలో ఉంచుకొని ప్రతిపక్షాలు ఆడుతున్న రాజకీయ స్టంట్ ఈ తతంగం అని కాంగ్రెస్ సభ్యులు పేర్కొన్నారు. (ఆం ప్ర 25.7.89)

**రాజకీయ హత్య** వి. *raajakiiya hatya* రాజకీయ కక్షల కారణంగా చంపటం political murder బెంగాల్‌లో రోజు రోజుకీ రాజకీయ హత్యలు పెరిగి పోతున్నాయని ఆయన పేర్కొన్నారు. (ఆం ప్ర. 5.7.89)

**రాజకీయ హస్తం** వి. *raajakiiya hastam* రాజకీయవాదుల ప్రమేయం political hand ఇటీవల జరిగిన ఒక హత్యకు రాజకీయ రంగు పులమడంతో దీని వెనుక రాజకీయ హస్తం ఉందని ... అనుకుంటున్నారు. (ఆం భూ 21.3 88)

**రాజకీయాస్త్రం** వి. *raajakiiyaastram* రాజకీయ ప్రయోజనాలకోసం ఉపయోగించే ఆయుధం political weapon మాజీ కేంద్ర మంత్రి ఏర్పాటు చేయతలపెట్టిన "ఫోరం" రాజకీయ పార్టీగానీ, రాజకీయ అస్త్రంగానీ కాదనీ, కాంగ్రెస్ నుండి సస్పెండయిన రాజ్యసభ సభ్యుడు శ్రీ సత్యపాల్ మాలిక్ అన్నారు. (ఆం. జ్యో 14 9 87)

**రాజధాని** వి. *raajadhaani* పరిపాలనకు కేంద్రంగా ఉండే నగరం; ముఖ్యపట్టణం capital కేంద్రం ఏ ప్రతిపక్ష రాష్ట్ర ప్రభుత్వాన్నైనా బర్తరఫ్ చేస్తే ఆ మరుసటిరోజే ప్రతిపక్షాలు రాజధానిని ముట్టడించగలవని హర్యానా ముఖ్యమంత్రి హెచ్చరించారు. (ఆం ప్ర 26 8 89)

**రాజనీతిజ్ఞత** వి. *raajaniitijnata* రాజకీయాలను నడపటంలో ఉన్న నేర్పు లేదా ప్రావీణ్యం political wisdom ... జయవర్ధనే ధైర్యసాహసాలు, రాజనీతిజ్ఞతే కారణాలని భారత ప్రధాని ... ప్రశంసించారు. (ఆం భూ 14 10 89)

**రాజభాష** వి. *raajabhaaSa* పరిపాలనాది రంగాలలో దేశం మొత్తానికి ప్రాతినిధ్యం వహిస్తూ ప్రభుత్వ గుర్తింపు పొందిన భాష national language రాష్ట్రాలు స్వచ్ఛందంగా హిందీని రాజభాషగా అంగీకరించేలా ప్రయత్నిస్తామని, బలవంతం చేయబోమని ఆయన అన్నారు. (ఉ. 8 7 87)

**రాజీ** వి. *raajii* పరస్పరం వ్యతిరేకమైన వ్యక్తులు లేదా సంస్థలు తమ పట్టుదలలు కొంత వదులుకొని ఇచ్చి పుచ్చుకునే ధోరణితో వ్యవహరించటానికి అంగీకరిం

చటం compromise ఇప్పుడు రష్యా చైనా రెండూ కలసి ఉత్తర కొరియా మీద ఒత్తిడి తీసుకు వచ్చి దక్షిణ కొరియాతో రాజీకి ఒప్పించవచ్చు. (ఆం భూ 25 5 89)

**రాజీనామా** వి. *raajiinaamaa* పద విని వదలి పెడుతున్నట్లు తెలుపుతూ సమ ర్పించే లాంఛన పత్రం resignation ముద్రగడ పద్మనాభం రవాణా మంత్రి పద వికి చేసిన రాజీనామాను గవర్నర్ నేడు ఆమోదించారు (ఆం ప్ర 20 4 88)

**రాజ్యంచేయు** క్రి. *raajyamceeyu* (దేశా ధినేతగా) పరిపాలన చేయు to rule చెకొస్లవేకియాలో పద్దెనిమిదేళ్ళు రాజ్యంచే సిన గుస్తావ్ హుసాక్ స్థానే మిలోష్ జేక్స్ నాయకుడైనాడు. (ఈ 29 12 87)

**రాజ్యమేలు** క్రి. *raajyameelu* చూ. రాజ్యం చేయు. ప్రస్తుతం వివిధ దేశాలలో రాజ్యమే లుతున్న నియంతలందరూ ఎన్నికల్ని [illegible] స్తామని, ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరిస్తామని అంటూనే నిరవధికంగా అధికారంలో కొనసా గుతున్నారు. (ఆం ప్ర. 11 12 87)

**రాజ్యసభ** వి. *raajyasabha* భారత పార్లమెంట్‌లో పరోక్ష పద్ధతిలో ఎన్నికైన సభ్యులతో కూడిన ఎగువసభ upper house గుజరాత్ నుంచి రాజ్యసభకు తిరిగి పోటీ చేయడానికి కేంద్ర వాణిజ్య మంత్రి శ్రీ పి. శివశంకర్‌కు కాంగ్రెస్(ఐ) టికెట్ లభించింది. (ఆం ప 7 7 87)

**రాజ్యాంగ అవతారిక** వి. *raajyaanga avataarika* రాజ్యాంగంలోని ముందు మాట preamble రాజ్యాంగ అవతా రిక చదువుతూ రామారావు తన ప్రసంగం మొదలుపెట్టారు. (ఈ 29 7 87)

**రాజ్యాంగం** వి. *raajyaangam* ప్రజల హక్కులు, ప్రభుత్వ అధికారాలు, బాధ్య తలు మొ. నిర్దేశిస్తూ ఒక దేశం రూపొందించుకున్న లిఖిత నియమావళి constitution రాజ్యాంగంలోని 263 అధికరణం కింద ఈ మండలులు స్వయం ప్రతిపత్తి గలవిగా వుండాలని అన్నారు. (ఆం ప్ర 22 4 88)

**రాజ్యాంగ నిబద్ధత** వి. *raajyaanga nibaddhata* రాజ్యాంగం ప్రకారం గుర్తింపు constitutional validity పంచా యితీ సంస్థలకు రాజ్యాంగ నిబద్ధత కల్పించా లన్నారు. (ఈ 5 5 89)

**రాజ్యాంగబద్ధం** వి. *raajyaangabaddham* రాజ్యాంగానికి అనుగుణంగా ఉండటం constitutional రాజ్యాం గబద్ధంగా వెల్లడికాదగిన నిజాలు. (ఆం. ప్ర 25 4.89)

**రాజ్యాంగ యంత్రం** వి. *raajyaanga yantram* రాజ్యాంగం ప్రకారం నడిచే ప్రజాస్వామ్య పరిపాలనా వ్యవస్థ state machinery అయితే రాష్ట్రం లోని రాజ్యాంగ యంత్రం విఫలమైందని, ఏ ఇతర పార్టీ ప్రభుత్వం ఏర్పాటు చేయలేదని గవర్నర్ తన నివేదికలో స్పష్టం చేశారని హోంమంత్రివారితో అన్నారట. (ఆం. భూ. )

**రాజ్యాంగ విధి** వి *raajyaanga vidhi* రాజ్యాంగంలో నిర్దేశించిన బాధ్యత constitutional duty రాజ్యాంగ విధికి అనుగుణంగానే ఆయా రాష్ట్ర ప్రభు త్వాలు పంచాయితీ చట్టాలను రూపొందిం చుకున్నాయి (ఈ. 5 5 89)

**రాజ్యాంగ విరుద్ధం** వి. *raajyaanga viruddham* రాజ్యాంగ వ్యతిరేకమైనది. unconstitutional తన ప్రభుత్వం విషయంలో గవర్నర్ ఇచ్చిన "రాజ్యాంగ విరుద్ధ సలహా"పై ఎటువంటి చర్చా తీసు

కోరాదని తాను రాష్ట్రపతిని కోరినట్టు ముఖ్య మంత్రి తెలిపారు. (ఆం ప్ర. 21.4.89)

**రాజ్యాంగ వ్యవస్థ** వి. *raajyaanga vyavastha* రాజ్యాంగం ప్రకారం ఏర్పాటయిన సంస్థ constitutional body దురదృష్టవశాత్తు ఈసభ ఒక నిరుపయోగమైన రాజ్యాంగ వ్యవస్థగా మిగిలిపోయింది. ఇప్పుడు దీనికి ప్రజాప్రాతినిధ్య లక్షణాలు లేవు. (ఆం ప్ర. 25.7 89)

**రాజ్యాంగ సంక్షోభం** వి. *raajyaanga sankSoobham* రాజ్యాంగ నియమాలను ఉల్లంఘించటంవల్ల చట్టపరంగా ఏర్పడిన గందరగోళ పరిస్థితి constitutional crisis లోకాయుక్తగా రాష్ట్ర ప్రభుత్వం సూచించిన వ్యక్తిని నియమించేందుకు నిరాకరించడం ద్వారా గవర్నర్ అవాంఛనీయ వివాదాన్ని, రాజ్యాంగ సంక్షోభాన్ని సృష్టించారని ప్రతిపక్షనాయకుడు రాష్ట్రపతికి విన్నవించారు. (ఈ 26 4.88)

**రాజ్యాంగ సవరణ బిల్లు** వి. *raajyaanga savaraNa billu* రాజ్యాంగంలో మార్పులు చేయటానికి ప్రతిపాదించే ముసాయిదా constitutional amendment bill పంచాయితీ నగరపాలక సంస్థలకు సంబంధించిన రాజ్యాంగ సవరణ బిల్లులను శుక్రవారమే ఓటింగుకు పెట్టడానికి ప్రతిపక్షాలు ప్రయత్నించాయి. (ఆం భూ 19 8 89)

**రాజ్యాంగ స్ఫూర్తి** వి *raajyaanga sphuurti* రాజ్యాంగం ప్రతిఫలించే భావం spirit of the constitution హర్యానా, నాగాలాండ్ ఎన్నికల ప్రచారాలలో ఎన్టీఆర్ వేర్పాటు ఉద్యమాలను బలపరిచారని వ్యాఖ్యానించి బూటాసింగ్ రాజ్యాంగ స్ఫూర్తికే విఘాతం కలిగించారని ఎల్. కె. అద్వాని విమర్శించినపుడు ... (ఈ 8 12.87)

**రాజ్యాంగేతర శక్తి** వి. *raajyaangeetara Sakti* చట్టపరంగా అవసరమైన పదవి ఏదీ లేకపోయినప్పటికీ అపరిమితమైన అధికారాలు చలాయించే వ్యక్తి extra constitutional authority or power రాజ్యాంగేతర శక్తిగా తయారైన శ్రీ ... అవినీతి పనులను వెల్లడించిన శ్రీ ... పై చర్య గైకొనడం ద్వారా ముఖ్యమంత్రి తన నియంతృత్వ బంధుప్రీతి విధానాలను చాటుకున్నారని విమర్శించారు. (ఉ. 17.11 87)

**రాటుదేలు** క్రి. *raaTudeelu* (సుదీర్ఘ అనుభవం ఫలితంగా) వ్యక్తిత్వం లేదా నైపుణ్యం బాగా పదునెక్కి బలోపేతం అగు to get toughened or matured స్పిన్నర్లు కాలం గడచిన కొద్దీ రాటుదేలుతుంటారు. (ఆం. భూ. 20 4 89)

**రాడార్** వి. *raaDaar* విమానాలు, నౌకలు మొ. వాటి ఉనికి, కదలికలను కంటికి కనపడనంత దూరంలో ఉన్నప్పుడే గమనించి తెలియజేసే సాంకేతిక వ్యవస్థ radar దాడి జరుగక ముందే మిసిలీ స్థావరాలపై అమెరికా దాడి చేయబోదని, దాడికి సన్నాహంగా రాడార్‌ను అమెరికా నౌకలపై గురిపెడితే మాత్రం దెబ్బతీస్తామని శ్రీ వీన్ బెర్గర్ అన్నారు. (ఆం ప. 16.7.87)

**రాడికల్** వి. *raaDikal* విప్లవ భావజాలంప్రాతిపదికగా నడచుకొనే యువ (సాధా. విద్యార్థి) రాజకీయవాది radical రాడికల్స్‌పట్ల కఠినంగా వ్యవహరించవలసిన సమయం ఆసన్నమైందని ఆయన అన్నారు. (ఆం. ప్ర. 21.8.87)

**రాణించు** క్రి. *raaNincu* ఒక రంగంలో తన ప్రతిభా పాటవాలను సమర్థవంతంగా నిరూపించు to shine, succeed ఇంగ్లాండ్‌లో సన్‌డేలీగ్ పోటీల్లో ఎసెక్స్-కెంట్ జట్టు మధ్య మ్యాచ్‌లో మార్క్‌వాఫ్ రాణించాడు. (ఆం. ప్ర 25.4.89)

**రాతపరీక్ష** వి. *raatapariikSa* పోటీ పరీక్షల్లో ప్రశ్నాపత్రంలోని ప్రశ్నలకు రాసిన సమాధానాలు ఆధారంగా అభ్యర్థుల ప్రతిభని నిర్ణయించే పద్ధతి (మౌఖిక పరీక్షకన్నా భిన్నమైనది) written test తొలుత అభ్యర్థులందరికీ రాతపరీక్ష ఉంటుందనీ, ఎస్. ఇ. ఆర్. టి. వారు 85 మార్కుల ప్రశ్నాపత్రం సిద్ధంచేసి పంపుతారనీ, మిగతా 15 మార్కులు మౌఖిక పరీక్షకు కేటాయించినట్లు మంత్రి చెప్పారు. (ఆం. ప్ర. 29.4.89)

**రాద్ధాంతంచేయు** క్రి. *raaddhaantam-ceeyu* (ఒక విషయంపై) పెద్దగా గొడవచేయు to raise hue and cry సోనియా గాంధీ ఏదో అన్నదని ఉపేంద్ర ఆయన పార్టీ వాళ్ళు లేనిపోని రాద్ధాంతం చేయడం తప్పని ఆయన అన్నారు. (ఈ. 29.12.87)

**రాబట్టు** క్రి. *raabaTTu* (డబ్బు, సమాచారం మొ.) ప్రత్యేకమైన ప్రయత్నం ద్వారా ఇతరుల నుంచి గ్రహించు to extract, gather అమెరికా రక్షణ రహస్యాలు, ఆయుధ సాంకేతిక పరిజ్ఞానానికి సంబంధించిన కీలక సమాచారాన్నైనా ఏజెంట్లు డబ్బిచ్చి కనుక్కోవడమో లేక రహస్యంగా రాబట్టడమో చేస్తున్నదని ... చెబుతున్నారు.

**రాయబారం** వి. *raayabaaram* భిన్న వర్గాల మధ్య సయోధ్యకై చేసే ప్రయత్నం mediation, negotiation శ్రీ అజిత్ సింగ్‌ను తమ పార్టీలో చేరవలసిందిగా కాంగ్రెస్(ఐ) వారు కూడా పదేపదే రాయబారాలు పంపుతున్నారు. (ఆం. భూ. 24.5.89)

**రాయబారకార్యాలయం** వి. *raaya-baarakaaryaalayam* విదేశ రాయబారి, అతని సిబ్బంది పనిచేసే స్థలం embassy భద్రతా చర్యల్లో భాగంగానైనా పారామిలిటరీ దళాలు నేడు అమెరికా రాయబారకార్యాలయాన్ని చుట్టుముట్టి నిఘా ఉధృతం చేశారు. (ఆం. ప్ర. 3.7.89)

**రాయబారి** వి. *raayabaari* విదేశంలో తమ దేశ కార్యకలాపాలను నిర్వహించేందుకు ప్రత్యేకంగా నియమించిన ప్రభుత్వ ప్రతినిధి ambassador భారత, నేపాల్ మైత్రీ ఒప్పందంపై నేపాల్ వైఖరికి సంబంధించి సంప్రదింపులు జరపడానికి భారత రాయబారి అర్వింద్ దేవ్‌ను ఖాట్మండు నుంచి ఇక్కడికి పిలిపించారు. (ఆం. ప్ర. 3.5.89)

**రాయల్టీ** వి. *raayalTii* ఒక వస్తువుని ఉపయోగించుకున్నందుకు చట్టపరంగా దాని హక్కుదారులయిన వారికి చెల్లించాల్సిన సొమ్ము royalty తమకు రాయల్టీ చెల్లించనిదే దూరదర్శన్‌కు రిలయన్స్ మ్యాచ్‌ల ప్రసారానికి అనుమతివ్వమంటూ ఇండో-పాక్ సంయుక్త నిర్వాహక కమిటీ (ఐ. పి. జె. ఎం. సి.) స్పష్టం చేసింది. (ఆం. జ్యో. 15.9.87)

**రాయితీ** వి. *raayitii* కొన్ని వర్గాలకు ప్రభుత్వం కల్పించే ప్రత్యేక (ఆర్థిక) సౌకర్యం లేదా తగ్గింపు monetary concession ఈ నిర్ణయాలవల్ల వర్తక వాణిజ్య రంగాలలోని వారికి 30కోట్ల రూపాయల రాయితీ లభిస్తుంది. (ఆం. ప్ర. 8.2.89)

**రాష్ట్రపతిపాలన** వి. *raaSTrapati-paalana* రాష్ట్ర ప్రభుత్వం రద్దయినప్పుడు అక్కడ రాష్ట్రపతి పేరు మీద కేంద్రం నిర్వహించే పరిపాలన president's rule కర్నాటకలో బొమ్మై ప్రభుత్వాన్ని రద్దు చేసి రాష్ట్రపతిపాలన విధించారు. (ఆం. ప్ర. 22.7.89)

**రాష్ట్రప్రతిపత్తి** వి. *raaSTrapratipatti*

ప్రత్యేక రాష్ట్రం హోదా statehood డార్జిలింగ్‌కు రాష్ట్రప్రతిపత్తి మినహా ఏదైనా పశ్చిమ బెంగాల్ ప్రభుత్వానికి అంగీకారయోగ్యమేనని బసు విలేకరులతో తెలిపారు. (ఈ 22.7 87)

**రాస్తారోకో** వి. *raastaarookoo* నిరసనను వ్యక్తం చేస్తూ ప్రదర్శనకారులు (ప్రధాన) రహదారిపై వాహనాలను నడవనీయకుండా ఆపివేయటం rastaroko, road blockade *రాష్ట్రరోడ్డు రవాణా సంస్థ బస్సు ఛార్జీలను పెంచినందుకు నిరసనగా కాంగ్రెస్(ఐ) పార్టీ అధ్వర్యంలో నేడు రాష్ట్ర వ్యాప్తంగా జరిగిన రాస్తారోకో ఆందోళన విజయవంతమైంది.* (ఆం ప్ర 6 12.88)

**రికార్డు** వి. *rikaarDu* (ఆటల పోటీల వంటి వాటిలో) అప్పటివరకు ఇతరులెవ్వరూ ప్రదర్శించనంత ఉన్నతమైన లేదా అధమమైన స్థాయి record (as in sports etc.) *గతంలో రికార్డు నెలకొల్పిన బల్వీందర్ సింగ్ మాత్రం కాంస్య పతకంతో సంతృప్తి పడాల్సి వచ్చింది* (ఈ. 2.9 89)

**రికార్డుచేయు** క్రి. *rikaarDuceeyu* ఒక విషయం లేదా సంఘటనకి సంబంధించిన సమాచారాన్ని భవిష్యత్తులో ఉపయోగించేందుకు వీలుగా రాసిపెట్టు to record (incidents, evidence etc.) *ఈ 'శిరోముండనం' వార్త పత్రికలకెక్కడంతో విజయవాడ అదనపు మేజిస్ట్రేట్ ఆ కేసులో సాక్ష్యాధారాలు రికార్డుచేయడానికి పూనుకున్నారు.* (ఆం. భూ 14 5 89)

**రిక్రిమినేషన్ పిటిషన్** వి. *rikrimineeSan piTiSan* ప్రతివాది తనపై ఆరోపించబడ్డ నేరాలను తిరిగి వాదిపై కోర్టులో ఆరోపిస్తూ చేసే అభ్యర్థన; ప్రత్యభియోగం recrimination petition *తెలుగుదేశం అభ్యర్థి శ్రీ వల్లభనేని తనకు వ్యతిరేకంగా తీర్పువచ్చినప్పటికీ, తెలుగుదేశం అభ్యర్థి శ్రీ బాబురావును ఎంపికైన అభ్యర్థిగా ప్రకటించకూడదని జిల్లా ప్రజాపరిషత్ అధ్యక్షుడు శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు రిక్రిమినేషన్ పిటిషన్ దాఖలు చేశారు.* (ఆం భూ 29.6 87)

**రిక్రూట్ చేసుకొను** క్రి *rikruuTceesukonu* (ఉద్యోగాలలో) నియామకం చేసుకొను to recruit *రేవుల్లో అత్యవసర సరుకులు కదిలించేందుకు అధికారులు ఎమర్జెన్సీ నిబంధనల కింద బయటి కార్మికులను రిక్రూట్ చేసుకోవడం ప్రారంభించారు.* (ఆం భూ 20 4.89)

**రిక్రూట్ మెంట్** వి *rikruuTmenT* ఉద్యోగంలో భర్తీ చేసుకోవటం recruitment *సికింద్రాబాద్‌లో ఆర్మీ రిక్రూట్ మెంట్.* (ఈ. 18 6 87)

**రిగ్గింగ్** వి. *rigging* ఎన్నికలలో దొంగ ఓట్లు వేయటం rigging (as in elections) *ఈశాన్య రాష్ట్రాలలో రిగ్గింగ్ నిరోధించడానికి ఎన్నికల నిబంధనలు మరింత కట్టుదిట్టం చేశారు.* (ఆం. భూ 22.4.89)

**రిజర్వు ఫారెస్టు** వి. *rijarvu faaresTu* (అటవీ సంపదను కాపాడటం కోసం) చెట్లు నరకటం, వేట వంటి కార్యకలాపాలను నిషేధిస్తూ ప్రభుత్వం ప్రకటించిన అటవీ ప్రాంతం reserve forest *రిజర్వు ఫారెస్టు ప్రాంతాల నుంచి అటవీ సంపద అక్రమ రవాణాను అరికట్టేందుకు రాష్ట్ర ప్రభుత్వం ...* (ఆం ప్ర 23.6 87)

**రిజర్వేషన్లు** వి ( బ.వ.) *rijarveeSanlu* ఉద్యోగాలు, సీట్లువంటి సౌకర్యాలలో కొన్ని అట్టడుగు వర్గాలవారికి ప్రత్యేకించి కేటాయించటం reservations *గ్రామ పంచా*

యితీ ఎన్నికలలో వెనుకబడిన తరగతులకు 25 శాతం రిజర్వేషన్లను కల్పించాలని రాష్ట్ర వెనుకబడిన తరగతుల సంక్షేమ సంఘం విజ్ఞప్తి చేసింది. (ఆం. జ్యో. 16.10.87)

రిజిస్టరగు క్రి. *rijisTaragu* లాంఛనంగా నమోదు కావటం to be registered అప్పటి నుండి ప్రతియేటా సగటున 86 నుంచి 100 కేసుల దాకా రిజిస్టరవుతు న్నాయి. (ఆం. ప్ర. 17.8.89)

రిటర్నింగ్ అధికారి వి. *riTarning adhikaari* ఒక నియోజక వర్గంలో ఎన్ని కలను నిర్వహించటానికి ఎన్నికల కమీషన్ తరపున నియమితుడైన ప్రభుత్వాధి కారి returning officer నామినేషన్ల ఉపసంహరణ రోజున సంబంధిత పత్రాలు సమర్పించలేదన్న కారణంగా రిటర్నింగ్ అధి కారులు ఆయా అభ్యర్థులకు హస్తం గుర్తు కేటాయించలేదు. (ఆం. ప్ర. 13.11.89)

రిటర్న్సు వి. *riTarns* ఆదాయపు పన్నుకి సంబంధించి ప్రభుత్వానికి సమ ర్పించే వివరాలు (income tax) returns శ్రీ రామారావు వ్యక్తిగతం గానూ, హిందూ అవిభక్త కుటుంబకర్తగానూ, 1986-87 మదింపు సంవత్సరానికి గడువు లోపల కావాలని రిటర్న్సు దాఖలు చేయలేదన్న ఆరోపణ పై ... (ఆం. ప్ర. 21.4.88)

రిట్ పిటీషన్ వి. *riT piTiiSan* ప్రభుత్వ చర్యలను సవాలు చేస్తూ ప్రాథ మిక హక్కుల రక్షణకై కోర్టులో దాఖలయ్యే అప్పీలు writ petition గ్రామ రక్షణ కమీటీలను ఏర్పాటు చేస్తూ జారీ అయిన ప్రభుత్వ ఉత్తర్వును సవాలు చేస్తూ ఒక రిట్ పిటీషన్ రాష్ట్ర హైకోర్టు న్యాయ మూర్తి విచారణకు స్వీకరించారు. (ఆం. భూ. 31.5.89)

రిపోర్టరు వి. *ripoorTaru* పత్రికలకు వార్తలను సేకరించి పంపే ఉద్యోగి reporter నగరానికి చెందిన ఒక రిపోర్ట రుపై కొందరు దాడి చేయడంతో నిరసన వ్యక్తం చేస్తూ ప్రారంభోత్సవ కార్యక్రమాన్ని నగరానికి చెందిన పత్రికా విలేకరులు బహి ష్కరించారు. (ఆం. భూ. 11.5.89)

రిపోర్టు వి. *ripoorTu* ఒక అంశం గురించి అధ్యయనం చేసిన తరువాత సమర్పించే పత్రం; నివేదిక report బోఫోర్స్ రిపోర్ట్‌పై పార్లమెంటరీ కమిటీ. (ఆం. ప్ర. 6.6.87)

రిఫరీ వి. *rifarii* ఆటల పోటీలు నియమని బంధనల ప్రకారం జరిగేటట్లు ప్రత్యక్షంగా చూస్తూ నిర్వహించే అధికారి referee జాతీయ రిఫరీలు ఐదుగురు ఈ టోర్నమెం టులో మ్యాచ్‌లను పర్యవేక్షిస్తారు. (ఆం. ప్ర. 16.6.87)

రిఫరెండం వి. *rifarenDam* ఏదైనా ముఖ్యమైన సమస్య లేదా ప్రభుత్వ ప్రతి పాదనపై ప్రజల మనోభావాలను బ్యాలెట్ ద్వారా సేకరించటం referendum తూర్పు రాష్ట్రంలో జరపదలచిన రిఫరెండం ప్రతిపాదన రద్దు చేయాలని, ఈ ప్రతిపాదన తమిళుల స్వయం నిర్ణయాధికార హక్కును ఉల్లంఘిస్తున్నదని సమావేశం తెలిపింది. (ఆం. భూ. 1.5.89)

రిమాండు వి. *rimaanDu* నేర విచా రణ కోసం నిందితులను నిర్బంధంలో ఉంచటం remand సబ్ ఇన్స్పెక్టర్ నిందితులను అరెస్టు చేసి జ్యుడిషియల్ రిమాండ్‌కు పంపారు. (ఆం. భూ. 14.6.89)

రిలీఫ్ కమీషనర్ వి. *riliif kamiiSanar* తుఫాను మొదలైన వైపరీత్యాలు ఏర్పడి నప్పుడు ప్రజలకు సహాయ కార్యక్రమాలు నిర్వహించటానికి నియమించిన ప్రత్యేక

అధికారి relief commissioner భారీ వర్షాలు, వరదల కారణంగా పంటలు కోల్పోయిన రైతులకు ఉచితంగా విత్తనాలు ఇవ్వాలని వ్యవసాయ శాఖాధికారులు నిర్ణయించారని రిలీఫ్ కమీషనర్ తెలిపారు. (ఆం భూ 27 7.89)

**రిలీవ్‌చేయు** క్రి. *riliivceeyu* ఉద్యోగిని పదవీ బాధ్యతల నుండి విడుదల చేయు to relieve *పద్నాలుగు మందిని రిలీవ్‌చేయవలసిందిగా హెడ్ ఆఫ్ డిపార్ట్‌మెంట్స్, సూపరిండెంట్స్‌కు సైతం ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.* (ఆం జ్యో. 24 6.87)

**రిలే** వి. *rilee* (పరుగు పందెం, ఈత మొ.) పోటీల్లో టీము సభ్యులు వంతుల వారీగా పాల్గొని పూర్తి చేయటం relay *ఇక 4X100 మీటర్ల రిలేలో క్లార్క్, డాని ఎవరెట్, ఫ్లాయిడ్ హియర్డ్, కార్ల్ లూయిస్ బృందం 40.14 సెకెన్లతో ప్రథమ స్థానాన్ని సాధించారు.* (ఆం ప్ర. 21.9.89)

**రివర్ పోలీస్** వి. *rivar pooliis* నదీ ప్రాంతాన్ని పరిరక్షించటానికి ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన రక్షక దళం river police *గంగానదిలో శవాలు, చెత్తా చెదారం పడవేయకుండా చూడటానికి 'రివర్ పోలీస్' అనే ప్రత్యేక పోలీసు దళాన్ని ఏర్పాటు చేయడం జరిగిందన్నారు.* (ఆం ప 16 7.87)

**రివాజు** వి. *rivaaju* చాల కాలం నుంచి జరుగుతూవస్తున్న సంప్రదాయం customary or normal practice *ప్రతిసారి మారిన నాయకత్వం గత నాయకత్వాన్ని ఆడిపోసుకోవడం అన్ని చోట్లా ఓ రివాజు అయిపోయింది.* (ఆం భూ 26 4 89)

**రివిజను** వి *rivijanu* కేసును మళ్ళీ విచారించటం revision *అప్పీళ్ళ పేరిట, రివిజన్ల పేరిట న్యాయ స్థానాలకి రావాల్సిన అవసరం కూడా ఉండదు.* (ఉ. 15.6 87)

**రీటేక్** వి. *riiTeek* (సినిమా షూటింగ్‌లో) ఒక దృశ్యం సంతృప్తికరంగా రాలేదనిపించినప్పుడు తిరిగి అదే దృశ్యాన్ని మళ్ళీ చిత్రీకరించటం retake *సినిమాల్లో మాదిరిగా, రీటేక్‌లు రాజకీయాల్లో కుదరవని రాష్ట్ర ముఖ్యమంత్రి గుర్తించాలని ... హితవు చెప్పారు.* (ఈ 23.4 89)

**రీపోలింగ్** వి. *riipooling* (అక్రమాలు జరిగాయని నిర్ధారణ అయినప్పుడు) ముందు జరిగిన పోలింగ్ రద్దు చేసి మళ్ళీ కొత్తగా నిర్వహించటం repolling *246 కేంద్రాల్లో రీపోలింగ్.* (ఈ 23 11 89 )

**రుగ్మత** వి. *rugmata* అనారోగ్యం లేదా సామర్థ్యం దెబ్బతిన్న స్థితి sickness *ఈనాటి భారతదేశం రుగ్మతలైన మతమౌఢ్యానికి, లంచగొండితనానికి ...* (విశా. 29.10 87)

**రుచించు** క్రి. *rucincu* (ఒక విషయం) మనసుకు నచ్చు to be relished or liked *తమకు విడివిడిగా 1500 డాలర్లు, మాధవమంత్రి ఒక్కరికే 2,500 డాలర్లు ఇవ్వడం ఆటగాళ్ళకు ఏ మాత్రం రుచించ లేదు.* (ఈ. 18 8 89)

**రుచిమరుగు** క్రి. *rucimarugu* అనుభవించటం అలవాటగు to be addicted, taste (power) *అధికారం రుచిమరిగిన వారికి అధికార దాహం పెరిగిపోగలదన్న సత్యానికి యాభై తొమ్మిదవ రాజ్యాంగ సవరణ బిల్లు ఒక శాస్త్రీయమైన ఉదాహరణ.* (ఆం ప్ర. 17 3 88)

**రుజువుచేయు** క్రి. *rujuvuceeyu* (ఒక విషయం) నిజమని సాక్ష్యాధారాలతో తేల్చి

చెప్పు, నిరూపించు to prove స్విస్ ఆడిట్ బ్యూరో నివేదిక ఈ విషయం రుజువుచేసిందని జైపాల్ అన్నారు. (ఆం. ప్ర 6.6.87)

**రుణగ్రస్తుడు** వి. *ruNagrastuDu* చేసిన అప్పులు తీర్చ లేని పరిస్థితిలో చిక్కుకున్న వ్యక్తి debt-ridden person ఈ సహకార పఠానులు రుణగ్రస్తులైన రైతుల ఇళ్ళ ముందువారిని అవమానపరచడానికి దండో రావేసి వంట పాత్రలు, ఇంటి తలుపులు పెరికి తీసుకుని పోవటం ఆంధ్రలో సర్వసామాన్యమయినది. (ఆం. ప్ర 26 4 89)

**రుణపడు** క్రి. *ruNapaDu* (చేసిన సహాయానికి) కృతజ్ఞులై ఉండు to be indebted మొత్తం రాష్ట్రంలో కరువు అనావృష్టి నివారణకు శాశ్వత ప్రాతిపదికపై చర్యలు తీసుకుంటున్న శ్రీ రామారావుకు ఆంధ్ర ప్రదేశ్ ప్రజలు ఎంతో రుణపడివున్నారని ఆయన చెప్పారు. (ఆం జ్యో 30 11.87)

**రుణపత్రాలు** వి. (బ.వ.) *ruNapatraalu* అప్పును మంజూరు చేస్తున్నట్టుగా ప్రకటిస్తూ (బ్యాంకు వాళ్ళు) ఇచ్చే కాగితాలు loan-certificates విద్యావంతులైన యువకులకు, వికలాంగులకు ఈ సందర్భంగా రుణ పత్రాలు ప్రదానం చేశారు (ఆం ప్ర 8.5 89)

**రుణమేలా** వి. *ruNameelaa* బహిరంగ సభలో మూకుమ్మడిగా బలహీన వర్గాలకు అప్పులు మంజూరు చేసే కార్యక్రమం loan-mela వివిధ పథకాల రూపంలో అప్పటికప్పుడు ఎప్పటికీ తిరిగి చెల్లించలేని రుణాలు మంజూరు చేసి రుణమేలాలు నిర్వహిస్తున్నాయి. (ఆం ప్ర. 26 4 89)

**రుతుపవనాలు** వి. (బ.వ.) *rutupavanaalu* వర్షాకాలం ఆరంభంలో మేఘాలను మోసుకొచ్చే గాలులు monsoon రుతుపవనాల కారణంగా ఆదివారంనాడు బాపట్ల, హైదరాబాద్‌లలో మూడు సెంటీమీటర్ల చొప్పున ... వర్షపాతం రికార్డయింది. (ఈ 11.9 89)

**రుద్దు** క్రి. *ruddu* ఇష్టంలేని లేదా సంబంధం లేని విషయాన్ని బలవంతంగా అంటగట్టు to impose, hold responsible (wrongly) ఏ భాషనైనా బలవంతంగా రుద్దితే సమస్యలు ఉత్పన్నమవడం తప్ప ప్రయోజనాలు ఉండవని ఆయన స్పష్టం చేశారు. (ఆం ప్ర 14 2 89)

**రువ్వు** క్రివి. *ruvvu* రాళ్ళు మొ. వస్తువులు (సాధారణంగా గాయపరిచే ఉద్దేశంతో) ఇతరుల వైపు విసురు to hurl గ్రామంలో నేడు పరస్పరం రాళ్ళు రువ్వుకుంటున్న తెలుగుదేశం, కాంగ్రెస్(ఐ) కార్యకర్తల గుంపును చెదర గొట్టడానికి పోలీసులు గాలిలో కాల్పులు జరిపారు. (ఆం ప్ర 21 11 89)

**రూఢిఅగు** క్రి. *ruuDhiagu* రుజువులతో తెలియు to become established or confirmed గతంలో కూడా కొల్లాపూర్ మాజీ శాసనసభ్యుడు .. ను హత మార్చడంతో జిల్లాలో నక్సలైట్లు ఎంతకైనా తెగిస్తారని, వారి బలం పుంజుకున్నదని రూఢిఅయింది. (ఆం ప్ర. 13 6 89)

**రూపకల్పన** వి. *ruupakalpana* ఒక వస్తువు, ప్రణాళిక మొ. రూపొందించటానికి ముందు దాని రూపురేఖలు, పనితీరును గురించిన వివరాలతో ఊహాత్మకంగా తయారు చేసిన పథకం design అగ్ని క్షిపణి రూపకల్పన కేవలం ఒక సాంకేతిక ప్రదర్శన లాంటిది. ఇది స్వీయ సాంకేతిక ప్రయత్నం మాత్రమేనని చర్చలలో అమెరికా నాయకులకు స్పష్టం చేసినట్టు పంత్ తెలిపారు. (ఆం భూ 2.7.87)

**రూపుదిద్దుకొను** క్రి. *ruupudiddukonu* స్పష్టమైన ఆకారం లేదా నిర్మాణం ఏర్పడు to take shape, be formed దేశ రాజధానిలో నెలకొన్న తాజా రాజకీయ వాతావరణం గురించి ఫ్రంట్ నేతల నేతృత్వంలో రూపుదిద్దుకున్న సంయుక్త కార్యాచరణ పథకం గురించి వివరించినట్లు తెలిసింది. (ఈ 26.7.89)

**రూపుమాపు** క్రి. *ruupumaapu* (సమస్యను) శాశ్వతంగా తొలగించు to remove, eradicate నక్సలైట్ల బెడదను రూపుమాపడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సమర్థ కార్యాచరణ పథకాన్ని రూపొందించాలని ... పిలుపు ఇచ్చారు. (ఈ. 22.6 89)

**రూపొందించు** క్రి. *ruupondincu* (వస్తువు, పథకం మొ.) తయారు చేయు to evolve మత సమస్యను పరిష్కరించటానికి ఒక సమగ్ర వ్యూహాన్ని రూపొందించుకోవాలని ... సూచించారు. (ఈ. 28.6 89)

**రూలింగ్** వి. *ruling* చట్టసభలో ఒక అంశంపై వివాదం చెలరేగినప్పుడు సభాధ్యక్షుడు చేసే అంతిమ నిర్ణయం లేదా ఇచ్చే తీర్పు ruling (by the speaker) మంత్రికి, ప్రతిపక్ష సభ్యులకు మధ్య తీవ్ర స్థాయిలో వాదోపవాదాలు జరుగుతుండగా, స్పీకర్ ఈ సమస్యపై పూర్తి స్థాయి చర్చ జరగాలని రూలింగ్ ఇచ్చారు. (ఆం ప్ర 19 7 89)

**రెక్టర్** వి. *rekTar* విశ్వవిద్యాలయాలలో ప్రధానంగా విద్యావ్యవహారాలను చూసే అధికారి (ఉపాధ్యక్షులకన్నా ఒక మెట్టు కింది స్థాయి) rector (of a university) ఇక్కడ శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ మాజీ రెక్టర్, ఫాకల్టీ ఆఫ్ సైన్సెస్ డీన్ ప్రొఫెసర్ వి. ఎస్. రామదాసుకు అమెరికాలోని వటుమల్ ఫౌండేషన్ వారి పతకం అవార్డుగా లభించనున్నది. (ఈ 2.10 87)

**రెగ్యులర్‌చేయు** క్రి. *regyularceeyu* (తాత్కాలికంగా పనిచేస్తున్న ఉద్యోగుల సర్వీసులు) శాశ్వత ప్రాతిపదిక మీద నియమించటం ద్వారా చట్టబద్ధం చేయు to regularize ఈ ఇంజనీరింగ్ సిబ్బంది సర్వీసులు రెగ్యులర్‌చేసే విషయంలో సరియైన శ్రద్ధ వహించటంలేదని, ఇంజనీర్ల సంఘం విచారం వ్యక్తం చేసింది. (ఆం. భూ. 3.12.87)

**రెచ్చగొట్టు** క్రి. *reccagoTTu* 1. తమ మాటలు, చేతల ద్వారా ఇతరులకి కోపావేశాలు కలిగించి చెలరేగేటట్లు చేయు to provoke 2. ఉద్రేకం, ద్వేషం వంటి భావాల్ని మరింతగా పెంచు to incite, to fan (emotions etc.) నెలరోజుల్లో లొంగిపోవాలని నక్సలైట్లకు గడువివ్వడం వారిని మరింత రెచ్చగొట్టడమేనని అభిప్రాయపడ్డారు. (ఆం. భూ. 3 7 89)

**రెడ్ అలర్ట్** వి. *reD alarT* తీవ్రమైన హింసాత్మక సంఘటనలు జరిగినప్పుడు రక్షక దళాలను అప్రమత్తం చేయటం red alert రాజధానిలో గురువారం రాత్రి తీవ్రవాదులు రెండుచోట్ల సబ్ మిషన్ గన్స్‌తో కాల్పులు జరపడంతో అధికారులు రెడ్ అలర్ట్ ప్రకటించారు. (ఆం. జ్యో 26 6 87)

**రెడ్‌క్రాస్** వి. *reDkraas* దుర్ఘటనలలో బాధితులకు సహాయం చేసే అంతర్జాతీయ సంస్థ Red Cross జాఫ్నా తమిళులకు ఆహార పదార్థాలు ఔషధాలను తీసుకొని వెళ్ళిన భారత రెడ్‌క్రాస్ బృందంపై శ్రీలంక సైనికులు ఆదివారం కాల్పులు జరిపినట్టు ఇక్కడకు సమాచారం అందింది. (ఆం. భూ 30 6 87)

రెడ్ టేపిజం వి. *reD Teepijam* ప్రభుత్వ కార్యాలయాలలో రూల్సు పేరిట జరిగే జాప్యం red tapism చెప్పులు అరిగేలా తిరిగితేగాని పనులు జరగడంలేదు. ప్రభుత్వంలో రెడ్‌టేపిజం ఎక్కువగా పెరిగిపోయింది. (ఆం. ప్ర. 24.4.89)

రెస్యూమ్ వి. *resyuum* అభ్యర్థి అర్హతలకు సంబంధించిన సమాచార సంక్షిప్త రూపం résumé ఒక ఉద్యోగానికి దరఖాస్తు చేసేటప్పుడు దాన్ని శాస్త్రీయంగా విశ్లేషణాత్మకంగా తయారు చేయడం ఎంతైనా అవసరం. మీ బయోడేటా సారాంశాన్నే 'రెస్యూమ్' అంటారు. (ఈ. 30.9.89)

రేకెత్తు క్రి. *reekettu* (అనుమానం, అశాంతి మొ.) తలెత్తు to arise ఇప్పటికైనా కేంద్ర ప్రభుత్వం ఈ డిమాండ్ల సాధనలో చొరవ తీసుకోకపోతే పారిశ్రామిక అశాంతి రేకెత్తగలదని ఆయన హెచ్చరించారు. (ఈ. 30.6.89)

రేవు కార్మికులు వి. (బ.వ.) *reevu kaarmikulu* నౌకాశ్రయాలలో పని చేసే (ప్రధానంగా సరుకులు ఎత్తటం, దించటం) పనివాళ్ళు dock workers దేశవ్యాప్తంగా లక్షాపాతికవేలమంది రేవు కార్మికులు మూడు రోజులుగా సాగిస్తున్న సమ్మె చట్ట విరుద్ధమైనదిగా ప్రభుత్వం బుధవారం నాడు ప్రకటించింది. (ఆం. భూ. 20.4.89)

రేషన్ కార్డు వి. *reeSan kaarDu* చౌక దుకాణాల నుంచి నిత్యావసర వస్తువులు పొందటానికి వీలుగా ప్రభుత్వం జారీ చేసే అర్హతా పత్రం ration card ఖమ్మం జిల్లా తల్లాడ మండల పరిధిలోని అన్నారు గూడెం గ్రామానికి చెందిన 300 కుటుంబాల వారు 8 నెలల క్రితం రేషన్ కార్డుల కోసం దరఖాస్తు పెట్టారు. (ప్ర. శ. 10.10.87)

రేసు వి. *reesu* (గుర్రాలు, పడవలు, మొ. పందేలలో) నిర్ణీత లక్ష్యాన్ని ఎవరు వేగంగా చేరుతారన్నది తేల్చటానికి పెట్టే పోటీ race ఒ. కె. డింగీ విభాగంలో టి. పి. ఎస్. రావత్ (కోర్ ఆఫ్ ఇంజనీర్స్ సెయిలింగ్ క్లబ్) మూడో రేసులో గెలిచాడు. (ఆం. ప్ర. 28.7.89)

రేసుకోర్సు వి. *reesukoorsu* గుర్ర పుందాలు జరిగే చోటు race course బెంగుళూరు రేసుకోర్సులో శిక్షకుడిగా కాలం వెళ్ళబుచ్చుతున్న ... (ఆం. ప్ర. 22.4.89)

రైతాంగం వి. *raitaangam* వ్యవసాయదారుల సమూహం peasantry రైతులకు మేలు చేయడమే కేంద్రం ధ్యేయమని రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు పలువురు ప్రకటనలు గుప్పిస్తుండగా, గప్‌చిప్‌గా యూరియా ధర పెరుగుదలకు ఎందుకు అవకాశం ఇచ్చారో తెలియడం లేదని రైతాంగం వాపోతోంది. (ఈ. 6.10.88)

రొటేషన్ పద్ధతి వి. *roTeeSan paddhati* (పదవి, అవకాశం మొ.) ఒక క్రమంలో కాల నియమం ప్రకారం ఒకరి తరువాత మరొకరికి వచ్చే విధానం rotation system ... ఛైర్మన్ పదవిని కూడా రొటేషన్ పద్ధతిలో వారికి దక్కనీయాలి. (ఈ. 9.5.89)

రోడ్డు రోమియో వి. *rooDDu roomiyoo* రోడ్ల మీద అమ్మాయిలను అల్లరి చేసే ఆకతాయి road romeo రోడ్డు రోమియోల బారి నుండి కాపాడండి అంటూ విద్యార్థినులు చేసిన నినాదాలు సోమవారం పట్టణ వీధుల్లో ప్రతిధ్వనించాయి. (ఉ. 4.10.88)

రోయింగ్ వి. *rooying* పడవ పందెం rowing ఆసియా రోయింగ్ (పడవ

పందాలు) నిర్వహించే అవకాశాన్ని జంట నగరాలు చేజేతులా వదులుకున్నాయి. (ఆం ప్ర 20 4 88)

**రౌండ్** వి. *raunD* పోటీ తుది ఫలితం తేలేవరకు ఉండే వివిధ దశలలో ఒక దశ round *ఇద్దరి మధ్య 12 రౌండ్ల పోటీ జరగవలసి ఉంది కానీ, ఎనిమిదవ రౌండ్‌లోనే ఉలోవా కుప్పకూలి పోయాడు.* (ఆం ప్ర. 28 8 89)

**రౌండ్ టేబుల్ సమావేశం** వి. *raunD Teebul śamaaveesam* సమస్యలపై కూలంకషంగా చర్చించేందుకు సంబంధిత పక్షాలన్నీ కలిసి కూర్చోవటం round table conference *ఎన్నికల నిధులకు సంబంధించి నిర్దిష్టమైన విధివిధానాలు నిర్ణయించేందుకు అన్ని రాజకీయ పార్టీలతో ఒక రౌండ్ టేబుల్ సమావేశం ఏర్పాటు చేయాలని వి. పి. సింగ్ సూచించారు.* (ఈ 20 6 87)

**రౌడీయిజం** వి. *rauDiiyijam* ఇతరులను బెదరించటం, హింసించటం, భయపెట్టటం వంటి పద్ధతుల ద్వారా స్వప్రయోజనం సాధించుకునే జీవన విధానం rowdism *దుండగులు పెరిగిపోతున్నారని, రౌడీయిజం పెచ్రేగి పోతోందని, ఇలా పెద్ద ఆందోళన లేవదీశారు కొందరు ప్రజలు.* (ఆం ప్ర. 26 4 89)

**ర్యాంకు** వి. *ryaanku* (టెన్నిస్ లాంటి ఆటల్లో గాని లేదా పరీక్షల్లోగాని) వచ్చిన పాయింట్లు లేదా మార్కులు ఆధారంగా లభించే (ఉన్నత) స్థాయీ పరమైన గుర్తింపు rank *ఫ్రెంచ్ ఓపన్ వరకు 19వ ర్యాంకులో ఉన్న బాంగ్ ఒక్కసారిగా ఆరో ర్యాంక్‌కు చేరుకున్నాడు.* (ఆం. ప్ర. 14.6.89)

**ర్యాలీ** వి. *ryaalii* 1. నిరసన లేదా మద్దతు తెలపటానికి నిర్వహించే ఊరేగింపు rally *విజయవాడలో కేంద్రానికి వ్యతిరేకంగా ప్రతిపక్షాలు ఏర్పాటు చేసిన ర్యాలీలో పాల్గొనడానికి విజయవాడ వెడుతూ హైదరాబాద్‌లో ఆగారు.* (ఆం. జ్యో. 26 6 87) 2. (టెన్నిస్, స్క్వాష్ మొ. ఆటల్లో) ఒక పాయింట్ సాధించటానికి ఆటగాళ్ళు చాలాసేపు పోరాడటం rally *ఈ సెమీఫైనల్లో గ్రాఫ్ బలం, నేర్పు ముందు నిలువలేకపోయింది. అప్పుడప్పుడూ కొన్ని ర్యాలీలు సాగినా మ్యాచ్ మొత్తంలో గ్రాఫ్ ఆధిక్యతే స్పష్టంగా కనిపించింది.* (ఆం. ప్ర. 7.7.89)

## ల

**లంకె** వి. *lanke* వ్యక్తులు లేదా సంస్థల మధ్య సహజంగా ఉండే సంబంధం link, relationship *శ్రీలంకతో ఎంతటి లంకె ఉన్నప్పటికీ ... పొరుగు దేశంతో వ్యవహరించడంలో భారత ప్రభుత్వానికి కొన్ని పరిమితులున్నాయి.* (ఈ. సం 5 6 87)

**లంఘించు** క్రి. *langhincu* తీవ్రంగా అడ్డుతగులు to obstruct, pounce upon *నిర్మల బోస్ ఒక ప్రకటన చదువుతుండగా కాంగ్రెసు సభ్యులు ఆయనపై లంఘించారు.* (ఆం ప్ర 14.10.87)

**లంచ్ మోషన్** వి. *lanc mooSan* (హైకోర్టులో) దాఖలు చేసిన రోజే (మధ్యాహ్నం) స్వీకరించేందుకు ఉద్దేశించిన కొత్త కేసు లేదా పాత కేసుకు సంబంధించిన కొత్త పరిణామం lunch motion *రిట్ నెంబర్ కాకపోయినా, లంచ్ మోషన్‌గా అడ్మిట్ చేసి నెంబర్ వేసి తాత్కాలిక ఉత్తర్వులు చేయడానికి ఆధారం ఏమీ లేదని ...* (ఉ. 14.8.87)

**లంచ్ విరామం** వి. *lanc viraamam* మధ్యాహ్న భోజనం కోసం కేటాయించిన సమయం lunch break డేవిడ్ సన్ లంచ్ విరామం తర్వాత హాఫ్ సెంచరీ సాధించాడు. (ఆం ప్ర. 26 4.89)

**లంచం** వి. *lancam* పని సానుకూలం కోసం అక్రమంగా చెల్లించే లేదా పుచ్చు కొనే సొమ్ము; ముడుపు bribe లంచాలు చెల్లించారనే పుకార్లు విదేశీ శక్తుల అస్థిరీకరణ ప్రయత్నంలో భాగమని ... (విశా. 8 6 87)

**లంచగొండి విధానం** వి. *lancagonDi vidhaanam* లంచాల ద్వారా మాత్రమే పనులు జరిగే అక్రమ పద్ధతి bribery ప్రజా సంబంధ శాఖలన్నింటిలో అవినీతిని, లంచగొండి విధానాన్ని అణచివేయడంలో అధికారులు చేపట్టవలసిన కార్యక్రమాలను చర్చించడానికి ... (ఉ. 28 10 87)

**లంపటం** వి. *lampaTam* వ్యవహార సంబంధమైన చిక్కుముడి complication జిన్నా వ్రాసిన వీలునామా ప్రకారం ఆలీఘర్ ముస్లిం యూనివర్సిటీకి రావాల్సిన కోటి మూడు లక్షల రూపాయలు పాకిస్తాన్ చట్టాల లంపటంలో ఇరుక్కుని ఆగిపోయాయి. (ఉ. 28 10.87)

**లక్షించు** క్రి. *lakSincu* లెక్కలోకి తీసు కొను; పరిగణించు to take into consideration తనకు తోచిందే సభ్యు లకు శిరోధార్యమని కేంద్రం విరవీగి తొందర పాటుతో శాసనపరమైన చర్యలకు సమకట్టితే విరుద్ధ ఫలితాలు తప్పవని ఆయన చేసిన హెచ్చరిక కూడా లక్షింపదగింది. (ఈ. 3 5.89)

**లక్ష్మణ రేఖ** వి. *lakSmaNa reekha* స్పష్టమైన విభజనను సూచించే హద్దు; అడ్డుగీత dividing line కొంతమంది సభ్యుల ప్రవర్తనను తిలకిస్తూంటే ఘటనలు జరిగిన శాసనసభలకు, మనసభకు మధ్య లక్ష్మణ రేఖ పెద్దగా ఏమీ లేదని అనిపి స్తూంది. (ఆం. భూ. 20 4 89)

**లఘుచిత్రం** వి. *laghucitram* నిడివి తక్కువ కల్గి కొన్ని సన్నివేశాలతో కూర్చిన చలన చిత్రం short film ... 'మా ఊరు' లఘు చిత్రం కూడ ఉత్తమ బహుమతి నందుకోవడం గమనార్హం. (ఆం. ప్ర 21 4 89)

**లబ్ధిదారుడు** వి. *labdhidaaruDu* ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాల్లో సహాయం (డబ్బు, భూమి, పశువులు వగైరా) పొందేవాడు beneficiary కర్నూలు జిల్లా చాగలమర్రి మండలంలోని కదిరిపురం తాండాకు చెందిన 45 మంది షెడ్యూల్డు తెగల లబ్ధిదారు లకు ఎద్దు, బండ్లు కొనుగోలు నిమిత్తం సబ్సిడీ రూపంలో ... రూపాయలు విడుదల అయ్యాయని ... (ఆం ప్ర. 23.6.89)

**లబ్ధిపొందు** క్రి. *labdhipondu* ఆర్థికపరమైన ప్రయోజనం చేకూరు benefit ఆర్టీసీలో గుర్తింపు పొందిన నేషనల్ మజ్దూర్ యూని యన్‌కు యాజమాన్యానికి మధ్య కుదిరిన ఒప్పందంవల్ల సంస్థలో పనిచేసే 96 వేల మంది ఉద్యోగులు లబ్ధిపొందారు. (ఆం భూ. 20 4 89)

**లయంచేయు** క్రి. *layamceeyu* వివిధ సంస్థలను ఒకదానిలో విలీనం చేయు; కలిపివేయు to merge అకాడమీ లన్నిం టినీ తెలుగు విశ్వవిద్యాలయంలో లయం చేసినట్లు, సహకార చక్కెర కర్మాగారాలను చక్కెర సమాఖ్యలో విలీనం చేసినందున పద్దుల మార్పే తప్ప అదనపు ఆస్తులు పట్టుకు రావు. (ఈ. 17.3 88)

**లాంఛనం** వి. *laanchanam* నియమాను సారం పాటించే పద్ధతి formality మే 30వ తేదీన కొత్త రాష్ట్రంగా రూపొందిన

గోవాను లాంఛనంగా ప్రారంభించేందుకు ... (ప్ర.శ. 5.6.87)

**లాంఛనప్రాయం** వి. *laanchanapraa-yam* 1. నియమాల ప్రకారం పాటించే పద్ధతి formality కేవలం రాష్ట్రపతి పదవికి అభ్యర్థిని ఎంపిక చేసుకోవడమనే లాంఛనప్రాయమైన విషయంలో సైతం, ప్రతి పక్షనాయకులు ఇంతగా మల్లగుల్లాలు పడవల సిరావడం దురదృష్టకరం. (ఆం ప్ర 23 6 87) 2. మొక్కుబడి తీర్చుకున్నట్లుగా ఉండటం; నామమాత్రం nominal ఒకవేళ కాంగ్రెస్ అధిష్ఠాన వర్గం ఈ కోర్కెలను ఆమోదించినా, మూపనార్ వర్గం సహాయం లాంఛనప్రాయంగా మాత్రమే ఉంటుంది. (ఆం భూ 26.5.89)

**లాకప్** వి. *laakap* నిందితులను పోలీసు స్టేషన్‌లో తాత్కాలికంగా నిర్బంధించి ఉంచే గది lockup గత ఆగస్టు 27న టుటౌన్ పోలీస్ స్టేషన్ లాకప్‌లో మరణించిన సాంబయ్య కేసు విచారణను ... (ఆం భూ. 11.5 89)

**లాకప్ మరణం** వి. *laakap maraNam* నిందితులు పోలీసు నిర్బంధంలో ఉన్నప్పుడు చనిపోవటం lockup death వీరవాసరం పోలీస్ స్టేషన్‌లో మళ్ళీ ఒక లాకప్ మరణం జరిగినట్టు తెలియ వచ్చింది. (ఉ. 29.7 87)

**లాకౌట్** వి. *laakauT* సమ్మెలు జరిగినప్పుడు యాజమాన్యం కర్మాగారాన్ని మూసివేసి కార్మికులను లోపలికి అనుమతించకపోవటం lockout ఇసిఐఎల్‌లో లాకౌట్ తక్షణం ఎత్తి వేయాలని, కార్మికులకు వేతనాలు చెల్లించాలని ... డిమాండ్ చేసింది. (ఆం భూ 6 7 89)

**లాక్కుపోవు** వి. *laakkupoovu* బలవంతంగా తీసుకొనిపోవు to snatch, take forcibly ప్రజలకు ఇచ్చిన ఆయుధాలను నక్సలైట్లు దాడిచేసి లాక్కుపోతే ఎలా అంటే నక్సలైట్లను ఎదుర్కోడానికే గదా ఆయుధాల లైసెన్సులు అని ఆయన అడిగారు. (ఆం భూ 20.4.89)

**లాగు** క్రి. *laagu* ఇష్టంలేకున్నా ఒక కార్యక్రమంలోకి దించు to drag ప్రముఖ తెలుగు సినీనటుడు అక్కినేని నాగేశ్వరరావును క్రియాశీలక రాజకీయాల్లోకి లాగాలని కాంగ్రెస్(ఐ) పార్టీ ప్రయత్నిస్తోందా? (ఆం. ప్ర 5.12.87)

**లాఠీచార్జీ** వి. *laaThiicaarjii* అదుపు తప్పిన ప్రజానీకాన్ని నియంత్రించేందుకు పోలీసులు చేతికర్రలతో మోదటం cane charge ప్రజలు ప్రెస్ గ్యాలరీలోకి చొచ్చుకొని రావడంతో లాఠీచార్జీ చేశారు. (ఆం ప్ర 2 7.87)

**లాఠీప్రయోగం** వి. *laaThiiprayoogam* చూ. లాఠీచార్జీ. ... ఎస్. ఎఫ్. ఐ. విద్యార్థులపై విశ్వ విద్యాలయ ఆవరణలో నేటి ఉదయం పోలీసులు లాఠీప్రయోగం జరిపారు. (ఆం ప్ర 19 7.89)

**లాబీ** వి. *laabii* 1. చట్టసభల సభ్యులు తమలో తాముగానీ, ప్రజలతో గాని ముచ్చటించటానికి ఉద్దేశించిన చట్టసభా ప్రాంగణం lobby తాము ఎటువంటి వినతి పత్రాన్ని సమర్పించలేదని మంత్రి శ్రీ బాబూఖాన్, తెలుగుదేశం నాయకుడు శ్రీ బేగ్ శాసనసభ లాబీలో విలేఖరులకు చెప్పారు. (ఆం. ప్ర. 20.9 89) 2. కొన్ని ప్రయోజనాలకోసం రాజకీయ నాయకులపై ఒత్తిడి తెచ్చే పలుకుబడిగల బృందం lobby పలుకుబడిగల భవన నిర్మాతల లాబీ ఒత్తిళ్ళకు లొంగి ప్రభుత్వం మోడక్ సిఫార్సులను నీరుగార్చింది. (ఈ. 1.7.87)

**లాభంపొందు** క్రి. *laabhampondu* ప్రయోజనం చేకూర్చుకొను to take advantage రాష్ట్రపతి పదవికి రెండో సారి పోటీ చేస్తే *30, 40* లక్షల దాకా ఖర్చు పెట్టడానికి కొందరు సిద్ధమైనట్టు తాను వెల్లడించిన అంశాన్ని అడ్డుపెట్టుకొని ప్రభుత్వం లాభం పొందాలనుకుంటే అను మతించనని మాజీ రాష్ట్రపతి శ్రీ జైల్ సింగ్ ప్రకటించారు. (ఆం. భూ 7.3 88)

**లాభపడు** క్రి. *laabhapaDu* ఆర్థిక పరమైన ప్రయోజనం చేకూరు to gain ఆహార ధాన్యాల ధరలను పెంచడంవల్ల ధనిక రైతులు మాత్రమే లాభపడి, పేదలు భూమిలేనివారు తీవ్రంగా నష్టపోరా? (ఆం ప్ర 15.10.87)

**లాలూచిపడు** క్రి. *laaluucipaDu* నీతి నియమాలకు విరుద్ధంగా రహస్యంగా అవగాహనకు వచ్చు to have an understanding, collude పంజాబ్ టెర్రరిస్టులతో పాకిస్తాన్ లాలూ చిపడి వారికి సహాయపడిందని ... చెప్పారు. (ఆం. ప్ర 20.4 88)

**లావాదేవీ** వి. *laavaadeevii* (వ్యా పార లేదా ఆర్థికపరమైన) బేరసారాలు transaction, deal లింస్సెట్ క్రిమి సంహారక మందు లావాదేవీలో కొందరు తెలుగుదేశం పార్టీ పార్లమెంట్ సభ్యులకు ముడుపులు ముట్టాయన్న విషయం స్పష్టం చేశారు. (ఆం. భూ. 3.2.89)

**లింగనిర్ధారణ పరీక్ష** వి. *linganird-haaraNa pariikSa* గర్భంలో ఉన్న శిశువు ఆడో, మగో తేల్చి చెప్పే వైద్య పరీక్ష omniosynthesis (a test to decide the sex of the child in the womb) గర్భస్థ శిశువు ఆడో మగో తెలుసుకొనేందుకు ఉద్దేశించిన లింగ నిర్ధారణ పరీక్షలు ఆడ శిశువులను పిండ దశలోనే హత్య చేసేందుకు ఉపయోగపడు తున్నాయని ... తేలింది. (ఆం. జ్యో. 4 10 89)

**లిక్కర్** వి. *likkar* మత్తు పానీయం; మద్యం liquor ఇక్కడ రోజూ *60* ట్యాంకర్ల నుండి నీటిని వివిధ ఫ్యాక్టరీలకు ముఖ్యంగా లిక్కర్ తయారు చేసే కంపెనీలకు అమ్ముతున్నా రని ... (ఉ. 29 6.87)

**లిఖితపూర్వక ఆదేశం** వి. *likhitapuur-vaka aadeeśam* (మౌఖికం కాకుండా) రాత రూపంలో ఉన్న ఉత్తర్వు written order రాష్ట్రపతి నుంచి లిఖితపూర్వక ఆదేశాలు అందిన తర్వాతనే ... (ఈ. 25.11 89)

**లిఖితపూర్వకం** వి. *likhitapuurvakam* ఒక విషయాన్ని రాత రూపంలో ఇవ్వటం; sth given in writing మధ్యవర్తులు లేరని బోఫోర్స్ ప్రభుత్వానికి మళ్ళీ లిఖిత పూర్వకంగా తెలియజేసింది. (ఆం. ప్ర. 6 6 87)

**లిటిగేషన్** వి. *liTigeeSan* పరిష్కారం కోసం కోర్టు ముందుకు వచ్చిన వివాదాస్ప దమైన విషయం; వ్యాజ్యం litigation ప్రస్తుతం అరవై లక్షల మంది పన్ను చెల్లిం పుదారులు ఉన్నారని, ఏటా కోర్టులకు ఆరు వేల లిటిగేషన్లు వస్తుంటాయని అన్నారు. (ఈ. 6 6.87)

**లిఫ్ట్ ఇరిగేషన్** వి. *lifT irigeeSan* నదులు, జలాశయాల నుంచి నీటిని బల మైన మోటారు పంపుసెట్ల ద్వారా పంట పొలాలకు సరఫరా చేసే పథకం; ఎత్తి పోతల పథకం lift irrigation నేరడి వద్ద వంశధారకు లిఫ్ట్ ఇరిగేషన్ పథకం మంజూరైందని, దీనికి ప్రభుత్వం హైడ్రాలిక్ క్లియరెన్స్ ఇస్తే సుమారు *400* ఎకరాలకు నీరందుతుందని .. (ఆం. భూ 20.5.89)

లిబరేషన్ టైగర్లు వి. *libereeSan Taigarlu* శ్రీలంకలో తమిళులకు ప్రత్యేక దేశం కావాలని కోరుతూ సాయుధ పోరాటం జరిపే ఒక తీవ్ర వాద తమిళ బృందం (ఎల్.టి.టి.ఇ) Liberation Tigers of Tamil Ealam (L.T.T.E), an armed Tamil group fighting for a sovereign state for Tamilians in Sri Lanka *శ్రీలంక ఉత్తర ప్రాంతంలో రెండు తమిళ గెరిల్లా వర్గాల మధ్య గల కలహాల వల్ల ముగ్గురు లిబరేషన్ టైగర్లు మరణించారు.* (ఆం. భూ. 6.9 89)

లీక్‌చేయు క్రి. *liikceeyu* అధికారపరమైన రహస్య సమాచారాన్ని అక్రమ పద్ధతిలో బయటపెట్టు to leak *సి. ఎ. జి. నివేదికను పార్లమెంట్‌లో ప్రవేశపెట్టక ముందే కాంగ్రెస్(ఐ) ఎం. పి. లకు దాన్ని లీక్‌చేశారని స్పష్టంగా తెలుస్తోంది.* (ఆం. ప్ర. 27.7 89)

లీకేజీ వి. *liikeejii* అధికారపరమైన రహస్య సమాచారం అక్రమ పద్ధతిలో వెల్లడికావటం leakage (of information) *పరీక్షా పత్రాల లీకేజీ వల్ల కూడా నిజంగా చదివిన విద్యార్థులు నష్టపోయారని ఆయన అన్నారు.* (ఆం భూ 6.6 87)

లీగల్ టైమ్ వి. *liigal Taim* వ్యక్తులు, సంస్థలు (ఉదా. తీవ్రవాదులు) నిషేధాలు లేకుండా చట్టబద్ధంగా వ్యవహరించటానికి అవకాశం కలిగిన సమయం legal time (a period during which individuals, organisations (as radicals) are allowed to function legally without any ban) *జిల్లాలో లొంగి పోయినట్లుగా ప్రకటించిన శ్రీ రామస్వామి అనే విద్యార్థి కేవలం లీగల్ టైమ్‌లో అనగా 1984 నుండి 86 మధ్య కాలంలో 'రాడికల్ విద్యార్థి సంఘం' సానుభూతిపరుడని ...* (ఆం. ప్ర 19.7.87)

లీజు వి. *liiju* ఇతరుల ఆస్తిని నిర్ణీతకాలం పాటు కౌలుకి లేదా అద్దెకి తీసుకోవటం lease *ఈ సంస్థలు ఏ రకంగా లీజు ఒప్పందాన్ని ఉల్లంఘించారని ప్రశ్నించగా, అవి రెండు విధాలుగా లీజు ఒప్పందాన్ని ఉల్లంఘించినట్లు ఆమె తెలిపారు.* (ఆం. ప్ర. 20.4.88)

లీడ్ బ్యాంక్ వి. *liiD byaank* సాలుసరి సుమారు 200 కోట్ల రూపాయల లావాదేవీ కలిగిన ప్రముఖమైన బ్యాంకు lead bank *ఈ విషయంలో గతంలో జారీ చేసిన ఆదేశిక సూత్రాలను పాటించాలని రిజర్వ్ బ్యాంక్ లీడ్ బ్యాంక్‌లను కోరింది.* (ఆం. ప 20.9 87)

లీప్ సెకండ్ వి. *liip sekanD* భూభ్రమణ కాలంతో అన్వయించెందేట్టుగా కాలగమనం లెక్కింపులో అదనంగా చేర్చిన లేదా తగ్గించిన ఒక్క క్షణకాలం leap second *సంవత్సరాన్ని సెకను పెంచే "లీప్ సెకండ్".* (ఆం ప 5.10.87)

లీల వి. *liila* అసాధారణం, ఆశ్చర్యకరం అయిన పని (వ్యంగ్యం) miracle *ఎస్. ఎస్. సి. బోర్డు లీలలు.* (ఆం. ప. 17.10.87)

లుకలుకలాడు క్రి. *lukalukalaaDu* సమస్యలతో నిండి ఉండు to be full of (problems, squables etc.) *విభేదాలు, వైషమ్యాలతో లుకలుకలాడుతున్న కాంగ్రెస్(ఐ) ఆయన సారథ్యంలో ఏ మేరకు*

పురోగమిస్తుందన్నది మున్ముందుగాని స్పష్టం కాదు. (ఈ. 4.5.89)

**లూటీ** వి. *luuTii* పెద్ద ఎత్తున దోచుకోవటం; దోపిడీ looting *ఆంధ్రప్రదేశ్ తూర్పు గోదావరి జిల్లా ద్రాక్షారామంలోని ప్రసిద్ధ భీమేశ్వర స్వామి దేవాలయం నుంచి ఆభరణాలు లూటీ జరిగినట్టు పోలీసులు తెలిపారు.* (ఉ. 13.10.87)

**లూటీచేయు** క్రి. *luuTiiceeyu* పెద్ద ఎత్తున దోచుకొను to loot *డిశంబర్‌లో నాగసముద్రాల క్రాసింగ్ వద్ద హైద్రాబాద్ నుండి వస్తున్న ఎరువుల లారీని లూటీచేసి నక్సలైట్లు ప్రజలకు పంచిపెట్టారు.* (ఆం. భూ. 11.7.89)

**లెక్కలుచెప్పు** క్రి. *lekkaluceppu* ఆదాయ వ్యయాలను వెల్లడించు to make the accounts public *కాంగ్రెస్ పార్టీ ఏనాడైనా లెక్కలు చెప్పిందా? ఎక్కడ నుంచి డబ్బు తెచ్చారు? ఎలా ఖర్చు చేస్తున్నారు అన్నది కాంగ్రెసువారు చెప్పగలరా?* (ఆం. జ్యో. 22.10.87)

**లెక్కింపు సరళి** వి. *lekkimpu saraLi* ఎన్నికల సందర్భంలో ఓట్లను లెక్కవేసే క్రమంలో వివిధ పార్టీల బలాబలాలను సూచించే ధోరణి counting trend (in elections) *ఫలితాలు ప్రకటించని ఇతర స్థానాల్లో కూడా కాంగ్రెస్(ఐ) అభ్యర్థులు ఆధిక్యతతో ఉన్నట్లు ఓట్లు లెక్కింపు సరళిని బట్టి తెలుస్తోంది.* (ఆం. జ్యో. 21.11.87)

**లెఫ్టిస్ట్** వి. *lefTisT* మార్క్సిస్ట్ దృక్పథంతో సమసమాజాన్ని ఆకాంక్షించే వ్యక్తి ; వామపక్షవాది leftist *ఎన్టీఆర్ ఏ రకం లెఫ్టిస్ట్?* (ఉ. 26.6.87)

**లెవీ** వి. *levii* ఉత్పత్తిలో కొంత భాగాన్ని నిర్ణీత ధరకు స్వేచ్ఛా విపణిలో కాకుండా ప్రభుత్వానికి అమ్మటం levy *లెవీ బియ్యం సేకరణకై మిల్లర్లకు లక్ష్యాలను నిర్ణయించటానికి ... మంత్రివర్గ ఉపసంఘం మిల్లర్లతో ...* (ఆం. ప్ర. 4.10.88)

**లేఆఫ్** వి. *leeaaf* తగినంత పనిలేనప్పుడు యాజమాన్యం కార్మికులను తాత్కాలికంగా పనినుంచి తొలగించటం layoff *హెచ్. ఎం. టి. ల్యాంప్స్ విభాగంలో విద్యుచ్ఛక్తి కోత సాకుతో మే నెల ఐదవ తేదీన లేఆఫ్ విధించారు.* (ఆం. ప్ర. 20.6.87)

**లేవదీయు** క్రి. *leevadiiyu* (సమస్య, వివాదం మొ.) సృష్టించు; రేకెత్తించు to cause (a controversy, problem etc.) *ఆంధ్ర ప్రదేశ్ శాసన సభ స్పీకర్ శ్రీ జి. నారాయణరావు ప్రభుతులకు నోటీసులు జారీ చేయటం రాష్ట్ర శాసన సభకు, న్యాయ స్థానానికీ మధ్య పెద్ద వివాదాన్ని లేవదీసింది.* (ఆం. ప్ర. 1.5.89)

**లేవనెత్తు** క్రి. *leevanettu* ప్రాముఖ్యం కలిగిన అంశాలను సభ దృష్టికి తెచ్చు; ప్రస్తావించు to raise (an issue) *లోక్‌సభలో జీరో అవర్‌లో దండావతే ఈ సమస్యలను లేవనెత్తారు.* (ఆం. ప్ర. 19.4.88)

**లైక్‌మైండెడ్** విశ. *laikmainDeD* ఒకే విధమైన భావాలు, అభిప్రాయాలు కలిగి ఉన్న likeminded *పలువురు లైక్‌మైండెడ్ శాసన సభ్యులు బయటి వారు లేని సందర్భాలలో చర్చించుకునే అంశాలలో తెలుగు దేశం నాయకులపై వస్తున్న ఆరోపణలే ప్రధానంగా ఉంటున్నాయి.* (ఉ. 21.11.87)

**లైజాన్ అధికారి** వి. *laijaan adhikaari* వివిధ విభాగాల మధ్య కార్యక్రమాలను సమన్వయంచేసే ఉద్యోగి liaison officer ప్రభుత్వ రంగ సంస్థలలో లైజాన్ అధికారుల అవసరం లేదని, వారిని పోషించటం ప్రజా ధనాన్ని దుర్వినియోగం చేయటమేనని ... (ఆం. ప్ర 23.6 87)

**లొంగదీసుకును** క్రి. *longadiisukunu* బలవంతంగా తమ అదుపులోకి తీసుకును to overpower ఈ పడవను స్వాధీనం చేసుకున్న తర్వాత లొంగదీసుకున్న కిరాయి సైనికులను, వారి నిర్బంధం నుంచి విడిపించిన మాల్దీవుల పౌరులను, భారత కమెండోలు ఐ. ఎస్. ఎఫ్. గోదావరి నౌకలోకి తరలించారు. (ఆం. జ్యో 8.11 88)

**లొంగిపోవు** క్రి. *longipoovu* తమంత తాముగా అధికారుల వశమైపోవు to surrender పార్టీ సిద్ధాంతం మంచిదయినా ఆచరణలో లొసుగుల కారణంగా నిరసన చెంది తాను లొంగిపోతున్నట్లు గురు వారంనాడు ... తెలిపాడు. (ఈ. 28 7 89)

**లొసుగు** వి. *losugu* ఏదైనా పని, నిర్మాణం మొ. వాటిలో ఉండే లోటుపాటు; లోపం defect ప్రస్తుత ఎన్నికల విధానంలోని లొసుగులపట్ల ఆందోళన వ్యక్తం చేస్తూ పరిస్థితిని చక్కదిద్దటానికి భవిష్యత్తులో కొత్త చర్యలు తీసుకుంటామని చెప్పారు. (ఈ. 12.5.89)

**లోక్ అదాలత్** వి. *look adaalat* న్యాయమూర్తి మధ్యవర్తిత్వం ద్వారా కోర్టు లిటిగేషన్ లేకుండా తగాదాలను పరిష్కరించే న్యాయ వ్యవస్థ; న్యాయ పంచాయతీ Lok Adalat (a system of dispensing legal justice avoiding prolonged and expensive litigation) చట్టపరమైన వివాదాల్ని న్యాయస్థానానికి వెలుపల మధ్యవర్తిత్వం ద్వారా, చర్చల ద్వారా పరిష్కరించడం కోసం మానవతా దృక్పథంతో ఏర్పరచినవే లోక్ అదాలత్‌లు. (ఉ 15 6.87)

**లోక్‌సభ** వి. *looksabha* భారత పార్లమెంటులో ప్రత్యక్షంగా ఎన్నికైన ప్రజాప్రతినిధులతో కూడిన దిగువ సభ Lok sabha (the lower house of the parliament ఎంతో కాలంగా ఎదురు చూస్తున్న అలహాబాద్ లోకసభ స్థానం ఎన్నిక కార్యక్రమాన్ని ఎన్నికల సంఘం ప్రకటించటంతో ... (ఆం. ప్ర. 20.4 88)

**లోకస్ స్టాండి** వి. *lookas sTaanDi* ఏదైనా ఒక విషయంలో జోక్యం చేసుకునే హక్కు locus standi ముఖ్యమంత్రి శ్రీ ఎన్టీ రామారావుకు వ్యతిరేకంగా దాఖలైన రిట్ పిటిషన్ల విషయంలో 'లోకస్ స్టాండి' (జోక్యం చేసుకునే హక్కు) గురించి పునరాలోచన జరపడానికి ... (ఆం. ప్ర. 18.12.87)

**లోకాయుక్త** వి. *lookaayukta* ప్రభుత్వ అధికారులపైనా, ప్రజా ప్రతినిధులపైనా వచ్చే ఆరోపణలపై నిజానిజాలను విచారించి ప్రభుత్వానికి తన నిర్ణయాలను తెలియజేసే న్యాయాధికారి Lok Ayukta, ombudsman ముఖ్యమంత్రి పదవిలో ఉన్న వ్యక్తిపై వచ్చే అవినీతి ఆరోపణలను విచారించే అధికారాన్ని సైతం లోకాయుక్త పరిధిలోనికి తీసుకొని వచ్చే ... (ఈ. 10 9.89)

**లోటు** వి. *looTu* ఆదాయం కంటె వ్యయం ఎక్కువగా ఉండటంవల్ల కలిగే కొరత deficit అయిదేళ్ళ క్రితం వరకూ దక్షిణ కొరియా ఋణభారం క్రింద నలిగిపోయింది. విదేశీ వాణిజ్యంలో లోటు విపరీతంగా ఉండేది. (ఆం. ప్ర 4.5.89)

**లోటుదారీ ద్రవ్యవిధానం** వి. *looTu daarii dravyavidhaanam* బడ్జెట్‌లో ప్రయత్న పూర్వకంగా లోటుని కల్పించి బయటినుంచి అప్పులు తీసుకోవడం ద్వారా దాన్ని భర్తీచేసే పద్ధతి deficit financing ... ఈ మొత్తాన్ని లోటు దారీ ద్రవ్యవిధానం ద్వారా సమకూర్చుకొన్నా ప్రమాదమేమీ ఉండదని కొందరు ఆర్థిక నిపుణుల అభిప్రాయం. (ఆం ప 20.9.87)

**లోతట్టు** విశ. *lootaTTu* 1 ప్రధాన రహదారి నుంచి దూరంగా ఉన్న, మారు మూల interior అయితే అడ్డతీగలలో సబ్‌కలెక్టర్ ఉండిపోయి సిబ్బందిని మాత్రం లోతట్టు గ్రామాలకు పంపారని తెలియ వచ్చింది. (ఉ. 28.1.88) 2. పల్లపు low-lying పాపాగ్నినది కూడా పొంగ డంతో లోతట్టు ప్రాంతాలలోని గ్రామాలన్నీ జలమయమయ్యాయి (ఆం ప్ర. 18.7.89)

**లోపాయికారీగా** క్రి విశ *loopaayikaari-igaa* పైకి తెలియకుండా రహస్యంగా; గోప్యంగా clandestinely కొందరు ప్రతిపక్షనాయకులు ఉగ్రవాదులకు లోపాయ కారీగా ప్రోత్సాహమిస్తున్నారని ఆయన ఆరో పించారు. (ఈ 20.7.89)

**లోబడి వ్యవహరించు** క్రి. *loobaDi vyavaharincu* (చట్టాలు, నియమ నిబం ధనలు మొ. వాటికి) అనుగుణంగా నడచుకొను to comply ఒప్పందంలో శ్రీ చద్దా మధ్యవర్తి కాదని ఈ విషయంలో తమ సంస్థ భారత దేశం విధించిన షర తులకు లోబడి వ్యవహరించిందని వారు పేర్కొన్నారు. (ఆం. జ్యో 19.9.87)

**లోబరుచుకొను** క్రి. *loobarucukonu* వశపరుచుకొను to control తనను నయాన లోబరుచుకోలేకపోయిన ముఖ్య మంత్రి భయాన లొంగదీసుకోడానికి కాంగ్రెస్(ఐ) కార్యకర్తలను తనమీదికి ఉసి గొల్పాడని ... ఆరోపణ. (ఉ 27.11.87)

**లౌకిక రాజ్యం** వి. *laukika raajyam* ఏ ఒక్క మతానికి సంబంధించని, మతా తీతమైన secular state ఇండియా లౌకిక రాజ్యంగా ఉన్నంత కాలం మతానికి, జాతీయతకు మధ్య సంఘర్షణకు తావే లేదని ఆయన వ్యాఖ్యానించారు. (ఆం ప్ర. 9.7.89)

## వ

**వంగడం** వి. *vangaDam* (పంటలలో) ప్రత్యేకంగా అభివృద్ధి చేసిన రకం breed త్వరలో తెగుళ్ళను తట్టుకొనే నిరోధక శక్తి అధికంగా ఉన్న ప్రత్తి వంగడాలను రూపొం దించబోతున్నట్లు కూడా వారు తెలియజే శారు. (ఆం భూ 3.5.89)

**వంతపాడు** క్రి. *vantapaaDu* (విచ క్షణా జ్ఞానం ఉపయోగించకుండా) ఇత రుల పనులకు, అభిప్రాయాలకు మద్ద తుగా మాట్లాడు to support (indes criminately sb's action or opinion) కొందరు ప్రతిపక్ష నాయకులు 'ఖలిస్తాన్'కు పంజాబ్‌లో ఉగ్రవాదానికి వంత పాడుతున్నారు. (ఆం భూ. 29.6.89)

**వందన సమర్పణ** వి. *vandana samarpaNa* సభానంతరం కార్యక్రమ నిర్వహణలో సహకారం అందించినవారం దరికీ కృతజ్ఞతలు చెప్పటం vote of thanks సభానంతరం సి. హెచ్. స్పోర్ట్స్ డైరెక్టర్ ఎల్. వెంకట్రామ్‌రెడ్డి వందన సమర్పణ చేశారు. (ఈ 5.6.89)

**వంధ్యత్వం** వి. *vandhatvam* సంతానం లేకపోవటం barrenness వంధ్యత్వా నికి ఖచ్చితమైన కారణాలను తెలుసుకుని నివారణోపాయాలను కనిపెట్టేందుకు ఈ

పరిశోధనలు దోహదపడగలవని భావిస్తున్నట్టు శాస్త్రవేత్తల బృందం నాయకుడు డా. ఎస్. శివాజీ తెలిపారు. (ఆం భూ 26 11 87)

**వక్ఫ్ బోర్డు** వి. *vakf boorDu* ఇస్లాం మత సంస్థల ధర్మాదాయ వ్యవహారాలు చూసే మండలి wakf board (a body which manages the religious affairs of Muslims) మసీదులు మరమ్మతులు చేయడానికి శ్మశానాల ప్రహరీ గోడలు కట్టడానికి వక్ఫ్ బోర్డుకు *20* లక్షల రూపాయల సహాయం అందజేసి నందుకు ముఖ్యమంత్రికి మంత్రి కృతజ్ఞతలు తెలిపారు. (ఆం. భూ 26 4 89)

**వక్రభాష్యం** వి. *vakrabhaaSyam* వాస్తవానికి విరుద్ధంగా వ్యాఖ్యానించటం; తప్పుడు వ్యాఖ్యానం misinterpretation "స్వతంత్ర భారత చరిత్రలో ఈ కొత్త బిల్లును పదవ మైలురాయి"గా పేర్కొనడం చరిత్రకు వక్రభాష్యం తప్ప మరొకటి కాదు. (ఆం. భూ 12 5 89)

**వక్కాణించు** క్రి. *vakkaaNincu* (విషయం) నొక్కిచెప్పు to stress శ్రీ తివారి ప్రభుత్వం సాధించిన విజయాలను ప్రజలకు తెలియ చేయవలసిన ఆవశ్యకతను వక్కాణించారు. (ఆం. ప్ర. 11 5 89)

**వక్తృత్వ సామర్థ్యం** వి. *vaktRtva saamarthyam* చక్కగా ధాటిగా మాట్లాడే నైపుణ్యం oratory power కాంగ్రెస్-ఐ పెద్ద యెత్తున చేయనున్న దాడిని ఎదుర్కొనడానికి తమ వక్తృత్వ సామర్థ్యాన్ని అసెంబ్లీ నియమ నిబంధనల విషయంలో తమ పరిజ్ఞానాన్ని మెరుగుపరచుకునేందుకు ... సభ్యులు ... విస్తృత స్థాయిలో సంప్రదింపులు జరుపుతున్నారు. (ఆం ప్ర. 11 12 87)

**వక్రీకరించు** క్రి. *vakriikarincu* (విషయాన్ని) తప్పుగా చిత్రించు to misinterpret ఇరాన్‌కు నౌకా విధ్వంసక "సిల్క్ వామ్ మిస్సైలీ"లను తాము విక్రయించినట్లు అమెరికా చేస్తున్న ప్రకటనను చైనా ఖండించింది. అటువంటి వార్తలు ఇరాన్-ఇరాక్ యుద్ధంలో చైనా వైఖరిని వక్రీకరించేవిగా ఉన్నాయని విదేశీయ శాఖ ప్రతినిధి చెప్పారు. (వి. 20 6 87)

**వత్తాసు** వి *vattaasu* ఇతరుల మాటలకు, ప్రవర్తనకు ఇచ్చే మద్దతు support జనతాదళ్ సభ్యులు వ్యతిరేక కేకలు వేయగా, వారికి బి జె.పి., సి.పి.ఎం., సి.పి ఐ., డి.ఎం కె. సభ్యులు వత్తాసు పలికారు. (ఆం. భూ. 22 12 89)

**వత్తిడితెచ్చు** క్రి. *vattiDiteccu* (ఒక పని చేయాల్సిందిగా) బలవంతపెట్టు to bring pressure (on sb) స్విస్ బ్యాంకులలోని బోఫోర్స్ ఖాతాలను సమగ్ర ఆడిట్ చేయవలసిందిగా స్వీడన్ ప్రభుత్వంపై వత్తిడి తీసుకురావాలని ... (వి. 8 6.87)

**వదంతి** వి. *vadanti* (స్పష్టమైన సాక్ష్యాధారాలులేనప్పటికీ) ఒక సంఘటన జరిగినట్లు లేదా జరగబోతున్నట్లు వ్యాపించే వార్త; పుకారు rumour అబద్ధాలతో కూడుకున్న నిరాధారమైన వదంతులను ఒక పథకం ప్రకారం ప్రచారం చేస్తున్నారు. (ఆం. ప్ర 6 6 87)

**వన్‌డే క్రికెట్** వి. *vanDee krikeT* పరిమిత ఓవర్లతో ఒక రోజు మాత్రమే ఆడే క్రికెట్ ఆట one-day cricket విమర్శకుల నోళ్ళు మూయించడానికి 'వన్‌డే క్రికెట్' వచ్చింది. (ఆం ప్ర 8 10 87)

**వనమహోత్సవం** వి *vanamahootsavam* అటవీ శాఖ వారు ఏటా నిర్వహించే వేడుక vanamahotsav

(planting of trees by the forest department on particular occasions) వనమహోత్సం సందర్భంగా ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావు మొక్కను నాటిన దృశ్యం. (ఉ. 8.7.87)

**వన్నెతెచ్చు** క్రి. *vanneteccu* సామర్థ్యం మెరుగుపరచు to bring credit ... ఇందువల్ల శ్రీ వెంగళరావు తన మంత్రిత్వ శాఖకు మరింత వన్నెతేవడానికి ... వీలుక లుగుతుందని అధిష్ఠాన వర్గం ఆలోచిస్తోంది. (ఆం. జ్యో. 4.3.88)

**వమ్ముచేయు** క్రి. *vammuceeyu* (ప్రయత్నం) సఫలం కాకుండా చేయు to foil నగర శివారు ప్రాంతంలో శుక్రవారం రాత్రి ఒక పెట్రోల్ బంక్‌ను, కోళ్ళ ఫారాన్ని దోచుకునేందుకై బందిపోటు దొంగలు చేసిన యత్నాలను పోలీసులు వమ్ముచేశారు. (ఆం. భూ. 4.6.89)

**వయోజన విద్య** వి. *vayoojana vidya* చదువురాని పెద్దలకు చదువు నేర్పడం adult education వయోజన విద్యా సూపర్ వైజర్ల ఉద్యోగాలు అస్మదీయులకే ఇవ్వవలసిందిగా కోరుతూ రాష్ట్ర విద్యా శాఖ మంత్రి సంబంధిత అధికారులకు రాసిన లేఖ బయటపడింది. (ఉ. 6.4.88)

**వయోపరిమితి** వి. *vayooparimiti* ఉద్యోగార్హతలలో వయసుకి సంబంధించిన హద్దు age limit ప్రస్తుతం రాష్ట్ర ఏ.పి.పి. యస్.సి పరీక్షలు వ్రాయడానికిగాను గరిష్ట వయోపరిమితిని 34 నుంచి 28 సంవత్సరాలకు తగ్గించటం పట్ల వేలాది యువకులు, ఉద్యోగ అవకాశం కోల్పోతారనీ ... (ఆం. ప్ర. 16.8.87)

**వర్క్‌షాప్** వి. *varkSaap* శిక్షణకోసం నియమిత కాలంపాటు ఏర్పాటు చేసే శిబిరం workshop మండలాధ్యక్షులకు ఇటీవల రెండురోజులపాటు నిర్వహించిన వర్క్‌షాప్ ముగింపు సమావేశంలో జిల్లా కలెక్టర్ ప్రసంగించారు. (ఆం. భూ. 6.6.87)

**వర్కింగ్ కమిటీ** వి. *varking kami-Tii* వివిధ కార్యక్రమాలను నిర్వహించటానికి ఏర్పాటయ్యే సంఘం; కార్య నిర్వాహక సంఘం working committee ఎ.ఐ.సి.సి సమావేశానికి ముందే పార్టీ వర్కింగ్ కమిటీ సమావేశమై ఎఐసిసి సదస్సులో ఆమోదించాల్సిన తీర్మానాన్ని తయారు చేస్తుంది. (ఈ. 6.7.89)

**వర్గ పోరాటం** వి. *varga pooraaTam* పెట్టుబడిదారులు, బడా భూస్వాముల దోపిడీకి వ్యతిరేకంగా కార్మికులు, కర్షకులు చేసే పోరు class struggle చైనా విప్లవం, వర్గ పోరాటాలతో పెనవేసుకుపోయిన మహానగరం షాంఘై అని ఆయన అభివర్ణించారు. (ఈ. 19.5.89)

**వర్గీయులు** వి. (బ.వ.) *vargiiyulu* ఒక గ్రూపుకి లేదా పార్టీకి చెందిన వ్యక్తులు people belonging to a group or party ఇందిరా కాంగ్రెస్ వర్గీయులు నేరుగా కలెక్టర్‌కే ఫిర్యాదు చేయగా ఆయన నిస్సహాయత వ్యక్తం చేశారు. (ఈ. 29.6.87)

**వర్తమానం** వి. *vartamaanam* (విషయం, సంఘటన మొ. వాటి గురించి) ఇతరులకి వ్యక్తి ద్వారా పంపే సమాచారం message శ్రీ లంక విదేశాంగశాఖ కార్యదర్శి శ్రీ బెర్నార్డ్ తిలక్ రత్న సోమవారం న్యూఢిల్లీలో ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీని కలుసుకొని తమ అధ్యక్షుడు శ్రీ ఆర్ ప్రేమదాస పంపిన వర్తమానాన్ని అందజేశారు. (ఆం. భూ. 7.6.89)

**వర్తింపజేయు** క్రి. *vartimpajeeyu* (నియ

మాలు, నిర్ణయాలు మొ.) అన్వయింపజేయు to apply ముఖ్యమంత్రి ప్రకటించిన మేరకు కళాశాలల ఆధ్యాపకులకు సవరించిన యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ (యు.జి.సి) వేతనం స్కేళ్ళను వర్తింపజేస్తామని విద్యాశాఖ మంత్రి తెలిపారు (ఆం జ్యో. 8.12 88)

**వర్ధంతి** వి. *vardhanti* మరణించిన (ప్రముఖ) వ్యక్తి స్మృత్యర్థం ప్రతి సంవత్సరం ఆ వ్యక్తి చనిపోయిన రోజు జరిపే కార్యక్రమం death anniversary సురభి నాట్యమండలికి మూల పురుషుడైన స్వర్గీయ వనారస గోవిందరావు వర్ధంతి శనివారం సాయంత్రం త్యాగరాయ గానసభలో జరిగింది. (ఈ 22 12.87)

**వర్ధమాన దేశం** వి. *vardhamaana deeśam* వలస పాలన నుంచి విముక్తి పొంది, స్వయం సమృద్ధి వైపు పురోగమిస్తున్న దేశం developing country వర్ధమాన దేశాలు అనగా నూతనంగా స్వాతంత్ర్యం పొంది యిన్నాళ్ళుగా సామ్రాజ్యవాద, వలస దోపిడీకి గురై ఆర్థికంగా, పారిశ్రామికంగా వెనుకబడిపోయిన దేశాలు (వి. 10 6 87)

**వర్షపాతం** వి. *varSapaatam* నియమిత కాలంలో ఒక ప్రదేశంలో పడిన వాన పరిమాణం rain fall ఇప్పటివరకు ఉన్న వర్షపాతాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే దేశంలోని అనేక ప్రాంతాలలో అనావృష్టి పరిస్థితులున్నట్లు తెలుస్తుందని ... అన్నారు. (ఆం ప్ర 17.8 89)

**వర్షాకాల సమావేశం** వి. *varSaakaala samaaveeśam* ప్రభుత్వ కార్యకలాపాలు, ప్రజా సమస్యలు చర్చించటానికి చట్టసభలు వర్షాకాలంలో ఏర్పాటు చేసే సమావేశం monsoon session పదకొండు రోజులపాటు జరిగిన వర్షాకాల సమావేశాల అనంతరం ఆంధ్రప్రదేశ్ శాసనసభ సమావేశాలను నిరవధికంగా వాయిదా వేశారు. (ఆం ప్ర. 20.9 89)

**వలంటీరు** వి. *valanTiir* ఎలాంటి ప్రతిఫలం ఆశించకుండా సామాజిక, రాజకీయాది కార్యక్రమాల నిర్వహణలో తోడ్పడే వ్యక్తి volunteer సహాయ కార్యక్రమాలు చేపట్టేందుకుగాను వలంటీర్లను పంపేందుకు మదర్‌థెరిసా సంసిద్ధత వ్యక్తం చేశారని ... (ఈ 5 6 87)

**వలపన్ను** క్రి. *valapannu* (నేరస్థుల్ని పట్టుకోవటానికి) పథకం ప్రకారం ఏర్పాట్లు చేయు to lay trap నకిలీ నోట్ల మార్పిడి పేరుతో మోసం చేసే ఐదుగురు వ్యక్తుల ముఠా నొకదానిని పోలీసులు గతరాత్రి వలపన్ని పట్టు కొన్నారు. (ఈ. 5.10 87)

**వలస** వి *valasa* (మెరుగైన జీవనం కోసం) అధిక సంఖ్యలో ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి తరలివెళ్ళటం migration, exodus జాఫ్నా ద్వీపకల్పంలో సైన్యం దాడులవల్ల తమిళుల వలస కొనసాగుతున్నది. (ఆం ప్ర 16 6 87)

**వల్లించు** క్రి. *vallincu* (ప్రముఖ వ్యక్తులు లేదా గ్రంథాలలో చెప్పిన అభిప్రాయాలను) పదేపదే ఇతరులకు వినిపించు to invoke ఓట్లు అడగటానికి సూక్తులను వల్లిస్తూ తమను తాము సమర్థించుకుంటున్నారని విమర్శించారు. (ఆం. భూ 20 11 89)

**వశపరచుకొను** క్రి. *vaśaparacukonu* అధీనంలోకి తీసుకొను to seize ఆ మార్కెట్‌లోని చద్దా ఆఫీసులో దొరికిన డాక్యుమెంట్లను అధికారులు వశపరచుకున్నారు. (ఆం ప్ర 6 6 87)

**వసతిగృహం** వి. *vasatigRham* తాత్కాలి కంగా కొంతకాలం నివసించటానికి ఉద్దే శించిన ఇల్లు guest house, hostel *ఇక్కడ బాలబాలికల వసతిగృహ నిర్మాణము నకు గాను ... బైలర్స్‌కాలనీ పక్కనవున్న ...* (ఆం ప. 9 6 87)

**వసూలుచేయు** క్రి. *vasuuluceeyu* (డబ్బు) రాబట్టు to collect (money) *గణేశ్ నగర్ కాలనీలో అక్రమ నిర్మాణానికి నష్ట పరిహారంతో పాటు స్థలం ఖరీదును కూడా వసూలుచేయాలని కౌన్సి లర్ సూచించగా సమావేశం ఆమోదించింది.* (ఆం. భూ 7 10 87)

**వాకోవర్** వి. *vaakoovar* (ఆటల్లో) ఎదుటి పక్షం పోటీలో నుంచి తప్పుకున్న ఫలితంగా ఆడకుండానే లభించే గెలుపు walk-over *1974 ఫైనల్లో జాత్యహం కార దక్షిణాఫ్రికాతో ఆడేందుకు భారత్ నిరాకరించి వాకోవర్ ఇచ్చింది* (ఈ 5 10.87)

**వాకౌట్‌చేయు** క్రి. *vaakauTceeyu* నిర సనగా సమావేశం నుంచి బయటికి వెళ్ళి పోవు to walkout *స్పీకర్ అనుమతించ నప్పుడు సభలో ఇలా గందరగోళం చెలరేగడం ప్రతిపక్షం నిరసనగా వాకౌట్ చేయడం సర్వ సాధారణమే.* (ఆం ప్ర. 25 4 88)

**వాగ్దానం** వి. *vaagdaanam* (తప్ప కుండా చేస్తానని) మాట ఇవ్వటం; హామీ promise *ఇటీవల జరిగిన న్యూస్ సలహా సంఘం సమావేశంలో కూడా న్యూస్ ప్రింట్ అందుబాటు గురించి ప్రభుత్వం ఎలాంటి వాగ్దానం చెయ్యలేదు.*

**వాగ్వాదం** వి. *vaagvaadam* (ఇరుప క్షాలు) భిన్నాభిప్రాయాలతో గొంతు పెంచి తగాదా పడటం argument *ఎం.సి. హెచ్. కార్యాలయం ఎదుట 'ధర్నా'కు పోలీసులు నిరాకరించిన సందర్భంగా ఒక దశలో కార్మికులకు పోలీసులకు మధ్య కొంత వాగ్వాదం జరిగింది.* (ఆం ప్ర 16 6 87)

**వాఙ్మూలం** వి. *vaangmuulam* న్యాయ స్థానంలో చెప్పే సాక్ష్యం testimony *ఒక కేసుకు సంబంధించిన ఒక వ్యక్తి బోనులో నిలబడి తన వాఙ్మూలం ఇవ్వడం ప్రారంభిం చాడు.* (ఆం ప్ర 21.4 88)

**వాటర్‌గేట్ కుంభకోణం** వి. *vaaTar-geeT kumbhakoonam* 1972 లో రిప బ్లికన్ పార్టీ వ్యక్తులు కొందరు డెమోక్రటిక్ పార్టీ కేంద్ర కార్యాలయంనుంచి సమా చారం దొంగలించటంవంటి నేర కార్యక లాపాలకు పాల్పడిన ఫలితంగా ఏర్పడిన వివాదం watergate scandal *వాట ర్‌గేట్ కుంభకోణం వెల్లడించి నందువల్ల ఆనాటి అమెరికా అధ్యక్షుడు నిక్సన్ పద వీచ్యుతుడు కావడం తెలిసిందే.* (ఈ. 24 7 89)

**వాటాధనం** వి. *vaaTaadhanam* (పరిశ్ర మల్లో) తమ వంతుగా పెట్టిన పెట్టుబడి share capital *75 శాతం పైబడి ఎగు మతి చేయడానికి హామీ ఇచ్చే పక్షంలో విదేశీ పెట్టుబడులు సరాసరి అనుమతించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. విదేశీ సంస్థల వాటాధనం నిష్పత్తిలో మార్పు చేశారు* (ఆం ప్ర. 4.5 89)

**వాటిల్లు** క్రి. *vaaTillu* (నష్టం, కష్టం మొ.) సంభవించు, కలుగు to happen (as loss, damage etc.) *శివసేన-శక్తు లకు ఏ రకంగా ప్రోత్సాహమిచ్చినా దేశ ప్రజాస్వామిక, లౌకిక పునాదులకే ముప్పు వాటిల్లుతుందని హెచ్చరించింది* (ఈ. 15 6 89)

**వాడకందారు** వి. *vaaDakamdaaru* మార్కెట్‌లో ఉత్పత్తి అయ్యే సరుకుల్ని,

సంస్థలసేవల్ని ఉపయోగించుకొనే వ్యక్తి user ... ప్రస్తుతం పనిచేసే ఆటో ఎక్స్ఛేంజ్ సక్రమంగా పనిచేయడంలేదని దీని వల్ల టెలిఫోన్ వాడకందారులు తీవ్ర ఇబ్బం దులకు గురౌతున్నందున ... (ఉ. 24.4 88)

**వాణిజ్య ఉద్రిక్తత** వి. *vaaNijya udriktata* వర్తక సంబంధమైన వివాదాల ఫలి తంగా దేశాల మధ్య తలెత్తిన ఘర్షణ trade tension ఇండియా అమెరికాల మధ్య వాణిజ్య ఉద్రిక్తత నెలకొని ఉన్న ప్రస్తుత క్లిష్ట సమయంలో కరణ్‌సింగ్ అమె రికాలో రాయబారిగా నియమితులయ్యారు. (ఆం ప్ర 22 8 89)

**వాణిజ్య కార్యకలాపాలు** వి (బ.వ.) *vaaNijya kaaryakalaapaalu* వ్యాపార వ్యవహారాలు trade బంద్ రోజున కూడా వాణిజ్య కార్యకలాపాలు నిర్వహించవలసిం దిగా ప్రభుత్వాధికారులు అంతకుముందు వ్యాపారులకు నచ్చజెప్పారు. (ఈ 12.5 89)

**వాణిజ్య లోటు** వి. *vaaNijya looTu* ఎగుమతులు తగ్గి కనిపించే తేడా trade deficit వాణిజ్య లోటును భర్తీ చేయడా నికి రూపాయి విలువను తగ్గించాలని ఎవరు ఎన్ని విధాల వత్తిడి తెచ్చినా అంగీకరించే ప్రసక్తే లేదని ఆర్థికమంత్రి శ్రీ ఎన్.డి. తివారి స్పష్టం చేశారు. (ఆం. ప్ర 25 11 87)

**వాతావరణ కార్యాలయం** వి. *vaataavaraNa kaaryaalayam* శీతోష్ణస్థి తుల్ని తెలియజేసే విభాగ కేంద్రం office of the meteorological department తుఫాన్ ప్రభావంవల్ల రానున్న 48 గంటల్లో తెలంగాణా, రాయ లసీమ జిల్లాల్లో భారీవర్షాలు కురుస్తాయని ఇక్కడి వాతావరణ కార్యాలయం తెలియజే సింది. (ఆం జ్యో 17 10 87)

**వాదన** వి. *vaadana* (న్యాయస్థానంలో) తర్కబద్ధంగా చేసే అభిప్రాయ ప్రకటన arguement ఈ పిటీషన్ పై నేడు న్యాయవాది ఒకరు ప్రధాన న్యాయమూర్తి ఇ.ఎస్. వెంకటరామయ్య ముందు ప్రస్తా వించగా మంగళవారం రోజున వాదనలు వినేందుకు తేదీ ఖరారు చేశారు. (ఆం ప్ర. 22 9 89)

**వాదప్రతివాదనలు** వి. (బ.వ.) *vaadaprativaadanalu* (న్యాయ నిర్ణేతల ఎదుట) ఒక విషయంపై అనుకూలంగానూ, వ్యతి రేకంగాను జరిగే భాషణం hearing, arguments for and against గురువారంనాడు రోజంతా ఈ విషయమై వాద ప్రతివాదనలు కొనసాగిన తర్వాత ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ యోగేశ్వర్ దయాళ్ జోక్యం చేసుకుంటూ . . . (ఈ 30.6 89)

**వాదోపవాదాలు** వి. (బ.వ.) *vaadoopavadaalu* ఒక అంశంపై ఇరుపక్షాల మధ్య అభిప్రాయ భేదాలు ఏర్పడి తీవ్రస్థాయిలో జరిగే చర్చ arguments ఇదే అంశంపై రాజ్యసభలో కూడా బుధవారం తీవ్రస్థాయిలో వాదోపవాదాలు జరిగాయి (ఈ 20 7 89)

**వాపోవు** క్రి *vaapoovu* బాధ, ఆవేదనల్ని వ్యక్తంచేయు lament పోలీసులు తనను రెండు రోజుల పాటు పోలీసు స్టేషన్‌లో నిర్బంధించారనీ, యిన్ని కష్టాలుపడ్డా తన కూతురు కష్టాలు గట్టెక్కలేదని శ్రీ రాజయ్య వాపోయారు. (ఆం ప్ర 13 6 89)

**వామపక్షం** వి *vaamapakSam* మార్క్సిస్టు దృక్పథానికి కట్టుబడి రాజకీ యాలలో పాల్గొనే పార్టీ leftist party వామపక్షం అంటే భిక్షం పెట్టేది కాదు. పేద రికాన్ని, నిరుద్యోగాన్ని తొలగించి వ్యవస్థను మార్చేదని . .. అన్నారు. (వి 9 6 87)

**వామపక్ష ప్రజాస్వామ్యవాదులు** వి.

(బ.వ.) *vaamapakSa prajaasvaamyavaadulu* మార్క్సిస్టు దృక్పథానికి కట్టుబడినవారు, ప్రజాస్వామ్యాన్ని కాంక్షిం చేవారు left and democratic forces కాంగ్రెస్ పార్టీ వ్యతిరేకించే వామ పక్ష ప్రజాస్వామ్య వాదులను ఏకంచేసే బృహ త్తర బాధ్యత మార్క్సిస్టు పార్టీపై ఉన్నదని అన్నారు. (ఆం ప్ర. 11.10 85)

**వామపక్షవాది** వి. *vaamapakSavaadi* చూ. లెఫ్టిస్ట్. సామ్రాజ్యవాదులకు వ్యతి రేకంగా విదేశీ విధానం అనుసరించని వ్యక్తి భూసంస్కరణల అమలును తిరస్కరించే వ్యక్తి వామపక్షవాది ఎట్లా అవుతాడని ... ప్రశ్నిం చారు. (ఆం. ప 26 6.87)

**వాయిదా తీర్మానం** వి. *vaayidaatiirmaanam* (చట్టసభలలో) అజెండాలో ఉన్న అంశాలను పక్కనపెట్టి, అత్యంత ప్రాముఖ్యం ఉన్న మరో విషయాన్ని చర్చకు చేపట్టాలని కోరుతూ ప్రవేశపెట్టే తీర్మానం adjournment motion ఇటీవల జరిగిన కాంగ్రెస్(ఐ) శాసన సభ్యుడి హత్యపై ప్రతిపక్ష శాసన సభ్యుడు వాయిదా తీర్మానానికి పట్టు బట్టడంతో నేడు సభలో పెద్ద ఎత్తున రభస జరిగింది. (ఆం ప్ర 18 7 89)

**వాయిదావేయు** క్రి *vaayidaaveeyu* (పని, సమావేశం మొ.) అప్పటికి ఆపివేసి మరో గడువు నిర్ణయించు to postpone, adjourn నేడు జరగా ల్సిన పదవ తరగతి సాంఘిక శాస్త్రం రెండో పేపర్ పరీక్షను రాష్ట్ర ప్రభుత్వం వాయిదా వేసింది. (ఆం. ప్ర 13 4 88)

**వాయుగుండం** వి. *vaayugunDam* అల్ప పీడనం వల్ల సముద్రంలో ఏర్పడే ప్రచండ మైన సుడిగాలి cyclone విశాఖపట్నానికి 800 కి.మీ. దూరంలో ఆగ్నేయ దిశగా నేడు వాయుగుండం కేంద్రీకృతమై ఉన్నట్లు వాతా వరణ కార్యాలయం తెలియజేసింది. (ఆం ప్ర 18 11 88)

**వాయుదూత్** వి. *vaayuduut* దేశం లోని ముఖ్యమైన పట్టణాల మధ్య ప్రయాణీకులకోసం చిన్న విమానాలను తిప్పే సంస్థ Vayudoot (an Indian Airlines service that runs small passenger planes) మద్రాస్, తిరుపతి మధ్య వాయుదూత్ సర్వీస్ జూలై పదో తేదీ నుంచి ప్రారంభమ వుతున్నట్లు వాయుదూత్ మేనేజర్ కెప్టెన్ బి. ఎస్. డెమ్మాగ్రి తెలియజేశారు.(ఉ. 7.7.87)

**వార్‌జోన్** వి. *vaarjoon* పోరాటం జరు గుతున్న ప్రదేశం war zone ఇప్పటికీ 'పట్టు' సంపాదిస్తున్న గిరిజన గ్రామాన్ని 'వార్‌జోన్' కింద విభజించారు. (ఆం. ప్ర. 5 7.89)

**వారంటు** వి. *vaaranTu* నేరపరిశోధనలో భాగంగా వ్యక్తుల్ని అరెస్టు చేయటం, వస్తు వులు స్వాధీనం చేసుకోవటం వంటి చర్యలు చేపట్టటానికి వీలుగా పోలీసులకు అనుమతినిస్తూ న్యాయమూర్తి జారీచే సేపత్రం warrant నాన్ బెయిలబుల్ వారంటు పురస్కరించుకుని అతనిని అరెస్టు చేసేందుకు సబ్ ఇన్స్పెక్టర్ వెళ్ళారు (ఆం. భూ 12.5.89)

**వార్తాపత్రిక** వి. *vaartaapatrika* సమా చారం అందించే పత్రిక newspaper వార్తాపత్రికలకు వ్యాసాలు రాసినందుకు భారత క్రికెట్ కంట్రోల్ బోర్డు తనకు ఇచ్చిన షోకాజ్ నోటీస్‌పై ... (ఆం ప్ర. 1 1.88)

**వార్షిక నివేదిక** వి. *vaarSika niveedika* సంస్థలు సంవత్సరాంతంలో తాము ఆ సంవత్సరం నిర్వహించిన కార్యాకలాపాలు, సాధించిన అభివృద్ధి గురించి తయారు చేసిన సమీక్ష annual report ప్రిన్సి పాల్ డా. ఆ.ఏ. వత్సల కళాశాల వార్షిక నివేదిక సమర్పించారు. (ఆం. ప్ర. 11.5.89)

**వార్షిక ప్రణాళిక** వి. *vaarSika praNaa-Lika* ఒక నిర్ణీత సంవత్సరంలో అమలు జరగవలసిన కార్యక్రమాల ఆర్థిక వ్యవహారాల అంచనా annual budget *1989-90 ఆర్థిక సంవత్సరంలో వ్యవసాయ రంగానికి వార్షిక ప్రణాళికా నిధుల కింద 16 కోట్ల 54 లక్షల రూపాయలు కేటాయించారు.* (ఈ. 6 7 89)

**వార్షిక బడ్జెట్** వి. *vaarSika baDjeT* చూ. వార్షిక ప్రణాళిక. *రాష్ట్రంలో వివిధ నీటి పారుదల పథకాలకు వార్షిక బడ్జెట్‌లో* కేటాయించిన నిధులను ఆర్థిక సంవత్సరం పూర్తి అయ్యేలోగా పూర్తిగా ఖర్చు చేయాలని ... తెలిపారు. (ఈ 18 6 87)

**వాలంటీరు** వి. *vaalanTiiru* చూ. వలంటీరు. *ఊరేగింపునకు అగ్రభాగాన అరుణ పతాక నెత్తిన రైతు, ఆ వెనుక 26 మంది సుశిక్షితులైన వాలంటీర్లు ఇరు ప్రక్కల నడవగా మూడు లక్షల మంది ప్రదర్శనలో* పాల్గొన్నారు. (ఆం భూ. 1.5 89)

**వారుణి వాహిని** వి. *vaaruNi vaahini* కల్లు, సారాలను కంట్రోల్ ధరకు సరఫరా చేసే ప్రభుత్వ పథకం varuni vahini (a scheme meant for supplying country-liquor at controlled prices) *రాష్ట్ర ప్రభుత్వ సంస్థ అయిన ఈ వారుణి వాహిని ప్లాంటులో* మహిళలు రోజు వారి వేతనాలపై పనిచేస్తుంటారు. (ఈ. 15.9 87)

**వారోత్సవం** వి. *vaarootsavam* (సంస్థలు) ఏడు రోజుల పాటు జరుపుకునే వేడుక week-long celebration *ప్రజాకళల వారోత్సవంలో ప్రజానాట్యమండలి కళాకారులు ఎక్కడికక్కడ ప్రదర్శనలిస్తూ ప్రజాకళలకు, అలాగే ప్రజాకళాకారులకు, మిగిలిన కళాకారులకు గల వ్యత్యాసాన్ని ప్రజలకు* వివరిస్తూ ... నిధులు వసూలు చేయాలని విజ్ఞప్తి చేసింది. (ప్ర శ. 1.7.87)

**వాస్తవరూపం దాల్చు** వి. *vaastavaruu-pam daalcu* (పథకం, ఆలోచన మొ.) అమలు జరుగు to materialise (as a plan ...) సెలవులో ఉన్న శ్రీ కె. రాజయ్యకు ప్రభుత్వం డి. ఎస్. పి. ప్రమోషను ఇవ్వనున్నట్టు తమకు రూఢిగా తెలియవచ్చిందని, *ఇదే గనుక వాస్తవరూపం* దాలిస్తే ప్రభుత్వ చర్యకు నిరసనగా తాము ప్రత్యక్ష చర్యకు దిగవలసివస్తుందని కొందరు ఇన్‌స్పెక్టర్లు అంటున్నారు. (ఆం. జ్యో. 9.4.88)

**వాస్తవాధీన రేఖ** వి. *vaastavaadhiina reekha* ఇరు దేశాల మధ్య ఉన్న వివాదాస్పద సరిహద్దు line of actual control *దురదృష్టవశాత్తు 1949లో కాశ్మీరులో నిర్ధారితమైన కాల్పుల విరమణ రేఖ గానీ, 1972 నాటి వాస్తవాధీన రేఖ గాని సియాచిన్ ప్రాంతం భవిష్యత్తును నిర్ధారించ* లేదు. (ఆం. జ్యో 2.10 87)

**విందు** వి. *vindu* ప్రముఖులు కొన్ని ప్రత్యేక సందర్భాల్లో ఏర్పాటుచేసే భోజనం dinner, feast *ప్రధాని గురువారంనాడు* ఇచ్చిన విందుకు రాష్ట్రపతి హాజరయ్యారు. (ఆం భూ. 12 6 87)

**విందు రాజకీయం** వి. *vindu raajaki-iyam* రాజకీయ పరమైన ఎత్తుగడలలో భాగంగా ప్రముఖులకు విందులు ఏర్పాటు

చేయడం dinner politics అప్పటికే రాష్ట్ర గవర్నర్ కొత్తగా ప్రారంభించిన విందు రాజకీయాల సంగతి ముఖ్యమంత్రి దృష్టికి వచ్చింది. (ఉ. 11 4 88)

**విందు సమావేశం** వి. *vindu samaaveeśam* (మిత్రులు, సన్నిహితులైన) ప్రముఖులు విందు పేరుతో కలిసి సంప్రతించుకోవటం dinner meeting ఈ నెల 11న ... నివాసం లో రెండున్నర గంటల సేపు విందు సమావేశం జరిగింది. (ఈ 15.7 89)

**వికటించు** క్రి. *vikaTincu* వ్యతిరేకంగా పరిణమించు to misfire బంద్‌లూ, ఆందోళనలూ శ్రుతిమించి ప్రజా జీవనానికి అవరోధాలు అధికమైతే, ఆశించిన ఫలితాలు వికటించే ప్రమాదం ఉంది. (ఆం. భూ 12.8 89)

**వికలాంగుడు** వి. *vikalaanguDu* అవయవాల్లో లోపం ఉన్న వ్యక్తి physically handicapped ఇంతవరకు వికలాంగుల సహకార సంస్థ స్వయం ప్రతిపత్తి గల సంస్థగా ఉన్నందున కొంతమేరకు అభివృద్ధి సాధించగలిగాము . . . (ఈ 5 6 87)

**వికిరణమగు** క్రి. *vikiraNamagu* (ఉష్ణం) పదార్థాన్ని తాకి తిరిగి వెనక్కి ప్రసరించు to reflect back (as heat) భారత ఉపఖండంలో చదరపు మీటరుకు సుమారు 50 నుంచి 100 వాట్ల వరకు సౌరశక్తి అంతరిక్షంలోకి వికిరణమౌతున్నట్లు ఉపగ్రహం సేకరించిన వివరాలను బట్టి తెలుస్తోందని శ్రీ వాస్తవ చెప్పారు. (ఆం. భూ. 9.5 89)

**వికెట్** వి. *vikeT* (క్రికెట్ ఆటలో) బ్యాట్స్‌మన్ క్రీజ్‌లో ఉండి ఆట కొనసాగించే అర్హత లేదా అవకాశం wicket ఎయిర్ ఫోర్స్ బౌలర్లలో రాయ్ నాలుగు వికెట్లు, చౌహాన్ ఐదు వికెట్లు తీసుకున్నారు. (ఈ 5.6.87)

**వికెట్ కీపర్** వి. *vikeTkiipar* (క్రికెట్ ఆటలో) బంతుల్ని ఆపి పరుగుల్ని నిరోధించడం, క్యాచ్ పట్టి లేదా స్టంప్స్‌ని పడగొట్టడం ద్వారా బ్యాట్స్‌మన్‌ని ఔట్ చేయటం కోసం స్టంప్స్ వెనక నిలబడి ఉండే ఆటగాడు wicket-keeper ఈ రెండు మ్యాచ్‌లలోనూ వికెట్ కీపర్ కిరణ్ మోరేని తొలగించారు. (ఆం. ప్ర 1.1.88)

**వికేంద్రీకరణ** వి. *vikeendriikaraNa* అధికారాలు, కార్యకలాపాలలో కొన్నిటిని దిగువనున్న ఇతర స్థాయిలకు లేదా ప్రాంతాలకు బదిలీచేయటం decentralization, devolution 330 సమితులుగా ఉన్నవాటిని 1104 మండలాలుగా చేసి పరిపాలన వికేంద్రీకరణకు నాంది పలికిన ఘనత ప్రభుత్వానిదని అన్నారు. (ఈ 15 8 9)

**వికేంద్రీకరించు** క్రి. *vikeendriikarincu* వికేంద్రీకరణ జరుపు to decentralize, devolve భారత్-శ్రీలంక ఒప్పందం ప్రకారం మైనారిటీ తమిళులకు అధికారాలను వికేంద్రీకరించిన తర్వాత పరస్పర సంప్రదింపుల ద్వారానే ఉపసంహరణ సాధ్యపడుతుందని . . . (ఈ. 13 7.89)

**విఘటనచేయు** క్రి. *vighaTanaceeyu* రాజ్యాంగాధినేత లాంఛనంగా చట్టసభ సమావేశాలను ముగించు to prorogue రాష్ట్ర శాసనసభ పదవ సమావేశాన్ని గవర్నర్ గురువారం విఘటనచేసినట్టు ఒక అధికార ప్రకటనలో పేర్కొన్నారు. (ఆం భూ 22.4.88)

**విఘాతం** వి. *vighaatam* విషయ పురోగతికి, అభివృద్ధికి తగిలే దెబ్బ setback, impediment ఈ సంబంధాలకు నేపాల్ విఘాతం కల్గించిందని, నేపా

ల్‌లోని భారతీయులపై కొత్త ఆంక్షలు విధించిందని ఆయన విమర్శించారు. (ఈ. 19.7 89)

**విచక్షణారహితం** వి. *vicakSaNaarahitam* ఉచితానుచితాలు లెక్క చేయకపోవటం indescriminate విద్యార్థులపై విచక్షణారహితంగా కాల్పులు జరిపించింది. (ఈ. 5.6 89)

**విచారణ** వి. *vicaaraNa* కేసులు, ప్రజా ప్రాముఖ్యం ఉన్న సంఘటనలకు సంబంధించిన వాస్తవాలను తేల్చేందుకు ( సాక్షులను ప్రశ్నించడం, సాక్ష్యాధారాలను పరిశీలించడం వంటి వాటి ద్వారా) జరిపే శోధన enquiry, probe, investigation, hearing ఈ ప్రమాదకారణాలపై విచారణ జరుపుతున్న కమీషన్ త్వరలో నివేదిక సమర్పించగలదని . . . చెప్పారు. (ఆం. ప్ర. 18 4.88)

**విచారించు** క్రి. *vicaarincu* చట్టపరంగా పరిశీలించు; విచారణ జరుపు to hear (as a court) . . . అధ్యక్షతన సుప్రీం కోర్టు ధర్మాసనం ఈ కేసును విచారిస్తున్నది. (ఆం. ప్ర 26 4 88)

**విచ్ఛిన్నంచేయు** క్రి. *vicchinnamceeyu* (ఏదైనా నిర్మాణం లేదా వ్యవస్థని) ముక్కలుగా చేసి పనికిరాకుండా చేయు to disrupt, destroy . . . ఉద్యమకారులు గత ఏడాది రైలుమార్గాలను విచ్ఛిన్నం చేయడంవల్ల ఎందరో అమాయక రైలు ప్రయాణీకుల జీవితాలు నాశనమైపోయాయని ఆయన ఈ సందర్భంగా గుర్తు చేశారు. (ఈ. 25 4.89)

**విచ్ఛిన్నకర కార్యకలాపాలు** వి. (బ.వ.) *vicchinnakarakaaryakalaapaalu* దేశాన్ని ముక్కలు చేసే ప్రయత్నాలు disruptive activities దేశంలో జరుగుతున్న వేర్పాటువాద, విచ్ఛిన్నకర కార్యకలాపాలపై నేరుగా చర్చ జరిపేందుకు ప్రభుత్వం ఈ దశలో సంసిద్ధత వ్యక్తం చేసింది. (ఈ. 17.8 89)

**విచ్ఛిన్నకర శక్తి** వి. *vicchinnakara śakti* దేశాన్ని ముక్కలు చేసేందుకు ప్రయత్నించే వ్యక్తి disruptive force దేశ సమగ్రతను భగ్నం చేసేందుకు కొన్ని విచ్ఛిన్నకర శక్తులు కృషి చేస్తున్నాయని, యువకులు ముందుకు వచ్చి దేశ సమగ్రతను కాపాడవలసిందిగా ఆమె యువకులకు పిలుపునిచ్చారు. (ఆం. భూ. 22.7.89)

**విజయోత్సవం** వి. *vijayootsavam* గెలిచినప్పుడు చేసుకునే వేడుక celebration of victory . . . బి. జె. పి. అభ్యర్థి విజయోత్సవం జరుపుకుంటుండగా కొందరు దుండగులు ఆ ఊరేగింపుపై బాంబు విసిరారు. (ఈ. 28 11 89)

**విజృంభించు** క్రి. *vijRmbhincu* చెలరేగి దాడిచేయు to strike ఉగ్రవాదులు మరో సారి విజృంభించారు. (ఉ 15.6 87)

**విజ్ఞప్తి** వి. *vijnapti* సహాయం, తదితర సానుకూల చర్యను ఆపేక్షిస్తూ కోరే కోరిక appeal లిక్కర్ ఇండియాపై చర్యకు విజ్ఞప్తి. (ఈ. 5 6 87)

**విజ్ఞాపనపత్రం** వి. *vijnaapanapatram* కోరికలు వివరిస్తూ వాటి పరిష్కారం కోసం అధికారంలో ఉన్నవారికి సమర్పించే వినతి పత్రం memorandum ఊరేగింపు అనంతరం శ్రీమతి వనమాల నాయకత్వంలో ప్రతినిధి వర్గం గవర్నర్ కుముద్ బెన్ జోషికి విజ్ఞాపనపత్రం అందజేశారు. (ఆం ప్ర 4.5.89)

**విడత** వి *viData* మొత్తం కార్యక్రమంలోని ఒక దశ phase చైనాకు వ్యతిరేకంగా

అమెరికా నేడు రెండవ విడత ఆంక్షలను ప్రకటించింది. (ఆం ప్ర 22 6 89)

**విడనాడు** క్రి. *viDanaaDu* వదులుకొను to give up, abandon ఉపాధ్యాయుల సమస్య పరిష్కారంలో ప్రభుత్వం తన అలక్ష్య వైఖరిని విడనాడకపోతే ఉద్యమాన్ని తీవ్రతరం చేస్తామని . . . హెచ్చరించారు. (ఈ. 5.7.88)

**విడాకులు** వి. (బ.వ.) *viDaakulu* భార్యాభర్తలు చట్టప్రకారం విడిపోవటం divorce దాదాపు వంద ఏళ్ళ చర్చ అనంతరం అర్జెంటీనాలో వివాహితులకు విడాకులు తీసుకునే స్వేచ్ఛ లభిస్తున్నది. (ఆం ప. 9.6.87)

**విడిదిచేయు** క్రి. *viDidiceeyu* తాత్కాలికంగా బసచేయు to camp అక్కడే ఏడుగురు సభ్యులు గల తీవ్రవాదుల దళం విడిదిచేసి ఉన్నట్టు పోలీసులు చెప్పారు. (ఆం భూ. 14.5.89)

**విడిది స్థలం** వి. *viDidi sthalam* తాత్కాలికంగా బసచేసే చోటు camp ప్రతినిధులను ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన బస్సులలో విడిది స్థలాలకు విశ్రాంతి గృహాలకు తరలించారు. (ఈ. 27 4 89)

**విడుదలచేయు** క్రి. *viDudalaceeyu* 1. (వ్యక్తుల్ని) నిర్బంధంలో నుంచి వదిలిపెట్టు to release (sb from confinement) . . . కార్యకర్తలను వెంటనే విడుదల చేయాలని సుప్రీం కోర్టు నేడు ఆదేశాలు జారీచేసింది. (ఆం ప్ర. 26.4.89) 2. (స్వాధీనం చేసుకున్న వస్తువుల్ని) తిరిగి ఇచ్చివేయు జర్నలిస్టులు తమతో తెచ్చుకున్న కెమెరాలను విడుదల చేయడానికి తమకు ఆదేశాలు లేవని పాకిస్తాన్ అధికారులు పేర్కొనడంతో వారిద్దరినీ నిర్బంధించారు. (ఆం. ప్ర 24.11.89) 3. (నిధులను) ఉపయోగం నిమిత్తం అందించు to release (funds etc.) మంచినీటి పథకాలకు ఏడుకోట్లు విడుదల చేశారు. (ఆం ప్ర. 20.9 89) 4. (సరుకులు మొ.) కొనుగోలు నిమిత్తం మార్కెట్ లోకి పంపించు to release (goods etc. into the market) జంటనగరాలలో ఏప్రిల్ నెలలో రెండు దశలలో బియ్యం విడుదల చేస్తున్నట్టు చెప్పారు. (ఆం. ప్ర. 13.4.88) 5. అందరికీ తెలిసేటట్టు సమాచారాన్ని ప్రకటించు to issue (a statement, notification etc.) ఈ నెల 8 వతేదీన ఎన్నికలకు సంబంధిం నోటిఫికేషన్ విడుదల చేస్తారు. (ప్రశ 8.10.87)

**విదితం** వి. *viditam* ఇంతకు ముందే తెలిసిన సమాచారం clear, well-known అమెరికా భూభాగంలో వున్న ఐక్యరాజ్య సమితిలోని సర్వసభ్య సమావేశంలో ప్రసంగించాల్సివున్న పి. ఎల్. ఓ. అధ్యక్షుడు అరాఫత్‌కు అమెరికా తమ దేశంలోకి ప్రవేశించేందుకు అనుమతి నిరాకరించిన విషయం విదితమే. (ఆం. జ్యో. 6 12 88)

**విదేశాంగ మంత్రిత్వశాఖ** వి. *videeśaanga mantritvaśaakha* ఇతర దేశాలతో సంబంధ వ్యవహారాలు చూసే ప్రభుత్వ విభాగం ministry of external affairs తమ లక్ష్య సాధనకు అవసరమైనంత తీవ్రంగా పోరాటం సాగించాలని ముజాహిదీన్లు నిర్ణయం తీసుకున్నారని పాక్ విదేశాంగ మంత్రిత్వశాఖ ప్రతినిధి ఒకరు తెలిపారు. (ఆం భూ 26 4.89)

**విదేశాంగ విధానం** క్రి. *videeśaanga vidhaanam* ఇతర దేశాలతో ఏర్పరచుకునే సంబంధాలకు సంబంధించిన కార్యాచరణ

ప్రణాళిక foreign policy పాకిస్థాన్ నూతన ప్రధాని బెనజీర్ భుట్టో విదేశాంగ విధానం ఎలా ఉంటుందో అమెరికాకు ఇంకా స్పష్టంగా తెలియడంలేదు. (ఆం జ్యో 3.12.88)

**విదేశీ కార్యాలయం** వి. *videeśii kaaryaalayam* ఇతర దేశాలతో సంబంధ బాంధవ్యాలకు సంబంధించిన వ్యవహారాలను చూసే కేంద్రం foreign office ఈ విషయాన్ని జపాన్ విదేశీ కార్యాలయం ప్రకటించింది. (ఆం ప్ర 26 4 89)

**విదేశీ ఖాతా** వి. *videeśii khaataa* ఇతర దేశాల బ్యాంకులలో డబ్బు నిల్వ చేసుకునేందుకు తెరిచే పద్దు foreign account కొందరు ప్రతిపక్ష నాయకుల విదేశీ ఖాతాలపై దర్యాప్తు జరపవలసిందిగా మాజీ ఆర్థిక మంత్రి . . . కోరినట్టు వచ్చిన వార్తలను . . . ఖండించారు. (ఆం. ప్ర. 8.2 89)

**విదేశీ పెట్టుబడి** వి. *videeśii peTTubaDi* వ్యక్తులు, ప్రైవేటు సంస్థలు మరో దేశానికి చెందిన పరిశ్రమలకు అందజేసే మూలధనం foreign investment విదేశీ పెట్టుబడులను ఆకర్షించడంలో ఆగ్నేయాసియా దేశాలు పోటీపడుతున్న సమయంలో భారత ప్రభుత్వం తన పట్టుదలను ఇంకా సడలించే స్థితిలో లేదు. (ఆం ప్ర 29 4 89)

**విదేశీ మారకం** వి. *videeśii maarakam* అంతర్జాతీయ విపణిలో లావాదేవీలకు ఉపయోగపడే భిన్న దేశాల ద్రవ్యం foreign exchange సానబట్టిన వజ్రాల రూపంలో ఎగుమతి చేయబడిన దిగుమతులకు చెల్లించిన విదేశీ మారకం నుంచి విదేశీ కరెన్సీ లభిస్తున్న మాట నిజమే. (ఆం ప్ర. 26.4 89)

**విదేశీ ముప్పు** వి. *videeśii muppu* ఇతర దేశాల శత్రు చర్యల వల్ల దేశ సమగ్రతకు కలిగే ప్రమాదం external threat తన స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారం, ప్రాదేశిక సమగ్రతలకు "విదేశీ ముప్పు" ఏర్పడినట్లు . . . (ప్ర. శ. 5 6.87)

**విదేశీ వాణిజ్యం** వి. *videeśii vaaNijyam* ఇతర దేశాలతో జరిపే వ్యాపారం foreign trade విదేశీ వాణిజ్య లోటును పూడ్చడానికి విదేశీ ఋణభారం తగ్గించడానికి ఇండియా చేస్తున్న ప్రయత్నాలు ఎంతవరకు ఫలిస్తాయి. (ఆం. ప్ర. 4.5.89)

**విదేశీయ ధనం** వి. *videeśiiya dhanam* ఇతర దేశాలతో వాణిజ్యం వల్ల సమకూరే ఆయా దేశాల ద్రవ్యం; విదేశీ కరెన్సీ foreign currency వజ్రాలు పొదిగిన నగల ఎగుమతి ద్వారా మరింత ఎక్కువ విదేశీయ ధనం లభించగలదని చెప్తున్నారు. (ఆం. ప్ర. 26 4.89)

**విదేశీరుణం** వి. *videeśiiruNam* ఇతర దేశాల నుంచి తీసుకున్న అప్పు foreign debt భారత విదేశీరుణ భారం 5500 కోట్ల రూపాయలకు చేరుకుందని . . . ఆరోపించారు. (ఈ 27.4.89)

**విదేశీశక్తి** వి. *videeśiiśakti* అనవసరంగా జోక్యం చేసుకునే ఇతర దేశానికి చెందిన వ్యక్తి లేదా సంస్థ foreign element హిందువులు, సిక్కుల మధ్య విభేదాల సృష్టికి విదేశీశక్తులు యత్నిస్తున్నాయని . . . ఆరోపించారు. (ఆం ప్ర. 3 7.89)

**విదేశీసంపద** వి. *videeśiisampada* ఇతర దేశాలలో దాచిపెట్టిన ఆస్తి, డబ్బు మొ. foreign wealth ఈ మధ్యకాలంలో ప్రకటించిన విచారణలను అర్థరహితంగా శ్రీ ఉన్నికృష్ణన్ పేర్కొంటూ, అజితాబ్ సోదరుల విదేశీసంపదపై ప్రకటించిన విచారణను ఆయన ఈ సందర్భంగా ప్రస్తావించారు. (ఆం. జ్యో 21.7.87)

విద్యాసంవత్సరం వి. *vidyaasamvatsaram* చదువు చెప్పేందుకు విద్యాలయాలకు ఏర్పాటయిన కాల వ్యవధి academic year చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు తమ స్వీయ చరిత్రలో విద్యా సంవత్సరం గురించి వివరించారు (ఉ 6.10 87)

విద్యుత్ కోత వి. *vidyut koota* (వినియోగాన్ని అదుపు చేసేందుకుగాను) కరెంటు సరఫరా నియమిత కాలంపాటు నిలిపివేయటం power cut ప్రస్తుతం అమలులో ఉన్న విద్యుత్ కోత సమయాన్ని మరింత పెంచనున్నట్లు శుక్రవారంనాడు రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు ప్రకటించింది. (ఆం భూ 16.4.88)

విద్యుదీకరణ వి. *vidyudiikaraNa* 1 (ఒక ప్రాంతానికి) కరెంటు సరఫరాని అందుబాటులోకి తేవటం electrification (of a region) నూటికి నూరు శాతం గ్రామీణ విద్యుదీకరణను సాధించిన మహారాష్ట్ర 1989-90లో అదనంగా 1600 మె. వా. విద్యుత్ ఉత్పాదన సామర్థ్యాన్ని సంతరించుకోనున్నది. (ఈ 22.5 89) 2. (కరెంట్ ద్వారా నడిచే రైళ్ళకోసం) రైలు పట్టాలకు పైభాగంలో విద్యుత్ సరఫరా ఏర్పాటు చేయటం electrification (of a railway) కాజీపేట-హైదరాబాదు రైలు మార్గం విద్యుదీకరణకు అవసరమైన నిధులు మంజూరు చేయడానికి . . . (ఆం భూ 20.6 87)

విద్యుద్ఘాతం వి. *vidyudghaatam* కరెంటు ప్రవహించే వస్తువును తాకటంవల్ల తగిలే ప్రాణాపాయకరమైన దెబ్బ electrocution ఆ తర్వాత కొంతసేపటికి కరెంటు రావడంతో వారు విద్యుత్ ఘాతానికి బలి అయినారు. (ఆం ప్ర 18 5 89)

విద్రోహ చర్య వి *vidrooha carya* విధ్వంసం, వినాశనం కల్గించే దుర్మార్గపు పని sabotage, subversive act కర్నాటక ఎక్స్‌ప్రెస్ ప్రమాదంలో విద్రోహ చర్యకుగల అవకాశాల గురించి మంత్రి వివరాలను ఇచ్చారు. (ఈ 25 4 89)

విధాన నిర్ణయం వి. *vidhaana nirNayam* కార్యక్రమాలకు సంబంధించి సూత్రరీత్యా నిశ్చయించటం policy decision జనసామాన్యం ఆరోగ్యానికి సంబంధించి అత్యంత ప్రధానమైన విధాన నిర్ణయం విషయంలో కేంద్రమంత్రి సూచనప్రాయంగా వెల్లడించిన అభిప్రాయానికి అత్యంత ప్రాముఖ్యం వున్నది. (ఉ. 9 9 87)

విధాన నిర్ణాయక పరిషత్ వి. *vidhaana nirNaayaka pariSat* సంస్థాపరంగా విధాన నిర్ణయాలు తీసుకునే నాయకుల బృందం policy making body రాష్ట్ర కార్యవర్గం, విధాన నిర్ణాయక పరిషత్ అధ్యక్షులు మొత్తం 50 మందిదాకా విషయ నిర్ణాయక సభలో పాల్గొంటారని వారు చెప్పారు. (ఈ 15 5 89)

విధాన పత్రం వి. *vidhaana patram* లక్ష్యాలు,వాటి ఆచరణకు నిర్దేశించే కాగితం policy document ఎనిమిదో పంచవర్ష ప్రణాళిక 'విధాన పత్రం'ను సూత్రప్రాయంగా ఆమోదించేందుకు ప్రణాళికా సంఘం సమావేశమవుతుంది. (ఆం. ప్ర 30.6 89)

విధాన ప్రకటన వి. *vidhaana prakaTana* (ఏదైనా విషయంపై) తమ ఆలోచన తీరు గురించి అధికారికంగా తెలియజేయటం) policy statement ప్రభుత్వరంగంపై తమ వైఖరి ఏమిటో, ఈ విషయంలో ఎలాంటి చర్యలు చేపట్టనుందో మొదలగు అంశాలపై ప్రభుత్వం ఒక విధాన

ప్రకటన చేయాలనీ, తద్వారా దీనిపై బహిరంగ చర్చకు అవకాశం కల్పించాలని వీరు విజ్ఞప్తి చేశారు. (ఆం ప్ర 20 2 89)

**విధానసభ** వి. *vidhaanasabha* అసెంబ్లీలో ఎన్నికైన ప్రజాప్రతినిధులతో కూడిన దిగువ సభ; శాసనసభ legislative assembly రోడ్ల ఆక్రమణలను, అక్రమ నిర్మాణాలను తొలగించే అధికారాన్ని రోడ్లు భవనాల శాఖకు కల్పిస్తూ ఒక చట్టాన్ని త్వరలో ప్రవేశపెట్టనున్నట్లు రోడ్లు భవనాల శాఖ మంత్రి సోమవారంనాడు రాష్ట్ర విధాన సభలో ప్రకటించారు. (ఆం. భూ 28 7 87)

**విధి** వి. *vidhi* నియమ నిబంధనల ప్రకారం- తప్పనిసరిగా చెయ్యాల్సింది obligatory, compulsory రాష్ట్రంలో ఏ ప్రాంతంలో అవుట్ డోర్ షూటింగ్ చేయాలన్నా విధిగా వారం రోజుల ముందే సమాచార శాఖ కమీషనర్ అనుమతికోసం దరఖాస్తు పెట్టుకోవాలని . . . (ఈ 21 8 87)

**విధించు** క్రి *vidhincu* అమలు చేయు to impose, clamp లూథియానా పాతనగరంలో కర్ఫ్యూ విధించారు. (ఈ 5.6.87)

**విధి నిర్వహణ** వి. *vidhi nirvahaNa* బాధ్యతల్ని నిర్వర్తించటం discharging of one's duties . . . పోలీసుల విధి నిర్వహణను నేనెలా ఆటంకపరుస్తాను అని ముఖ్యమంత్రి సమాధానం చెప్పారు. (ఈ 5.10 88)

**విధేయత** వి. *vidheeyata* తమ సంస్థ లేదా నాయకుని పట్ల ఉండే పూర్తి నమ్మకం, గౌరవం loyalty పార్టీలోని తన విమర్శకుల పట్ల వి. పి. సింగ్ కఠినంగా ఉన్నప్పటికీ, పార్టీకి విధేయత ప్రకటించారని ఆయన పేర్కొన్నారు (ఈ 5.6 87)

**విధ్వంసకాండ** వి. *vidhvamsakaanDa* పనిగట్టుకొని ఆస్తులకు తీవ్రనష్టం కలిగించటం destruction, vandalism . . . అరెస్టులకు నిరసనగా విధ్వంసకాండకు పాల్పడినా ప్రభుత్వానికి చీమకుట్టినట్టయినా లేకపోవడం వల్లే ఈ కిడ్నాప్ తప్పని సరైందని వారు అన్నట్లు ఆయన చెప్పారు. (ఆం భూ 22 5.89)

**విధ్వంసకారుడు** వి. *vidhvamsakaaruDu* ఆస్తులను ధ్వంసం చేసే వ్యక్తి vandal దేశ సుస్థిరతను, సమైక్యతను పరిరక్షించేందుకు విధ్వంసకారులను తీవ్రంగా శిక్షించాలని చైనాలో సొసైటీ అధ్యక్షుడు వ్యాఖ్యానించినట్టు అధికార వార్తా సంస్థ పేర్కొన్నది. (ఆం ప్ర 22 6 89)

**వినతిపత్రం** వి. *vinatipatram* చూ విజ్ఞాపనపత్రం. విద్యుత్ సౌకర్యం కల్పించాలని శాసనసభ్యుడు ఎం. ఓంకార్ ద్వారా పలు వినతిపత్రాలు అందజేసినా లాభం లేకపోయిందని ఎం. సి. పి. ఐ. ఆందోళన వ్యక్తం చేసింది. (ఈ. 10 5 89)

**వినిమయదారుడు** వి. *vinimayadaaruDu* వాడకం కోసం వస్తువుల్ని మార్కెట్లో కొనుక్కునే వ్యక్తి consumer *1986* వినిమయదారుల పరిరక్షణ చట్టం, వినిమయదారుల హక్కులను పరిరక్షించడమే కాకుండా చట్టాన్ని ఉల్లంఘించిన వారిని కఠినంగా శిక్షించే విధంగా ఉందని అన్నారు. (ఆం ప్ర 20 4 88)

**వినియోగదారుడు** వి. *viniyoogadaaruDu* చూ. వినిమయదారుడు. వ్యవసాయోత్పత్తులలో అధిక భాగాన్ని ప్రభుత్వ సంస్థలు కొనుగోలు చేయాలని ఈ సందర్భంగా అయ్యే అదనపు ఖర్చులు తగ్గించి, వినియోగదారునిపై భారం పడకుండా చూడా

లని సూచించింది. (ఈ 1 5 89)

**వినియోగదారుల రక్షణ సమాఖ్య** వి. *viniyoogadaarula rakSaNa samaakhya* వాడకందారులకు అన్యాయం జరగకుండా పరిరక్షించేందుకు ఏర్పాటయిన సంఘం consumers protection council వినియోగదారులను మోసంచేసే కంపెనీలను, వ్యాపార సంస్థలను 'బ్లాక్ లిస్ట్'లో ఉంచాలని మంగళవారం రాష్ట్ర వినియోగదారుల రక్షణ సమాఖ్య తొలి సమావేశంలో మాట్లాడుతూ రాష్ట్ర పౌరసరఫరాల మంత్రి . . . పేర్కొన్నారు. (ఉ. 20 4 88)

**వినియోగించు** క్రి. *viniyooginCu* (వస్తువుల్ని) నిర్దిష్టమైన పనికోసం వాడు to employ హర్యానా ఎన్నికలకోసం "ఆంధ్ర ప్రదేశ్" భవన్‌కు చెందిన కార్లను వినియోగించినట్లు కూడా ఆయన పేర్కొన్నారు. (ఆం. ప్ర 1.12 87)

**విన్నవించు** క్రి. *vinnavincu* ఉన్నత స్థానంలో ఉన్నవారికి చెప్పు to report రాష్ట్రపతికి ఈ విషయాన్ని విన్నవించిన పార్లమెంట్ సభ్యులందరికీ ఆయన కృతజ్ఞతలు తెలిపారు. (ఆం జ్యో 27 11 88)

**విన్యాసం** వి. *vinyaasam* రక్షణ దళాలు, వాటి ఆయుధ సామాగ్రి పాటవం ప్రదర్శించే కార్యక్రమం exercise or manoeuvre (as of defence forces) పాకిస్తాన్ సైన్యం తాము కొత్తగా సంపాదించుకున్న అనేక ఆయుధాల శక్తి సామర్థ్యాలను వచ్చే శీతాకాలం భారతీయ సరిహద్దుల్లో జరిగే విన్యాసాలలో ప్రదర్శిస్తాయని 'నేషన్' పత్రిక తెలిపింది. (ఆం భూ 1.5.89)

**విప్** వి. *vip* చట్టసభలలో పా తన సభ్యులను ఏదైనా అంశంపై ని శించిన విధంగా ఓటింగ్ చెయ్యాలని జా చేసే ఆదేశం party whip తమ మొదటి ప్రిఫరెన్సు ఓటు శ్రీ కృష్ణయ్యర్‌కు వేయాలని తెలుగుదేశం తన ఎం. పి. లకు విప్ జారీ చేసింది. (ఆం జ్యో 3 7 87)

**విపత్కారం** వి. *vipatkaram* ప్రమాదం, నష్టం కలిగించేది dangerous ప్రజలకు ఆయుధాలు ఇవ్వడంవల్లా విరివిగా తుపాకి లైసెన్సులు ఇవ్వడంవల్ల విపత్కర పరిస్థితులు ఏర్పడవచ్చునని . . . వ్యాఖ్యానించారు. (ఆం. ప్ర 22 4 89)

**విపరిణామం** వి. *vipariNaamam* పరిస్థితిలో ఇటీవల వచ్చిన మార్పు development . . . నేతృత్వంలో ప్రతిపక్షమంతా నాటకాల కంపెనీ మాదిరిగా తయారైందని, ఈ విపరిణామాలు చాలా దురదృష్టకరమైనవని తివారీ నిశితంగా విమర్శించారు. (ఈ. 25 7 89)

**విప్లవం** వి. *viplavam* (శాస్త్ర సాంకేతిక రంగాలలో) పెనుమార్పు revolution వండిన వంటకాన్ని ఆర్నెల్ల వరకైనా చెడిపోకుండా తాజాగా ఉంచగలిగే ప్రక్రియను డి. ఎఫ్. ఆర్. ఎల్ శాస్త్రజ్ఞుడు రూపొందించారు. ఇక ఆహార పరిశ్రమలో విప్లవం వచ్చినట్లేనని వారు తమ నివేదికలో తెలిపారు. (ఉ 7.9 87)

**విప్లవ ప్రతీఘాతకుడు** వి. *viplava pratighaatakuDu* విప్లవ లక్ష్యాలను దెబ్బతీసే వ్యక్తి counter-revolutionary విప్లవ ప్రతీఘాతకులను, తిరుగుబాటుదారులను తీవ్రంగా అణచివేయాలని పార్టీనాయకుడు చేసిన ప్రసంగం . . . (ఆం ప్ర. 30 6 89)

**విప్లవ రాజకీయాలు** వి. (బ.వ.) *viplava raajakiiyaalu* సాయుధ పోరాటం ద్వారా ఉన్న వ్యవస్థను కూలదోసి సరికొత్త వ్యవస్థను ఏర్పాటుచేయటానికి

ప్రయత్నించే రాజకీయ కార్యకలాపాలు revolutionary politics *గత సంవత్సరం పోలీసు ఎన్‌కౌంటర్‌లో మరణించిన 'సికాస ' ఆర్గనైజర్ తనను విప్లవ రాజకీయాలలోకి తీసుకొచ్చాడని . . . విలేఖరులకు వివరించాడు.* (ఆం. ప్ర 7.7.89)

**విప్లవాత్మకం** వి. *viplavaatmakam* పరిస్థితిలో తీవ్రమైన, అభివృద్ధికరమైన మార్పులను తీసుకువచ్చేది revolutionary *ఉద్యోగాలలో 30 శాతం మహిళలకు కేటాయిస్తూ, ఆస్తిలో మహిళలకు సమాన హక్కు కల్పిస్తూ విప్లవాత్మక నిర్ణయాలు తీసుకున్న . . . ప్రభుత్వం ఈ బిల్లును ఆమోదించాలని కోరారు.* (ఈ. 25.7.87)

**విఫలయత్నం** వి. *viphalayatnam* ఫలించని కృషి unsuccessful attempt *హర్యానాలో లోక్‌దళ్‌లోని అజిత్ సింగ్, బహుగుణ వర్గాలను ఏకం చేయాలన్న విషయంలో శ్రీ రామారావు విఫలయత్నం చేశారు.* (ఈ. 6.6.87)

**విబంధరాజ్యం** వి. *vibandharaajyam* చూ. అలీన దేశం *ఒకరితో ఒకరు పోరాటం సాగిస్తున్న విబంధ రాజ్యాలను సమితి కార్యదర్శి విమర్శించారు.* (ఆం ప 26.9.87)

**విభేదం** వి. *vibheedam* అభిప్రాయాలలో ఉన్న తేడా difference . . . *తో విభేదాలు ఉన్నట్లు పత్రికలలో వచ్చిన వార్తల గురించి ప్రశ్నించినపుడు అలాంటిదేమీ లేదని . . . తెలిపారు.* (ఆం భూ 1.10.87)

**విభ్రాంతి** వి. *vibhraanti* ఊహించనిది జరిగినప్పుడు కలిగే ఆశ్చర్యం surprise, shock *లంచాలు చెల్లించారనే పుకార్లు విదేశీ శక్తుల అస్థిరీకరణ ప్రయత్నంలో భాగమని విశ్వసించేవారికి ఈ నివేదికలో విషయాలు మరింత విభ్రాంతిని కలుగచేస్తాయి అని . . . అన్నారు.* (వి 8.6.87)

**విమర్శించు** క్రి. *vimarśincu* వ్యక్తులు లేదా విషయాలలోని తప్పులను ఎత్తి చూపు; తప్పు పట్టు to criticize *తొలుత తమ ప్రసంగంలో బ్రిటీష్ కాలం నాటి నుండీ మనదేశంలో నెలకొని ఉన్న బూనిన విద్యావిధానాన్ని విమర్శించారని తెలిసింది.* (ఈ 5.6.87)

**విమానాశ్రయం** వి. *vimaanaaśrayam* విమానాలు దిగటానికి, తిరిగి ఎగరటానికి అనువుగా అవసరమైన వసతులు, పరికరాలతో కూడిన ప్రదేశం air port *గల్ఫ్ విమానాశ్రయంలో ఎమర్జెన్సీని ప్రకటించారు.* (ఆం ప్ర. 26.8.89)

**విముక్తి** వి *vimukti* (ఇబ్బందికరమైన) బాధ్యతలనుండి బయట పడటం relief (from burden or some duty *తనకు విముక్తి ప్రసాదించాల్సిందిగా జగ్‌మోహన్ కేంద్రాన్ని కోరారని . . . విశ్వసనీయ వర్గాల ద్వారా తెలిసింది.* (ఆం ప్ర 23.6.89)

**విరగబండు** క్రి. *viragabanDu* (పంటలు) అధికస్థాయిలో దిగుబడినిచ్చు to yield heavily *విరగబండితే ధరలు విరిగి పోతాయన్న నిస్పృహ నుంచి రైతాంగాన్ని విముక్తం చేయటంలో ప్రభుత్వం విఫలమైంది.* (ఈ. 11.7.89)

**విరమించుకొను** క్రి. *viramincukonu* పోటీలేదా ఇతరత్రా ప్రయత్నం నుంచి తప్పుకొను; ఉపసంహరించుకొను to withdraw *హైదరాబాద్ లోక్‌సభ నియోజకవర్గంలో తెలుగుదేశం అభ్యర్థికి మద్దతుగా ఇండిపెండెంట్‌గా రంగంలో ఉన్న . . . పోటీనుంచి విరమించుకున్నారు.* (ఆం. ప్ర. 21.11.89)

**విరాళం** వి. *viraaLam* ఉదార కార్యక్రమాలకోసం డబ్బు లేదా వస్తురూపేణా చేసే సహాయం donation,

contribution బ్రౌన్ స్మారక భవన నిర్మాణానికి విరాళాలకై విజ్ఞప్తి. (ఆం ప 6.6 87)

**విరుచుకుపడు** క్రి. *virucukupaDu* 1. తప్పులు, లోపాలకు బాధ్యుల్ని చేస్తూ తీవ్రంగా విమర్శించు to come down స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా మంగళవారంనాడు ఎర్రకోటవద్ద ప్రసంగించిన తీరు పరిశీలిస్తే ఆయన నిరాశ, నిస్పృహలకు గురై ప్రతిపక్షాల మీద విరుచుకు పడుతున్నట్లుందని జనతాదళ్ ఉపాధ్యక్షులు . . . అన్నారు. (ఆం. భూ 17.8.89) 2. (సాధారణ రక్షక దళాలు) ఎదురు తిరిగిన వారిని అణచివేయటానికి దాడిచేయు to crack down "ఒకవేళ సైన్యం విరుచుకపడి అణచివేస్తే భవిష్యత్ ఉద్యమాలన్నింటికీ మేమే ఆదర్శ ప్రాయ మార్గదర్శకుల మవుతాం" అని విద్యార్థులు ప్రకటించారు. (ఈ 30.5.89)

**విరుద్ధఫలితం** వి. *viruddhaphalitam* ఆశించిన దానికి వ్యతిరేకమైన ఫలం negative result కేంద్రం విర్రవీగి తొందరపాటుతో శాసన పరమైన చర్యలకు సమ కట్టితే విరుద్ధఫలితాలు తప్పవని ఆయన చేసిన హెచ్చరిక కూడా లక్షింపబడగింది. (ఈ 3.5 89)

**విర్రవీగు** క్రి. *virravugu* అహంకారంతో ప్రవర్తించు to behave in an agressive manner . . . తనకు తోచిందే సర్వులకూ శిరోధార్యమని కేంద్రం విర్రవీగి తొందరపాటుతో శాసన పరమైన చర్యలకు సమ కట్టితే విరుద్ధ ఫలితాలు తప్పవని . . . (ఈ. 3 5 89)

**విలయతాండవంచేయు** క్రి. *vilayataan-Davamceeyu* (అవాంఛనీయ పరిస్థితి) ఒక ప్రదేశం అంతటా తీవ్రస్థాయిలో నెలకొని ఉండు to prevail, reign (as an undesirable situation) రాష్ట్రంలో కరువు విలయతాండవంచేస్తున్నదని ఎండిపోయిన చేలను . . . (ఉ 7 10 87)

**విలీనం** వి. *viliinam* భిన్న సంస్థలు కలిసి ఒక్కటి కావటం merger ఆ తర్వాత విలీనాన్ని అభిలషిస్తున్న మూడు పార్టీల జాతీయ కార్యవర్గాలు సమావేశమై ఈ విలీనం ప్రణాళికను ఖరారు చేయగలదని తెలిపారు. (ఆం భూ 20 4 88)

**విలీనమగు** క్రి. *viliinamagu* భిన్న సంస్థలు ఒకటిగా కలిసిపోవు to merge దేశవ్యాప్తంగా 28 సంస్థలు తమ పార్టీ బహుజన సమాజ్‌లో విలీనమయ్యాయని ఆయన అంటూ . . . (ఆం భూ 27.4 89)

**విలీనీకరణ** వి. *viliniikaraNa* భిన్న సంస్థల్ని ఒకటిగా కలపటం process of merging స్వతంత్ర భారతంలో సంస్థానాల విలీనీకరణ తర్వాత అంతటి ప్రాశస్త్యం గల పరిణామంగా రాజీవ్ చొరవను ప్రజలు పరిగణిస్తారు. (ఆం భూ. 3 5 89)

**విలపించు** క్రి. *vilapincu* మిక్కిలిగా ఏడ్చు; రోదించు to cry కన్నీరు మున్నీరుగా విలపిస్తూ తన భర్తను వదలవలసిందిగా నక్సలైట్లను ఆమె కోరారు. (ఈ 26 12.89)

**విలేకరుల సమావేశం** వి. *vileekarula samaaveeśam* (అభిప్రాయాలు, సమాచారం మొ. అందించే నిమిత్తం) పత్రికా ప్రతినిధులను ఒకచోటికి పిలిపించటం press meet మాజీ మంత్రులలో అసంతృప్తి నెలకొని ఉన్నదంటూ పత్రికలలో వస్తున్న వార్తలను వారు మంగళవారం నాడిక్కడ విలేకరుల సమావేశంలో త్రోసిపుచ్చారు. (ఆం ప్ర 22.2 89)

**వివక్ష** వి. *vivakSa* కొందరిని తక్కువగా

మరి కొందరిని ఎక్కువగా పరిగణించి, భేద భావం చూపటం discrimination . . . అస్సాం ప్రభుత్వం కూడా కేంద్రం వివక్షకు గురవుతుంది. (ఆం ప్ర. 23 7 89)

**వివరణ** వి. *vivaraNa* (విషయాన్ని) విడమరచి చెప్పటం explanation *జాతి భద్రత దృష్ట్యా, తనకున్న అనుమానాలపై స్పష్టమైన వివరణ ఇవ్వాలని ముఖ్యమంత్రి ప్రధానమంత్రిని కోరారు.* (ఆం ప్ర 20.7 89)

**వివరణ నోటీసు** వి. *vivaraNa nooTiisu* (క్రమశిక్షణా చర్యలో భాగంగా) తగిన కారణం తెలపాల్సిందిగా కోరుతూ పంపే పత్రం show cause notice *ఈ విధంగా వివరణ నోటీసు అందుకున్నవారిలో రాష్ట్ర రెవిన్యూ మంత్రి కూడా ఉన్నారని విలేకరుల సమావేశంలో . . చెప్పారు.* (ఆం భూ 6 10.87)

**వివరణపత్రం** వి. *vivaraNapatram* 1. (సమావేశంలో) చర్చకు చేపట్టే అంశాలకు సంబంధించి ముందుగా తయారు చేసుకున్న పట్టిక; అజెండా agenda *ఈ సమావేశానికి సంబంధించిన ఆహ్వానాలు అందరికీ వారంరోజుల ముందుగానే అందినప్పటికీ, సమావేశంలో చర్చించే అంశాలపై ఎటువంటి వివరణపత్రం ఇవ్వలేదు.* (ఆం జ్యో 5 6 87) 2. చూ. శ్వేతపత్రం. *గత ఐదేళ్ళలో రాష్ట్రంలో సంభవించిన లాకప్ మరణాలు, నిందితులపై తీసుకున్న చర్యలు గురించి వివరించే ఒక వివరణపత్రాన్ని ప్రభుత్వం ప్రచురించాలని శ్రీ వెంకయ్య నాయుడు డిమాండ్ చేశారు.* (ఆం. ప్ర 9 10 88)

**వివాదం** వి. *vivaadam* అంగీకార యోగ్యం కాని నిర్ణయాలు, కార్యకలాపాల విషయంలో జరిగే గొడవ controversy, dispute *గవర్నర్లు, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ గవర్నర్ విషయంలో రేకెత్తిన వివాదంపై వచ్చిన విమర్శలకు ప్రతిస్పందిస్తూ . . .* (ఆం ప్ర 1.12 88)

**వివాదాస్పదం** వి. *vivaadaaspadam* వివాదంతో కూడుకొన్నది controversial *గవర్నరయినా మరొకరు అయినా దానిని వివాదాస్పదం చేయడం విచారకరమని మంత్రి అన్నారు.* (ఆం జ్యో 21.11 88)

**విశదీకరించు** క్రి. *viśadiikarincu* (విషయం) స్పష్టంగా అర్థమయ్యేటట్టు వివరించు to explain, clarify *రాజ్యసభలో ప్రత్యేక ప్రస్తావన పరిధిని విశదీకరించే విధంగా నిబంధనలు ఉండాలని ఆయన అన్నారు.* (ఈ. 26 2.88)

**విశుద్ధపాలన** వి. *viśuddha paalana* అవినీతి, అక్రమాలకు తావులేని స్వచ్ఛమైన పరిపాలన clean administration *ప్రవర్తనా నియమావళి ఒకటి ఉన్నదనే వాస్తవాన్ని విస్మరించజాలదు విశుద్ధపాలనకు కానీ, ప్రజాశ్రేయస్సుకు కానీ, దానిని పాటించి తీరాలి.* (ఆం ప్ర 5 7 88)

**విశేష తీర్మానం** వి. *viśeeSa tiirmaanam* చట్టసభ పరిధిలోకిరాని అంశాలను సభలో ప్రస్తావించేందుకు ఉద్దేశించిన ప్రతిపాదన special motion *జనతా నాయకుడు . . . ఈ విషయమై లోక్‌సభలో విశేష తీర్మానానికి నోటీసు ఇచ్చారనీ, ఇది వచ్చే వారం చర్చకు వస్తుందనీ తెలియజేశారు.* (ఈ. 26 11 88)

**విశ్రాంతి దినం** వి. *viśraanti dinam* (క్రికెట్ వంటి ఆటల్లో) ఆటగాళ్ళు మధ్యలో సేదతీరడం కోసం కేటాయించిన ఆటలేని రోజు rest day . . . *అయితే విశ్రాంతి దినం నాటికి మాకు చాలా మంచి ఆధిక్యం లభించింది.* (ఈ. 20.4 89)

**విశ్లేషించి చూచు** క్రి. *viśleeSinci cuucu* (విషయాన్ని) క్షుణ్ణంగా విడమరచి పరిశీలించు to scrutinize, analyse ... *ఈ అనుభవాల్ని దృష్టిలో పెట్టుకొని మేము గిరిజన ప్రాంతాలలో అభివృద్ధి కార్యక్రమాలను, శాంతి భద్రతల పరిస్థితిని బాగా విశ్లేషించి చూడవలసి ఉంది" అని ఆయన అన్నారు.* (ఆం ప్ర 31 12.87)

**విశ్వకిరణాలు** వి. (బ.వ.) *viśvakiraNaalu* విశ్వాంతరాళంలో నుంచి భూమికి చేరుకునే కాంతి, ఉష్ణం; కాస్మిక్ కిరణాలు cosmic rays *'ఉటా' విశ్వవిద్యాలయం పరిశోధకులు నిర్మించిన "ప్లైస్‌ఐ" అనే డిటెక్టర్ ఖగోళ విజ్ఞాన రంగంలో కెల్లా వింతగా తోచే అంశాలలో ఒకటైన విశ్వ కిరణాల రహస్యాలను కనుగొంటుంది.* (ఆం. జ్యో 5.12 87)

**విశ్వప్రయత్నం** వి. *viśvaprayatnam* (కార్యసాధన కోసం) ఉన్న శక్తి సామర్థ్యాలను అన్నింటినీ ఉపయోగించటం great effort *కరీంనగర్‌లో అసలు జరిగిందేమిటో తెలుసుకోడానికి రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగం విశ్వప్రయత్నం చేస్తున్నది.* (ఉ 1.7.87)

**విశ్వరూపం** వి. *viśvaruupam* వ్యక్తిలో దాగిఉన్న సంపూర్ణ ప్రతిభా సామర్థ్యాలు one's true class or potential *ముఖ్యంగా కెప్టెన్ గ్రీనిడ్జ్ ఈ మ్యాచ్‌లో తన విశ్వరూపం ప్రదర్శించాడు.* (ఉ 22.3 88)

**విశ్వవిద్యాలయం** వి. *viśvavidyaalayam* ఉన్నత విద్యాబోధన, పరిశోధనా కార్యకలాపాలకు వేదికగా ఉంటూ, సాధారణంగా కొన్ని కళాశాలలతో కూడి ఉన్న వ్యవస్థ university *విశ్వవిద్యాలయాలను వికేంద్రీకరించి కాలేజీలుగా విడగొట్టాలని శ్రీ రామిరెడ్డి సూచించారు.* (ఈ. 17.12.87)

**విశ్వసనీయవర్గం** వి. *viśvasaniiyavargam* (ఇచ్చిన సమాచారానికి సంబంధించి) నమ్మదగిన వ్యక్తి reliable source *జూన్ మొదటి వారంలోనే ఎన్నికల నోటిఫికేషన్ వెలువడుతుందని విశ్వసనీయ వర్గాల ద్వారా తెలిసింది.* (ఈ 27.4.89)

**విశ్వాస తీర్మానం** వి. *viśvasa tiirmaanam* చట్ట సభలలో మెజారిటీ నిరూపించుకునేందుకు ప్రవేశపెట్టే తీర్మానం motion of confidence *సభకు హాజరైన వారిలో 99 మంది విశ్వాస తీర్మానానికి అనుకూలంగా ఓటు చేయగా, ఎనిమిది మంది వ్యతిరేకంగా ఓటు చేశారు.* (ఆం. జ్యో. 29.1.88)

**విషమం** వి. *viSamam* 1.(ఆరోగ్య పరిస్థితి) ప్రమాదకరం critical, dangerous, *14 మంది తీవ్రమైన గాయాలతో చేరగా ఆరుగురి పరిస్థితి విషమంగా వుంది.* (ఆం ప్ర. 18.7 89) 2. చాలా ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నది, కఠినమైనది critical, crucial ... *జిల్లా ప్రజాపరిషత్ అధ్యక్ష స్థానానికి ఈ నెల 6వ తేదీన జరుగుతున్న ఎన్నిక ఇటు అధికార పక్షమైన తెలుగుదేశానికి అటు కాంగ్రెస్‌కు విషమ పరీక్షగా తయారైంది.* (ఆం. జ్యో. 5 3 88)

**విషమించు** క్రి. *viSamincu* (పరిస్థితి) ప్రమాదకరంగా మారు to become serious, deteriorate *మరింత విషమించిన గఫార్‌ఖాన్ ఆరోగ్యం* (ఈ. 7.7.87)

**విసురు** క్రి. *visuru* 1. (వస్తువుని) గాలిలో లక్ష్యంవైపు బలంగా పంపు to hurl, throw కొలంబో నగరంలో రెండు భార తీయ బ్యాంకులపై బుధవారంనాడు సింహళ తీవ్రవాదులు బాంబులు విసిరారు (ఈ 27.7.89) 2. వి. విమర్శిస్తూ అనేమాట (critical) comment త్రిపారీ విసు ర్లతో కాంగ్రెస్ ఇరకాటం (ఈ 20.11.89)

**విస్తరణ** వి. *vistaraNa* సంఖ్యాపరంగా కానీ, ఇతరత్రాకానీ (వస్తు) పరిమాణం పెంచటం expansion త్వరలోనే మంత్రి వర్గ విస్తరణకానీ, మార్పులుకానీ జరుగవచ్చు ననే అనుమానానికి తావిచ్చినట్లయింది. (ఆం ప్ర. 8.4.88)

**విస్తరించు** క్రి. *vistarincu* 1. ఇతర ప్రాంతాలకు వ్యాపించు to spread అందుకే ఈ వ్యాపారం ఆసియా నుంచి ఇటీవల ఆఫ్రికా, లాటిన్అమెరికా ఖండాలకు కూడా విస్తరించింది. (ఆం ప 24.9.87) 2. సంఖ్యా పరంగా కానీ, ఇతరత్రా కానీ పరిమాణం పెంచు to expand ఆంధ్రప్రదేశ్‌లో దూరదర్శన్ ట్రాన్స్‌మిటింగ్ కేంద్రాలను విస్తరించనున్నట్టు శ్రీ భగవత్ వెల్లడించారు. (ఆం జ్యో 9.10.88)

**విస్తుపోవు** క్రి. *vistupoovu* (ఊహించ నిది జరిగినపుడు) ఆశ్చర్యపడు to be surprised . . . మంత్రివర్గంలో ఇప్ప టికే పొడసూపిన విభేదాలు సైనికవర్గాలకు విస్తరిస్తే విస్తుపోనక్కరలేదు. (ఈ 20.2.88)

**విస్తృత ఒప్పందం** వి. *vistRta oppandam* విశాల ప్రాతిపదికపై అంగీకారం broad agreement కిడ్నాపర్లకు, ప్రభు త్వానికి మధ్య ఒక 'విస్తృత ఒప్పందం' కుది రిందని . . . జమ్మూలో ఒక సీనియర్ అధికారి చెప్పారు. (ఆం ప్ర 12.12.89)

**విస్తృతం** వి. *vistRtam* 1. (వి షయానికి సంబంధించి) ముఖ్యమైన అన్ని అంశాలను స్పృశించేది; సవివరం elaborate, extensive మంగళవా రంనాడు సాయంత్రం రెండవసారి జరిగిన సమావేశంలో విస్తృతంగా చర్చించి రాజీ నామాలేఖలపై సంతకాలు చేశారు. (ఉ 25.1.88) 2.(ఏదైనా కార్యకలాపం) నిర్దిష్ట ప్రదేశంలో కొన్ని ప్రాంతాలకే పరిమితం కాకుండా అధికాధిక భాగంలో జరగటం extensive దక్షిణ కాశ్మీర్‌లో ఆయన విస్తృతంగా పర్యటించారు. (ఆం. జ్యో 13.11.88)

**విస్తృతంచేయు** క్రి *vistRtamceeyu* చూ విస్తరించు విశాఖ విమానాశ్రయాన్ని విస్తృతం చేయాలన్న ప్రతిపాదనేదీ పరిశీలనలో లేదని విమానయాన శాఖ సహాయమంత్రి . . . చెప్పారు. (ఈ 20.7.89)

**విస్తృత ధర్మాసనం** వి. *vistRta dharmaasanam* ఎక్కువమంది న్యాయమూ ర్తులతో కూడిన బెంచి larger bench ముఖ్యమంత్రి. . చిత్రంలో నటించకుండా నిరోధించాలని కోరుతూ దాఖలైన వివిధ రిట్ పిటిషన్లను విచారణకు స్వీకరించే విషయంలో వాదనలను హైకోర్టు విస్తృత ధర్మాసనం (లార్జర్ బెంచి) సోమవారం నాడు పరిశీలిస్తుంది (ఈ 23.6.89)

**విస్తృతపరచు** క్రి. *vistRtaparacu* చూ. విస్తరించు 2. హోటల్ పరిశ్రమరంగంలో సహకారాన్ని విస్తృతపరచుకోవాలని ఉభయ దేశాలు ఆసక్తితో ఉన్నాయి. (ఈ 16.7.89)

**విస్తృత ప్రభుత్వం** వి. *vistRta prabhutvam* వివిధ పార్టీలు గ్రూప్‌లకు చెందిన ప్రతినిధులతో విశాల ప్రాతిపదికపై ఏర్పా టయిన ప్రభుత్వం broad-based government ఆఫ్ఘనిస్తాన్‌లో విస్తృత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయటంపై నెలకొన్న

ప్రతిష్టంభనను తొలగించటంలో సోవియట్ విదేశాంగ మంత్రి . . . నేడు విఫలమయ్యారు. (ఆం ప్ర 7.2.89)

**విస్తృత బెంచి** వి. *vistRta benci* చూ. విస్తృత ధర్మాసనం ... ఈ వివాదానికి సంబంధించిన అన్ని రిట్ పిటీషన్లను హైకోర్టు విస్తృత బెంచి ఎదుట ఈ నెల 24వ తేదీన విచారణకు సమర్పించాలని డివిజన్ బెంచి ఆదేశించింది. (ఉ. 8.9.87)

**విస్తృత స్థాయి** వి. *vistRta sthaayi* (చర్చలు, సంభాషణలు మొ. వాటికి సంబంధించి) విశాల ప్రాతిపదిక wide range భారత దేశం పొరుగు దేశాల పట్ల అనుసరిస్తున్న వైఖరిని అవగాహన చేసుకొన్నానని రష్యా అధినేత . . . భారత ప్రధాన మంత్రి . .తో చర్చల సందర్భంగా చెప్పారు. నేడు . . . ఆయనను కలుసుకొని విస్తృత స్థాయిలో చర్చలు జరిపారు. (ఆం ప్ర 17.7.89)

**విహంగశాస్త్రం** వి. *vihangaśaastram* చూ. పక్షిశాస్త్రం ప్రపంచంలోనే ప్రముఖ విహంగ శాస్త్రవేత్త డాక్టరు. సలీం ఆలీ అని, ఆయన మృతితో దేశం ప్రకృతిని ఆరాధించే గొప్ప వ్యక్తిని కోల్పోయిందని రాష్ట్రపతి . . . నేడొక సంతాప సందేశంలో చెప్పారు. (ఆం ప్ర 21.6.87)

**విహంగశాస్త్రవేత్త** వి. *vihangaśastra-veetta* పక్షిశాస్త్రంలో పరిశోధన చేసే వ్యక్తి ornithologist డా. సలీం ఆలీ ప్రపంచ ప్రసిద్ధ విహంగ శాస్త్రవేత్తేకాక, మర్యాద, విజ్ఞానం, విహంగాలకుండే నిర్మలత్వాన్ని కలబోసుకున్న వ్యక్తి అని . . . ఆయన సంతాప సందేశంలో చెప్పారు. (ఆం. ప్ర. 21.6.87)

**వీగిపోవు** క్రి. *viigipoovu* (తీర్మానం, బిల్లు మొ.) మెజారిటీ లభించనందువల్ల ఆమోదం పొందకపోవు to be rejected బిల్లులు రాజ్యసభలో ఆమోదం పొందినా, వీగిపోయినా తమకేం నష్టంలేదని కాంగీయులు నిమ్మకు నీరెత్తినట్టున్నారు. (ఈ 14.8.89)

**వీటో** వి. *viiToo* (భద్రతా మండలిలో శాశ్వత సభ్యదేశాలకు) మెజారిటీ నిర్ణయాలను తిరస్కరించటానికి ఉన్న ప్రత్యేక అధికారం veto మన కాశ్మీర్ సమస్యతో సహా పెక్కు అంతర్జాతీయ సమస్యలపై వర్ధమాన దేశాలకూ, సోషలిస్ట్ దేశాల ప్రయోజనాలకూ హానికరంగా సమితి భద్రతా మండలిలో ఆంగ్లో-అమెరికన్ కూటమి దేశాలు ప్రవేశపెట్టిన పెక్కు తీర్మానాలను 'వీటో' చేసి పక్కకు నెట్టించినవాడు గ్రోమికో. (ఆం భూ 5.7.89)

**వీధికెక్కు** క్రి. *viidhikekku* (అభిప్రాయ భేదాలు) బయటపడు to come into the open చీలికలు వాలికలైన కాంగ్రెస్‌లోని . . . వర్గం, పి. సి. సి. అధ్యక్షుడు . . .వర్గం వివాదాలు వీధికెక్కాయి. (ఆం భూ. 22.7.89)

**వీలునామా** వి. *viilunaamaa* మరణానికి ముందు తమ ఆస్తులు, తదితర వ్యవహారాల గురించి తమ నిర్ణయాలు, అభిప్రాయాలు రాసి ఉంచే పత్రం will, testament కమ్యూనిజం మొట్టమొదట అవతరించినపుడు దాన్ని అనుసరించాలని భావించిన, భావిస్తున్న దేశాల నాయకులలో అత్యధికులు అధికార దాహమున్న పాలకులే నని ఖొమైని తన వీలునామాలో విమర్శించారు. (ఆం భూ 7.6.89)

**వీసా** వి. *viisaa* ఇతర దేశాలలో ప్రవేశించటానికి, తిరగటానికి లేదా వదలి వెళ్ళటా

నికి సంబంధించి అధికారులు పాస్‌పో ర్టుపై ఇచ్చే అనుమతి visa అమెరికాలో శాశ్వత నివాస సౌకర్యం ఉన్నవారికి వెంటనే వీసాలు మంజూరు చేస్తారు (ఆం ప్ర. 26.7.89)

**వృక్షకాలనిర్ణయశాస్త్రం** వి. *vRkSa kaalanirNayaśaaStram* చెట్లు, మాను లలోని వార్షిక వలయాల ఆధారంగా వాటి వయసుని, పర్యావరణపరంగా గతంలో సంభవించిన మార్పుల కాలాన్ని నిర్ణయించే శాస్త్రం dendrochronology చెట్ల, మానులలోని వార్షిక వలయాల సంఖ్యను బట్టి, వాటి వయస్సును నిర్ణయించే శాస్త్ర విభా గాన్ని 'వృక్షకాలనిర్ణయశాస్త్రం' అంటారు. (ఆం జ్యో. 30.6.87)

**వృత్తిపన్ను** వి. *vRttipannu* ఉద్యోగం మీద విధించిన పన్ను professional tax రాష్ట్ర కార్యదర్శి . . . మాట్లాడుతూ కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు వృత్తిపన్ను ఎత్తివేయాలని కోరారు. (ఆం. ప్ర. 26.4.89)

**వృద్ధిపొందు** క్రి. *vRddhipondu* (సంఖ్యా పరంగా) పెరుగు to develop ... తెల్ల కణాలను తిరిగి రోగుల రక్తంలో ప్రవేశపె ట్టగా అవి అక్కడ వృద్ధిపొంది ఊపిరితిత్తులు, మూత్రపిండాలు, పెద్దపేగు చర్మానికి సోకే కాన్సర్‌లను నిర్మూలిస్తున్నట్టు కనిపించింది. (ఆం జ్యో. 2.2.88)

**వెంట్రుకవాసి** వి. *venTrukavaası* అతితక్కువ తేడా hair breadth, narrow ఉత్కంఠగా సాగిన ఈ పరుగు పందెంలో పి. టి. ఉష 52.9 సెకన్ల సమ యంతో వెంట్రుకవాసిలో విజయం సాధించి స్వర్ణపతకం కైవసం చేసుకుంది. (ఈ. 2.9.89)

**వెంపర్లాడు** క్రి. *vemparlaaDu* (సాధా. అనుచితం, అసాధ్యం అయిన విషయాల కోసం) ఆరాటపడు to crave ... అలాంటి పార్టీతో బి.జె.పి. పొత్తు పెట్టు కొని సంకుచిత రాజకీయ ప్రయోజనాల కోసం వెంపర్లాడుతోందని విమర్శించారు. (ఈ 20.7.89)

**వెచ్చించు** క్రి. *veccıncu* ఖర్చుచేయు to spend ఈ మొత్తంలో 58 కోట్లు సహాయ కార్యక్రమాలకు 11 కోట్లు మధ్యతరహా ఇరి గేషన్ పనులకు వెచ్చించగలమని ఆయన అన్నారు. (వి 12.10.87)

**వెట్టిచాకిరి** వి. *veTTicaakiri* తగిన ప్రతిఫలం ఇవ్వకుండా బానిస స్థాయిలో పనిచేయించుకోవటం bondage, bonded labour ఇకపోతే మధ్యప్రదేశ్, బీహార్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు రాష్ట్రాలలో 'వెట్టిచాకిరి' విధానం అమల్లో ఉన్నట్లు సబ్ కమిటీ దృష్టికి వచ్చింది. (ఆం. ప్ర 20.4.88)

**వెదజల్లు** క్రి. *vedajallu* (వస్తువుల్ని) అప రిమితంగా ప్రవేశపెట్టు to flood నాసి రకం, కల్తీ పురుగు మందులను మార్కెట్లోకి విచ్చలవిడిగా వెదజల్లుతున్న వారి 'తాట వలుస్తా' అని హెచ్చరించారు. (ఈ. 23.2.88)

**వెనక్కిపిలిచే హక్కు** వి. *venakkipilıcee hakku* ఎన్నికయిన ప్రజాప్రతినిధిని ఆ నియోజకవర్గం ప్రజలు పదవి నుంచి మధ్య లోనే తప్పించే అవకాశం right to recall ఓటర్లు విశ్వాసాన్ని కోల్పోయినట్ల యితే ఆ ప్రతినిధిని "వెనక్కిపిలిచే హక్కు" వుండాలన్నది . . . సి. పి. ఐ. చేస్తున్న డిమాండ్లలో మరొకటి. (వి 18.10.87)

**వెనక్కుతగ్గు** క్రి. *venakkutaggu* (ప్రదేశం) విడిచివెళ్ళు to retreat, withdraw ఇండోనేషియా, మలయా, ఫిలిప్పైన్స్ తదితర దేశాలలో సామ్రాజ్య వాదులు యుద్ధానంతరం వెనక్కుతగ్గాక

సమరశీల సాయుధపోరాటాలు చెలరేగాయి. (ప్ర శ. 27.10 87)

**వెనుకంజవేయు** క్రి. *venukanjaveeyu* అనుమానంతోకానీ, అననుకూల పరిస్థితు లవలనకానీ ఒకపని చేయకుండా ఆగిపోవు to draw back పోలీసులు ముందుకు అడుగువేసినట్లయితే, తాము ఎటువంటి చర్య కైనా పూనుకుంటామని తీవ్రవాదులు బెద రించడంతో వారు వెనుకంజవేసినట్లు తెలు స్తోంది (ఆం.జ్యో 30 12 87)

**వెనుకేసుకువచ్చు** క్రి. *venukeesuku-vaccu* సమర్థించు to defend, back పార్టీ వెన్నుపోటు పొడవ చూపిన నైతిక విలు వలు లేని వారిని కాంగ్రెస్‌వారు వెనుకేసు కురావడం విచారకరమని ఆయన అన్నారు. (ఉ. 1 12.87)

**వెనుదీయు** క్రి. *venuduuyu* సడలింపు ధోరణి ప్రదర్శించు to relent దౌర్జన్యా లను అరికట్టడంలో ప్రభుత్వం ఏ మాత్రం వెనుదీయదన్నారు. (ఈ 14.6 89)

**వెన్నుదన్ను** వి. *vennudannu* గట్టి మద్దతు strong support, backbone విద్యార్థుల ఉద్యమానికి వెన్ను దన్నుగా ఉంటున్న ఉదారవాదులు కూడా క్రమంగా వెనక్కి తగ్గుతున్నారు. (ఈ 30.5 89)

**వెన్నుపోటు** వి. *vennupooTu* దొంగచా టుగా దెబ్బతీయటం back stabbing కుట్రదారుల వెన్నుపోటు రాజకీయాలకు సంబంధించిన సాక్ష్యాధారాలు తమ వద్ద వున్నాయని . . . ఆయన చెప్పారు. (ఆం. ప. 18.7.87)

**వెన్నువిరుచు** క్రి. *vennuvirucu* (ఎదుటి పక్షం) బలాన్ని కోలుకోలేని విధంగా దెబ్బ తీయు to wreck, rip through రిలయన్స్ పోటీలో పరుగుల తుఫాన్ సృష్టిం చిన నవజ్యోతిసింగ్ సిద్ధూ, మద్రాస్ టెస్టులో వెస్టిండీస్ వెన్ను విరచిన నరేంద్ర హిర్వాణీ లను ప్రత్యక్షంగా చూడాలన్న ఆసక్తి పలువురు షార్జా క్రికెట్ అభిమానులు వ్యక్తపరిచారు. (ఉ 22 3.88)

**వెయిట్ లిఫ్టింగ్** వి. *veyiT lifT-ing* (పందెంలో భాగంగా) బరువులు ఎత్తటం weight lifting యురోపి యన్ వెయిట్ లిఫ్టింగ్ పోటీల్లో రష్యాకు నాలుగో టైటిల్ లభించింది. (ఆం ప్ర. 23 9 89)

**వెలయు** క్రి *velayu* ప్రత్యక్షమగు, కనిపించు to appear . . . ప్రభాకరన్‌కు శ్రద్ధాం జలి ఘటించవలసిందిగా ప్రజలను కోరుతూ టైగర్ల గట్టి స్థావరమైన వావునియాలో పోస్టర్లు వెలసినట్టు శ్రీలంక సైనికవర్గాలు తెలిపాయి. (ఈ 25.7 89)

**వెలవెలబోవు** క్రి. *velavelaboovu* కళా కాంతులు కోల్పోవు to look pale విజయవాడలోని వస్త్రలత బీసెంట్‌రోడ్, వన్‌టౌన్‌లలో వస్త్రాలషాపులు మూసివేయ డంతో ఆప్రాంతాలు వెలవెలబోయాయి. (ఈ 5 6 87)

**వెలికితీయు** క్రి. *velikituuyu* (మరుగున పడి ఉన్నవాటిని) బయటికితీయు to dig out,extricate అగ్నిమాపక సిబ్బంది, పోలీసులు హుటాహుటిన ఆ ప్రాంతానికి చేరుకొని రాళ్ళ కింద పడిన రెండు శవా లను వెలికితీశారు. (ఆం. ప్ర. 18 7 89)

**వెలిడిక్టరీ** వి. *veliDikTarii* (ఏదైనా కార్యక్రమానికి) ముగింపు ఉత్సవం valedictory ప్రొద్దుటూరు వ్యాయామకళాశాల వారు నిర్వహించిన 'యోగాసన వెలిడిక్టరి' కార్యక్రమానికి ముఖ్య అతిథిగా, హైదరాబాద్‌కు చెందిన . . . (ఆం ప 1 9.87)

**వెలిబుచ్చు** క్రి. *velibuccu* (భావాలు, అభిప్రాయాలు) వ్యక్తపరచు to express ఆయన నేటి ఉదయం ఎ.ఐ.సి.సి ప్రధాన కార్యదర్శి . . .ను కలిసి తన అభిప్రాయం వెలిబుచ్చారు. (ఆం. ప్ర 29 6.89)

**వెలుగు** క్రి. *velugu* అధికమైన ప్రాముఖ్యం పొందు to shine, enjoy రాష్ట్ర మంత్రివర్గంలో నంబర్ టూగా వెలిగిన శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి . . . (ఆం. జ్యో. 11 12.87)

**వెలుగుచూచు** క్రి. *velugucuucu* అందుబాటులోకి వచ్చు to see the light, appear భారత, రామాయణాలకు, భగవద్గీతకు ఆనాటి నుండి ఈనాటి వరకు ఎంతమంది చేతుల మీదుగానో టీకా తాత్పర్యాలు వెలిశాయి. విభిన్న వ్యాఖ్యానాలు వెలుగుచూశాయి. (ఆం భూ 28.8 89)

**వెలుగులోకి వచ్చు** క్రి. *velugulooki vaccu* జనానికి తెలియు to come to the light ఒక హరిజన రైతు పచ్చని పైరుని ఒక బడా భూస్వామి తన నిరంకుశత్వంతో పశువులతో తొక్కించి పేదరైతు నోట్లో మట్టి కొట్టిన సంగతి ఆలస్యంగా వెలుగులోకి వచ్చింది. (ఆం ప్ర. 21 8 89)

**వెలువడు** క్రి. *veluvaDu* (ఉత్తరాలు, ఫలితాలు మొ.) ప్రకటితమగు to be issued, be out ప్రైరిస్టులపై సెక్యూరిటీ దళాలు కఠిన చర్యలను తీసుకొంటాయని టెలివిజన్ ద్వారా అధికారిక ఉత్తర్వు వెలువడింది. (ఈ 26 7.89) పరీక్ష ఫలితాలు ఏడవతేదీన వెలువడుతాయి. (ఆం ప్ర 27.6.87)

**వెలువరించు** క్రి. *veluvarincu* (పుస్తకాలు, ఫలితాలు మొ.) అచ్చురూపంలో బయటికి ప్రకటించు to bring out, publish . . . కాకులు అనే కథల సంపుటి వెలువరించారు. (ఆం. భూ. 21 11 87)

**వెల్లడగు** క్రి. *vellaDagu* (విషయం) బయటపడు to become known ఎవరేమి ఘోషించినా రాజ్యాంగ సవరణ తెచ్చి తీరాలన్న ప్రధాని రాజీవ్ గాంధీ పంతం సడలదన్నది ఢిల్లీ సదస్సులో వెల్లడైంది. (ఈ 8.5 89)

**వెల్లడించు** క్రి. *vellaDincu* (గుప్తంగా ఉన్న విషయం లేదా సమాచారం) తెలియజేయు to reveal కమిటీ ఛైర్మన్ పార్లమెంటుకన్నా ముందు పత్రికలకు కమిటీకి సంబంధించిన విషయాలను వెల్లడించటం పట్ల వారు అభ్యంతరం వ్యక్తం చేశారు. (ఆం ప్ర 13 4 88)

**వెల్లడిచేయు** క్రి. *vellaDiceeyu* చూ. వెల్లడించు జనరల్ సుందర్జీ బోఫోర్స్ కుంభకోణంలో జరిగిన కీలకమైన అంశాలను వెల్లడి చేశారని ఆయన అభివర్ణించారు. (ఆం. భూ. 3.9 89)

**వెల్లవేయు** క్రి. *vellaveeyu* (నిజాన్ని) కప్పిపుచ్చు to paint over వాస్తవాలకు వెల్లవేసి, తిమ్మిని బమ్మి చేసేందుకు సృష్టించిన జాయింట్ పార్లమెంటరీ కమిటీలో పాల్గొనేది లేదని ప్రధాన ప్రతిపక్ష పార్టీలన్నీ బహిష్కరించినా పాలకులకు, వారి తాబేదార్లకు చీమకుట్టినట్లయినా లేకపోయింది. (ఈ 25 7.89)

**వెల్లివిరియు** క్రి. *vellivirıyu* (సంతోషం, ఆనందం మొ.) ఉప్పొంగు to swell

out, overflow రాబిన్ స్మిత్, గోవ ర్ లు కలసి ఇంగ్లండ్ అభిమానుల ముఖాల్లో సంతోషం వెల్లివిరిసేలా చేయగలిగారు. (ఈ 28.7.89)

**వెల్లువ** వి. *velluva* (ఎన్నికల్లో) ఎదురులేని విజయ పరంపర wave హర్యానాలో కాంగ్రెస్(ఐ) ప్రభుత్వాన్ని కూల్చివేసిన దేవీలాల్ వెల్లువలో పాలకపార్టీ ప్రముఖుల కుమారులు పూర్తిగా కొట్టుకు పోయారు. (వి 20.6.87)

**వెళ్ళగక్కు** క్రి. *veLLagakku* మనసులోని మాటను బయటపెట్టు to speak (one's mind) టికెట్టు ఇచ్చి గెలిపించిన పార్టీకొమ్ము కాయకపోతే మళ్ళీ ఎన్నికల్లో నెగ్గడానికి ఎవరు సహాయం చేస్తారని సర్దార్ హుకుంసింగ్ లాంటి స్పీకర్లు బాహాటంగానే తమ ఆలోచనా సరళిని వెళ్ళగక్కారు. (ఈ 25 5.89)

**వెళ్ళదీయు** క్రి. *veLLaduyu* లేమితోకానీ, ఆసక్తి లేకుండా కానీ (కాలం, జీవితం) గడుపు to live or spend time in a disinterested or casual manner దారిద్ర్యరేఖకు దిగువన బ్రతుకుల్ని వెళ్ళదీస్తున్న ప్రతికుటుంబంలో ఒకరికి ఉద్యోగం కల్పించి ఆదుకోవాలన్న ఉద్దేశమే ఈ పథకం లక్ష్యమని ఆయన చెప్పారు. (ఆం భూ 2.5 89)

**వెళ్ళబుచ్చు** క్రి. *veLLabuccu* చూ. వెళ్ళదీయు. చాలీచాలని సౌకర్యాలతో, భవనాల కొరతతో సదుపాయాలలేమితో న్యాయమూర్తులు కాలం వెళ్ళబుచ్చవలసి వస్తోందని ఆయన ఆవేదనగా చెప్పారు. (ఈ. 4.7 89)

**వెసులుబాటు** వి. *vesulubaaTu* (తోచిన విధంగా) నిర్ణయాలు తీసుకోవటానికీ, పనులు చేయటానికి ఉన్న స్వేచ్ఛ freedom, flexibility ప్రతిపక్ష పార్టీల వోట్లు చీలకుండా ఉండేందుకు సీట్ల సర్దుబాటు విషయంలో జనతాదళ్ రాష్ట్ర శాఖలకు వెసులుబాటు కల్పిస్తున్నట్లు ఆయన వివరించారు. (ఆం భూ 26 4 89)

**వేగిరపరచు** క్రి *veegiraparacu* (పని, పరిణామం మొ.) మరింత వేగంగా జరిగేట్లు చేయు to speed up భారతీయులను అక్కడ నుంచి ఖాళీ చేయించేపని వేగిర పరుస్తామని విదేశీ వ్యవహారాల మంత్రిత్వ శాఖ అధికార ప్రతినిధి . . . చెప్పారు. (ఈ 9 6 89)

**వేట** వి. *veeTa* నిందితులనుకానీ శత్రువుల నుకానీ పట్టుకోవటంకోసం పెద్ద ఎత్తున వెతకటం; గాలింపు hunt గతరాత్రి దాడిచేసిన టెర్రరిస్టులకోసం పోలీసులు భారీ ఎత్తున వేట ప్రారంభించారు. (ఉ. 15.6 87)

**వేటు** వి. *veeTu* శిక్షాత్మక చర్య stroke జాతీయ వ్యతిరేక రాష్ట్రాలపై వేటు. (ఆం. భూ. 17 12 87)

**వేడినందుకొను** క్రి. *veeDinandukonu* (కార్యకలాపాల జోరుతో వాతావరణం) మరింత ఉత్తేజకరంగా మారు to hot up . . . గ్రామాలలో ఎక్కడ చూసినా వేడివేడిగా ఎన్నికలపై చర్చలు జోరుగా సాగుతూ క్రమంగా గ్రామీణ వాతావరణం వేడినందుకుంటోంది. (ఉ 27.2 88)

**వేతనం** వి. *veetanam* చేసిన పనికి ప్రతిఫలంగా (సాధా.) నెలకోసారి నియమ క్రమంగా ముట్టజెప్పే డబ్బు; **జీతం** wage, salary అధికారుల నిర్లక్ష్యం వల్లే తమకు సవరించిన వేతనాలు అందటంలేదని ఆయన విమర్శించారు. (ఆం. ప్ర 15 5 89)

**వేతనం స్కేలు** వి. *veetanam skeelu* మూలవేతనపు కనిష్ట గరిష్ట పరిమితులు,

ఇంక్రిమెంట్లు మొదలైన వివరాలు విడి విడిగా పొందుపరచి ఉన్న జీతం కొల మానం pay scale ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు ప్రకటించిన యూని వర్సిటీ గ్రాంట్స్ కమీషన్ (యు. జి. సి) వేతనం స్కేళ్ళను వర్తింపజేస్తామని విద్యాశా ఖమంత్రి శ్రీ ఇంద్రారెడ్డి తెలిపారు. (ఆం జ్యో. 8.12 88)

**వేదిక** వి. *veedika* అభిప్రాయ వ్యక్తీ కరణకు, తత్సంబంధిత కార్యకలాపాలకు కేంద్రమైన సంస్థాగత నిర్మాణం forum, platform *అలీనోద్యమం వంటి వేదికలను ఉపయోగించేందుకు ఉద్యుక్తం కావల్సింది.* (ఈ. 5.6 87)

**వేధశాల** వి. *veedhaśaala* (శాస్త్ర జ్ఞులు) నక్షత్రాలు, వాతావరణం వంటి విషయాలను పరిశీలించటానికి తగిన పరి కరాలు ఏర్పాటు చేసి ఉన్న భవనం observatory *1987కు అదనంగా ఒక సెకెను చేర్చటం జరుగుతున్నది అని, ఈ వేధశాల (అబ్జర్వేటరీ) పేర్కొన్నది.* (ఆం ప 5.10.87)

**వేధించు** క్రి. *veedhincu* 1. బాధలు పెట్టు to harass *వరకట్నంకోసం వేధించేవారిని శిక్షించేందుకు పటిష్టమైన చట్టాలున్నాయి.* (ఈ 30189) 2. ఇబ్బంది పెట్టు to bother . . . *కొన్నాళ్ళ ముందు తాము చేసిన ప్రతిపాదనలనే రష్యా ఆమో దిస్తే అందులో ఏదో ఉందన్న అనుమానం ఆ దేశాలను వేధిస్తోంది.* (ఆం భూ. 20 6 87)

**వేధింపు** వి. *veedhimpu* మాటలతోకానీ, చేతలతోకానీ అదే పనిగా (వెంటపడి) బాధ పెట్టటం harassment, teasing . . . *అయితే ఈ సందర్భంలో అర్థాంతరంగా తన పదవికి రాజీనామా చేసిన సర్పంచ్ శ్రీ నరహరి రాజీనామా వెనుక నక్సలైట్ల హస్తం కాని, ఇటు పోలీసుల వేధింపుగాని ఉండవచ్చని స్థానిక రాజకీయ నాయకులం టున్నారు.* (ఆం భూ 16.5.89)

**వేయు** క్రి. *veeyu* (కమిటీని) నియమించు to appoint, constitute *1986 లో నిర్బంధితులైన వారి కేసుల పరిశీలనకై ప్రధాని మహమ్మద్‌ఖాన్ జొనేజో లోగడ పార్లమెంటరీ కమిటీని వేశారు.* (ఆం. భూ. 21 11.87)

**వేర్పాటు ఉద్యమం** వి. *veerpaaTu udyamam* ప్రత్యేకమైన రాజకీయపాలనా ప్రాంతంగా విడిపోవాలని చేసే ఆందోళన secessionist movement *గతంలో రెండు సార్లు వేర్పాటు ఉద్యమాలను, మత సంఘర్షణలను సమర్థవంతంగా ఎదుర్కొ న్నారన్నారు.* (ఆం. ప్ర 22 4.89)

**వేర్పాటువాదం** వి. *veerpaaTuvaadam* ప్రత్యేకమైన రాజకీయపాలనా ప్రాంతం (దేశం లేదా రాష్ట్రం)గా విడిపోవాలని చేసే ఆందోళన secessionism *అంతే కాక ఇప్పటికే చెడిన కేంద్ర రాష్ట్ర సంబంధా లను మరింత దిగజారుస్తాయని వేర్పాటువా దానికి దోహదపడ్తాయని ఆయన విమర్శిం చారు.* (ఆం. ప్ర 5 7 89)

**వేర్పాటువాద శక్తి** వి. *veerpaaTu-vaada śakti* దేశాన్ని చీల్చటానికి ప్రయ త్నించే వ్యక్తి లేదా ముఠా secessionist force *దేశసమైక్యత, సమగ్రతలకు సవా లుగా పరిణమించిన మతతత్వ, వేర్పాటువాద శక్తులతో ప్రతిపక్షాలు కుమ్మక్కయ్యాయని ప్రధాని ఆరోపించారు.* (ఆం భూ 19.5 89)

**వేలెత్తిచూపు** క్రి. *veeletticuupu* పొర పాటు లేదా తప్పును పేర్కొను to point out *బొంబాయిలో వరల్డ్‌కప్*

సెమీఫైనల్లో తమ కెప్టెన్ వైదొలగడం ఓ టెస్టులో బ్యాటింగ్ ఆర్డర్లో ఓ మెట్టుదిగడం మొదలైన వాటిని వేలెత్తి చూపారు. (ఈ. 30.5.89)

**వేళాకోళమాడు** క్రి. *veeLaakooLama-aDu* పరిహాసపూర్వకంగా మాట్లాడు to make fun of sb సాయంకాలాల్లో ఏడుగంటలకే పెళ్ళాంతో పక్కకు చేరి టి.వి. చూస్తూ గడిపేవాడని రీగన్‌ను వేళాకోళమాడేవారట వైట్‌హౌస్ సిబ్బంది. (ఆం భూ 21.4 89)

**వేసవి శిబిరం** వి. *veesavi śibiram* ఒక ప్రత్యేక విషయంపై అవగాహన పెంపొందించేందుకు, తగిన శిక్షణ ఇచ్చేందుకు ఎండాకాలం ( సెలవుల్లో) ఏర్పాటు చేసే కార్యక్రమం summer camp పిల్లలకు అంతర్జాతీయ అవగాహనకోసం నిర్వహించే వేసవి శిబిరాలలో పాల్గొనేందుకు అందరికీ అవకాశం లభించదని, అందువల్ల దేశంలోని వివిధ రాష్ట్రాల మధ్య మార్పిడిని ప్రారంభించాలని గవర్నర్ . . . అభిప్రాయపడ్డారు. (ఉ. 24 7.87)

**వైఖరి** వి. *vaikhari* (ఒక విషయంపట్ల) ఆలోచన, ప్రవర్తనలకు సంబంధించిన ధోరణి attitude, stand 'కాగ్'నివేదికపై ప్రభుత్వవైఖరికి నిరసనగా లోక్‌సభకు మూకుమ్మడి రాజీనామాలు చేయాలని . . . (ఆం. ప్ర 23 7 87)

**వైదొలగు** క్రి. *vaidolagu* 1. (పదవి) విడిచిపెట్టు to step down పబ్లిక్ అకౌంట్స్ కమిటీ ఛైర్మన్‌ను ప్రతిపక్ష పార్టీల నుంచి ఆయా పార్టీల బలాబలాల ప్రాతిపదికగా నియమించాలన్న పార్లమెంటరీ సంప్రదాయాన్ని స్పీకర్ గౌరవించకపోతే పార్లమెంటరీ ఆర్థిక కమిటీల నుంచి వైదొలగాలని ఉభయసభలలోని ప్రతి పక్షపార్టీల ఎం.పీ.లు సమావేశమై నిర్ణయించారు. (ఆం. భూ. 12.5 89) 2. (సైనికంగా) అధీనంలో ఉన్న ప్రాంతం ఖాళీ చేసి వెళ్ళు to move out, clear away ఆఫ్ఘనిస్తాన్ నుండి సోవియట్ యూనియన్ వైదొలగాలని . . . సఖరోవ్ విజ్ఞప్తి చేశారు. (ఆం. ప్ర. 16.6 87)

**వైద్యమండలి** వి. *vaidyamanDali* వైద్యరంగంలో విద్య, పాలనాది వ్యవహారాలు చూసుకునేందుకు ఏర్పాటయిన ఉన్నత స్థాయి యంత్రాంగం medical council రాష్ట్రంలో సుమారు ఆరు నెలల కాలంలో ప్రభుత్వం వైద్యమండలిని ఏర్పాటు చేస్తుందని వైద్య ఆరోగ్యశాఖ మంత్రి . . . ప్రకటించారు. (ఈ. 22 7 87)

**వైభవప్రాభవాలు** వి. (బ.వ.) *vaibha-vapraabhavaalu* చారిత్రకంగా సిద్ధించిన గొప్పతనం great heritage మన దేశ, రాష్ట్రాల సంస్కృతి వైభవప్రాభవాలను గురించి ప్రజలకు చెప్పడానికి . . . (ఈ. 7 6 89)

**వైమానిక దళం** వి. *vaimaanika daLam* గగనతలంలో (విమానాల నుంచి) పోరాడే సాయుధ దళాల విభాగం air force భారత వైమానిక దళానికి గగనతలంలో కావలసింది పిల్లులుకాదు, పులులని . . . అన్నారు. (ఆం ప్ర 9 10.87)

**వొరగబెట్టు** క్రి. *voragabeTTu* సహాయం అందించు (వ్యంగ్యం) to help దళిత వర్గాలను ఉద్ధరిస్తానని చెప్పిన . . . వెనుకబడిన తరగతులకు కూడా ఏమీ వొరగబెట్టలేదని మొసలి కన్నీరు కారుస్తున్నాడని . . విమర్శించారు. (ఆం. ప్ర. 29.11 87)

**వోట్ ఆన్ అకౌంట్ బడ్జెట్** వి. *vooTaan akaunT baDjeT* ప్రధాన

బడ్జెట్‌ను సమర్పించేలోగా ప్రభుత్వ అవసరానికై ప్రవేశపెట్టే తాత్కాలిక బడ్జెట్ vote on account budget వోట్ ఆన్ అకౌంట్ బడ్జెట్ ప్రవేశపెట్టినపుడు రెవిన్యూఖాతాలో *187* కోట్ల మిగులు చూపించారు. (ఆం ప్ర. 14 7 87)

**వోటరు** వి. *vooTaru* ఎన్నికలలో ఓటు వెయ్యటానికి హక్కు పొందిన పౌరుడు voter యాభై ఐదులక్షల వోటర్లలో దాదాపు అరవై శాతం వోటర్లు ఈ వోటింగ్‌లో పాల్గొన్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. (ఆం ప్ర. 5 7 89)

**వోటింగ్** వి. *vooTing* ఓటు వేయటం voting యాభై ఐదులక్షల వోటర్లలో దాదాపు అరవై శాతం వోటర్లు ఈ వోటింగ్‌లో పాల్గొన్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. (ఆం ప్ర 5 7 89)

**వ్యక్తంచేయు** క్రి. *vyaktamceeyu* (ఆలోచనలు, అభిప్రాయాలు మొ.) వెలిబుచ్చు to express కాంగ్రెస్ ప్రజల విశ్వాసాన్ని చూరగొంటూనే ఉన్నదన్న విశ్వాసాన్ని ఆయన వ్యక్తం చేశారు. (ఈ 29 7 89)

**వ్యక్తిగత హింసావాదం** వి. *vyaktigata himsaavaadam* కేవలం కొందరు వ్యక్తుల్ని, వర్గశత్రువుల్ని హతమార్చటం ద్వారా రాజకీయ లక్ష్యం సాధించవచ్చు ననే విధానం political belief in making individuals as one's targets అరెస్టులకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమం నిర్మించాలేతప్ప అమాయకుల హత్యలు ప్రత్యామ్నాయం కావని వారు పేర్కొన్నారు. వ్యక్తిగత హింసావాదంవల్ల సాధించేది ఏమీ ఉండదని వారు పేర్కొన్నారు. (ఆం. ప్ర 13 6 89)

**వ్యక్తిపూజ** వి. *vyaktipuuja* ఆయా రంగాలలో తమకు అభిమాన పాత్రమైన వ్యక్తుల్ని అమితంగా ఆరాధించటం hero-worship వ్యక్తి పూజలు లేవు అంటున్న ముఖ్యమంత్రి తన కాళ్ళకు సాష్టాంగ నమస్కారాలు చేస్తున్నా కూడా ఎటువంటి అభ్యంతరం చెప్పకపోవడంతో కాళ్ళకు మొక్కేవారి సంఖ్య విమానాశ్రయంలో క్రమేణా పెరిగింది (ఉ 9 7 87)

**వ్యతిరేక పవనం** వి. *vyatireeka pavanam* (వ్యక్తులు లేదా సంస్థల పట్ల) ప్రజల్లో వ్యక్తం అయ్యే అయిష్టత hostile wind ప్రస్తుతం నాగాలాండ్ కాంగ్రెస్(ఐ)కు వ్యతిరేక పవనాలు వీస్తున్నాయని . . . చెప్పారు. (ఈ 18 6 87)

**వ్యయకర్తనం** వి. *vyayakartanam* (నిధులు) ఖర్చు చేసే విధానం expenditure వ్యయకర్తనంపై కమిటీ వ్యయాన్ని తగ్గించే ఉద్దేశంతో నాలుగైదు మంత్రిత్వ శాఖల పనితీరును కూలంకషంగా అధ్యయనం చేసేందుకు క్యాబినెట్ కార్యదర్శి అధ్యక్షతన ఒక ఉన్నతస్థాయి కమిటీ నియమించినట్టు . . . చెప్పారు. (ఆం. ప్ర 6 10 88)

**వ్యర్థపదార్థం** వి. *vyarthapadaartham* ఉత్పత్తి క్రమంలో నిరుపయోగంగా మిగిలిపోయిన (ద్రవ లేదా ఘన రూపంలోని) చెత్త waste product ఈ పరిశ్రమల నుంచి వెలువడుతున్న వ్యర్థపదార్థాల్ని నక్కవాగులోకి వదిలివేస్తున్నారు. (ఉ 18 4 88)

**వ్యవధి** వి. *vyavadhi* ఒక పనిచెయ్యటానికి అవసరమైన కాలపరిమితి, గడువు time "కలకత్తా టెస్టు వల్ల అస్సలు తీరికలేకుండా పోయింది. అందువల్ల మరో పదిరోజుల వ్యవధి కావాలని విజ్ఞప్తి చేస్తున్నారు" అని వెంగ్‌సర్కార్ బోర్డుకు పంపిన ఒక లేఖలో కోరారు. (ఆం. ప్ర 1 1 88)

**వ్యవసాయ కమతం** వి. *vyavasaaya kamatam* సాగు నిమిత్తం ఒక్క కుటుంబం అధీనంలో ఉన్న భూమి agricultural holding పశ్చిమ దేశాలు సైతం సామూహిక వ్యవసాయ కమతాలు వదలి వ్యక్తిగత వ్యవసాయ కమతాల వైపు దృష్టి సారిస్తున్నాయని ఆయన పేర్కొన్నారు. (ఆం ప్ర. 18.7.87)

**వ్యవస్థాపక సదస్సు** వి. *vyavasthaapaka sadassu* కొత్త సంస్థను ఏర్పాటు చేసి ప్రకటించేందుకు జరిగే సమావేశం formation convention నేడిక్కడ నాలుగు పార్టీల ప్రతిపక్ష 'జనతాదళ్' వ్యవస్థాపక సదస్సును ఉద్దేశించి ప్రసంగిస్తూ శ్రీ దేవీలాల్ . . . 'నిరుద్యోగభృతి ప్రకటించడానికి నేనెంతగానో గర్విస్తున్నాను' అని పేర్కొన్నారు. (ఆం. ప్ర 12.10.88)

**వ్యవస్థాపక సమావేశం** వి. *vyavasthaapaka samaaveeśam* చూ. వ్యవస్థాపక సదస్సు. జనతాదళ్ ఏర్పడేందుకు గతనెల పదకొండో తేదీన బెంగుళూరులో జరిగిన వ్యవస్థాపక సమావేశంలో తీసుకున్న నిర్ణయాన్ని నేడు జనతాపార్టీ నేషనల్ కౌన్సిల్ ప్లీనరీ సమావేశం ఆమోదించటంతో కొత్త పార్టీ అమల్లోకి వచ్చినట్లయింది. (ఆం ప్ర 19.11.88)

**వ్యవహరించు** క్రి. *vyavaharincu* 1. బాధ్యతలు నిర్వహించు to act ఇప్పటివరకు అస్సాం గవర్నర్ హరిదేవ్ జోషి మేఘాలయ గవర్నర్‌గా కూడా వ్యవహరించారు. (ఈ. 5.7.89) 2. ప్రవర్తించు to deal with పొరుగుదేశంతో వ్యవహరించడంలో భారత ప్రభుత్వానికి కొన్ని పరిమితులున్నాయి. (ఈ. 5.6.87)

**వ్యవహారం** వి. *vyavahaaram* రాజకీయ, వ్యాపారాది రంగాలకు సంబంధించిన విషయం affair బోఫోర్స్ ఏజెంట్ విన్‌ఛద్దా పాస్‌పోర్ట్ వ్యవహారంలో ఉన్న మిస్టరీని, ఆయన పర్యటనకు దారితీసిన పరిస్థితులను . . . (ఆం. ప్ర. 19.4.88)

**వ్యవహారశైలి** వి. *vyavahaaraśaili* పని చేసే పద్ధతి style of functioning నలుగురు ముఖ్యమంత్రులను మార్చిన కాంగ్రెస్ అధిష్ఠానవర్గం ఆరేళ్ళలో ఐదుగురు పి.సి.సి అధ్యక్షులను మార్చటం ఎంతమాత్రం వింతకాదు. అప్పటికీ ఇప్పటికీ కాంగ్రెస్ వ్యవహారశైలి అంతే మార్పేమీలేదు. (ఆం. ప్ర. 4.5.89)

**వ్యాఖ్యాత** వి. *vyaakhyaata* కార్యక్రమాలను (ప్రేక్షకులు లేదా శ్రోతలకోసం) వివరించే వ్యక్తి commentator, compere ఈ కార్యక్రమాలన్నింటికీ ప్రముఖ నటి తులసి వ్యాఖ్యాతగా వ్యవహరిస్తారు. (ప్ర.శ. 5.6.87)

**వ్యాఖ్యానం** వి. *vyaakhyaanam* ఏదైనా విషయంపై (సాధా. నిపుణులు) తెలియజేసే అభిప్రాయం comment . . . ఈ నెల 26 సాయంత్రం నుంచి అర్ధరాత్రి వరకు నిపుణుల ప్రత్యేక వ్యాఖ్యానాలను కూడా ప్రసారం చేస్తారు. (ఈ. 25.11.89)

**వ్యాఖ్యానించు** క్రి. *vyaakhyaanincu* ఏదైనా విషయం లేదా వ్యక్తులపై తమ అభిప్రాయం, విమర్శ మొ. వ్యక్తంచేయు to comment ఈ సందర్భంగా . . . మాట్లాడుతూ 'మన ప్రణాళికా రచన' లోపభూయిష్టంగా, తప్పుదారి పట్టించేదిగా వుందని వ్యాఖ్యానించారు. (ఆం. జ్యో. 21.11.88)

**వ్యాజ్యకారుడు** వి. *vyaajyakaaruDu* కేసు నిమిత్తం కోర్టుకు వచ్చేవాడు litigant ప్రతిరోజు వేలాదిమంది లాయ

ర్లతో వ్యాజ్యకారులతో హడావిడిగా ఉండే రాజధానిలోని మూడు కోర్టులు నేడు బోసి పోయాయి. (ఆం ప్ర 6.7 89)

**వ్యాపకం** వి. *vyaapakam* ఏదైనా పనిచేస్తూ ఉండటం involvement, activity కన్నూమిన్నూ కానని నిరంతర వ్యాపకాలతో కూడుకున్న ఈ ప్రపంచంలో మనుషులకు ఆలోచించడానికే వ్యవధి చాలదు. (ఆం భూ. 23 4.89)

**వ్యూ హం** వి. *vyuuham* 1. (పోరాటంలో) ప్రత్యర్థులపై విజయం సాధించటానికి చేసే ప్రణాళిక strategy (as in military, election campaign etc.) నక్సలైట్ల వ్యూహాలను భేదించే శిక్షణగల మిలిటరీకి దీని బాధ్యత అప్పగించాలని ఆయన కోరారు. (ఈ 2.1 88) 2. (విద్య, వాణిజ్యం మొ. రంగాలలో) నిర్ణీత లక్ష్యం సాధించటానికి నిర్ణయించిన పద్ధతి strategy (as in education, business etc.) శ్రీలంక చర్య కారణంగా ఏర్పడిన పరిస్థితిని ఎదుర్కొనే వ్యూహం నిర్ణయిస్తారని తేయాకు బోర్డు ఛైర్మన్ . . . (ఆం. ప్ర. 6 6 87)

**వ్యూహ నిపుణుడు** వి. *vyuuha nipuNuDu* వ్యూహాలు పన్నడంలో నేర్పరి strategist రైతులను సంపన్నులు, పేదలుగా విభజించి, పట్టణ గ్రామీణ శ్రామికులను ఏకంచేయాలని నినాదం ఇచ్చారు. దీనితో లెనిన్‌కు గొప్ప వ్యూహ నిపుణుడుగా పేరు వచ్చింది. (ఆం. ప్ర 21.8.89)

**వ్యోమగామి** వి. *vyoomagaami* అంతరిక్ష నౌకలో ప్రయాణించటానికి, నిర్ణీత విధులు నిర్వహించటానికి శిక్షణ పొందిన వ్యక్తి; అంతరిక్ష యాత్రికుడు astronaut ప్రపంచంలో కెల్లా అత్యంతాధునికమైన 'మిర్' స్టేషన్‌లో ఆరునెలలుగా తమ విధులు నిర్వర్తిస్తున్న యూరిరొమనెంకో, అలెగ్జాండర్‌లవీకిన్‌లు సోయజ్ టిఎం. 34 వ్యోమగాములు ముగ్గురికి స్వాగతం పలికారు. (ఈ. 25 7 87)

## శ

**శంకుస్థాపన** వి. *śankusthaapana* కొత్త కట్టడాలు ప్రారంభించటానికి ముందు లాంఛనంగా జరిపే పూజా కార్యక్రమం laying of foundation stone 30 కోట్ల రూపాయల వ్యయంతో చేపడుతున్న రైవాడ ప్రాజెక్టును ముఖ్యమంత్రి త్వరలో శంకుస్థాపన చేస్తారని తెలిపారు. (ఓ. 15.10.88)

**శఠగోపం** వి. *śaThagoopam* నమ్మించి మోసం చేయటం cheating ఓరుగల్లు వాసులకు 'సప్తగిరి' శఠగోపం. (ఆం. జ్యో. 25 6 87)

**శతఘ్ని** వి. *śataghni* యుద్ధ రంగంలో శత్రు లక్ష్యాలపై దాడిచేయటానికి ఉపయోగించే భారీ తుపాకి artillery gun బోఫోర్స్ శతఘ్నుల కొనుగోలు వ్యవహారంలో ఏజెంట్లు ఉండరాదని రక్షణ మంత్రిత్వ శాఖ ... పేర్కొనలేదని ... (ఆం. ప్ర. 19.7.89)

**శరణార్థి** వి. *śaraNaarthi* మాతృదేశంలో రక్షణ కరువైన పరిస్థితిలో ఇతర దేశంలోకి వలస వెళ్ళిన వ్యక్తి refugee భారత దేశంలోకి శ్రీ లంక నుంచి పెద్ద ఎత్తున తమిళ శరణార్థులు రావడం కూడా ఆందోళన కలిగిస్తున్నదని ఆయన చెప్పారు. (ఆం. ప్ర 9.6 87)

**శవ పంచాయితీ** వి. *śava pancaayatii* అసహజ పరిస్థితులలో మరణించిన వారి దేహాన్ని గ్రామాధికారి, నలుగురు సభ్యులతో కలిసి చేసే పరిశీలన; పంచనామా a court of arbitrators consisting of five members

examining the dead body శవ పంచాయితీ కూడా మీరే చేసుకుని పోస్టు మార్టం జరిపించుకోవచ్చు గదా అని పోలీసులు వాళ్ళతో చెప్పారు. (ఆం ప్ర 6 10 89)

**శవ పరీక్ష** వి. *śava parıkSa* మరణించటానికి గల కారణాలను తెలుసుకునేందుకు చేసే వైద్య పరిశీలన postmortem పోలీసులతో, రాజు బంధు మిత్రులతో, శవ పరీక్ష చేసిన డ్వాక్టరుతో వివరంగా మాట్లాడిన తర్వాత రాజుది సహజ మరణం కాదని .. పేర్కొన్నారు. (ఆం ప్ర. 27 7 89)

**శషభిషలు** వి. (బ వ.) *śaaSa-bhıSalu* ప్రయోజనంలేని తిరకాసులతో కూడిన చర్చలు purposeless and impeding discussions ప్రకటించిన జోన్ల పంపిణీ గురించి అధికారులింకా శషభిషల్లో మునిగి ఉండగానే తీవ్రవాదులు రంగంలోకి దిగి ... (ఆం భూ. 20 4 89)

**శాంతి కపోతం** వి. *śaanti kapootam* స్నేహ సౌహార్దాలకు ప్రతిరూపం **అయిన** (తెల్ల) పావురం dove as a peace symbol రెక్కలు విప్పిన శాంతి కపోతాలు: పాత నగరం చరిత్రలోనే నేటి 'శాంతి కపోతాల' ప్రదర్శన అపురూపమని ... (ఆం. జ్యో 1.3 88)

**శాంతి దళం** వి. *śaantı daLam* ఇరువర్గాల లేదా దేశాల సాయుధ సంఘర్షణని నివారించి సాధారణ పరిస్థితులు నెలకొల్పటానికి ఒక ఒప్పందంలో భాగంగా వెళ్ళిన విదేశీ సైన్యం peace-keeping force శాంతి దళాన్ని వెనక్కి పిలిపించుకోవలసిందిగా ప్రధాన మంత్రి రాజీవ్ గాంధీని అభ్యర్థించగలనని ఆయన చెప్పారు. (ఈ. 2.6.89)

**శాంతి పథకం** వి. *śaanti pathakam* శాంతిని పరిరక్షించేందుకు ఉద్దేశించిన ప్రణాళిక peace plan ... దలైలామా సూచించిన పంచసూత్ర శాంతి పథకాన్ని ఆమోదించాలని కోరుతూ టిబెటన్ యూత్ కాంగ్రెస్ ... (ఈ. 5 10 87)

**శాంతి ఫోరం** వి. *śaanti fooram* యుద్ధ నివారణ, నిరాయుధీకరణకై ఏర్పాటు చేసిన వేదిక peace forum నిరాయుధీకరణకు మద్దతుగా ఐ.రా.స వార్షోత్సవం సందర్భంగా అక్టోబర్ 24,25 తేదీలలో శాంతి ఫోరం నిర్వహిస్తామని ... (ఆం ప్ర 16.6 87)

**శాంతి మండలం** వి *śaantı man-Dalam* యుద్ధ విరమణ కోసం అంగీకరించిన భూభాగం peace zone ఇండియా సూచించిన చర్చనీయాంశాలకు (agenda) 'శాంతి మండలా'న్ని కూడా నేపాల్ చేర్చింది. (ఆం భూ 29 8 89)

**శాంతిరక్షణ దళం** వి. *śaantırakSaNa-daLam* చూ. శాంతి దళం. డిసెంబర్ 31 నాటికి భారత శాంతిరక్షణ దళాలను తమ దేశం నుంచి ఉపసంహరించవలసిందిగా శ్రీలంక ప్రభుత్వం భారత్‌ను కోరవచ్చు. (ఈ 21 0 87)

**శాంతిసంక్షేమ సంఘం** వి. *śaanti-sankSeema sangham* సమస్యలు తలెత్తకుండా చూడటానికి ప్రజల శ్రేయస్సు దృష్ట్యా పది మంది పెద్దలతో కలిసి ఏర్పడిన సంస్థ peace and welfare committee ఆదివారం రాత్రి పాతబస్తీ ఛత్రినాక కర్షక ఇండస్ట్రీ ఆవరణలో శాంతి సంక్షేమ సంఘం ఏర్పాటుచేసిన ఇఫ్తార్ విందు కార్యక్రమంలో ... పాల్గొన్నారు. (ఈ.అను 1 5 89)

**శాంతి సంఘం** వి. *śaanti sangh-am* అల్లర్లు, హింసాకాండ చెలరేగకుండా

చూడటానికి ప్రజల శ్రేయస్సు దృష్ట్యా కొంత మంది పెద్దలతో ఏర్పడిన కమిటీ peace committee తీవ్రవాదుల ప్రాబల్యంవున్న ప్రాంతాల్లో శాంతి సంఘాలను ఏర్పరచి .. (ఈ 20 4 89)

**శాంతి సూత్రం** వి. *saanti suutram* అల్లకల్లోలాన్ని నివారించేందుకు సూచించిన ప్రతిపాదన peace formula శ్రీలంకలోని జాతివైషమ్యాల అంతానికి కొత్త శాంతి సూత్రం రూపొందించబడుతున్నట్లు తెలుస్తున్నది. (వి. 18 7 87)

**శాంతి సేన** వి. *saanti seena* చూ. శాంతిదళం. ముల్లయితీపు జిల్లాలో శాంతి సేన గస్తీదళంపై తీవ్రవాదులు దొంగచాటుగా దాడి చేయగా అయిదుగురు సైనికులు మరణించారు. (ఈ 17 2 87)

**శాంపుల్ సర్వే** వి. *saampul sarvee* విషయ నిర్ధారణకోసం జరిపే నమూనా పరిశీలన sample survey ... ఈ విధంగా సేకరించిన సంతకాలలో ఎన్ని సక్రమమైనవో తెలుసుకునేందుకు "శాంపుల్ సర్వే" నిర్వహించవలసిందిగా ఆయన విలేఖరులను కోరారు. (ఆం. ప్ర. 8 9 89)

**శాఖ** వి. *saakha* 1. పరిపాలనా విభాగం portfolio ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు తన మంత్రి వర్గాన్ని పునర్వ్యవస్థీకరించి, మంత్రులకు ఈ విధంగా శాఖలను కేటాయించారు. (ఆం. ప్ర 16.2 87) 2. బ్యాంకులకు, సంస్థలకు చెందిన విభాగం branch తమ బ్యాంకు త్వరలో హైదరాబాద్‌లో ఒక వాణిజ్య శాఖను, విశాఖపట్నంలో ఒక ఓవర్‌సీస్ శాఖను ప్రారంభించనున్నట్లు ఛీఫ్ జనరల్ మేనేజర్ శ్రీ కె. ఎస్. పురోహిత్ తెలిపారు. (ఆం. ప్ర 27 4.88)

**శాటిలైట్ పట్టణం** వి. *saaTılaıT paTTaNam* ప్రధాన పట్టణ శివారులలో నిర్మించే చిన్న పట్టణం, ఉపపట్టణం satellite town నానాటికీ పెరిగిపోతున్న విశాఖ పట్టణం, విజయవాడ ప్రజల అవసరాలను తీర్చడానికి నగరాలను సుందరంగా తీర్చిదిద్దడానికి ఈ నగరాల చుట్టూ శాటిలైట్ పట్టణాల ఏర్పాటుకు తక్షణం చర్యలను గైకొనవలసిందిగా ముఖ్యమంత్రి ... (ఆం జ్యో. 8.9 87)

**శాడిజం** వి. *saaDıjam* ఇతరుల్ని బాధించి ఆనందించే మనస్తత్వం sadism అధికారుల అనుభవ రాహిత్యంకాని, నిర్మాతలను ఇరుకున పెట్టాలనే 'శాడిజం' కాని ఈ ఉత్తర్వులకు కారణమై ఉండవచ్చని సినీ ప్రముఖులు కొందరు భావిస్తున్నారు. (ఉ 21.4 87)

**శాసనసభ** వి. *saasanasabha* ఎన్నికైన ప్రజాప్రతినిధులు చట్టాలు చేసి, ప్రభుత్వ విధానాలను రూపొందించి నిర్ణయించే (రాష్ట్రానికి పరిమితమైన) విధానసభ legislative assembly ... శాసన సభ ఆవరణలోకి అక్రమంగా చొరబడిన ఆరోపణపై జైలుశిక్ష అనుభవిస్తున్న ... (ఈ 27 4 89)

**శాసనసభ్యుడు** వి. *saasanasabhyuDu* శాసనసభకు ఎన్నిక అయిన ప్రతినిధి; ఎమ్మెల్యే member of legislative assembly (M.L.A) అధికారుల వైఖరికి నిరసనగా కార్యకర్తలు ప్రదర్శనలు నిర్వహిస్తున్నారని శాసనసభ్యుడు ... (ఆం. ప్ర. 11 5 89)

**శాశ్వత పరిష్కారం** వి. *saasvata pariSkaaram* ఒక సమస్య మళ్ళీ తలెత్తకుండా చేసే పద్ధతి permanent solution ... అలాగే త్రిపురలోని గిరిజను

లను వెనక్కి తీసుకొని రావడానికి తాజాగా ప్రయత్నాలు ఆరంభించాలి. అప్పుడే సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది. (ఆం. ప్ర 5 7 89)

**శాశ్వత ప్రతినిధి** వి. *saasvata pratinidhi* ఒక దేశం తరఫున (ఐక్య రాజ్య సమితిలో) ఆధికారికంగా ప్రాతినిధ్యం వహించే వ్యక్తి permanent representative ఇండియా తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు సర్వసత్తాక అధికారాలకు భంగకరంగా వ్యవహరించినందుకు తీవ్ర నిరసన వ్యక్తం చేయవలసిందని ఐక్య రాజ్య సమితిలోని తమ శాశ్వత ప్రతినిధిని ఆదేశించినట్టు ... తెలియవచ్చింది. (ఆం. భూ. 6.6.87)

**శాస్త్రీయ దృక్పథం** వి. *saastriiya dRkpatham* వాస్తవాలను కేవలం ప్రయోగాల ద్వారా నిర్ణయించే రీతి scientific outlook రైతులు ఎకరానికి ఇంత పండించామని చెప్పుకొనటానికి బదులు ఇన్ని క్యూసెక్కుల నీరుకు, ఇంత పండిచామని చెప్పుకునే శాస్త్రీయ దృక్పథం రైతుకు అలవర్చాలనీ ... (ఆం. ప్ర. 14.4 88)

**శాస్త్రీయ పద్ధతి** వి. *saastriiya paddhati* విజ్ఞానంతో కూడిన మార్గం scientific method వేపకాయల నుంచి రసాన్ని తీయడానికి శాస్త్రీయ పద్ధతిని కూడా రూపొందించారని ... (ఆం భూ. 20.6 87)

**శిక్షణ** వి. *sikSaNa* ఒక వృత్తిలో నిర్దిష్ట ప్రమాణస్థాయికి చేరుకోవటానికిచ్చే తర్ఫీదు; అభ్యాసం training మొదటి విడత యంత్రాలతో కొందరికి శిక్షణ ఇస్తామని ఆయన చెప్పారు. (ఆం. ప్ర. 23 6 89)

**శిక్షణాశిబిరం** వి. *sikSaNaasibiram* నిర్దిష్ట ప్రమాణ స్థాయికి చేరుకోవటానికి తర్ఫీదునిచ్చే చోటు training camp, workshop (academic) రాష్ట్ర స్థాయిలో ఈ నెల 28,29 తేదీల్లో తెలుగు కథలపై సారస్వత పరిషత్ హాల్‌లో శిక్షణాశిబిరం నిర్వహించనున్నట్లు ... (ఆం ప్ర. 28 8 87)

**శిక్షాస్మృతి** వి. *sikSaasmRti* నేరానికి తగిన దండన వివరణలు, నియమ నిబంధనలు తెలిపే న్యాయశాస్త్ర గ్రంథం penal code పౌరులు నేరం చేస్తే వాళ్ళ నేరాన్ని విచారించటానికి న్యాయ స్థానాలున్నాయి. నేర తీవ్రవతను బట్టి శిక్షించటానికి శిక్షాస్మృతులున్నాయి. (ఆం భూ 14.5.89)

**శిఖరాగ్ర చర్చలు** వి. (బ.వ.) *sikharaagra carcalu* దేశాధినేతల అత్యున్నత సమావేశంలో జరిగే సంభాషణలు summit talks సోవియట్ అధినేత మిఖాయిల్ గోర్బచెవ్, అమెరికా అధ్యక్షుడు రోనాల్డ్ రీగన్‌ల మధ్యన వచ్చే నెల రెండవ వారంలో వాషింగ్టన్‌లో శిఖరాగ్ర చర్చలు జరుగనున్నట్టు తెలుస్తున్నది. (ఆం. జ్యో 14.9 87)

**శిఖరాగ్ర సదస్సు** వి. *sikharaagra sadassu* దేశాధి నేతల అత్యున్నత సమావేశం summit (as in summit talks) 1969 ఘర్షణలతో పతాకస్థాయికి చేరిన విభేదాలను, ఉద్రిక్తతలను తొలగించుకునేందుకు సోమవారం ఇక్కడ ప్రారంభమయ్యే శిఖరాగ్ర సదస్సు, సత్సంబంధాల సాధనకోసం రెండు దేశాల నేతలు సాగిస్తున్న కృషికి నాంది పలుకుతుంది. (ఈ. 15 5 89)

**శిఖరాగ్ర సభ** వి *sikharaagra sabha* చూ శిఖరాగ్ర సదస్సు బుష్-గోర్బచెవ్ శిఖరాగ్ర సభ గురించి అమెరికా ప్రభుత్వం తనంతట తాను ప్రస్తావించనప్పటికీ ... చర్చిస్తుంది (ఈ. 9.5 89)

**శిఖరాగ్ర సమావేశం** వి. *sikharaagra samaaveeśam* చూ. శిఖరాగ్ర సదస్సు. ఈ ఏడాది ఆఖరుకు అమెరికా అధ్యక్షుడు రీగన్, రష్యానేత గోర్బచెవ్ మధ్య శిఖరాగ్ర సమావేశం జరిగే అవకాశాల గురించి కూడా శ్రీ రాజీవ్, గోర్బచెవ్ చర్చించారు. (ఆం. భూ. 3 7 87)

**శిబిరం** వి. *sibiram* 1. తాత్కాలికంగా ఆపన్నులను ఆదుకునేందుకు ఏర్పాటు చేసిన నివాసం camp (as in refugee camp) జింబాబ్వే ప్రభుత్వం మొజాంబిక్‌కు చెందిన 78 వేల మంది శరణార్థులను నాలుగు శిబిరాల్లో పోషిస్తున్నదని ఆయన చెప్పారు. (ఆం. ప్ర 23 6 89) 2. రాజకీయ పార్టీలలో ఒక వర్గం camp అసమ్మతి శిబిరంలో సాగుతున్న చర్చలు వేడిగా ఉన్నాయి.

**శిరోముండనం** వి. *siroomunDanam* గుండుగీయించటం tonsure జరిమానా కట్టిన తర్వాత పోలీసులు శిరోముండనం చేయించటం ప్రత్యక్షంగా న్యాయస్థానాలను ధిక్కరించడమే. (ఆం భూ 14 5 89)

**శివారు** వి. *sivaaru* ప్రధాన పట్టణ పరిసర ప్రాంతం outskirts (of a town) విశాఖపట్నం నగర రద్దీని తగ్గించేందుకు శివారు పట్టణాలను అభివృద్ధి చేయాలని ... ( ప్ర.శ 7 9 87)

**శివారు పట్టణం** వి.*sivaarupaTTaNam* చూ. శాటిలైట్ పట్టణం. విశాఖపట్నం, గుంటూరు (అమరావతి) వద్ద నిర్మిస్తున్న శివారు పట్టణాలకు (శాటిలైట్ పట్టణాలకు) ప్లాట్లు చేసి వేలం వేస్తామని ... (ఉ 5 10 88)

**శిలాజాలు** వి. (బ.వ.) *silaajaalu* చిర కాలం కింద నిర్జీవమైన జంతువుల, చెట్ల అవశేషాలు fossiles నర్మదా నదిపై నిర్మించనున్న ఆనకట్టలవల్ల అతిప్రాచీన చారిత్రక ప్రదేశాలు, ప్రాచీన శిలాజాలు జలమయమయ్యే ప్రమాదం ఉందని పురావస్తు శాస్త్ర వేత్తలు ఆందోళన చెందుతున్నారు. (ఆం ప్ర 18 1.88)

**శిలాన్యాసం** వి. *silaanyaasam* నూతన భవన నిర్మాణంలో పునాది రాయి వేసే కార్యక్రమం laying the foundation stone రామమందిరం శిలాన్యాసానికి విశ్వహిందూ పరిషత్ ఎంచుకున్న స్థలం వివాదగ్రస్త ప్రాంతంలోకి రాదని ప్రభుత్వం బుధవారం రాత్రి ... స్పష్టీకరించడంతో ... ఘర్షణ ప్రమాదం తప్పింది. (ఈ 10.11 89)

**శీతకన్ను** వి. *siitakannu* ఉదాసీన వైఖరిని అవలంబించటం, నిర్లక్ష్య ధోరణి ప్రదర్శించటం nelson's eye, indifferent attitude ప్రస్తుత డివిజనల్ మేనేజర్ శ్రీ కేశవులు నాయుడు వనపర్తి డిపోపై శీతకన్ను వేసారని కార్మిక వర్గాలు తెలిపాయి (ఆం. భూ 26.5 89)

**శీతాకాల సమావేశం** వి. *siitaakaala samaaveeśam* చలికాలంలో జరిపే చట్టసభల సమావేశం winter session అయితే, ఆనవాయితీ ప్రకారం పార్లమెంట్ శీతాకాల సమావేశాలు కూడా నవంబర్‌లోనే ప్రారంభం కావల్సి ఉంటుందని ప్రధాని అన్నారు. (ఆం ప్ర 27 7 89)

**శీలహననం** వి. *siilahananam* వ్యక్తిత్వంపై దెబ్బతీయటం, పరువు ప్రతిష్టల్ని దిగజార్చటం character assasination తమ కాళ్ళ కింద భూమి కదలి పోతున్నదనే నిరాశా నిస్పృహల్లో కాంగ్రెస్(ఐ) నాయకత్వం ప్రతిపక్షనాయకుల శీలహననానికి రోత ఎత్తులు, జిత్తులతో రోట్లో తలదూరుస్తున్నది. (ఈ 28 8.89)

**శృంగభంగం** వి. *śRngabhangam* (రాజకీయ రంగంలో) పరాభవం defeat, debacle శివాజీ గణేషన్‌కు తమిళనాడులో ఎలాంటి శృంగభంగమైందో అక్కినేనికి కూడా అదే పరాభవం జరుగుతుందని కూడా ఆయన అన్నారు. (ఆం భూ 27 4 89)

**శోచనీయం** వి. *śoocaniiyam* విచారించదగినది, చింతించదగినది deplorable ప్రధానమైన చిక్కడపల్లి బస్సు షెల్టర్ ఏర్పాటు చేయకపోవడం శోచనీయమన్నారు. (ఈ.అను. 14 6 89)

**శ్రద్ధాంజలి** వి. *śraddhaanjali* మరణించినవారి పట్ల గౌరవ సూచకంగా వారి ఆత్మ శాంతికై కొన్ని నిమిషాలపాటు మౌనం పాటించటం homage అతి సాధారణమైన జీవితం గడుపుతూ అత్యున్నత విలువలను కాపాడుకున్న శ్రీ అబ్బాస్ ధన్యజీవి అని శ్రద్ధాంజలి ఘటించారు. (ఆం జ్యో. 5 6 87)

**శ్రమదోపిడీ** వి. *śramadoopiDii* కష్టానికి తగిన ప్రతిఫలం ఇవ్వకుండా పనివాళ్ళ కష్టాన్ని మిగుల్చుకోవటం exploitation of labour బీడీ కార్మికుల శ్రమ దోపిడీ. (ఆం భూ 29 11 87)

**శ్రీకారం** వి. *śriikaaram* (శుభ) ప్రారంభం launching of a new programme దృశ్య శ్రవణ బోధనకు నేడే శ్రీకారం. (ఈ 17 6 87)

**శ్రీకారంచుట్టు** క్రి. *śriikaaramcuTTu* ఒక కార్యక్రమాన్ని మొదలుపెట్టు to make a beginning ఈ సంవత్సరం అక్టోబర్‌లో ఉభయదేశాల విదేశీ వ్యవహారాల ఉప మంత్రుల స్థాయిలో జరిగిన సంప్రదింపులు నూతన కార్యక్రమానికి శ్రీకారం చుట్టాయి. (ఈ 15 5 89)

**శ్రీముఖం** వి. *śriimukham* వివరణ కోరుతూ పంపేలేఖ, తాఖీదు letter of order ఈ విషయంలో శ్రీ ఆనం దరావుకు పార్టీ ప్రధాన కార్యదర్శి నుంచి 'శ్రీముఖం' రావడమే గాక ... (ఆం ప్ర 23 7 89)

**శ్రుతిమించు** క్రి. *śrutimincu* వ్యవహారం చేయిదాటిపోవు to go out of hands మలహర్‌రావు హత్యతో తీవ్రవాదుల హింసాకాండ మరీ శ్రుతిమించినందున తిరిగి అరికట్టడానికి రాష్ట్ర ప్రభుత్వం తీవ్ర చర్యలు తీసుకోవాలని ... డిమాండు చేశారు. (ఆం భూ. 11.6 89)

**శ్లాఘించు** క్రి. *ślaaghincu* (ఒకరి పనులను) ఘనంగా పొగడు to praise profusely పంచాయితీరాజ్ బిల్లు నుంచి హానికరమైన, అభ్యంతరకరమైన క్లాజులను ప్రభుత్వం తొలగించేట్టు చేయడం ప్రతిపక్షాలు, ప్రజలు సాధించిన మరో విజయమని ఆయన శ్లాఘించారు. (ఈ 15 5 89)

**శ్లాబ్ పద్ధతి** వి. *ślaab paddhati* సగటు వినియోగాన్ని బట్టి చార్జీలు వసూలు చేయటం slab system ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం విద్యుత్ వినియోగంపై శ్లాబ్ పద్ధతి ప్రవేశపెట్టేందుకు అవసరమగు అదనపు కమీషన్ పద్ధతిపై ప్రైవేట్ సంస్థలను నియమించింది. (వి 10 7 87)

**శ్వేతజాతీయులు** వి. *śveetajaatiiyulu* తెల్లటి శరీర ఛాయ కలిగిన వారు, తెల్లవారు (బ్రిటీషువారు) white people దక్షిణాఫ్రికాలో శ్వేత జాతీయులకోసం కేటాయించిన నివాస ప్రాంతాల్లో నివసిస్తున్న నల్లవారి గురించి తెలియజేయవలసిందని శ్వేత జాతీయులను కోరాలని ప్రభుత్వం యోచిస్తున్నది. (ఆం. ప్ర 3 7 89)

**శ్వేతపత్రం** వి. *śveetapatram* ప్రభుత్వం ఒక విషయానికి సంబంధించి పూర్తి సమాచారం ప్రకటించే నివేదిక white paper ... రాష్ట్ర ప్రభుత్వం అఖిల

పక్షం ఏర్పాటు చేసి ఆంధ్రప్రదేశ్ ప్రాజెక్టు లకు సంబంధించిన వాస్తవాలను శ్వేతపత్రం ద్వారా నివేదించాలని . . (ఆం జ్యో 16.10.87)

ష

**షటిల్ బస్సు** వి. *SaTil bassu* ప్రయాణీకుల సౌకర్యార్థం అవసరమని భావించిన కొన్ని (దగ్గర) ప్రాంతాల్లో ఎక్కువ ట్రిప్పులు నడిపే బస్సు shuttle bus *రంగారెడ్డి జిల్లా డిపో నుండి-హయత్‌నగర్-బండరావిలాల, హయత్‌నగర్-ఉమర్‌ఖాన్‌గూడ గ్రామాల మధ్య నడపటానికి గాను రెండు షటిల్ బస్సు సర్వీసులకు మలక్‌పేట శాసన సభ్యుడు ... వేశారు.* (ఆం ప్ర 5 7 87)

**షరతు** వి. *Saratu* ఒప్పందంలో భాగంగా లాభాన్ని పొందే వ్యక్తి లేదా సంస్థ విధిగా ఇవ్వాల్సిన హామీ లేదా చెయ్యాల్సిన పని condition *అయితే ఒక వారంలోగా ఆమె శాసనసభలో తన బలాన్ని నిరూపించుకోవాలని షరతు విధించినట్లు ... తెలిసింది.* (ఆం. ప్ర 4 1 88)

**షరామామూలు** వి *Saraamaamuulu* ఎపుడూ జరిగేది లేదా అందరికీ తెలిసిన విషయం usual thing or common happening *ఏరు దాటాలన్నా, నదిని దాటాలన్నా సరైన సౌకర్యాలు లేక నాటు పడవలు, డింగీలు, పుట్లను ఆశ్రయించడం షరామామూలే* (ఆం భూ 11 7.89)

**షరీకగు** క్రి. *Sariikagu* స్వార్థంతో రహస్య అవగాహనకు వచ్చు; కుమ్మక్కగు to collude *కార్మికులపై పనిభారాన్ని పెంచి, నిబంధనలను తగ్గించేందుకు నేషనల్ మజ్దూర్ యూనియన్ మేనేజ్‌మెంట్‌తో షరీకయి నట్లు ఈ ఒప్పందం రుజువు చేస్తోందని ...* (ఆం భూ 1 8 89)

**షాక్ ట్రీట్‌మెంట్** వి *Saak TriiTmenT* తన ఆధిక్యతను నిరూపించుకోటానికి ఇతరులు ఊహించని రీతిలో హఠాత్తుగా తీసుకొనే తీవ్ర చర్య shock treatment *మంత్రులందరినీ తన గుప్పిట్లో పెట్టుకోడానికే వీలుగా "వారికి షాక్ ట్రీట్‌మెంట్" ఇచ్చారా అన్న ప్రశ్నకు ముఖ్యమంత్రి కాదన్నట్లుగా సమాధానం చెబుతూ, అలాంటి వాటికి అవకాశం లేదని .. అన్నారు* (ఆం ప్ర 13 2 89)

**షాక్‌తిను** క్రి. *Saaktinu* ఊహించని సంఘటనతో చిత్తరపోవు, దిగ్భ్రమచెందు to suffer a shock *శంకర్‌కు ఏ. ఓ సి గేటుపద్ద ప్రమాదం జరిగిందని, అతన్ని ఆస్పత్రిలో చేర్పించారని .. తెలుపగా షాక్ తిన్న ఆమె త్వరత్వరగా ..* (ఆం ప్ర 31.12 87)

**షాట్** వి. *SaaT* చిత్ర నిర్మాణంలో వ్యవధానం లేకుండా చిత్రీకరించే కనిష్ఠ అంశం single continuous film sequence photographed *ఒక్కో షాట్ తీయడానికి ఎంత సమయం పడుతుంది?* (ఉ 21 8 87)

**షాట్‌పుట్** వి. *SaaTpuT* నియమిత బరువుగల ఇనుప గుండును విసిరే క్రీడాపోటీ shot put *షాట్‌పుట్‌లో కాల్మికోవ్యా (పశ్చిమ జర్మనీ) స్వర్ణపతకం సాధించాడు. అతను ఇనుపగుండును 19.6 మీటర్ల దూరం విసిరాడు.* (ఆం ప్ర 21 9 89)

**షార్ట్ సర్క్యూట్** వి *SaarT sarkyuuT* విద్యుత్ ప్రవాహంలో ఏర్పడే అపక్రమం short-circuit *ఢిల్లీలోని అన్సారీ భవన్‌లో సోమవారం జరిగిన అగ్నిప్రమాదానికి కారణం కరెంట్ షార్ట్ సర్క్యూట్ కావడమేనని ... తెలియజేశారు.* (ఉ 1 7 87)

**షిఫ్టు** వి. *SifTu* యాజమాన్యం, కర్మాగారాలు ఎల్లవేళలూ నడవడానికి వీలుగా కార్మికులకు ఒక రోజులో కేటాయించిన నిర్ణీత పని కాలం shift (as in industries) అయితే నేడు మొదటి 'షిఫ్టు' నుండే కార్మికులందరూ తిరిగి పని చేయడం ప్రారంభించారు. (ఆం. ప్ర. 24 4 89)

**షెడ్యూలు** వి. *SeDyuulu* రాజ్యాంగంలో ఒక విభాగం; అధికరణం a schedule (of constitution or an act) రాజ్యాంగంలో 11వ షెడ్యూలు ఏర్పాటు చేయడం వల్ల రాష్ట్ర ప్రభుత్వం అధికారులకు ఎలాంటి హాని జరగదని తెలిపారు. (ఆం. భూ 20 5.89)

**షెడ్యూల్డు ప్రాంతం** వి. *SeDyuulDu praantam* ప్రభుత్వం గెజిట్ ద్వారా గుర్తించిన ప్రత్యేక వర్గాల (గిరిజనుల) నివాస ప్రాంతం (ఇక్కడ భూముల ఉత్పత్తుల క్రయవిక్రయాలకు సంబంధించి ప్రత్యేక నిబంధనలుంటాయి) scheduled area ఆయా ప్రాంతాలు పూర్తిగా షెడ్యూల్డు ప్రాంతాలుగా ఎక్సైజు అధికారులు ధృవీకరించిన పిదప గిరిజనులు సారా కాచుకోవాల్సి ఉంది. (ఆం ప్ర 15 89)

**షేర్** వి. *Seer* వ్యాపార సంస్థల మూలధనంలో వాటా share 'షేర్ కాలం' పాఠకులకోసం దగ్గరలోనే షేర్ల నమోదు తేదీలు ప్రకటించిన కంపెనీల జాబితాను ఇస్తున్నాం. (ఆం. ప్ర. 25 4.88)

**షోకాజ్ నోటీసు** వి. *Sookaaj nooTiisu* క్రమ శిక్షణను ఉల్లంఘించినందుకు లేదా సంస్థ ప్రయోజనాలకు నష్టం కలిగించే విధంగా ప్రవర్తించినందుకు సభ్యుణ్ణి సంజాయిషీ అడుగుతూ పంపే పత్రం show cause notice వార్తా పత్రికలకు వ్యాసాలు రాసినందులకు భారత క్రికెట్ బోర్డు తనకు ఇచ్చిన షోకాజ్ నోటీసుపై సమాధాన మిచ్చేందుకు ... (ఆం. ప్ర. 1 1.88)

**షోరూమ్** వి. *Sooruum* వస్తువులను వినియోగదారులకోసం అందంగా అమర్చి ఉంచిన విక్రయశాల (గది) show-room నగరంలోని లేపాక్షి షోరూమ్ ఆధునీకరణ కోసం ... (ఆం ప్ర 8 10 87)

## స

**సంకటస్థితి** వి. *sankaTasthiti* ఇబ్బంది లేదా కష్టం కలిగించే పరిస్థితి trouble, fix ప్రధాని రాజీవ్ గాంధీ సంకట స్థితిలో పడినప్పుడల్లా నాపై బురదజల్లడం ద్వారా ప్రజల దృష్టిని ఆయనపై నుంచి మళ్ళించే విధానాన్ని పాలకపక్షం అనుసరిస్తోంది. (ఆం ప్ర 28.7.89)

**సంకల్పం** వి. *sankalpam* ఒక పనిచెయ్యాలనే ఆలోచన intention ప్రజా సంక్షేమానికిగాను తనకు కొత్త జీవితాన్ని ప్రారంభించాలన్న సంకల్పముందని వివరించారు. (ఈ 16 5 89)

**సంకల్పించు** క్రి. *sankalpincu* నిర్ణయించుకొను to plan, decide పట్టణ స్థానిక సంస్థలను పటిష్టం చేసేందుకు రాజ్యాంగం 65 వ సవరణ బిల్లు తీసుకురావాలని ప్రభుత్వం సంకల్పించింది. (ఈ 15.7 89)

**సంకీర్ణ ప్రభుత్వం** వి. *sankiirNa prabhutvam* ఒకటి కంటే ఎక్కువ పార్టీలు భాగస్వాములుగా ఉన్న ప్రభుత్వం; మిశ్రమ ప్రభుత్వం coalition government లోక్‌దళ్(బి), బిజెపితో కలిసి సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు చేస్తుందా లేక సొంతంగా ప్రభుత్వం ఏర్పాటు చేస్తుందా అన్న విషయమై . . . (ఆం జ్యో 20.6 87)

**సంకీర్ణ మంత్రివర్గం** వి. *sankiirNa mantrivargam* (మిశ్రమ ప్రభుత్వంలో) వివిధ రాజకీయ పక్షాల సభ్యులతో కూడిన మంత్రిమండలి coalition cabinet *జమ్మూ కాశ్మీర్ సంకీర్ణ మంత్రివర్గంలోకి ఆది వారం 11 మంది కొత్త మంత్రులను తీసు కున్నారు.* (ఈ. 1.5.89)

**సంకుచిత విధానం** వి. *sankucita vidhaanam* విశాల దృక్పథం లేకుండా ప్రవ ర్తించటం narrow-mindedness, parochial attitude ... *ఈ నేపథ్యం అవిభక్త హిందూ ఉమ్మడి కుటుంబం కర్తగా ముఖ్యమంత్రిపై కేసు పెట్టడం అర్థ రహితమని, ఇది కేంద్ర ప్రభుత్వం సంకుచిత విధానాలకు నిదర్శనమని ... విమర్శించారు.* (ఆం జ్యో 21 4 88)

**సంకేతం** వి. *sankeetam* ఒక విష యానికి ప్రతిబింబంగా నిలిచేది; గుర్తు, చిహ్నం symbol, sign *మన స్వాతం త్ర్యోద్యమంలో అవిచ్ఛిన్నంగా, అనుశ్రుతంగా కొనసాగిన ప్రపంచ దృక్పథానికిది సంకేతం.* (విశా 6 10 87)

**సంక్లిష్టరూపం** వి. *sankliSTaruupam* (పరిస్థితి, సమస్య మొ.) అర్థం చేసుకోవటం, పరిష్కరించటంలో మరింత కష్టమైన దశ complicated *రాజీవ్ హయాంలో పంజాబ్ సమస్య గత ఎన్నికల నాటికన్నా సంక్లిష్టరూపం దాల్చింది.* (ఈ 11 5 89)

**సంక్షిప్త వ్యాఖ్య** వి. *sankSipta vyaakhya* విషయాన్ని క్లుప్తంగా ఒకటి రెండు మాటల్లో చెప్పటం brief comment ... *ఒప్పందం కుదిరిన నేపథ్యంలో గురు వారం రాత్రి బి.బి.సి ఈ అంశంపై ఒక సంక్షిప్త వ్యాఖ్యను ప్రసారం చేసింది.* (ఈ 30 6 89)

**సంక్షేమం** వి. *sankSeemam* సుఖసం తోషాలు, భద్రతతో కూడిన మనుగడ welfare *మైనారిటీల సంక్షేమంకోసం 15 సూత్రాల కార్యక్రమాన్ని అమలు చేస్తున్నట్లు చెప్పారు.* (ఈ 28 6 89)

**సంక్షోభం** వి *sankSoobham* 1. వనరు లకు తీవ్రమైన కొరత ఏర్పడి ఆందోళన కరంగా ఉన్న పరిస్థితి crisis *ముఖ్య మంత్రి తప్పుడు విధానాలవల్లనే రాష్ట్రంలో తీవ్ర విద్యుత్ సంక్షోభం ఏర్పడిందని ... విమర్శించారు.* (ఆం.భూ. 27.4 89) 2. (రాజకీయ పాలనా రంగాలలో) తీవ్రమైన ఘర్షణకు దారితీసే అనిశ్చిత, ప్రమాద కర పరిస్థితి crisis *బీహార్ జనతాదళ్ అధ్యక్షపదవి నుంచి రఘునాథ్‌ఝాను తొల గించి, రామసుందర్‌దాస్‌ను ఆ స్థానంలో నియమిస్తూ వి.పి.సింగ్ హఠాత్తుగా గైకొన్న చర్య, కొన్ని రాష్ట్రాలలో ఆయన కార్యవర్గ సభ్యులను ఎంపిక చేసిన తీరు పార్టీలో సంక్షోభం సృష్టించింది.* (ఆం భూ 24 5.89)

**సంగ్రహించు** క్రి. *sangrahincu* (నిధులు, అధికారాలు మొ.) అన్యాయంగా లాక్కొను to usurp, take away *కేంద్ర ప్రభుత్వం ఏకపక్ష నిర్ణయాల ద్వారా రాష్ట్ర ప్రభుత్వ అధికారాలను సంగ్రహిస్తూ రాష్ట్రాలను ఎందుకూ పనికిరాకుండా చేస్తోం దని ... ముఖ్యమంత్రి విమర్శించారు.* (ఈ. 22 4 88)

**సంఘటితతత్త్వం** వి. *sanghaTitattvam* ఐక్యభావంతో ఒకటికావటం unity, solidarity . . . *కాగా, ప్రతిపక్షాలవారు ఒక అపూర్వమైన రీతిలో సంఘటితతత్త్వాన్ని ప్రదర్శించారు.* (ఆం.ప్ర 25 7 89)

**సంఘటితపరచు** క్రి. *sanghaTitaparacu* ఒక్క తాటి మీదికి తీసుకువచ్చు; ఏకం

చేయు to organise, unite సమస్యల పెనుభారంతో సతమతమవుతున్న రైతులను సంఘటితపరచి వారిని ఉద్యమ బాటలో నడిపించడానికి ... ప్రారంభమవుతున్నాయి. (ఈ. 26 4 89)

**సంఘటితంచేయు** క్రి *sanghaTitam-ceeyu* చూ. సంఘటితపరచు. ఈ సమావేశంలో పార్టీ రాజ్యాంగాన్ని గురించి, పార్టీని సంఘటితంచేసి భవిష్యత్ కార్యక్రమాన్ని రూపొందించే విషయమై చర్చించడం జరుగుతుందని ఆయన తెలిపారు. (ఆంజ్యో 5.6.87)

**సంఘటితమగు** క్రి. *sanghaTitam-agu* సమైక్యభావంతో ఒకటి అగు to become united పధ్నాలుగు రాష్ట్రాలకు [illegible] రైతు సంఘాల ప్రతినిధులు న్యూఢిల్లీలో జరిపిన రెండు రో[illegible] [illegible] భారతీయ కిసాన్ యూనియన్ పేరిట, ఒకే పతాకం క్రింద జాతీయ స్థాయిలో [illegible] ఏకాభిప్రాయం కుదిరింది. (ఈ. 18.7.89)

**సంఘవిద్రోహ శక్తి** వి. *sanghavidrooha śakti* చట్ట వ్యతిరేక కార్యకలాపాలకు తలపడుతూ, సమాజానికి కీడుచేసే శక్తి: అసాంఘిక శక్తి anti-social element సంఘవిద్రోహ శక్తులను, తీవ్రవాదులను అణచివేయడానికి ప్రతిగ్రామంలో ఒకరికి లేదా ఇద్దరికి ఉదారంగా ఆయుధాల లైసెన్సు ఇవ్వాలని ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం ... (ఆం భూ 20 4 89)

**సంఘవ్యతిరేక శక్తి** వి. *sanghavy-atireeka śakti* చూ సంఘవిద్రోహ శక్తి. ఉదారంగా ఉత్తరప్రదేశ్ స్థానిక సంస్థల ఎన్నికల్లో 12 మంది సంఘవ్యతిరేక శక్తులు ఎన్నికవ్వడాన్ని ఆయన పేర్కొన్నారు (ఆంప్ర 17 8 89)

**సంఘీభావం** వి. *sanghiibhaavam* కలసికట్టుగా ఉండటం solidarity రాష్ట్రంలో కరెంట్ కోతకు నిరసనగా, సింగరేణి కార్మికుల సమ్మెకు సంఘీభావంగా నిజామాబాద్ జిల్లాలోని సి.పి.ఐ (ఎం.ఎల్) శనివారం నిర్వహించిన బంద్ విఫలమైంది. (ఆం భూ 21.5.89)

**సంచలనం** వి. *sancalanam* (ఊహించని లేదా అసాధారణమైన సంఘటనవల్ల) జనంలో కలిగే అమితమైన ఆసక్తి, ఉద్విగ్నత మొ. భావాలు sensation, commotion, flutter ఆర్థిక నేరాలకు పాల్పడినట్టు ఆరోపిస్తూ తనపై దాఖలైన రెండు కేసుల సందర్భంగా ముఖ్యమంత్రి . . . ఆర్థిక నేరాల ప్రత్యేక కోర్టుకు స్వయంగా హాజరై సంచలనం సృష్టించారు. (ఆం.జ్యో. 21.4.88)

**సంచలనాత్మకం** వి. *sancala-naatmakam* సంచలనం కలిగించేది sensational సిటీ సివిల్ కోర్టులో . . . హాజరుకావడం సంచలనాత్మక వార్త అయింది. (ఆం.భూ. 23.4.88)

**సంచార** విశ. *sancaara* (అవసరాన్ని బట్టి) ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి తరలించడానికి అనువుగా ఏదైనా వాహనంలో ఏర్పాటు చేసిన (క్యాంటిన్, కోర్టు, లైబ్రరి మొ.) mobile (canteen, court, library etc.) హైదరాబాద్ పాతనగర వాసులకోసం ఒక సంచార గ్రంథాలయాన్ని (మొబైల్ లైబ్రరి) ఈ నెలలో ప్రారంభించాలని . . నిర్ణయించింది. (ఆంప్ర 17 3 89)

**సంజాయిషీ** వి. *sanjaayiSii* తన వైపు నుంచి ఇచ్చే వివరణ explanation రోడ్లు భవనాల శాఖ మంత్రి తనపై లోకాయుక్త చేసిన వ్యాఖ్యల గురించి బుధవారం

ముఖ్యమంత్రిని కలుసుకొని సంజాయిషీ ఇచ్చి నట్లు తెలిసింది. (ఆంజ్యో 26.6 87)

**సంతకాల ఉద్యమం** వి. *santakaala udyamam* ఏదైనా విషయానికి మద్దతుగా పెద్ద ఎత్తున ప్రజల,ప్రజాప్రతినిధుల సంతకాలు సేకరించే కార్యక్రమం signature campaign . . . దేశ వ్యాప్తంగా కోటి మంది ప్రజలతో సంతకాల సేకరణ ఉద్యమం చేపడుతున్నామని ఆయన చెప్పారు. (ఈ 2 10 87)

**సంతరించుకొను** క్రి. *santarıncu-konu* సమకూర్చుకొను to acquire, procure ... హార్పన్ క్షిపణుల వంటి అస్త్రాయుధాల్ని పాక్ సంతరించుకున్నప్పటికీ ఎటువంటి సవాల్‌నైనా తిప్పికొట్టే శక్తి మన నౌకాదళానికి ఉందని ఆయన చెప్పారు. (ఆం భూ 14 5 89)

**సంతాపం** వి. *santaapam* మరణించే వారి పట్ల తెలిపే సానుభూతి condolence ఈ సంఘటనలో మృతి చెందినవారి కుటుంబాలకు ఆయన తన ప్రగాఢ సంతాపాన్ని తెలియజేశారు. (ఆంజ్యో. 8 7 87)

**సంతాపదినం** వి. *santaapadinam* అత్యంత ప్రముఖుల మరణంపట్ల సానుభూతిని వ్యక్తం చేయటానికి ప్రభుత్వం లాంఛనంగా నిర్ణయించిన రోజు day of mourning ఏ దుర్ఘటన జరగకుండానే సచివాలయం ఓ వారం రోజులు సంతాపదినాలు ప్రకటించాల్సి వస్తుందని . . విమర్శించారు. (ఆం ప్ర. 14.2 87)

**సంతాపసందేశం** వి *santaapa sandeeśam* వ్యక్తుల మరణాన్ని పురస్కరించుకొని సానుభూతి వ్యక్తం చేస్తూ పంపే కబురు condolence message సోవియట్ అధ్యక్షుడు గోర్బచేవ్‌కు పంపిన ఒక సంతాపసందేశంలో . . . రాష్ట్రపతి గుర్తు చేశారు. (ఆం.భూ 4 7 89)

**సంతృప్తికరం** వి. *santRptıkaram* అవసరానికీ, ఆశించిన దానికీ సరిపోయేట్లు ఉండటం satisfactory తెలంగాణాలో కూడ తమ పార్టీ పరిస్థితి సంతృప్తికరంగా ఉందన్నారు. (ఈ 16 7.89)

**సందడి** వి. *sandaDı* ఎక్కువ జన సంచారం; రద్దీ bustle, crowded సందడిగా ఉండే ప్రాంతంలో జరిగిన ఈ దారుణ సంఘటనతో పట్టణంలోని మహిళలు తీవ్ర భయాందోళనలకు గురయ్యారు. (ఆం భూ 21 4 89)

**సందర్శించు** క్రి. *sandarśıncu* పరిస్థితిని సమీక్షించటానికి అధికారికంగా ఒక ప్రాంతానికి వెళ్ళిచూచు to visit ఉగ్రవాదుల దాడి జరిగిన వెంటనే లెఫ్టినెంట్ గవర్నర్ శ్రీ కపూర్, పోలీసు కమీషనర్ ఆ ప్రాంతాలను సందర్శించారు. (ఉ 15 6 87)

**సందిగ్ధావస్థ** వి. *sandıgdhaavastha* ఎటూ తేల్చుకోలేని పరిస్థితి dilemma రాష్ట్రపతి ఎన్నికైన తర్వాతగాని, రాష్ట్రంలో సహకార సంఘాల ఎన్నికల తరువాతగాని ముఖ్యమంత్రి తన నిర్ణయాన్ని బయట పెట్టవచ్చు. ఈ విషయంలో ఆయన చాలా సందిగ్ధావస్థలో ఉన్నారు. (ఉ 9 6 87)

**సందేహాస్పద వైఖరి** వి *sandeehaaspada vaikharı* అనుమానంతో కూడిన ధోరణి suspicious attitude శాస్త్రజ్ఞుల పట్ల అధికారులు సందేహాస్పద వైఖరిని అనుసరిస్తున్నారని అరుణాచలం తెలిపారు (ఈ. 30.1 89)

**సంపాదకీయం** వి. *sampaadakii-yam* తాజా రాజకీయ సామాజికాది విషయాలపై వ్యాఖ్యానిస్తూ సంపాదకుడు

రాసే వ్యాసం editorial భారత ప్రభుత్వాన్ని ఆదేశిస్తూ శ్రీలంక అధ్యక్షుడు తీసుకున్న ఏకపక్ష నిర్ణయాన్ని మార్క్సిస్టు పార్టీ పత్రిక 'పీపుల్స్ డెమోక్రసీ' సంపాదకీయంలో తీవ్రంగా విమర్శించింది. (ఆం.భూ 28 6.89)

**సంప్రదాయం** వి. *sampradaayam* గతం నుంచీ పాటిస్తూ వచ్చిన ఒక నిర్దిష్టమైన పద్ధతి convention గవర్నర్ల నియామకం విషయంలో కేంద్రం సంప్రదాయాన్ని అనుసరించే వ్యవహరిస్తున్నదనీ . . . శ్రీ బూటా సింగ్ వివరించారు. (ఆం.ప్ర. 1.12 88)

**సంప్రదాయ పద్ధతి** వి. *sampradaaya paddhati* గతంలో రూపకల్పన జరిగి అనుసరిస్తూ వస్తున్న విధానం conventional or traditional method సంప్రదాయ పద్ధతులలో విద్యాబోధన వల్ల ప్రయోజనం లేదని, అందువల్ల ఆధునిక పద్ధతులను అవలంబిస్తున్నామని తెలిపారు. (ఈ 9.5.87)

**సంప్రదింపులు** వి. (బ.వ.) *sampradimpulu* పరస్పరం అభిప్రాయాలు తెలుసుకోటానికి జరిపే చర్చలు consultations, talks, negotiations ఆయా జిల్లాల కలెక్టర్లు మిల్లర్లతో సంప్రదింపులు జరుపుకున్నారని . . . పేర్కొన్నారు.

**సంబంధం** వి. *sambandham* (ప్రాంతాల మధ్య ఉండే) రవాణా, సమాచార మార్గం link, connection కుండపోతగా కురుస్తున్న వర్షం మూలంగా బొంబాయి మహా నగరానికి బయటి ప్రపంచంతో ఉన్న సంబంధాలు నేటి మధ్యాహ్నంతో తెగిపోయాయి. (ఆం.ప్ర 25.7.89)

**సంబంధిత** విశే. *sambandhita* (విషయంతో) సంబంధం ఉన్న concerned సభ్యులు అడిగిన ప్రశ్నలకు తాను సంబంధిత మంత్రికి తెలియజేస్తానని ఆయన అన్నారు. (ఆం.ప్ర 19 6.88)

**సంభవించు** క్రి. *sambhavincu* (ఏదైనా సంఘటన) జరుగు to happen విశాఖ ఉక్కు కర్మాగారంలోని బొగ్గు రవాణా చేసే కన్వేయర్ బెల్ట్‌లో సోమవారంనాడు పెద్ద అగ్ని ప్రమాదం సంభవించింది. (ఆం.జ్యో 29.11.88)

**సంయమనం** వి. *samyamanam* ప్రవర్తన మితిమీరకుండా అదుపులో పెట్టుకోవటం restraint సంయమనం పాటించండి భారత్, శ్రీలంకలకు భూటాన్ మాల్దీవ్స్ విజ్ఞప్తి. (విశా 9 6.87)

**సంయుక్త పార్లమెంటరీ కమిటీ** వి. *samyukta paarlamenTarii kamiTii* చట్టసభలోని భిన్న పక్షాల సభ్యులతో కలిపి ఏర్పాటు చేసిన సంఘం joint parliamentary committee సంయుక్త పార్లమెంటరీ కమిటీ ముందు సాక్ష్యమివ్వడానికై వస్తున్న . . . బొంబాయికి చేరుకున్నారు. (ఈ. 14 4 88)

**సంయుక్త ప్రకటన** వి. *samyukta prakaTana* ఇద్దరు, అంతకన్నా ఎక్కువ మంది కలసి చేసే ప్రకటన joint statement or communique రెండు అగ్ర కమ్యూనిస్టు దేశాల మధ్య 30 ఏళ్ళ కలహాలను అంతం చేస్తూ గోర్బచేవ్ తొలి చైనా పర్యటన నేడు పూర్తయిన సందర్భంగా ఒక సంయుక్త ప్రకటనను జారీ చేశారు (ఆం.భూ 19 5 89)

**సంయుక్త రంగం** వి. *samyukta rangam* (పరిశ్రమలకు సంబంధించి) ప్రభుత్వం, ప్రైవేటు వాటాలు కలిసి పెట్టుబడి

పెట్టి నిర్వహించే వ్యవస్థ joint sector ప్రభుత్వ ప్రైవేట్ రంగాలు సంయుక్తంగా విద్యుత్‌ను ఉత్పత్తి చేయడానికి సంబంధిం చిన విధానాన్ని కేంద్రం త్వరలో రూపొందిం చనున్నది . . . (విశా 9 9 87)

**సంలీనంచేయు** క్రి. *samlıınamceeyu* (భిన్న సంస్థల్ని) కలుపు to mix, merge ఇదివరలోలాగ, పార్టీ ప్రభుత్వ వ్యవస్థలను సంలీనంచేయడం అవసరంలేదు. (ఆం ప్ర. 8.5 89)

**సంసిద్ధత** వి. *samsiddhata* (పనికి) సుముఖంగా ఉండటం readiness . . . కార్యకలాపాలపై నేరుగా చర్చ జరిపేం దుకు ప్రభుత్వం ఈ దశలో సంసిద్ధత వ్యక్తం చేసింది. (ఈ 17.8 89)

**సంస్థాగతం** వి. *samsthaagatam* పార్టీకి సంబంధించినది organisational సభ్యత్వానికి చెందిన వివాదాలు ఉన్నప్పటికీ కాంగ్రెస్-ఐ సంస్థాగత ఎన్నికలు వచ్చే జనవరి నెలాఖరు నాటికి పూర్తవుతాయని . . చెప్పారు. (ఆం ప్ర 25 6 87)

**సంస్థాపక సమావేశం** వి. *samsthaapaka samaaveeśam* (సంస్థ) ప్రారంభోత్సవ సదస్సు inaugural meeting బెంగు ళూరులో ఈ నెల 1 న జరుప తలపెట్టిన సమావేశాన్ని కొత్తపార్టీ సంస్థాపక సమావే శంగా జరిపేందుకు . . . ఏకగ్రీవంగా నిర్ణయించింది. (ఆం ప్ర 5.10 88)

**సకాలం** వి. *sakaalam* అనుకున్న సమయం right time, intime సకా లంలో ముఖ్యమంత్రి వచ్చారు. (ఆం ప. 28 8.87)

**సగటు స్థాయి** వి. *sagaTu sthaayı* సాధారణం అని భావించే పరిమాణం average దక్షిణ కోస్తా, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాల్లో సగటు స్థాయిని మించి ఉష్ణోగ్రత నమోదు అయింది. (ఈ. 16 5 89)

**సచివాలయం** వి. *sacivaalayam* ప్రభుత్వ పరిపాలనా విభాగాలకు చెందిన కార్యదర్శులు, మంత్రుల కార్యాలయాల సముదాయం secretariat ప్రస్తుతానికి ఆర్.టి.సి. బస్ ఛార్జీలను పెంచబోమని రాష్ట్ర రవాణా శాఖ మంత్రి సోమవారం నాడు సచివాలయంలో పత్రికా ప్రతినిధుల సమావేశంలో చెప్పారు. (ఆం.భూ. 23.5.89)

**సచ్ఛీలత** వి. *sacchiilata* మంచి నడవడిక good conduct or character, sanctity ... నిష్పాక్షికంగా నిర్భయంగా విహిత విధులు నిర్వహించాల్సిన ఒక ప్రజా స్వామిక విభాగం సచ్ఛీలతను సందేహాస్పదం చేశారు. (ఈ 12 5 89)

**సజావుగా** క్రి.విశే. *sajaavugaa* అడ్డంకు లేమీ లేకుండా ; సవ్యంగా smoothly అధిక ఆదాయం తెచ్చిపెట్టే తునికాకు సేక రణ ఈ సంవత్సరం సజావుగా సాగుతుందా? (ఆం ప్ర 24 4.89)

**సజీవ దహనం** వి. *sajiiva dahanam* మంటల్లో కాలి చనిపోవటం burnt alive మంటల్లో ఇద్దరు సజీవ దహనం. (ఆం జ్యో. 21 7 87)

**సజీవ సంబంధం** వి. *sajiiva sambandham* ప్రత్యక్ష సంబంధం close and direct contact ... మన ప్రజా తంత్ర రాజకీయ వ్యవస్థ గౌరవ మర్యాదలను కోల్పోతున్నది. ప్రజలతో సజీవ సంబంధాలు కొరవడుతున్నాయి. (ఈ 3.5.89)

**సడలించు** క్రి. *saDalincu* (నియమాలు, నిబంధనలు మొ. వాటిలో) వెసులుబాటు

కల్పించు to relax పరిస్థితి మెరుగుపడ డంతో జిల్లా అధికారులు గురువారం ఉదయం 7 గంటల నుండి 11 గంటల పాటు కర్ఫ్యూ సడలించారు. (ఆంజ్యో 5.6.87)

**సతమతమగు** క్రి. *satamatamagu* (సమస్యలతో) కొట్టుమిట్టాడు to struggle, flounder తీవ్రవాద సమస్యతో సతమతమవుతున్న ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాలలో ప్రభుత్వ యంత్రాంగం పనితీరు పర్యవేక్షించి ... (ఆం భూ. 7.7 89)

**సతాయించు** క్రి. *sataayincu* ఇబ్బందులు కల్పించి బాధపెట్టు to give trouble ఫైనాన్స్‌లోని డబ్బును భాగస్వాములే వారి స్వంత వ్యాపారాలకు పనులకు వాడుకుంటూ, ఇతరులకు అప్పులు ఇవ్వకుండా సతాయిస్తూ బోగస్ సర్టిఫికెట్లు కొన్నింటికి తేదీలు లేకుండా . . . వెల్లడైంది. (ఆం.భూ. 31.5 89)

**సతార్కికం** వి. *sataarkikam* వాదనకు నిలిచేది; హేతుబద్ధం logical, reasonable ఒక రాష్ట్ర శాసనసభకు జరిగిన ఎన్నికలలో కేంద్రంలో అధికారంలో ఉన్న పార్టీ ఓడిపోయినంత మాత్రాన దేశ ప్రధాని దిగిపోవాలన్న డిమాండు ఏరకంగా సతార్కికమో బోధపడదు. (ఈ 30 1 89)

**సత్కరించు** క్రి. *satkarincu* అత్యున్నత సేవల దృష్ట్యా బిరుదులనిచ్చి గౌరవించు; సన్మానించు to honour తమ ప్రియతమ నాయకుణ్ణి ఈ అత్యున్నత అవార్డుతో సత్కరించినందుకు . . . భారత ప్రభుత్వానికి తన కృతజ్ఞతలు తెలిపారు. (ఈ 27 1.88)

**సత్యాగ్రహం** వి. *satyaagraham* రాజకీయ, సామాజిక మార్పులకోసం చేసే అహింసాయుతమైన ఆందోళన (గాంధీజి రూపకల్పన చేసి ఆచరించిన మార్గం) satyagrah సత్యాగ్రహం వల్లనే మీకు (టిబెట్) స్వాతంత్ర్యం లభించగలదని ఆయన అన్నారు. (ఆం.ప్ర 26 11.87)

**సత్వరం** క్రి.విశే. *satvaram* ఏ మాత్రం ఆలస్యం చేయకుండా ; వెంటనే immediately, quickly ఉత్తర దక్షిణాది రైళ్ళు చాల వరకు ఆలస్యంగా నడిచాయి. ఈ మార్గంలో సత్వరం రైళ్ళ రాకపోకల పునరుద్ధరణకు కృషి జరుగుతున్నది. (ఆం భూ 2.5 89)

**సత్సంబంధాలు** వి. (బ.వ.) *satsambandhaalu* స్నేహ పూర్వక సంబంధాలు cordial relations ఈ మార్పులను శుభ సూచకంగా భావించిన రష్యా నాయకులు ఇరు దేశాల మధ్య సత్సంబంధాలు కోసం మళ్ళీ ప్రయత్నాలు ప్రారంభించారు. (ఈ 15 5 89)

**సదస్సు** వి. *sadassu* నిర్దిష్ట విషయాలపై విపులంగా చర్చించటానికి ఏర్పాటు చేసిన సమావేశం convention, conference ఆదాయం పన్ను కమీషనర్ల రెండు రోజుల సదస్సును గురువారం ఇక్కడ ప్రారంభించిన సందర్భంగా... (ఈ 5.6.87)

**సదుపాయం** వి. *sadupaayam* కార్య నిర్వహణ సక్రమంగా, సులభంగా సాగటానికి ఉపకరించే పరికరాలు, పరిస్థితులు మొ. facility తమకు సరైన సదుపాయాలు కల్పిస్తే తప్పక రెట్టింపు సేవలను అందిస్తామని ఆయన స్పష్టం చేశారు. (ఉ. 13 4.88)

**సద్యః స్పందన** వి. *sadyah spandana* బయటి నుంచి ఏ రకమైన ప్రభావం, ప్రోద్బలం లేకుండానే సందర్భాన్ని బట్టి అప్పటికప్పుడు సహజంగా వ్యక్తం అయ్యే ప్రతిక్రియ spontaneous

response నక్సలైట్లు మండల ప్రజాపరిషత్ అధ్యక్షుని అపహరించి కాల్చివేసిన సంఘటనకు వ్యతిరేకంగా నినాదాలుకాక తెలుగుదేశం పార్టీకి, ప్రభుత్వానికి వ్యతిరేకంగా నినాదాలు రావడమే అది ప్రజల సద్యఃస్పందన (స్పాంటేనియస్) కానట్లు, రాజకీయ దురుద్దేశంతో కూడుకొన్నట్లు స్పష్టం చేస్తున్నదన్నారు. (ఆం.ప్ర. 15.6.89)

సద్వినియోగం చేసుకొను క్రి. *sadviniy-oogam ceesukonu* సక్రమంగా ఉపయోగించుకొను to utilize, exploit భారతదేశం ఈ అవకాశాలను సద్వినియోగం చేసుకోవాలని ఆయన సలహా ఇచ్చారు. (ఆం.ప్ర. 17 12 87)

సన్నగిల్లు క్రి. *sannagillu* తగ్గిపోవు to become less or reduced . . . బెంగుళూరు సదస్సులోనే కొత్తపార్టీ ఆవిర్భవించే అవకాశాలు సన్నగిల్లినట్టు కన్పిస్తున్నాయి. (ఆం.జ్యో. 9.10 88)

సన్నద్ధంఅగు క్రి. *sannaddhamagu* (యుద్ధం,సమ్మె మొ.) ఘర్షణ పూరితమైన కార్యకలాపం చేపట్టటానికి తయారగు be prepared ఈ నెల 27న కర్నాటక బంద్ నిర్వహించడానికి ప్రతిపక్షాలు, ట్రేడ్ యూనియన్లు సన్నద్ధంకావడంతో రాష్ట్రంలో పోలీసు బందోబస్తును కట్టుదిట్టం చేస్తున్నారు. (ఈ 26 4.89)

సన్నాహక కమిటీ వి. *sannaahaka kamiTii* సమావేశానికి అవసరమయ్యే ఏర్పాట్లను పర్యవేక్షించటానికి ఏర్పాటైన కమిటీ preparatory committee సార్క్ సన్నాహక కమిటీ సమావేశం. (ఉ. 15 6 87)

సన్నాహక సమావేశం వి. *sannaa-haka samaaveeśam* ప్రధాన సమావేశానికి అవసరమైన ఏర్పాట్ల గురించి సమీక్షించేందుకు ఏర్పాటయిన సమావేశం preparatory meeting శిఖరాగ్ర సమావేశానికి రెండు రోజుల ముందు అధికారుల సన్నాహక సమావేశం జరుగుతుంది.

సన్నాహాలుచేయు క్రి. *sannaa-haaluceeyu* చేయ తలపెట్టిన పనికి అవసరమైన ఏర్పాట్లు చేయు to make preparations or arrangements ఇప్పటి వరకైతే ఒక్క జనతాపార్టీ మాత్రమే పూర్తిస్థాయిలో బెంగుళూరు సదస్సుకు సన్నాహాలు చేసుకుంది. (ఆం జ్యో. 9 10 88)

సన్నిహిత వర్గాలు వి. (బ.వ.) *sannihita vargaalu* ప్రముఖులతో దగ్గర రాజకీయ సంబంధం ఉండి, వారికి సంబంధించిన సమాచారం తెలిపే వ్యక్తులు sources close to sb ప్రతిష్ఠ తిరిగి సంపాదించడానికి ప్రధాని బహుముఖ కార్యక్రమం రూపొందిస్తున్నారని ఆయన సన్నిహిత వర్గాలు వెల్లడించాయి. (ఆం. జ్యో 20.6.87)

సన్నిహిత సంబంధం వి. *sannihita sambandham* చాలా దగ్గరగా మెలగటం close contact, rapport ... పలువురు ప్రతిపక్ష నాయకులతో కూడా చంద్రస్వామికి సన్నిహిత సంబంధాలు ఉన్నాయి. (ఆం. జ్యో 9 4.88)

సన్మాన సభ వి. *sanmaana sabha* అభినందించటానికి ఏర్పాటు చేసిన సమావేశం felicitation meeting అక్కినేనికి పద్మభూషణ్ అవార్డు వచ్చిన సందర్భంగా ఇక్కడి విజయా టాకీసులో ఏర్పాటుచేసిన సన్మానసభలో ఆయన ప్రసంగించారు. (ఉ. 14 4.87)

సఫలీకృతంఅగు క్రి. *safaliikRtamagu*

పెట్టుకొన్న లక్ష్యాలను సాధించు to succeed రాష్ట్రంలో నక్సలైట్లను అణచివే యటానికి కొత్తగా కమెండో దళాన్ని గ్రేహౌం డ్సును ఏర్పాటుచేయాలని రెం సంవత్స రాల క్రితం తీసుకొన్న ప్రభుత్వ నిర్ణయం ఇప్పటివరకు సఫలీకృతంకాలేదని వారు పేర్కొన్నారు. (ఆం.భూ. 20.4.89)

**సబ్‌జుడిస్** వి. *sabjuDis* న్యాయస్థానం పరిశీలనలో ఉండి ఇంకా తీర్పురానందు వల్ల వేదికలు, ప్రసారసాధనాలు, బహిరంగ కార్యక్రమాలు మొ. చోట్ల ఏ విధంగానూ చర్చించటానికి, వ్యాఖ్యానించటానికి వీల్లేని విషయం subjudice ... సభ్యులు వేసిన ప్రశ్నలకు సమాధానం ఇవ్వకుండా సబ్‌జుడిస్ అవుతుందని ఆ మంత్రి వాదించాడు. (ప్రజా 5.12.87)

**సబబు** వి. *sababu* (ఏదైనా పని) నైతిక, సామాజికాది నియమాలు, సంప్రదాయా లకు అనుగుణంగా ఉన్న స్థితి; సమంజసం, సముచితం proper, just ... మంత్రి పదవి చేపట్టి జాతీయ స్థాయికి ఎదిగిన అకాలీ దళ్ సీనియర్ నాయకుడు శ్రీ ప్రకాశ్ సింగ్ బాదల్‌ను నిర్బంధించి వేధించటం సబబు కాదని బర్నాలా అన్నారు. (ఆం భూ. 1.5 89)

**సబ్సిడీ** వి. *sabsiDii* (సహాయ, సంక్షేమ కార్యక్రమాల్లో భాగంగా) ప్రజలకు అందించే వస్తువుల ధరలు, రుణాలు మొ. వాటిలో ప్రభుత్వం లేదా సంబంధిత సంస్థ కల్పించే తగ్గింపు సౌకర్యం subsidy కరువులో ఉన్న రైతాంగాన్ని ఆదుకునేందుకు తక్షణ సహాయంగా యాభై శాతం సబ్సిడీపై ఎరువులు, విత్తనాలు సరఫరా చేస్తామని ముఖ్యమంత్రి ప్రకటించారు. (ఆం జ్యో. 17.9.87)

**సభాకమిటీ** వి. *sabhaakamiTii* చూ. సభాసంఘం. ... మాజీ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుపై విచారణ జరపడా నికి సభాకమిటీని నియమించడాన్ని సవాలు చేస్తూ ఈ రిట్ పిటీషన్ దాఖలు చేశారు. (ఉ. 13.8 87)

**సభాపతి** వి. *sabhaapati* చట్టసభలలో దిగువసభ కార్యకలాపాలు నిర్వహించే అధ్య క్షుడు speaker యువజన కాంగ్రెస్ సభ్యులు 32 మందికి శాసనసభ నిర్ణయిం చిన విధంగా 30 రోజులు జైలుశిక్ష పూర్తిగా అనుభవించవలసిందేనని ... ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభాపతి రూలింగ్ ఇచ్చారు. (ఆం. ప్ర. 15.9.89)

**సభాసంఘం** వి. *sabhaasangham* ప్రజా ప్రాముఖ్యం ఉన్న సంఘటనపై విచా రణ కోసం శాసన సభ్యులతో ఏర్పాటు చేసిన కమిటీ house committee గుంటూరు జిల్లా మంగళగిరిలో ఈ నెల 15 వ తేదీన జరిగిన సంఘటనపై సభాసంఘం ఏర్పాటు చేయాలన్న ప్రతిపక్షాల డిమాండ్‌ను ... అంగీకరించారు. (ఆం భూ 23.7.87)

**సభాస్థలి** వి. *sabhaasthali* సభ జరిగేచోటు meeting place, auditorium బహిరంగ సభా లిగా రూపొందిన ఎస్.వి. యూనివర్సిటీ డియం గ్రౌండ్స్‌లో పటిష్ఠ మైన ఎత్తైన దిక ప్రత్యేకంగా ఏర్పాటు చేశారు. (ఈ 15 6 89)

**సభాహక్కుల కమిటీ** వి. *sabhaahakk-ula kamiTii* చట్టసభల హక్కుల పరిర క్షణ బాధ్యతను నిర్వర్తించేందుకు సభ్యు లతో ఏర్పాటయిన సంఘం privileges committee మంత్రి ఎవరయినా మార్గ దర్శక సూత్రాలను అతిక్రమిస్తే అది పార్ల మెంట్ లేక శాసన సభా హక్కులు ఉల్లం ఘించినట్లవుతుందని ఆ విషయం పరిశీలించే అధికారం సభాహక్కుల కమిటీలకు మాత్రమే ఉన్నదని ఆయన చెప్పారు. (ఆం భూ. 11.8.89)

**సభాహక్కుల తీర్మానం** వి. *sabhaa hakkula tiirmaanam* ఎవరైనా సభా హక్కులకు భంగం కలిగించారని భావించినపుడు వారికి వ్యతిరేకంగా సభలో సభ్యులు ప్రవేశపెట్టే తీర్మానం privilege motion స్పీకర్ జి. నారాయణ రావుపై సభాహక్కుల తీర్మానానికి నోటీసు ఇవ్వాలని ... నిర్ణయించుకున్నారు. (ఆం భూ 11 4.88)

**సభాహక్కులు** వి. (బ.వ.) *sabha-ahakkulu* చట్టసభలకు తమ హోదా, హుందాతనం కార్యకలాపాలు మొ. వాటికి సంబంధించి ప్రత్యేకంగా ఉన్న అధికారాలు privileges ... శ్రీ సి.హెచ్. విద్యాసాగరరావు హైకోర్టు స్టే విషయాన్ని స్పీకర్ దృష్టికి తెస్తూ, హైకోర్టు స్టే సభాహక్కులను ఉల్లంఘించేదిగా ఉందని అన్నారు. (ఈ. 14 8 87)

**సభికుడు** వి. *sabhikuDu* ఏదైనా కార్యక్రమం (ఉపన్యాసం, నృత్యం మొ.) వినటానికి లేదా చూడటానికి వచ్చిన వ్యక్తి; ప్రేక్షకుడు a member of audience రాజమండ్రిలో జరిగిన ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ సభావేదికపై కూర్చున్న బాలుడు సభికులను ఆకర్షించాడు. (ఆం భూ 17.11.89)

**సభ్యత్వం** వి. *sabhyatvam* ఏదైనా సంస్థ, కమిటీ మొ. వాటిలో సభ్యుడుగా ఉండటం membership పార్లమెంటు సభ్యులు తమ పదవులకు సభ్యత్వాలకు రాజీనామా ఇవ్వాలని కాంగ్రెస్ పార్టీ ప్రధాన కార్యదర్శి ... కోరారు. (ఆం. భూ. 4 10 87)

**సభ్యదేశం** వి. *sabhyadeeśam* ఏదైనా సంస్థలో సభ్యత్వం ఉన్న దేశం member-country భద్రతా మండలిలోని అన్ని సభ్యదేశాలతో లంక దౌత్యవేత్తలు సంప్రదించినట్లు తెలుస్తోంది. (ప్రజా. 5 6.87)

**సభ్యుడు** వి. *sabhyuDu* ఏదైనా సంస్థ, కమిటీ మొ. వాటికి చెందిన వ్యక్తి member సభ్యులు అడిగిన ప్రశ్నలను తాను సంబంధిత మంత్రికి తెలియజేస్తానని ... (ఆం ప్ర. 19 4 88)

**సమంచేయు** క్రి. *samamceeyu* (ఆటల్లో) ఎదుటిపక్షం చేసినంత స్కోరుని సాధించు to equalize, level (the score) కానీ సోవియట్ జట్టు వెంటనే కోల్పానూర్ ఇగోర్ ద్వారా గోల్ సాధించి స్కోరు సమం చేసింది. (ఆం జ్యో. 25.1.88)

**సమకూరు** క్రి. *samakuuru* (అవకాశం) లభించు to be gotten, be provided ... దిగువ సభలోని 35 శాతం స్థానాలకు ప్రతిపక్షాలకు పోటీచేసే అవకాశమూ సమకూరింది. (ఈ 9.6 89)

**సమకూర్చు** క్రి. *samakuurcu* సౌకర్యాలను లభింపజేయు to provide మధ్య తరగతి కుటుంబాలకు సమకూర్చిన పసుపు పచ్చ కార్డులపై చౌకధర దుకాణాల ద్వారా బియ్యం సరఫరాను ... (ఆం ప్ర. 4 5.89)

**సమగ్రత** వి. *samagrata* (ఏదైనా ప్రాంతం) ఒక దేశం ఐక్యతతో విభేదాలు లేకుండా ఉండటం integrity దేశంలో ప్రజాస్వామ్యం, మతసామరస్యం, సమగ్రత పదికాలాలపాటు పరిరక్షింపబడాలంటే శ్రీ రాజీవ్ పాలన తప్ప మరోమార్గం లేదని ... అన్నారు. (ఈ. 21.8 89)

**సమగ్ర నివేదిక** వి. *samagra niveedika* అన్ని వివరాలు జాగ్రత్తగా పొందుపరచిన రిపోర్టు comprehensive report ... కె.సి. కెనాల్ గురించి తీసుకునే చర్యల గురించి సమగ్ర నివేదిక పంపాలని అధికారులు కోరారు. (ఈ. 14 8.89)

**సమతౌల్యం** వి. *samataulyam* ఏదో ఒకవైపుకి మొగ్గు చూపకుండా సమంగా ఉండటం balance పాకిస్తాన్‌కు తేయాకును ఎగుమతి చేసి ప్రతిగా అక్కడ నుండి ఆయుధాలను దిగుమతి చేసుకోడానికి శ్రీలంక సిద్ధమైంది. ఈ రకంగా వాణిజ్యాన్ని సమతౌల్యం చేసుకోవాలని రెండు దేశాలు భావించాయి. (ఆం ప్ర 6 6 87)

**సమన్‌చేయు** క్రి. *samanceeyu* విచారణతో సంబంధం ఉన్నవారిని న్యాయస్థానానికి హాజరుకమ్మని ఆదేశించు to summon దేశంలోని ఏ న్యాయస్థానానికి శాసనసభ స్పీకర్‌ను సమన్‌చేసే అధికారం లేదని ... స్పీకర్ నారాయణరావు స్పష్టం చేశారు. (ఈ 13 9 89)

**సమన్లు** వి. (బ.వ.) *samanlu* ఏదైనా విచారణకు సంబంధించి హాజరుకావలసిందిగా కోర్టు నుంచి వచ్చిన ఉత్తర్వు summons ... సమన్లు లేదా ఉత్తర్వులను తానుకానీ, లెజిస్లేచర్ కార్యదర్శికానీ అందుకునే ప్రశ్నే ఉత్పన్నం కాదని స్పీకర్ ... స్పష్టం చేశారు. (ఆం. ప్ర 23.9 89)

**సమన్వయం** వి. *samanvayam* సరైన అవగాహనతో కలిసి పనిచేయటం co-ordination కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీకి, పిసిసి(ఐ)కి మధ్య సమన్వయం చాలా అవసరమని .. అన్నారు. (ఈ 6 9 89)

**సమన్వయ కమిటీ** వి. *samanvaya kamiTii* వ్యవహారాలు, కార్యక్రమాలు సక్రమంగా, సమన్వయంతో జరిగేట్లు చూసేందుకు ఏర్పాటు అయిన సంఘం coordination committee ఆంధ్ర ప్రదేశ్, రాజస్థాన్, మధ్యప్రదేశ్ ... రాష్ట్రాలకు చెందిన కాంగ్రెస్(ఐ) సమన్వయకమిటీలు సోమవారంనాడు ఇక్కడ విడివిడిగా ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీని కలుసుకొని ... పరిస్థితిని నివేదించారు. (ఆం. భూ 9.5 89)

**సమన్వయపరచు** క్రి. *samanvayaparacu* (కార్యకలాపాలలో) సమన్వయం ఉండేట్లుగా చూచు to co-ordinate జనతాదళ్ రాష్ట్ర శాఖలు చేసే కృషిని సమన్వయపరచి లోకసభ ఎన్నికల్లో ప్రతిపక్షాల ఓట్లు చీలకుండా చూసే బాధ్యతను పార్టీ ... అప్పచెప్పింది. (ఈ. 12.5.89)

**సమన్వయ సంఘం** వి. *samanvaya sangham* చూ. సమన్వయ కమిటీ. శ్రీ భగత్ రాష్ట్ర సమన్వయ సంఘం అధ్యక్షునిగా కూడా వ్యవహరిస్తున్నారు. (ఆం. భూ 26.4 89)

**సమభావం** వి *samabhaavam* అందరినీ ఒకే దృష్టితో తేడాలు లేకుండా చూడటం equal treatment సభ్యులందరిపట్ల సమభావం ప్రదర్శించి సత్సంప్రదాయాలు నెలకొల్పారు. (ఈ 25 5.89)

**సమయం** వి. *samayam* ఒక పనిని చేయటానికి అవసరమయ్యే వ్యవధి time బొమ్మయ్ తన మెజారిటీని నిరూపించుకోడానికి తగినంత సమయం ఇవ్వకపోవడంపై ప్రతిపక్షసభ్యులు ధ్వజమెత్తారు. (ఆం ప్ర 26 4 89)

**సమర్థవంతం** వి. *samarthavan-tam* సామర్థ్యం కలిగినట్టిది efficient, competent జాతి సమస్యను పరిష్కరించడంలో డిసెంబర్ 19 ప్రతిపాదనలే సమర్థవంతమైన పాత్రను నిర్వహిస్తాయని ఇండియా విశ్వసిస్తోంది. (ఆం ప్ర. 6 6 87)

**సమర్థించు** క్రి. *samarthincu* ఒక అభిప్రాయానికి అనుకూలంగా మాట్లాడు; బలపరచు to support, endorse శ్రీ సింగ్ ప్రతిపాదనను పార్టీ సీనియర్ నాయకుడు శ్రీ చంద్రశేఖర్ సమర్థించారు. (ఆం. ప్ర. 2 12 89)

**సమర్పణ** వి. *samarpaNa* పై స్థానంలో ఉన్నవారికి అందజేయటం; ఇవ్వటం submission, offering రాజీనామాల సమర్పణకు ముందు తెలుగుదేశం లోక్‌సభ ప్రతిపక్ష నాయకుడు శ్రీ మాధవరెడ్డి ఈ క్రింది నోటీసు సభలో చదివారు. (ఆం ప్ర. 25 7.89)

**సమర్పించు** క్రి. *samarpincu* విషయం లేదా సమస్య గురించి రాతపూర్వకంగా అందించు to submit, offer ప్రధానికి సమర్పించిన ఛార్జిషీటులో .. మరో మూడు తాజా ఆరోపణలు చేశారు. (ఆం జ్యో 8 4 88)

**సమష్టి కార్యక్రమం** వి. *samaSTi kaaryakramam* అందరు కలసికట్టుగా చేసే పని joint programme ... ఇతర జాతీయ, ప్రాంతీయ పార్టీలన్నీ ఒక వేదికపైకి రావలసిన సమయం ఆసన్నమైందని సూచించారు త్వరలో వీరంతా ఒక వేదికపైకి వచ్చి సమష్టి కార్యక్రమాన్ని రూపొందించి పథకం సిద్ధం చేయాలని ఆయన కోరారు. (ఈ. 22 7 87)

**సమష్టి నిర్ణయం** వి. *samaSTi nirNayam* అందరు కలసి ఒక అభిప్రాయానికి రావటం joint decision ... నిరసనగా ఆదివారంనాడిక్కడ సమావేశమైన ప్రతిపక్షాల అగ్రనాయకులు ఆ సమష్టి నిర్ణయం తీసుకున్నారు. (ఈ 24 7 89)

**సమసిపోవు** క్రి. *samasipoovu* సమస్యాపూర్వకమైన పరిస్థితి తొలిగిపోవు to subside, fizzle out సింగరేణిలో కొందరు కార్మికులు పనిచేయటంపట్ల సమ్మె సమసిపోతుందనుకోవడం తప్పని సింగరేణి కార్మిక సమాఖ్య ప్రకటించింది. (ఆం భూ 5 5 89)

**సమస్య** వి. *samasya* పరిష్కరించవలసిన వ్యవహారం problem తమిళుల సమస్యకు శాశ్వత పరిష్కారాన్ని ... (ఆం ప్ర. 6.6 87)

**సమాఖ్య** వి. *samaakhya* సంఘాలు కలసి ఏర్పడే కూటమి confederation ... రేవు కార్మికులు కూడా ఒక్క సమాఖ్య ఆధ్వర్యంలో కాకుండా రకరకాల యూనియన్ల పేరిట వ్యవహరించటంపట్ల దీర్ఘకాలంలో తమ మధ్య అనైక్యతకు తామే కారకులవుతారని గమనించాలి. (ఆం. భూ. 22.4 89)

**సమాంతర ప్రభుత్వం** వి. *samaantara prabhutvam* అధికారికంగా ఉన్న దానికి పోటీగా నడిపే మరో పాలనా వ్యవస్థ parllel governmeent గవర్నర్ శ్రీమతి కుముద్‌బెన్ జోషిని అడ్డుపెట్టుకొని కేంద్రం సమాంతర ప్రభుత్వాన్ని నడుపుతోందని .. ఆరోపించింది. (ఈ. 19.2.88)

**సమాచారరంగం** వి. *samaacaararangam* దేశ, విదేశాలలో జరిగే విషయాలను సేకరించి, పంపిణీ చేసే వ్యవస్థ; వార్తా ప్రపంచం field of information ... దేశంలో శాస్త్రీయ ప్రతిభకు కొదవలేదని క్రమేపీ రూపు దిద్దుకుంటున్న 'సమాచారరంగం'లో విప్లవాన్ని మనం సాధించి తీరవలసి ఉందని ... అన్నారు. (ఈ 30.1.89)

**సమాచార లోపం** వి. *samaacaara loopam* విషయం సరిగా తెలియకపోవటం అనే లోటు communication gap ... సమాచారలోపంవల్ల అపోహలు వచ్చాయి. అందుకు పత్రికలు కూడా తోడ్పడ్డాయని అన్నారు. (విశా. 8 10 87)

**సమాధికట్టు** క్రి. *samaadhikaTTu* నామరూపాలు లేకుండా చేయు to bury ... మరొకసారి అటువంటి అనైక్యతకు ఈ పక్షాలు పాల్పడితే నాన్-కాంగ్రెస్, నాన్-క

మ్యూనిస్టు ప్రతిపక్షానికి శాశ్వతంగా ఓటర్లు సమాధికడతారని గుర్తించడం మంచిది. (ఆం భూ 8 6.89)

**సమాధిచేయు** క్రి. *samaadhiceeyu* చూ. సమాధికట్టు to bury ... రాజకీయ ప్రయోజనాలకోసం ఈ సాంప్రదాయాన్ని సమాధిచేశారని ఆయన ఆరోపించారు. (ఆం. భూ. 19 5 89)

**సమాయత్తమగు** క్రి. *samaayattamagu* తగు ఏర్పాట్లు చేసుకొను; సన్నద్ధమగు to get ready, be prepared ... ఉప ఎన్నికలకు రంగం సిద్ధం చేసుకునేందుకు తెలుగుదేశం, కాంగ్రెస్(ఐ) పార్టీలు సమాయత్తమవుతున్నాయి. (ఆం ప్ర 23 10 88)

**సమారోహణ** వి. *samaaroohaNa* ఉత్సవ కార్యక్రమాలను ప్రారంభింటం launching of a festival ... ఉత్సవాల సమారోహణ కార్యక్రమంలో లోకాయుక్త ఆవుల సాంబశివరావు ప్రభృతులు పాల్గొంటారు. (ఆం ప్ర 2.2 88)

**సమాలోచన** వి. *samaaloocana* సమస్యల గురించి సమష్టిగా ఆలోచించి చర్చించుకోవటం discussions, talks శ్రీ రాజీవ్‌గాంధీ నేడు తన మంత్రివర్గ సహచరులతో సమాలోచనలు జరిపారు. (ఆం ప్ర 16.6 87)

**సమావేశం** వి. *samaaveeśam* సభలో అంతాచేరి సమ~లు చర్చించుకోవటం conference ' లో జరిగిన కాంగ్రెస్(ఐ) యేతర సమావేశాని ... అనుకున్నాం. (విశా 9.6 87)

**సమీకరణ** వి. *samiikaraNa* అనేక విధాలుగా సేకరించటం mobilisation ప్రపంచ టెన్నిస్ బలాబలాల సమీకరణంలో చిత్రమైన మార్పుకి, వినూత్నమైన మలుపుకీ ఈ ఇద్దరు జర్మన్ ఛాంపియన్లు చెప్పుకోదగ్గ కృషి చేశారు. (ఈ. 13 9 89)

**సమీకరించు** క్రి. *samiikarincu* ఒక ప్రయోజనార్థం వివిధరకాలుగా అవసరమైన వాటిని సేకరించు; పోగుచేయు to gather, collect ప్రజాభ్యుదయ కార్యక్రమాల నిమిత్తం బృహత్తర స్థాయిలో ఆర్థిక వనరులను సమీకరించవలసి ఉంటుంది. (ఈ 28 7.89)

**సమీకృత పథకం** వి. *samii-kRta pathakam* బహుళ ప్రయోజనాలు ఉన్న ప్రణాళిక integrated programme సంచార జాతులకు ఉపాధికల్పించే సమీకృత పథకాలను ఈ కొత్త పథకంలో చేర్చాలని ప్రభుత్వం ఆశిస్తున్నది. (ఆం. ప్ర 29 4.89)

**సమీక్షాసంఘం** వి. *samiikSaasangham* లోటుపాట్లను సరిచూడటానికి ఏర్పాటైన బృందం; పరిశీలనా సంఘం review committee ప్రతి రైల్వేకు ఒక సమీక్షా సంఘాన్ని ఏర్పాటు చేయాలని ... ప్రజా సమస్యల డైరెక్టరేట్ పేర్కొన్నది. (ఆం. భూ 21 5 89)

**సమీక్షాసమావేశం** వి. *samiikSaasa-maaveeśam* ఏ పని ఎంతవరకు జరిగిందో తెలుసుకునేందుకు ఏర్పాటు చేసే పరిశీలక సభ review meeting ... తదితర జిల్లా అధికార్లు పూర్తిగా తెలుగు వాడకానికి మారితే సచివాలయంలో కూడా తెలుగు అమలు మరింత వేగంగా, సులభంగా జరుగుతుందని సమీక్షాసమావేశం అభిప్రాయపడిందని ఆయన అన్నారు. (ఆం. జ్యో. 27 4.88)

**సమీక్షించు** క్రి. *samiikSincu* పరిస్థితులను లేదా వ్యవహారాలను శ్రద్ధగా విచారించు లేదా పరిశీలించు to review దక్షిణాసి

యాలోని భద్రతా పరిస్థితులను కూడా వీరు సమీక్షించారు. (ఈ 16.7 89)

**సమీప ప్రత్యర్థి** వి. *samiipa pratyarthi* ఓడిపోయిన అభ్యర్థులలో అందరికంటె ఎక్కువ ఓట్లు సంపాదించి విజేత బలానికి దగ్గరగా ఉన్న అభ్యర్థి nearest rival ... జనతాదళ్ నాయకుడు వి.పి. సింగ్ తన సమీప ప్రత్యర్థి కాంగ్రెస్ అభ్యర్థి కంటె 75 వేల ఓట్లు ఆధిక్యతలో ఉన్నారు. (ఆం. భూ 29 11.89)

**సముచితం** వి. *samucitam* తగిన విధంగా ఉండటం proper, appropriate ... రష్యానేత స్వాగత వేదికను ముందుగా నిర్ణయించిన తియాన్మెన్ స్క్వేర్ నుంచి మార్చడమే సముచితమని ఉన్నతాధికారులు భావించారు. (ఈ 16.5.89)

**సముదాయించు** క్రి. *samudaayincu* ఓదార్పు ద్వారా బాధను, ఆగ్రహాన్ని తగ్గింపజేయు; బుజ్జగించు to molify తిరిగి ఆదివారం రాత్రి కూడా వారు రామచంద్రా రెడ్డిని సముదాయించారు. (ఈ 21 12.87)

**సముద్ధరణ** వి. *samuddharaNa* వ్యవస్థాపరమైనలోటు పాట్లను సరిదిద్ది, పటిష్ఠపరచటం upliftment, revamping పంచాయతీరాజ్ వ్యవస్థ సముద్ధరణకు ముఖ్యమంత్రులతో ఒక్కరోజు సమావేశం ముగించాలని పించి ... మొక్కు చెల్లించుకున్నారు. (ఈ 8.5 89)

**సముపార్జించు** క్రి. *samupaarjincu* వివిధ విషయాలపై జ్ఞానాన్ని బాగా సంపాదించు; గడించు to obtain, acquire దీనికి అవసరమైన మౌలిక సాంకేతిక పరిజ్ఞానాన్ని లేబొరేటరీ ఇప్పటికే సముపార్జించింది. (ఈ. 29 2 88)

**సమైక్యపోరు** వి. *samaikyapooru* అంతాచేరి కలసికట్టుగా పోరాడటం combined or joint struggle తమ ఆశయ సిద్ధికోసం తమిళ మిలిటెంట్లంతా సమైక్యపోరు సాగించాలని కరుణానిధి కోరారు. (ఆం ప్ర 28.7 89)

**సమ్మరీ అంచనా** వి. *sammarii ancanaa* ఆదాయపు లెక్కలకు సంబంధించి, స్థూలంగా చేసే మదింపు summary assessment పన్నుల విధానాలు సులభతరం చేయడానికి ఈ ఏడాది సమ్మరీ అంచనాలకు ఆదాయ పరిమితిని లక్షరూపాయల నుండి రెండు లక్షల రూపాయలకు పెంచారు. (ఆం భూ 6 6.87)

**సమ్మె** వి. *samme* (కార్మికులు, ఉద్యోగులు, విద్యార్థులు) విధులకు హాజరుకాకుండా కోర్కెల పరిష్కారంకోసం జరిపే పోరాటం strike ... కార్మికులు సమ్మెను విరమించారు. (విశా. 8 6 87)

**సమ్మేళనం** వి. *sammeeLanam* ఒక ప్రయోజనార్థం ఒకచోట ముఖ్యులు కలవటం; సమావేశం meeting సేలంలో పీఠాధిపతుల సమ్మేళనం. (ఆం. ప్ర. 6 1 88)

**సమ్మోహన శక్తి** వి. *sammoohana śakti* రాజకీయాలలో జనాన్ని భారీగా ఆకర్షించే సామర్థ్యం glamour, charisma ప్రజల్లో ఇంకా తనకు సమ్మోహన శక్తి ఉందనుకుంటే ... కాంగ్రెస్‌తో ముఖాముఖి పోటీకి రమ్మనమనండి అని సవాల్ చేశారు. (ఆం ప్ర 28 8 89)

**సయోధ్య** వి. *sayoodhya* విభేదాలు తొలగించుకొని ఏర్పరుచుకునే స్నేహం amity లంకతో సయోధ్యకు భారత్ చొరవ. (ఆం. జ్యో. 6.6 87)

**సరంజామా** వి *saranjaamaa* ఒక కార్యక్రమానికి లేదా ఒక వృత్తికి అవసరమైన వస్తుసామగ్రి equipment,

paraphernalia ముందుగా నిర్ణయిం చిన కార్యక్రమం ప్రకారం సైన్స్ ఫెస్టివల్ సరంజామా ... చేరాల్సి ఉంది. (ఉ 15 6 87)

సరఫరా వి. *sarafaraa* ఉత్పత్తి ప్రాంతాల నుంచి సరకులు వినిమయదారులుండే చోటికి చేరవేయటం supply (of goods) ఆయా ఉత్పత్తి ప్రాంతాల నుంచి వస్తువుల సరఫరాలు తగ్గడంతో అడపాదడపా సమస్య మరింత జటిలమవుతూ ఉంటుంది (ఈ 25 4.89)

సరళతరంచేయు క్రి. *saraLataramceeyu* అన్య మార్గాల ద్వారా రద్దీని తగ్గించు to regulate ... ట్రాఫిక్ రద్దీని సరళతరం చేసే ప్రయత్నంలో భాగంగా నగరంలో ... నిర్మిస్తున్నారు. (ఆం ప్ర 4 12.87)

సరళీకరణ చర్య వి. *saraLiikaraNa carya* విధానాలను సులభతరం చేయటానికి చేపట్టే కార్యక్రమం liberalisation measure సమగ్ర పారిశ్రామిక అభివృద్ధి సాధనకోసం నెలరోజుల్లో మరిన్ని సరళీకరణ చర్యలను కేంద్రం ప్రకటిస్తుందని ... చెప్పారు. (ఈ. 18 6 87)

సరళీకృతం వి. *saraLiikRtam* సంక్లిష్టంగా ఉన్నదాన్ని సులభతరం చేయటం simplifying ... ప్రమోషన్ల విషయంలో ప్రస్తుతం పాటిస్తున్న రిజర్వేషన్ వర్తింపును సరళీకృతం చేసి ... (ఈ 20 4 89)

సరిహద్దు వి. *sarihaddu* దేశం, రాష్ట్రం మొ. పాలనా ప్రాంతపు పొలిమేర, ఎల్ల border భారత పాకిస్తాన్ సరిహద్దుల పొడవున పాకిస్తాన్ సైనిక కాపలాను పెంచుతున్నది. (ఆం ప్ర. 19 4 88)

సరిహద్దు చర్చలు వి. (బ.వ.) *sarihaddu carcalu* దేశం పొలిమేరల గురించిన వివాదాలపై జరిపే సంప్రదింపులు border talks భారత చైనాల మధ్య త్వరలో జరగబోయే సరిహద్దు చర్చల వల్ల ఇరుదేశాల మధ్య సంబంధాలు మరింత మెరుగు పడగలవని ..

సరిహద్దు ప్రాంతం వి. *sarihaddu praantam* దేశం పొలిమేర ప్రాంతం border area సరిహద్దు ప్రాంతాల్లో శాంతిని పరిరక్షిస్తూ ... (ఈ. 19.5 89)

సరిహద్దు భద్రతాదళం వి. *sarihaddu bhadrataadaLam* దేశ పొలిమేర ప్రాంతం రక్షణకోసం ఏర్పాటు చేసిన సైన్యం border security force అమృతసర్ జిల్లాలో గతవారం సరిహద్దు భద్రతాదళం పెద్ద మొత్తంలో ఆయుధాలు స్వాధీనం చేసుకుంది. (ఆం. ప్ర 1 1.88)

సరిహద్దు సమస్య వి. *sarihaddu samasya* ఇరుగు పొరుగు దేశాల లేదా రాష్ట్రాల మధ్య విభజనరేఖ నిర్ధారణ విషయంలో తలెత్తే వివాదం border issue సరిహద్దు సమస్యకు పరిష్కారం ప్రజల మనోభావాలకు అనుగుణంగా ఉండాలి. (ఆం భూ. 21 4 88)

సరెండరగు క్రి. *sarenDaragu* (ఉగ్రవాదులు, మిలిటెంట్లు) మునుపటి హింసా రాజకీయాల నుంచి వైదొలగి లొంగిపోవు to surrender తాండవ దళానికి చెందిన కాకూరి జోగయ్య .. సరెండరయ్యారు. (ఈ 5 7 89)

సర్కారీ బంద్ వి. *sarkaarii band* ప్రభుత్వపరంగా ప్రజా కార్యక్రమాలను స్తంభింపజేయటం government sponsored bandh ఆగస్టు 10 వ తేదీన తమ పార్టీ నిర్వహించింది ప్రజాబంద్ కాగా, ఆగస్టు 30 న రాష్ట్రంలో జరుగనున్నది సర్కారీ బంద్ అని అభివర్ణించారు. (ఆం. ప్ర 28.8 89)

**సర్క్యులర్** వి. *sarkyular* విషయాన్ని తెలిపేందుకు అధికారికంగా పంపే పత్రం; నోటీసు circular ప్రధాన కార్యదర్శి జారీచేసిన సర్క్యులర్ నేరుగా మంత్రులను ఉద్దేశించి .. (ఆం ప్ర 23.6.87)

**సర్క్యులేషన్ తీర్మానం** వి. *sarkyuleeSan tiirmaanam* సభ్యుల ఇండ్లకు పంపి సంతకాలు తీసుకోవటం ద్వారా తీర్మానాలను ఆమోదం పొందే పద్ధతి resolution by circulation కమిటీ సభ్యుల ఇండ్లకు తీర్మానాలు రాసి ప్రతులు పంపి సంతకాలు సేకరించడాన్ని సర్క్యులేషన్ పద్ధతి ఆమోదం అంటారు ... 'సర్క్యులేషన్ తీర్మానాలు ఉండితీరాలి' కమీషన్ ఉవాచ ... (ఉ 16 7.87)

**సర్దుబాటు** వి. *sardubaaTu* భిన్న రాజకీయ పార్టీలు ఎన్నికలలో పోటీపడకుండా పరస్పరం సహకరించుకొనేందుకు చేసుకొనే ఏర్పాటు adjustment సీట్ల సర్దుబాటు గురించి చర్చించి, జాబితా ఖరారు చేసేందుకు రెండు పార్టీల నాయకులు పదిహేను రోజుల్లో సమావేశమవుతారు. (ఆం ప్ర 29 6 89)

**సర్వ్** వి. *sarv* (టెన్నిస్‌లాంటి ఆటల్లో) ప్రత్యర్థి ఆడేందుకు వీలుగా బంతిని కొట్టి అందివ్వటం serve మెక్నో ఈ మ్యాచ్‌లో అద్భుతంగా సర్వ్ చేశాడు. (ఆం ప్ర. 4.7 89)

**సర్వతోముఖాభివృద్ధి** వి. *sarvatoomu khaabhivRddhi* అన్ని రంగాలలో అభివృద్ధి చెందటం integrated development దేశం సర్వతోముఖాభివృద్ధికి రష్యా బృహత్తర సహాయ సహకారాలు అందిస్తున్నదని ఆయన సంతృప్తిని వ్యక్తం చేశారు. (ఆం జ్యో 23 11 88)

**సర్వప్రతినిధి సభ** వి. *sarvapratinidhi sabha* ఐక్యరాజ్యసమితిలో సభ్య దేశాల వారందరితో కూడిన సమావేశం general assembly (U.N.O) మంగళవారంనాడు సర్వప్రతినిధి సభలో ప్రసంగించనున్న షెవర్డ్‌నాడ్జే బుష్ ప్రతిపాదనకు రష్యా ప్రతిస్పందనను తెలియజేసే అవకాశం ఉంది. (ఆం ప్ర. 27.8 87)

**సర్వసన్నద్ధం** వి. *sarvasannaddham* అన్ని విధాలా సిద్ధంగా ఉండటం well prepared దాడి జరిపిన పక్షంలో ఎదుర్కొనడానికి భారత్ సర్వసన్నద్ధంగా ఉందని ... హామీ ఇచ్చారు. (ఉ 26 4.88)

**సర్వసభ్య సమావేశం** వి. *sarvasabhya samaaveeśam* సభ్యులందరూ హాజరయ్యే సభ general body meeting ... రాష్ట్ర మున్సిపల్ ఛైర్మన్ల ఛాంబర్ ఇరవై మూడో సర్వసభ్య సమావేశానికి ఆయన ముఖ్యఅతిథిగా హాజరయ్యారు. (ఈ. 24 4 89)

**సర్వీసు** వి *sarviisu* 1. ఉద్యోగంలో చేరిన తర్వాత అందులో కొనసాగిన కాలం; పదవీకాలం service ప్రస్తుతం ఉన్న ఎన్. ఎం. ఆర్‌లలో కేవలం 30 శాతం మంది మాత్రమే నిజంగా అయిదేళ్ళ సర్వీసు పూర్తయి న్యాయంగా పర్మనెంటయ్యారు. (ఆం ప. 20 9 87) 2. ఆటలో బంతిని కొట్టి ప్రత్యర్థికి అందివ్వటం service మార్టినా అద్భుతంగా సర్వీస్ చేసింది. (ఆం ప్ర 29.8 89)

**సలహాదారు** వి. *salahaadaaru* రాజకీయ న్యాయ, ఆర్థికాది విషయాలపై తగిన సూచనలిచ్చే వ్యక్తి advisor పంజా

బుల్లో టెర్రరిజాన్ని అణచివేసేందుకు రాష్ట్ర డి.జి.పి. ఎ.ఎఫ్. రెబిరోను గవర్నర్ సలహాదారుగా నియమించారు. (ఉ. 21 4 88)

**సలహాసంఘం** వి. *salahaasangham* తగిన సూచనలిచ్చే సభ్యుల కూటమి advisory council ... వివరాలను వెల్లడిస్తూ, మిగులు భూములను గుర్తించేందుకు ఏర్పాటయ్యే సలహాసంఘంలో అన్ని రాజకీయ పార్టీల ప్రతినిధులు సభ్యులుగా ఉంటారు. (ఈ 29.6 89)

**సవరణ** వి. *savaraNa* ఉన్న చట్టాలలో ఆధునిక అవసరాలకు తగినట్లు కొన్ని మార్పులు, చేర్పులు చేయటం amendment రిజర్వేషన్‌లో కొన్ని అంశాలకు సవరణలు అవసరం కావచ్చునన్నారు. (ఈ. 26 7 89)

**సవరణ బిల్లు** వి *savaraNa billu* ఉన్న చట్టానికి మార్పులు, చేర్పులు చేసే బిల్లు amendment bill పంచాయతీరాజ్ వ్యవస్థ చట్టం సవరణ బిల్లు సభ ముందుకు కూడా రాకముందే ... ఫిర్యాదు చేశారు. (ఆం. భూ. 5.5.89)

**సవరించు** క్రి. *savarincu* ఉన్న నిబంధనలలో కొన్ని మార్పులు, చేర్పులు చేయు to amend పన్నుల విధానాన్ని సవరించేటప్పుడు ప్రభుత్వం ఈ అంశాలన్నిటిని దృష్టిలో పెట్టుకుంది. (ఈ. 5.6.87)

**సవాలుచేయు** క్రి. *savaaluceeyu* చట్టం, ఉత్తర్వు మొ. వాటి న్యాయ బద్ధత, సమంజసత్వాలను (న్యాయస్థానంలో) ప్రశ్నించు to challenge *1987* హిందూ మత ధర్మ సంస్థలు దేవాలయ చట్టాన్ని సవాలు చేస్తూ దాఖలయిన పిటీషన్లపై ఆయన ఈ ఉత్తర్వులు జారీ చేశారు. (ఆం జ్యో 5 6 87)

**సవాలువిసరు** క్రి. *savaaluvisaru* (ఏదైనా విషయంలో) పోటీపడి శక్తి సామర్థ్యాలు రుజువు చేసుకొమ్మని పిలుచు to challenge సత్తా ఉంటే పార్లమెంట్ సీటుకు రాజీనామా చేసి అదే స్థానంలో కాంగ్రెస్-ఐ తో పోటీచేసి గెలుపొందాలని ... సభ్యులకు ఆయన సవాలువిసిరారు. (ఆం. భూ. 7 10.87)

**సవివరం** వి. *savivaram* (పథకం, ఆలోచన మొ. విషయాలలో) అన్ని అంశాలు తేటతెల్లంగా పేర్కొని ఉన్నది elaborate, detailed ... ఫ్రంట్ నేతల నేతృత్వంలో రూపుదిద్దుకుంటున్న సంయుక్త కార్యాచరణ పథకం గురించి వి.పి.సింగ్ వీరికి సవివరంగా వివరించినట్లు తెలిసింది. (ఈ 26.7 89)

**ససేమిరా** అవ్య. *saseemiraa* పూర్తి అనంగీకారం no, never, not at all బహిష్కరణ నిర్ణయాన్ని మార్చుకునేలా శ్రీలంకకు నచ్చచెప్పే యత్నాల్ని ఇతర సభ్య దేశాలు ప్రారంభించనప్పటికి శ్రీలంక ససేమిరా అనడంతో అవి విఫలమయ్యాయి. (ఆం భూ. 29 6 89)

**సస్పెండ్‌చేయు** క్రి. *saspenDceeyu* 1. (అనుచిత ప్రవర్తనకు శిక్షగా) ఉద్యోగం లేదా ఏదైనా సంస్థ సభ్యత్వం నుంచి కొంతకాలం పాటు తొలగించు to suspend మండల ఆసుపత్రిలో ఇద్దరు మహిళల మరణానికి బాధ్యులైన డ్యూటీ సిబ్బందిని వెంటనే సస్పెండ్‌చేయాలని వారిపై కఠిన చర్యలు తీసుకోవాలని ... విజ్ఞప్తి చేశారు (ఆం భూ 7.10 87) 2. (చట్టం, రూలు మొ. వాటిని) కొంత

కాలం పాటు అమలు కాకుండా నిలుపు to suspend దేవాలయాలకు ఇనాము లుగా లభించిన భూముల్ని ప్రభుత్వం పేరు మీదికి మార్చడానికి వీలుకల్పించే నిబంధనను కూడా న్యాయమూర్తి సస్పెండ్‌చేశారు. (ఆం. జ్యో 5.6.87)

సస్పెన్షన్ వి. *saspenSan* తాత్కాలి కంగా పనిచెయ్యకుండా నిలుపు చేయటం suspension శాసన సభను రద్దు చేయ టమా? లేక సస్పెన్షన్‌లో ఉంచటమా అనే దానిపై ప్రభుత్వం సందేహంలో పడింది. (ఆం. ప్ర 22 4 89)

సస్పెన్సు వి. *saspensu* ఏమి జరుగుతుందో తెలియని ఉద్వేగ స్థితి suspense వారు కావాలని సస్పెన్సును పెంచుతున్నారా లేక బ్లాక్ మెయిల్ చేయ డానికి యత్నిస్తున్నారా అని అనుమానం కూడా కలుగుతున్నది. (ఆం జ్యో 18 6 87)

సస్యరక్షణ చర్య వి. *sasyarakSaNa carya* క్రిమికీటకాదుల బారి నుంచి పంటను రక్షించటానికి తీసుకునే జాగ్రత్త crop protection సస్యరక్షణ చర్యలు చేపట్టేందుకు *14* వేల టన్నుల క్రిమి సంహా రక మందులను సరఫరా చేయాలని కూడా నిర్ణయించారు. (ఈ 6 7 89)

సస్య విప్లవం వి. *sasya viplavam* ఆధునిక శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం సహాయంతో ఆహార ధాన్యోత్పత్తిని అపా రంగా పెంచటానికి ఉద్దేశించిన ప్రణా ళిక green revolution సస్య విప్లవం ద్వారా ముఖ్యంగా గోధుమ ఉత్పత్తికి సంబం ధించి అత్యద్భుత విజయం సాధ్యమైంది. (ఈ 11 12.87)

సహకరించుకొను క్రి. *sahakarincukonu* పరస్పరం మంచి అవగాహనతో సహాయ పడు to cooperate రెండు దేశాలు అనేక రంగాల్లో సహకరించుకొంటున్నాయి. (ఆం జ్యో 5 6 87)

సహకార చక్కెర ఫ్యాక్టరీ వి. *sahakaara cakkera fyaakTarii* సహ కార రంగంలో ఏర్పాటు అయిన పంచ దార కార్ఖానా cooperative sugar factory సహకార చక్కెర ఫ్యాక్టరీల ద్వారా మూడు డిస్టిలరీలను ఏర్పాటు చేయడం జరు గుతుందని ... (ఆం. ప్ర 8.4 88)

సహకార పరపతి సంఘం వి. *sahakaara parapati sangham* సహ కార రంగంలో (రైతులకు) ఋణాలిచ్చే ఆర్థిక సంస్థ cooperative credit society వ్యవసాయ పరపతి, ఉత్పాదకాల సరఫరా, మార్కెటింగ్ సేవలు ఒకే ప్రాంగ ణంలో లభింపజేసే ఉద్దేశంతో "సింగిల్ విండో" కింద ప్రాథమిక పరపతి సహకార పరపతి సంఘాలను విలీనం చేసి ... సృష్టిం చింది. (ఈ 18 10 87)

సహకార బ్యాంకు వి. *sahakaara byaanku* సహకార రంగంలో రైతాంగా నికి ఋణాలిస్తూ ఆర్థిక లావాదేవీలను చూసే సంస్థ cooperative bank పట్టణ ప్రాంతాల్లోని దేవాదాయ స్థలాలను బహిరంగ వేలం వేసి, తద్వారా వచ్చే ఆదా యాన్ని సహకార బ్యాంకులలో డిపాజిట్ చేయాలని ... ప్రకటించారు. (ఈ. 2.6.89)

**సహజ న్యాయం** వి. *sahaja nyaayam* ఉచితమైనదనిపించే న్యాయం natural justice ... వాస్తవానికి ధిక్కారకుల్ని అక్కడికక్కడే శిక్షించాలని లేకుంటే ఈ దేశంలో ప్రజాస్వామ్యసంస్థలు పనిచేయటం అసాధ్యం కాగలదని సహజ న్యాయం చెబుతుంది కూడా అని స్పీకర్ అన్నారు. (ఆం ప్ర. 1.5 89)

**సహజ వనరులు** వి. (బ.వ.) *sahaja vanarulu* ప్రకృతి సిద్ధమైన సంపత్తి natural resources మనకు సహజ వనరులు ఉన్నాయి. బొగ్గు పుష్కలంగా ఉంది. ముడి ఇనుము కొరత లేదు. సాంకేతిక నిపుణులు లక్షల సంఖ్యలో ఉన్నారు. (ఆం. ప్ర 4 5 89)

**సహజ వాయువు** వి. *sahaja vaayuvu* భూగర్భంలో చమురు నిక్షేపాలను వెలికితీసే క్రమంలో వెలువడే (మండే స్వభావం కల) వాయువు natural gas మన రాష్ట్రంలో లభ్యమయ్యే సహజ వాయువును పూర్తిగా ఉపయోగించుకునే హక్కు మనకే ఉండాలని అన్నారు. (ఆం ప్ర 21 9 88)

**సహజాతం** వి. *sahajaatam* తార్కిక విశ్లేషణ అవసరం లేకుండా విషయాలను గమనించిన వెంటనే అర్థం చేసుకోదగిన శక్తి intuition శ్రోత ఈ విషయాన్ని సహజాతంగా (ఇంట్యూషన్) నైనా గుర్తించవచ్చు. (ఈ. 14 8 87)

**సహాయ భృతి** వి. *sahaaya bhRti* చూ. ఎక్స్‌గ్రేషియా మృతుని కుటుంబానికి సహాయ భృతి మంజూరు చేయాలని ... కోరారు. (ఈ. 31.10.89)

**సహాయ మంత్రి** వి. *sahaaya mantri* మంత్రివర్గంలో కేబినెట్ స్థాయి మంత్రికి సహకారం ఇస్తూ కింది అంచెలో పనిచేసే అమాత్యుడు state minister రాష్ట్రపతి ఉత్తరువును గురించి దేశ వ్యవహారాల శాఖ సహాయ మంత్రి ... (ఈ 14 8.87)

**సహేతుకం** వి. *saheetukam* చూ. హేతుబద్ధం మానవతా హృదయంతో ప్రథమంగా ఎం.ఎల్.ఎ. ను రక్షించేందుకు తగిన చర్యలు తీసుకోకుండా రెచ్చగొట్టే విధంగా మాట్లాడటం సహేతుకం కాదని వారన్నారు. (ఈ 14.8 87)

**సాంకేతిక ఉద్యమం** వి. *saankeetika udyamam* కార్యక్రమాలను శాస్త్రీయ పద్ధతుల్లో సమగ్రంగా నిర్వహించటానికి చేపట్టే సామూహిక ప్రయత్నం technological movement జాతీయ స్థాయిలో చేపట్టిన అయిదు సాంకేతిక ఉద్యమాల్లో మంచినీటి సరఫరా ఉద్యమానికి పెద్దపీట వేశామని . . . (ఆం.జ్యో 15.10.88)

**సాంకేతిక ప్రగతి** వి. *saanketika pragati* శాస్త్రీయ పద్ధతుల్లో జరిగే అభివృద్ధి technological development శాస్త్రీయ ఆలోచన - పరిశోధనా రంగాల్లో స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకొనేందుకు దేశీయ శాస్త్ర సాంకేతిక ప్రగతి ఫలితాలు భారత సమాజానికి ప్రయోజనం చేకూర్చేట్టు చూడాలని . . . కోరారు. (ఈ. 13 7 89)

**సాంగోపాంగంగా** క్రి.విశే. *saangoopaangangaa* ఒక విషయానికి సంబంధించిన పూర్తి వివరాలతో ; సాకల్యంగా detailed, thoroughly పశువుల దాణా తయారు యంత్రాలు అమ్మే ఒక కంపెనీకి జక్కర్ ఎలా తోడ్పడిందీ ఇందులో సాంగోపాంగంగా వివరించారు. (ఆం.భూ 3.5 89)

**సాంఘిక న్యాయం** వి. *saanghika nyaayam* సమాజంలోని అసమానతలను తొలగించే విధంగా ప్రజలందరకూ కల్పించే సంక్షేమం social justice సమాజం లోని అంతరాలను పోగొట్టి ప్రజలందరికీ సాంఘిక న్యాయం చేకూర్చడానికి నెహ్రూ తన జీవితాంతం శ్రమించాడని ఆమె అన్నారు. (ఈ 1.7.89)

**సాంఘిక సమస్య** వి. *saanghika samasya* సమాజంలో విస్తృతంగా పాకిన పెడధోరణి social problem . . . ఆడో, మగో తెలుసుకోడానికి నిర్ధారణ పరీక్షలు చేయించి ఆడ శిశువు అని తేలితే భ్రూణ హత్యలకు పాల్పడుతున్నారని ఆమె అన్నారు. ఇది సాంఘిక సమస్యగా పరిణమించిందని కూడా . . . అన్నారు. (ఆం.ప్ర. 17.11.88)

**సాంస్కృతిక మార్పిడి** వి. *saamskRtika maarpiDi* భిన్న దేశాల నాగరికతల మధ్య అవగాహనకై కళాకారుల, విద్యావేత్తల మొ. బృందాలను ఆయా దేశాలు పరస్పరం పంపుకోవటం cultural exchange సోవియట్ సాంస్కృతిక మంత్రి శ్రీ వి. జి. జఖరోవ్ సెప్టెంబర్ 18న మనదేశం వచ్చినపుడు కుదిరిన సాంస్కృతిక మార్పిడి కార్యక్రమం కింద ఈ రెండు విద్యా సంబంధమైన ఒడంబడికలపై సంతకాలు జరిగాయి. (ఆం.భూ 25 11 87)

**సాకల్యంగా** క్రి.విణ. *saakalyan-gaa* అన్ని విషయాలను అన్నివైపులనుంచి క్షుణ్ణంగా (పరిశీలించటం); వివరంగా thoroughly, detailed manner సాంకేతికపరమైన అన్ని అంశాలనూ సాకల్యంగా పరిశీలించి సైన్యాధికారులు చేసిన సిఫారసు మేరకే . . . (ఈ 21.7.89)

**సాక్షాత్కరించు** క్రి. *saakSaatkarincu* అనుకోకుండా ఏదైనా కనిపించి విస్మయ పరచు to appear (unexpectedly) కొలంబోలోని భారత హైకమీషన్ కార్యాలయం ముందు గురువారం ఉదయం సాక్షాత్కరించిన ఓ చెక్క పెట్టె భయాందోళనలకు కారణమైంది. (ఈ 5 6 89)

**సాక్ష్యాధారం** వి. *saakSyaadhaaram* నిజనిరూపణకు తోడ్పడే అంశం; రుజువు evidence, proof ప్రభుత్వ పక్షానికి శ్రీ బూటాసింగ్ నాయకత్వం వహిస్తూ, శ్రీ గాంధీ అన్న మాటలు అక్షరాలా సత్యమని, వాటిని రుజువు చేయడానికి తగిన సాక్ష్యాధారాలున్నాయని అన్నారు. (ఆం.ప్ర 17 8 89)

**సాగించు** క్రి. *saagincu* అడ్డులేకుండా నిర్వహించు, జరుపు to perpetuate నక్సలైట్ల సానుభూతిపరులనే పేరుతో అమాయక ప్రజలపై పోలీసులు సాగిస్తున్న దమన కాండను నిలిపివేయాలని . . . (ఆం.జ్యో 2.2.89)

**సాచివేత వైఖరి** వి. *saaciveeta vaikhari* తీవ్రమైన విషయాలపట్ల అవలంబించే ఉదాసీన, నిర్లక్ష్య ధోరణి callous attitude గతంలో ఉగ్రవాదుల దురాగతాలకు బర్నాలా ప్రభుత్వం సాచివేత వైఖరే కారణమని ఆరోపించిన కేంద్ర ప్రభుత్వం ఇప్పుడు . . . (ఉ 15.6 87)

**సాదర ఖర్చు** వి. *saadara kharcu* (కంపెనీ వ్యవహారాలలో) చిల్లరఖర్చులకు వాడే సొమ్ము miscellaneous expenditure . . . ఏజెంట్లు ఎవరికైనా ఏదైనా ముట్టజెబితే దానిని సాదర ఖర్చుల కింద జమ కట్టాలనీ బోఫోర్స్ వాదిస్తున్నది. (ఆం.భూ. 20 6.87)

**సాధకబాధకాలు** వి. (బ.వ.) *saadhak-abaadhakaalu* ఒక కార్యక్రమం నెరవేర్చ టంలో ఉండే ఇబ్బందులు problems *లొంగిపోయిన తీవ్రవాదుల సాధకబాధకాలను తీర్చే విషయంపై అధికారులు తనతో తరచు చర్చలు జరపమని కూడా ఆయన కోరారు.* (ఈ. 30.6.89)

**సాధనచేయు** క్రి. *saadhanaceeyu* ఒక పనిలో నైపుణ్యం సంపాదించటానికి నిరం తరం ప్రయత్నం చేయు to practise *ప్రస్తుతం అంతర్జాతీయ రంగంలో యూరో పియన్ జట్లు అనుసరిస్తున్న మెలకువలను క్షుణ్ణంగా పరిశీలించి వాటికి తగిన ఎత్తుగడ లను భారత జట్టు సాధనచేయాలి.* (ఆం.భూ. 1.2.88)

**సాధారణ ఎన్నికలు** వి. (బ.వ.) *saad-haaraNaennikalu* లోకసభకు దేశ వ్యాప్తంగా ప్రజాప్రతినిధుల ఎంపికకై నిర్వహించే రాజ్యాంగబద్ధమైన ఎన్నికలు general elections *భారత రాజ్యాం గంలో నిర్దేశించిన ప్రజాస్వామ్యం, సెక్యు లిరిజం, సోషలిజంపై విశ్వాసం ప్రకటిస్తూ అకాలీదళ్ తన నియమ నిబంధనావళిలో మార్పు చేయనంతవరకు వచ్చే సాధారణ ఎన్నికల్లో పాల్గొనేందుకు అనుమతించబో మని . . . ప్రకటించారు.* (ఆం.ప్ర. 4.7 89)

**సాధారణం** వి. *saadhaaraNam* (ఆందో ళన చెందాల్సిన పనిలేని) నిలకడ పరిస్థితి normal *ప్రధాన న్యాయమూర్తి పరిస్థితి ప్రస్తుతం సాధారణంగానే ఉందని, అయిన ప్పటికీ పరిశీలన నిమిత్తం ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో ఉంచామని ..* (ఆం.ప్ర. 7.7 87).

**సాధారణ బడ్జెట్** వి. *saadhaaraNa baDjeT* ఏటా ప్రభుత్వం ప్రకటించే ఆదాయ వ్యయాల పట్టిక general budget *ఈ నెల 20 వతేదీన 1988-89 వ సంవత్సరానికి సాధారణ బడ్జెట్‌ను లోక్ సభలో ప్రవేశపెడతారు.* (ఉ 9.2 88)

**సాధారణ సంబంధాలు** వి. (బ.వ.) *saadhaaraNa sambandhaalu* దేశాల మధ్య శాంతి, సహజీవనాలకోసం ఏర్పా టుచేసుకొనే దౌత్య, సాంస్కృతిక మార్పి డులు normal (diplomatic) relations *చైనాతో తిరిగి సాధరణ సంబం ధాలను నెలకొల్పుకోవడం గురించి ప్రస్తా విస్తూ . . . ఆయన స్పష్టం చేశారు.* (ఆం.భూ 26 11 87)

**సాధారణ స్థితి** వి. *saadhaaraNa sthiti* కల్లోలం, ఘర్షణలు లేకుండా అదు పులో ఉన్న శాంతి భద్రతల వాతావరణం normalcy *జాఫ్నాలో యుద్ధ వాతావ రణ పరిస్థితులు ఉండగా శ్రీలంకలోని ఇతర ప్రాంతాలలో పరిస్థితులు ఎంతో సాధారణ స్థితిలో ఉన్నాయని . . . చెప్పారు.* (విశా. 28 10.87)

**సాధించు** క్రి *saadhincu* ప్రయత్నించి సంపాదించు; గెలుచు to get, achieve *మధ్యతరగతి ప్రజల నుండి ఈ సంస్థ పెద్ద మొత్తాలు సాధించింది.* (ఈ. 5 6 87)

**సాధ్యాసాధ్యాలు** వి. (బ.వ.) *saad-hyaasaadhyaalu* కార్యాచరణలో వచ్చే సమస్యలు feasibility, prospects *కృత్రిమ వర్షాలు కురిపించడంలో సాధ్యాసా ధ్యాలను పరిశీలించి . . .* (ఉ 8.4 88)

**సానదేరు** క్రి. *saanadeeru* ఒక పనియందు అధిక నైపుణ్యం పొందు; పదునెక్కు to be sharpened *కక్షిదార్ల ముక్కు పిండి సాధ్యమైనంత ఎక్కువ ఫీజు దండుకొనే*

అభ్యాసం సానదేరినందువల్ల న్యాయవాద వృత్తి వ్యాపారంగా మారిపోయిందనే విమర్శ వాస్తవమైనది కాదు. (ఈ. 4.7 89)

**సానుకూల పరిణామం** వి. *saanukuula pariNaamam* సామాజికంగా కోరదగిన మార్పు positive development చైనా దీన్ని సానుకూల పరిణామంగా అభివర్ణిస్తూ హర్షం ప్రకటించింది. (ఈ 16 5.87)

**సానుభూతిపరుడు** వి. *saanubhuuti-paruDu* ఒక పార్టీ రాజకీయ ఉద్యమాలలో ప్రత్యక్షంగా పాల్గొనకుండా, వాటిలో పాల్గొనే వారి సిద్ధాంతాలు, ఉద్యమాల పట్ల అభిమానం కల వ్యక్తి sympathiser గుంటూరు జిల్లా చిలకలూరిపేట పార్టీ సభ్యుల, సానుభూతిపరుల సమావేశంలో శ్రీ రాజేశ్వరరావు ప్రసంగించారు. (విశా 20 6.87)

**సానుభూతి పవనాలు** వి. (బ.వ.) *sa-anubhuuti pavanaalu* ఒక ప్రముఖ వ్యక్తి దారుణ హత్యకు గురిఅయినప్పుడు ఆ వ్యక్తి పట్ల కలిగే అభిమానపు వెల్లువ waves of sympathy *1984* లో ఇందిర సానుభూతి పవనాలు బలంగా వీయడంతో . . . చేజిక్కించుకోగలిగింది. (ఆం.ప్ర 21.11 89)

**సాపత్యం** వి. *saapatyam* ఒకే విధమైన పోలిక ఉండటం; పొంతన parallelism, similarity ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ప్రవేశపెట్టబోతున్న బిల్లుకు ఆనాటి ముసాయిదాకు సాపత్యంలేదు. (ఈ 8.5 89)

**సాఫల్యత** వి. *saaphalyata* తగినట్లుగా చేకూరిన ఫలితం fulfilment అభివృద్ధి ఫలితాలు ప్రజాస్వామ్యానికి అందకపోతే స్వాతంత్ర్యానికి సాఫల్యత చేకూరదని . . . అన్నారు. (ఈ 16 8 89)

**సాఫీ** వి. *saafii* ఎటువంటి అడ్డంకులు, ఇబ్బందులు లేకపోవటం; నిరాటంకం uninterrupted చైనా నుంచి నేపాల్‌కు . . . వస్తువులను సాఫీగా రవాణా చేయడానికి వీలుగా . . . ఏర్పాటు చేసింది. (ఆం.భూ. 22 4 89)

**సామరస్యం** వి. *saamarasyam* ఎలాంటి అవరోధాలు, ఘర్షణలు లేని ప్రశాంత వాతావరణం cordiality, amicability ముఖ్యమంత్రి ప్రభుత్వ కార్యదర్శి వద్ద విడివిడిగా జరిగిన చర్చలు సామరస్యంగా జరిగాయని . . . తెలిపారు. (ఈ. 28.9 89)

**సామరస్య జీవనం** వి. *saamarasya ji-ivanam* భిన్న సంస్కృతులకు, మతాలకు చెందినవారు సౌమ్యంగా, స్నేహంగా కలిసి బతకటం amity, peaceful living (among different groups of people) ప్రశాంత వాతావరణం, సామరస్య జీవనం సాధ్యం కావడానికి ఇంకా చాలకాలం పడుతుందని తెలుసుకోవాలి. (ఉ. 6 10.87)

**సామరస్యత** వి. *saamarasyata* చూ. సామరస్యం తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక హైదరాబాద్ నగరంలో మతకల్లోలాలు తగ్గి సామరస్యత పెంపొందిందని ముఖ్యమంత్రి చెప్పారు. (ఆం.ప్ర 22 4 88)

**సామరస్య మార్గం** వి. *saamarasya-maargam* విభేదాలు లేకుండా స్నేహభావంతో నడచుకొనే పద్ధతి amicable way . . . గోర్బచేవ్ ఆధ్వర్యంలో రష్యా విదేశాంగ విధానం మరింత సామరస్య మార్గం అనుసరించి నందుకు తాను . . . అన్నారు. (ఈ. 17 5 89)

**సామర్థ్యం** వి. *saamarthyam* పని చక్కగా చేయగల శక్తి, నేర్పు capacity . . . అద్భుతమైన సామర్థ్యాన్ని చూపినందుకు గాను కంపెనీకి బుధవారంనాడు అవార్డు బహూకరించారు. (ఆం.ప్ర. 28 7.89)

**సామాజిక అడవులు** వి. (బ.వ.) *saamaajika aDavulu* వాతావరణ సమతుల్యంకోసం ప్రయత్న పూర్వకంగా వ్యక్తులు, సంస్థలు పెంచే చెట్లు ( యూకలిప్టస్, సుబాబుల్ చెట్లతోటలు వగైరా) social forests కెనడా అంతర్జాతీయ సంస్థ ఇచ్చే నిధులతో అమలు జరుగుతున్న సామాజిక అడవుల పెంపకం . . . (ఉ 8 7 87)

**సామాజిక న్యాయం** వి. *saamaajika nyaayam* చూ. సాంఘిక న్యాయం. దేశంలో అట్టడుగు వర్గాల ప్రజలకి కూడా సామాజిక న్యాయం చేకూరేలా ప్రవాస భారతీయులు తమ వంతు కృషి చేయాలని . . . అన్నారు. (ఈ 19 5 89)

**సామాజిక పరివర్తన** వి. *saamaajika parivartana* చెడు సంప్రదాయాలను వ్యతిరేకిస్తూ సంఘం ఉన్నత దశకు ఎదిగే మార్పు social transformation వర్గకుల రహిత సమాజం ధ్యేయంగా సామాజిక పరివర్తనకు అవసరమైన రాజకీయ, ఆర్థిక, సాంఘిక మార్పులతో రాష్ట్రాన్ని ప్రగతిపథంలో నడిపించడమే తమ పార్టీ లక్ష్యమని వారన్నారు. (ఈ. 8.5 89)

**సామాజిక బాధ్యత** వి. *saamaajika baadhyata* సంఘపరమైన సమస్యలపట్ల జవాబుదారీ కలిగి ఉండటం social responsibility ప్రజలలో సామాజిక బాధ్యత పెంపొందించాలని, సామాజిక బాధ్యత ఎంతో ముఖ్యమైనదని, కాని దాన్నే ప్రజలు మరచిపోతున్నారని . . . అన్నారు. (ఈ. 15.10.88)

**సామాజిక విప్లవశక్తి** వి. *saamaajika viplavaśakti* సంఘంలోని రుగ్మతలను వదలగొట్టి గుణాత్మక మార్పులు తేగల వ్యక్తి లేదా సంస్థ social revolutionary సంఘం శరణం గచ్ఛామి అని బుద్ధుడు ప్రవచించి గొప్ప సోషలిస్టు అయ్యాడని, మానవతా ధర్మాన్ని తన శైలిలో చెప్పడానికి ఉద్భవించిన సామాజిక విప్లవశక్తిగా . . . అభివర్ణించారు. (ఆం ప్ర 16 11.88)

**సామూహిక ప్రదర్శన** వి. *saamuuhika pradarśana* తమ రాజకీయ అభిప్రాయాలను వ్యక్తం చేసేందుకు ప్రజలు పెద్ద ఎత్తున వీధులలో నినాదాలతో జరిపే ఊరేగింపు massive demonstration బీజింగ్ వీధుల్లో విద్యార్థులు ప్రారంభించిన సామూహిక ప్రదర్శనల పర్వం నానాటికీ పుంజుకొని ప్రజాస్వామ్య హక్కులకోసం బృహత్తర ప్రజా ఉద్యమంగా పరిణమించింది. (ఈ 31 5 89)

**సామూహిక బావులు** వి. (బ.వ.) *saamuuhika baavulu* చిన్న రైతులకు సాగునీరు అందించేందుకు ప్రభుత్వం తవ్వించే నూతులు community wells ఆదోని డివిజన్‌లోని మంత్రాలయం మండలంలో షెడ్యూల్ కులాల ఆక్షను ప్లాను కింద రూ. 12 60 లక్షల ఖర్చుతో 70 సామూహిక బావుల నిర్మాణం చేయుటకు నిర్ణయించినట్లు . . . తెలిపారు. (ఆం.ప్ర. 15.10 87)

**సామూహిక రాజీనామా** వి. *saamuuhika raajiinaamaa* ఒక లక్ష్యాన్ని సాధించటంకోసం, నిరసనను తెల్పటంకోసం మూకుమ్మడిగా సభ్యులు పదవీ త్యాగం చేయటం resignations en masse . . . సి. ఎ. జి.

ని కాంగ్రెస్(ఐ) తీవ్రంగా నిందిస్తోందని అద్వాని అన్నారు. దీనికి తగిన సమాధానమే ఈ సామూహిక రాజీనామాలని ఆయన అన్నారు. (ఈ 24.7.89)

**సామ్రాజ్యవాదం** వి. *saamraajyavaadam* ఆర్థిక, సైనిక, రంగాలలో అపారంగా ఇతర దేశాల విధానాలను ప్రభావితం చేయగల దేశం (పెట్టుబడిదారీ విధానపు ఉన్నతదశ) imperialism పంజాబ్‌లో సంక్షోభాన్ని ఉధృతం చేయడానికి అమెరికన్ సామ్రాజ్యవాదం నిర్వహిస్తున్న దుష్టపాత్ర గురించి సి.పి.ఐ.(ఎం) చాలా కాలంగా ప్రజలను హెచ్చరిస్తూ వస్తున్నదని . . తెలిపింది. (ఆం.ప్ర. 5.6.87)

**సాయుధ దళం** వి. *saayudha daLam* దేశ రక్షణకోసం ఆయుధాలు ధరించిన సైనిక బలగం armed forces చైనా-సోవియట్ సరిహద్దు వెంబడి సాయుధ దళాలను కనీస స్థాయికి తగ్గించుకోవాలని నిర్దేశిస్తూ . . (ఈ. 19.5.89)

**సాయుధ పోలీసులు** వి. (బ.వ.) *saayudha poolisulu* శాంతి భద్రతల పరిరక్షణకై ఆయుధాలు ధరించిన రక్షక భటులు armed police force బెంగుళూరు నగరంలో కీలకమైన చోట్ల ఇప్పటికే సాయుధ పోలీసులు రంగప్రవేశం చేశారు. (ఈ 27.4.89)

**సారథి** వి. *saarathi* నిర్వహణ సామర్థ్యం కల వ్యక్తి; నాయకుడు man at the helm, leader రాష్ట్ర 'దళ్' సారథి బాబుల్. (ఆం జ్యో 2.2.89)

**సారథ్యం** వి. *saarathyam* ప్రదర్శనలలో, బృందాలలో నాయకత్వం leadership, guidance, heading న్యాయ మూర్తులు కె ఎన్. సింగ్, ఎస్. రంగనాథన్, ఎం. ఎం. అహ్మద్, కె. ఎస్. సైకియాలతో కూడిన ఈ ధర్మాసనానికి జస్టిస్ సవ్యసాచి ముఖర్జీ సారథ్యం వహిస్తున్నారు. (ఈ 26.4.89)

**సారథ్యం వహించు** క్రి. *saarathyam vahincu* నాయకత్వ బాధ్యత నిర్వహించు to lead . . . గ్రాహం గూచ్ ఇంగ్లాండ్ జట్టుకి సారథ్యం వహిస్తాడు. (ఈ. 17.8.89)

**సారథ్య సంఘం** వి. *saaradhya sangham* రాజకీయ కార్యక్రమాలను, నిర్ణయాలనూ నిర్దేశించే అనుభవంకల నాయకుల బృందం steering committee "మౌలిక విభేదాలు" సమసిపోయిన అనంతరం సారథ్య సంఘం సుహృద్భావ వాతావరణంలో సమావేశమైందని ఆయన చెప్పారు. (ఈ 6.10.88)

**సారించు** క్రి. *saarincu* ఒక లక్ష్యంపై, ఆలోచనపై ప్రత్యేక శ్రద్ధ పెట్టు to aim at, pay special attention అన్ని విషయాలపై చర్చించామని ఎన్నికల వ్యూహం, ఎన్నికల ప్రణాళికపై కూడా ప్రత్యేకంగా దృష్టి సారించమన్నారు. (ఈ 27.5.89)

**సార్క్** వి. *saark* దక్షిణాసియా ప్రాంతీయ సహకార సంఘం (ఇండియా, పాకిస్తాన్, శ్రీలంక, బంగ్లాదేశ్, భూటాన్, మాల్దీవుల దేశాలతో ఏర్పడిన కూటమి) South Asian Association for Regional Cooperation దక్షిణాసియా ప్రాంతీయ సహకార సంఘం ఆరు రోజుల సమావేశాలు ఆదివారం ఇక్కడ ప్రారంభమైనాయి. (ఆం ప 15.6.87)

**సార్వత్రిక ఎన్నికలు** వి. (బ.వ.) *saarvatrika ennikalu* చూ. సాధారణ ఎన్నికలు. దేశ వ్యాప్తంగా 1977లో జరిగిన సార్వత్రిక ఎన్నికలలో 'జనతా' కాంగ్రెస్‌ను ఓడించి కేంద్రంలో అధికారాన్ని చేపట్టింది. (ఆం. భూ 20.6.89)

**సార్వత్రిక సమ్మె** వి. *saarvatrika samme* ఉద్యోగులు, కార్మికులు ముఖ్యమైన కోర్కెల సాధనకోసం దేశ వ్యాప్తంగా పని నిలుపుదలచేయటం general strike *గత 21 రోజులుగా సాగుతున్న బస్సుల సమ్మెకు మద్దతుగా శ్రీ లంక అంతటా సోమవారంనాడు సార్వత్రిక సమ్మెకు జనతా విముక్తి పెరమున తీవ్ర వాద సంస్థ పిలుపిచ్చింది.* (ఆం ప్ర 3 7.89)

**సార్వత్రిక సివిల్ కోడ్** వి. *saarvatrika sivil kooD* చట్ట ప్రకారం దేశ ప్రజలందరికీ ఒకే న్యాయ విధానం ఉండాలనే పద్ధతి common civil code *భారత రాజ్యాంగాన్ని మరోసారి పరిశీలించాలని సార్వత్రిక సివిల్ కోడ్ అమలు చేయాలని, పంజాబ్ సమస్యకు న్యాయమైన పరిష్కారం యోచించాలని . . . డిమాండు చేస్తున్నది.* (ఆం భూ. 27 9 89)

**సార్వభౌమాధికారం** వి. *saarvabhau-maadhikaaram* (ఇతరుల ప్రమేయం లేకుండా) ఒక దేశానికి తన రాజకీయ, పాలన, విదేశీ మొ. వ్యవహారాల్లో ఉన్న సంపూర్ణ స్వేచ్ఛ, సర్వాధికారాలు sovereignty *తమ దేశ సార్వభౌమాధికారంపై ప్రాదేశిక సమగ్రతపై చెప్పాపెట్టకుండా ఇండియా దాడి చేసిందని శ్రీలంక ఆరోపించింది.* (ఆం జ్యో 5 6.87)

**సాలిడారిటీ ఉద్యమం** వి. *saaliDaari-Tii udyamam* పోలెండులో కమ్యూనిస్టు పాలనకు వ్యతిరేకంగా లీచ్ వలెసా నాయకత్వంలో వచ్చిన ఉద్యమం solidarity movement *1983లో పోలెండులో సైనిక పాలన ఉండేది. అప్పట్లో 'సాలిడారిటీ' ఉద్యమం పుట్టిన గాన్స్కి నగరానికి పోప్ వెళ్ళలేకపోయారు.* (ఈ. 18 6 87)

**సావధాన తీర్మానం** వి. *saavadhaana tiirmaanam* చట్ట సభలలో ప్రజాప్రాముఖ్యంగల అంశంపట్ల ప్రభుత్వ దృష్టిని ఆకర్షించటానికి ఉద్దేశించిన తీర్మానం call attention motion. . . . *కుదిరిన ఒప్పందాన్ని ఉల్లంఘించడంవల్ల ఉత్పన్నమైన పరిస్థితిని చర్చించడానికై ప్రవేశపెట్టిన సావధాన తీర్మానానికి మంత్రి సమాధానం చెప్పారు.* (ఆం ప్ర 26 4.89)

**సావనీర్** వి. *saavaniir* ప్రత్యేక సందర్భాలలో వ్యక్తులు, సంస్థలు ప్రచురించే విశిష్ట సంచిక souvenir *ఈ కార్యక్రమంలో రాష్ట్ర ముఖ్యమంత్రి పాల్గొని సావనీర్‌ను ఆవిష్కరిస్తారని . . . చెప్పారు.* (ఆం భూ. 18 7 89)

**సాహసించు** క్రి. *saahasincu* ఒక పనిని ధైర్యంతో తెగించి చేయు to venture *ఆర్థిక సహాయ సంస్థలు రుణాలివ్వడానికి సాహసించలేకపోతున్నాయి.* (ఈ 19 2 88)

**సింగిల్ పాయింట్ ప్రోగ్రామ్** వి *singil paayinT proograam* ఇతర పనులన్నీ పక్కకునెట్టి ఒకే అంశానికి ఎక్కువగా ప్రాధాన్యమిచ్చి అమలు జరిపే కార్యక్రమం single point programme *ప్రస్తుతం మా శాఖలో మా ముందున్నది ఈ సింగిల్ పాయింట్ ప్రోగ్రామే. అదేమిటంటే వీలైనన్ని తెలుగు సమాచారం కాపీలను పంచిపెట్టడమేనని సమాచారశాఖ అధికారి ఒకరు వ్యాఖ్యానించారు.* (ఆం ప్ర 25 6 87)

**సింగిల్ విండో** వి. *singil vinDoo* రైతులకు వ్యక్తిగత అప్పు, భూమి తనఖా అప్పు, దీర్ఘకాలిక అప్పు మొ. పరపతి సౌకర్యాలను ఒకేచోట నుంచి కల్పించే పథకం ; ఏక గవాక్ష విధానం single window system *రైతులకు దీర్ఘకాలిక, స్వల్పకాలిక రుణాలను, ఇతర సౌకర్యాలను*

ఇదివరలోవలె వేరువేరు సంఘాల ద్వారా కాకుండా, ఈ కొత్త సంఘాల ద్వారా పంపకంచేసే "సింగిల్ విండో" పథకమే ఇందుకు కారణం. (ఆం. జ్యో. 3 7 87)

**సింగిల్ వికెట్ టోర్నమెంట్** వి. *singil vikeT ToornamenT* (క్రికెటర్లలో (సాధారణంగా ఆల్‌రౌండర్లు) వ్యక్తిగతంగా ఎవరు మేటి అని నిర్ణయించేందుకు జరిపే పరిమిత ఓవర్ల పోటీ single wicket tournment ప్రపంచ ఆల్‌రౌండర్స్‌లో మేటి ఎవరో తేల్చే సింగిల్ వికెట్ టోర్నమెంట్ . . . మన దేశంలో జరుగుతుంది. (ఆం ప్ర. 29 7.89)

**సింగిల్స్** వి. *singils* (టెన్నిస్, షటిల్ మొ. ఆటల్లో) ఒక్కోవైపు ఒక్క ఆటగాడు మాత్రమే పాల్గొనే పోటీ singles పురుషుల సింగిల్స్ సెమీఫైనల్‌కు చేరుకోవడంలో రెండుసార్లు ప్రపంచ ఛాంపియన్ తొలిసారి విఫలమయ్యాడు. (ఆం. ప్ర 26.4 89)

**సింథటిక్** విణ. *sinthaTik* కృత్రిమంగా తయారుచేసిన synthetic ఉపయోగించిన సింథటిక్ రసాయనాల ద్వారా విటమిన్-ఎ తయారు చేయడానికి ఇక్కడి ప్రాంతీయ పరిశోధనాలయం శాస్త్రజ్ఞులు తీవ్రంగా కృషి చేస్తున్నారు. (ఆం. ప్ర. 23 6 87)

**సింపోజియం** వి. *simpoojiyam* నిర్దిష్ట విషయంపై నిపుణులు చర్చించేందుకు ఏర్పాటు చేసిన సదస్సు symposium ఇండియాలో ఇటీవల అఖిలభారత వైద్య శాస్త్రాల సంస్థలో 'బయో మెడికల్ సైన్సెస్' పై ఒక 'సింపోజియం' జరిగింది. (ఉ. 22.12.87)

**సింహావలోకనం** వి. *simhaavalookanam* గతాన్ని అందులో తప్పొప్పులను నిలకడగా విశ్లేషించుకోవటం retrospection నిజానికి ఈ రోజున శ్రామికవర్గం ఆత్మపరిశీలనా విమర్శలతో తమ ఉద్యమాన్ని సింహావలోకనం చేసుకొని లోటుపాట్లను సరిదిద్దుకొని పురోగమించాలనే ఆదర్శం తెరమరుగై పోయింది. (ఆం ప్ర. 1 5 89)

**సిక్సర్** వి. *siksar* (క్రికెట్‌లో) బంతిని బౌండరీలైను అవతల పడేట్లుగా కొట్టటం (దీనికి ఆరు పరుగులు లభిస్తాయి.) sixer గ్రీనిడ్జ్ 69 పరుగులు సాధించాడు. 8 ఫోర్లు, ఒక సిక్సర్ కొట్టాడు. (ఆం. ప్ర 1.1 88)

**సిగ్గుసిగ్గు** వి. *siggu siggu* చట్ట సభలలో, బహిరంగ సమావేశాలలో, ఎదుటి పక్షాన్ని అవహేళన చేస్తూ చేసే నినాదం shame shame రాజ్యసభలో ప్రశ్నోత్తరాల సమయం ముగియగానే మొత్తం ప్రతిపక్ష సభ్యులందరూ లేచి నిలబడి సి.ఎ.జి. నివేదిక ప్రతులను గాలిలో ఊపుతూ 'సిగ్గుసిగ్గు' అని కేకలు వేశారు. (ఆం ప్ర. 20.7.89)

**సిటింగ్ స్క్వాడ్** వి. *siTing skvaaD* పరీక్షల్లో అక్రమాలు జరక్కుండా నిరోధించటానికి ఒక నిర్ణీత కేంద్రంలో ప్రత్యేకంగా నియమించబడిన అధ్యాపక బృందం sitting squad వాస్తవంగా మాస్ కాపీయింగ్ జరిగివుంటే పరీక్షల సందర్భంగా ఈ పరీక్షా కేంద్రంలో ఉన్న 'సిటింగ్ స్క్వాడ్' ఎందుకు చూస్తూ ఊరుకుందని ... ప్రశ్నించారు. (విశా. 20.6.87)

**సిటీ కాంపెన్సేటరీ అలవెన్సు** వి. *siTii kaampenseeTarii alavensu* నగరాలలో ఉండే అధిక జీవన వ్యయానికి ప్రతిగా ప్రభుత్వం ఉద్యోగులకు చెల్లించే భత్యం city compensatory allowance ... రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు ఇటీవల సవరించిన విధంగానే రవాణా సిబ్బందికి కూడా సిటీ కాంపెన్సేటరీ అలవెన్సు ... ఇవ్వదలచినట్లు తెలిపారు. (ఈ 20 6.87)

**సిద్ధంచేయు** క్రి. *siddhamceeyu* తయారుచేసి ఉంచు to keep ready స్థానిక సంస్థల ఎన్నికల్లో 'సంస్కరణలు' తెచ్చేందుకు వీలుగా రాష్ట్ర ప్రభుత్వం ముసాయిదా బిల్లును సిద్ధంచేసింది. (ఈ 26 11 87)

**సిద్ధపడు** క్రి. *siddhapaDu* ఒక పని చేసేందుకు తయారగు to be prepared అయితే అమెరికా ఈ చర్చకు సిద్ధపడటం లేదని ఆయన అన్నారు. (ప్రజా 8 10 87)

**సిద్ధమగు** క్రి *siddhamagu* పాల్గొనటానికి ప్రయత్నాలు పూర్తిగా చేసుకొను to get ready బొంబాయి మ్యాచ్‌కు సిద్ధమవుతున్న చేతన్. (ఆం. జ్యో. 14 10 87)

**సిద్ధహస్తుడు** వి. *siddhahastuDu* ఒక పనిలో అనుభవం, నైపుణ్యంగల వ్యక్తి; నిపుణుడు person known for doing wrong deeds, expert ప్రజా ఉద్యమాలను విచ్ఛిన్నం చేయడంలో కమ్యూనిస్టులు మొదటి నుండీ సిద్ధహస్తులని ఆయన విమర్శించారు. (ఈ 21.12.87)

**సిఫార్సు** వి. *sifaarsu* వివరాలతో కూడిన సూచన recommendation గవర్నర్ సిఫార్సును రాష్ట్రంలో నెలకొన్న పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని 356 అధికరణం కింద రాష్ట్రపతి పాలనకు వెంకట్రామన్ ఉత్తర్వు జారీ చేసినట్లు చెప్పారు. (ఈ 22 4 89)

**సిలబస్** వి. *silabas* ఒక విద్యా సంవత్సరంలో బోధించవలసిన పాఠ్యాంశాలు; పాఠ్యప్రణాళిక syllabus ఇప్పటివరకు 60 శాతం సిలబస్ మాత్రమే పూర్తి అయిందని మిగతా 40 శాతం సిలబస్ పదిరోజుల్లో ... చెప్పారు. (ఆం. భూ. 22 6 87)

**సివిల్ కోడ్** వి. *sivil kooD* ఆస్తులు, వారసత్వాలు తదితర విషయాలలో వర్తించే పౌర చట్టం civil code రాజ్యాంగాన్ని సమీక్షించటం, దేశమంతటికీ ఒకే సివిల్ కోడ్ ప్రవేశ పెట్టటం ... బి.జె.పి. ఎన్నికల ప్రణాళికలో అత్యధిక ప్రాధాన్యం ఇస్తారు. (ఈ. 27 9 89)

**సివిల్ డామేజి కేసు** వి. *sivil Daameeji keesu* పౌరులకు ప్రభుత్వం వల్లగాని, ప్రభుత్వ వైఫల్యంవల్లగాని కలిగే నష్టానికి పరిహారం కోరుతూ వేసే దావా; పౌర నష్టం దావా civil damage suit వంగవీటి మోహన రంగారావు ప్రాణాలను కాపాడడంలో విఫలమైన రాష్ట్ర ప్రభుత్వంపై హైకోర్టులో 'సివిల్ డామేజ్' కేసు వేయడానికి ... యోచిస్తున్నారు. (ఆం.భూ. 3.7 89)

**సివిల్ వార్** వి. *sivil vaar* చూ. అంతర్యుద్ధం. "రాబోయే సివిల్ వార్‌కు ఆయనే బాధ్యుడు" అని కూడా ... అన్నారు. (ఆం. ప్ర 21 4 89)

**సీజ్‌చేయు** క్రి. *siijceeyu* అధికారులు స్వాధీనం చేసుకొను to sieze సమాచారశాఖ ప్రచురించిన పుస్తకం అందరికీ వచ్చేట్లు చూడాలి లేదా సీజ్‌చేయండి. (ఆం ప్ర 19 12.87)

**సీజన్** వి. *siijan* ఆటలు (ముఖ్యంగా

క్రికెట్) ఎక్కువగా జరిగే రెండు మూడు నెలల కాలం season (as in sports) ఈ మ్యాచ్ గెలవడంతో ... కు 22 పాయింట్లు వచ్చాయి. దీనితో ... కు ఈ సీజన్‌లో 273 పాయింట్లు వచ్చినట్లయింది. (ఆం ప్ర. 17 8 89)

**సీజాక్ చేయు** క్రి. *siijaak ceeyu* సముద్రంలో నౌకను ముట్టడించి స్వాధీనం చేసుకొని తీసుకుపోవు to seajack భారత్ నుంచి అరవై వేల తుపాకులను కొనుగోలు చేసిన బ్రిటిష్ ఆయుధాల ఏజెంట్ ఫ్రాంక్ టర్నర్ కళ్ళు గప్పి సి. ఐ. ఏ. ఈ నౌకను 'సీజాక్' చేసింది. (ఈ 7 12.87)

**సీల్ చేయు** క్రి. *siilceeyu* ఎవ్వరూ ఉపయోగించకుండా (యంత్రాలను, భవనాలను) అధికార ముద్రతో యథాతథంగా నిలిపివేయు లేదా మూసివేయు to seal కస్టమ్స్ అధికారులు స్మగ్లర్‌ను అదుపులోకి తీసుకొని కారును సీల్ చేశారు. (ఆం భూ. 21 4 89)

**సీలింగ్** వి. *siiling* ఆస్తి, డబ్బు మొ. విషయాలలో ప్రభుత్వం విధించే గరిష్ఠ పరిమితి ceiling సీలింగ్ నిబంధనలలో కొంత సడలింపు. (ఈ. 6 6 87)

**సుంకం** వి. *sunkam* వస్తువుల క్రయ విక్రయాలపై, ఎగుమతులు దిగుమతులు మొదలైన వాటిపై ప్రభుత్వం విధించే పన్ను levy రిలయన్స్ వ్యవహారాలను దృష్టిలో పెట్టుకొని ఈ కమిటీ కొన్ని ప్రధాన కేసులలో ఈ సంస్థ ఎగ్గొట్టిన ఎక్సైజు సుంకపు మొత్తాలను మదింపు చేసింది. (ఆం ప్ర 26.4.89)

**సుఖాంతం** వి. *sukhaantam* సంతోషకరమైన ముగింపు ending in a happy note సంచలనాత్మకంగా జరిగిన ఐ.ఎ.ఎస్ అధికారుల బందీ ఘటన ఎట్టకేలకు సుఖాంతంగా ముగిసింది. (ఉ. 30 12.87)

**సుగమంఅగు** క్రి. *sugamamagu* అడ్డంకులు తొలగించి ఒక క్రమంలో ముందుకు సాగేందుకు వీలు కల్పించు to pave the way సస్పెన్షన్‌లో వున్న అసెంబ్లీని రద్దు చేయడంతో రాష్ట్రంలో అసెంబ్లీ ఎన్నికల నిర్వహణకు మార్గం సుగమంఅయింది. (ఆంజ్యో 7 3 89)

**సుతరాము** అవ్య. *sutaraamu* ఏ మాత్రమూ, ససేమిరా absolutely, not at all నిధులు ఖర్చు అయ్యేది రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగం ద్వారానే కదా! అధికారులు అట్టడుగు స్థాయికి వెళ్ళడం ఎన్టీఆర్‌కు సుతరాము ఇష్టంలేదు. (ఆం.భూ. 24.5 89)

**సుతిమెత్తగా** క్రి.విశే. *sutimettagaa* చెప్పే విషయంలో కాఠిన్యం లేకుండా, సున్నితంగా in a suggestive tone . . . ప్రతిపక్షం సుతిమెత్తగా కర్తవ్యబోధ చేసిన తరువాత కూడా యథార్థాలను ఎరుకపరిచే తెగువ శ్రీజక్కర్‌కు లేకపోయింది. (ఈ 10 5.89)

**సుదీర్ఘ చర్చ** వి. *sudiirgha carca* ఎక్కువ సమయం కేటాయించి ఒక విషయంపై కూలంకషంగా జరిపే సంభాషణలు lengthy and elaborate discussion ఈ కమిటీ ఇప్పటికే సమావేశమై సుదీర్ఘ చర్చలు జరిపిందని అన్నారు. (ఉ 15 10 88)

**సుదీర్ఘ సమావేశం** వి. *sudiirgha samaaveeśam* ఒక విషయంపై ఎక్కువసేపు చర్చలు, సంప్రదింపులు జరపటం marathon session వైట్ హౌస్ ప్రతిపాదనపై సభలోని రిపబ్లికన్ సభ్యులు

బుధవారం సుదీర్ఘ సమావేశం జరిపారని సభ్యుడు బాబ్ డార్విన్ తెలిపారు. (ఈ 20.11 87)

**సునాయాసం** వి. *sunaayaasam* అలస టకు గురికాకుండా ఉండటం; అతిసులభం ease, effortless *1986లో మహారాష్ట్ర పోటీల్లో ఈ దూరాన్ని 17 నిమిషాల 49.98 సెకన్లలో దాటి గౌరవ్ కపూర్ సృష్టించిన రికార్డును నాగపాల్ ఇప్పుడు సునాయాసంగా బద్దలు చేశాడు.* (ఈ 27.9 89)

**సునిశితం** వి. *suniśitam* 1. వాడి కలిగినది sharp . . . *అతని బౌలింగ్ అంత సునిశితంగా ఖచ్చితంగా ఉంది.* (ఈ. 20 4.89) 2. సూక్ష్మ పరిశీలనతోకూడినది keen, minute . . . *వచ్చిపోయే అతిథుల వాహనాలను సునిశితంగా తనిఖీ చేశారు.* (ఈ 16 8 89)

**సున్నిత భావోద్రేకం** వి. *sunnita bhaavoodreekam* మతపరమైన, సాంఘికప రమైన నమ్మకాలతో కూడిన అభిప్రాయం passion *సున్నిత భావోద్రేకాలను రెచ్చ గొడుతుండటం వల్ల వారసత్వంగా వస్తున్న సంప్రదాయ విలువలను మనం కోల్పోతు న్నామని . . . శ్రీ రాజీవ్ గాంధీ హెచ్చరించారు.* (ఆంభూ. 10.7 87)

**సుప్రీం** వి. *supriim* ఉన్నతాధికారాలు గల సంస్థ higher body *కోర్టు యువజన కాంగ్రెస్ కార్యకర్తలను అరెస్టు చేయకుండా ... అసెంబ్లీయే సుప్రీం అని పేర్కొన్నారు.* (ఆం.ప్ర. 27 8.89)

**సుముఖత** వి. *sumukhata* (సమస్యల పరి ష్కారంపట్ల) ప్రదర్శించే సానుకూల వైఖరి favourable disposition *జయవ ర్ధనే ప్రభుత్వం తమిళ వర్గాల కోర్కెలు తీర్చడానికి సాధ్యమైనంతమేరకు సుముఖత చూపినా లిబరేషన్ టైగర్లు విర్రవీగారు.* (ఈ 5 6.87)

**సురక్షిత ప్రాంతం** వి. *surakSita praantam* ప్రమాదం లేని ప్రదేశం safer place *వరదలో చిక్కుకున్న వారిని సుర క్షిత ప్రాంతాలకు తరలించేందుకు వీలుగా పడవలు సిద్ధంగా ఉంచామని . . . తెలిపారు.* (ఈ. 26 7.89)

**సులభతరం** వి. *sulabhataram* అధి కార పరమైన చిక్కులను తగ్గించి విధి విధానాలలో తెచ్చే సరళమైన పద్ధతి; సర ళతరం simplified, easier . . . *ఆయుధాలు లైసెన్సులు మంజూరుచేసే విధా నాన్ని సులభతరం చేస్తామని ఆయన హామీ ఇచ్చారు.* (ఉ. 31 3 88)

**సుస్థిరం** వి. *susthiram* రాజకీయంగా నిలకడ కలిగినటువంటిది; పటిష్ఠమైనది stable *ప్రజలు బాగా ఆలోచించి సుస్థి రమైన ప్రభుత్వాన్ని అందించే పార్టీకే ఓటు వేయాలని ప్రధాని విజ్ఞప్తి చేశారు.* (ఈ. 20 11 89)

**సుహృద్భావ పర్యటన** వి. (బ.వ.) *suhRdbhaava paryaTana* ఉభయ దేశాల మధ్య సత్సంబంధాలను నెలకొ ల్పేందుకు దేశాధినేతలు చేసే స్నేహ యాత్ర cordial visit ... *ఈ రెండు రోజుల సుహృద్భావ పర్యటనలో ఆయన వెంట శ్రీమతి సోనియాగాంధీ ... వెళ్లారు.* (ఉ 27 87)

**సుహృద్భావ వాతావరణం** వి. *suhRdbhaava vaataavaraNam* స్నేహ సంబం ధాలకు అనుకూలమైన పరిస్థితి cordial atmosphere *అయితే ఈ సమా వేశం సుహృద్భావ వాతావరణంలో సాగిందని మొత్తం ద్వైపాక్షిక సంబంధాలు వారి చర్చకు*

వచ్చాయని ఆయన చెప్పారు. (ఆంప్ర 5989)

**సుహృద్భావ సంబంధాలు** వి. (బ.వ.) *suhRdbhaava sambandhaalu* విభేదాలకు తావు లేకుండా మంచి సంబంధాలతో కూడిన స్నేహం cordial relations . . . శ్రీ సింగ్ తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ ముఖ్యమంత్రులు, గవర్నర్లు మధ్య సుహృద్భావ సంబంధాలు ఉండాలని సూచించారు. (ఆంప్ర. 11288)

**సూచన** వి. *suucana* 1. కార్యక్రమాల రూపకల్పనకు ఇచ్చే సలహా advice, recommendation *ఇక ఆ కమిటీ సూచన మేరకు వివిధ రాష్ట్రాలు విధించిన భూ గరిష్ట పరిమితులు ఇలా ఉన్నాయి.* (ఆంప్ర 13689) 2 (సామాజిక వ్యవహారాల్లో, ప్రకృతిలో) రాబోయే మార్పులను తెలిపే అంశం indication *రానున్న 48 గంటల్లో మహారాష్ట్రలోని నాందేడ్ దిగువగా ఉన్న గోదావరి పరీవాహక ప్రాంతంలో ఒక మోస్తరు నుంచి భారీ వర్షాలు కురిసే సూచనలు ఉన్నట్లు వాతావరణ కేంద్రం తెలిపింది.* (ఆంప్ర 29 7.89)

**సూచనప్రాయం** వి. *suucanapraayam* నిర్ణయం ఖరారు చేయకముందు ఆ నిర్ణయాలను కొంతమేర ధ్వనింపచేయటం indicative, giving a hint, suggestive . . . *ప్రభుత్వ తీర్మానంపై చర్చను అనుమతిస్తామని స్పీకర్ సూచనప్రాయంగా తెలియజేయడంతో ప్రతిపక్ష సభ్యులు నిరసన వ్యక్తం చేశారు.* (ఆంప్ర 25 4 89)

**సూచించు** క్రి *suucincu* తన అభిప్రాయాన్ని సలహారూపంలో మరొకరికి చెప్పు to suggest, recommend *జిల్లాలో పార్టీని మరింత పటిష్టం చేయడానికి రమణారెడ్డిని పార్టీలో చేర్చుకోవలసిందిగా ముఖ్యమంత్రికి . . . సూచించినట్లు తెలుస్తోంది.* (ఆం.భూ 28789)

**సూచీ** వి. *suucii* (వస్తువుల ధరలలో పెరుగుదలను తరుగుదలను) ఇన్ని పాయింట్లు పెరిగిందని లేదా తరిగిందని తెలిపే గణాంక వివరం index (of prices) *1989 జనవరి ఒకటో తేదీనాటికి ఉన్న వినిమయ ధరల సూచీ ఆధారంగా వివిధ ప్రభుత్వ రంగ సంస్థలలో వేతన సవరణ జరిగిందని . . .* (ఆంభూ. 1589)

**సూటు** వి. *suuTu* కోర్టులో దాఖలయిన వ్యాజ్యం suit *ఇక సిటీ సివిల్, క్రిమినల్ కేసుల్లో దాఖలయ్యే కేసుల వివరాలను పరిశీలిస్తే గత జూన్ వరకు మొత్తం 52, 626 సూట్లు పెండింగ్‌లో ఉన్నాయి.* (ఆంప్ర 17889)

**సూత్రధారుడు** వి. *suutradhaa-ruDu* (దురుద్దేశంతో కూడిన) కార్యక్రమాన్ని రూపకల్పనచేసి అమలుచేయటంలో ప్రధాన వ్యక్తి protagonist, instigator *సైనిక తిరుగుబాటు వార్తను రేడియో ప్రసారం చేసింది. బ్రిగేడియర్ హసన్ రేడియోలో ఈ ప్రకటన చేశారు. ఈ తిరుగుబాటు వెనుక సూత్రధారులు ఎవరు అన్నది ఇంకా తెలియరాలేదు.* (ఆం.భూ. 17.89)

**సూత్రప్రాయం** వి. *suutrapraayam* కార్యక్రమం అమలుకు ముందు విధానపరంగా ఆమోదించటం in principle *తెలుగు మీడియంలో హైదరాబాద్ నగరంలో ప్రారంభించనున్న ఈ జర్నలిజం కోర్సులకు రాష్ట్రప్రభుత్వం సూత్రప్రాయంగా అంగీకరించిందని ఆయన చెప్పారు.* (ఆం.జ్యో. 84.88)

**సూత్రబద్ధ వ్యతిరేకత** వి. *suutrabad-*

*dha vyatıreekata* నియమాను సారం విముఖతను ప్రకటించటం principled opposition పాక్‌కు తిరిగి ప్రవేశం కల్పించటంపై భారత్ సూత్రబద్ధంగా వ్యతిరేకత తెలిపింది. (ప్ర శ 15.10 87)

**సూపర్ కంప్యూటర్** వి. *suupar kampyuuTar* (శాస్త్ర సాంకేతిక రంగాల్లో) అత్యంత సంక్లిష్టమైన సమాచారాన్ని విశ్లేషించ గలిగిన శక్తి సామర్థ్యాలు గల కంప్యూటర్ super computer శాస్త్ర సాంకేతిక వాతావరణ విభాగాలకు రుతుపవనాల పరిశోధనలో ఉపయోగపడగల సూపర్ కంప్యూటర్ కొనుగోలుకు భారత దేశం శుక్రవారంనాడు అమెరికాతో ఒప్పందం కుదుర్చుకుంది. (ఆంజ్యో. 10 10 87)

**సూపర్ న్యూమరరీ** విణ. *suupar nyuumararıı* ఒక కోర్సులో ఉండే సీట్ల సంఖ్యకాక, అదనంగా (క్రీడలు, జాతీయ సేవా పథకం, యన్.సి సి. మొ. రంగాలలో) అర్హతలున్న వారికి కేటాయించే సీట్ల సంఖ్యకు సంబంధించిన; అదనపు super numerary యోగ్యతను బట్టి సీట్లు రానివారికి సూపర్ న్యూమరరీ సీట్లు సృష్టించి వారికి ప్రవేశం కల్పించాలని ఆయన సూచించారు (ఆంప 18 9 87)

**సూపర్‌వైజర్** వి. *suuparvaijar* పనులు జరగటాన్ని సమీక్షించే అధికారి supervisor దూరదర్శన్‌లో ముఖ్యమంత్రి చేసే ప్రసంగాలపై ఒక అధికారిని 'సూపర్‌వైజర్'గా నియమించి కేంద్రం చిన్న చూపు చూస్తోందన్నారు. (ఆంప్ర 21 8 89)

**సెంచరీ** వి. *sencarıı* (క్రికెట్లో) నూరు పరుగులు century (100 runs) విండీస్ జట్టులో రిచీరిటర్డ్‌సన్ ధాటిగా ఆడి సెంచరీ సాధించడం విశేషం. (ఆంజ్యో 4.12.87)

**సెంటిమెంట్** వి. *senTımenT* హేతుబద్ధం కాకపోయినా గట్టి నమ్మకంతో కూడిన భావం sentiment మతపరమైన సెంటిమెంట్లను ఎన్నికల కోసం వాడుకోవడం తీవ్ర అభ్యంతరకర అంశమని శ్రీ దర్బారాసింగ్ అన్నారు. (ఆంభూ 17 11 89)

**సెకండ్‌చేయు** క్రి *sekanDceeyu* ఒక పదవికి ఒకరి పేరు సూచించినప్పుడు వేరొకరు అదే వ్యక్తిని బలపరచు, సమర్థించు to second చంద్రశేఖర్ ఇందుకు సమ్మతించి దేవీలాల్ పేరును సెకండ్‌చేయడానికి సంసిద్ధత వ్యక్తం చేశారు. (ఆంభూ. 2 12 89)

**సెక్యులర్ విలువలు** వి (బ.వ) *sekyular vıluvalu* మత ప్రమేయంలేని రాజ్యాంగ విధానం వల్ల ఏర్పడే ప్రాధాన్యతలు secular values 'భూమి' 'క్రానికల్' విజయవాడ నుంచి ప్రారంభిస్తున్నందుకు సంతోషం వ్యక్తంచేస్తూ జాతీయ సమైక్యతకు, సెక్యులర్ విలువలకు ఈ రెండు పత్రికలు ఎంతో తోడ్పడ్డాయని రాజీవ్ గాంధీ ప్రశంసించారు. (ఆంభూ. 1 6 89)

**సెక్యులరిజం** వి. *sekyularıjam* మతాతీతమైన లేదా మత ప్రసక్తి లేని లౌకిక వ్యవస్థ secularism దేశంలో సెక్యులరిజాన్ని, మైనారిటీస్ అన్న పదాన్ని అలీన విధానాన్ని తీసేస్తే భారతదేశం రేపటి నుంచి బాగుపడుతుందని ఆయన అన్నారు. (ఆంప. 17 6.87)

**సెగలుకక్కు** క్రి *segalukakku* సంక్షోభాలతో సామాజిక స్థితి వేడెక్కు, భగ్గుమను to simmer, boil ప్రదర్శనలు, సమ్మెల పరంపరతో ఇప్పటికే సెగలుకక్కుతున్న బాంగ్లాదేశ్ భవితవ్యానికి హింసాధోరణి అవధులు దాటడం క్షేమంకాదు. (ఈ 20.2.88)

సెట్ వి. *seT* (టెన్నిస్ ఆటలో) ఆరు లేక (అవసరాన్ని బట్టి) అంతకన్నా ఎక్కువ గేములతో కూడిన యూనిట్ set ఒక్క రెండో సెట్‌లో తప్ప మిగతా సెట్‌లన్నిటిలో ఆధిక్యత చూపించాడు. (ఆంప్ర 4 7 89)

**సెన్సార్‌చేయు** క్రి. *sensaarceeyu* (సినిమా, పుస్తకం, నివేదిక, వార్త మొ. వాటిలో) అభ్యంతరమనిపించిన అంశాలను తొలగించు; తగ్గించు to censor *ఈ రెండు పేజీల రిపోర్టులో 'వెల్లడైన విషయాలు' అంశం దగ్గిర కొంతమేరకు తెల్ల కాగితం ఉందని, అంటే అప్పటికే స్వీడిష్ ప్రభుత్వం నాలుగింట మూడు వంతుల సమాచారాన్ని సెన్సార్‌చేసిందని అర్థం అవుతోందని ఆయన అన్నారు.* (ఉ. 4 7.87)

సెన్సార్‌షిప్ వి. *sensaarSip* వార్తలలో ప్రభుత్వానికి అభ్యంతరకరం, ఆక్షేపణీయం అనిపించిన అంశాలను తొలగించటం censorship శ్రీలంక ప్రభుత్వం పత్రికలపై సెన్సార్‌షిప్‌ను బుధవారంనాడు విధించింది. (ఆం.భూ 6 7 89)

సెమిఅర్బన్ **ప్రాంతం** వి. *semiarban praantam* సౌకర్యాలలో, నాగరికతలో చాలావరకు పట్టణ వాతావరణం కలిగిన ప్రదేశం semi-urban area *దేశంలోని పట్టణ, సెమిఅర్బన్ ప్రాంతాల సమగ్ర అభివృద్ధికి పంచాయతీరాజ్ బిల్లు తరహాలో ఓ బిల్లును ప్రవేశపెట్టాలని ప్రభుత్వం ప్రతిపాదించిందని రాజీవ్ చెప్పారు.* (ఈ. 19 5 89)

సెమినార్ వి. *seminaar* ఒక అంశంపై నిపుణులందరు కలసి విభిన్న కోణాలలో చర్చించటానికి ఏర్పాటైన సమావేశం; చర్చాగోష్ఠి seminar *'ఆంధ్ర ప్రదేశ్‌లో ఎగుమతి అవకాశాలు' అనే అంశం మీద ఏర్పాటయిన సెమినార్‌ను ఆయన నేడు ఇక్కడ ప్రారంభించారు.* (ఆం.భూ. 6 6 87)

సెమీ ఫైనల్స్ వి. *semi fainals* ఆఖరి ఆటలో ఆడే ముఖ్యమైన [illegible] ఎంపిక చేసేందుకు ముందు ఆ[illegible]ల్లో చివరిది semi finals *ఇంటర్ సర్వీసెస్ క్రికెట్ ఛాంపియన్ షిప్ పోటీల సెమి ఫైనల్స్‌లో గురువారంనాడు ఆట ముగి[illegible] సమయానికి ఎయిర్ ఫోర్స్ జట్టు వికెట్ నష్టపోకుండా 38 పరుగులు చేసింది.* (ఈ 5 6.87)

సెర్చి వారంట్ వి. *serci vaaranT* నేర పరిశోధనలో భాగంగా సంబంధిత ప్రదేశాన్ని సోదా చెయ్యటానికి అనుమతిస్తూ న్యాయమూర్తి జారీచేసే పత్రం search warrant . . . *అయితే కర్నూలు పోలీసులు మాత్రం భాషాను ఎక్కడ దాచిందీ చెప్పలేదని కోర్టు నుంచి సెర్చి వారెంట్ తీసుకొని వెళ్ళగా కర్నూల్ సి. పి. ఎస్.లో భాషా కన్పించాడని ఆయన చెప్పారు.* (ఆం.భూ 26.4.89)

సెలవిచ్చు క్రి. *selaviccu* అభిప్రాయం ప్రకటించు (వ్యంగ్యం) to say (sarcastic) *శ్రీలంకలో తన ప్రభుత్వాన్ని పడగొట్టడానికి భారత విదేశ గూఢచార సంస్థ 'రా' (ఆర్. ఎ. డబ్ల్యు) కుట్ర పన్నుతున్నదని అధ్యక్షుడు ఆర్. ప్రేమదాస తాజాగా సెలవిస్తున్నారు.* (ఈ. 22 8 89)

సెలెక్ట్ కమిటీ వి. *selekT kamiTii* చట్టసభలలో ఏదైనా ఒక బిల్లును కూలంకషంగా పరిశీలించాలనుకున్నప్పుడు నిపుణులైన వివిధ పక్షాల సభ్యులతో ఏర్పాటయ్యే సంఘం select committee *స్థానిక సంస్థల ఎన్నికల, సంస్కరణల బిల్లును సెలెక్ట్ కమిటీ పరిశీలనకు పంపాలని శాసనసభ నిర్ణ*

యించింది. (ఈ. 17.12 87)

**సెలెక్టర్** వి. *selekTar* క్రీడలలో ఆటగాళ్ళను ఎంపిక చేసే అధికారి selector సెలెక్టర్లపై వస్తున్న విమర్శలు సమంజసమైనవేనా? (ఈ. 18 6.87)

**సెషన్స్ కేసు** వి. *seSans keesu* జిల్లా స్థాయి కోర్టుల్లో నమోదయ్యే ఫిర్యాదు sessions case ఇక సెషన్స్ కేసులు, స్పెషల్ కేసులు 5784 పెండింగ్‌లో ఉన్నాయి. (ఆం.ప్ర 17 4 89)

**సేకరణ** వి. *seekaraNa* అనేక ప్రాంతాల నుంచి లభ్యమయ్యే ధాన్యం, బియ్యం, తునికాకు మొ. వాటిని సమీకరించటం లేదా పోగు చేయటం procurement రాష్ట్రంలో ధాన్యం సేకరణ ప్రజా పంపిణీ విధానం గురించి ఆహార సలహా సంఘంలోని పలువురు సభ్యులు అడిగిన ప్రశ్నలకు . . . (ఆం.ప్ర 27 4 88)

**సేకరణ ధర** వి. *seekaraNa dhara* సరుకులను లేదా వస్తువులను ఉత్పత్తిదారులనుంచి సేకరించేటప్పుడు ప్రభుత్వం చెల్లించే ధర procurement price జిల్లా అధికార యంత్రాంగం విజ్ఞప్తిపై తునికాకు సేకరణ ధర కట్ట ఒక్కింటికి 28 పైసల నుండి 30 పైసలకు ప్రభుత్వం పెంచినట్టు . . . (ఆం.భూ. 27 4 89)

**సేకరించు** వి. *seekarincu* కావలసిన సామగ్రిని, వివరాలను పోగుచేయు to collect, elicit మృతుల వివరాలు పోలీసులు సేకరిస్తున్నారు. (ఈ. 25.5 89)

**సేవచేయు** క్రి. *seevaceeyu* సంస్థలకోసం నిజాయితీ, అంకిత భావాలతో పనిచేయు to serve మనసావాచా నేను పార్టీకి, పార్టీ నాయకత్వానికి ఏ అరమరికలు లేకుండా చేయగలిగినంత సేవచేశాననే సంగతి తనకు తెలియని విషయంకాదు. (ఆం.జ్యో 18 11.87)

**సైద్ధాంతిక చైతన్యం** వి. *saiddhantika caitanyam* సిద్ధాంతపరంగా స్పష్టమైన అవగాహనతో కూడిన ఆలోచనా ధోరణి ideological consciousness దేశంలోని కార్మికోద్యమ నాయకత్వంలో తొలి దినాల నాటి దీక్ష, సేవా తత్పరత, రాజకీయ సైద్ధాంతిక చైతన్యం తిరిగి నెలకొనగలవని ఆశిద్దాం. (ఆం ప్ర. 1.5 89)

**సైనిక కుట్ర** వి. *sainika kuTra* బల ప్రయోగంతో అధికారాన్ని కైవసం చేసుకొనేందుకు చేసే మిలిటరీ కుతంత్రం; సైనిక తిరుగబాటు military coup ఫిజీలో రాజకీయ, రాజ్యాంగ సంక్షోభాన్ని సృష్టించిన సైనిక కుట్ర అనంతరం గవర్నర్ ఫిజీ సాయుధ దళాల సమావేశంలో ప్రసంగించటం ఇదే ప్రథమం. (ఆం.ప్ర 6.6.87)

**సైనిక చర్య** వి. *sainika carya* కల్లోల పరిస్థితిని అదుపులోకి తీసుకురావటానికి సాయుధ దళాలను ప్రయోగించటం military action వడమరచ్చి ప్రాంతంలో సైనిక చర్య కూడా పూర్తయిందని పేర్కొంటూ, సమస్య పరిష్కారంకోసం చర్చలు జరపడానికి శ్రీలంక ప్రభుత్వం ఎదురుచూస్తోందని చెప్పారు. (ఈ. 5 6 87)

**సైనిక తిరుగుబాటు** వి. *sainika tirugubaaTu* చూ. సైనిక కుట్ర. జనరల్ రాడ్రిగ్వెజ్ నేడు ప్రేమ రోడిమార్జో రేడియోలో ప్రసంగిస్తూ తాను సైనిక తిరుగుబాటు జరిపినట్లు ప్రకటించారు. (ఆం.ప్ర 4 12 89)

**సైలెంట్ వేవ్** వి. *sailen T veev* ఎన్నికల సందర్భాలలో పైకి పొక్కని అభిప్రాయ తరంగం silent wave ప్రస్తుతం రాష్ట్రంలో తెలుగుదేశం ప్రభంజనం కనిపించడం లేదేమిటని ఒక విలేకరి అడగ్గా తెలుగుదేశం పట్ల ప్రజల్లో 'సైలెంట్ వేవ్' ఉందని రామారావు వ్యాఖ్యానించారు. (ఈ. 31.10 89)

**సొంతం చేసుకొను** క్రి. *sontam ceesukonu* తనది చేసుకొను, గెలుచుకొను to win, bag అట్లాంటా నివాసి అయిన ఆ 26 ఏళ్ళ బాక్సర్ మరెవరో కాదు. క్రూయిజర్ వెయిట్ బాక్సింగ్‌లో ప్రపంచ టైటిల్‌ని తన సొంతం చేసుకున్న ఇవాండర్ హోలీఫీల్డ్.

**సొమ్ము చేసుకొను** క్రి. *sommu ceesukonu* పరిస్థితిని స్వప్రయోజనాలకు అనుగుణంగా మార్చుకొను to cash మేవాత్‌కి నిజమైన నాయకుడిగా సామాన్య ప్రజల్లో గుర్తింపు ఉన్న శ్రీ తయ్యాబ్ హుసేన్ పలుకుబడిని శ్రీ భజన్‌లాల్ సొమ్ము చేసుకోవాలనుకుంటున్నారు. (ఆం ప్ర. 18.11 89)

**సోకు** క్రి. *sooku* అనేకమందికి జబ్బులు వచ్చు (disease) to spread బురాజుల, జొన్నగిరి గ్రామాల్లో ఫ్లోరైడు ఎక్కువై ప్రస్తుతం పలురకాల వ్యాధులు సోకే ప్రమాదమున్నదని . . అన్నారు. (వి 24 10 87)

**సోదాచేయు** క్రి. *soodaaceeyu* ఇళ్ళనూ, కార్యాలయాలనూ పోలీసులు లేదా అధికారులు నేర వివరాల ఆచూకీ కోసం తనిఖీ చేయు; వెదుకు (police) to search thoroughly సంపూర్ణంగా సాధారణ పరిస్థితుల పునరుద్ధరణకుగాను ఆయుధాలు, ఇతర మందుగుండు సామగ్రిని స్వాధీనపరచుకునేందుకు నగరంలోని కొన్ని ప్రాంతాలలో సోదాలు చేయాలని అధికారులు నిర్ణయించారు. (వి. 20 6.87)

**సోషలిస్టు ఫోరమ్** వి. *sooSalis Tu fooram* కాంగ్రెస్‌పార్టీలో (గతంలో) ప్రగతిశీలభావాల ఆలోచనాధోరణిగలవారి బృందం socialist forum శ్రీమతి గాంధీ వెలుగులోకి వచ్చాక నెహ్రూ ఫోరమ్‌ను ఏర్పాటుచేసి సోషలిస్టు ఫోరమ్‌ను తెరమరుగు చేసేశారు. (ఆంభూ 23 7 87)

**సౌలభ్యం** వి. *saulabhyam* అనుకూలం లేదా సౌకర్యంగా ఉండటం convenience కెనడాలో వెస్టిండీస్ క్రికెటర్లు ఇంతకు ముందే మ్యాచ్‌లు ఆడడానికి ఒప్పుకున్నందువల్ల వారి సౌలభ్యంకోసం టోర్నమెంట్‌ను రెండు రోజులు ముందుకు జరిపినట్టు జగ్‌మోహన్ తెలిపారు. (ఈ. 29.8 89)

**సౌహార్ద పర్యటన** వి. *sauhaarda paryaTana* చూ. సుహృద్భావ పర్యటన సోవియట్ యూనియన్‌లో భారతీయ ఉత్సవాల ప్రారంభోత్సవాన్ని పురస్కరించుకుని ప్రధానమంత్రి శ్రీ రాజీవ్ గాంధీ రెండు రోజుల పర్యటనకోసం గురువారం నాడు ఇక్కడి నుండి సోవియట్ యూనియన్ బయలుదేరి వెళతారు. (ఆం ప్ర. 2.7.87)

**సౌహార్ద ప్రతినిధి** వి. *sauhaarda pratinidhi* సం ల, పార్టీల సభలకు ఇతర సంస్థల, పా ల నుండి మైత్రిని తెలిపేందుకు _ జరయ్యే వ్యక్తి friendly delegate . . . 400 మంది ప్రతినిధులతో పాటు పలు విదేశాల నుండి కూడా సౌహార్ద ప్రతినిధులు మహాసభకు వస్తారు. (ఈ 12.10 87)

**సౌహార్ద వాతావరణం** వి. *sauhaarda*

*vaataavaraNam* దేశాధినేతలమధ్య చర్చల సందర్భంగా స్నేహ పూర్వక స్థితి cordial or friendly atmosphere శుక్రవారం ఉదయం బ్రిటన్ ప్రధాని మార్గరెట్ థాచర్‌తో ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ జరిపిన సమావేశం సౌహార్ద వాతావరణంలో జరిగింది. (ఆం. భూ. 15.7.89)

**స్కోరు** వి. *skooru* క్రీడల పోటీలలో ఆయా జట్లు చేసిన పరుగులు లేదా పొందిన పాయింట్లు score వెస్టిండీస్ మొదట ఇన్నింగ్స్ భారీ స్కోరును భారత జట్టు అధిగమించటమే నేడు చివరి రోజున ఆటలో విశేషం. (ఆం ప్ర 1.1.88)

**స్కైడైవింగ్** వి. *skai daiving* గగన తలంలో చేసే క్రీడావిన్యాసాలు sky diving స్కైడైవింగ్ అంటే సుమారు 1200 అడుగులు ఎత్తునుంచి దూకి విన్యాసాలు చేయడం. (ఆం. భూ 10.8.89)

**స్క్రాప్‌యార్డ్** వి. *skraap yaarD* ఉపయోగపడని పాత ఇనుప సామాను నిలువ చేసే చోటు scrap yard స్క్రాప్ యార్డ్‌లోని పాత ఇనుమును అయిదుగురు సభ్యులున్న దొంగల ముఠా అపహరించుకు పోతుండగా శాంతి భద్రతల దళం ఆ ముఠాపై కాల్పులు జరిపింది. (ఆం ప్ర 16.5.89)

**స్టంట్** వి. *sTanT* స్వప్రయోజనం ఆశించి చేసే పని stunt ప్రధానమంత్రి శ్రీ రాజీవ్ గాంధీ గ్రామ సర్పంచ్‌లకు లేఖలు వ్రాయడం ఎన్నికల స్టంట్ తప్ప మరేమీ కాదని పంచాయతీరాజ్ శాఖ మంత్రి శ్రీ సి. చంద్రశేఖర్ వ్యాఖ్యానించారు. (ఆం ప్ర. 21.9.89)

**స్టంపింగ్** వి. *sTamping* (క్రికెట్ ఆటలో) బ్యాటింగ్ చేస్తున్న వ్యక్తి క్రీజ్‌కి బయట ఉన్నప్పుడు వికెట్‌కీపర్ బంతితో వికెట్లను కొట్టి అవుట్ చేయటం stumping 'స్టంపింగ్'కు ఐదేసి వందలు చొప్పున బుష్ సంస్థ ఇస్తుంది. (ఆం ప్ర 8.10.87)

**స్టాండింగ్ కమిటీ** వి. *sTaanDing kamiTii* విధాన నిర్ణయాలను ఉన్నతస్థాయిలో ఖరారు చేసే ముందు, వాటిని వివరంగా పరిశీలించేందుకు ఏర్పాటయిన సంఘం standing committee ప్రభుత్వ ఉత్తర్వులన్నింటినీ తొలుత స్టాండింగ్ కమిటీలో చర్చించి తదనంతరం హైదరాబాద్ నగర పాలక సంస్థ సర్వ సభ్య సమావేశం ఆమోదించిన తరువాత అమలు జరపాలని మేయర్ ... ఆదేశించారు. (ఆం. భూ. 22.7.89)

**స్టాంప్ డ్యూటీ** వి. *sTaamp dyuuTii* క్రయవిక్రయాల తనఖాల రిజిస్ట్రేషన్‌కై చెల్లించవలసిన దస్తావేజు రుసుం stamp duty పంట రుణాలను పొందడానికి రైతులు చెల్లిస్తున్న స్టాంపు డ్యూటీని రద్దు చేసే విషయమై ఇటీవల హైదరాబాద్‌లో గ్రామీణ బ్యాంకులు సమీక్షా సమావేశంలో చర్చించినట్లు తెలిసింది. (ఈ. 2.10.87)

**స్టాట్యుటరీ అధికారాలు** వి. (బ.వ.) *sTaaTyuTarii adhikaaraalu* చట్టపరమైన హక్కులు statutory powers వక్ఫ్ బోర్డును పునర్వ్యవస్థీకరించేందుకు ఒక కమిటీని వేశామని ఆయన చెప్పారు. బోర్డుకు స్టాట్యుటరీ అధికారాలు ఇచ్చిన తరువాత దోషులపై చర్య తీసుకొంటామని శ్రీ ఫారూఖ్ హామీ ఇచ్చారు. (ఈ. 14.7.87)

**స్టార్‌వార్స్** వి. *sTaarvaars* అగ్ర రాజ్యాలు అంతరిక్షంలో సాగించే అణ్వాయుధాల యుద్ధం; నక్షత్ర యుద్ధం star wars ముఖ్యంగా 'స్టార్‌వార్స్' పథకాన్ని ఆపివేయాలన్న షరతుతో నిమిత్తం లేకుండా 1981లో రీగన్ చేసిన ప్రతిపాదనలకు దగ్గరగా ఉన్న

ప్రతిపాదనలనే గోర్బచెవ్ చేయడం నాటో దేశాలకు కొంత ఆశ్చర్యం కూడా కలిగించింది. (ఆం భూ 20 6.87)

**స్టీరింగ్ కమిటీ** వి. *sTiiring kamiTii* చూ.సారథ్య సంఘం జనమోర్చా నేత స్టీరింగ్ కమిటీ ఛైర్మన్ వి.పి. సింగ్ ఆధ్వర్యంలో శనివారం దాదాపు మూడు గంటలపాటు స్టీరింగ్ కమిటీ సుదీర్ఘ సమావేశం జరిగింది. (ఆం. జ్యో 9.10.88)

**స్టెన్‌గన్** వి. *sTengan* అధిక సంఖ్యలో తూటాలు పేల్చగల సామర్థ్యం ఉన్న మర తుపాకీ stengun స్టెన్‌గన్‌లతో జరిపిన కాల్పుల్లో 14 మంది మరణించారు. (ఉ. 15.6 87)

**స్టెరాయిడ్స్** వి. *sTeraayiDs* క్రీడలలో శారీరక శక్తికి ఉత్ప్రేరకమైన మందు (చట్ట ప్రకారం నిషిద్ధం) steroids స్టెరాయిడ్స్ వాడినట్టు వెల్లడైన సందర్భాల్లో అథ్లెట్లపై కనీసం నాలుగేళ్ళ నిషేధాన్ని విధించడం సమంజసమని అతను పేర్కొన్నాడు. (ఈ. 20 9.89)

**స్టే** వి. *sTee* కింది కోర్టు లేదా ప్రభుత్వం ఇచ్చిన ఉత్తరువులను నిలిపివేస్తూ కోర్టు జారీ చేసే ఆజ్ఞ stay ... ఉరిశిక్ష అమలుపై సుప్రీం కోర్టు స్టే మంజూరు చేసింది. (ఆం. జ్యో. 2 12 88)

**స్టేడియం** వి. *sTeeDiyam* క్రీడల పోటీలు నిర్వహించటానికీ, ప్రేక్షకులు మెట్ల దొంతర్లపై కూర్చొని తిలకించటానికీ, అన్ని సౌకర్యాలతో ఏర్పాటు చేసిన మైదానం; క్రీడల ప్రాంగణం stadium విశాఖ నగరంలో ఎంతో కాలంగా ఎదురు చూస్తున్న స్టేడియం నిర్మాణం వచ్చే మార్చినాటికి పూర్తి చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నట్లు మేయర్ ... చెప్పారు. (ప్ర శ 31 7.87)

**స్ట్రైకింగ్ ఫోర్సు** వి. *sTraiking foorsu* తక్షణమే దాడిచేయటానికి సిద్ధంగా ఉండే సైనికదళం striking force నగరంలోని 254 ప్రాంతాలను ఉద్రిక్తతకు త్వరగా లోనయే ప్రాంతాలుగా గుర్తించారు. 35 పోలింగ్ అవుట్ పోస్టులను ఏర్పాటు చేయడం, 103 స్ట్రైకింగ్ ఫోర్సులతో బాటు 283 మొబైల్ దళాలను ఏర్పాటు చేసి శాంతి భద్రతలను కాపాడాలని నిర్ణయించారు. (ఆం. భూ. 21 11 89)

**స్తంభించిపోవు** క్రి. *stambhincipoovu* ఎక్కడ పని అక్కడ ఆగిపోవు లేదా నిలిచిపోవు ~~to~~ come to a halt, get paralysed శనివారం రాత్రి జరిగిన హత్యాకాండకు నిరసనగా బి.జె.పి. ఇచ్చిన పిలుపు మేరకు నగరంలో వర్తక వాణిజ్యాలు దాదాపు స్తంభించిపోయాయి. (ఆం ప్ర 16 6 87)

**స్తంభింపచేయు** క్రి. *stambhimpaceeyu* 1. ఎక్కడి పనులక్కడ జరగకుండా నిలిపివేయు to bring to a halt రైతుల అప్పులను రద్దు చేయాలని కోరుతూ ధర్నా చేసి సహకార బ్యాంక్ కార్యాలయంలో పనులను స్తంభింపచేసినందుకు సుమారు వంద మంది రైతులను కామారెడ్డి పోలీసులు సోమవారం అరెస్టు చేశారు. (ఆం భూ 16 5 89) 2. ఆస్తులపై స్వంతదారుల ప్రమేయం లేకుండా చేయు to freeze the accounts ప్రభుత్వం వద్దా ఆస్తులను స్తంభింపచేయలేదని కూడా తెలుస్తున్నదని ఆయన అన్నారు. (ఆం. ప్ర 19.4 88)

**స్త్రీవిమోచన** వి. *striivimoocana* మహిళలు పురుషాధిక్యం పైన తమ ప్రగతికి అడ్డుగానిలిచే కాలం చెల్లిన ఆచారాల పైనా పోరాడి విజయం సాధించటం

women's liberation ... తేదీలలో 'స్త్రీవిమోచన శిక్షణ' కార్యక్రమాలను నిర్వహిస్తారని రంగారెడ్డి జిల్లా మహిళా మండలుల సమాఖ్య కన్వీనర్ ... ఒక ప్రకటనలో తెలిపారు. (ఆం. ప్ర 27 87)

**స్థానం** వి. *sthaanam* 1. ఒక రంగంలో ఉండే గుర్తింపు; ప్రాధాన్యం a place (established recognition) ఇండియా సైన్యంలో నేపాలీయులకు ఓ విశిష్ట స్థానం ఉందని, ఏ రెండు ఐరోపాదేశాల మధ్య, ఉదాహరణకు ఫ్రాన్స్, జర్మనీ దేశాలలో ఆయా దేశాలలో ఒకరికొకరు ఇవ్వని స్థానం మనం ఇచ్చామని ఆయన అన్నారు. (ఆం ప్ర 20 11 89) 2. చట్టసభలలో ఎన్నికలలో ఒక నియోజకవర్గ ప్రాతినిధ్యం a seat (in election) వచ్చేవారం జరిగే ఎన్నికల్లో కాంగ్రెస్(ఐ)కి 200 లోక్‌సభ స్థానాలు కూడా దక్కకపోవచ్చు. (ఆం. ప్ర. 20 11.89)

**స్థానచలనం** వి. *sthaanacalanam* ఉన్న చోటు నుంచి కదలించటం; పదవి మార్పు, బదలీ change of position, transfer ఐ.ఎ.ఎస్‌లకు స్థానచలనం. రాష్ట్రంలోని కొందరు ఉన్నతస్థాయి ఐ.ఎ ఎస్. అధికారుల పదవుల్లో ప్రభుత్వం మార్పులు చేసింది. (ఆం. ప్ర 10 9 87)

**స్థానిక పత్రిక** వి. *sthaanika patrika* పరిమిత ప్రాంతంలో జరిగే విషయాలను ప్రధానంగా ప్రచురించే పత్రిక local journal స్థానిక పత్రికలను జాతీయ పత్రికలను విభజించాలని ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలను జర్నలిస్టులు భగ్నం చేశారు. (ఆం. ప్ర 4 7.89)

**స్థానికప్రజలు** వి. (బ.వ.) *sthaanikaprajalu* ఒక ప్రాంతంలో జీవిస్తూ సిర నివాసం ఏర్పరుచుకున్న జనం local people కాకూర్‌లో ప్రజాటెలిఫోన్ లేక ప్రజలు అనేక ఇబ్బందులకు గురి అవుతున్నారని స్థానిక ప్రజలు తెలియజేశారు. (ఈ. 6 6 87)

**స్థానిక రాజకీయాలు** వి. (బ వ.) *sthaanika raajakiiyaalu* ఒక ప్రాంతంలో అక్కడి సమస్యలు, పరిస్థితులాధారంగా ప్రజలమధ్య తలెత్తే విభేదాలు, వివాదాలు local politics అన్నకు స్థానిక రాజకీయాలుగాని, కుట్రలుగాని అసలు తెలియదు. (ఆభూ. 7.10 87)

**స్థానిక సంస్థ** వి. *sthaanika samstha* ప్రాంతీయమైన ప్రజా వ్యవహారాలను నిర్వహించే వ్యవస్థ (పంచాయితీ, మండలం, జిల్లా పరిషత్తు మొ.) local body అధికారాన్ని వికేంద్రీకరించి స్థానిక సంస్థలు వనరులు పెంచుకొనే అవకాశం కల్పించాలని రాష్ట్ర ప్రభుత్వాలను గవర్నర్ ... కోరారు. (ఈ 22 8.89)

**స్థాయి** వి. *sthaayi* సంస్థాపరమైన లేదా వ్యక్తిగతమైన హోదా status, level ప్రధాని రాజీవ్ గాంధీతో చర్చించగలిగిన 'స్థాయి' వి. పి. సింగ్‌కు లేదని భగత్ వ్యాఖ్యానిస్తూ ... (ఆం. ప్ర 21 8 89)

**స్థావరం** వి. *sthaavaram* శత్రువులకు చిక్కకుండా పకడ్బందీగా ఏర్పాటు చేసుకున్న చోటు military (base) hideout గెరిల్లా స్థావరం కమాండోల స్వాధీనం. (ఆం ప్ర 16.6 87)

**స్థితిగతులు** వి. (బ.వ.) *sthitigatulu* ఒక విషయం గురించిన వివరాలు state of affairs ఈ సమావేశంలో దేశంలో ఉర్దూ భాష స్థితిగతులు చర్చించి, రానున్న ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీకి పూర్తి మద్దతు ప్రకటిస్తూ

తీర్మానం ఆమోదించి శ్రీ రాజీవ్ గాంధీకి ఇవ్వనున్నట్లు శ్రీ చెన్నారెడ్డి చెప్పారు. (ఈ 17 8 89)

**స్థిరపడు** క్రి. *sthirapaDu* ఒక ప్రాంతంలో బతుకు తెరువుకై శాశ్వతంగా నివసించు; ఒకే చోట నిలదొక్కుకొను to settle down (as a resident) ... ఇప్పుడిప్పుడే నూతన సేద్యపు నీటి సదుపాయాలు పొందబోతున్న ప్రాంతాలలో స్థిరపడి అక్కడే అంతిమ శ్వాసపీల్చుకుంటూ ఉన్నట్లు కనిపిస్తున్నది. (ఆం ప్ర. 27 11 87)

**స్థిరీకరణ నిధి** వి. *sthiriikaraNa nidhi* మార్కెట్లో ఉత్పత్తుల ధరలు విపరీతంగా పడిపోకుండా చూసేందుకు ఏర్పాటయ్యే భారీ సొమ్ము (price) stabilization fund పొగాకు ధరలు విపరీతంగా పడిపోకుండా నిరోధించడానికై దాదాపు రూ. 40 కోట్లతో 'స్థిరీకరణ నిధి'ని ఏర్పాటు చేయాలని చర్చ సందర్భంగా కాంగ్రెస్ సభ్యుడు ... సూచించారు. (ఆం ప్ర 26 4 89)

**స్థూల జాతీయోత్పత్తి** వి. *sthuula jaatiiyootpatti* దేశంలో అన్నిరంగాల్లోనూ కలిపి జరిగిన ఉత్పాదన gross national product స్థూల జాతీయోత్పత్తికి పొత్తి తగినంతగా దోహదపడగలదని ఆయన అన్నారు. (ఆం ప్ర. 20 9 89)

**స్నాతకోత్సవ ఉపన్యాసం** వి. *snaata-kootsava upanyaasam* విశ్వ విద్యాలయాలలో పట్ట ప్రదానోత్సవ సందర్భంగా జరిగే సమావేశంలో ముఖ్య అతిథి చేసే ప్రసంగం convocation address ... శనివారం ఇక్కడి పద్మావతీ మహిళా యూనివర్సిటీలో జరిగిన మూడో స్నాతకోత్సవంలో స్నాతకోత్సవ ఉపన్యాసం ఇస్తూ అన్నారు. (ఈ 14 8 89)

**స్నాతకోత్సవం** వి. *snaatakootsavam* పట్టభద్రులకు పట్టాలు ప్రదానం చేసే విశ్వవిద్యాలయ కార్యక్రమం convocation ఈ స్నాతకోత్సవం సందర్భంగా 32 మంది అభ్యర్థులకు ఎం. ఫిల్. తదితర డిగ్రీలను ప్రదానం చేస్తారు. (ఆం. ప్ర. 22.9 87)

**స్నేహ పోరాటం** వి. *sneeha pooraa-Tam* మిత్ర పక్షాల మధ్య సర్దుబాటు కుదరని స్థానాలలో జరిగే పోటీ friendly contest తెలుగుదేశం పార్టీ మిత్ర పక్షాల సాయం లేకపోతే రాష్ట్రంలో మళ్ళీ అధికారంలోకి రాలేదని ఇక ఎన్నికల్లో జరిగేది కేవలం స్నేహ పోరాటంలాంటిదే అని శ్రీ చంద్రబాబు నాయుడు స్పష్టం చేశారు. (ఆం. భూ 29 8 89)

**స్నేహ యాత్ర** వి. *sneeha yaatra* ఉభయ దేశాల మధ్య శాంతి సుహృద్భావాల పెంపుకు సాంస్కృతిక మైత్రీ సంబంధాల అభివృద్ధికి కృషి జరిపే ప్రతినిధుల పర్యటన; సౌహార్ద పర్యటన friendship tour ఏడాదిపాటు జరుగనున్న భారత ఉత్సవాలు ప్రారంభోత్సవ వేడుకలలో పాల్గొనుటకుగాను జూన్ 27 నుండి జూలై 10 వరకు ఇస్కస్ ఫిలింసొసైటీ ఇప్సొసో ఆధ్వర్యాన 20 మంది సభ్యులతో కూడిన స్నేహ యాత్రా బృందం సోవియట్‌లో పర్యటించనున్నదని సొసైటీ ప్రధాన కార్యదర్శి .. తెలిపారు. (వి. 26 6 87)

**స్నేహ సేతువు** వి. *sneeha seetuvu* (దేశాల మధ్య) బలమైన మైత్రీబంధం friendly ties ... సోదర సోషలిస్టు దేశాల రెంటి మధ్య సైద్ధాంతిక, రాజకీయ, తదితర కారణాలవల్ల ... కూలిపోయిన స్నేహ సేతువును పునర్నిర్మించడానికి 1982 లో ముఖ్యమైన చర్చలు మొదలయ్యాయి. (ఈ 15 5 89)

స్పందించు క్రి. *spandincu* సమస్యల పరిష్కారానికి వెంటనే సిద్ధమై ముందుకు వచ్చు to react ... *మండలాధ్యక్షులు పార్టీ అధిష్ఠాన వర్గాన్ని హెచ్చరించిన విషయం తెలిసిందే. దీనిపై తెలుగుదేశం పార్టీ అధిష్ఠాన వర్గం స్పందించి జిల్లాలో పరిస్థితిని సమీక్షించడానికి ...* (ఆం ప్ర 4 7 89)

స్పష్టంచేయు క్రి. *spaSTamceeyu* అనుమానాలకు తావు లేకుండా విశదమయ్యే విధంగా చెప్పు ; నిక్కచ్చిగా చెప్పు to clarify, make clear *శ్రీలంకతో కయ్యానికి దిగడం భారత్ అభిమతం కాదని ఆయన స్పష్టంచేశారు.* (ఆం జ్యో 5 6 87)

స్పష్టీకరణ వి. *spaSTiikaraNa* అనుమానాలు రాకుండా ఒక విషయాన్ని విడమర్చి చెప్పే వివరణ clarification *రాష్ట్ర శాసనసభ విధించిన 30 రోజుల జైలు శిక్ష తీర్పును తు. చ. తప్పక అమలు జరిపి తీరాలని స్పీకర్ ఇచ్చిన రూలింగ్‌ను ఆ లెజిస్లేటర్లు ప్రస్తావిస్తూ 304 వ నిబంధన కింద నోటీసు ఇస్తే దానిపై ప్రకటనగాని, స్పష్టీకరణగాని చేయాల్సింది ప్రభుత్వమని అన్నారు.* (ఆం ప్ర. 18.9.89)

స్పాన్సర్‌చేయు క్రి. *spaansarceeyu* వ్యాపార దృక్పథంతో ప్రకటన రుసుం చెల్లించి ప్రచారంకోసం తమ పేర కార్యక్రమాలను ప్రసారం చేయించు to sponsor *ఈ పోటీలకు రాహుల్ రస్తోగిని చార్మినార్ ఛాలెంజ్ బ్యానర్‌పై వి.ఎస్.టి. సంస్థ స్పాన్సర్‌చేస్తోంది.* (ఈ 2 9.89)

స్పిన్ వి. *spin* క్రికెట్లో బంతి గిర్రున తిరుగుతూ లక్ష్యంవైపు పోయేటట్లు విసరటం spin (as in cricket) *స్పిన్‌కు అనుకూలించిన 'పిచ్'పై ఖాదిర్ విజృంభించడంతో ఇంగ్లండు వికెట్లు వరుసగా పడ్డాయి.* (ఆం జ్యో 26 11 87)

స్పీకర్ వి. *spiikar* శాసనసభ, లోక్‌సభ సమావేశ కార్యక్రమాలను నిర్వహించే సభాధ్యక్షుడు; సభాపతి speaker *త్రిపురలో 8 మంది మృతిపై ప్రతిపక్షాలు వాయిదా తీర్మానాన్ని స్పీకర్ త్రోసి పుచ్చడంతో ప్రతిపక్షసభ్యులు తీవ్రగలభా సృష్టించారు.* (ఆం భూ 1 9 89)

స్పృశించు క్రి. *spRsincu* భిన్న రంగాలతో ప్రమేయం కలిగి ఉండు to touch upon, get involved *అప్పటి నుంచి తెలుగు సాహితీలోకంలో ఆయన స్పృశించని తనదైన ముద్ర అంటూ వేసుకొనని శాఖ అంటూ లేదు.* (ఆం జ్యో. 22 10 87)

స్పెక్యులేషన్ వి. *spekyuleeSan* రాజకీయాలలో, ఎన్నికలలో వ్యాపార రంగంలో రాబోయే పరిణామాలపై చేసే ఊహాగానాలు speculation *వాణిజ్య బ్యాంకుల పాత్ర సకాలంలో 'వర్కింగ్ కాపిటల్'కు ఋణాలు ఇవ్వడమే గాని స్టాక్ మార్కెట్‌లో 'స్పెక్యులేషన్' సాగించడంగాదని రిజర్వు బ్యాంకు గవర్నర్ శ్రీ మల్హోత్రా ... చెప్పారు.* (ఆం. ప 6 6.87)

స్పెషల్ లీవ్ పిటీషన్ వి. *speSal liiv piTiiSan* కింది కోర్టు తీర్పుపై నిందితులు ప్రత్యేక అనుమతితో పై కోర్టులో దాఖలు చేసుకునే అప్పీలు special leave petition *ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఇచ్చిన ఆ తీర్పును సవాలు చేస్తూ సుప్రీంకోర్టులో స్పెషల్ లీవ్ పిటీషన్‌ను యువజన కాంగ్రెస్(ఐ) కార్యకర్తలు దాఖలు చేశారు.* (ఆం. భూ. 26 4.89)

స్ప్రింట్ వి. *sprinT* వంద మీటర్లవంటి తక్కువ దూరాలు అతివేగంగా పరిగెత్తే పందెం sprint *పురుషుల 100 మీటర్ల స్ప్రింట్‌లో కార్ల్ లూయీస్ (అమెరికా)*

పరాజయం పొందాడు. (ఆం. ప్ర 21 9 89)

**స్ఫూర్తి** వి *sphuurti* ఆవేశంతో కూడిన పట్టుదల; పోరాటపటిమ spirit ఇరాన్ యుద్ధస్ఫూర్తి అమెరికాను దిగ్భ్రాంతి పర చింది. (ఆం.భూ 20.4.88)

**స్మగుల్డ్ వస్తువులు** వి. (బ వ.) *smagulD vastuvulu* విదేశాల నుంచి దిగుమతి సుంకం తదితర పన్నులు చెల్లించకుండా రహస్యంగా రవాణా చేసుకొని అమ్ము తున్న వస్తువులు smuggled goods ఒక వైపు స్మగ్లర్లు నల్ల బజారులో విచ్చల విడిగా అక్రమ వ్యాపారం చేస్తుంటే మరో వైపు కస్టమ్స్ నోటిఫైడ్ షాపుల ముసుగులో స్మగుల్డ్ వస్తువులు అమ్ముతున్నారు. (ఈ అను 28.7 89)

**స్మగ్లర్** వి. *smaglar* సుంకాలు చెల్లిం చకుండా దొంగతనంగా విదేశీవస్తువులు అమ్మి రహస్య వ్యాపారం చేసే వ్యక్తి smuggler కాల్పులు జరగటానికి కొద్ది కాలం ముందు మన ప్రాంతంలో ప్రవేశించిన పాకిస్తానీ స్మగ్లర్లు నలుగురిని బి.ఎస్.ఎఫ్ జవానులు సవాలు చేశారనీ, ఆ సందర్భంగా జరిగిన కాల్పుల్లో ఇద్దరు స్మగ్లర్లు మరణించగా ... (ఆం ప. 7.7.87)

**స్మారక నిధి** వి. *smaaraka nidhi* గతిం చిన ప్రముఖుల పేర సత్కార్యాల నిమిత్తం సేకరించిన ద్రవ్యం memorial fund ఇటీవల మరణించిన ప్రముఖ శాస్త్రవేత్త ప్రొఫెసర్ సూరి భగవంతం పేరిట ఒక స్మారక నిధిని ఏర్పాటు చేయాలని రాష్ట్ర విజ్ఞాన శాస్త్ర అకాడమీ నిశ్చయించింది. (ఆం ప్ర. 21.2.89)

**స్మారక స్థూపం** వి. *smaaraka sthuupam* ప్రజా సేవలో జీవితం ముగించిన వారి జ్ఞాపకార్థం స్థంభాకారంలో నిర్మించే చిహ్నం memorial కొల్లాపూర్ మండలా ధ్యక్షుడిని విడిపించుకోడానికి ఇచ్చిన మాట ప్రకారం జిల్లాలో నక్సలైట్ల మృతవీరుల స్మారక స్థూపాలను ప్రజల సహకారంతో తెలుగుదేశం కార్యకర్తలు పునర్నిర్మించడం ... (ఆం ప్ర. 29 8.89)

**స్మారకోపన్యాసం** వి. *smaarakoopanyaasam* ప్రముఖుల స్మృత్యర్థం వారి వర్ధంతి సందర్భంలో ఏర్పాటు చేసే వార్షిక ప్రసంగం memorial lecture సుంద రయ్య విజ్ఞాన కేంద్రం, భారత సామాజిక శాస్త్రాల అధ్యయన సంస్థ ఆధ్వర్యంలో ఈ నెల 19 వ తేదీన స్మారకోపన్యాసాలు ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. (ఆం ప్ర. 18.5 89)

**స్మృతి చిహ్నం** వి. *smRti cihnam* చనిపోయిన వారి జ్ఞాపకార్థం నిర్మించిన కట్టడం memorial ఇందిరా గాంధీ స్మృతి చిహ్నంగా శక్తిస్థల్‌లో నెలకొల్పిన అతిపెద్ద గ్రానైట్ స్లాబ్ వద్దకు ... రాజీవ్ గాంధీ, ఆయన భార్య, పిల్లలు చేరుకొన్నారు. (ఆం ప్ర 1.11 88)

**స్లాబ్ పద్ధతి** వి. *slaab paddhati* అసలు లెక్కలతో ప్రమేయం లేకుండా తరగ తుల వారిగా సినిమాహాళ్ళు, కరెంటు మోటార్లు మొ. వాటికి నిర్ణీత కాలా నికి ఇంత మొత్తమని పన్ను చెల్లించే విధానం slab system స్లాబ్ పద్ధతి రాష్ట్రమంతటా విస్తరించడంవల్లనే సినిమాల్లో ఈ దుష్ట సంప్రదాయం వచ్చిందని కొందరు వాదిస్తున్నారు. (ఆం. భూ. 6 6.87)

**స్వగృహ ప్రవేశం** వి. *svagRha praveeśam* (రాజకీయాలలో) ఒక పార్టీ నుంచి మరో పార్టీకి ఫిరాయించి, తిరిగి కొంతకాలానికి మాతృసంస్థలో నికి రావటం home coming (as

in politics) ఈ నేపథ్యంలో డ్యాక్టర్ మర్రిచెన్నారెడ్డి 'స్వగృహప్రవేశం' ముఠాకీ చులాటలతో ఉన్న కాంగ్రెస్‌పై ప్రభావం చూపించవచ్చు. (ఉ. 4.10.88)

స్వచ్ఛందం వి. *svacchandam* ఇతరుల ఒత్తిడి, ప్రేరణ లేకుండా తీసుకునే స్వయం నిర్ణయంలోని ఇష్ట పూర్వకత voluntary, volition సభ్యుడు స్వచ్ఛందంగా రాజీనామా చేయలేదనే భావం కలిగినప్పుడు మాత్రమే స్పీకర్ ఆ రాజీనామాను ఆమోదించకుండా ఉండవచ్చని ఆయన అన్నారు. (ఆం ప్ర 25 7 89)

స్వచ్ఛంద పదవీవిరమణ పథకం వి. *svacchanda padaviiviramaNa pathakam* ఉద్యోగి తనకు తానుగా పదవి నుండి విరమించే పద్ధతి voluntary retirement scheme వివిధ ప్రభుత్వ రంగ పరిశ్రమలలో అధిక సిబ్బంది సమస్య పరిష్కారానికి స్వచ్ఛంద పదవీవిరమణ పథకం ప్రవేశపెట్టే ప్రతిపాదన కూడా ప్రస్తావించి ... (ఆం. భూ 6 6 87)

స్వచ్ఛంద ప్రవాసం వి. *svacchanda pravaasam* తను అంతకుముందున్న రంగాన్ని ఇష్ట పూర్వకంగా వదిలిపెట్టి దూరంగా వెళ్లటం self exile నాలుగేళ్ళ క్రితం ఇజ్రాయేల్ ప్రధానమంత్రి పదవి నుంచి తప్పుకొన్నారు మెనాషెమ్ బెగిన్. అప్పటి నుంచి ఆయన 'స్వచ్ఛంద ప్రవాసం' లోనే కాలం గడుపుతున్నారు. (ఈ 11 12.87)

స్వచ్ఛత వి. *svacchata* ఒక వ్యక్తి తన జీవితంలో పాటిస్తూవచ్చిన నిష్కళంకత్వం; మచ్చలేనితనం integrity (of character) తన వ్యక్తిగత స్వచ్ఛతను శంకిస్తూ ఓ పత్రికలో వచ్చిన ఆరోపణలకు సంబంధించి అన్ని వాస్తవాలను వివరించడానికి ప్రతిపక్షనాయకుల్ని కలుసుకోడానికి తాను సిద్ధమేనని ... ప్రకటించారు. (ఈ 9.5 89)

స్వతంత్ర ప్రతిపత్తి వి. *svatantra pratipatti* విధి నిర్వహణలో రాజ్యాంగపరంగా సర్వాధికారాలుగల వ్యవస్థ autonomous status అధికార ప్రచార యంత్రాంగమైన దూరదర్శన్, ఆల్ ఇండియా రేడియోలకు స్వయం ప్రతిపత్తిని కల్పించాలనేది చాల 'చౌకబారు ఎత్తుగడ' అని మాజీ మంత్రి శ్రీ అజిత్ కుమార్ పంజా అభిప్రాయపడ్డారు. (ఆం. ప్ర. 8.12 89)

స్వదేశీ పరిజ్ఞానం వి. *svadeeśii parijnaanam* దేశీయమైన ప్రజ్ఞా పాటవాలు, సాంకేతిక నైపుణ్యం indigenous know-how తేలిక రకం యుద్ధ విమానాన్ని స్వదేశీ పరిజ్ఞానంతో తయారు చేయబోతున్నాం అని ఆయన చెప్పారు. (ఈ. 14 7 89)

స్వపరిపాలన వి. *svapari- paalana* తమ వ్యవహారాలు తామే నిర్వహించుకునే స్వేచ్ఛగల వ్యవహార సరళి self government మున్సిపల్ ఉద్యోగులు ప్రావిన్షలైజేషన్‌వల్ల స్వపరిపాలనకు విఘాతం కలుగుతుందన్నారు. (ఈ. 1.5.89)

స్వయం ఉపాధి వి. *svayam upaadhi* (ప్రభుత్వ ఆర్థిక సాయంతో) ఇతరులపై ఆధారపడకుండా సొంతంగా ఏదో ఒక వృత్తిని చేపట్టి బతుకు తెరువు ఏర్పరచుకోవటం self employment ఈ రకంగా మహిళలకు స్వయం ఉపాధి కల్పించుకోవడమే కాకుండా ఇతర మహిళలకు సరైన దృక్పథం కల్పించడానికి ... (ఉ 14 4 88)

స్వయం ఉపాధికల్పన పథకం వి. *svayam upaadhikalpana pathakam*

ఇతరులపై ఆధారపడకుండా నిరుద్యోగులు ఏదో ఒక వృత్తిని చేపట్టి బతుకు తెరువు కల్పించుకోవటానికి ప్రభుత్వం ప్రవేశపెట్టిన స్కీము self employment scheme *స్వయం ఉపాధికల్పన పథకం క్రింద వచ్చే ఏడాది కేటాయించనున్న 25 కోట్ల రూపాయల్లో స్త్రీల సంక్షేమం కోసం కూడా ప్రత్యేక పథకాలను రూపొందించనున్నట్లు ముఖ్యమంత్రి తెలిపారు.* (ఆం భూ 30.12 89)

**స్వయం ప్రతిపత్తి** వి. *svayam pratipatti* స్వతంత్ర పాలనాధికారం కలిగి ఉండటం autonomy *రాజ్యాంగంలోని 263 అధికరణ క్రింద ఈ మండలులు స్వయం ప్రతిపత్తి గలవిగా ఉండాలని అన్నారు.* (ఆం. ప్ర 22.4.88)

**స్వయం సత్తాక ప్రతిపత్తి** వి. *svayam śattaaka pratipatti* చూ. స్వయం ప్రతిపత్తి. *యు.జి.సి. సూచన మేరకు రాష్ట్రంలో 50 కళాశాలలకు స్వయం సత్తాక ప్రతిపత్తిని కల్పించాలనే విషయాన్ని సమావేశంలో చర్చించారు.* (ఈ 5 6.87)

**స్వయం సమృద్ధి** వి. *svayam samRddhi* దిగుమతులపై ఆధారపడకుండా తమ అవసరాలకు సరిపడ్డ ఉత్పత్తిని సాధించటం self sufficiency *ప్రణాళికా బద్ధమైన ప్రగతి మూలంగా దేశం వ్యవసాయ రంగంలో స్వయం సమృద్ధి సాధించిందనీ, ఫలితంగా ఆహారధాన్యాల దిగుమతి అవసరం తప్పిందని ఆయన అన్నారు.* (ఉ. 24 4 88)

**స్వర్ణ పతకం** వి. *svarNa patakam* వివిధ రంగాలలో చేసిన విశిష్టకృషికిగాని లేదా పోటీలో నెగ్గినప్పుడుగాని ఇచ్చే నాణెం ఆకారంలో ఉండే బంగారు బహుమతి gold medal *దీనితో ఈ క్రీడోత్సవాలలో ఆమె సాధించిన స్వర్ణ పతకాల సంఖ్య ఆరయింది.* (ఆం ప్ర 29 8 89)

**స్వర్ణోత్సవం** వి. *svarNootsavam* ఏదైనా ఒక సంస్థను స్థాపించి, 50 సంవత్సరాలు పూర్తి అయిన తర్వాత జరుపుకునే వేడుక golden jublee celebration *భటిండాలోని ఖల్సాహయ్యర్ సెకండరీ స్కూల్ స్వర్ణోత్సవాలలో పాల్గొని బయటకు వస్తుండగా ...* (ఆం భూ. 6.2 89)

**స్వల్పకాలిక చర్చ** వి. *svalpakaalika carca* ఒక విషయం లేదా అంశంపై చట్ట సభలో కొద్దిసేపు జరిపే వాగ్వాదం short duration discussion *అసెంబ్లీలో సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి శ్రీ సుధాకర్ నాయక్ స్వల్పకాలిక చర్చకు సమాధానమిస్తూ, హాస్టళ్ళ పనితీరును అధ్యయనం చేయటానికి ప్రభుత్వం ఒక కమిటీని నియమించనున్నట్టు ప్రకటించారు.* (ఆం ప్ర. 18.7.89)

**స్వస్తి** వి. *svasti* కొంతకాలంగా సాగిస్తూ వచ్చిన కార్యకలాపాలను ఆపివేయటం; ముగింపు bidding good bye to a programme *ఇంతలో శ్రీమతి జానకి తాను అసలు రాజకీయాలకే స్వస్తి చెప్పాలని నిశ్చయించుకున్నట్లు ప్రకటించారు.* (ఆం. జ్యో 2 2.89)

**స్వస్తిచెప్పు** క్రి. *svasticeppu* మునుపటి అలవాట్లను లేదా విధానాలను ఆపివేయు, వదలిపెట్టు, మానివేయు to give up *ప్రజలను, ప్రజాప్రతినిధులను హత్యచేసే విధానాలకు నక్సలైట్లు స్వస్తిచెప్పాలని ఆయన కోరారు.* (ఆం భూ. 11.6 89)

**స్వస్తిపలుకు** క్రి. *svastipaluku* చూ. స్వస్తి చెప్పు. *శత్రుత్వాలకు స్వస్తిపలుకుతూ శ్రీలంక ప్రభుత్వం, ఎల్.టి.టి.ఇ. ఒప్పందం*

కుదుర్చుకున్నప్పటికీ, పైగర్లు హింసను విడనాడలేదని అధికార ప్రతినిధి చెప్పారు. (ఈ 30.6.89)

స్వస్తివాచకం వి. *svastivaacakam* ఆచరణలో ఉన్న పద్ధతిని విరమిస్తున్నామని చెప్పే మాట giving up (certain practice) రాబోయే విద్యా సంవత్సరానికి అవసరమైన పాఠ్య ప్రణాళిక ముందుగానే తయారు చేసుకోవటం, దీనికి అనుగుణంగా పుస్తక ముద్రణ అక్టోబర్ నవంబరు మాసాలలోనే ప్రారంభించటం తెలుగు అకాడమీ గతంలో ఆనవాయితీగా చేసేది. అయితే గత సంవత్సరంగా దీనికి స్వస్తివాచకం పలికినట్లుగా ఉంది. (ఈ. 20 6 87)

స్వాగతం పలుకు క్రి. *svaagatam paluku* అతిథిని సాదరంగా రమ్మని ఆహ్వానించు to welcome అక్కడ రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ అధినేత శ్రీ బాలా సాహెబ్ దేవరసు ఊరేగింపుకు స్వాగతం పలికారు. (ఆం. భూ. 15 9 89)

స్వాగత వేదిక వి. *svaagata veedika* ఆహ్వాన ఉత్సవ కార్యక్రమాన్ని నిర్వహించే స్థలం platform (for welcoming) విద్యార్థులతో ఘర్షణలకు బదులు రష్యానేత స్వాగత వేదికను ముందుగా నిర్ణయించిన తియాన్మిన్ స్క్వేర్ నుంచి మార్చడమే సముచితమని ఉన్నతాధికారులు భావించారు. (ఈ 16 5.89)

స్వాగత సన్నాహాలు వి (బ.వ.) *svaagata sannaahaalu* ముఖ్య సందర్భంలో వస్తున్న నాయకులకు, ప్రతినిధులకు ఆహ్వానం పలికేందుకు చేసే ఏర్పాట్లు (బ్యానర్లు కట్టడం, ద్వారాలు నిర్మించటం, గోడలపై నినాదాలు రాయటం మొ) arrangements for a welcome రెండు రోజుల కాంగ్రెస్(ఐ) సదస్సుకు సంబంధించి స్వాగత సన్నాహాలు చేసే బాధ్యత తను కాంగ్రెస్(ఐ) కార్పొరేటర్లకు అప్పగించడాన్ని నిరసిస్తూ ... గాంధీభవన్‌కు చేరుకున్నారు. (ఈ. 22.5 89)

స్వాగతోపన్యాసం వి. *svaagatoopanyaasam* సభా ప్రారంభంలో అతిథులనూ, సభికులనూ ఆహ్వానిస్తూ చేసే ప్రసంగం welcome address కాంగ్రెస్ అసంతృప్తి వర్గ నాయకుడు శ్రీ రామచంద్రారెడ్డి స్వాగతోపన్యాసం చేస్తూ, డి.సి.సి. అధ్యక్షునిగా మూడేళ్ళుగా పదవిలో ఉన్నప్పటికీ జిల్లా కేంద్రంలో కాంగ్రెస్ పార్టీకి కార్యాలయం కూడా ఏర్పాటు చేయలేకపోయాడంటూ ... ఎత్తి పొడిచాడు. (ఆం. ప్ర 1 7.89)

స్వాధీనం చేసుకొను క్రి. *svaadhiinam ceesukonu* నిందితుల వద్ద ఉన్న (చట్ట వ్యతిరేకమైన) సామగ్రిని కైవసం చేసుకొను; వశపరచుకొను to seize ... ... వారి నుంచి నాటు ఆయుధాలు మందుగుండు సామగ్రి స్వాధీనం చేసుకున్నారు. (ఆం ప్ర 24.4 89)

స్వాపో(SWAPO) వి. *svaapoo* దక్షిణాఫ్రికా వలస పాలన నుంచి, నమీబియాకు స్వాతంత్ర్యం కోరుతూ ఉద్యమం నడిపిన నమీబియా ప్రజల సంస్థ South West African People's Organization నమీబియా ప్రజల స్వాతంత్ర్యానికి ఉద్యమం నడుపుతున్న ఏకైక అధికార సంస్థ అయిన 'స్వాపో' త్వరలో సొంత వార్తా సంస్థ నెలకొల్పుకోబోతుంది. (ఉ. 13.7 87)

**స్వారీచేయు** క్రి. *svaariiceeyu* అధికార దర్పంతో పెత్తనం చెలాయించు to ride over పంచాయితీల పట్ల కేంద్రానికి ఏమాత్రం ప్రేమలేదని కేవలం కాంగ్రెసే తర రాష్ట్ర ప్రభుత్వాలపై 'స్వారీ'చేయాలన్న ఉద్దేశంతోనే రాజ్యాంగ సవరణకు కేంద్రం పూనుకొన్నదని ... విమర్శించారట. (ఆం ప్ర 11.5 89)

**స్వార్థపర శక్తులు** వి. (బ.వ.) *svaartha-para śaktulu* రాజకీయంగా ఆర్థికంగా తమ లాభమే చూసుకొనే వర్గాలు forces with vested interests నిరుపేద వర్ధమాన దేశాల మేలుకోసం భారతదేశం గొంతెత్తినప్పుడల్లా స్వార్థపర శక్తులు తలెత్తి వ్యతిరేక ప్రచారానికి సిద్ధపడుతున్నాయని ... అన్నారు. (ఆం భూ 23 7.87)

**స్వావలంబన** వి. *svaavalambana* ఇతర దేశాలపై ఆధారపడకుండా కావలసిన యంత్రాలను, ఉత్పత్తులను సొంతంగా తయారు చేసుకోగల శక్తి; స్వయం సమృద్ధి self reliance రక్షణ రంగంలో స్వావలంబన అవసరం. రక్షణాయుధాల ఉత్పత్తి రంగంలో మన దేశం త్వరితగతిన స్వయం సమృద్ధి సాధించాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నదని కేంద్ర రక్షణ శాఖ మంత్రి శ్రీ కె. సి. పంత్ అన్నారు. (ఈ 24.8 87)

**స్వాహాచేయు** క్రి. *svaahaaceeyu* ప్రజా హిత కార్యక్రమాలకై ఉద్దేశించిన సొమ్మును, అక్రమంగా దిగమింగు to embezzle, swindle .. ఇంజనీర్లు, కాంట్రాక్టర్లు కుమ్మక్కయి పెక్కు అవకతవకలకు పాల్పడి లక్షలాది రూపాయలు స్వాహాచేసినట్లు విశ్వసనీయంగా తెలిసింది. (ఆం. ప్ర 20 9 87)

**స్విమ్మర్** వి. *swimmar* 'ఈత' పోటీల్లో పాల్గొనేవ్యక్తి; ఈతగాడు swimmer భారత స్విమ్మర్లకు శిక్షణ ఇవ్వడానికి తూర్పు జర్మనీ నుంచి రోలెండ్ మాలెస్‌ను తీసుకు రావాలని స్పోర్ట్సు అథారిటీ ఆఫ్ ఇండియా నిర్ణయించింది. (ఆం. ప్ర. 3.5 89)

**స్విమ్మింగ్ పూల్** వి. *swimming puul* (పట్టణాలలో) ఈత కొట్టడానికి ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఈత కొలను swimming pool ఇండియా పార్క్‌లో మరో స్విమ్మింగ్ పూల్ రూపొందిస్తారు. (ఆం ప్ర.)

**స్వీకరించు** క్రి. *swiikarincu* గౌరవంగా తీసుకొను to receive, take రాష్ట్రపతిభవన్ ఎదుట ఆయన త్రివిధ దళాల నుంచి సైనిక వందనం స్వీకరించారు. (ఆం జ్యో 21.11.88)

**స్వేచ్ఛాయుత విధానం** వి. *sveec-chaayuta vidhaanam* (పెద్ద దేశాలు, అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు పెట్టే ఆంక్షలకు లొంగకుండా) ఒక దేశం స్వతంత్రంగా అవలంబించే పద్ధతి; స్వతంత్ర వ్యవహార సరళి independent policy భారత దేశం ఎంతగా స్వేచ్ఛాయుత విధానాలను అనుసరించాలని కోరుకుంటుందో అంతగా విదేశీ శక్తుల వత్తిడులు ఎదురవుతున్నాయనీ ... (ఆం భూ 23.7 87)

**స్వేచ్ఛా వాణిజ్యం** వి. *sveecchaa vaaNijyam* ఎగుమతులు దిగుమతులపై కఠినమైన ఆంక్షలులేని వ్యాపారం free trade కన్సర్వేటివ్ పార్టీ తిరిగి ఎన్నికవటంతో, అమెరికాతో స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందానికి ఆమోదం లభించే అవకాశం ఏర్పడింది. (ఆం ప్ర. 23 10 88)

**స్వేచ్ఛా విపణి** వి *sveecchaa vipaNi* కంట్రోళ్ళు, రేషనింగు నిషేధాలు లేకుండా వ్యాపారస్తులు చేసే వ్యాపారం open market కనీసం స్వేచ్ఛా విపణి ద్వారా మూడు లక్షల టన్నుల బియ్యం అనుమతించవలసిందిగా తమిళనాడు ప్రభుత్వం కేంద్రాన్ని కోరింది. (ఆం ప్ర. 23 7 89)

**స్వైరవిహారంచేయు** క్రి. *svairavihaaramceeyu* అడ్డూ ఆపూలేకుండా ఇష్టానుసారంగా ప్రవర్తించు to go berserk గత నెలలో సికింద్రాబాద్ మోండా మార్కెట్ వద్ద కత్తులతో స్వైర విహారంచేసి 11 మంది అమాయకులను గాయపరచిన ఆరుగురు గూండాలను నగర పోలీసులు బుధవారంనాడు అరెస్టు చేశారు. (ఆం. భూ. 20 4 89)2. ఎదుటిపక్షం నిస్సహాయస్థితిలో పడేంత ఉధృతంగా ఆడు to go on rampage (as in sports) యాషెస్ సీరిస్ ఐదో క్రికెట్ టెస్టు పోటీలో ఆస్ట్రేలియా ఓపెనర్లు జెఫ్ మార్ష్, మార్క్ టేలర్ స్వైరవిహారంచేస్తున్నారు. (ఆం భూ. 11.8.89)

## హ

**హంగు** వి. *hangu* సంస్థ సమర్థంగా నడవటానికి అవసరమైన (నిధులు, పరికరాలు మొ.) సౌకర్యం facility, requirement కాంగ్రెసేతర పార్టీలు పలు రాష్ట్రాలలో అధికారానికి వచ్చాకే స్థానిక సంస్థలు పునరుజ్జీవం పొందాయి. సమర్థంగా పనిచేయడానికి అవసరమైన హంగులు సమకూరాయి. (ఈ 3 5 89)

**హంగుదారు** వి. *hangudaaru* రాజకీయ నాయకుడి మద్దతుదారు; అనుచరుడు follower మంత్రులు వారి హంగుదార్లు మమ్మల్ని మొండివారిగా జమకట్టి వదలిపెట్టి ఉంటారని ... (ఆం. ప్ర 17 8 89)

**హంసపాదు** వి. *hamsapaadu* కార్యక్రమానికి (సాధా. మొదట్లోనే) ఏర్పడే అడ్డంకి setback, trouble సారధ్య సంఘానికి ఆదిలోనే హంసపాదు. నాలుగు పార్టీల సారధ్య సంఘం ప్రథమ సమావేశానికి ఆదిలోనే కష్టాలు ఎదురైనాయి. (ఆం ప్ర 4 10 88)

**హక్కుభుక్తం** వి. *hakkubhuktam* (ఆస్తి, ఇతర సదుపాయాలపై) అధికారంకలిగి అనుభవిస్తూ ఉన్న స్థితి title (to property) పుట్టుకతోనే తమ పార్టీకి సంక్రమించిన ఈ హక్కుభుక్తాలను ఇతర పార్టీలకు, నాన్ కాంగ్రెస్ ప్రభుత్వాలకు వీసమెత్తుకూడా వర్తింపజేయడానికి ససేమిరా వీల్లేదని ... (ఈ. 1 12 87)

**హక్కుల తీర్మానం** వి. *hakkula tirmaanam* చూ. సభాహక్కుల తీర్మానం బడ్జెట్ వివరాలు ముందుగానే బయటకు పొక్కినందుకుగాను ముఖ్యమంత్రి ... పై రేపటి నుండి మొదలవుతున్న శాసనసభ సమావేశాల్లో హక్కుల తీర్మానం తెచ్చేందుకు కాంగ్రెస్(ఐ) సభ్యులు నిర్ణయించుకున్నట్లు తెలిసింది. (ఆం ప్ర 18 2 89)

**హజ్ యాత్రికులు** వి. (బ.వ.) *haj yaatrikulu* మక్కా మదినాలను సందర్శించటానికి వెళ్ళేవారు Hajj pilgrims 'హజ్' యాత్రికుల సౌకర్యాలను చూడ

డానికి బొంబాయిలో ఇప్పటికే నిర్మాణం అయిన 'హజ్‌భవనం' తరహాలో హైదరాబాద్‌లో కూడా నిర్మించాలని ... నిర్ణయించింది. (ఆం ప్ర. 26.4 89)

**హడావిడి** వి. *haDaavıDı* (తగినంత సమయం లేకపోవటంతో) కార్యనిర్వహణలో చూపించే తొందర haste ప్రస్తుత తరుణంలో రాష్ట్ర కాంగ్రెస్-ఐ శాసనసభాపక్షం ఎలా వ్యవహరించాలనే విషయమై పార్లమెంటరీ బోర్డు హడావిడిగా సమావేశమై చర్చించింది. (ఆం. భూ. 21 4.89)

**హతమార్చు** క్రి. *hatamaarcu* (పోరాటం, సైద్ధాంతిక ఘర్షణల్లో భాగంగా) చంపివేయు to kill బూటకపు ఎదురు కాల్పుల్లో సిక్కులను హతమారుస్తున్నందుకు ... నిరసనగా ఆయన ఆ పతకాన్ని తిరస్కరించారు. (ఆం ప్ర 26 4.89)

**హత్యాయత్నం** వి. *hatyaayatnam* (వ్యక్తుల్ని) చంపే ఉద్దేశ్యంతో చేసే దాడి attempt to murder శ్రీమతి సిరిమావో బండారు నాయకేపై గుర్తు తెలియని వ్యక్తులు కొందరు బాంబులు విసిరి హత్యాయత్నం చేశారు. (ఆం. భూ 6 2.89)

**హత్యా రాజకీయాలు** వి. (బ.వ.) *hatyaa raajakiiyaalu* (రాజకీయాల్లో) ప్రత్యర్థుల్ని అంతమొందించటం ద్వారా తమ ఉనికిని కాపాడుకొనే విధానం politics of murder ఎన్నికల ప్రకటన రాగానే, ఈ నెల రోజుల్లో అయిదుగురు కార్యకర్తలు హత్యారాజకీయాలకు బలయిపోయారు. (ఆం ప్ర. 2.11 89)

**హద్దు పద్దు** వి. *haddu paddu* సంఖ్యలో కానీ, పరిమాణంలోకానీ వచ్చే పెరుగుదలలో సహించదగిన స్థాయి limit, control ... ప్రభుత్వ పరిపాలనలో హద్దు పద్దు లేకుండా బస్సు ఛార్జీలు ఐదారుసార్లు పెరిగాయి. (ఆం. భూ 21 4 89)

**హమాలీ** వి. *hamaalı* (బస్టాండు, రైల్వే స్టేషన్లు వంటి ప్రదేశాల్లో) బరువులు మోసి జీవనం సాగించే వ్యక్తి; కూలీ porter నిజామాబాద్ రైల్వే స్టేషన్ ఆవరణలో రైల్వే హమాలీల కోసం రైల్వే అధికార్లు నిర్మించిన హమాలీల విశ్రాంతి గృహానికి ... ప్రారంభోత్సవం చేశారు. (ఆం భూ 7.6.89)

**హయాం** వి. *hayaam* (వ్యక్తులు లేదా పార్టీలు) అధికారంలో ఉన్న కాలం; పదవీకాలం, పరిపాలనా కాలం regime కమ్యూనిస్టు పార్టీ 40 ఏళ్ళ హయాంలో పోలెండ్‌లో సార్వత్రిక ఎన్నికలు జరగడం ఇదే మొదటిసారి. (ఈ 9 6 89)

**హరించివేయు** క్రి. *harincıveeyu* (ఇతరుల అధికారాలు, హక్కులు మొ. వాటిని) అక్రమంగా లాగివేసుకొను; లేకుండాచేయు to usurp రాజ్యాంగం ప్రకారం రాష్ట్రాలకు గల హక్కులు, అధికారాలను క్రమక్రమంగా హరించివేస్తున్న కేంద్రంలోని ... (ఈ 3.5 89)

**హరించుకుపోవు** క్రి. *harıncukupoovu* (వనరులు, సంపద మొ.) తరిగి, తరిగి చివరకు ఏమీ మిగలకుండా పోవు to diminish, vanish కాంగ్రెస్ వాళ్ల కాలంలోనే రాష్ట్రంలోని అటవీసంపద అంతా హరించుకుపోయిందని అటవీ శాఖమంత్రి ... తీవ్ర ఆరోపణలు చేశారు. (ఉ 11 1 87)

**హరిత వలయం** వి. *harita valayam* ఏదైనా పట్టణం లేదా నగరం చుట్టూ చెట్లు, పచ్చిక మైదానాలతో వ్యాపించి ఉన్న పచ్చని ప్రాంతం green belt హైదరాబాద్ పట్టణాభివృద్ధి సంస్థ (హుడా) మూడు కోట్ల 53 లక్షల రూపాయల వ్యయంతో

*1200* హెక్టార్లలో హరిత వలయం చేయా లని ప్రతిపాదించినట్లు .. చెప్పారు. (ఉ. 1.11 87)

**హరిత విప్లవం** వి. *harita viplavam* చూ.సస్యవిప్లవం. ఆధునిక వ్యవసాయ పద్ధ తుల వినియోగాన్ని జనాభా నియంత్రణ కృషితో సమన్వయించి నట్టయితే భూమి మీద నివసిస్తున్న ప్రజానీకానికి రెండురెట్లు ఎక్కువ మందిని పోషించ గలుగుతుందని 'హరిత విప్లవ' ప్రధాన సృష్టికర్తలలో ఒకరైన రాబర్ట్ ఇ. చాండ్లర్ పేర్కొన్నారు. (ఆం. భూ. 27 4.89)

**హర్తాళ్** వి. *hartaaL* ఏదైనా అవాంఛనీయ సంఘటనకు నిరసనగా చేసే ఆందోళన; బంద్ hartal, strike కాశ్మీరు సరిహ ద్దులోని 'లీ' పట్టణంలో జరిగిన సంఘటన లకు నిరసనగా బుధవారంనాడు హర్తాళ్ జరిగింది. (ఆం భూ 17.8 89)

**హర్డిల్స్** వి. *harDils* మధ్య మధ్యలో అడ్డుగా అమర్చి ఉన్న తేలికపాటి ఫ్రేము లను దాటుకుంటూ పరిగెత్తే పరుగు పందెం hurdles (race) *400* మీటర్ల పురుషుల హర్డిల్స్ పోటీలో డేడ్ ప్యాట్రిక్ (అమెరికా) *49.97* సెకన్లలో విజయం సాధించగా . .. (ఆం. ప్ర. 25 9 89)

**హర్షధ్వానాలు** వి. (బ వ.) *harSad-hvaanaalu* విన్న విషయం పట్ల తమ సంతోషం, అంగీకారం తెలియజేస్తూ కొట్టే చప్పట్లు applause ఆఫ్ఘనిస్తాన్ అధ్య క్షుడు శ్రీ నయ్యద్ మహ్మద్ నజీబుల్లాను మనదేశానికి ఆహ్వానించినట్లు సభ్యుల హర్ష ధ్వానాల మధ్య ప్రధాని రాజీవ్ గాంధీ లోకసభలో ప్రకటించారు. (ఉ 21 4.88)

**హర్షం** వి. *harSam* ఇతరులు తీసు కున్న నిర్ణయాలు, చేపట్టిన కార్యక్రమాల పట్ల వ్యక్తం చేసే ఆమోద పూర్వ కమైన సంతోషం appreciation, (expression of) welcoming (a decision, action etc.) ... ఇన్ని సంవత్సరాలకైనా రోగుల ప్రాణాలతో చెలగాటమాడుతున్న అవినీతి అధికారులపై చర్య తీసుకున్నందుకు సర్వత్రా హర్షం వెలి బుచ్చుతున్నారు. (ఆం భూ 26.5 89)

**హస్తం** వి. *hastam* (చెడ్డపనులకు సంబం ధించి) పరోక్ష భాగస్వామ్యం లేదా ప్రేరణ hand, influence ఈ వ్యవహారాల న్నిటి వెనుక కొందరు రాజకీయ నాయకుల, కార్మిక సంఘాల నాయకుల హస్తాలున్నా యట. (ఆం. ప 20 9 87)

**హస్తకళ** వి. *hastakaLa* చేతితో నైపుణ్యంగా అందమైన వస్తువుల్ని తయారు చేసే వృత్తి పని handicraft రాష్ట్రంలో హస్తకళలను ప్రోత్సహించేందుకు వీలుగా ఎగుమతులను మరింతగా పెంచాలని ఆంధ్రప్రదేశ్ హస్త కళల అభివృద్ధి సంస్థ ప్రతిపాదించింది. (ఆం. ప్ర 8 10 89)

**హస్తగతం చేసుకొను** క్రి. *hastagatam ceesukonu* పోటీ లేదా ఘర్షణలో చేజి క్కించుకొను to capture గతంలో జరిగిన మండల ప్రజాపరిషత్తు ఎన్నికలలో కనీసం ఒక్క మండలాన్ని కూడా బి.జె.పి. హస్తగతం చేసుకోక పోవడమే ఇందుకు తార్కాణంగా వారు చెబుతున్నారు. (ఆం ప్ర. 4.5 89)

**హాజరు అగు** క్రి. *haajaruagu* సభలు, సమావేశాలు మొ. వాటికి వచ్చు లేదా వెళ్ళు to attend, be present ఈ సభలకు తెలుగునాడులోని ఆనాటి కవులూ, రచయితలు హాజరైనారు. (ఆం. భూ 21 11.87)

**హాజరుపరచు** క్రి. *haajaruparacu*

(సాధా. నిందితుల్ని) విచారణకోసం న్యాయమూర్తి ముందు ప్రవేశపెట్టు to produce పోలీసులు ... నలుగురు అమ్మాయిల్ని అరెస్టుచేసి వాళ్ళపై వ్యభిచార నేరం మోపి మరునాడు కోర్టులో హాజరు పరిచారు. (ఆం భూ 14.5 89)

**హాట్ కేకు** వి. *haaTkeeku* (ఉన్నత ప్రమాణాలు, మంచి నాణ్యతవల్ల) మార్కెట్లోకి వచ్చీరావటంతోనే అమ్ముడుపోయే వస్తువు hot cake (thing that sells quickly) హాట్ కేకులైన రష్యన్ పుస్తకాలు. (ఈ 11.12.87)

**హాబీ సెంటర్** వి. *haabii senTar* ఏదైనా వైజ్ఞానిక విషయంపట్ల ఆసక్తి, అభిలాషలను పెంపొందించేందుకు ఉద్దేశించిన కేంద్రం hobby centre జంట నగరాలలో హైస్కూలు విద్యార్థులకోసం ఆంధ్రప్రదేశ్ సైన్స్ సెంటర్ వారు ఎలక్ట్రానిక్స్ హాబీ సెంటర్ ఏర్పాటు చేస్తున్నారు. (ఈ. 20.6.87)

**హామీ** వి. *haamii* ఏదైనా పనిచేస్తామని లేదా జరిగేట్లు చూస్తామని ఇచ్చేమాట assurance, promise ఈ కార్యక్రమాన్ని అమలు జేయడానికి అన్ని చర్యలు తీసుకోగలమని ముఖ్యమంత్రి హామీ ఇచ్చారని ఆయన తెలిపారు (ఆం జ్యో 19 9.87)

**హామీదారు** వి. *haamiidaaru* ఇరు పక్షాల మధ్య వ్యవహారంలో మొదటి పక్షం, రెండో పక్షం నుంచి పొందవలసినది (ఆ పక్షానికి) అందేట్లుగా చూసే బాధ్యత తీసుకునే మూడోపక్షం guarantor, surety .. తమిళుల న్యాయమైన కోర్కెల సాధనకు హామీదారు పాత్ర వహించడానికే ఐపికెఎఫ్ శ్రీలంకలో ఉందని ప్రకటనలో తెలిపారు. (ఆం భూ. 1.7 89)

**హాషిష్** వి. *haaSiS* 'గంజాయి' వంటి మత్తుపదార్థం hashish ... ఉత్తర బొంబాయిలోని మరొక అంతర్జాతీయ మార్కెట్‌లో 3 కోట్ల 70 లక్షల రూపాయల విలువచేసే ఐదు టన్నుల హాషిష్ స్వాధీనం చేసుకున్నారు. (ఆం జ్యో. 3.7 87)

**హింసాకాండ** వి. *himsaakaanDa* అధిక స్థాయిలో వ్యక్తుల్ని చంపటం, తీవ్రంగా గాయపరచటం వంటి సంఘటనలు violence పంజాబ్ రాష్ట్రంలో హింసాకాండ కొనసాగుతూనే ఉంది. (ఆం. భూ. 21.4 88)

**హిట్ లిస్టు** వి. *hiT lisTu* సాయుధ గ్రూపులు తాము చంపదలచుకున్న వారి పేర్లతో తయారు చేసుకున్న జాబితా hit list నక్సలైట్ల 'హిట్ లిస్టు'లో ఉన్నవారికి ఆయుధాలిచ్చి వారికి పోలీసు రక్షణ కల్పించమని ప్రభుత్వాన్ని ఆయన కోరారు. (ఆం.భూ. 22.4.89)

**హితవుచెప్పు** క్రి. *hitavuceppu* శ్రేయస్సును కోరుతూ, మంచి మార్గంలో నడుచుకొమ్మని సలహా ఇచ్చు to advise రాష్ట్రంలో జరుగుతున్న కుంభకోణాలపై ఏమీ చేయలేని ముఖ్యమంత్రి ... కేంద్రం గురించి మాట్లాడటం తగదని ఆయన పరోక్షంగా హితవుచెప్పారు. (ఉ. 15 6.87)

**హితవు పలుకు** క్రి. *hitavu paluku* చూ. హితవు చెప్పు. కర్షక పరిషత్‌కు నామినేషన్ పద్ధతి ఉండటం మంచి విధానం కాదని శ్రీ జక్కర్ హితవు పలికారు. (ఈ. 19 3 88)

**హిమఖండం** వి. *himakhanDam* సముద్రంలో తేలుతూ ఉండే పెద్ద మంచు కొండ (ఇందులో ఎక్కువభాగం నీటిలో మునిగి ఉంటుంది. ఇది నౌకలకు ప్రమాదకరం.) iceberg అంటార్కిటికా నుంచి 40 కిలోమీటర్ల వెడల్పు హిమఖండం తెగి

పోయి ప్రస్తుతం రాస్ సముద్రంలో తేలిపో తున్నట్టు జాతీయ సైన్సు సంస్థ తెలిపింది. (ఆం భూ 7 11 87)

**హిమనదీ ప్రాంతం** వి. *himanadii praantam* పర్వతాలలో పెద్దపెద్ద గడ్డలుగా ఏర్పడిన మంచు, నెమ్మదిగా లోయల్లోకి జారుతూ ఉండే ప్రాంతం glacier సియాచిన్ హిమనదీ ప్రాంతంలో పాకిస్తాన్ తదుపరి దాడికి పాల్పడినట్లయితే ... (ఈ 28 10 87)

**హుందాతనం** వి. *hundaatanam* మంచితనం, నెమ్మది, తనమీద తనకి అదుపు వంటి లక్షణాలతో కూడిన ప్రవర్తన dignity ప్రతిపక్షాలు రాజకీయ విభేదాలతో ఏవో నాటకాలు సృష్టించడం వంటి వికృత చేష్టలకు పాల్పడి ప్రతిపక్షాల హుందాతనాన్ని కోల్పోయారని అన్నారు. (ఆం. భూ 17 5.89)

**హుకుంనామా** వి. *hukumnaamaa* 1. (సిక్కుల) మతగురువులు జారీచేసే ఆదేశం sikh religious decree అకాల్‌తఖ్త్ ముందు ప్రస్తుతం అకాల్‌తఖ్త్ నమూనా మాత్రమే ఉంది. ఇక్కడి నుంచి అకాల్‌తఖ్త్ జతేదార్ హుకుంనామా చదివేవారు. ఈ హుకుంనామా సిక్కు మతస్థులందరికీ శిరోధార్యం. (ఆం భూ 30.5 89) 2. చూ. విప్. ... కొనుగోలు కుంభకోణానికి సంబంధించిన అకౌంట్స్ కమిటీ నివేదికను పార్లమెంట్‌లో ప్రవేశపెట్టనివ్వకుండా నిరోధించడానికి కాంగ్రెస్(ఐ) అధినాయకత్వం తన సభ్యులకు 'హుకుంనామా' జారీ చెయ్యలేదా? (ఈ 17.5 89)

**హుటాహుటిన** క్రి.విశే. *huTaahuTina* (పరిస్థితి తీవ్రత వల్ల) అత్యంత వేగంగా in a hurried, rushing manner సీనియర్ రైల్వే అధికారులు హుటాహుటిన ప్రమాదస్థలానికి చేరుకున్నారు. (ఆం ప్ర 30.5 89)

**హృద్రోగ నిపుణుడు** వి. *hRdrooga nipuNuDu* గుండె జబ్బుల్ని పరీక్షించి నయం చేయటంలో ప్రత్యేక శిక్షణ పొందిన వైద్యుడు cardiologist ఇక్కడ నుంచి హృద్రోగ నిపుణుడు కూడా బలియా వెళ్ళారు. (ఈ 12 10 87)

**హెచ్చరించు** క్రి. *heccarincu* జరగటానికి అవకాశమున్న ప్రమాదాలు, ఇతరత్రా అవాంఛనీయ సంఘటనల విషయంలో జాగ్రత్తగా ఉండమని తెలియజేయు to caution ఇక నుంచైనా ప్రభుత్వం ప్రజలు, ప్రజాప్రతినిధుల ఆస్తులు, ప్రాణాలకు రక్షణ కల్పించలేకపోతే పార్టీ సభ్యత్వానికి కూడా రాజీనామా చేస్తామని వారు ప్రభుత్వాన్ని హెచ్చరించారు. (ఆం. ప్ర. 13.6.89)

**హెచ్చరిక** వి. *heccarika* రానున్న ప్రమాదం గురించి రాతపూర్వకంగా కానీ నోటిమాటగా కానీ సూచించే జాగ్రత్త caution నిజామాబాద్ జిల్లాలోని పోలారం చెరువు మత్తడివద్ద ఏడు అడుగులకుపైగా నీరు ప్రవహిస్తున్నది. ప్రజలందరూ జాగరూకతతో ఉండాలని హెచ్చరికలు జారీచేశారు. (ఆం. ప్ర. 25 7 89)

**హెచ్చరిక సూచిక** వి. *heccarika suucika* (నదుల నీటి మట్టానికి సంబంధించి) వరద ప్రమాదస్థాయికి చేరిందని తెలిపేందుకు ఏర్పాటు చేసిన(అడుగులతో) గుర్తు danger mark దుమ్ముగూడెం, భద్రాచలం, కూనవరం, ధవళేశ్వరంలలో గోదావరి నీటిమట్టం హెచ్చరిక సూచికకు దిగువగా ఉంది. (ఆం. ప్ర 29 7.89)

**హెలిపాడ్** వి. *helipaaD* హెలికా

ష్టర్ దిగటానికి తిరిగి ఎగరటానికి అనువుగా ఏర్పాటు చేసిన చదునైన ప్రదేశం helipad, heliport *ప్రధాని హెలికాప్టర్‌లో దిగడంకోసం ప్రత్యేకంగా ఒక హెలిపాడ్ ఇక్కడ నిర్మించారు.* (ఆం. భూ 3.5 89)

**హెల్త్‌క్లబ్** వి. *heltklab* శరీరాన్ని దృఢంగా, ఆరోగ్యంగా ఉంచుకొనేందుకు అవసరమైన వసతులతో (వ్యాయామ పరికరాలు, ఈతకొలను మొ.) కూడిన ప్రదేశం health club *'హెల్త్‌క్లబ్'లలో చాలా వాటికి ఈతకొలను సదుపాయం ఉండదు.* (ఆం. ప్ర 10 5 89)

**హేతుబద్ధం** వి. *heetubaddham* (ఏదైనా విధానం) సక్రమం, సమర్థవంతం అయినట్టిది rational *తేయాకు పరిశ్రమలో పన్నుల విధానాన్ని మరింత హేతుబద్ధంగా రూపొందించడంలో రాష్ట్రప్రభుత్వాలు ...* (ఆం ప్ర. 6.6 87)

**హేళనచేయు** క్రి. *heeLanaceeyu* ఇతరులపట్ల తేలికభావం ప్రదర్శిస్తూ కేకలు వేయు to jeer ... *మంత్రి అన్నప్పుడు మాత్రం వారు హేళనచేశారు.* (ఆం ప్ర. 25.4 89)

**హైకమాండ్** వి. *haikamaanD* చూ. అధిష్ఠాన వర్గం. *కాని కర్షక పరిషత్ ఎన్నికల్లో పోటీ చెయ్యడానికిగాను ఈ మండలం నుండి ఇద్దరి పేర్లను హైకమాండ్‌కు పంపగా ...* (ఆం ప్ర 3 7 89)

**హైకోర్టు** వి. *haikoorTu* రాష్ట్ర స్థాయిలోని అత్యున్నత న్యాయస్థానం high court *వచ్చేనెల మధ్యలో ముగ్గురు జడ్జీలు పదవీ విరమణ చేయడంతో హైకోర్టులో సర్వీసు జడ్జీల సంఖ్య మరింత తగ్గిపోతుంది.* (ఆం భూ 1.10 87)

**హైజంప్** వి. *haijamp* రెండు దిమ్మెల మధ్య అడ్డంగా కొంత ఎత్తులో ఉంచిన కర్ర మీదుగా, ఎగిరి దూకే క్రీడల పోటీ high jump *హైజంప్‌లో రిక్‌గోజీ 2.23 మీటర్ల ఎత్తు ఎగిరి విజయం సాధించారు.* (ఆం ప్ర 21 9 89)

**హైజాక్‌చేయు** క్రి. *haijaakceeyu* చూ. దారి మళ్ళించు. *గత ఏడాది సెప్టెంబరులో పాక్ అమెరికన్ జెట్ లైనర్ విమానాన్ని కరాచీ విమానాశ్రయంలో హైజాక్‌చేసిన అయిదుగురుపై రహస్య విచారణ ...* (ప్రజా. 14 7 87)

**హైజాకరు** వి. *haijaakaru* హైజాక్ చేసిన వ్యక్తి hijacker *కువైట్ విమానాన్ని హైజాక్‌చేసిన హైజాకర్లు నేడు మరో ప్రయాణీకుడ్ని కాల్చి చంపారు.* (ఆం ప్ర. 12 4 88)

**హైడ్రో గ్రాఫిక్ సర్వే** వి. *haiDroo graafic sarvee* నదులు, సరస్సులు, సముద్రాల అంతర్గత స్వరూపానికి సంబంధించిన సమాచార సేకరణ, విశ్లేషణలకోసం చేపట్టే పరిశీలన hydro graphic survey *హైడ్రో గ్రాఫిక్ సర్వేలో నదిలో లోతుపాతులు, గుట్టలు, మెరకలు, నదీ ప్రవాహ మార్గం ఎలా ఉందన్న విషయాలతో పాటు ... అయ్యే ఖర్చు గురించి అంచనా వేస్తారు.* (ఈ. 11.12.87)

**హైరానాపడు** క్రి. *hairaanaapaDu* తంటాలుపడు to struggle *ప్రజాస్వామ్య మహోద్యమాన్ని విప్లవ ప్రతీఘాతక కుతంత్రంగా చూపించి చరిత్రను తిరగరాయడానికి బీజింగ్ ప్రాపగాండా యంత్రాంగం నానా హైరానాపడుతున్నది.* (ఈ. 30.6.89)

**హైలెవల్ కెనాల్** వి. *haileval kenaal* నీటి మట్టానికి ఎగువభాగం నుంచి తీసిన కాలువ high level canal తుంగభద్ర

హైలెవల్ కెనాల్ పనులను సకాలంలో పూర్తి చేయనందువల్ల అటు అనంతపురం, ఇటు కడప జిల్లాలోనూ క్షామ పీడిత ప్రాంతాలలోని రైతులకు అన్యాయం జరుగుతోందని ... (ఉ. 2.7 87)

**హైలైట్ చేయు** క్రి. *hailaiTceeyu* ఏదైనా ఒక విషయానికి ప్రాముఖ్యం ఇచ్చి అందరి దృష్టికి వచ్చేట్లు చేయు to highlight భారత ప్రధాని ... నీరుకొండ సంఘ టనను రాజకీయంగా 'హైలైట్'చేయడానికి మాత్రమే కరువు కాటకాల పరిస్థితి సమీ క్షించే నెపంపై రాష్ట్రానికి వచ్చారని ఆయన ఆరోపించారు. (ఆం జ్యో. 16 8 87)

**హైసెక్యూరిటీ జోన్** వి. *haisekyuuriTii joon* దాడుల నుంచి రక్షణ కల్పించ టానికి విస్తృతస్థాయిలో భద్రతా ఏర్పాట్లు చేసిన ప్రాంతం high security zone యువజన కాంగ్రెస్(ఐ) కార్యకర్తలు సెంట్రల్ ఢిల్లీలోని 'హైసెక్యూరిటీ జోన్'లో నివసించే ఈ నాయకుల ఇళ్ళపై అతిసు లభంగా ఈ దాడులకు పూనుకోగలగటం గమనించాల్సిన విషయం. (ఉ. 23 7.87)

**హోంగార్డు** వి. *hoomgaarDu* శాంతి భద్రతల నిర్వహణలో పోలీసుశాఖకి సహా యంగా ఉండేందుకు ఏర్పాటుచేసిన అను బంధ దళాల సభ్యుడు (వీళ్ళ నియా మకం తాత్కాలికం) home guard తీవ్రవాదుల పట్టు నుంచి గిరిజనులను తప్పిం చేందుకు మరింత పెద్ద ఎత్తున గిరిజనులను హోంగార్డులుగా రిక్రూట్ చేసుకోదలచినట్టు ... చెప్పారు. (ఆం. భూ. 31 12.87)

**హోదా** వి. *hoodaa* 1. పదవికి సంబంధిం చిన స్థాయి rank, capacity వివిధ ప్రాంతాల్లో, హోదాల్లో పనిచేశాక ఆయన ప్రస్తుత స్థానానికి ఎదిగారు. (ఆం ప్ర 11 5 89) 2. సమాజంలో ఉన్న గౌరవ స్థానం status జనతాదళ్ అధికారంలోకి వస్తే కాంగ్రెస్(ఐ) తీసుకొచ్చిన పంచాయితీరాజ్ చట్టాన్ని రద్దు చేస్తామని వి. పి.సింగ్ చేసిన ప్రకటన ఆయన హోదాను తగ్గించిందనే చెప్పాలి. (ఆం. భూ 17.5.89)

**హోరాహోరీ** విశే. *hooraahoorii* అన్ని పక్షాలు సమానంగా (పోటీ, పోరాటం మొ.) సర్వ శక్తులు కేంద్రీకరించి చేసే; తీవ్రమైన keen, fierce ఆదోని కర్షకప రిషత్ అధ్యక్ష స్థానానికి హోరాహోరీ పోటీ జరిగే అవకాశాలున్నాయి. (ఆం భూ. 29 5 89)

**హోరు** వి. *hooru* ప్రచారం,నినా దాలు మొ.కార్యకలాపాల తీవ్రత roar, intensity(of a noisy activity) ప్రతిరోజు ఇటీవల కేంద్రం ప్రవేశపెట్టిన పథ కాల హోరు, రేడియో, టీవీలలో వినవ స్తోందని ఆయన అన్నారు. (ఆం. భూ. 28.8.89)

**హోరెత్తు** క్రి. *hoorettu* (నినాదాలు, ప్రసం గాలు మొ. వాటితో) మార్మోగు; ప్రతిధ్వనించు to resonate, echo కాంగ్రెస్(ఐ) అనుకూల నినాదాలతో ఆవ రణ హోరెత్తింది. (ఆం భూ 21 2 89)

**హౌస్‌సర్జన్** వి *haussarjan* రోగులకు చికిత్సను స్వయంగా చేపట్టే శిక్షణ దశలో ఉన్న వైద్య విద్యార్థి house surgeon అవకతవకలపై పోరాడుతున్న హౌస్‌సర్జన్లు రెండు వారాల క్రితం డాక్టర్ మొదలియా ర్‌ను ఒప్పించి 'డ్రగ్ కమిటీ'ని మళ్ళీ ఏర్పాటు చేయడంలో సఫలం అయ్యారు. (ఆం భూ. /11 5 89)